శ్రీనాథుని

# శృంగార నైషధము

## టీకా తాత్పర్యములు




భాషాప్రవీణ

డా. బులుసు వేంకట సత్యనారాయణమూర్తి

M.A; M.phil; Ph.D

శ్రీనాథుని

# శృంగార నైషధము

టీకా తాత్పర్యములు

భాషాప్రవీణ
డా. బులుసు వేంకట సత్యనారాయణమూర్తి
M.A; M.phil; Ph.D

కళాగౌతమి
401, సి. బ్లాక్, గ్రీన్‌హిల్స్‌మెగాసిటీ,
పి జె ఆర్ రోడ్, చందానగర్, హైదరాబాద్–50
పిలుపు :9866290025

# శృంగార నైషధము

ముద్రణ : 2024

ప్రతులు : 500

మూల్యం : 350/-



వలయువారు :

కళాగౌతమి
401, సి. బ్లాక్, గ్రీన్ హిల్స్ మెగాసిటీ,
పి.జె.ఆర్. రోడ్, చందానగర్,
హైదరాబాద్–50
పిలుపు : 9866290025

భాషాప్రవీణ
గొట్టుముక్కల వేంకటసత్యనరసింహశాస్త్రి
ఆధ్యాత్మిక పౌరాణిక సాహిత్యోపన్యాసకులు,
అధ్యక్షుడు – 'ఆస్వాదన' సాహితీసమితి



'శ్రీమాత' 5-130/3, సంతోష్ నగర్
వాకలపూడి, కాకినాడ – 533 005
సెల్ : 98499 35652

# <u>నైషధౌషధమ్</u>

సంస్కృతాంధ్ర భాషలలో కావ్యామృత రసాస్వాదం నిజంగా ఔషధం వంటిదే ! విద్వదౌషధమని పేరందిన నైషధ మహాకావ్యాన్ని సంస్కృతభాషలో శ్రీహర్ష సుకవి, ఆంధ్రభాషలో శుభపరిసమాప్తిగా శ్రీనాథభట్టసుకవీ రచించారు. ఇరువురూ చింతామణీ మంత్రరాజోపాసకులే ! అటువంటి నైషధ గ్రంథాన్ని చదవడం, అవగాహనకు తెచ్చుకోవడం సాధ్యమయే విషయం కాదు.

శ్రీనాథ కృతియైన 'శృంగార నైషధం' కూడా సులభగ్రాహ్యం కాదు. కేవలం నిఘంటు సహాయంకూడా పనిచేయదు. ఇప్పటి విద్యారంగ పరిస్థితులు అసలు అవకాశమివ్వవు. దానికి సమర్థులైన వారి వ్యాఖ్యానాలూ, సాహిత్య నిపుణుల విశ్లేషణలు లభిస్తే కొంత కొంత రుచి అందవచ్చు. సరైన సమయంలో సోదరుడు శ్రీ బులుసు వెంకట సత్యనారాయణమూర్తి ఆ సాహస కార్యానికి నడుంకట్టారు. ఇంతకుముందే అచ్చతెనుగు రామాయణానికీ, నాచన సోముని ఉత్తర హరివంశానికీ వ్యాఖ్యాతగా కొంత సాధన కలసి వచ్చింది. స్వతహాగా సాహిత్యానురక్తీ, పరిశీలనాసక్తీ ఉండడం వల్ల రాణింపుకి దోహదం చేశాయి.

శ్రీనాథ మహాకవి సకల విద్యా సనాథుడు. భాషాపరిజ్ఞాన పాటవమూ, బహు శాస్త్ర వైదుష్యమూ, లోకజ్ఞత మొదలైన సుగుణాలతో ఆ సారస్వత మూర్తి కృతులన్నీ ఆలోచనామృతాలే ! తెలిసినవారు ఆయన సాహిత్యపు మెఱుగులను లోకానికి అందించడం ఆవశ్యకమూ, ముదావహమూ కూడా.

ముఖ్యంగా శ్రీనాథ కవి శృంగార నైషధం ఒక విజ్ఞాన సర్వస్వం. ప్రతికవికీ సూక్ష్మాతి సూక్ష్మ లోకవృత్త పరిశీలన అవసరం. ప్రథమాశ్వాసం 50వ పద్యంలో చేనేత వృత్తిని కృతిభర్త ప్రతాపంతో అన్వయించడం ఒక విశేషం. ద్వితీయా శ్వాసం 95వ పద్యంలో ద్వ్యణుక సిద్ధాన్త ప్రస్తావన, చతుర్థాశ్వాసం 44 వ పద్యంలో మన్మథుని పరాక్రమవర్ణనకు మహాస్రగ్ధర ఛందో ఔచిత్యానికి ఒక ఉదాహరణ. పంచమాశ్వాసములోని 144 వ పద్యమూ, అష్టమాశ్వాసంలోని 19 వ పద్యమూ ఆ సందర్భానికి సమన్వయించిన విధానమూ – వ్యాకరణశాస్త్రాదుల పాండిత్యాన్నీ పట్టి చూపుతాయి. వర్ణనలలో వినూత్న భావ విన్యాసం ఆహా! అనిపిస్తుంది. మనకు తెలియని ఎన్నో పదాల ఉనికి కనిపిస్తుంది. ఇలా పరిశీలిస్తూ పోతే ప్రతి పద్యమూ ఒక రసగుళిక. సంస్కృతభాషా పాండిత్య ప్రదర్శనమేకాక అచ్చమైన అందమైన తెలుగు పద్యాల ఒయ్యారాలకు శ్రీనాథుని కృతి ఒక గని. నలుని దేవతార్చన వర్ణన శ్రీనాథుని ఈశ్వరార్చన కళాశీలతకు ప్రమాణం. ద్వాపర, కలి దేవతల వికటవర్తన నేటి సమాజ పరిస్థితికి అద్దం పడుతోంది.

ఇక వ్యాఖ్యానం విషయానికి వస్తే ఒక్క అంశం మాత్రం నిరాశ కలిగించింది. ప్రతి పద్యంలోని ప్రతి పదానికీ అర్థం చెప్పకుండా కఠిన పదాలకు మాత్రమే వ్రాయడం ఆ అంశం. పాఠకులకు పదక్రమం సుగమమే కనుక అన్నిటికీ వ్రాయలేదు. కానీ ఇప్పటి భాషాబోధనలో నిత్యమూ వాడుతున్న పదాలకే అర్థం తెలియని దుస్థితి నెలకొంది. వారికి సులభంగా బోధపడాలన్నదే నా నిరాశకు కారణం.

శ్రీ సత్యనారాయణమూర్తి గారి వ్యాఖ్యానం అవగాహనా గహనమైన చాలాచోట్ల మంచి సౌలభ్యతను అందించింది. అర్థవివరణతోబాటు శాస్త్ర విషయాల పరిచయం, కవిహృదయావిష్కరణ, తేలికైన గమనం కలిగి చాలావరకు వారికృషి కృతకృత్యమైనది. గతకాలపు పండితుల వ్యాఖ్యానాలు కూడా ఆర్థం చేసుకోలేని నేటి అభ్యాసకులకు ఇదిచాలా సహాయకారిగా సాగింది. ప్రాచీన సాహిత్యం మీద ఉన్న ఆపోహలు, ఆక్షేపణలు, తిరస్కారాలు తొలగి భాషమీద అభిరుచి పెరగాలన్నా, భాష నిలబడాలన్నా ఇలాటి వ్యాఖ్యానాలు, వ్యాసాలూ ఇంతకంటే సరళంగా రావాల్సిన అవసరం చాలా ఉంది. శ్రీ సత్య నారాయణ మూర్తి గారి ఈవ్యాసంగంనుంచి ఇంకా గ్రంథ వ్యాఖ్యానాలు భాషాభిమానులను అలరిస్తూ వస్తాయని నా నమ్మకం.

మా ఇరువురి మధ్యగల ఒక సౌభ్రాత్రం, ఆలోచనా సామ్యం, భాషానురక్తీ కారణాలుగా ఈ నాలుగు మాటలూ వ్రాయడానికి అవకాశం ఇచ్చినందుకు వ్యాఖ్యాత శ్రీ సత్యనారాయణమూర్తి గారికి ధన్యవాదాలు తెలియజేస్తున్నాను.

23-4-2024
కాకినాడ

భవదీయుడు
గొ॥ వెం॥ సత్యనరసింహశాస్త్రి

# నైషధం విద్వదౌషధమ్

శృంగార నైషధమునకు మూలము సంస్కృతమునందలి నైషధ కావ్యము. దీనిని శ్రీహర్షుడు రచించెను. శ్రీహర్షుడు మామల్లదేవి, శ్రీహరుల కుమారుడు. చింతామణి మంత్రోపాసకుడు. సమస్త శాస్త్రములయందు పండితుడని నైషధము తెలుపుచున్నది. ఇతని పాండిత్యమును గూర్చి పలుకథలు ప్రచారములో నున్నవి. ఇతడేకాలమువాడో స్పష్టత కనబడదు. కన్యాకుబ్జాధీశ్వరునినుండి బహుమానము నందినట్లు తన గ్రంథమున పేర్కొనియుండుటనుబట్టి ఇతడా రాజు ఆస్థానమున యుండియుండవచ్చునని యూహింపనగును. క్రీ.శ. 1348 ప్రాంతముననున్న రాజశేఖరకవి శ్రీహర్షుడు జయచంద్రుని ఆస్థానమున ఉండెనని వ్రాసెను. దీనినిబట్టి శ్రీహర్షుడు 11వ శతాబ్దము వాడని మనము అనుకోవచ్చును.

నైషధ కావ్యము అతి ప్రౌఢమై, అసాధారణ కల్పనా శోభితమై సామాన్య పండితులకు దురవగాహమై నారికేళ పాకమున యున్నదని పండితవాక్యము. ఇట్టి ప్రౌఢకావ్యమును ఆంధ్ర కవిత్వమున సుప్రసిద్ధుడైన కవిసార్వభౌముడు శ్రీనాథ మహాకవి 'శృంగార నైషధము'గా అనువదించెను.

శ్రీనాథుడు తండ్రి మారయామాత్యుడు, తల్లి భీమాంబ. పద్మపురాణమును రచించిన కమలనాభామాత్యుని మనుమడు. జన్మస్థలము కొండవీడు. 'నా కవిత్వమ్ము నిజము కర్ణాటభాష', 'తల్లీ ! కన్నడ రాజ్యలక్ష్మీ దయలేదా నేను శ్రీనాథుడన్', 'కర్ణాటకటక పద్మవనహేళి' అని కాశీఖండమున మరొక పద్యమునను అనుటచేతను, వీనికితోడు ఈతని కవిత్వమున కన్నడపదములుండుటచేతను శ్రీనాథుని జన్మస్థలము కర్ణాటకమని యందురు కాని యది సమర్థనీయము కాదు.

శ్రీనాథుని గ్రంథములను విమర్శనా పూర్వకముగా చదివినచో మనోహరముగా జాతీయములు వాడుటయు, అతి మధురముగా గ్రంథములు వ్రాసి పండితుల ప్రశంసలందుటయు గమనింపగలము. శ్రీనాథుని గ్రంథముల సంస్కృతభూయిష్ఠ పదబంధములను చూచి కొందరు యిది తెలుగు కవిత్వము కాదని హేళన చేసియుండ శ్రీనాథుడు 'నా కవిత్వము సంస్కృతము కాదు, తెలుగును కాదు. చెవులకింపగు కర్ణాటభాష' యని బదులు పలికియుండును.

శ్రీనాథుడు కొండవీటి రెడ్ల యాస్థానమునందున్నవాడా! రాజమహేంద్రవర రెడ్ల యాస్థానమందున్నవాడా! యను సందేహము. శ్రీనాథుడు జన్మించినది కొండవీడు. తన గ్రంథములను అంకితమిచ్చినది కొండవీడి రెడ్ల మంత్రులకు. కొండవీటి రెడ్లు తన సామర్థ్యమునకు తగిన గుర్తింపు నివ్వని కారణమున కొండవీడు వీడి యతడు రాజమహేంద్రవరము చేరియుండును. సమర్థుడైన కవిచే కొండవీటి రెడ్డిరాజులు ఏ గ్రంథమును అంకితమిచ్చికొని యుండకపోవుట మనము గ్రహింపవలసియున్నది.

కస్తూరి నిచ్చిన తెనుంగురాయని, హేమపాత్రములో భోజనముపెట్టిన విస్సనమంత్రిని స్మరించి కృతజ్ఞతను చూపిన శ్రీనాథుడు తనను పోషించిన కొండవీటి రెడ్డిరాజుల నేల స్మరించుకొనడు ? తాను వీరభద్రారెడ్డి ఆస్థాన విద్వాంసుడనయినట్లు చెప్పుకొనుటచేతను, చివరిదశలో వ్రాసిన పద్యమున 'కాశికా విశ్వేశు కలసె వీరారెడ్డి' అని అందరికంటె ముందు వీరభద్రారెడ్డిని పేర్కొనుటచేతను

నైషధాది మహాప్రబంధములు పెక్కు<br>
చెప్పినాడవు మాకు నాశ్రితుడ వనఘ<br>
యిపుడు చెప్పందొడంగిన యీ ప్రబంధ<br>
మంకితము చేయు వీరభద్రయ్యపేర

అని అల్లాడ వేమారెడ్డి చెప్పినట్లు శ్రీనాథుడు తాను వారికాశ్రితుడై యుండినట్లు చెప్పుకొనుటచేతను ఈ మహాకవి రాజమహేంద్రవర రెడ్ల ఆస్థానముననే ఉన్నాడని చెప్పవచ్చును. కాని ఇతడు ఈ రెడ్ల

ఆశ్రయములోనున్నను పలుమార్లు సంచారములు చేసి, పలువురు ప్రభువుల సత్కారములనందియుండును.

శ్రీనాథుని కాలమును ఈ గ్రంథమునుబట్టి మనము నిర్ణయింపవచ్చును. అల్లాడ వేమారెడ్డి క్రీ.శ. 1434లో సామర్లకోట భీమేశ్వరస్వామికి భూదానము చేసినట్లు అచట ఒక శిలాశాసనమున్నది. వీరాభద్రారెడ్డియు, శ్రీనాథుడును కూడా అప్పటివారే కావున ఇదియే వారి కాలమని చెప్పవచ్చును. తన చివరిదశలో వీరభద్రారెడ్డి మరణించినట్లు తెల్పియుండుటచే ఆ తరువాత శ్రీనాథుడు మరికొంతకాలము బ్రతికియున్నాడని చెప్పవలెను. దీనినిబట్టి శ్రీనాథుని కాలము క్రీ.శ. 1365 –1450 మధ్యకాలమని నిర్ణయింపవచ్చును.

శ్రీనాథుడు ఏయే గ్రంథములను ఏయే కాలములలో రచించెనో తెలిసికొనవలసియున్నది. శ్రీనాథుని గ్రంథ ఆధారములను బట్టి ఈ విషయమును నిర్ణయించ ప్రయత్నింతము. శ్రీనాథుడు తన కాశీఖండములో–

సీ. చిన్నారి పొన్నారి చిఱుత కూకటినాడు
రచియించితి మరుత్తరాట్చరిత్ర
నూనూగు మీసాల నూత్నయౌవనమున
శాలివాహన సప్తశతి నుడివితి
సంతరించితి నిండు జవ్వనమ్మునయందు
హర్షనైషధకావ్య మాంధ్రభాష
ప్రౌఢ నిర్భరవయ:పరిపాకమున గొని
యాడితి భీమనాయకుని మహిమ

తే. ప్రాయ మింతకు మిగుల కైవ్రాలకుండ
గాశికాఖండ మను మహా గ్రంథ మేను
దెలుగు జేసెద గర్ణాట దేశ కటక
పద్మవన హేళి శ్రీనాథ భట్ట సుకవి

ఈ పద్యమువలన తొలుత మరుత్తరాట్చరిత్ర తరువాత క్రమముగా శాలివాహన సప్తశతి, శృంగార నైషధము, భీమేశ్వర పురాణము, కాశీఖండము రచించినట్లు తెలియుచున్నది. ఇవికాక ఈతని కృతులుగా పండితారాధ్య చరిత్రము, హరవిలాసము, పల్నాటి వీర చరిత్రము మున్నగునవి కాశీఖండము కంటె ముందుగనే రచించినట్లు కనబడుచున్నది. మరుత్తరాట్చరిత్ర, శాలివాహన సప్తశతి బాల్యావస్థలోనివగుటచే వానిని ఎవరికిని అంకితమిచ్చినట్లు కనబడదు. పండితారాధ్య చరిత్రమును వేమారెడ్డి సేనానాయకుడగు మామిడి ప్రెగ్గడయ్యకు, శృంగార నైషధమును వేమారెడ్డి సేనానాయకుడగు మామిడి సింగనకు, హరవిలాసమును అవచి తిప్పయశెట్టికి అంకితమిచ్చెను

వీరభద్రారెడ్డి మరణానంతరము కొండవీడు చేరి పల్నాటి వీరచరిత్రమును వ్రాసి యుండవచ్చును. శ్రీనాథుడు దేశ సంచార సమయమున –

సీ. దీనారటంకాల దీర్థమాడించితి
దక్షిణాధీశు ముత్యాలశాల
బగులగొట్టించి తుద్భట వివాదప్రౌఢి
గౌడ డిండిమభట్టు కంచుఢక్క
చంద్రశేఖర క్రియాశక్తి రాయలయొద్ద
బాదుకొల్పితి సార్వభౌమ బిరుదు
బలుకు తోడై తాంధ్రభాషా మహాకావ్య
నైషధ గ్రంథ సందర్భమునకు

తే. యెటుల మెప్పించెదో నన్ను నింకమీద
రావుసింగ మహీపాలు ధీవిశాలు
నిండు కొలువున నెలకొనియుండి నీవు
సకల సద్గుణ నికురంబ శారదాంబ

ఈ పద్యమువలన దక్షిణాధీశ్వరుని ముత్యాలశాలలో గౌడ డిండిమభట్టు కంచుఢక్కను బ్రద్దలుకొట్టి

స్వర్ణాభిషేకమునందెనని, కవిసార్వభౌమ బిరుదమునందెనని తెలియుచున్నది. పలుదేశములు తిరిగి పలువురు పండితులతో వాదించి పండించుకున్న పరిజ్ఞానమే తన కావ్యముల ఉన్నతికి కారణము కావచ్చునేమో ! మఱియు కాశీఖండమున 'వచియింతు వేములవాడ భీమనభంగి నుద్దండలీల నొక్కొక్కమాటు' అని చెప్పుటవలన ఇతడు తిట్టుకవిత్వమును కూడ చెప్పియుండును. శ్రీనాథుని చాటువులును ప్రసిద్ధములు. ఒకప్పుడు పల్నాటిసీమ సంచారమున అతడు చెప్పినవిగ నున్న పద్యములు మనము చూడవచ్చును –

క. నెమలిపురి యమపురంబుగ
యముడాయెను బసివిరెడ్డి యంతకు మిగులన్
యమదూతలైరి కాపులు
క్రమమెఱుగని దున్నలైరి కరణాలెల్లన్

క. గుడిమీది కోతిచేతను
గుడిలోపలి నంబివారి కోడలిచేతన్
నడివీథి లంజచేతను
నడిగొప్పుల యోరుగాలి నణగితి ననుమీ

క. జొన్నకలి జొన్నయంబలి
జొన్నన్నము జొన్న పిసరు జొన్నలె తప్పన్
సన్నన్నము సున్నసుమీ
పన్నుగ బల్నాటిసీమ ప్రజలందఱకున్

ఆ. ఊరు వ్యాఘ్రనగర మురగంబు కరణంబు
కాపు కపివరుండు కసవు నీడు
గుంపుగాగ జేరి గురజాలసీమలో
నోగులంత గూడి రొక్కచోట

చివరి కాలమందు బొద్దుపల్లెను వ్యవసాయము చేయుటయు, పన్ను చెల్లింపలేక పోవుటయు, పడిన శిక్షయు మన మనసును కరిగించును.

సీ. కవిరాజు కంఠంబు గౌగిలించెనుగదా
పురవీథి నెదురెండ బొగడదండ
సార్వభౌముని భుజాస్కంధ మెక్కెనుగదా
నగరివాకిటనుండు నల్లగుండు
ఆంధ్రనైషధకర్త యంఘ్రియుగ్మంబున
దగిలియుండెనుగదా నిగళయుగము
వీరభద్రారెడ్డి విద్వాంసు ముంజేత
వియ్యమందెనుగదా వెదురుగొడియ

తే. కృష్ణవేణమ్మ గొనిపోయె నింతఫలము
బిలబిలాక్షులు తినిపోయె దిలలు పెసలు
బొద్దుపల్లెను గొడ్డేఱి మోసపోతి
నెట్లు చెల్లింతు టంకంబు లేడునూర్లు

అలాగే –

సీ. కాశికా విశ్వేశు గలిసె వీరారెడ్డి
రత్నాంబరమ్ము లే రాయడిచ్చు
గైలాసగిరి బండె మైలారువిభు డేగి
దినవెచ్చ మే రాజు దీర్చగలడు
రంభగూడె దెనుంగు రాయరాహుత్తుండు
కస్తూరి కేరాజు బ్రస్తుతింతు

స్వర్గస్థుడయ్యె విస్సనమంత్రి మఱి హేమ
పాత్రాన్న మెవ్వాని పంక్తి గలదు
తే. భాస్కరుడు మున్నె దేవునిపాలి కరిగె
గలియుగంబున నికనుండ కష్టమనుచు
దివిజ కవివరు గుండియల్ దిగ్గురనగ
నరుగుచున్నాడు శ్రీనాథు డమరపురికి

విలాస జీవనము గడపిన శ్రీనాథుడు సంపాదించిన దంతయు వ్యయముచేసి అవసానకాలమున పడరాని పాట్లు పడవలసివచ్చెను.

శ్రీనాథుని కవిత్వధోరణి నిరుపమానమై మహాప్రవాహమువలె నిరర్గళమైనది. తానే భాగమును వర్ణించినను యది బహు సుందరమై యుండును. ఇతని కవిత సలక్షణమైనది. కవిత్రయ మంగీకరింపని కొన్ని ప్రయోగముల నితడు ప్రయోగించెను. అది నిరంకుశత్వముచేతనే గాని యజ్ఞతచేతను గాదు. కొన్నిచోట్ల కవిత్రయమువారికంటెను సొగసులనద్దెననవచ్చును. కావుననే పెద్దనాదులు ఈతని ననుసరించిరనుట ఈతని ఘనతగా చెప్పవచ్చును.

శ్రీనాథుని శృంగార నైషధ కావ్యమును పరిశీలింప ఒక్క విషయము మనము మరువరాదు. శ్రీహర్షుని కవితా గుంభనములను దెనిగింప మహాకవియగు నీతడు సాహసించెనుగాని వేఱొక్కడు అట్టి సాహసమునకు పూనుకొనడు. కొన్నిచోట్ల మూలమును కాదని స్వేచ్ఛగ విహరించినను, కొన్నిచోట్ల మూలమును చక్కగా అనువదించెను. సంస్కృతమునుండి తెనుగులోనికి తెచ్చుట కశక్యంబులైన శ్లేషలను, కొన్ని సమాసములను వానిని అట్లే తన గ్రంథమున చేర్చుకొనెను. కొన్ని భాగములను పరిశీలించిన శ్రీనాథుడు కనుకనే వానిని రచింపగలిగెనని మన కనిపించును –

మూలము : యథోహ్యమాన: ఖలు భోగభోజినా
ప్రసహ్య వైరోచని జన్య పత్తనమ్
విదర్భజాయా మదన స్తథా మనో
నలావరుద్ధం వయసైవ వేశిత:

అనువాదము : తే. అప్పు డనలావరుద్ధత నార గూరి
బాణపురమును బోని యా భైమి మనము
పుష్ప బాణాసనుడు భోగ భోజియైన
వర వయో విశేషంబు వార్వముగ దఱిసె

మూలమున 'మనోనలావరుద్ధ మ'నునెడ 'నలావరుద్ధము, అనలావరుద్ధము' అని పదశ్లేషయు, 'భోగభోజి వయస్' అనుచోట అర్థశ్లేషయు చేర్పబడినవి. ఆ శ్లేషను తెలుగున తెచ్చుటకే శ్రీనాథుడు ఆ పదములనే వాడుకొనెను. వేఱు పదముల నుపయోగింప తెలుగు సమర్థము కాకపోవుటచే శ్రీనాథుడు వానినే స్వీకరించెను కాని యసమర్థతచే కాదని గ్రహింపవలెను. మఱికొన్నిచోట్ల మూలమునలేని పెక్కు పదములను రసపుష్టికై చేర్చుటయు కాననగును–

మూలము : సరసీ: పరిశీలితుం మయా
గమికర్మీకృత నైక నీవృతా
అతిథిత్వమనాయి సాదృశో:
సదసత్సంశయ గోచరోదరీ

అనువాదము : మ. మృదురీతిం బ్రతివాసరంబు గమికర్మీభూత నానా నదీ
నద కాంతార పురీ శిలోచ్చయుడనై నైకాద్భుత శ్రీజిత
త్రిదివంబైన విదర్భదేశమున నారీరత్నముం గాంచితిన్
సదసత్సంశయ గోచరోదరి శరత్సంపూర్ణ చంద్రాననన్

మ. కమలేందీవర షండ మండిత లసత్కాసార తీరంబునన్
గమికర్మీకృత నైకనీవృతుడనై కంటి న్విదర్భంబునన్
రమణిన్ బల్లవపాణి పద్మనయనన్ రాకేందు బింబాననన్
సమ పీనస్తని నస్తినాస్తి విచికిత్సా హేతు శాతోదరిన్

అని రెండు విధములుగా రచించెను. ఈ రెండున మూలమునకు సరి కాలేదని చదివినవారికి తేటతెల్లము

కాకపోదు. ఇందు మూలములో లేని అర్థమును ప్రకటించు పెక్కు పదములను చేర్చినను పద్యములు రసవంతములై వ్యర్థ పదభూయిష్ఠములై కానరాక స్వతంత్ర పద్యములవలెనే పాఠకులకు ఆనందమును కలిగించుచున్నవి.

మూలము :
త్వచ్చేతస స్థైర్య విపర్యయంతు
సంభావ్య భావ్యస్మి తదజ్ఞ ఏవ
లక్ష్యేహి బాలా హృదిలోల శీలే
దరాపరాద్ధేషు రపి స్మరస్యాత్

అనువాదము : ఉ. ఇప్పటి నీ తలంపు తెఱగిట్టిది యౌనిటమీద నెప్పుడే
చొప్పున నుండునో నిజము సుద్ది యెఱుంగముగాని యుగ్మలీ
చెప్పెడిదేమి ? బాలికల చిత్తము లంబుతరంగ లోలముల్
తప్పునొ తాకునో కుసుమధన్విని యేటులు దైవికంబుగన్

ఈ పద్యమున మూలములోని యర్థమును చక్కగా అనువదించాడు శ్రీనాథుడు. మూలములోనున్న 'లోల' పదమునకు 'అంబుతరంగ' యను ఉపమానమును చేర్చుట మిక్కిలి నిపుణత్వము. అట్లే –

మూలము :
త్రినేత్ర మాత్రేణ రుషాకృతం య
త్తదేవయోద్యాపిన సంవృణోతి
నవేదరుష్టేద్య సహస్రనేత్రే
గంతాసు కామ:ఖలు కామవస్థాం

అనువాదము : తే. మూడుకన్నుల వేల్పుతో మోహరించి
నేడు దేహంబు లేక యున్నాడు దాను
వేయికన్నుల వేల్పుతో విగ్రహించి
వనిత యింకేమి గానున్నవాడొ మరుడు

ఇది మూలమున కన్యూనానతిరిక్తమై మూలాభిప్రాయమును చక్కగా వివరించినది. పెక్కు పద్యములందు సంస్కృత కల్పనములను శ్రీనాథుడు ఇమిడ్చినట్లు మఱియొకరు చేయలేరనుట నిశ్చయము.

ప్రౌఢత్వమున ప్రసిద్ధిచెందిన తెలుగు కావ్యములలో శృంగార నైషధము ఎన్నుకొనదగినది. వ్యాఖ్యాన సహాయము లేకుండగా ఈ కావ్యము నర్థముచేసికొనుట పండితులకును సాధ్యపడకపోవచ్చును. మహారణ్యమువలె ప్రవేశింప కష్టసాధ్యమగు ఈ గ్రంథమునకు టీకా తాత్పర్యముల నందించ వలసినదిగ మిత్ర, శిష్య ప్రార్థితుడనై ఈ పని చేపట్టితిని. శ్రీహర్షుని కల్పనములకు తన కల్పనాతిశయమును జోడించి వ్రాయబడిన ఈ గ్రంథమును వ్యాఖ్యానించుట సుకరముకాదని నాకు తెలియును. ఐనను నా శక్తిమేరకు వ్యాఖ్యానించితిని. పాఠకులకు విసుగుదల పుట్టించు సుదీర్ఘ చర్చలకు నేను పోలేదు. అట్లని పూర్తిగ విడువనూ లేదు. ఇది పాఠకులు గ్రహింతురు గాక.

వ్రాసితి నచ్చ రాముకథ వారని కోర్కి మదిన్ గలంచగన్
వ్రాసితి నాచనార్యు హరివంశపు వ్యాఖ్యను మెప్పు పొందుచున్
వేసర కిప్డు నైషధము విప్పి హితుల్ నెఱ చూడ నిచ్చితిన్
జేసెద నిట్లు దత్పరత సేవలు భాషకు శ్రద్ధతోడుతన్

శ్రీరస్తు

# శృంగార నైషధము

ప్రథమాశ్వాసము

1 **శ్రీరామా కుచమండలీ మృగమద శ్రీగంధ సంవాసిత**
**స్ఫారోదార భుజాంతరుండు ధరణీ సంశ్లేష సంభావనా**
**పారీణుండు కృతార్థుఁ జేయుఁ గరుణా పాథోధి పద్మాక్షుఁ డిం**
**పారన్ మామిడి పెద్దమంత్రి సుతు సింగామాత్య చూడామణిన్**

శ్రీరామా = లక్ష్మీదేవియొక్క, కుచమండలీ = స్తనప్రదేశమండలి, మృగమద = కస్తూరిచేతను, శ్రీగంధ = మంచిగంధముచేతను, సంవాసిత = పరిమళించునదిగాచేయబడ్డ, స్ఫార = పెద్దదైన, ఉదార = విశాలమైన, భుజాంతరుండు = వక్షస్థలము కలవాడును, ధరణీ = భూదేవియొక్క, సంశ్లేష = కౌగిలిని, సంభావనా = గౌరవించుటయందు, పారీణుండు = నేర్పుకలవాడును, కరుణా పాథోధి = దయాసముద్రుడునైన, పద్మాక్షుడు = పద్మములవంటి నేత్రములు కలవాడు – విష్ణువు, మామిడి పెద్దమంత్రి సుతున్, సింగామాత్య చూడామణిన్ = సింగన మంత్రిశ్రేష్ఠుని, ఇంపారన్ = ఇష్టముతో, కృతార్థు చేయున్ = కోరికలు తీరినవానినిగా చేయుగాక.

తా. లక్ష్మీదేవి స్తనప్రదేశమందలి కస్తూరిచేతను, మంచిగంధముచేతను పరిమళింపచేయబడ్డ గొప్ప విశాలమైన వక్ష స్థలముకలవాడును, భూదేవిని కౌగిలించుకొనుటయందు నేర్పుకలవాడును, దయాసముద్రుడునైన విష్ణుమూర్తి మామిడి పెద్దమంత్రి కుమారుడైన సింగనామాత్యుని ప్రీతితో కోరికలు తీరినవానినిగా చేయుగాక.

2 మ. **కనకక్షోణిధరంబు కార్ముకముగాఁ గద్రూ తనూజుండు శిం**
**జినిగా మాధవుఁ డమ్ముగాఁ బురము లక్షీణైక దోశ్శక్తి గె**
**ల్చిన జోదీశ్వరుఁ డిచ్చుగాత జయలక్ష్మీ సుస్థిరైశ్వర్య శో**
**భనముల్ పెద్దయ సింగమంత్రికి జగత్ప్రఖ్యాత సత్కీర్తికిన్**

కనకక్షోణిధరంబు = బంగారుకొండ (మేరుపర్వతము), కార్ముకముకాన్ = ధనుస్సుకాగా, కద్రూ తనూజుండు = కద్రువ యొక్క కుమారుడు (ఆదిశేషుడు), శింజినికాన్ = వింటినారికాగా, మాధవుడు = విష్ణుమూర్తి, అమ్ముకాన్ = బాణముకాగా, అక్షీణ = తక్కువకాని (గొప్పదైన), ఏక = ముఖ్యమైన, దోశ్శక్తిన్ = భుజబలముచే, పురములు = త్రిపురములను, గెల్చిన = నాశనముచేసిన, జోదు = వీరుడైన, ఈశ్వరుడు, జగత్ = లోకమునందు, ప్రఖ్యాత = ప్రసిద్ధమైన, సత్కీర్తిన్ = మంచి కీర్తికలవాడైన, పెద్దయ సింగమంత్రికిన్ = పెద్దమంత్రి కుమారుడైన సింగనమంత్రికి, జయ = జయమును, లక్ష్మీ = సంపదను, సుస్థిర = శాశ్వతమైన, ఐశ్వర్య = ఐశ్వర్యములను, శోభనముల్ = శుభములను, ఇచ్చుగాత.

తా. మేరుపర్వతమును విల్లుగాను, ఆదిశేషుని వింటినారిగాను, విష్ణుమూర్తిని బాణముగాను చేసికొని గొప్ప భుజబలముతో త్రిపురములను నాశనము చేసిన వీరుడైన పరమేశ్వరుడు లోకంలో పేరెన్నికగన్న కీర్తిమంతుడైన పెద్దమంత్రి కుమారుడైన సింగనమంత్రికి జయమును, సంపదను, శాశ్వత ఐశ్వర్యములను, శుభములను ఇచ్చుగాక.

3 ఉ. **హాటక గర్భుచేతఁ గమలాసనుచేఁ జతురాస్య కంఠ శృం**
**గాటక వీథికా కృత విగాహ చతుశ్శ్రుతిచేత దేవతా**
**కోటి కిరీట సంఘటిత కోమల పాదసరోజుచే జగ**
**న్నాటక సూత్రిచేతఁ గృతినాథుఁడు గాంచుఁ జిరాయురున్నతుల్**

హాటకగర్భుచేతన్ = బంగారు వికారమైన అండమే ఉత్పత్తిస్థానముగాకలవానిచేతను, కమలాసనుచేన్ = పద్మమే ఆసనముగా కలవానిచేతను, చతుర్ ఆస్య = నాలుగు ముఖములుకల, కంఠ = గొంతు అనెడి, శృంగాటక వీధికా = నాలుగు దారులు కలిసే వీధియందు, కృత = చేయబడిన, విగాహ = సంచారముకల, చతుః = నాలుగు, శ్రుతిచేతన్ = వేదములుకలవానిచేతను, దేవతాకోటి = దేవతల సమూహముయొక్క, కిరీట సంఘటిత = కిరీటములచే తాకబడుచున్న, కోమల = మృదువైన, పాద సరోజుచేన్ = పాదపద్మములుకలవానిచేతను, జగత్ నాటక = ఈ లోకమనే నాటకమునందు, సూత్రిచేతన్ = సూత్ర ధారునిచేతను, కృతినాథుడు = కృతిపతియగు సింగనామాత్యుడు, చిర ఆయుః = పూర్ణాయువును, ఉన్నతుల్ = మహోన్నతులను, కాంచున్ = పొందును.

తా. బంగారు వికారమైన అండమే ఉత్పత్తి స్థానముగా కలవాడును, పద్మ సింహాసనుడును, నాలుగు ముఖముల గొంతుక యనెడు నాలుగు దారులు కలిసే వీథియందు సంచరించుచున్న నాలుగువేదములుకలవాడును, దేవతలందరిచేతను నమస్కరింపబడుచున్నవాడును, జగన్నాటక సూత్రధారియునగు బ్రహ్మవలన కృతిపతియగు సింగనమంత్రి పూర్ణాయువును, మహోన్నతిని పొందుగాక.

**4 శా. జేజేయంచు భజింతు నిష్టఫలసంసిద్ధుల్ మదిం గోరి ని**
**ర్వ్యాజ ప్రౌఢకృపావలంబునిఁ గటప్రస్యంది దానాంబునిం**
**బూజాతత్పర దేవదానవ కదంబున్ బాలకేళీ కళా**
**రాజత్కౌతుక రంజితోరగపతి ప్రాలంబు హేరంబునిన్**

ఇష్టఫలసంసిద్ధుల్ = కోరిన కోర్కెల సంసిద్ధిని, మదిన్ = మనసునందు, కోరి, నిర్వ్యాజ = కారణములేనట్టియు, ప్రౌఢ = ఉదారమయినట్టియు, కృపా = దయకు, అవలంబుని = ఆశ్రయమైనవానిని, కట = చెక్కిళ్ళనుండి, ప్రస్యంది = కారుచున్న, దానాంబునిం = మదజలముకలవానిని, పూజ = పూజించుటయందు, తత్పర = ఆసక్తులైన, దేవ దానవ కదంబున్ = దేవతల, రాక్షసుల సమూహముకలవానిని, బాలకేళీకలా = చిన్నతనపు ఆటలయొక్క విలాసముచే, రాజత్ = వెలుగొందుచున్న, కౌతుక = కుతూహలముచేత, రంజిత = సంతోషపెట్టబడిన, ఉరగపతి = నాగరాజును, ప్రాలంబున్ = హారముగాకలవానిని, హేరంబునిన్ = విఘ్నేశ్వరుని, జేజే అంచు = నమస్కారములు అనుచు, భజింతున్ = సేవింతును.

తా. కారణము లేనట్టియు, ఉదారమైనట్టియు దయారసమునకు ఆశ్రయమైనవానిని, చెక్కిళ్ళనుండి కారుచున్న మదజలము కలవానిని, సమస్త దేవదానవులచే పూజింపబడుచున్నవానిని, బాల క్రీడాసక్తిచే సర్పరాజును సంతోషపెట్టి హారముగా ధరించినవానిని విఘ్నేశ్వరుని మనసునందలి కోర్కెలు తీరునట్లుగ కోరి జేజేయని సేవించెదను.

**5 సీ. సింహాసనము చారు సిత పుండరీకంబు**
**చెలికత్తె జిలుబారు పలుకుచిలుక**
**శృంగార కుసుమంబు చిన్ని చుక్కలరాజు**
**పసిఁడి కిన్నెరవీణె పలుకుదోడు**
**నలువ నెమ్మోముఁదమ్ములు కేళిగృహములు**
**తళుకుటద్దంబు సత్కవుల మనసు**
**వేదాది విద్యలు విహరణ స్థలములు**
**చక్కని రాయంచ యెక్కిరింత**
**తే. యెపుడు నేదేవి కాదేవి యిందు కుంద**
**చంద్ర చందన మందార సారవర్ణ**
**శారదాదేవి మామక స్వాంత వీధి**
**నిండువేడుక విహరించుచుండుఁగాత**

ఎపుడున్ = ఎల్లప్పుడును, ఏ దేవికిన్ = ఏ సరస్వతీదేవికి, చారు = అందమైన, సితపుండరీకంబు = తెల్ల తామర, సింహాసనము, జిలుబారు పలుకు చిలుక = ముద్దుపలుకులు పలుకు చిలుక, చెలికత్తె, చిన్ని చుక్కల రాజు = నెలవంక, శృంగార కుసుమంబు = అలంకారార్థమైన పూవు; పలుకు తోడు = మాట చెలి, పసిడి కిన్నెర వీణె = బంగారు కిన్నెర వీణె, కేళి గృహములు = క్రీడా మందిరములు; నలువ = బ్రహ్మదేవునియొక్క, నెతి మోము తమ్ములు = అందమైన తామరలవంటి ముఖములు; సత్కవుల మనసు = చక్కని కవులయొక్క మనస్సు, తళుకు అద్దంబు = మెరిసే అద్దము; వేద ఆది విద్యలు, విహరణ స్థలములు = విహరించే స్థలములు; చక్కని = సుందరమైన, రాయంచ = రాజహంస, ఎక్కిరింత = వాహనము, ఏ దేవికి, ఆ దేవి = ఆ సరస్వతీదేవి, ఇందు = చంద్రుడు, కుంద = మల్లెలు, చంద్ర = కర్పూరము, చందన = మంచిగంధము, మందార = కల్పవృక్ష పుష్పమువలె, సార = నిగ్గయిన, వర్ణ = దేహచ్ఛాయ కలదైన, శారదాదేవి, మామక = నాయొక్క, స్వాంత వీధి = మనసునందు, నిండు వేడుకన్ = సంతోషముతో, విహరించుచుండుగాత (ఉపమాలంకారము)

తా. ఏ సరస్వతీదేవికి సతతము అందమైన తెల్ల తామరపూవు సింహాసనమో, ముద్దుపలుకులు పలుకు చిలుక చెలికత్తెయో, చంద్రుడు అలంకరణకొరకు పూవో, మాటల చెలి బంగారు కిన్నెర వీణెయో, క్రీడామందిరములు బ్రహ్మదేవుని తామరలవంటి ముఖములో, సత్కవీశ్వరుల మనస్సు మెరిసే అద్దమో, వేదాది విద్యలు విహరణ స్థలములో, అందమైన రాజహంస వాహనమో ఆ సరస్వతీదేవి, చంద్రుడు, మల్లెలు, కర్పూరము, మంచిగంధము, మందారమువలె చక్కని దేహచ్ఛాయ కలిగి ఒప్పుచు నా చిత్తమున ఎల్లప్పుడు విహరించుగాక. **6**

**వ. అని యిష్టదేవతా ప్రార్థనంబు చేసి** **7**

**సీ. వ్యాస వాల్మీకి సంయమి వాక్సుధాంభోధి**
**లోలోర్మి పంక్తుల నోలలాడి**
**భట్ట బాణ మయూర భారతీ సందర్భ**
**సౌభాగ్య గరిమంబు సంగ్రహించి**
**భాస సౌమిల్లక ప్రతిభా సమున్మేష**
**హేలా విశేషంబు నిచ్చగించి**
**మాఘ భారవి వచోమకరంద నిష్యంద**
**మాధుర్యమునకు సమ్మదము నొంది**
**తే. కాళిదాసు మనంబులోఁ గాంచి మ్రొక్కి**
**రాజశేఖరుఁ గవిరాజుఁ బ్రస్తుతించి**
**ధీరమతి నన్నపార్యుని దిక్క యజ్వ**
**శంభుదాసునిఁ గరమర్థి సన్నుతించి**

వ్యాస వాల్మీకి సంయమి = వ్యాసుడు, వాల్మీకి యనెడు మునులయొక్క, వాక్కు = మాటలనెడి, సుధ అంభోధి = అమృత సముద్రమునందు, లోల = చలించుచున్న, ఊర్మి పంక్తులన్ = అలల వరుసలయందు, ఓలలు ఆడి = ఈదులాడి, భట్ట బాణ = పండితుడైన బాణునియొక్కయు, మయూర = మయూరునియొక్కయు, భారతీ = కవిత్వముయొక్క, సందర్భ సౌభాగ్య గరిమంబు = సందర్భ సంపదయొక్క ఆధిక్యమును, సంగ్రహించి = సంపాదించి, భాస = భాసుని యొక్కయు, సౌమిల్లక = సౌమిల్లకునియొక్కయు, ప్రతిభా = ప్రజ్ఞయొక్క, సమున్మేష = వికాసముయొక్క, హేలా విశేషంబు = అసామాన్య విలాసమును, ఇచ్చగించి = ఇష్టపడి, మాఘ = మాఘునియొక్కయు, భారవి = భారవియొక్కయు, వచస్ = వాక్యములనెడి, మకరంద నిష్యంద = అమృత ప్రవాహముయొక్క, మాధుర్యమునకు = తీపితనమునకు, సమ్మదమును ఒంది = సంతసమును పొంది, కాళిదాసున్, మనంబులోన్ = మనసులో, కాంచి = తలంచి, మ్రొక్కి = నమస్కరించి, రాజశేఖరున్, కవిరాజున్, ప్రస్తుతించి = స్తుతించి, ధీరమతి = నిర్మల బుద్ధికల, నన్నపార్యునిన్ = నన్నయభట్టారకుని, తిక్క యజ్వన్ = తిక్కన సోమయాజిని, శంభుదాసున్ = ఎఱ్ఱాప్రగ్గడను, కరము = మిక్కిలి, అర్థిన్ = కోరికతో, సన్నుతించి = స్తుతించి.

తా. వ్యాసుడు, వాల్మీకి యనెడు మునులయొక్క మాటలనబడే అమృత సముద్రమునందు కదలాడు కెరటములందు ఈదులాడి, పండితులైన బాణ, మయూరులయొక్క కవిత్వ సందర్భ సంపద గరిమను సంపాదించి, భాసుని, సౌమిల్లకుల బుద్ధి చాతుర్యముయొక్క అసామాన్య విలాసమును ఇష్టపడి; మాఘ, భారవులయొక్క వాక్యామృత ప్రవాహ మాధుర్యానికి సంతసించి, కాళిదాసును మనసున స్మరించి, మ్రొక్కి; రాజశేఖరుని, కవిరాజుని స్తోత్రముచేసి; నిర్మల బుద్ధికల నన్నయభట్టును, తిక్కన సోమయాజిని, ఎఱ్ఱాప్రగ్గడను మిక్కిలి యిష్టపడి పొగడి.

**8 వ. నవరసభావానుబంధ బంధురంబుగా నొక్క ప్రబంధంబు నిర్మింపఁదలంచి కౌతూహలాధీన మానసుండనై తన్మహాప్రబంధ ప్రారంభంబునకుం దగిన పుణ్యశ్లోక పురాతన మహారాజచరిత్రం బెయ్యదియొకో యని వితర్కించుచున్న సమయంబున**

నవరస = శృంగారాది నవరసములయొక్క, భావ = భావముల, అనుబంధ = సంబంధముచే, బంధురంబుగాన్ = అతిశయించునట్లుగా, ఒక్క ప్రబంధంబున్, నిర్మింప తలంచి = రచింప దలచి, కౌతూహల = కుతూహలమునకు, అధీన = లోబడిన, మానసుండనై = మనస్సు కలవాడనై, తత్ మహాప్రబంధ = ఆ గొప్ప ప్రబంధముయొక్క, ప్రారంభమునకున్ = మొదలిడుటకు, తగిన = సమర్థమైన, పుణ్యశ్లోక = మంచి కీర్తికల, పురాతన = ప్రాచీనుడైన, మహారాజ చరిత్రంబు, ఎయ్యదియొకో అని = ఏది ఉందా అని, వితర్కించుచున్న = ఆలోచించుచున్న, సమయంబున = సమయంలో

తా. శృంగారాది నవరస భావముల సంబంధముచేత అతిశయించునట్లుగా ఒక్క ప్రబంధమును రచింప దలంచి కుతూహలముతో కూడిన మనస్సు కలవాడనై ఆ గొప్ప ప్రబంధానికి మొదలెట్టడానికి తగిన మంచికీర్తికల, ప్రాచీనుడైన మహారాజు చరిత్రము ఏదికలదాయని వితర్కించుకుంటున్న సమయంలో

**9 సీ. తన కృపాణము సముద్ధతవైరి శుద్ధాంత**
**తాటంకముల కెగ్గు దలచుఁచుండఁ**

దన బాహుపీఠంబు ధరణిభృత్కమఠాహి
　　సామజంబులకు విశ్రాంతి యొసఁగఁ
దన కీర్తి నర్తకి ఘనతర బ్రహ్మాండ
　　భవన భూముల గొండ్లిఁ బరిఢవింపఁ
దన దానమహిమ సంతాన చింతారత్న
　　జీమూత సురభుల సిగ్గుపఱుపఁ
తే. బరఁగు శ్రీవేమమండలేశ్వరుని మంత్రి
యహిత దుర్మంత్రి వదన ముద్రావతార
శాసనుడు రాజవేశ్యా భుజంగ బిరుద
మంత్రి పెద్దయ సింగనామాత్యవరుఁడు

తన కృపాణము = తన కత్తి, సముద్ధత = గర్వించిన, వైరి = శత్రువులయొక్క, శుద్ధాంత = అంతఃపుర స్త్రీలయొక్క, తాటంకములకు = బంగారు చెవికమ్మలకు, ఎగ్గు తలచుచు ఉండన్ = హానిని తలపెట్టుచుండగా, తన బాహుపీఠంబు = విశాలములైన తన భుజములు, ధరణి భృత్ = కుల పర్వతములకు, కమఠ = ఆదికూర్మమునకు, అహి = ఆదిశేషునకు, సామజములకున్ = దిగ్గజములకును, విశ్రాంతి ఒసగ = విశ్రాంతిని ఇచ్చుచుండగా, తన కీర్తి నర్తకి = తన కీర్తియనెడి నాట్యకత్తె, ఘనతర = మిక్కిలి గొప్పవైన, బ్రహ్మాండ = బ్రహ్మాండమనెడి, భవన భూముల = లోగిలి ప్రదేశములందు, గొండ్లిన్ = నాట్యమును, పరిఢవింపన్ = ప్రవర్తింపచేయుచుండగా, తన దాన మహిమ, సంతాన = కల్పవృక్షము, చింతారత్న = చింతామణి, జీమూత = మేఘము, సురభులన్ = కామధేనువులను, సిగ్గుపఱుపన్ = సిగ్గుపడునట్లు చేయుచుండగా, పరగు = ఒప్పుచున్న, శ్రీ వేమమండలేశ్వరుని మంత్రి, అహిత = వైరుల, దుర్మంత్రి = దుర్మార్గులైన మంత్రులయొక్క, వదన = నోళ్ళను, ముద్రావతార = మూయునట్లుచేయుటకు, శాసనుడు = సమర్థుడు, రాజవేశ్యా భుజంగ, బిరుద = బిరుదుగాకల, పెద్దయ సింగన అమాత్యవరుడు, మంత్రి

తా. శత్రురాజులను జయించువాడును, ప్రజలను రక్షించువాడును, కీర్తిశాలియును, మహాదాతయును, శ్రీ వేమారెడ్డి మంత్రియును, రాజవేశ్యాభుజంగ అని బిరుదుకలవాడును పెద్దయ సింగన మంత్రిశ్రేష్ఠుని

10 శా. పంచాంగ స్థిర మంత్ర రక్షణకళాప్రౌఢుండు బాలామనః
పాంచాలుండు విరించివంశ జలధి ప్రాలేయభానుండు దో
శ్చంచచ్చాప కృపాణ లబ్ధ విజయైశ్వర్యుండు దిక్కామినీ
కాంచీ మౌక్తిక కీర్తి పెద్ద విభు సింగం డొక్కనా డిమ్ములన్

పంచాంగ = అయిదు అంగములచేతను (సహాయ, సాధనోపాయ, దేశవిభాగ, కాలవిభాగ, విపత్ప్రతీకారము), స్థిర = నిశ్చలమైన, మంత్ర = ఆలోచనలను, రక్షణ కళా = రక్షించడమనే నేర్పునందు, ప్రౌఢుండు = సమర్థుడు, బాలా = ప్రియురాంద్ర యొక్క, మనః = మనస్సునకు, పాంచాలుండు = శ్రేష్ఠ పురుషుడు, విరించివంశ = బ్రహ్మావంశమనెడి, జలధి = సముద్రమునకు, ప్రాలేయ భానుండు = చంద్రునివంటివాడు, దోః = బాహువులయందు, చంచత్ = ప్రకాశించుచున్న, చాప = విల్లుచేతను, కృపాణ = కత్తిచేతను, లబ్ధ = పొందిన, విజయ ఐశ్వర్యుండు = విజయము, సంపద కలవాడు, దిక్ కామినీ = దిక్కులనెడి స్త్రీలయొక్క, కాంచీ = మొలనూళ్లయందలి, మౌక్తిక = ముత్యములుగా మారిన, కీర్తి = కీర్తికలవాడు, పెద్దవిభు సింగండు = పెద్దరాజు కుమారుడైన సింగన, ఇమ్ములన్ = ప్రీతితో, ఒక్కనాడు

తా. పంచాంగములచేతను స్థిరమైన ఆలోచనలను రక్షించుటయందు నేర్పుకలవాడు, ప్రియురాంద్ర మనస్సునకు పాంచాల జాతి పురుషుడైనవాడు, బ్రహ్మవంశమనెడి సముద్రమునకు చంద్రునివంటివాడు, భుజబలముచే ప్రకాశించు విల్లు, కత్తిచేత విజయ, ఐశ్వర్యములను పొందినవాడు, దిగంతములవరకు వ్యాపించిన కీర్తికలవాడునైన పెద్దరాజు కుమారుడైన సింగన ప్రీతితో ఒకరోజున

11 **వ. మృదు మధుర చిత్ర విస్తర కవితా విలాస వాగీశ్వరులగు కవీశ్వరులును, బతంజలి కణాదాక్ష చరణపక్షిలాది శాస్త్ర సిద్ధాంత కమలవనహంసులగు విద్వాంసులును, భరత మతంగ దత్తిళ కాపాలాంజనేయ ప్రణీత సంగీత విద్యా రహస్య విజ్ఞాన వైజ్ఞానిక స్వాంతులగు కళావంతులును, శక్తిత్రయ చతురుపాయ షాడ్గుణ్య ప్రయోగ యోగ్య విచారులగు రాయబారులును, నిఖిల పురాణేతిహాస సంహితా తాత్పర్య పర్యాలోచనా దురంధర ధిషణా సముత్సాహులగు పౌరాణిక సమూహంబును బరివేష్టింపం గొలువుండి సకల విద్యా పారంగతుండు సరస సాహిత్య గోష్ఠీ వినోద ప్రసంగంబున**

తా. సులభము, మధురము, అద్భుతమునైన బంధములుకల, శబ్దముల విరివికల, కవితా చాతుర్యము కలిగిన, పద ప్రయోగ సమర్థులైన, కవిశ్రేష్ఠులును, పతంజలి, కణాదుడు, భృగు, పక్షిలుడు మొదలైన శాస్త్ర సిద్ధాంత పద్మవనమునకు, సూర్యునివంటివారగు పండితులు; భరత, మతంగ, దత్తిళ, కాపాల, ఆంజనేయాదులచే రచింపబడిన, సంగీత విద్యా రహస్య

ములను తెలిసి కొనుటచే విశేష జ్ఞానముకల చిత్తముకలవారగు సంగీతజ్ఞులును, ప్రభు, మంత్ర, ఉత్సాహ శక్తులయొక్కయు, సామ, దాన, భేద, దండోపాయములయొక్కయు, సంధి, విగ్రహము, యానము, ఆసనము, ద్వైధము, సమాశ్రయము అనెడి గుణములను, ఉపయోగించుటకు తగిన సమయము తెలిసినవారగు రాయబారులును, సమస్తమైన పురాణ, ఇతిహాస, సంహిత భావములను, చక్కగా యోచించునట్టి, సమర్థమైన బుద్ధి ప్రయత్నముకలవారగు పౌరాణిక సమూహంబును పరివేష్టింపన్ కొలువుండి సకల విద్యాపారంగతుడు సింగన, సరస సాహిత్య గోష్ఠీ వినోద ప్రసంగంబున

**12 శా. భారద్వాజ పవిత్ర గోత్రుని శుభాపస్తంబ సత్సూత్రు వి**
**ద్యా రాజీవభవుండు మారయకుఁ బుణ్యాచార భీమాంబకు**
**న్గారామైన తనూజు నన్ననఘు శ్రీనాథాఖ్యునిం బిల్చి స**
**త్కారంబొప్పఁగ గారవించి పలికెన్ గంభీర వాక్ప్రౌఢిమన్**

భారద్వాజ పవిత్ర గోత్రుని, శుభ ఆపస్తంబ సత్ సూత్రుని, విద్యా రాజీవభవుండు = విద్యలలో బ్రహ్మతో సమానుడు, మారయకు, పుణ్యాచార = పతివ్రతయైన, భీమాంబకున్, గారాము ఐన = గారాబముకల, తనూజు = కుమారుని, అనఘున్ = దోషరహితుని, శ్రీనాథ ఆఖ్యునిన్ = శ్రీనాథుడను పేరుగల, నన్ను, పిల్చి, సత్కారంబు, ఒప్పగ = తగిన రీతిగా, గారవించి = గౌరవించి, గంభీర, వాక్ ప్రౌఢిమన్ = మాటల నేర్పుతో, పలికెన్

తా. భారద్వాజ పవిత్ర గోత్రుని, విద్యలలో బ్రహ్మసమానుని, మారయ, భీమాంబల గారాబు పుత్రుని, దోష రహితుని, శ్రీనాథుడను పేరుగల నన్ను పిల్చి సత్కారముతో గౌరవించి మాటల నేర్పుతో ఇట్లు పలికెను.

**13 శా. బ్రాహ్మీదత్త వరప్రసాదుఁడ వురుప్రజ్ఞా విశేషోదయా**
**జిహ్మస్వాంతుఁడ వీశ్వరార్చన కళాశీలుండ వభ్యర్థిత**
**బ్రహ్మాండాది మహా పురాణచయ తాత్పర్యార్థ నిర్ధారిత**
**బ్రహ్మజ్ఞానకళా నిధానమవు నీ భాగ్యంబు సామాన్యమే**

బ్రాహ్మి = సరస్వతిచే, దత్త = ఈయబడిన, వర = వరముచే, ప్రసాదుడవు = అనుగ్రహింపబడినవాడవు, ఉరు = గొప్పదైన, ప్రజ్ఞా విశేష = ప్రతిభయొక్క అతిశయముచే, ఉదయ = ఆవిర్భావమందిన, అజిహ్మ స్వాంతుడవు = కపటములేని మనసు కలవాడవు, ఈశ్వర అర్చన కళా; శీలుండవు = ఆసక్తి కలవాడవు, అభ్యర్థిత = అభ్యసింపబడిన, బ్రహ్మాండ ఆది, మహా పురాణ, చయ = సముదాయముల, తాత్పర్య, అర్థ, నిర్ధారిత = నిశ్చయింపబడిన, బ్రహ్మజ్ఞానకళా = బ్రహ్మజ్ఞాన విద్యకు; నిధానమవు = నిధివంటివాడవు, నీ భాగ్యంబు సామాన్యమే

తా. సరస్వతి అనుగ్రహముచే వరములందినవాడవు, గొప్ప ప్రతిభాతిశయముచే లభించిన కుటిలత్వములేని మనసు కలవాడవు, శివపూజా రహస్యముల నెఱిగినవాడవు, బ్రహ్మాండ పురాణము మొదలైన పురాణముల అర్థ తాత్పర్యముల నన్నిటిని నిర్ణయాత్మకముగ తెలుసుకొనిన బ్రహ్మజ్ఞాన విద్యా నిధివి. నీ అదృష్టము సామాన్యమైనది కాదు.

**14 క. జగము నుతింపఁగఁ జెప్పితి**
**ప్రెగడయ్యకు నా యనుంగు పెద్దనకుఁ గృతుల్**
**నిగమార్థ సార సంగ్రహ**
**మగు నా యారాధ్య చరిత మాదిగఁ బెక్కుల్**

నా అనుంగు పెద్దనకు = నాకు ప్రీతిపాత్రుడైన పెద్దన్నగారు, ప్రెగడయ్యకు, జగము నుతింపగన్ = లోకము మెచ్చుకునేలా, నిగమ అర్థ సార సంగ్రహము అగు = వేదార్థములయొక్క సారమును సంగ్రహరీతిలో, ఆ ఆరాధ్య చరితము, ఆదిగ = మొదలైన, పెక్కుల్ = అనేకములైన, కృతుల్ = గ్రంథములను, చెప్పితి = చెప్పియున్నావు.

తా. నాకు ప్రియ సోదరుడైన ప్రెగడయ్యకు లోకము మెచ్చుకునేలా వేదార్థ సార సంగ్రహమగు ఆ ఆరాధ్య చరిత్ర మొదలైన అనేక గ్రంథములను చెప్పియున్నావు.

**15 వ. కావున నాకు నొక్క ప్రబంధంబు పుణ్యశ్లోక పురాతన రాజర్షి చరితానుబంధబంధురంబుగా రచింపు మందును**

తా. కావున ఒక ప్రబంధము పవిత్రమైన యశము కల్గినట్టియు, ప్రాచీనమైనట్టియు, రాజర్షియొక్క చారిత్రముయొక్క సంబంధము ఒప్పునట్లుగా నా కొఱకు రచింపుము. ఆ రచన చేయుటలోను

**16 సీ. కవిరాజ రాజి శేఖర హీర ముకుటంబు**
**శ్రీహీర కులవార్ధి శిశిరకరుఁడు**
**మామల్లదేవి కుమారరత్నంబు చిం**
**తామణి మంత్ర చింతన ఫలంబు**
**కవికులాదృష్టాధ్వ గమనాధ్వనీనుండు**
**కాశ్మీరనృప సభ కమల హేళి**

**ఖండన గ్రంథ సంగ్రథన కర్కశ బుద్ధి**
**షట్తర్క ఫక్కికా చక్రవర్తి**
**తే. భట్ట హర్షుండు ప్రౌఢ వాక్పాటవమున**
**నెద్ది రచియించె బుధలోక హితముపొంటె**
**నట్టి నైషథ సత్కావ్య మాంధ్ర భాష**
**ననఘ! యొనరింపు నాపేర నంకితముగ**

కవిరాజ = కవిశ్రేష్ఠులయొక్క, రాజి = సమూహమునకు, శేఖర = శిరోభూషణ రూపమైన, హీర = వజ్రమయమైన, ముకుటంబు = కిరీటము వంటివాడును, శ్రీహీర కుల = శ్రీహీరుని వంశమనెడి, వార్ధి = సముద్రమునకు, శిశిరకరుడు = చంద్రుని వంటివాడును, మామల్లదేవి కుమారరత్నంబు, చింతామణి మంత్ర = చింతామణి మంత్రమును, చింతన = పఠనచేయుటకు, ఫలంబు = ఫలితమువంటివాడును, కవికుల = కవుల సమూహముచే, అదృష్ట = చూడబడని, అధ్వ = మార్గమునందు, గమన = నడచుటకు, అధ్వనీనుండు = బాటసారి యయినవాడును, కాశ్మీర నృప = కాశ్మీర రాజుయొక్క, సభ = సభయనెడి, కమల = పద్మమునకు, హేళి = సూర్యుని వంటివాడును, ఖండన గ్రంథ = ఖండన ఖాద్యమనెడి గ్రంథముయొక్క, సంగ్రథన = కూర్చుటయందు, కర్కశ బుద్ధి = సమర్థమైన తెలివికలవాడును, షట్ తర్క = ఆరు విధములైన తర్కశాస్త్రముల, ఫక్కికా = ఫణితులకు, చక్రవర్తి = సార్వభౌముని వంటివాడును, భట్ట హర్షుండు = హర్షుడను పండితుడు, ప్రౌఢ వాక్పాటవమునన్ = ప్రౌఢమైన వాక్యములయొక్క పటుత్వముచేత, ఎద్ది = ఏ కావ్యమును, బుధలోక హితము పొంటెన్ = పండిత లోకము మేలుకొరకు, రచియించెన్ = రచించెనో, అట్టి నైషథ సత్కావ్యము, ఆంధ్రభాషన్, అనఘ = దోష రహితుడా!, నా పేరన్ అంకితముగా, ఒనరింపుము = రచింపుము.(రూపక అలంకారము)

తా. కవిశ్రేష్ఠుల శిరోభూషణరూపమైన వజ్రమయ కిరీటమువంటివాడును, శ్రీహీరు(తండ్రి)ని వంశమనెడి సముద్రమునకు చంద్రునివంటివాడును, మామల్లదేవి కుమారరత్నమును, చింతామణి మంత్రమును చింతన చేయుటకు ఫలమైనవాడును, కవికులము స్పృశింపని మార్గమున పయనించు బాటసారియయినవాడును, కాశ్మీరరాజు సభయనెడి తామరకు సూర్యుని వంటివాడును, శ్రీహర్షుడను పండితుడు ప్రౌఢమైన వాక్పటుత్వముచే ఏ కావ్యమును పండిత బృందము మేలుకొఱకు రచించెనో యట్టి నైషథ సత్కావ్యమును ఆంధ్రభాషలో ఓ దోష రహితుడా! నాకు అంకితముగా రచింపుము.

**17 చం. పనివడి నారికేళ ఫలపాకమునం జవియైన భట్ట హ**
**ర్షుని కవితానుగుంభములు సోమరిపోతులు కొంద ఱయ్యలొ**
**నని కొనియాడ నేర రది యట్టిద లేజవరాలు చెక్కు గీఁ**
**టిన వసవల్చు బాలకుఁడు డెందమునం గలఁగంగ నేర్చునే**

నారికేళ ఫల పాకమునన్, చవియైన = రుచికలిగినట్టి, భట్ట హర్షుని = శ్రీహర్షుడనెడి పండితుని, కవిత అనుగుంభములు = కవిత్వ సందర్భములు, సోమరిపోతులు కొందఱు = చదువని అజ్ఞానులు కొంతమంది, అయ్యలు = మూర్ఖులు, పనివడి = పూనుకొని, ఔనని కొనియాడ నేరరు = మేలైనదని ఒప్పుకొనలేరు, అది = ఆ ఒప్పుకొనక పోవుట, లే జవరాలు = యువతి, చెక్కు గీటినన్ = చెక్కు నొక్కినచో, వసవల్చు బాలకుడు = పసిబాలుడు, డెందమునన్ = మనసున, కలగంగ నేర్చునే = కలతచెందుట యెఱుగునా? అట్టిద = అటువంటిదేసుమా! (దృష్టాంత అలంకారము)

తా. పసిబాలుడు యువతి చెక్కునొక్కినను ఏవిధముగా దాని సారము తెలియక మనసునందు కలతచెందడో ఆరీతిగనే చదువుకోని కొంతమంది అజ్ఞానులు నారికేళపాకముతో రుచికలిగినట్టి శ్రీహర్షుని కవిత్వ సందర్భములను మెచ్చుకోలేరు.

**18 వ. అని పలికి సబహుమానంబుగాఁ గర్పూర తాంబూలం బొసంగి జాంబూనదాంబరాభరణంబులు గట్టనిచ్చి వీడ్కొలిపిన నేను నమ్మహాప్రధానునిం గృతినాయకుంజేసి నైషధకావ్యంబు చెప్పం దొడంగితిఁ దత్ప్రారంభంబునకు మంగళాచరణంబుగాఁ దదీయ వంశావతారం బభివర్ణించెద**

తా. అని పలికి, సబహుమానంబుగా కర్పూర తాంబూలములను ఇచ్చి కనక మయములైన వస్త్రములను, ఆభరణములను ధరించుటకు ఇచ్చి పంపగా, నేనును ఆ మహా ప్రధానుని సింగనామాత్యుని కృతిపతిగా చేసి నైషథ కావ్యము చెప్పుటకు, పూనుకొంటిని. ఆ గ్రంథ ప్రారంభమునకు మంగళాచరణంబుగా ఆ కృతిపతియొక్క వంశావతారంబు అభివర్ణించెద.

**19 శా. తోరంబైన తపో విశేషమున సద్యోజాత వక్త్రంబున**
**న్గౌరీ వల్లభుచేత దీక్షఁ గొనియె న్సప్తర్షులం దొక్కఁడై**
**తారావీథి నలంకరించెఁ గనియెం ద్రయ్యర్థ సంఘాతమున్**
**భారద్వాజ మహామునీంద్రుఁ దగదే భక్తిం బ్రశంసింపగన్**

తోరంబు ఐన = గొప్పదైన, తపో విశేషమున = తపస్సుయొక్క ఆధిక్యముచే, సద్యోజాత వక్త్రంబునన్ = సద్యోజాతమనుపేరుగల ముఖముచే, గౌరీవల్లభుచేతన్ = పరమేశ్వరునిచేత, దీక్షన్ = పంచాక్షరీ మంత్రోపదేశమును, కొనియెన్ = పొందెను, సప్తర్షుల

యందు, ఒక్కడై, తారావీథిన్ = ఆకాశమును, అలంకరించెన్, త్రయి అర్థ సంఘాతమున్ = వేదార్థ సమూహమును, కనియెన్ = కనుగొనెను, భారద్వాజ మహామునీంద్రున్, భక్తిన్, ప్రశంసింపగన్, తగదే

**సద్యోజాతము, వామదేవము, అఘోరము, తత్పురుషము,ఈశానము అని పరమేశ్వరుని అయిదు ముఖములు**

**కశ్యపుడు, అత్రి, భరద్వాజుడు,విశ్వామిత్రుడు, గౌతముడు, జమదగ్ని, వశిష్ఠుడు సప్త మహర్షులు**

తా. తనదైన గొప్ప తపస్సుచేత పరమేశ్వరుని సద్యోజాత ముఖమునుండి పంచాక్షరీ మంత్రోపదేశమును పొందెను. సప్త ఋషులయందు తానొక్కడై గగనవీథి నలంకరించెను. వేదత్రయిని కనుగొనెను. అట్టి భరద్వాజమహాముని భక్తితో ప్రశంసించుటకు తగినవాడేకదా!

**20 ఉ. ఆ మునినాథు నన్వయమునం దుదయించెఁ బయఃపయోనిధిన్**
**యామవతీ కళత్రుఁ డుదయం బయినట్లుగఁ గల్పవృక్ష చిం**
**తామణి కామధేను సమదాన నిరూఢుఁడు విద్విషత్తమ**
**స్తోమ దివాకరుండు పెద తూర్కన మంత్రి కులాగ్రగణ్యుడై**

ఆ మునినాథుని, అన్వయమునందు = వంశమునందు, పయస్ పయోనిథిన్ = పాల సముద్రమునందు, యామవతీ కళత్రుడు = రాత్రి భార్యగాకలవాడు (చంద్రుడు), ఉదయంబయినట్లుగ = పుట్టినట్లుగ, కల్పవృక్ష, చింతామణి, కామధేను, సమ దాన నిరూఢుడు = సమానమైన దానగుణమునందు స్థిరమైనవాడు, విద్విషత్ = శత్రువులనెడి, తమః స్తోమ = చీకట్ల సమూహమునకు, దివాకరుండు = సూర్యునివంటివాడునగు, పెద తూర్కనమంత్రి, కుల అగ్రగణ్యుడై = కులశ్రేష్ఠుడై, ఉదయించెన్

తా. ఆ భరద్వాజుని వంశమునందు పాలసముద్రమునందు చంద్రుడు ఉదయించినట్లుగ కల్పవృక్షము, చింతామణి, కామధేనువులతో సమానమైన దానగుణముచే స్థిరమైనవాడును, శత్రువులనెడి చీకటి సమూహమునకు సూర్యునివంటివాడును అగు పెద తూర్కన మంత్రి కులశ్రేష్ఠుడై జనియించెను. (ఉపమ, రూపక అలంకారములు)

**21 వ. తత్సంతాన క్రమంబున**

తా. ఆ సంతానపు వరుసలో

**22 మ. కుటిలారాతి వరూథినీధవ శిరఃకుట్టాక ధాటీ మహా**
**పటహధ్వాన విపాట్యమాన దశ దిగ్భాగుండు త్రైలోక్య సం**
**పుట పేటీ పరిపూర్ణ కీర్తిమయ కర్పూర ప్రకాండుండు శ్రీ**
**చిటిపెద్దప్రభుఁడొప్పె విక్రమపురీ సింహాసనాధ్యాసియై**

కుటిల = కపటులైన, అరాతి = శత్రువులయొక్క, వరూధినీ ధవ = సేనాపతులయొక్క, శిరస్ = తలలను, కుట్టాక = నరుకునట్టి, ధాటీ = దండయాత్రయందలి, మహాపటహ = గొప్ప తప్పెటలయొక్క ధ్వాన = శబ్దముచే, విపాట్యమాన = బ్రద్దలుకొట్టబడుచున్న, దశ దిగ్భాగుండు = పది దిక్కులు కలవాడును, త్రైలోక్య = మూడు లోకములనెడి, సంపుట పేటీ = అరలుగల పెట్టియందు, పరిపూర్ణ = నిండిన, కీర్తిమయ = కీర్తిరూపమైన, కర్పూర ప్రకాండుండు = మంచి కర్పూరము కలవాడును, శ్రీ = లక్ష్మీయుతుడైన, చిటిపెద్దప్రభుడు, విక్రమపురీ, సింహ ఆసన అధ్యాసియై = సింహాసనము నందు అధివసించినవాడై, ఒప్పెన్ = ప్రకాశించెను.

తా. కపటులయిన శత్రు సేనాపతులయొక్క తలలను నరకునట్టి దండయాత్రలయందలి గొప్ప తప్పెటల శబ్దముచే జయింపబడుచున్న పది దిక్కులు కలవాడై, బరిణెయందలి కర్పూరము వలె మూడులోకములయందు నిండిన కీర్తిరూపమైన పరిమళము కలవాడై, చిటిపెద్దన ప్రభువు విక్రమనగర సింహాసనాసీనుడయి వెలుగొందెను. (రూపకాలంకారము)

**23 కం. ఆ చిటిపెద్ద ప్రభునకు**
**వాచస్పతి సదృశ నీతి వైభవ లక్ష్మీ**
**వైచిత్రి కధిక విమల శి**
**వాచార ఘనుండు మామిడన్న జనించెన్**

వాచస్పతి = బృహస్పతితో, సదృశ = సమానమైన, నీతి వైభవ = నయవిద్య మహిమకల, లక్ష్మీ = సంపదయొక్క, వైచిత్రి = పలువిధములుకలవానికి, అధిక విమల = మిక్కిలి నిర్మలమైన, శివ ఆచార ఘనుండు = శివభక్తిచే గొప్పవాడగు, మామిడన్న, జనించెన్. (ఉపమాలంకారము)

తా. బృహస్పతితో సమానమైన నయవిద్య మహిమకల పలువిధములైన సంపదలు కలవాడు, మిక్కిలి స్వచ్ఛమైన శివభక్తిచే గొప్పవాడునైన మామిడన్నమంత్రి పుట్టెను.

**24 ఉ. స్వామి హితంబునన్, సమద శాత్రవ భంజనశక్తి, బంధు ర**
**క్షా మహనీయ సంపద, వసంత సమాగమ ఫుల్ల మల్లికా**
**స్తోమ తుషార పాండుర యశో గరిమంబున, ధర్మ శీలతన్,**
**మామిడి మంత్రిఁ బోల మతి మంత్రులు లేరు వసుంధరాస్థలిన్**

స్వామి హితంబునన్ = ప్రభువునకు మేలుకోరుటయందును, సమద = గర్వితులైన, శాత్రవ = శత్రువులను, భంజన శక్తి = సంహరించు శక్తియందును, బంధు, రక్షా = రక్షించుటయను, మహనీయ = గొప్ప, సంపద = సంపదయందును, వసంత సమాగమ = వసంతకాలము వచ్చుటచే, ఫుల్ల = వికసించిన, మల్లికాస్తోమ = మల్లెపూల సమూహమువలెను, తుషార = మంచువలెను, పాండుర = తెల్లని, యశోగరిమంబునన్ = కీర్తి పెంపునందును, ధర్మ శీలతన్ = ధర్మాచారమందును, మామిడి మంత్రిన్, పోలన్ = సరిపోల్చుటకు, వసుంధరా స్థలిన్ = ఈ భూమండలములో, మఱి = ఇంకెవ్వరును, మంత్రులు, లేరు.

తా. ప్రభువు మేలు కోరుటయందును, మదించిన శత్రువులను సంహరించుటయందును, బంధువులను రక్షించుట యను గొప్ప సంపదయందును, వసంతకాలమందు వికసించిన మల్లె, మంచువలె తెల్లని గొప్ప కీర్తియందును, ధర్మాచరణ మందును మామిడి మంత్రికి సరిపోల్చదగినవారు ఈ భూమండలములో మఱెవ్వరును లేరు. (ఉపమాలంకారం)

**25 తే. అతని యర్ధాంగలక్ష్మి యక్కాంబ గనియె**
**నాత్మజుల వేదమూర్తుల నబ్ధినిభుల**
**వెలయ శ్రీపెద్దనామాత్య వీరభద్ర**
**మారనప్రభు నామన మంత్రివరుల**

అతని అర్ధాంగ లక్ష్మి = ఆ మామిడి మంత్రి భార్య, అక్కాంబ, వెలయన్ = చక్కగా, వేదమూర్తులన్ = వేదస్వరూపులైనట్టియు, అబ్ధి నిభులన్ = సముద్రములతో సమానులైనట్టియు, శ్రీ = శోభకలవారైన, పెద్దనామాత్య, వీరభద్ర, మారనప్రభు, నామన మంత్రి, వరులన్ = శ్రేష్ఠులను, కనియెన్ = కనెను.

తా. ఆ మామిడిమంత్రి భార్యయైన అక్కాంబ చక్కగా నాలుగు వేదస్వరూపులైనట్టియు, నాలుగు సముద్రములతో సమాను లైనట్టియు శోభాయుక్తులైన నలుగురు కుమారులను పెద్దనామాత్య, వీరభద్ర, మారనప్రభు, నామనమంత్రియను శ్రేష్ఠులను కనెను.

**26 సీ. అనవద్య హృద్య విద్యాబుద్ధి సంసిద్ధి**
**బిసరుహాసను నుద్ది పెద్దవిభుడు**
**భద్ర నిర్నిద్ర వాఙ్ముద్రా సముద్వృత్తిఁ**
**గద్రూభవుఁడు వీరభద్రమంత్రి**
**మేరు భూధరసార ధీరతా గుణ హారి**
**వైరి శైల బలారి మారశౌరి**
**స్వామిభక్తి హితైక భావ వైభవభూమి**
**భామినీ రతిరాజు నామరాజు**
**తే. మామిడీశ్వర సాగరామరకుజంబు**
**లక్కమాంబికా శుక్తిరత్నాంకురములు**
**వంశపావను లర్థార్థి వాంచితార్థ**
**దానశౌండులు సౌభ్రాత్ర ధర్మపరులు**

అనవద్య = తక్కువకాని, హృద్య = మనోహరమైన, విద్యాబుద్ధి = విద్యా బుద్ధులయొక్క, సంసిద్ధిన్ = సంప్రాప్తిచే, బిసరుహాసనున్ = బ్రహ్మతో, ఉద్ది = సమానుడైన, పెద్ద విభుడు = పెద్దనామాత్యుడును, భద్ర = మంగళకరమైన, నిర్నిద్ర = జాగరూకమైన, వాక్ ముద్రా = వాక్కుల స్వరూపముయొక్క, సముత్ వృత్తిన్ = అతిశయముచే, కద్రూభవుడు = శేషునితో సమానుడైన, వీరభద్రమంత్రి = వీరభద్రమంత్రియును, మేరు భూధర = మేరుపర్వతముయొక్క, సార = సారమైన, ధీరతా గుణ = ధైర్య గుణముచే, హారి = మనోహరుడును, వైరి = శత్రువులనెడి, శైల = పర్వతములకు, బలారి = ఇంద్రునితోసమానుడైన, మారశౌరి = మారన్న మంత్రియును, స్వామిభక్తి = ప్రభుభక్తికి, హిత = మేలుచేయుటకు, ఏకభావ = ఒకే అభిప్రాయము కలిగిన, వైభవ భూమి = ప్రాభవమునకు నిలయమైన, భామినీ = స్త్రీలకు, రతిరాజు = మన్మధునివంటివాడగు, నామరాజు = నామరాజును, మామిడి ఈశ్వర = మామిడి విభుడనెడి, సాగర = సముద్రమున పుట్టిన, అమర కుజంబులు = కల్పవృక్షములు, అక్కమాంబికా = అక్కమాంబయనెడి, శుక్తి = ముత్యపుచిప్పకు, రత్నాంకురములు = ముత్యములవంటివారు, వంశపావనులు = వంశమును పవిత్రముచేయువారు, అర్థార్థి = యాచకుల, వాంఛిత అర్థ = కోరిన ద్రవ్యములను, దాన = ఇచ్చుటయందు, శౌండులు = నిపుణులు, సౌభ్రాత్ర ధర్మ పరులు = మంచి సోదరభావ ధర్మమునందు ఆసక్తులు

తా. పెద్దనామాత్యుడు మంచి విద్యాబుద్ధుల సంప్రాప్తిచే బ్రహ్మతో సమానుడు. వీరభద్రమంత్రి మంగళకర, జాగరూక వాక్ స్వరూపాతిశయముచే ఆదిశేషునితో సమానుడు. మారన్నమంత్రి మేరుపర్వత సారమైన ధైర్యగుణముచే మనోహరుడై, శత్రు పర్వతములకు ఇంద్రునితోసమానుడు. నామరాజు ప్రభుభక్తికి, మేలుచేయుటకు వేరు భావములేని ప్రాభవుడు, స్త్రీలకు మన్మథ సమానుడు. ఈ నలుగురును మామిడివిభుడనెడి సముద్రమున పుట్టిన కల్పవృక్షములవంటివారు, అక్కమాంబయనెడి ముత్యపుచిప్పయందలి ముత్యములవంటివారు, వంశమును పవిత్రముచేయువారు, యాచకుల ఇష్టములను ఇచ్చుటయందు

దాననిపుణులు. సోదర ధర్మమును పాటించువారు.

**27 మ. అనతారాతి వసుంధరారమణ సప్తాంగాపహార క్రియా**
**ఘన సంరంభ విజృంభమాణ పటుదోఃఖర్జూ ద్వితీయార్జునుం**
**డన వేమాధిప రాజ్యభార భరణ వ్యాపారదక్షుండు పె**
**ద్దన మంత్రీశుఁడు మామిడన్న సుతుఁడేతన్మాత్రుఁడే చూడగన్**

అనత = వంగని, అరాతి వసుంధరారమణ = శత్రురాజులయొక్క, సప్తాంగ = ఏడు సాధనములను, అపహార క్రియా = లాగుకొనుటయను వ్యాపారమునందు, ఘన = గొప్పదైన, సంరంభ = ప్రయత్నముతో, విజృంభమాణ = చెలరేగుతున్నట్టి, పటు= సమర్థమైన, దోః = భుజములయొక్క, ఖర్జూ = దురదగల, ద్వితీయ అర్జునుండు = రెండవ అర్జునుడు, అనన్ = అనునట్లుగా, వేమ అధిప = వేమరాజుయొక్క, రాజ్యభార భరణ = రాజ్యభారమును భరించుటయనెడి, వ్యాపార దక్షుండు = పనియందు సమర్థుడైనట్టియు, మామిడన్న సుతుడు = మామిడిమంత్రి కుమారుడైన, పెద్దన మంత్రీశుడు, చూడగన్ = అలోచింపగా, ఏతత్ మాత్రుడే = సామాన్యుడా? కాదు.

తా. తనకు లొంగని శత్రురాజులను జయించుటయందు గొప్ప ప్రయత్నముతో చెలరేగు సమర్థమైన భుజముల తీటగలవాడై రెండవ అర్జునుడు అని ప్రశంసింపబడుచు వేమారెడ్డియొక్క రాజ్యభారమును వహించుటయందు సమర్థుడైన మామిడిమంత్రి కుమారుడైన పెద్దనమంత్రి ఆలోచింపగా సామాన్యుడు కాదు.

**28 ఉ. హేమధరాధరేంద్రమున కెంతయుఁ బెద్ద ధృతిన్ భుజంగమ**
**స్వామికి మేలుచేయి పటు వాగ్విభవంబున బుద్ధి సంపదం**
**దామరచూలికిన్ సరి ప్రధానులు దక్కినవారు సాటియే**
**మామిడి వీరభద్రున కమాత్యశిఖామణి కివ్వసుంధరన్**

ధృతిన్ = ధైర్యగుణముచే, హేమధరాధర ఇంద్రమునకు = మేరుపర్వతమునకు, ఎంతయున్ = మిక్కిలి, పెద్ద = అధికుడు, పటు = సమర్థమైన, వాగ్విభవంబునన్ = వాక్కుల సంపదచే, భుజంగమ స్వామికిన్ = ఆదిశేషునకు, మేలు చేయి = పైచేయి, బుద్ధి సంపదన్, తామరచూలికిన్ = బ్రహ్మకు, సరి = సమానుడు, ఈ వసుంధరన్ = ఈ భూమండలమందు, అమాత్య శిఖామణికిన్ = మంత్రి శ్రేష్ఠుడైన, మామిడి వీరభద్రునకున్ = మామిడన్న కుమారుడైన వీరభద్రునకు, ప్రధానులు = మంత్రులు, తక్కినవారు = మిగిలినవారు, సాటియే = సరిపడుదురా?

తా. మామిడి వీరభద్రమంత్రి ధైర్యగుణమున మేరుపర్వతముకంటెను అధికుడు. వాక్యసంపదచే ఆదిశేషునకు పైచేయి, బుద్ధిసంపదయందు బ్రహ్మదేవునికి సమానుడు. ఈ భూమండలములోని మిగిలిన మంత్రులెవ్వరును అతనికి సాటిరారు.

**29 ఉ. సత్యవచోనిరూఢుఁడు నిశాకర శేఖర భక్తి భావనా**
**సాత్యవతేయుఁ డుద్భట భుజాబల విక్రమకేళి విక్రమా**
**దిత్యుఁడు కార్య ఖడ్గ సముదీర్ణుఁడు మామిడి మంత్రి మారనా**
**మాత్యుఁడు వానిఁబోల వశమా ధరణీధవ మంత్రి కోటికిన్**

మామిడి మంత్రి మారన అమాత్యుడు, సత్యవచోనిరూఢుడు = సత్యమును పలుకుటయందు స్థిరమైనవాడు, నిశాకర శేఖర = చంద్రుడు సిగలోగల శివునియందలి, భక్తి భావనా = భక్తిరూపమైన ధ్యానమునందు, సాత్యవతేయుడు = వ్యాసుడు, ఉద్భట = ఘనమైన, భుజాబల = బాహుబలముచేతను, విక్రమ కేళి = పరాక్రమ క్రీడచేతను, విక్రమాదిత్యుడు, కార్య ఖడ్గ సముదీర్ణుడు = యుక్తి, శౌర్యములయందు మిక్కిలి గొప్పవాడు, ధరణీధవ = రాజులయొద్దనుండు, మంత్రి కోటికిన్ = మంత్రుల సమూహమునకు, వానిన్ పోలన్ = ఆ మారనమంత్రితో సమమగుటకు, వశమా = వీలగునా?

తా. మామిడిమంత్రి కుమారుడైన మారన మంత్రి సత్యమును పలుకుటయందు స్థిరమైనవాడు. శివునియందలి భక్తిరూప ధ్యానమునందు వ్యాసుడు. బాహుబలమునందు, పరాక్రమక్రీడయందు విక్రమాదిత్యుడు. యుక్తి, శౌర్యములయందు గొప్పవాడు. అట్టి మారన మంత్రిని రాజులయొక్క మంత్రి సమూహము సరిపోలుట వశమా?

**30 శా. స్వామిద్రోహర గండ లాంఛనునకున్ సంగ్రామ గాండీవికిన్**
**వేమక్ష్మాపతి కార్యభార కలనా విఖ్యాత ధీ శక్తికిన్**
**నామామాత్యున కన్యరాజ నిటలాన్తర్న్యస్త భాగ్యాక్షర**
**స్తోమాపాకరణ ప్రవీణునకు మంత్రుల్ సాటియే యెవ్వరున్**

స్వామి ద్రోహర గండ = రాజునకు ద్రోహచింత కలవారియెడ మగడు అనెడి, లాంఛనునకున్ = బిరుదుకలవానికి, సంగ్రామ = యుద్ధములో, గాండీవికిన్ = అర్జునునికి, వేమ క్ష్మాపతి = వేమరాజుయొక్క, కార్య భార = పనుల భారమును, కలనా = మోయుటయందు, విఖ్యాత = ప్రసిద్ధమైన, ధీశక్తికిన్ = బుద్ధిసామర్థ్యము కలవానికి, అన్యరాజ = శత్రురాజులయొక్క, నిటల = నుదుటి, అంతర = మధ్యభాగమున, న్యస్త = ఉంచబడిన, భాగ్య అక్షర = భాగ్యమును తెలిపెడి అక్షరములయొక్క, స్తోమ =

పంక్తిని, అపాకరణ = తుడిచివేయుటయందు, ప్రవీణునకున్ = నేర్పుకలవానికి, నామ అమాత్యునకు, మంత్రుల్, ఎవ్వరున్ = ఎవరైనను, సాటియే?

తా. నామమంత్రి రాజద్రోహులకు గండడని బిరుదు కలవాడు. యుద్ధంలో అర్జున సమానుడు. వేమరాజుయొక్క కార్య భారమును వహించుటయందు బుద్ధి సామర్థ్యము కలవాడు. శత్రురాజుల నుదుటి వ్రాతను తుడిచివేయు నేర్పరి. అట్టి నామ మంత్రికి మంత్రులెవ్వరును సరిపోలరు.

**31 ఉ. తమ్ములు దన్ను మువ్వురును దైవముగా గురుగా మహానిధా**
**నమ్ముగ దాతగాఁ దమ మనంబుల భావనసేసి కొల్వ భా**
**గ్యమ్ముల కెల్ల నెల్లయయి కాంచెఁ బ్రసిద్ధి నృప ప్రధాన ర**
**త్నమ్మగు మంత్రి పెద్దన యుదాత్తమతిన్ రఘురామునైవడిన్**

నృప ప్రధాన రత్నమ్మగు మంత్రి = వేమరాజునకు ముఖ్యమంత్రి యగు, పెద్దన, తన్నున్ = తనను, తమ్ములు మువ్వురును = ముగ్గురు తమ్ములును, దైవముగాన్, గురుగాన్, మహానిధానమ్ముగన్ = పెద్ద నిధిగాను, దాతగాన్, తమ మనంబులన్, భావన చేసి = తలంచి, కొల్వన్ = సేవించుచుండగా, భాగ్యమ్ములకు ఎల్లన్ = సమస్త సంపదలకు, ఎల్ల అయి = హద్దై, రఘురాము నైవడిన్ = రామచంద్రునివలె, ఉదాత్త మతిన్ = గొప్ప బుద్ధిచేత, ప్రసిద్ధికాంచెన్.

తా. మంత్రి పెద్దన, తనను ముగ్గురు తమ్ములును దైవముగాను, గురువుగాను, పెన్నిధిగాను, దాతగాను తలంచి సేవించుచుండగా, సమస్త సంపదలలో తనకు మించినవారు లేరని రఘురామునివలె గొప్ప బుద్ధికలవాడై ప్రసిద్ధి పొందెను.

**32 సీ. గౌతమగోత్ర విఖ్యాతుఁ డాపస్తంబ**
**పరమ సంయమిసూత్ర పావనుండు**
**గారాబు పౌత్రుండు గంధవారణుఁడగు**
**శ్రీకేతనామాత్య శేఖరునకు**
**పేషణి హనుమంత బిరుదాంకుఁడగు రాచ**
**వారికి నెయ్యంపు వరసుతుండు**
**చౌహత్త మల్లుండు దోహత్త నారాయ**
**ణుండు ఖండియరాయ చండ బిరుదు**

**తే. మంత్రి యల్లాడరాజును మహితపుణ్య**
**యన్నమాంబయుఁ దనకు నత్యంత గరిమ**
**దల్లియును దండ్రియును గాఁగఁ దనరునట్టి**
**తల్లమాంబికాదేవి నుద్వాహమయ్యె**

గౌతమ గోత్ర, విఖ్యాతుడు = ప్రసిద్ధుడు, ఆపస్తంబ పరమ సంయమి = ఆపస్తంబమహామునియొక్క సూత్ర = విధులచే, పావనుడు = పవిత్రమైనవాడు. గంధ వారణుడగు = గంధజాతి ఏనుగు వంటివాడగు, శ్రీకేతన అమాత్య శేఖరునకు = శ్రీకేతనమంత్రివరునకు, గారాబు పౌత్రుండు = ముద్దుల మనుమడు, పేషణి హనుమంత బిరుదాంకుడగు = పేషణి (సన్నెకల్లు) హనుమంతయని బిరుదుకలవాడగు, రాచవారికిన్ = రాజునకు, నెయ్యంపు = గారాపు, వరసుతుండు = వరపుత్రుడు, చౌహత్త మల్లుండు (నాలుగు భుజములుకల నారాయణునితో సమానుడని బిరుదు), దోహత్త నారాయణుండు (రెండుచేతులు కలిగినను నాలుగుచేతుల నారాయణునితో సమానుడని బిరుదు), ఖండియ రాయచండ బిరుదు = ఖండియరాయచండ అని బిరుదు కలవాడగు, మంత్రి అల్లాడరాజును = మంత్రియగు అల్లాడ రాజును, మహితపుణ్య = గొప్ప పుణ్యాత్మురాలగు, అన్నమాంబయున్, తనకున్ = తల్లమాంబకు, అత్యంత గరిమన్ = మిక్కిలి గౌరవముతో, తల్లియును తండ్రియును కాగన్, తనరునట్టి = ఒప్పునట్టి, తల్లమాంబికాదేవిన్, ఉద్వాహము అయ్యెన్ = పెండ్లాడెను.

తా. గౌతమ గోత్ర వంశమందు ప్రసిద్ధుడు, ఆపస్తంబుని విధులచే పవిత్రుడు, మదగజమువంటివాడు, కేతన మంత్రికి ముద్దుల మనుమడు, పేషణి హనుమంత బిరుదుకల రాజునకు గారాబు వరపుత్రుడునైన పెద్దన చౌహత్త మల్లుడు, దోహత్త నారాయణుడు, ఖండియరాయచండ అని బిరుదములు కలవాడగు మంత్రి అల్లాడరాజునకు, గొప్ప పుణ్యాత్మురాలగు అన్నమాంబకు కూతురైన తల్లమాంబను మిక్కిలి వైభవముగా పెండ్లాడెను.

**33 మ. వనితారత్నము తల్లమాంబికకు శ్రీవత్సాంకతుల్యుండు పె**
**ద్దనకుం బుట్టిరి నందనుల్ విమల విద్యా భారతీవల్లభుల్**
**వినతాసూను సమాన విక్రమనిధుల్ వీరుందు వేమాహ్వయుం**
**దును శ్రీ ప్రెగ్గడ దండనాథ తిలకుండున్ సింగనామాత్యుడున్**

వనితారత్నము, తల్లమాంబికకున్, శ్రీవత్స అంక తుల్యుండు = విష్ణువుతో సమానుడును (విష్ణువు పుట్టుమచ్చకు శ్రీవత్సాంక

మని పేరు), పెద్దనకున్, విమల విద్యా భారతీ వల్లభుల్ = దోషరహితమైన చదువులకు బ్రహ్మదేవునివంటివారును, వినతాసూను సమాన విక్రమ నిధుల్ = గరుత్మంతునితో సమానమైన పరాక్రమ నిధులును, వీరుండు = వీరుడైన, వేమ ఆహ్వయుండును = వేమాయను పేరుకలవాడును, శ్రీ = లక్ష్మీయుతుడైన, ప్రెగ్గడ దండనాథ తిలకుండున్ = ప్రెగ్గడయను సైన్యాధిపతి శ్రేష్ఠుడును, సింగన అమాత్యుడున్ = సింగనమంత్రియును, నందనుల్ = కుమారులుగా, పుట్టిరి.

తా. తల్లమాంబకు, విష్ణుసమానుడైన పెద్దనకు దోషరహితమైన చదువులలో బ్రహ్మదేవునివంటివారును, గరుత్మంతుని వంటి పరాక్రమము కలవారునైన వీరుడగు వేమన, సేనాధ్యక్షుడగు ప్రెగ్గడ, సింగనమంత్రియును పుత్రులుగ జన్మించిరి.

**34 అందగ్రజుండు**

**35 సీ. కాలకంఠ కఠోర కంఠ హుంకారంబు**
**చెవులు సోఁకని నాఁటి చిత్తభవుఁడు**
**కుపిత రాఘవ ఘన క్రూర నారాచంబు**
**తనువు నాటని నాఁటి వనధిరాజు**
**క్రుద్ధ కుంభోద్భవ భ్రూలతా కౌటిల్య**
**వికృతిఁ గ్రుంగని నాఁటి వింధ్యశిఖరి**
**వీరభద్రోదార ఘోర వీరావేశ**
**విహృతిఁ గందని నాఁటి తుహినకరుఁడు**
**తే. చక్కఁదనమున గాంభీర్య సారమునను**
**బ్రకట ధైర్య కళా కలాపములయందు**
**దండనాయక చూడావతంసమైన**
**మంత్రి మామిడి వేమనామాత్యుఁ డెలమి**

దండనాయక చూడా అవతంసమైన = సేనానాయకులలో శ్రేష్ఠుడైన, మంత్రి, మామిడి వేమనామాత్యుడు, చక్కదనమునన్, కాలకంఠ = శివునియొక్క, కఠోర = కఠినమైన, కంఠ హుంకారంబు = పెడబొబ్బ, చెవులు సోకని నాటి, చిత్తభవుడు = మన్మథుడు. గాంభీర్య సారమునను = గాంభీర్య అతిశయమునందు, కుపిత = కోపించిన, రాఘవ, ఘన = గొప్పదైన, క్రూర నారాచంబు = వాడియైన బాణము, తనువు = శరీరమునందు, నాటని నాటి, వనధిరాజు = సముద్రుడు, ప్రకట = ప్రసిద్ధమైన, ధైర్య = ధైర్యమునందు, కళా కలాపములయందు = విద్యలయొక్క సమూహములయందు, క్రుద్ధ = కోపించిన, కుంభోద్భవ = అగస్త్యునియొక్క, భ్రూలతా కౌటిల్య = బొమముదుల వంకరయొక్క, వికృతిన్ = వికారముచేత, క్రుంగని నాటి = అణిగిపోని, వింధ్యశిఖరి = వింధ్యపర్వతము, ఎలమిన్ = వికాసమునందు, వీరభద్ర = వీరభద్రునియొక్క, ఉదార = గొప్పదైన, ఘోర = భీకరమైన, వీర ఆవేశ = వీరావేశముచేతనైన, విహృతిన్ = విహారముచేత, కందని నాటి = కందిపోని నాటి, తుహినకరుడు = చంద్రుడు. (రూపకము,యథాసంఖ్యాలంకారము)

తా. సేనానాయక చూడామణియైన మామిడి వేమనామాత్యుడు చక్కదనమున శివుని హుంకారము వినని మన్మథుడు, గాంభీర్యమున కోపించిన రాముని బాణాగ్నిచే దహింపబడని సముద్రుడు, ధైర్య విద్యా సమూహమున అగస్త్యుని కోపమునకు క్రుంగని వింధ్యపర్వతము. కాంతిని వీరభద్రునిచే మర్దింపబడని చంద్రుడు.

**36 మ. తగుఁ గైవారమొనర్ప విక్రమకళాధౌరేయతాశాలి శ్రీ**
**ప్రెగడన్న ధ్వజినీశుఁ డంబునిధి గంభీరుండు శుంభద్ద్విష**
**న్నగర ద్వార కవాటపాటన విధాన ప్రౌఢ బాహార్గళా**
**యుగళుం డాహవ సవ్యసాచి ధరలో నొక్కండు పేరుక్కునన్**

విక్రమ కళా = పరాక్రమ విలాసముయొక్క, ధౌరేయతాశాలి = భారవాహకత్వముచే ఒప్పుచున్నవాడు, అంబునిధి గంభీరుండు = సముద్రునివలె గంభీరమైనవాడు, శుంభత్ = ప్రకాశించుచున్న, ద్విషత్ నగర = శత్రువుల నగరములయొక్క, ద్వార కవాట = ద్వారముల తలుపులను, పాటన = బ్రద్దలుకొట్టు, విధాన = పనియందు, ప్రౌఢ = నేర్పుగల, అర్గళా = అడ్డకఱ్ఱలవంటి, బాహా యుగళుండు = భుజద్వయముకలవాడు, ఆహవ = యుద్ధమునందు, సవ్యసాచి = అర్జునుడు అయిన, శ్రీ ప్రెగడన్న = శోభాయుతుడైన ప్రెగడన్న, ధ్వజినీశున్ = దండనాథుని, ధరలోన్ = భూమండలమున, పేరు ఉక్కునన్ = అధికమైన బలము విషయమై, ఒక్కండు = ఏ ఒక్కడైనను, కైవారము ఒనర్పన్ = స్తోత్రము చేయుటకు, తగున్ = సమర్థుడగును.

తా. పరాక్రమశాలియు, సముద్రునివలె గంభీరమైనవాడు, శత్రు ద్వారముల బద్దలుకొట్టుటయందు సమర్థమైన బాహు ద్వయముకలవాడు, యుద్ధరంగమున అర్జునునివంటివాడునైన ప్రెగడన్న దండనాథుని భూమండలమున పేరెక్కిన బలవంతు లెవరైనను స్తోత్రము చేయుటకు మాత్రమే సమర్థులగుదురు.

**37 సీ. గగన కల్లోలినీ కల్లోల మాలికా**
**హల్లీసకములతో నవఘళించి**

చరమ సంధ్యాకాల సంఫుల్ల మల్లికా
స్తబక పంక్తులతోడ సరసమాడి
శరదాగమారంభ సంపూర్ణ పూర్ణిమా
విమల చంద్రికలతో వియ్యమంది
బిసరుహాసనవధూ పృథు పయోధర భార
హారవల్లరులతో ననఁగి పెనఁగి
తే. వెలయు నెవ్వాని యభిరామ విమల కీర్తి
యతఁడు త్రిభువన రాయవేశ్యాభుజంగ
కదన గాండీవి జగనొబ్బ గండ బిరుద
శాశ్వతుం డొప్పు సింగన సచివరుండు

ఎవ్వాని = ఏ సింగనమంత్రియొక్క, అభిరామ = మనోహరమైన, విమల = స్వచ్ఛమైన, కీర్తి, గగన కల్లోలినీ = ఆకాశ గంగయొక్క, కల్లోల మాలికా = కెరటముల పంక్తులయొక్క, హల్లీసకములతోన్ = నాట్యములతో, అవఘళించి = సాటియై, చరమ సంధ్యాకాల = సాయంకాలమందు, సంఫుల్ల = వికసించిన, మల్లికా స్తబక = మల్లెపూల గుత్తులయొక్క, పంక్తుల తోడ = వరుసలతో, సరసము ఆడి = సరసముగా మాటలాడి, శరత్ = శరత్కాలముయొక్క, ఆగమ = రాకయొక్క, ఆరంభ = ప్రారంభదశయందలి, సంపూర్ణ పూర్ణిమా = నిండు పున్నమినాటి, విమల చంద్రికలతో = స్వచ్ఛమైన వెన్నెలలతో, వియ్యమంది = బంధుత్వముచేసి, బిసరుహ ఆసన = బ్రహ్మయొక్క, వధూ = భార్యయైన శారదయొక్క, పృథు = గొప్పవైన, పయోధర = స్తనములయొక్క, భార = బరువుతోను, హారవల్లరులతోన్ = తీగెలవంటి ముత్తెపుసరులతోను, అనగి పెనగి = ఒద్దికగానుండి, వెలయున్ = ప్రకాశించునో, అతడు, త్రిభువన = ముల్లోకములయందు, రాయవేశ్యాభుజంగ, కదన గాండీవి, జగనొబ్బ గండ, బిరుద = బిరుదములతో, శాశ్వతుండు = స్థిరుడై, సింగన సచివవరుండు = సింగన మంత్రిశ్రేష్ఠుడు, ఒప్పున్ =ఒప్పుచుండును.

తా. ఏ మంత్రియొక్క మనోహరమైన, స్వచ్ఛమైన కీర్తి ఆకాశగంగయందలి కెరటముల పంక్తుల నాట్యములతో సాటియగునో, సాయంకాలమందు వికసించిన మల్లెల గుత్తులతో సరసమాడునో, శరత్కాల ప్రారంభదశయందలి నిండు పున్నమి వెన్నెలలతో వియ్యమందునో, సరస్వతి స్తనములపైనున్న ముత్యాలహారములతో కలసి మెలసి ప్రకాశించునో అట్టి కీర్తిగల సింగనమంత్రి ముల్లోకములయందును రాయవేశ్యాభుజంగ, కదనగాండీవి, జగనొబ్బగండ బిరుదములతో శాశ్వతమైనవాడై ఒప్పుచుండును.

38 మ. అరుదారన్ వివిధాగ్రహారములతో నాందోళికా ఛ్ఛత్ర చా
మర కళ్యాణ కళాచికాది బహు సమ్మానార్హ చిహ్నంబు లా
దరమొప్పారఁగ వేమభూవరుని చేతం గాంచె సామ్రాజ్య సం
భరణ ప్రౌఢుఁ డమాత్య సింగఁడు నయ ప్రాగల్భ్య గర్వోన్నతిన్

సామ్రాజ్య = సమస్త రాజ్యమును, సంభరణ = రక్షించుటయందు, ప్రౌఢుడు = నిపుణుడగు, అమాత్య సింగడు = సింగనామాత్యుడు, నయ = నీతిశాస్త్రముయొక్క, ప్రాగల్భ్య గర్వ = సమర్థతయనుగర్వముయొక్క, ఉన్నతిన్ = అతిశయముచేత, అరుదారన్ = అపూర్వముగ, వివిధ అగ్రహారములతో, ఆందోళికా = పల్లకీలు, ఛత్ర = గొడుగులు, చామర = వింజామరలు, కళ్యాణ కళాచికా = శుభకర పాత్రలు, ఆది = మొదలైన, బహు = అనేకములైన, సమ్మాన = సత్కారములకు, అర్హ = తగిన, చిహ్నంబులు = లాంఛనములు, ఆదరము ఒప్పారగన్ = ఆదరము కనబడునట్లుగ, వేమ భూవరుని చేతన్, కాంచె = పొందెను.

తా. రాజ్యమునంతను సంరక్షించుటయందు నిపుణుడగు సింగనామాత్యుడు నీతిశాస్త్రమందలి సమర్థతాతిశయముతో వేమభూపాలునిచేత అపూర్వముగ వివిధ అగ్రహారములతోపాటు పల్లకీలు, ఛత్రచామరములు, కళ్యాణ కళాచికలు మొదలైన అనేక సత్కారములను ప్రీతిపూర్వకముగ పొందెను.

39 వ. ఈదృగ్విధ గుణాలంకారుండైన యమ్మహా ప్రధాన శేఖరునకు

తా. ఇటువంటి సద్గుణ భూషణుడైన ఆ శ్రేష్ఠుడైన సింగనామాత్యునకు

# షష్ఠ్యంతములు

40 క. శ్రీమంతున కావర్జిత
సామంతున కహిత హృదయ జలజాత వనీ
హేమంతునకును సలలిత
భామా కంతునకు సచివ భాస్వంతునకున్

శ్రీమంతునకు, ఆవర్జిత సామంతునకున్ = సామంతులను లొంగదీసుకొనినవానికి, అహిత = శత్రువులయొక్క, హృదయ =

చిత్తములనెడి, జలజాత వనీ = పద్మవనములకు, హేమంతునకును =హేమంత ఋతువైనవానికి (హేమంతమందలి మంచుకు పద్మములు ముకుళించుకుంటాయి), సలలిత = సుందరులైన, భామా =స్త్రీలకు, కంతునకు = మన్మథుడైన వానికి, మంత్రి భాస్వంతునకున్ = మంత్రి శ్రేష్ఠునికి

తా. ఐశ్వర్యవంతునికి, సామంతులను లొంగదీసుకొనినవానికి, శత్రు హృదయములనెడి పద్మవనములకు హేమంతుడైన వానికి, సుందరులైన స్త్రీలకు మన్మథుడైనవానికి సింగన మంత్రి శ్రేష్ఠునికి

**41 క. కుకురు కురు చోళ కేరళ**
**శక మరు కర్ణాట లాట సౌవీర నృప**
**ప్రకర సభాభరణ మహా**
**సుకవి జనానీక వినుత శుభ చరితునకున్**

కుకురు, కురు, చోళ, కేరళ, శక, మరు, కర్ణాట, లాట, సౌవీర దేశముల, నృప = రాజుల, ప్రకర = సముదాయముయొక్క, సభా = ఆస్థానములకు, ఆభరణ = అలంకారమైన, మహా సుకవి జన = గొప్ప కవివర్యులయొక్క, అనీక = సమూహముచే, వినుత = స్తుతింపబడు, శుభ = మంగళకరమైన, చరితునకున్ = చరిత్రముకలవానికి

తా. వివిధ రాజసభాస్థానములకు అలంకారమైన గొప్ప కవివర్యులచేత స్తుతింపబడు మంగళ చరిత్రము కలవానికి

**42 క. చెంచుమల చూఱకారున**
**కంచిత కరుణా తరంగితాపాంగునకుం**
**జంచల నయనా కల కిలి**
**కించిత లీలావిలాస కేళీరతికిన్**

చెంచుమల = చెంచుమల దుర్గమును, చూఱకారునకున్ = కొల్లగొట్టినవానికి, అంచిత = ఒప్పుచున్న, కరుణా తరంగిత = కనికరమనెడి తరంగములవలె పైకుబుకు, అపాంగునకున్ = క్రీగంటిచూపుకలవానికి, చంచలనయనా = స్త్రీలయొక్క, కల = అవ్యక్త మధురమైన, కిలికించిత = శృంగారభరిత చేష్టలు, లీలావిలాస = హావభావములు అను, కేళీ = క్రీడలయందు, రతికిన్ = ఆసక్తికలవానికి

తా. చెంచుమల దుర్గమును కొల్లగొట్టినవానికి, దయ ప్రకటమగు క్రీగంటిచూపులుకలవానికి, స్త్రీల శృంగారభరిత చేష్టలు, హావభావములను క్రీడలయందు ఆసక్తికలవానికి

**43 క. హాటక గిరిధీరున కరి**
**తాటంకవతీ కపోలతల వర మకరీ**
**పాటచ్చర కఠిన ధను**
**ర్జ్యాటంకారునకు మన్మథాకారునకున్**

హాటక గిరి = మేరుపర్వతమువలె, ధీరునకు = ధైర్యము కలవానికి, అరి = శత్రువుల, తాటంకవతీ = స్త్రీల, కపోల తల = గండప్రదేశమందలి, వర = శ్రేష్ఠమైన, మకరీ = మకరికాపత్రములను, పాటచ్చర = దొంగిలించు, కఠిన, ధనుస్ జ్యా టంకారునకు = వింటినారి ధ్వని కలవానికి, మన్మథ ఆకారునకున్ = మన్మథునివంటి రూపముకలవానికి

తా. మేరు పర్వతమువంటి ధైర్యముకలవానికి, వింటినారి ధ్వనిచేతనే శత్రుస్త్రీలకు వైధవ్యము నిచ్చువానికి, మన్మథుని వంటి రూపముకలవానికి

**44 క. శ్రీమహిత పెద్దసుతునకు**
**వేమక్షితిపాల రాజ్య విభవ కళా ర**
**క్షామణికి సింగన సచివ**
**గ్రామణికిం బాండ్యరాయ గజకేసరికిన్**

శ్రీ మహిత = ఐశ్వర్యముచే గొప్పవాడైన, పెద్ద సుతునకు = పెద్దన కుమారుడైన సింగనకు, వేమ క్షితిపాల = వేమ రాజుయొక్క, రాజ్య విభవ కళా = రాజ్య వైభవ విలాసముల, రక్షామణికిన్ = రక్షణయందు శ్రేష్ఠుడైనవానికి, పాండ్యరాయ గజ కేసరికిన్ = పాండ్యరాజనెడి ఏనుగునకు సింహమువంటివానికి, సింగన సచివ గ్రామణికి = మంత్రి శ్రేష్ఠుడైన సింగన మంత్రికి

తా. ఐశ్వర్యముచే గొప్పవాడైన పెద్దన కుమారుడైన సింగనకు, వేమభూపాలుని రాజ్య వైభవ విలాసముల రక్షణయందు శ్రేష్ఠుడైనవానికి, పాండ్యరాజనెడి ఏనుగునకు సింహమువంటి వానికి, మంత్రి శ్రేష్ఠుడైన సింగనమంత్రికి

**45 వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పం బూనిన యిమ్మహా ప్రబంధమునకు కథానాయకుండు**

## నలమహారాజ వర్ణనము

46 సీ. తపనీయ దండైక ధవళాతపత్రితో
ద్దండతేజః కీర్తిమండలుండు
నిర్మల నిజకథా నిమిష కల్లోలినీ
క్షాళితాఖిల జగత్కల్మషుండు
వితత నవద్వయ ద్వీప నానా జయ
శ్రీ వధూటీ సమాశ్లిష్ట భుజుఁడు
నిఖిల విద్యానటీ నృత్యరంగ స్థలా
యతనాయమాన జిహ్వాంచలుండు
తే. ప్రస్తుతింపంగఁ దగు సముద్భట కఠోర
చటుల గుణ టంక్రియా ఘనస్తనిత ఘోష
చాప నీరద భవ శరాసార శమిత
బలవ దహిత తేజో దవానలుఁడు నలుఁడు

తపనీయ = బంగారు, దండ = కామగల, ఏక = ఒక్కటైన, ధవళ = తెల్లని, ఆతపత్రిత = గొడుగుగా చేయబడుచున్న, ఉద్దండ = గొప్పదైన, తేజస్ = తేజస్సుయొక్కయు, కీర్తి = కీర్తియొక్కయు, మండలుండు = సమూహముకలవాడు, నిర్మల = స్వచ్ఛమైన, నిజ కథా = తన చరిత్రమనెడి, అనిమిష కల్లోలినీ = ఆకాశగంగచే, క్షాళిత = కడుగబడిన, అఖిల = సమస్తమైన, జగత్ = లోకములయొక్క, కల్మషుండు = పాపములుకలవాడు, వితత = విస్తారమైన, నవద్వయ ద్వీప = పదునెనిమిది ద్వీపములయొక్క, నానా = పలువిధములైన, జయశ్రీ = జయలక్ష్మియనెడి, వధూటీ = వనితచేత, సమాశ్లిష్ట = కౌగలించుకొనబడిన, భుజుడు = బాహువులుకలవాడు, నిఖిల విద్యా = సమస్త విద్యలనెడి, నటీ = నాట్య కత్తెలయొక్క, నృత్య రంగ స్థల = నాట్య రంగస్థలమనెడి, ఆయతనాయమాన = ఆలయముగా నొప్పుచున్న, జిహ్వా = నాలుకయొక్క, అంచలుండు = చివరకలవాడు, సముద్భట = గొప్పదైన, కఠోర = దారుణమైన, చటుల = చలించుచున్న, గుణ = వింటినారియొక్క, టంక్రియా = టంకారమనెడి, ఘన = గొప్పదైన, స్తనిత ఘోష = గర్జనముకల, చాప నీరద = ధనుస్సనెడి మేఘమువలన, భవ = పుట్టుచున్న, శర ఆసార= బాణ వర్షముచే, శమిత = ఆర్పబడిన, బలవత్ = బలవంతులైన, అహిత = శత్రువులయొక్క, తేజస్ = పరాక్రమమనెడి, దవానలుడు = అగ్నియైనవాడు, నలుడు, ప్రస్తుతింపంగన్ తగున్ = స్తుతిపాత్రుడు అగును. (రూపకాలంకారము) (తపనీయ, ధవళ విశేషణములచే ప్రతాపముయొక్క ఎరుపు, కీర్తియొక్క తెలుపు తెలుపబడుచున్నవి. మండలుడు అనునది గుండ్రని గొడుగున కుపమింపబడినది. కీర్తికి ప్రతాపము ఆధారము కనుక గొడుగునకు కామ ఆధారము.)

తా. నలుడు ప్రతాపమనెడి బంగారు కామగల తెల్లని కీర్తిగల ఏక ఛత్రముకలవాడు, ముల్లోకములను పవిత్రముచేయు ఆకాశగంగవలె పవిత్ర చరిత్రముకలవాడు, పదునెనిమిది ద్వీపములను జయించిన బాహువులుకలవాడు, నాట్యకత్తెల నాట్యాలయముగా నొప్పుచున్న సమస్త విద్యలు జిహ్వాగ్రమున కలవాడు, ధనుష్టంకారమనెడి గర్జనలుకల తన విల్లనెడి మేఘమునుండి బయల్వడు బాణవర్షముచే ఆర్పివేయబడిన శత్రువుల పరాక్రమాగ్ని కలవాడు. అట్టి నలమహారాజు స్తుతిపాత్రుడే యగును.

47 చం. అలయకధీతి బోధములు నాచరణంబు ప్రచారణంబు నాఁ
గలుగు నుపాధి భేదముల గాఢమతిన్ నిగమాదులైన వి
ద్యలు పదునాలిగింటికి నతం డొనరించెఁ జతుర్దశత్వముం
దెలియగలేము కారణము దీనికి నెమ్మెయి జర్చ సేసినన్

అతండు = ఆ నలమహారాజు, అలయక = అలసటలేక, అధీతి బోధములున్ = చదువుట, అర్థముచేసికొనుట, ఆచరణంబు ప్రచారణంబు = ఆచరించుట, ఆచరింపచేయుట, నాన్ = అనగా, కలుగు = ఉన్నట్టి, ఉపాధి భేదములన్ = నాలుగు ఉపాధి భేదములచేతను, గాఢమతిన్ = నిశ్చలబుద్ధితో, నిగమ ఆదులు ఐన = వేదములు మొదలైనవైన, విద్యలు పదునాలిగింటికిన్ = పదునాలుగు విద్యలకును, చతుర్దశత్వమున్ = నాలుగు దశలు కలిగియుండుటను, (పదునాలుగే యగుటను) ఒనరించె = కావించెను (ప్రతివిద్యకు నాలుగు ఉపాధి భేదములను కావించెను అనగా ఏబదియారగుటకు మారుగ పదునాలుగే యగుట) దీనికి = ఇట్లగుటకు, కారణము, ఏ మెయి = ఏ విధముగను, చర్చచేసినన్ = చర్చించినను, తెలియగలేము = తెలిసికొనలేము. (విరోధాభాసాలంకారము)

**ఋక్కు, యజుస్సు, సామము, అథర్వము అను నాలుగు వేదములు – శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యౌతిషము, కల్పము అను ఆరు వేదాంగములు – మీమాంస, న్యాయము, పురాణము, ధర్మశాస్త్రము ఇవి చతుర్దశ విద్యలు.**

తా. ఆ నలమహారాజు చదువుట, అర్థముచేసికొనుట, ఆచరించుట, ఆచరింపచేయుట అను నాలుగు ఉపాధి భేదములచేతను పదునాలుగు విద్యలను నేర్చి ఏబదియారింటిని పదునాలుగుగనే యుంచుటలోని కారణమును ఎంత చర్చించినను తెలిసికొనలేము.

**48 తే. అతని విద్య జిహ్వానటి శ్రుతివిధమున**
**నంగ గుణమున నష్టాదశాత్మయగుచు**
**విస్తరిల్లె నవద్వయ ద్వీప పృథ గ**
**శేష భూజయలక్ష్మీ జిగీషఁబోలె**

జిహ్వానటి = లోకుల నాలుకలయందు నాట్యము సల్పుచున్న, అతని = ఆ నలమహారాజుయొక్క, విద్య = సూపకారవిద్య, అంగ = షడంగములయొక్క, గుణమున = ఆవృత్తిచేత, అష్టాదశాత్మ అగుచు = పదునెనిమిది అగుచుండగా, (అల్ప, అధిక, సమము అను ఆరు రసములు పదునెనిమిది యగుచుండగా), నవద్వయ ద్వీప = పదునెనిమిది ద్వీపములవగు, పృథక్ = వేరువేరుగానున్నట్టి, అశేష = సమస్తమైన, భూజయలక్ష్మీ = భూమండలమును జయించుటవలన కలిగిన లక్ష్మలను, జిగీషన్ పోలె = జయింపవలెనను కోరికచేతను వలె, విస్తరిల్లెన్ = విస్తరించినది (ఉపమ,ఉత్ప్రేక్షాలంకారము)

తా. ఆ నలమహారాజు సూపవిద్యయందు ప్రవీణుడు. అది షడ్రసములచేతను ఒక్కొక్కటి అల్పము, అధికము, సమము అను భేదములచే పదునెనిమిది స్వరూపముల నందెను. ఆ పొందుట అతని వేదవిద్య పదునెనిమిది రూపములు పొందినట్లే యుండెను. ఇంకను ఆ పదునెనిమిది యగుట పదునెనిమిది ద్వీపములను ఒక్కొక్కదానిని ఒక్కొక్క రూపమున జయించుటకా యన్నట్లుండెను. **(వేదాది అష్టాదశ విద్యలు, అల్ప అధిక సమత్వములచే అష్టాదశ సూపకారవిద్యలు, అష్టాదశ ద్వీపములు)**

**49 తే. తాఁ ద్రినేత్రుని యపరావతారమగుట**
**దెలుపు దిక్పాలకాంశావతీర్ణుఁ డతఁడు**
**కామ సంచార హరణ ప్రగల్భమైన**
**శాస్త్రమను పేరి యధిక లోచనము కలిమి**

దిక్పాలక, అంశ = అంశవలన, అవతీర్ణన్ = అవతరించినట్టి, అతడు = ఆ నలమహారాజు, కామ సంచార = స్వేచ్ఛాప్రవృత్తిని, హరణ = ఆపుటయందు, ప్రగల్భము ఐన = సమర్థమైన, శాస్త్రమను, పేరి = పేరుగల, అధిక లోచనము = అదనపు కన్ను, కలిమిన్ = కలిగి యుండుటచే, తాన్ = తాను, త్రినేత్రుని = శివుని, అపర అవతారము, అగుటన్, తెలుపు = తెలుపుచుండును.

**(శివుడు కాముని ప్రచారమును హరించినట్లే నలుడు శాస్త్రకామ ప్రచారమును హరించుచున్నాడు)**

తా. దిక్పాలుర అంశచే సృజింపబడి కామప్రవృత్తిని ఆపుటయందు సమర్థుడైన నలమహారాజునకు శాస్త్రము పేరున అదనపు నేత్రముండుటచే తాను త్రినేత్రుని అపరావతారము అను విషయమును తెలుపుచుండును. (రూపకాలంకారము)

**50 చం. కెరలి మహాసి వేమసహకృత్వరి తద్భటకోటి చాతురీ**
**తురి సమరాంగణంబులఁ జతుర్హరిదావరణంబులన్ యశోం**
**బరముల నేయుచుండు బహుభంగులఁ బున్నమనాఁటి నిండు చం**
**దురు నునుసోగ వెన్నెలలతోఁ దులఁదూఁగెడు తద్గుణంబులన్**

సమరాంగణంబులన్ = యుద్ధరంగములందు, మహత్ = గొప్పదియైన, అసి = కత్తియనెడి, వేమ = నేతపలక, సహకృత్వరి = సహాయముగాకల, తత్ భట కోటి = ఆ నలమహారాజు భటుల సముదాయము యొక్క, చాతురీ = నేర్పనెడి, తురి = నాడె (నేత వస్తువు), కెరలి = అతిశయించి, పున్నమి నాటి, నిండు చందురు, నును సోగ = స్నిగ్ధములై, నిడుదలైన; వెన్నెలలతోన్, తుల తూగెడు = సాటి వచ్చెడు, తత్ = ఆ నలమహారాజుయొక్క, గుణంబులన్ = గుణములనెడి తంతువులచేత, చతుర్ హరిత్ = నాలుగు దిక్కులను, ఆవరణంబులు = కప్పుచుండెడి, యశోంబరములన్ = కీర్తియనెడి వస్త్రములను, బహుభంగులన్ = పెక్కు రీతులుగ, నేయుచుండు (రూపకాలంకారము)

తా. గొప్పదైన కత్తియనెడి నేతపలక సహాయముగ గల నలమహారాజు భటుల నేర్పరితనమనెడి నాడె నిండుచంద్రుని వెన్నెలలతో సమానమైన నలమహారాజుయొక్క గుణములనెడి తంతువులతో నాలుగు దిక్కులను కప్పగలిగిన కీర్తియనెడి వస్త్రములను పెక్కురీతులుగ నేయుచుండును.

**51 తే. తద్దిశాజయ యాత్రోత్థ ధరణి ధూళి**
**దోః ప్రతాప వైశ్వానర ధూమరేఖ**
**పాలమున్నీటిలోఁబడి పంకమయ్యె**
**నమృతదీధితిమైఁ జెంది యంకమయ్యె**

దోః = బాహువులయొక్క, ప్రతాప, వైశ్వానర = అగ్నిహోత్రునియొక్క, ధూమరేఖ = పొగసమూహమువలెనున్న, తత్ = ఆ నలమహారాజుయొక్క, దిశాజయ = దిగ్విజయముకొఱకైన, యాత్ర = యుద్ధయాత్రలందు, ఉత్థ = రేగిన, ధరణి ధూళి = భూపరాగము, పాలమున్నీటిలోన్ పడి = పాలసముద్రములో పడి, పంకము అయ్యెన్ = బురద అయ్యెను, అమృతదీధితి =

చంద్రునియొక్క, మైన్ = శరీరమును, చెంది = పొంది, అంకము అయ్యెన్ = కళంకమయ్యెను. (ఉత్ప్రేక్షాలంకారము)
తా. నలమహారాజుయొక్క బాహుప్రతాపమనెడి అగ్నిహోత్రుని పొగసమూహమువలెనున్నదై దిగ్విజయముకొఱకైన యుద్ధయాత్రలందు రేగిన భూపరాగము పాలసముద్రములోపడి బురదగా మారెను. చంద్రుని శరీరమును పొంది అది కళంకమామయెను.

**52 చ. అరయిక గల్గి భూమివలయం బఖిలంబును నీతిబాధలం**
**బొరయక యుండనా నృపతిపుంగవుఁ డేలుచునుండ నొండుచో**
**టిరవయి యుండకుండుటఁజుమీ యతివర్షము లాశ్రయించెఁ ద**
**త్పర నరనాథ యూథ వనితాజనతా నయనోత్పలంబులన్**

ఆ నృపతిపుంగవుడు = ఆ రాజశ్రేష్ఠుడు, అరయిక కల్గి = విచారణ కలిగి, భూమి వలయంబు = భూమండలము, అఖిలంబునున్ = సమస్తమును, ఈతిబాధలం, పొరయక ఉండన్ = పొందకుండునట్లుగా, ఏలుచునుండన్, ఒండుచోటు = మరియొకచోటు, ఇరవయి = నివాసస్థలమై, ఉండక ఉండుటన్ చుమీ = లేకపోవుటచేతనే సుమా, అతి వర్షములు = అతివృష్టి, తత్ = ఆ నలమహారాజుయొక్క, పర నరనాథ యూథ = శత్రురాజుల సమూహముయొక్క, వనితాజనతా = స్త్రీజనముయొక్క, నయన ఉత్పలంబులన్ = కలువలవంటి కన్నులను, ఆశ్రయించెన్ (ఉత్ప్రేక్షాలంకారము)

**(అతివృష్టి, అనావృష్టి, మూషికములు, మిడుతలు, చిలుకలు, పొరుగు రాజు ఈ ఆఱును ఈతిబాధలు)**

తా. ఆ నలమహారాజు తన రాజ్యమునందెచ్చటను ఈతిబాధలు లేకుండునట్లు పరిపాలించుచుండగా తనకు మరొకచోటు నివాసస్థలముగా లేకపోవుటచేత అతివృష్టి శత్రురాజుల స్త్రీల కలువలవంటి కన్నులను చేరుకొనెను.

**53 ఉ. కొండని వేడ్కతోఁ బసిడికొండ ధనార్థులకెల్లఁ బంచి యీ**
**కుండుట దానధారకుఁ బయోనిధు లెల్ల వ్యయింప లేమి యీ**
**రెండపకీర్తులం దల ధరించినవాఁడు ప్రదానశీలుఁ డా**
**తం డిరువాయగా ముడికిఁ దార్చిన వెంద్రుక లన్మిషంబునన్**

కొండు అని = తీసుకొమ్మని, వేడ్కతో = సంతోషముతో, పసిడి కొండ = మేరుపర్వతమును, ధనార్థులకు ఎల్లన్ = యాచకులందరికి, పంచి ఈకుండుట = పంచిపెట్టకుండుట, దానధారకున్ = దానజలమునకు, పయోనిధులు ఎల్ల = సముద్రములన్నియు, వ్యయింప లేమి = ఖర్చుచేయకపోవుట, ఈ రెండు అపకీర్తులన్, ప్రదానశీలుడు = దానమే స్వభావముగా కలవాడైన, ఆతండు, ఇరు పాయగాన్ = రెండు పాయలుగ, ముడికిన్ తార్చిన = ముడిగా కూర్చిన, వెంద్రుకలు, అన్ మిషంబునన్ = అను మిషచే, తలన్ ధరించినవాడు. (రూపకాలంకారము)
తా. ఇస్తున్నాను తీసుకోండని సంతోషంగా బంగారుకొండను యాచకులకు పంచిపెట్టకపోవడం, దానజలంగా సముద్రములోని నీటినంతను ఖర్చుచేయకపోవడం ఈ రెండు అపకీర్తులను దానమే స్వభావముగాగల ఆ నలమహారాజు రెండుపాయలుగనున్న వెంద్రుకలను ముడిగా కూర్చుట అను మిషచే తలను ధరించినాడు.

**54 చం. నియమ విచిత్రభంగి మహనీయుఁడు భూమివిభుండు మిత్ర జే**
**తయును నమిత్ర జాతయుఁ బ్రతాపగుణంబున నీతిఁ జార దృ**
**ష్టియును విచారదృష్టియు నటే! పరిపంథి మహీశులట్ల త**
**ద్భయమున భేతృతాగుణము వాసెనొ కాక విరుద్ధ ధర్మముల్**

నియమ = ఏర్పాట్లయొక్క, విచిత్ర = అద్భుతములైన, భంగి = రీతులు కలవాడును, మహనీయుడు, భూ విభుండు = ఆ నలమహారాజు, ప్రతాపగుణంబుచే = తేజోగుణముచే, మిత్ర జేతయు = సూర్యుని జయించివాడును, అమిత్రజాతయున్ = శత్రువులను జయించినవాడును, నీతిన్ = నీతిచేత, చార దృష్టియును = చారులనెడి చూపుకలవాడును, విచార దృష్టియున్ = ఆలోచనయే చూపుగాకలవాడును, అటే = అగుట ఆశ్చర్యము, తత్ భయమునన్ = ఆ నలునివలని భయముచేత, విరుద్ధ ధర్మముల్ = వ్యతిరేకములైన ధర్మములు, పరిపంథి మహీశులట్ల = శత్రురాజులవలె, భేతృతా గుణము = భేదబుద్ధిని, పాసెనొ కాక = విడిచిపెట్టెను కాబోలు (విరోధాభాస, ఉత్ప్రేక్ష అలంకారములు)
తా. నలమహారాజు అద్భుతములైన పలు ఏర్పాట్లచే మహనీయుడు. తేజోగుణముచే సూర్యుని జయించినవాడును, శత్రువులను జయించినవాడును, నీతిని చారదృష్టియు, విచారదృష్టియును అగుట ఆశ్చర్యము. ఆ నలమహారాజువలని భయమువలన విరుద్ధ ధర్మములు శత్రురాజులవలె విరోధమును వదలుకొన్నవి కాబోలు.

**55 మ. ధరనేకాంఘ్రి కనిష్ఠికాంగుళమ యాధారంబుగా నిల్చి ని**
**ర్భరలీలం గృతవేళ నెట్టన యధర్మంబుం దపస్విత్వముం**
**బొరసెం దక్కినవారలెవ్వరు తపంబుల్ సేయ రమ్మేది నీ**
**శ్వరు సామ్రాజ్యమునందు ధర్మము చతుష్పాదంబులం గ్రాలఁగన్**

కృతవేళన్ = కృతయుగమునందు, ఆ మేదిని ఈశ్వరు = ఆ నలమహారాజుయొక్క, సామ్రాజ్యమునందు, ధర్మము, చతుష్పాదంబులన్ = నాలుగు పాదములను, గ్రాలగన్ = ఒప్పుచుండగా, అధర్మంబున్ = అధర్మముసైతము, ఏక = ఏకాకియై, అంఘ్రి కనిష్ఠిక అంగుళము = పాదపు చిటికిన వ్రేలు మాత్రమే, ఆధారంబుగాన్ = ఊతమగునట్లుగా, నిల్చి, నిర్భరలీలన్ = భరింపశక్యముకాని రీతిచే, నెట్టనన్ = అనివార్యముగ, తపస్విత్వమున్ = తాపసవృత్తిని, పొరసెన్ = పొందెను, తక్కినవారలు, ఎవ్వరు, తపంబుల్, చేయరు (కావ్యార్థాపత్తి అలంకారము)

తా. కృతయుగమునందు ఆ నలమహారాజు సామ్రాజ్యమునందు ధర్మము నాలుగుపాదముల ఒప్పుచుండగా అధర్మము ఏకాకియై పాదపు చిటికినవ్రేలుమాత్రమే ఊతమగునట్లుగా నిలిచి భరింపశక్యముగాక అనివార్యముగ తాపసవృత్తిని పొందగా తక్కినవారలెవ్వరును ఆరీతిగా తపము చేయకుండిరి

**56 క. ఆ రాజు విజయలక్ష్మికి**
**నీరాజన మాచరించు నిర్దగ్ధ దిగం**
**తారాతిరాజ నగరీ**
**దారుణ వైశ్వానర ప్రదక్షిణ శిఖలన్**

ఆ రాజు = ఆ నలమహారాజు, విజయలక్ష్మికిన్, నిర్దగ్ధ = తగులపెట్టబడిన, దిగంతర = దిక్కులయొక్క అంతమువరకుగల, అరాతి రాజ = శత్రురాజులయొక్క, నగరీ = నగరములయొక్క, దారుణ = భీకరమైన, వైశ్వానర = అగ్నిహోత్రునియొక్క, ప్రదక్షిణ శిఖలన్ = ప్రదక్షిణ జ్వాలలచేత, నీరాజనము ఆచరించున్ = నిరాజనమిచ్చును (ఉత్ప్రేక్షాలంకారము)

తా. ఆ నలమహారాజుచే తగులపెట్టబడిన దిగంతములవరకుగల శత్రునగరములయొక్క భీకర అగ్నిజ్వాలలు ఆతని విజయలక్ష్మికి నీరాజనమిచ్చును.

**57 చ. ఇతఁడు దరిద్రుఁడౌననుచు నేర్పడ నర్థి లలాటపట్టికన్**
**శతధృతి వ్రాసినట్టి లిపిజాల మనర్థము గానియట్లుగా**
**వితరణ ఖేలనా విభవ విభ్రమ నిర్జిత కల్ప భూరుహుం**
**డతఁడు దరిద్రతా గుణమునందు దరిద్రునిఁ జేయు నాతనిన్**

వితరణ ఖేలనా = దానగుణమనెడి క్రీడయొక్క, విభవ = సంపదయొక్క, విభ్రమ = విలాసముచే, నిర్జిత = జయింపబడిన, కల్ప భూరుహుండు = కల్పవృక్షముగల, అతడు = ఆ నలమహారాజు, ఇతడు = ఈ మనుజుడు, దరిద్రుడు = బీదవాడు, ఔననుచన్ = అని పలుకుచు, ఏర్పడన్ = స్పష్టముగా, అర్థి లలాటపట్టికన్ = యాచకునియొక్క ఫాలతలమునందు, శతధృతి = బ్రహ్మ, వ్రాసినట్టి లిపిజాలము = లిఖించిన అక్షర సముదాయమును, న అర్థము = అర్థము లేనిది, కాని అట్లుగాన్ = కాకుండ, అతనిన్ = ఆ దరిద్రుని, దరిద్రతా గుణమునందు = బీదతనమునందు, దరిద్రునిన్ = బీదవానినిగా, చేయున్ = చేయుచుండును

తా. బ్రహ్మ 'వీడు దరిద్రుడగున'ని యాచకుని ఫాలతలమునందు వ్రాసిన వ్రాతను నలమహారాజు వానికి విస్తారమగు ధనము నొసగి యాతని బీదతనమును తొలగించి బ్రహ్మవ్రాత వ్యర్థము కాకుండునట్లు వాని బీదతనమునందు బీదవానినిగా జేయును. (అతిశయోక్తి అలంకారము)

**58 తే. అతని కీర్తి ప్రతాపంబు లవనిఁ గలుగ**
**నేల యివియంచు మదిలోన నెపుడు దలఁచు**
**నపుడ పరివేష నెపమున నబ్జసూర్య**
**మండలముల విధాతృండు గుండలించు**

అతని కీర్తి ప్రతాపంబులు, అవనిన్ = భూమియందు, కలుగన్ = ఉండగా, ఇవి ఏల అంచున్ = ఈ సూర్య చంద్ర మండలములు ఎందులకని, విధాతృండు = బ్రహ్మ, మదిలోనన్ = మనస్సునందు, ఎపుడు = ఏ సమయమునందు, తలచున్ = అనుకొనునో, అపుడ, పరివేష నెపమునన్ = గాలిగుడి వంకతో, అబ్జ సూర్య మండలంబులన్ = చంద్ర, సూర్య మండలములను, కుండలించున్ = సున్నాచుట్టును (ఉత్ప్రేక్షాలంకారము)

తా. నలమహారాజు కీర్తి (తెలుపు), ప్రతాపము (ఎఱుపు) భూమియందుండగా చంద్రసూర్య మండలములను ఇవెందుకని బ్రహ్మ ఎపుడు మనసులో అనుకున్నాడో అపుడే గాలిగుడివంకతో చంద్ర (తెలుపు) సూర్య (ఎఱుపు) లను సున్నా చుట్టుచుండును.

**59 వ. అన్నలుండు నళినబాంధవుండునుంబోలె ప్రతిదినంబును నభ్యుదయంబు నొందుచుఁ గ్రమంబున శైశవంబు నతిక్రమించి యౌవనారంభంబున నరిదుర్గ లుంఠనావసరంబులంబోలె లోహార్గళ దీర్ఘపీనతయును, గోపుర ద్వార కవాట దుర్ధర్ష తిరఃప్రసారితయును, బాహా వక్షంబులచేత వందీగ్రాహంబు గ్రహించి రోమకోటికపటంబున హాటకగర్భుండు పాటించి లిఖించిన సుగుణ గణనారేఖ లవయవంబులం బొలుపార సంపూర్ణ పూర్ణిమా చంద్రబింబంబు విడంబింపం జాలు నెమ్మొగంబునకుం గళంకాలంకారశంక నంకురింపఁ జేయంజాలు కోమల శ్మశ్రురాజి విరాజిల్ల గందు మెఱసి రెండవ కుసుమ కోదండుండునుంబోలె విలాసినీ మండలికిం గన్నులపండువై వెండియు**

తా.	ఆ నలుడు సూర్యునివలె ప్రతి రోజు అభ్యుదయంబును పొందుచు క్రమంగా బాల్యమును దాటి, యౌవన ఆరంభంబున శత్రుదుర్గములను కొల్లగొట్టు సమయములందువలె లోహపు గడియలయొక్క దీర్ఘత్వమును, స్థూలత్వమును; గోపుర ద్వారము తలుపుల కఠినత్వమును, వైశాల్యమును బాహువులచేతను, వక్షస్థలముచేతను బందీని పట్టినట్లుగ పట్టి వెంద్రుకల కోటులయొక్క మిషచేత బ్రహ్మ పూని వ్రాసిన మంచిగుణములను లెక్కించు గీతలు అవయవములయందు ఒప్పుచుండగా నిండైన పున్నమినాటి చంద్రబింబమును సరిపోలుటకు సమర్థమైన అందమైన ముఖమునకు కళంకమనెడి శంకను కలిగించుటకు సమర్థమగు, కోమల రోమసమూహము వెలుగొందుచుండగా మిక్కిలి ప్రకాశించి రెండవ మన్మథునివలె కామినుల సమూహమునకు, కన్నుల పండువై, ఇంకను

**60 తే. దాస్యమొనరించు విధుఁ డేతదాస్యమునకుఁ**
**బల్లవము లేతదంఘ్రి సంపల్లవములు**
**జలరుహములకుఁ దచ్ఛయచ్ఛాయ దాయ**
**యనఁగ నతఁడొప్పె నవయౌవనాగమమున**

విధుడు = చంద్రుడు, ఏతత్ ఆస్యమునకు = ఈ నలుని ముఖమునకు, దాస్యము = ఊడిగమును, ఒనరించున్ = చేయును, పల్లవములు = చిగుళ్ళు, ఏతత్ = ఈ నలుని, అంఘ్రి = పాదములయొక్క, సంపత్ లవములు= శోభాలేశములు, జలరుహములకున్ = పద్మములకు, తత్ = ఆ నలునియొక్క, శయ = అఱచేతియొక్క, ఛాయ = కాంతి, దాయ యనగన్ = శత్రువు అనునట్లుగా, అతడు = ఆ నలుడు, నవ యౌవన = క్రొత్త జవ్వనము, ఆగమమున = ఆరంభమునందు, ఒప్పెన్ = ప్రకాశించెను.
తా.	చంద్రుడు నలుని ముఖమునకు దాస్యము చేయును, చిగుళ్ళు ఈ నలుని పాదముల శోభాలేశములగును, అఱచేతి కాంతి కమలములకు శత్రువగుననునట్లుగా నలుడు నవయౌవనారంభమున ప్రకాశించెను. (అతిశయోక్తి అలంకారము)

**61 వ. అయ్యవసరంబున**

తా.	ఆ సమయమున

**62 తే. వానిఁ గలలోనఁ గానని వనజముఖియు**
**వాని మార్పడఁ బేర్కొని మానవతియు**
**వానిఁగా నాత్మ భావించి వరునిఁ గవయ**
**నప్పళింపని సతియు, లేదయ్యె నెచట**

వానిన్ = ఆ నలుని, కలలోనన్, కానని, వనజముఖియు = కాంతయును, వానిన్, మార్పడన్ = మారుపేరుతో, పేర్కొని = పేర్కొననట్టి, మానవతియు = స్త్రీయును, ఆత్మన్ = మనసున, వరునిన్ = భర్తను, వానిగాన్ = నలునిగా, భావించి = ఊహించుకొని, అప్పళింపని = కౌగలించుకొనని, సతియు = సాధ్వియును, ఎచటన్ = ఎచ్చటను, లేదయ్యె
తా.	ఆ నలుని కలలో కానని కాంతయును, వానిని మారుపేరుతో పేర్కొనని స్త్రీయును, మనసున భర్తను నలునిగనే భావించి కూడని సాధ్వియును ఎక్కడను లేదాయెను.

**63 చ. దరహసితావధీరిత సుధాకరబింబము నేత్రనిర్జితాం**
**బురుహమునైన యా నిషధ భూవరు నుల్లసితాననంబుతో**
**సరి మఱి యొండు గల్గమికి సంశయమేటికిఁ దద్ద్వయీ విజి**
**త్వర కమనీయ వస్తు రహితంబగునట్టి చరాచరంబునన్**

దరహసిత = మందహాసముచేత, అవధీరిత = తిరస్కరింపబడినట్టి, సుధాకర బింబము = చంద్రబింబము కలదియు, నేత్ర = కన్నులచే, నిర్జిత = జయింపబడిన, అంబురుహమున్ = కమలములుకలట్టియు, ఐన = అయినట్టి, ఆ నిషధ భూవరు = ఆ నలమహారాజుయొక్క, ఉల్లసిత = వికాసవంతమైన, ఆననంబుతో = ముఖముతో, సరి = సమానమైనది, తత్ ద్వయీ = ఆ చంద్ర, కమలములను రెండింటిని, విజిత్వర = జయించు స్వభావముకల, కమనీయ = మనోహరమైన, వస్తు రహితంబు = వస్తువు లేకపోవుట, అగునట్టి = అయినట్టి, చరాచరంబునన్ = ప్రపంచములో, మఱి ఒండు కల్గమికి = వేరొకటి లేకపోవుటకు, సంశయము ఏటికిన్ = సందేహమెందులకు? (కావ్యలింగాలంకారము)
తా.	మందహాసముచేత చంద్రబింబము తిరస్కరింపబడినది. నేత్రములచే కమలములు జయింపబడినవి. కాగా ఆ నలమహారాజుయొక్క వికాసవంతమైన ముఖముతో సమానమైనది లేదు. ఆ చంద్ర, కమలములను జయించు స్వభావము కల మనోహరమైన వస్తువు ప్రపంచములో వేరొకటి లేదనుటకు సందేహమును అవసరము లేదు.

**64 క. తలవెంద్రుక లెగఁగట్టెడు**
**కొలఁదిని నా నృపకుమారకుఁడు కడిమిమెయిన్**
**నలుదెసల కరుల గండ**
**స్థల ఫలకములన్ లిఖించె జయశాసనముల్**

ఆ నృపకుమారకుడు = ఆ రాజకుమారుడైన నలుడు, తల వెంౘ్రుకలు, ఎగ గట్టెడు = పైకి కట్టుకొనే, కొలదిని = వయసుననే, (జుట్టు ముడివేసుకునే వయసు వచ్చునప్పటికే), కడిమి మెయిన్ = పరాక్రమముతో, నలు దెసల = నాలుగు దిక్కులయందున్న, కరుల = ఏనుగులయొక్క, గండస్థల ఫలకములన్ = చెక్కిళ్ళయందు, జయ శాసనముల్, లిఖించె = వ్రాసెను

తా. నలమహారాజు వెంట్రుకలు ముడికి అందే వయసులోనే శౌర్యముతో నాలుగు దిక్కులందలి ఏనుగుల చెక్కిళ్ళపై జయశాసనములను వ్రాసెను. (అతిశయోక్తి, అత్యుక్తి అలంకారములు)

**65 తే. తరుణ పాథోరు హాధోవిధానములను**
**ధరణినాథ కిరీటాగ్రధానములను**
**నూర్ధ్వమయ్యెడు నిది యంచునొకొ విధాత**
**తత్పదం బూర్ధ్వ రేఖాంచితంబు చేసె**

తరుణ = లేతవయిన, పాథోరుహ = పద్మములను, అధో విధానములను = క్రిందుచేయుటలోను, ధరణినాథ = రాజులయొక్క, కిరీట అగ్ర = కిరీటముల కొనలయందు, ధానములను = ఉంచుటలలోను, ఇది = ఈ నలుని పాదము, ఊర్ధ్వము అయ్యెడు అంచున్ ఒకొ = మీదుగా నుండుటగునని కాబోలు, విధాత = బ్రహ్మ, తత్ పదంబు = ఆ నలునియొక్క పాదము, ఊర్ధ్వరేఖ అంచితంబు = ఊర్ధ్వరేఖలచే నొప్పునట్టిదిగ, చేసె = చేసెను (ఉత్ప్రేక్షాలంకారము)

తా. నలమహారాజు పాదము లేత పద్మములను క్రిందుచేయుటలోను, రాజుల కిరీటాగ్రముల యందుంచుటలోను ఊర్ధ్వమగునను తలంపుతోనే బ్రహ్మ నలుని పాదములందు ఊర్ధ్వ రేఖలను వ్రాసెను.

**66 తే. అపుడు లీలా వినిర్జితానంగుఁడైన**
**యతనిఁ గనియును వినియుఁ జింతానురక్తి**
**స్వర్గ మర్త్య పాతాళ విష్టపములందు**
**విబుధ నర భోగి కాంతలు వివశలైరి**

అపుడు = ఆ యౌవనారంభకాలమందు, లీలా వినిర్జిత = హేలగా జయింపబడిన, అనంగుడు ఐన = మన్మథుడు అయినటువంటి, అతనిన్ = ఆ నలమహారాజును, కనియును, వినియున్, చింత అనురక్తి = అతనిని స్మరించుటయందలి అనురాగముచే, స్వర్గ, మర్త్య = భూ, పాతాళ, విష్టపములందు = లోకములలో, విబుధ = దేవత, నర = మానవ, భోగి = నాగ, కాంతలు = స్త్రీలు, వివశలు ఐరి = పరవశలైరి (యథాసంఖ్యాలంకారము)

తా. యౌవనారంభకాలమందు హేలగా జయింపబడిన మన్మథునివంటివాడైన నలమహారాజును చూచియు, వినియు, అతనినే స్మరించుటయందనురాగమువలన దేవ, మానవ, నాగ కాంతలు పరవశలైరి.

**67 ఉ. ఱెప్పలు వాల్ప కప్పుడమి ఱేని మనోహరమూర్తి నిచ్చలుం**
**దప్పక చూచి చూచి విబుధ ప్రమదల్ ప్రమదంబు లాత్మలం**
**జిప్పిలుచుండ నెద్ది పరిశీలన సేసిరి యట్టి యబ్బెసం**
**బిప్పుడు వారు చూపుదు రపేత నిమేషములైన చూపులన్**

విబుధ ప్రమదల్ = దేవకాంతలు, ఆత్మలన్ = మనసులందు, ప్రమదంబులు = సంతోషములు, చిప్పిలుచుండన్ = అతిశయించుచుండగా, ఆ పుడమిఱేని మనోహరమూర్తిన్ = ఆ నలమహారాజుయొక్క సుందర రూపమును, నిచ్చలున్ = నిత్యమును, తప్పక = తప్పకుండా, ఱెప్పలు వాల్పక = కనుఱెప్పలు మూయక, చూచి చూచి, ఎద్ది = దేనిని, పరిశీలన చేసిరి = తెలిసికొనిరో, అట్టి అబ్బెసంబు = అట్టి అభ్యాసమునే, ఇప్పుడు = ఈ సమయమందుకూడ, వారు = ఆ దేవకాంతలు, అపేత నిమేషములు ఐన = ఱెప్పపాటు లేనటువంటి, చూపులన్, చూపుదురు (ఉత్ప్రేక్షాలంకారము)

తా. దేవకాంతలు మనసులందు సంతోషము అతిశయించుచుండగా ఆ నలమహారాజు సుందరరూపమును నిత్యము కనుఱెప్పలు మూయక చూచి చూచి దేనిని అభ్యసించిరో ఆ అభ్యాసముచే వారు ఇప్పుడుకూడ ఱెప్పపాటు లేనివారే అయ్యిరి.

**68 తే. తద్గుణాకర్ణనంబునఁ దదనిరీక్ష**
**ణమున ధన్యత్వమును నధన్యతయుఁ బొంది**
**యభిమతానభిమతమైన యక్షియుగము**
**దాల్చుఁ జక్షుశ్శ్రవః స్త్రీ కదంబకంబు**

చక్షుస్ శ్రవస్ = కన్నులే చెవులుగా గల, స్త్రీ కదంబకంబు = నాగకాంతా సమూహము, తత్ గుణ ఆకర్ణనంబునన్ = అతని గుణములను వినుటచేత, తత్ = ఆ నలమహారాజును, అనిరీక్షణమున = చూడలేకపోవుటచేత, ధన్యతను, అధన్యతయున్, పొంది, అభిమత = ఇష్టము, అనభిమతము = అయిష్టము, ఐన = అయినటువంటి, అక్షియుగము = కన్నుల జంటను, తాల్చున్ = ధరించును. (అతిశయోక్తి అలంకారము)

తా. కన్నులే చెవులుగాగల నాగకాంతలు ఆ నలమహారాజు గుణములను విని చూడలేకపోవుటచే, వినుటద్వారా

ధన్యత్వమును, చూడలేకపోవుటద్వారా అధన్యత్వమును పొంది ఇష్టాయిష్టములైన నేత్రద్వయమును ధరించును.

**69 చం. పొలుపొనఁగూడి కన్నుగవ మోడ్చిన యప్పు డజస్రభావనా**
**బలమున నా నృపాలకునిఁ బాయక చూతురు మర్త్యభామ లా**
**యలికులనీలవేణులకు నమ్మెయి నావిభుఁ జూచువేళలం**
**గలుగవుపో నిమేష పరికల్పనఁ బుట్టెడు నంతరాయముల్**

మర్త్యభామలు = మానవకాంతలు, పొలుపు ఒనగూడి = నిలుకడను పొంది, కన్నుగవ = రెండు కన్నులను, మోడ్చిన అప్పుడు = మూసినప్పుడు కూడా, అజస్ర భావనా = ఎల్లప్పుడు ఆ నలునే తలంచుటయనెడి, బలమున = సామర్థ్యము చేత, ఆ నృపాలకునిన్ = ఆ నలుని, పాయక చూతురు = విడువక చూచెదరు, అలికుల = తుమ్మెదల సమూహమువలె, నీల = నల్లనైన, ఆ వేణులకు = ఆ జడలుకల స్త్రీలకు, ఆ మెయిన్ = ఆ విధముగా, ఆ విభున్ = ఆ నలమహారాజును, చూచువేళలన్ = చూచు సమయములందు, నిమేష పరికల్పనన్ పుట్టెడు = ఱెప్పలు మూయుటవల్ల కలిగెడు, అంతరాయముల్ = విఘ్నములు, కలుగవు పో = కలుగవుసుమా! (అతిశయోక్తి అలంకారము)

తా. మానవస్త్రీలు ఎల్లప్పుడూ నలునే స్మరించుచుండుటచే ఆ భావనాబలమున కన్నులు మూసినప్పుడు కూడా మనసునందు ఆ నలుని చూచుచునే యున్నారు. అందువలన కను ఱెప్పలు మూతబడుటవలన కలిగెడు విఘ్నములు వారికి కలుగనేరకున్నవి.

**70 సీ. కోరి లీలాగేహ కుడ్యభాగంబుల**
**వ్రాయుదు రమ్మహీశ్వరుని మూర్తి**
**వ్రాసి కన్యాత్వ గౌరవము వీసరవోవ**
**దర్శింతు రనురాగ తరళ దృష్టి**
**దర్శించి యతని కేఁ దగుదునో తగనొ యం**
**చించుకించుక సంశయింతు రాత్మ**
**సంశయించి కరాంబుజములఁ గ్రొమ్మించు ట**
**ద్దము లెత్తి చూతురు తమ్ముఁ దారు**
**తే. రాజకన్యలు జగతి నా క్రమమునందుఁ**
**గందు వారల నిట్టూర్పు గాడ్పు వేఁడి**
**ముకురములు, చారు మోహనమూర్తి యనఁగఁ**
**బరఁగు దమయంతి చేతి దర్పణము దక్క**

జగతిన్ = లోకమునందు, రాజకన్యలు, కోరి= ఆశతో, లీలాగేహ = క్రీడాగృహములయొక్క, కుడ్యభాగములన్ = గోడలయందు, ఆ మహి ఈశ్వరుని మూర్తి = ఆ నలమహారాజుయొక్క రూపమును, వ్రాయుదురు, వ్రాసి, కన్యాత్వ గౌరవము, వీసరవోవన్ = వెలితిపడునట్లుగా, అనురాగ తరళ దృష్టి = ప్రేమతో మెఱయుచున్న చూపుచే, దర్శింతురు = చూచెదరు, దర్శించి = చూచి, అతనికి = ఆ నలునకు, ఏన్ = నేను, తగుదున్ ఓ = తగుదునా, తగను ఒ = తగనొ, అంచు = అనుకొనుచు, ఇంచుక ఇంచుక = కొంచెము కొంచెము, ఆత్మన్ = మనసున, సంశయింతురు = సందేహించెదరు, సంశయించి = సందేహపడి, కరాంబుజములన్ = పద్మములవంటి చేతులతో, క్రొమ్మించు అద్దములు = క్రొత్త తళుకు అద్దములను, ఎత్తి = పైకి ఎత్తి, తమ్మున్ తారు = తమను తాము, చూతురు = చూచుకొందురు, ఆ క్రమమునందున్ = ఆ చూచుకొను వరుసలో, చారు = సుందరమైన, మోహన మూర్తి = మోహము కలిగించు రూపు, అనగన్ = అనునట్లుగా, పరగు = ఒప్పుచున్న, దమయంతి చేతి దర్పణము తక్క, ముకురములు = తక్కిన రాచకన్యల చేతులందలి అద్దములు, వారల = వారియొక్క, నిడు ఊర్పు = దీర్ఘ నిశ్వాసముల, గాడ్పు = గాలియొక్క, వేడిచే, కందున్ = మలినములగును

తా. లోకములోని రాచకన్యలందఱును ఆశతో వారి క్రీడాగృహములయొక్క గోడలయందు ఆ నలుని రూపమును వ్రాయుదురు. వ్రాసి తమ కన్యాత్వ గౌరవము వెలితిపడునట్లుగా ప్రీతిగా దర్శింతురు, దర్శించి ఆ నలునికి తాము తగుదుమో తగమో యని మనసులో కొంచెము కొంచెము సందేహపడుదురు. సందేహించి తళుకు అద్దములను పైకెత్తి తమను తాము చూచుకొందురు. ఆ క్రమములో అందమైనదని అందరు ఒప్పుకున్న దమయంతి చేతిలోని అద్దము తక్క మిగిలిన రాచకన్యల చేతులలోని అద్దములు వారి గాఢ నిశ్వాసముచే కందిపోయినవి.

**71 వ. ఇవ్విధంబున ననన్య రూప లావణ్య రేఖా విలాస భాసమానయగు భీమనందన యా నరేంద్ర బృందారకునియందు డెందంబు నిలుపుటయును**

తా. ఈ విధంబున ఇతరులకులేని సౌందర్యముయొక్కయు, దేహకాంతి తీరుయొక్కయు లీలలచే ప్రకాశించుచున్నట్టి భీమనందన ఆ రాజ శ్రేష్ఠుడైన నలమహారాజునందు మనసు నిలుపుటయును

**72 తే. అప్పుడ నలావరుద్ధత నారఁ గూరి**
**బాణపురమును బోని యా భైమి మనముఁ**
**బుష్పబాణాసనుఁడు భోగ భోజియైన**
**వరవయో విశేషంబు వార్వమునఁ దఱిసె**

ఈ పద్యంలో బాణాపురం పరంగాను, దమయంతి పరంగాను అర్థద్వయము.

పుష్ప బాణ ఆసనుడు = మన్మథుడు, అప్పుడ = దమయంతి మనసున నలుడు నిలిచినప్పుడే, నల = నలమహారాజుచే, అవరుద్ధతన్ = ఆక్రమింపబడియుండుటను, ఆరన్ గూరి = మిక్కిలి పొంది, బాణాపురమును బోని = శోణితపురమువలె నున్న (బాణాసురుని పురమునకు అగ్నిప్రాకారమున్నది), భైమి మనమున్ = దమయంతి మనస్సును, భోగ భోజియైన = భోగములననుభవించునట్టి, వర వయో విశేషంబు = శ్రేష్ఠమైన యౌవన విశేషమను, వార్వమునన్ = గుఱ్ఱముచే, తఱిసెన్ = సమీపించెను. (శ్లేష ఉపమ అతిశయోక్తి అలంకారములు)

పుష్పబాణాసనుడు = ప్రద్యుమ్నుడు, అప్పుడ = అనిరుద్ధుని బాణుడు బంధించినప్పుడు, అనల అవరుద్ధతన్ = అగ్నిచే నిరోధింపబడియుండుటను, ఆరన్ గూరి = మిక్కిలియు నొంది, భోగ భోజియైన = పాములను తినునట్టిదైన, వర వయః విశేషంబు = శ్రేష్ఠ పక్షి విశేషమైన గరుత్మంతుడను గుఱ్ఱముచే, తఱిసెన్ = సమీపించెను.

**(బాణాసురుని కుమార్తె ఉషాకన్యక కలలో అనిరుద్ధుని చూసి వలచి తన చెలికత్తెయైన చిత్రలేఖచే రహస్యముగ ఆతనిని తెప్పించెను. ఈ విషయము తెలిసి బాణుడు ఆతనిని బంధించెను. ఆ విషయము నారదునివలన విని శ్రీకృష్ణుడు బలరామ, ప్రద్యుమ్నులతో గరుత్మంతునిపై వెళ్ళి బాణుని గర్వము నణచి ఉషా,అనిరుద్ధులను ద్వారకకు తెచ్చెను)**

తా. ప్రద్యుమ్నుడు అగ్నిచే ఆవరింపబడియున్న బాణాసురుని నగరమును పాములను తినునట్టి గరుత్మంతునిపై నెక్కి చేరునట్లు మన్మథుడు నలునిరూపముచే ఆవరింపబడియున్న దమయంతి మనస్సును యౌవనమనెడి గుఱ్ఱముపై నెక్కి ప్రవేశించెను.

## దమయంతి నలునియం దనురక్త యగుట

**73 వ. దమయంతియు శ్రవణ ప్రీతి వాసనా వశంబునం బ్రతిదిన ప్రవర్ధమానంబగు మనోనురాగంబు నిరూఢంబై యుండ**

తా. వినుటవలన కలిగిన ప్రేమయొక్క సంబంధమున వృద్ధిపొందుచున్న మనసునందలి ప్రేమ స్థిరమైనదైయుండగా

**(మన్మథావస్థలు పది : చూచుట, చింతించుట, తలచుట, జాగరణము, కృశించుట, విషయనివృత్తి, లజ్జాత్యాగము, ఉన్మాదము, మూర్ఛ, మృతి.)**

**74 శా. జనకుం గొల్వఁగ వచ్చినప్పుడు తదాస్థానంబులోఁ బాఠకుల్**
**వినుతప్రౌఢి వసుంధరాధిపతులన్ వేర్వేఱ కీర్తించుచో**
**వనితారత్నము వీరసేను తనయున్ వర్ణింపఁగా నున్నత**
**స్తన భారంబు కెలంకులన్నినుచుఁ జంచల్లీలరోమాంచమున్**

వనితారత్నము = స్త్రీరత్నమైన దమయంతి, జనకున్ = తండ్రియగు భీమరాజును, కొల్వగన్ = సేవించుటకు, వచ్చినప్పుడు, తత్ ఆస్థానంబులోన్ = ఆతని కొలువునందు, పాఠకుల్ = బట్టులు, వినుత ప్రౌఢి = పొగడదగిన నేర్పుతో, వసుంధరాధిపతులన్ = రాజులను, వేరు వేఱ = ఒక్కొక్కరినిగా, కీర్తించుచో = స్తుతించుచుండగా, వీరసేను తనయున్ = వీరసేనుని కుమారుడైన నలుని, వర్ణింపగాన్ = స్తుతించగా, చంచత్ లీలన్ = ఒప్పుచున్న విలాసముచే, రోమాంచమున్ = పులకాంకురములను, ఉన్నత = ఎత్తైన, స్తన భారంబు, కెలంకులన్ = పార్శ్వములయందు, నినుచున్ = నిండించును.

**(సాత్వికభావములు ఎనిమిది : స్తంభము,ప్రళయము,రోమాంచము,స్వేదము,వైవర్ణ్యము,వేపథము,అశ్రువు,వైస్వర్యము)**

తా. స్త్రీరత్నమైన దమయంతి తండ్రిని సేవించుటకు వచ్చినప్పుడు ఆతని కొలువునందు బట్టులు రాజులను ఒక్కొక్కరినిగా స్తుతించునప్పుడు నలుని స్తుతించుచుండగా అతని గుణములను విని ఆమె మోహముచెంది ఉన్నతమైన స్తనముల పార్శ్వముల యందు పులకాంకురములను నింపుచుండును.

**75 తే. మహిమ హిమవేళలందు నమ్మానవతికి**
**మాసరము లయ్యెఁ దలఁపంగ వాసరములు**
**పొడవు గలిగి తపర్తు సంపూర్తియందు**
**నంచితాయామవతులయ్యె యామవతులు**

తలపంగన్ = ఆలోచింపగా, ఆ మానవతికిన్ = ఆ దమయంతికి, హిమవేళల అందున్ = మంచుకురియు కాలము నందును (హేమంత ఋతువు), వాసరములు = పగళ్ళు, మహిమన్ = అధికముగా, మాసరములు అయ్యెన్ = నెలలు

అయ్యెను, తప ఋతు సంపూర్తియందున్ = గ్రీష్మకాలమందును, యామవతులు = రాత్రులు, అంచిత = అతిశయించిన, ఆయామవతులు అయ్యెన్ = నిడివికలవి అయ్యెను.

తా. మన్మథ పీడితయగు ఆ దమయంతికి హేమంత ఋతువునందలి పగళ్ళు అధికమై నెలలయ్యెను. గ్రీష్మకాల మందలి రాత్రులు అతిశయించి నిడివికలవయ్యెను.

**76 సీ. సఖులుఁ దాఁ బుష్పాస్త్రు జతపెట్టు పదమున**
**నభిషేక మొనరించు నవనినాథు**
**నల నామధేయమైన తృణంబు వినబడ్డ**
**నధిపతి పేర్విన్నయట్ల యలరు**
**నిషధదేశపు విప్ర నికరంబుఁ బూజించి**
**యలవోకఁ బ్రియుసుద్ది యడుగఁ దలఁచు**
**నభ్యాసవశమునఁ బ్రాణేశ్వరుని మీఁది**
**యించు గీతములు వాయించు వీణ**
**తే. నేర్పుగల చిత్రకరులచే నిలయభిత్తి**
**భువన మోహనాకారత బొలుపు మిగులు**
**మగని మగువను వ్రాయించి మదిఁ దలంచు**
**నిషధ రాజును దన్నుఁగా నీరజాక్షి**

సఖులు = చెలికత్తెలు, తాన్ = ఆ దమయంతియు, పుష్పాస్త్రు జతపెట్టు పదమునన్ = మన్మథునితో సరిపెట్టవలసిన స్థలమునందు, అవనినాథున్ = నలమహారాజును, అభిషేకము ఒనరించున్ = అభిషేకము చేయును, నల నామధేయము ఐన = నలమను పేరు గలదైన, తృణంబు = గడ్డిపోచ, వినబడ్డన్ = వినబడినను, అధిపతి పేరు = ఆ నలుని పేరు, విన్నట్లు = వినినయట్లు, అలరున్ = సంతోషించును, నిషధ దేశపు విప్ర నికరంబున్ = నిషధదేశమునుండి వచ్చిన బ్రాహ్మణ సమూహమును, పూజించి = పూజచేసి, అలవోకన్ = వేడుక నెపమున, ప్రియు సుద్ది = నలుని చరిత్రమును, అడుగన్ తలచున్ = అడుగుటకు ఇష్టపడును, అభ్యాసవశమునన్ = అభ్యాసముకలదగుటచే, వీణన్ = వీణయందు, ప్రాణేశ్వరుని మీది, ఇంచు గీతములు = ఇష్టములైన పాటలు, వాయించున్, నిలయ భిత్తిన్ = తన నివాస భవన గోడలయందు, నేర్పుగల చిత్రకరులచే, భువన మోహన ఆకారతన్ = లోకములకు మోహముకలిగించు ఆకారముతో, పొలుపు మిగులు = అందము అతిశయించు, మగని మగువను = స్త్రీ పురుషులను, వ్రాయించి, నీరజాక్షి = కమలముల వంటి కన్నులుకల దమయంతి, నిషధరాజును, తన్నుగాన్, మదిన్ = మనసునందు, తలంచున్ = తలపోయును.

తా. దమయంతి నలునిపై ప్రేమతో చెలికత్తెలతో కూడి మన్మథుని స్థానమున నలుని అభిషేకించును. నలమను గడ్డిపరక పేరువిన్నను ఆ నలుని పేరు విన్నట్లు సంతోషించును. నిషధ దేశమునుండి వచ్చిన బ్రాహ్మణ సమూహమును పూజించి వారిని వేడుక నెపమున నలుని చరిత్రమునుగూర్చి అడుగదలచును. అభ్యాసము కలదగుటచే వీణపై నలునిమీది ఇష్టములైన పాటలను వాయించును. భవనపు గోడలపై చిత్రకారులచే స్త్రీ పురుషుల చిత్రములను వ్రాయించి నిషధరాజుగాను, తననుగాను తన మనసునందు తలపోయుచుండును.

**77 ఉ. పువ్విలుకానితోడ సరిపోలెదు చక్కనివాఁడు భూమిలో**
**నెవ్వఁడు చెప్పుఁడా యనుచు నిష్టవయస్యలఁ గూర్చి యాత్మలో**
**నువ్విళులూరుచుం బలుకు నొప్పుల కుప్ప నలుండు గాక యొం**
**డెవ్వఁడనంగ మెచ్చుఁ దరళేక్షణ నెయ్యము వియ్య మెట్టిదో**

ఒప్పులకుప్ప = అందాలరాసియైన దమయంతి, పువ్విలుకానితోడన్ = మన్మథునితో, సరిపోలెదు చక్కనివాడు, భూమిలోన్ ఎవ్వడు చెప్పుడా యనుచు, ఇష్టవయస్యల గూర్చి = తన చెలికత్తెల నుద్దేశించి, ఆత్మలోన్ = మనసులో, ఉవ్విళులూరుచున్ = ఉత్సాహపడుచు, పలుకున్, నలుండు కాక, ఒండు = మరియొకడు, ఎవ్వడు, అనంగన్ = అనగా, మెచ్చున్, తరళేక్షణ = చంచలమైన కన్నులుకల దమయంతియొక్క, నెయ్యము వియ్యము = ప్రేమానుబంధము, ఎట్టిదో = ఎంత గట్టిదోకదా!

తా. అందాలరాసి దమయంతి తన చెలికత్తెలతో మన్మథునితో సరిపోల్చగల చక్కనివాడు భూమండలంలో ఎవ్వడు చెప్పండి అంటూ మనసులో ఉత్సాహపడుతూ పలుకును. చెలికత్తెలు నలుడు కాక మరెవ్వడు అనగా మెచ్చును. మరి ఆ దమయంతి ప్రేమానుబంధము ఎంత గట్టిదోకదా!

**78 వ. మఱియు మనోరథ పరంపరా సంవరణ ప్రసూన దామంబున నమ్మహీపతిం పతిగా వరియించియుం ద్రిభాగశేషంబులగు విభావరీ సమయంబుల నిమీలితంబైన నేత్రయుగ్మంబును బాహ్యేంద్రియ మౌన ముద్రాభిముద్రింతంబైన యంతఃకరణంబును మొఱంగి నిద్రచే సమానీతుండైన యా రాజ మనోజాతుచే నెంతయుం దడవు మంతనంబుండియు;**

**నిరంతర స్మరణ సరణి ధారావాహికావగాహంబున నెడనెడం బొడచూపు నప్పుడమితేనిం గనుంగొని, లజ్జా సాధ్వసంబులు మనంబులో ముప్పిరిగొనం బ్రమోదించియు నవ్వైదర్భి నిర్భర మదనశర శలాకాశంకు సంకలిత వేదనా దూయమాన మానసయై విజృంభిత మనోభవ భుజావష్టంభంబులగు హిమారంభంబులును, గాలాగరు కళంకిత కామినీ కంఠ మూలంబులగు శిశిర కాలంబులును, గలకంఠ కామినీ కంఠ కోమల కుహూకార కోలాహల కరంబిత కకుబంతంబులగు వసంతంబులును, సాయం సమయ సంపుల్ల మల్లికామోద మేదుర సమీరణౌఘంబులగు నిదాఘంబులును, విరహిజన హృదయ భయంకర స్తనిత సందోహంబులగు జలధరానేహంబులును, సకలజన మనో వికాసమయంబులగు శారద సమయంబులును గడపుచుండె. నవ్వేళ జలధివేలావలయిత వసుంధరా భువనమండలాఖండలుండగు నలుండును విమల నిజకీర్తి మౌక్తిక మాలికా సంతానంబులకు నంతర్సూనా గుణంబులుంబోలెఁ బొలుచు నక్కాంతాలలామంబు గుణంబులు జనపరంపరలవలన వినియె, నా సమయంబున**

తా. ఇంతేకాక కోర్కెల పరంపరయనెడి స్వయంవర నిమిత్తమైన పూవులదండచే ఆ నలమహారాజును భర్తగా స్వీకరించియు, మూడవ భాగము మిగిలియున్నవగు రాత్రులందు మూయబడిన కన్నులజంటను బాహ్యేంద్రియములయొక్క నిర్వ్యాపారత యనెడి ప్రతిబద్ధమైన మనస్సును వంచించి నిద్రలో తీసుకొనిరాబడిన ఆ రాజ మన్మథునితో చాలసేపు రహస్యముగా వర్తించియు, నిరంతర స్మరణచే ఎడతెగక ప్రవహించు ప్రవాహమునందు మునుగుటచే మాటిమాటికి కనబడుచున్న, ఆ నలమహారాజును చూచి సిగ్గును, భయమును మనసులో పెనగొనగా ఆనందించియు ఆ దమయంతి భరింపరాని మన్మథునియొక్క అంపకోలలనెడి మేకులచేత కూడియుండుటచే బాధచే నొచ్చుచున్న మనస్సుకలదై అతిశయించిన మన్మథునియొక్క బాహుగర్వము కలవియైన మంచు యొక్క ప్రారంభ స్థితిని (హేమంత ఋతువు), కృష్ణాగరుచే కలుషములైన స్త్రీలయొక్క కంఠప్రదేశము కలవియగు చలికాలములును, కోయిల గొంతువంటి గొంతులుకల స్త్రీల మృదువైన కుహూయనెడి కలకలధ్వనిచేత మిశ్రీభూతమైన దిగంతములు కలవియగు వసంతంబులును, సాయంకాల సమయమందు వికసించిన మల్లికా పరిమళముచే దట్టములైన వాయువుల సమూహములు కలవియగు గ్రీష్మ కాలములును, విరహిజన హృదయ భయంకర గర్జనలయొక్క సమూహములు కలవియగు వర్ష కాలములును, సకలజన మనోవికాస అవధులగు శరత్కాలములును జరపుచుండెను, అట్టి సమయమందు సముద్రముయొక్క చెలియలికట్టచేత చుట్టబడిన భూలోకమంతటికిని ప్రభువైన నలుడును నిర్మలమైన తనకీర్తియనెడి ముత్యముల వరుసలయొక్క సమూహములకు లోపలనుండెడి గుంభన సూత్రములవలె ఒప్పునట్టి ఆ దమయంతియొక్క సద్గుణములను జనసమూహమువలన విని, ఆ సమయమున

**79 శా. ఆ వామాక్షి మనోహరాకృతి యమోఘాస్త్రంబుగా భూవరున్**
**లావణ్యాధికు నచ్చలంబుమెయి గెల్వంబూని యిందిందిర**
**జ్యావల్లీ కిణకర్కశంబయిన హస్తం బుద్ధతిం జాఁపి వే**
**పూవుఁదూపులజోదు పుచ్చుకొనియెం బుండ్రేక్షుకోదండమున్**

ఆ వామాక్షి = సుందరమైన కన్నులుకల దమయంతియొక్క, మనోహర ఆకృతి = సొగసైన రూపము, అమోఘ = వ్యర్థముకాని, అస్త్రంబు కాన్ = అస్త్రముకాగా, లావణ్యాధికున్ = చక్కదనముచే గొప్పవాడగు, భూవరున్ = నలమహారాజును, అచ్చలంబుమెయి = అసూయచే, గెల్వన్ పూని = గెలవాలనుకొని, ఇందిందిర = తుమ్మెదలనెడి, జ్యావల్లీ = తీగెవంటి అల్లెత్రాటివలన కలిగిన, కిణ = కాయలచే, కర్కశంబయిన = కఠినమయినట్టి, హస్తంబు = చేతిని, ఉద్ధతిన్ = అతిశయముచే, చాపి = చాచి, వే = శీఘ్రముగా, పూవుందూపులజోదు = పూవులు బాణములుగాగల వీరుడు (మన్మథుడు), పుండ్రేక్షు కోదండమున్ = నలుపు ఎఱుపు చెఱకు వింటిని, పుచ్చుకొనియెన్ = చేపట్టెను. (ఉత్ప్రేక్షాలంకారము)

తా. మన్మథుడు తనకంటె సుందరుడైన నలమహారాజుపై అసూయతో జయింప నిశ్చయించి సొగసైన దమయంతి తనకు బాణముగా లభించుటచే దానిని ఎక్కుపెట్టుటకు తుమ్మెదలనెడి వింటినారియొక్క రాపిడి కాయలచే కఠినమైనట్టి చేతిని అతిశయముతో చాపి చెఱకువింటిని చేపట్టెను.

**80 క. శ్రవణావతంస మయ్యెను**
**ధవళాయత నేత్ర గుణము ధరణీపతికిన్**
**శ్రవణావతంస మయ్యెను**
**బువువింటి గుణంబు నపుడు పుష్పాస్త్రునికిన్**

ధవళ ఆయత నేత్ర = తెల్లని విశాలములైన కన్నులుకల దమయంతియొక్క, గుణము = సద్గుణము, ధరణీపతికిన్ = నలమహారాజునకు, శ్రవణ అవతంసము = చెవులకు భూషణము, అయ్యెను, అపుడు = ఆ సమయమున, పుష్పాస్త్రునికిన్ = మన్మథునికి, పువు వింటి గుణంబు = పూలబాణముయొక్క అల్లెత్రాడుకూడ, శ్రవణ అవతంసము = చెవులకు అలంకారము, అయ్యెను. (కావ్యలింగము అలంకారము)

తా. దమయంతి సుగుణములు నలుని చెవిని పడగానే మన్మథుడు కూడ తన పూవింటి అల్లెత్రాటిని కర్ణాంతము వరకు లాగి యుంచెను.

**81 ఉ. ఆ వసుధాధినాథుని మహాధృతిశాలి జయించు తెంపునన్**
**భావజుఁ డప్పు డున్మథన బాణము తియ్యని వింటఁ గూర్చుచోఁ**
**గేవల సాహసంబు మదిఁ గీల్కొనఁ జేసియు ముంచెఁ దాఁ ద్రిలో**
**కీ విజయార్జితంబులగు కీర్తిభరంబులు సంశయాంబుధిన్**

భావజుడు = మన్మథుడు, మహత్ = గొప్ప, ధృతి = ధైర్యముచే, శాలి = ఒప్పునట్టి, ఆ వసుధాధినాథున్ = ఆ నల మహారాజును, జయించు తెంపునన్ = జయించాలనే సాహసంతో, ఉన్మథన = లోకులందరను బాధింపజాలిన, బాణమును, తియ్యని వింటన్ = చెఱకువింటియందు, కూర్చుచోన్ = ఎక్కుపెట్టునపుడు, కేవల సాహసంబున్ = సాహసమును మాత్రమే, మదిన్ = మనసునందు, కీల్కొనన్ చేసియు = దృఢముగా చేసికొని, త్రిలోకీ = మూడులోకముల యొక్క, విజయ = గెలుపుచేత, ఆర్జితంబులగు = సంపాదింపబడిన, కీర్తిభరంబులు = కీర్తి రాసులను, సంశయ అంబుధిన్ = సందేహమనెడి సముద్రములో, ముంచెన్ = మునుగునట్లు చేసెను. (అతిశయోక్తి అలంకారము)

తా. మన్మథుడు ధైర్యశాలియయిన నలమహారాజును జయించాలని మూడు లోకములను జయింపజాలిన బాణమును చెఱకువింటియందు సంధింపగా ఎంతో సాహసమును ప్రకటించియు లోకములన్నిటిని జయించి సంపాదించిన కీర్తి రాసులను సంశయమనెడి సముద్రమునందు ముంచివేసెను.

**82 తే. అతనుఁడఁట జోదు పూమొగ్గయఁట శరంబు**
**చించినదియఁట తద్ధైర్య కంచుకంబు**
**నలుని దమయంతితోఁ గూర్పఁ దలఁచియున్న**
**ధాత మదియెత్తికోల్ తుదిఁ దాఁకకున్నె**

జోదు = వీరుడు, అతనుడు అట = దేహము లేనివాడట, శరంబు = బాణము, పూమొగ్గ అట, తత్ = ఆ నలునియొక్క, ధైర్య కంచుకంబున్ = ధైర్యమనెడి కవచమును, చించినది అట, నలుని, దమయంతితోన్, కూర్ప తలచియున్న, ధాత = బ్రహ్మయొక్క, మది యెత్తికోల్ = మనసునందలి అభిప్రాయము, తుదిన్ తాకకున్నె = నెరవేఱకుండునా?

తా. మన్మథుడు శరీరము లేనివాడైనను, బాణము పూమొగ్గేయయినను ఆ నలుని ధైర్య కవచమును చించివేసినదట. నలుని దమయంతితో కూర్ప తలచిన బ్రహ్మ మనోభిప్రాయము నెరవేఱకుండా ఉంటుందా? (విరోధాభాసాలంకారము)

**83 ఉ. ఎయ్యది కారణంబుగ మహీపతి యంచిత ధైర్య కంచుకం**
**బయ్యతనుండు సించె నలరమ్ములచే నది కారణంబుగాఁ**
**దొయ్యలి రాజనందనునితోడనఁ గూర్పఁ దలంచుచున్న యా**
**దయ్యము నెత్తికోలు తుదిఁ దాఁకుటఁ గానఁగ నయ్యె నయ్యెడన్**

ఆ అతనుండు = ఆ మన్మథుడు, అలరు అమ్ములచేన్ = పూలబాణములచే, మహీపతి = నలునియొక్క, అంచిత = ఒప్పుచున్నట్టి, ధైర్య కంచుకంబు = ధైర్యమనెడి కవచమును, ఎయ్యది కారణంబుగ = ఏకారణమునుబట్టి, చించెన్ = చీల్చెనో, అది కారణంబుగాన్ = ఆ కారణముచేతనే, తొయ్యలిన్ = దమయంతిని, రాజనందనునితోడనన్ = రాజకుమారుడైన ఆ నలునితో, కూర్పన్ = కలుపుటకు, తలంచుచున్న = ఆలోచించుచున్న, ఆ దయ్యమునెత్తికోలు = ఆ బ్రహ్మయొక్క ప్రయత్నము, తుదిన్ తాకుటన్ = నెఱవేఱుట, ఆ ఎడన్ = ఆ సమయమున, కానగన్ అయ్యెన్ = కనబడెను. (విరోధాభాసాలంకారము)

తా. ఏ కారణముచే మన్మథుడు పూవుటమ్ములచే నలుని ధైర్యకవచమును చీల్చెనో ఆ కారణముచేతనే దమయంతిని ఆ రాజకుమారునితో కలుపుటకు తలంచు ఆ బ్రహ్మ ప్రయత్నము నెఱవేఱు సమయము కనబడసాగెను.

**84 ఉ. ఏసల నవ్విరించి నొక యేటునఁ దామరపాన్పుపైఁ బడం**
**ద్రోసిన జోదు మన్మథుడు దుర్వహ నూత్న వియోగ వేదనా**
**యాసితమైన రాజు హృదయాబ్జముఁ గాఁడఁగనేసె నెంతయున్**
**గాసిలి తేఁటి ఱెక్క గతిగట్టిన పుష్ప శిలీముఖంబులన్**

మన్మథుడు, ఏసలన్ = విలాసముగా, ఆ విరించిన్ = ఆ బ్రహ్మను, ఒక ఏటున = ఒక్క దెబ్బచే, తామర పాన్పుపైన్, పడన్ త్రోసిన, జోదు = వీరుడు, దుర్వహ = భరిపంశక్యముకాని, నూత్న = క్రొత్తదైన, వియోగ = విరహమువల్లనైన, వేదనా = బాధచే, ఆయాసితము ఐన = అలసటచెందినదైన, రాజు హృదయాబ్జము = నలునియొక్క హృదయపద్మమును, ఎంతయున్ = మిక్కిలి, గాసిలి = ఆయాసపడి, తేటి ఱెక్క గతి = తుమ్మెద ఱెక్కయొక్క ఈకను, కట్టిన, పుష్పశిలీముఖంబునన్ = పూబాణములచే, కాడగన్ = నాటునట్లుగా, ఏసెన్ = కొట్టెను (ఉత్ప్రేక్షాలంకారము, కావ్యార్థాపత్తి అలంకారము)

తా. సృష్టికర్తయగు బ్రహ్మనే ఒక్క దెబ్బచే తామరపాన్పునందు పడునట్లు కొట్టిన మన్మథుడు దుర్వహమైన విరహబాధచే కలత చెందియున్న నలమహారాజు హృదయపద్మమును తన పూల బాణములచే గాఢముగా నాటునట్లు కొట్టెను.

**85 తే. లలన లజ్జాసరిద్దుర్గ లంఘనమున**
**రాజు హృదయంబుఁ జొచ్చిన క్రమముఁ జూడఁ**
**దరుణిమారంభ పరికల్పితంబులయిన**
**వలుఁద కుచకుంభముల ప్రభావమునఁ జూవె**

లలన = స్త్రీ (దమయంతి), లజ్జాసరిత్ దుర్గ = సిగ్గనెడి జలదుర్గమును, లంఘనమున = దాటుటచే, రాజు హృదయంబున్ = నలుని మనస్సును, చొచ్చిన క్రమమున్ = ప్రవేశించిన విధమును, చూడన్ = పరిశీలింపగా, తరుణిమ ఆరంభ = యౌవన ప్రాదుర్భావముచేత, పరికల్పితంబులయిన = కల్పింపబడినవైన, వలుద = స్థూలములైన, కుచకుంభములన్ = కడవలవంటి స్తనములయొక్క ప్రభావమునన్ చూవె = సామర్థ్యముచేతనే సుమా! (ఉత్ప్రేక్షాలంకారము)

తా. నలమహారాజు హృదయము సిగ్గనెడి జలదుర్గముచే ఆవరింపబడియున్నను దమయంతి ఆ జలదుర్గమును దాటి నలుని హృదయములో ప్రవేశించినది. ఆమె ఆ జలదుర్గము నెట్లు దాటినదన ఆమె యౌవన ప్రాదుర్భావమున కల్పింపబడిన ఉన్నతములైన కుచకుంభముల ప్రభావముచేతనేసుమా!

**86 సీ. జాగరోద్భూత దృగాగ్రంబు మాణిక్య**
**కర్ణకుండల దీప్తిఁ గప్పిపుచ్చు**
**రాజకార్య పరంపరాఖేద మిషమున**
**నిట్టూర్పు గాడ్పుల నిహ్నవించు**
**ఘనసార బహుళ చందన విలేపనమున**
**నాపాండుభావంబు నపలపించు**
**దోరంతర న్యస్త తారహారంబుల**
**నంతఃపరీతాప మపనయించు**
**తే. మాననీయ శశాంక కోమలములైన**
**యామినీ సమయములుఁ బర్యంకములును**
**సాక్షులుగ నొందు వలవంత జనవిభుండు**
**కన్నె కూర్మి ప్రకాశంబు గాకయుండ**

జనవిభుండు = రాజు (నలుడు), కన్నె కూర్మి = దమయంతిపై ప్రేమ, ప్రకాశంబు కాక ఉండన్ = బయటకు తెలియకుండగ, జాగర = మేలుకొనుటవలన, ఉద్భూత = పుట్టిన, దృక్ రాగంబున్ = కంటి ఎఱుపును, మాణిక్య కర్ణ కుండల = రత్న మకరకుండలములయొక్క, దీప్తిన్ = కాంతిచేత, కప్పిపుచ్చున్ = కప్పివేయును, రాజ కార్య, పరంపరా = సమూహమునందలి, ఖేద మిషమునన్ = శ్రమయనెడి మిషచేత, నిట్టూర్పు గాడ్పులన్ = దీర్ఘ నిశ్వాస వాయువులను, నిహ్నవించు = దాచివేయును, ఘనసార = పచ్చకప్పురముచే, బహుళ = నిండియున్న, చందన విలేపనమున = మంచిగంధపు పూతచేత, ఆ పాండుభావంబున్ = విరహమువల్లనైన తెల్లదనమును, అపలపించు = మఱుగుపరచును, దోర్ అంతర = బాహువుల మధ్యభాగమందు, న్యస్త = ఉంచబడిన, తారహారంబులన్ = ముత్యాల హారములచే, అంతఃపరీతాపము = మనసులోని తాపమును, అపనయించు = కప్పిపుచ్చును, మాననీయ = గౌరవింపదగిన, శశాంక కోమలములు ఐన = చంద్రునిచే మనోహరములైన, యామినీ సమయములున్ = రాత్రివేళలును, పర్యంకములును = శయ్యలును, సాక్షులుగ, వలవంతన్ = మదనసంతాపమును, ఒందున్ = పొందును. (అపహ్నవాలంకారము)

తా. నలమహారాజు దమయంతిపై తనకుగల ప్రేమ బయటకు కనబడకుండగ జాగరమువలన కనులు ఎఱ్ఱపడగా రత్నమకరకుండలముల కాంతిచే దానిని కప్పివేయును. దీర్ఘ నిశ్వాసములను రాచకార్య నిర్వహణ ఖేదమనెడి మిషతో కప్పివేయును. విరహకారణమున తెల్లబడిన దేహమును పచ్చకప్పురము మంచిగంధముచేత కప్పివేయును. మనసులోని తాపమును ముత్యాలహారములచే కప్పివేయును. వెన్నెలచే మనోహరములైన రాత్రులను పర్యంకములే సాక్షులుగ మదనసంతాపమును పొందుచుండును.

**87 వ. ఇవ్విధంబున నసంవరంబైన శంబరవైరి విక్రమంబు క్రమక్రమంబునం బరిస్ఫుటంబగుచుండ వియోగ వేదనా చిహ్నంబులు నిహ్నవింపం గొలందిగాక చీకాకుపడి యాకార రేఖా వినిర్భర్త్సిత మత్స్యలాంఛనుండగు నా రాజకుమారుం డొక్కనాఁ డారామ వీక్షావిహారంబునం గాలక్షేపంబు సేయువాఁడై ప్రభంజనాధ్యేయ జవంబును జంచల ఖురాంచల క్షోదిత క్షోణీమండలంబును నిగాళ దేవమణి దీప్తిచ్ఛటాపటల శంకావహ కృకాటికా ధవళ కేసర కేశ రశ్మి సంచయంబును వల్గు వల్గానుషక్త వదనతా విడంబిత వక్త్రస్థ భుజగ వైనతేయంబును జలాచల ప్రోథతానుమీయమాన నిజవేగదర్ప ప్రశంసా ప్రవచనోపన్యాసంబునునై సింధుజంబును శీత మహస్సహోదరంబును నగుట రెండవ యుచ్చైశ్రవంబునుం బోలిన యౌపవాహ్యంబు నారోహణంబు సేసి**

తా.	ఈ విధముగా దాపరికము లేని మన్మథుని పరాక్రమము క్రమక్రమముగ స్పష్ట పడుచుండగా విరహమువల్ల కలిగిన బాధా చిహ్నములు దాచుటకు శక్యము కాక చీకాకుపడి ఆకృతిచేత అదలించబడిన మన్మథుడేయగు ఆ నలుడు ఒక్కనాడు ఉద్యానవన సంచారముచేతను కాలక్షేపము చేయువాడై (నలుడు ఒకచోట ఉండలేకపోవుచుండుటచే దీనివలన చాపలము అను లక్షణము కనబడుచున్నది), గాలిచే నేర్వదగిన వేగముకలిగిన కదలుచున్న డెక్కలయొక్క అంచులచే పిండిగా చేయబడుచున్న భూ ప్రదేశము కలదియు కంఠమునందు సుడి కాంతులయొక్క వరుసల మొత్తములని శంకను కలిగించుచున్న మెడమీది గుంటయొక్క తెల్లని జూలు వెంట్రుకలయొక్క కాంతియొక్క సమూహము కలదియు, సుందరమైన కళ్ళెము తగిలించు పగ్గములతో కూడుకొనియున్న నోరు కలదగుటచే అనుకరింపబడుచున్న నోటియందున్న పాముతో గరుత్మంతుడుకలదియు, చలించుచున్న ముక్కు కలదగుటచే ఊహింపబడుచున్న తన వేగముయొక్క అతిశయమునుగూర్చి ప్రశంసా వాక్యములు కలదియునై, సింధుదేశమున పుట్టినదియును, చంద్రునితో సమానమైనదియును అగుటచే, రెండవ ఉచ్చైశ్రవంబునుం బోలిన గుఱ్ఱమును ఎక్కి

**88 తే. ప్రమద నిష్పందతర నేత్ర పద్మలగుచుఁ**
**పౌరజనులు విలోకింపఁ బ్రకటలీల**
**సముచితానల్ప పరివార సహితుఁడగుచు**
**నవనినాథసుతుండు వాహ్యాళి వెడలె**

పౌరజనులు, ప్రమద = సంతోషముచే, నిష్పందతర = మిక్కిలి నిశ్చలములైన, నేత్ర పద్మలు అగుచు = పద్మములవంటి నేత్రములు కలవారగుచు, విలోకింపన్ = చూచుచుండగా, ప్రకటలీలన్ = స్పష్టమైన విలాసముచే, సముచిత = తగిన, అనల్ప = తక్కువకాని, పరివార సహితుడు అగుచున్ = పరివారముతో కూడినవాడగుచు, అవనినాథుడు = నలుడు, వాహ్యాళి వెడలెన్.

తా.	నలుడు జనులందరు సంతోషముతో కనురెప్పలు మూయక తనను చూచుచుండగా విలాసముగా తగిన పరివారముతో కూడినవాడై వాహ్యాళికి వెళ్ళెను.

**89	వ. తత్ప్రదేశంబున**

**90	ఉ. నేమ మెలర్పఁగా గొడుగునీడ వహించు వసుంధరాస్థలీ**
**సీమనె యెక్కి యాడెను విచిత్రగతిం దురగోత్తమంబు నా**
**భూమివిభుండు తత్క్రమము వో యెడఁదప్పక యభ్యసించు వా**
**త్యామయ చక్ర చంక్రమవిహారములన్ సుడిగాడ్పు లిప్పుడున్**

ఆ భూమి విభుండు = ఆ నలమహారాజు, తురగ ఉత్తమంబున్ = శ్రేష్ఠమైన గుఱ్ఱమును, ఎక్కి, నేమము ఎలర్పన్ = నియమము ఒప్పునట్లుగా, గొడుగునీడ వహించు = తన పరిపాలన సాగు, వసుంధరా స్థలీ సీమనె = రాజ్యభాగమునందే, విచిత్రగతిన్ = పలు విచిత్ర రీతులలో, ఆడెను = విహరించెను, తత్ క్రమము వో = ఆ గుఱ్ఱముయొక్క మండలగతులనే, యెడన్ తప్పక = అనువు తప్పకుండ, సుడిగాడ్పులు = సుడిగాలులు, ఇప్పుడున్ = ఈ సమయమందు కూడ, వాత్యామయ = వాయుసమూహరూపములైన, చక్ర చంక్రమ = వలయముగా తిరుగుటయనెడి, విహారములన్ = విహారములచేత, అభ్యసించున్ = నేర్చుకొనుచుండును. (ఉత్ప్రేక్షాలంకారము)

తా.	ఆ నలమహారాజు శ్రేష్ఠమైన గుఱ్ఱమునెక్కి తన పరిపాలన సాగు రాజ్యభాగమునందే నియమము ఒప్పునట్లుగా పలు విచిత్రరీతులలో గుఱ్ఱమును మండలగతుల పోనిచ్చెను. ఆ గుఱ్ఱము చేసిన మండలగతులనే సుడిగాలులు వాయు సమూహరూపమైన వలయాకారముగా తిరుగుటయనెడి విహారములచేత అనువుతప్పక ఇప్పుడును అభ్యసించుచున్నవి.

**91	వ. ఇవ్విధంబునఁ గొంతతడ వతిజవ చతుర తురగ నర్తన క్రీడా డోలాయమాన మణికుండల మరీచి మండలీ నీరాజిత గండస్థలుండై వాహ్యాళి విహారంబు సలిపి వలయు సమాత్యులం బరివారంబును నచ్చోటనయుండ నియమించి యొక్కరుండునుం బాదచారియై ఘనచ్ఛాయంబునుం బ్రవాళ రాగచ్ఛురితంబును నగు విలాసకాననంబుఁ బయోనిధానంబు నంబుజాక్షుండునుంబోలెఁ బ్రవేశించి**

తా.	ఈ రీతిగా, కొంతసేపు మిక్కిలి చుఱుకుతనము కలిగిన నేర్పుగల గుఱ్ఱముయొక్క నాట్య క్రీడచేత ఊగిసలాడుచున్న రత్నకుండలములయొక్క కాంతికిరణముల సమూహముచేత నీరాజన మీయబడుచున్న చెక్కిళ్ళు కలవాడయి విహారంబు సలిపి కావలసిన మంత్రులను, పరివారంబును అక్కడనే ఉండ నియమించి, ఒక్కడును పాదచారియై గొప్ప నీడకలదియు, చిగుళ్ళయొక్క ఎఱ్ఱని కాంతులచే వ్యాప్తమైనదియునైన, పక్షులయొక్క క్రీడలకు ఉనికిపట్టయిన ఉద్యానవనమును (సముద్రము పక్షమున : మేఘముయొక్క కాంతివంటి కాంతికలదియును, పగడపు దీవుల ఎఱ్ఱని కాంతులచే ప్రకాశించునదియు) కన్నములోనుండు (పాములకు) స్థానమైన సముద్రమును పద్మముల వంటి నేత్రములు కల విష్ణుమూర్తివలె ప్రవేశించి

**92 తే. పత్రములమీఁద మూఁగిన భ్రమరకులము**
**హరవిసర్జన జనిత దుర్యశముఁ బోలఁ**

**గమియ విచ్చిన గేదంగి కన్నె పువ్వుఁ**
**గౌతుకము పల్లవింపఁగఁ గాంచె విభుఁడు**

విభుడు = నలుడు, పత్రముల మీదన్ = తేకులమీద, మూగిన, భ్రమర కులము = తుమ్మెదల సమూహము, హర = శివుడు, విసర్జన = విడచుటచే, జనిత = పుట్టిన, దుర్యశమున్ = అపకీర్తిని, పోలన్ = పోలియుండగా, కమియన్ = పూర్తిగా, విచ్చిన, గేదంగి కన్నె పువ్వున్ = క్రొత్తదైన మొగలిపూవును, కౌతుకము = వేడుక, పల్లవింపగన్ = చిగురొత్తగా, కాంచెన్ = చూచెను.

తా. తన తేకులమీద ముసిరిన తుమ్మెదలు శివుడు విసర్జించుటవలన పుట్టిన అపకీర్తిని పోలియుండగా పూర్తిగా వికసించిన మొగలిపూవును నలమహారాజు కౌతుకముతో చూచెను. (ఉత్ప్రేక్షాలంకారము)

**93 వ. విరహిజన హృదయచ్ఛేదన క్రియా క్రకచంబులు వియోగి మర్మ విదారణ వ్యాపార కర్ణి నారాచంబులుఁ బాంథజన హృషీక సూచీ శలాకలునగు కనక కేతకీజాలంబులఁ జేరం జనుదెంచి**

తా. నలుడు విరహిజనుల హృదయములను కోతపెట్టుటయను పనికి అంపములవంటివియును, విరహులయొక్క మర్మస్థానములను చీల్చుటయనెడి పనియందు కొంకిబాణములవలె నున్నవియును, బాటసారులయొక్క ఇంద్రియములకు సూదులవలెనున్నవియైన బంగారపు ఛాయకల మొగలిపూల సముదాయమును చేరుటకు సమీపించి

**94 చం. చిలికెడు కమ్మతేనియలఁ జిప్పిలి హస్తము లస్తకంబులన్**
**నిలువక జీరువాఱు నెడ నీ యతి సాంద్రపరాగముల్ గదా**
**యలరుల వింటి జోదునకు నప్పటి కప్పటి కప్పళించుకోఁ**
**గలిగెడునంచు వే కనలు గైకొని చూచె విభుండు కేతకిన్**

హస్తము = చేయి, చిలికెడు = వింటినుండి చిందుచున్న, కమ్మ తేనియలన్ = మధురమైన మకరందములచేత, చిప్పిలి = తడిసి, లస్తకంబులన్ = పిడియందు, నిలువక, జీరువాఱునెడ = జారిపోవుచున్న సమయమున, (ఓ మొగలిపొదా!) నీ = నీయొక్క, అతి సాంద్ర పరాగముల్ = మిక్కిలి దట్టమైన ధూళులేకదా!, అలరుల వింటి జోదునకు = పూల ధనుస్సుగల వీరునకు, అప్పటికి అప్పటికి = మాటి మాటికి, అప్పళించుకోన్ = అద్దుకొనుటకు, కలిగెడునంచు = దొరికెనని, వే = శీఘ్రముగా, కనలు కైకొని = కోపమువహించి, కేతకిన్ = మొగలిపొదను, చూచెన్

తా. మన్మథుడు తన చెఱకువింటినుండి కారుచున్న మకరందముచేత చేయి తడిసి ధనుస్సు పట్టుకొనునప్పుడు వీలుపడక జారిపోవుచున్న సమయమున ఓ మొగలిపొదా! నీ తేకులయందున్న ధూళిని చేతికి అద్దుకోడానికి దొరకడంచేత విరహులను జయించుచున్నాడని నలుడు కోపముతో మొగలిపొదను చూచెను.

**95 మ. దమయంతీ స్తనకుంభ విభ్రమముఁ బొందంగోరుటన్ ధూమపా**
**నముఁ గావించు చధోముఖంబులగు నానాకుంభముల్ వోలె ధూ**
**పములన్ దోహద మాచరింపఁగఁ గడుం పక్వంబులై యున్న దా**
**డిమముల్ సూచి నృపాలకుండు మదిఁ బాటించెన్ మహౌత్సుక్యమున్**

నృపాలకుండు = నలమహారాజు, దమయంతీ, స్తన కుంభ = కడవలవంటి స్తనములయొక్క, విభ్రమమున్ = విలాసమును, పొందన్ కోరుటన్ = పొందుటకు కోరుటచే, ధూమపానమున్ కావించుచు = పొగను త్రాగుచు, అధోముఖంబులు అగు = తలక్రిందులైనవగు, నానాకుంభముల్ వోలె = పలు కుండలోయనునట్లుగా, ధూపములన్ = పొగలచేత, దోహదము = పూవులను, ఫలములను పుట్టించు క్రియను; ఆచరింపగన్ = చేయగా, కడున్ పక్వంబులై ఉన్న = పెద్దవిగా పండినవైయున్న, దాడిమముల్ = దానిమ్మలను, చూచి, మదిన్ = మనసునందు, మహా ఔత్సుక్యమున్ = గొప్ప వేడుకను, పాటించెన్ = పొందెను. (ఉత్ప్రేక్షాలంకారము)

తా. దమయంతి స్తనకుంభములతో సాటిచెందగోరి పొగను త్రాగుచు అధోముఖములై తపమాచరించుచున్న కుంభములో యనునట్లు, ధూప దోహద ప్రక్రియచే పండిన దానిమ్మలను చూచి నలుడు మనసున గొప్ప వేడుకను పొందెను.

**96 తే. మన్మథుం దేయు కింశుక మార్గణములు**
**చన్నుఁగవ నాటుటయుఁ బాంథ సతియుఁబోలెఁ**
**బాఱుదెంచి కీరంబులు పండ్లు గఱవ**
**వణఁకు దాడిమిఁ జూచె భూవరుఁడు వేడ్క**

మన్మథుండు, ఏయు = వేయు, కింశుక మార్గణములు = మోదుగుపూల బాణములు, చన్నుగవన్ = స్తనద్వయమునందు, నాటుటయున్ = నాటగా, పాంథసతియున్ పోలెన్ = పథిక స్త్రీవలెనె, పాఱుతెంచి = వేగముగా వచ్చి, కీరంబులు = చిలుకలు, పండ్లు కఱవన్ = పండ్లను కొఱుకగా, వణకు దాడిమిన్ = కంపించుచున్న దానిమ్మను, భూవరుండు = రాజు, వేడ్కన్ = కుతూహలముతో, చూచెన్.

తా. మన్మథుడు వేయు మోదుగుపూల బాణములు స్తనద్వయమున నాటగా వెతచెందు పథిక స్త్రీవలె చిలుకలు

వేగముగావచ్చి పండ్లను కొఱుకగా దానిమ్మచెట్టు కంపించుటను రాజు కుతూహలముతో చూచెను.

**97 వ. మఱియు మందానిల పరిస్పందంబునం గందళితంబులై మకరంద బిందు నిష్యందంబులు చిందించు గురివెంద పూఁబందిరులును వలరాచ రాచవారికి వనదేవత యొనర్చు నీరాజన ప్రదీపాంకురంబులుంబోని కోమల కోరకంబులు గరంబు సొంపారు సంపెఁగలును, మదనచాప విముక్తంబులై మొదలం గ్రోలిన భవశరీర భస్మాంగ రాగంబు పరాగ వ్యాజంబున వెడలం గ్రాయుచున్న సురపొన్నలును, రోలంబ నికురుంబంబులకుఁ బానగోష్ఠీ స్థానంబులగు వికస్వర స్థలకమలినీ కదంబంబులును, గలకంఠ కంఠ హుంకారంబులం బాంథులకు భయంబు సంపాదింపం జాలు క్రొమ్మావి మోకచాలును, ధూమకేతు మండలంబునుంబోలె విరహిజనుల గుండియ లవియించుచుఁ జంచరీక పరంపరా శేఖరంబులై సొంపారు చాంపేయంబులును, వలయాకారంబునం బరిభ్రమించు భ్రమరంబుల సంగతిం గేసర రేణు విస్ఫులింగంబు లెగయ శాణోత్తేజనప్రకారంబు నంగీకరించు ననంగునకుం బ్రధాన బాణంబులగు నారంగంబులును, మృదుల పవమాన సంపాత కంపమాన కిసలయ కంటక ప్రక్షతంబులై మదన ముద్రాభిముద్రితంబులగు వారాంగనా జనంబుల వట్రువ పాలిండ్లకుం జుట్టంబులై తోరంబులగు మారేడుపండ్లును, నిఖిల యువద్వయీచిత్త నిమజ్జనోచితంబు లగు సజ్జకపుఁ బూమొగ్గలును, బ్రవాణ గర్భ గహ్వరంబులు వహియించుచు నించు విలుకాని తూణీరంబులకుం బోల్పఁ బట్టైన కలిగొట్టు పొదలును, నొండొండ చంద్రఖండంబులు వెడలం గ్రక్కు రాహుమండలంబునుంబోలెఁ గుటిల సిత కుట్మలంబులు వ్రేలం గాఢాంధకారంబునం గారుకొను మునిద్రుమంబులును గనుంగొనుచు బోషిత రాజకీరంబులు కైవారంబులు సేయఁ బ్రోది రాయంచలు మంగళగాన మొనర్పఁ గొలఁకుల కెలంకులను, బావుల క్రేవలను, నికుంజ క్రోడంబుల నీడలను విశ్రమించుచు బ్రసవ మృదు గంధ పశ్యతోహరంబులగు గంధవాహంబుల రాకలు విహారశ్రాంతి నపనయింప వికటఘటీయంత్ర సలిలధారా సరణి మార్గంబులఁ దెక్కెంబునకుం జక్కని గండుమీను వెదకు మీనకేతనుండునుం బోలె నుద్యానంబెల్లఁ గ్రుమ్మరి యగ్రభాగంబున**

తా. మఱియు మెల్లని వాయువులయొక్క ప్రసారముచేత మొలక లెత్తినవై మకరంద బిందు స్రావములను చిందించు గురివెంద పూ పందిరులును, మన్మథుడను రాజునకు వనదేవత చేయునట్టి నీరాజనమునకైన దీపముల కొనలువలెనే మృదువైన మొగ్గలు, మిక్కిలి ప్రకాశించుచున్న సంపెగలును, మన్మథుని వింటినుండి విడువబడినవై ముందుగా త్రాగిన ఈశ్వరునియొక్క దేహమందున్న బూడిదయనెడి మైపూతను పుప్పొడి మిషచేత బయటకు కక్కుచున్న సురపొన్నలును, తుమ్మెద సమూహములకు పానస్థాన ప్రదేశములగు వికసించినట్టి మెట్టతామరలయొక్క సమూహములును, కోకిల కూతలనెడి జడిపింపులచేత బాటసారులకు భయమును కూర్చుటకు సమర్థమైన లేతమామిడిగున్నలయొక్క వరుసలును, తోకచుక్కల సమూహమువలె విరహిజనుల గుండియలు పగుల గొట్టుచు తుమ్మెద పంక్తులు అగ్రములుగా కలవై ప్రకాశించునట్టి నాగకేసరములును, గుండ్రముగా తిరుగుచున్న తుమ్మెదల సంపర్కముచే కేసర పరాగమనెడి అగ్నికణములు వెదజల్లబడగా సానపెట్టు విధమును ఇష్టపడెడి మన్మథునకు ప్రధాన బాణంబులగు నారింజ పుష్పములును, మంద వాయువులయొక్క ప్రసారముచే చలించుచున్న చిగుళ్ళయందున్న ముండ్లచే చీల్చబడినవై మన్మథుని ముద్రచే ముద్రితములైన (నఖ క్షతములు) వెలయాండ్రయొక్క గుండ్రని స్తనములకు చుట్టంబులై, పెద్దవియగు మారేడుపండ్లును, సమస్తమైన ప్రాయపు స్త్రీ,పురుషులయొక్క మనస్సులను (మోహ సముద్రములో) ముంచుటకు తగినవియైన, మనోహరములైన పూమొగ్గలును, చిగుళ్ళ సంబంధమయిన చీకటి గుహలను వహియించుచు మన్మథుని అమ్ముల పొదులకు పోల్చుటకు స్థానములైన పాటలీవృక్ష పొదలును, క్రమక్రమముగా చంద్రశకలములను ఉమియుచున్న రాహుమండలమువలె, వక్రములైన తెల్లని మొగ్గలు వ్రేలాడుచుండగా పెను చీకటిచే నల్లబాఱుచున్న అవిసెచెట్లును చూచుచు, పెంపుడు చిలుకలు స్తోత్రములు చేయగా, పెంపుడు రాజహంసలు మంగళగానమొనర్ప, తటాకముల పార్శ్వములయందు, నూతుల ప్రక్కలను, పొదరిండ్ల ముందరి నీడలయందును విశ్రమించుచు పూవులందలి చక్కని పరిమళమును చూచుచుండగనే దొంగిలించునట్టి వాయువులయొక్క రాకలు విహరించుటవల్లనైన అలసటను పోగొట్టుచుండగా గొప్పవైన ఏతాములయొక్క నీటి ప్రవాహములయొక్క కాలువ మార్గములయందు ధ్వజమునకు సొగసైన పెద్ద చేపను వెదకుచున్న మన్మథుడును వలె ఉద్యానవనమునంతను తిరిగి, తన యెదుట

**98 సీ. శేషపుచ్ఛ చ్ఛాయఁ జెలువారు బిసములం**
**తర్మగ్న సురదంతి దంతములుగ**
**నిండార విరిసిన పుండరీక శ్రేణి**
**యామినీ రమణ రేఖాంకురముగఁ**
**బ్రతిబింబితోపాంత బహుల పాదపములు**
**గర్భస్థ శైల సంఘములు గాఁగఁ**
**నేకదేశంబున నిందీవరంబులు**
**కాలకూట మయూఖ ఖండములుగ**

తే. బాల శైవాల వల్లరీ జాలకంబు
బాడబానల భవ ధూమ పంక్తిగాఁగ
వారి రాశియుఁ బోలె గంభీరమైన
ఘన తటాకంబు గాంచె నజ్జనవిభుండు

శేషపుచ్ఛ ఛాయన్ = అనంతుని తోకయందున్న కాంతిచే, చెలువారు బిసములు = ఒప్పుచున్న తామరతూడులు, అంతర్ మగ్న = ఆ సముద్రమందు మునిగిన, సుర దంతి = దేవతల ఏనుగైన ఐరావతముయొక్క, దంతములుగన్, నిండార విరిసిన = బాగుగా వికసించిన, పుండరీక శ్రేణి = తెల్ల తామరల సమూహము, యామినీ రమణ = రాత్రికిపతియగు చంద్రుని యొక్క, రేఖా అంకురముగన్ = రేఖయొక్క మొలకకాగా, ప్రతిబింబిత, ఉపాంత = సమీపమందలి, బహుల = అనేకములైన, పాదపములు = చెట్లు, గర్భస్థ = ఉదరమందున్న, శైల సంఘములు = పర్వత సమూహములు, కాగన్ = అగుచుండగా, ఏకదేశంబునన్ = ఒక ప్రదేశమున, ఇందీవరంబులు = నల్లకలువలు, గరళ కూట = హాలాహలము యొక్క, మయూఖ = కిరణములయొక్క, ఖండములుగన్ = ముక్కలుకాగా, బాల = లేతవైన, శైవాల వల్లరీ = నాచు తీగెలయొక్క, జాలకంబు = సమూహము, బాడబ అనల = బడబాగ్నివలన, భవ = పుట్టిన, ధూమపంక్తి కాగన్ = పొగల సమూహము కాగా, వారిరాశియున్ పోలె = సముద్రమువలె, గంభీరము ఐన = లోతైన, ఘన తటాకంబున్ = గొప్ప తటాకమును, ఆ జనవిభుండు = ఆ నలుడు, కాంచెన్ = చూచెను. (రూపకాలంకారము)

తా. తెల్లతామరతూండ్లు ఐరావతముయొక్క దంతములుగాను, వికసించిన తామరలు చంద్రరేఖ మొలకలవలెను, ప్రతిబింబించిన చెట్లు సముద్రమందలి పర్వతములవలెను, అందలి నల్లకలువలు హాలాహల కిరణ ఖండములవలెను, నాచు తీగెలు బడబాగ్నినుండి పుట్టిన పొగలవలెను సముద్రమువలె నొప్పుచున్న లోతైన తటాకమును ఆ నలమహారాజు చూచెను.

**99 వ. కాంచి యొక్కింత తడవు మనంబునం గొనియాడుచుం దిమి తిమింగల ధులీ కుళీర మత్స్య కచ్ఛప మకర నికర సంచార తరళ తరంగమాలికా దోలాధిరోహ లీలా వ్యాలోల కలహంస సంసదాలాప కోలాహల ముఖరిత దిశాభాగంబైన యమ్మహా తటాకంబు తీర ప్రదేశంబున**

తా. చూచి, కొంచెము సేపు మనంబున కొనియాడుచు నూఱామడల చేప, తిమింగలమును మ్రింగు చేప, ఆడు తాబేళ్లు, ఎండ్రకాయలు, చేపలు, తాబేళ్ళు, మొసళ్ళు సమూహములయొక్క విహారములచేత చలించుచున్న అలల పంక్తులనెడి ఊయలను అధిరోహించుటయనెడి వినోదమునందు ఆసక్తికల కలహంస సమూహముయొక్క కలకలముచే ప్రతిధ్వనించుచున్న దిక్కులు కలదైన ఆ మహా తటాకంబు తీర ప్రదేశంబున

**100 సీ. విలసిత జంబాల పులినభాగమున ను**
**ద్దండ పద్మాతపత్త్రంబు నీడఁ**
**గమల కాండ కఠోర కంటకాంకుర పంక్తి**
**నొయ్యనఁ గంధరం బొరసికొనుచు**
**నొంటి కాలనె నిల్చి యూర్మి మారుతములఁ**
**జిగురు ఱెక్కల రేకు లెగయుచుండ**
**విశదమై పక్షతి ద్వితయంబు విడజాఱఁ**
**జంచు లొకించు కాకుంచితముగ**
**తే. వరుణరాజున కిడిన చామరము వోలెఁ**
**బొడవు మిగిలిన వెలిదమ్మి పువ్వుఁ బోలె**
**నిబిడ నిద్రాభిముద్రిత నేత్రమైన**
**రాజహంసంబుఁ గాంచె నా రాజసుతుఁడు**

విలసిత = ఒప్పుచున్న, జంబాల = బురదగల, పులిన భాగమునన్ = ఇసుక తిన్నెయందు, ఉద్దండ = గొప్పదైన, పద్మాతపత్ర నీడన్ = గొడుగువంటి పద్మముయొక్క నీడయందు, కమలకాండ = తామరకాడలయందున్న, కఠోర = కఠినములైన, కంటక అంకురపంక్తిన్ = ముండ్ల మొలకల వరుసయందు, ఒయ్యనన్ = మెల్లగా, కంధరంబు = మెడను, ఒరసికొనుచున్ = ఆన్చుకొనుచు, ఒంటికాలనె, నిల్చి, ఊర్మి మారుతముల = తరంగముల గాలిచే, చిగురు ఱెక్కల రేకులు = కోమలములైన ఱెక్కల ఈకలు, ఎగయుచుండన్ = పైకి లేచుచుండగా, విశదమై = స్వచ్ఛమైనదై, పక్షతి ద్వితయంబు = రెండు ఱెక్కలును, విడజాఱన్ = విడిపోవుచుండగా, చంచులు = ముక్కు, ఒకించుక = కొంచెము, ఆకుంచితముగ = ముడుచుకోబడగా, వరుణరాజునకున్, ఇడిన = పట్టిన, చామరము పోలెన్ = వింజామరవలె, పొడవు మిగిలిన = ఉన్నతిని అతిశయించిన, వెలి తమ్మి పువ్వున్ పోలె = తెల్ల తామర పువ్వువలె, నిబిడ నిద్ర = గాఢమైన నిద్రచే, అభిముద్రిత = మూయబడిన, నేత్రము ఐన = కన్నులుకలదైన, రాజహంసంబున్ = రాజహంసను, ఆ రాజసుతుడు, కాంచెన్ = చూచెను.

తా.	ఆ నలమహారాజు చెఱువు గట్టున బురదగల ఇసుకతిన్నెయందు గొడుగువంటి పద్మము నీడయందు తామర తూడులకు మెడను ఆన్చుకొని, ఒంటికాలిపై నిలచి, తరంగముల గాలిచే ఱెక్కల ఈకలు ఎగురుచుండగా స్వచ్ఛమైనదై రెండు ఱెక్కలును వదులుగా కాగా, ముక్కును కొంచెము ప్రక్కకు ముడుచుకొని వరుణదేవునకు పట్టిన వింజామరవలె, తెల్లతామర పూవువలె, గాఢ నిద్రచే కన్నులు మూసుకొన్న రాయంచను చూచెను. (స్వభావోక్తి అలంకారము)

**101 క. కాంచన పక్షంబగు రా**
**యంచం గనుఁగొని నృపాలుఁ డనురాగముతో**
**వంచించి పట్టుకొనియెద**
**నంచుఁ దలఁచె దైవఘటన కనుకూలముగాన్**

కాంచన పక్షంబు అగు = బంగారు ఱెక్కలు కలదైన, రాయంచన్, కనుగొని = చూచి, నృపాలుడు = రాజు, అనురాగముతో = ప్రీతితో, వంచించి = మోసగించి, పట్టుకొనియెదనంచున్, దైవఘటనకు, అనుకూలముగాన్, తలంచెన్ = ఆలోచించెను.

తా.	ఆ నలమహారాజు బంగారు ఱెక్కలు కలిగిన ఆ రాయంచను చూసి ఇష్టపడి కాబోవు వివాహము దైవఘటన కాగా దానికి తెలియకుండగా పట్టుకోవాలని ఆలోచించెను.

**102 తే. వామనుండైన కైటభవైరి విధము**
**నభినయించు క్రమంబున నధిపసుతుఁడు**
**నడిఁకి నడిఁకి యల్లల్లన నడిచి పట్టెఁ**
**బాణి పద్మద్వయంబునఁ బసిఁడియంచ**

అధిప సుతుడు = రాజకుమారుడు నలుడు, వామనుడు ఐన = పొట్టివాడైన, కైటభ వైరి = విష్ణుమూర్తి, విధమున్ = రీతిని, అభినయించు = నటించు, క్రమంబునన్ = పద్ధతితో, నడికి నడికి = వంగి వంగి, అల్లల్లన = మెల్లగా, నడచి, పాణి పద్మ ద్వయంబునన్ = పద్మములవంటి రెండు చేతులతో, పసిడి యంచన్ = రాయంచను, పట్టెన్ (స్వభావోక్తి)

తా.	ఆ నలమహారాజు పొట్టివాడైన విష్ణుమూర్తివలె నటిస్తూ వంగి వంగి మెల్లగా నడచి పద్మములవంటి తన రెండు చేతులతో ఆ రాజహంసను పట్టుకొనెను.

**103	వ. ఇట్లు నిషధరాజు చేతం బట్టువడి మేల్కాంచి యక్కాంచన హంసంబు కంచుగీసిన తెఱంగున నెలుఁగించుచు నెగయ నుంకించుచుఁ జంచుపుటంబునఁ బాణిపల్లవంబులు గఱచుచుఁ జరణంబులఁ గెంజుకొనుచు నఖంబుల నొత్తుచు నలుదిక్కులం జూచుచు నెద్దియుం జేయునదిలేక చీకాకుపడుచుండ నప్పాటన సంభ్రమ సముత్పత త్పతగకులంబై కమలషండంబు గలగుండువడియెఁ గూలంబులం గులాయంబులనుండి పుండరీక వనలక్ష్మీచరణ నూపుర క్రేంకారంబుల ననుకరించుచుఁ గారండవ బక క్రౌంచ రథాంగ కోయష్టికాదులు విహాయసంబున కెగసి కూయం దొడంగె నప్పుడు**

తా.	ఇట్లు నిషధరాజు చేత పట్టువడి మేలుకొని ఆ బంగారు హంస కంచుగంట ధ్వనివలె అరచుచు ఎగురుటకు ప్రయత్నించుచు దొన్నెవంటి ముక్కుతో చిగురువంటి చేతులను కఱచుచు, కాళ్ళను గించుకొనుచు, గోళ్ళచే గీరుచు, నలుదిక్కుల చూచుచు, ఎద్దియు చేయునదిలేక, చీకాకు పడుచుండ, ఆ సమయమందే తొట్రుపాటుచే ఎగురుచున్న పక్షి సమూహము కలదై తామరల సమూహము సంక్షోభము చెందెను, గట్లయందున్న గూళ్ళనుండి పద్మవనములయందుండెడి లక్ష్మీదేవియొక్క కాలి అందెలయొక్క క్రేంకార ధ్వనులను అనుకరించుచు కన్నెలేడిపిట్టలు, కొంగలు, క్రౌంచపక్షులు, చక్రవాకములు, గుడ్డి కొంగలు మొదలైనవి ఆకసమునకు ఎగిరి కూయసాగెను, అప్పుడు

**104 తే. జాతరూపచ్ఛద చ్ఛటా జాత రూప**
**లక్ష్మి యింతొప్పునే మరాళమున కనుచు**
**నద్భుతంబంది తనుఁ జూచు నధిపుసుతున**
**కిట్లనె మనుజభాషల హేమఖగము**

మరాళమునకు = హంసకు, ఇంత = ఇట్టి, జాతరూప = బంగారు, ఛద = ఈకలయొక్క, చ్ఛటా = సమూహమువలన, జాత = పుట్టిన, రూపలక్ష్మి = సౌందర్యశోభ, ఒప్పునే = ఉండునా?, అనుచున్ = అనుకొనుచు, అద్భుతంబంది = ఆశ్చర్యపడి, తనున్ = తనను, చూచు, అధిపుసుతునకు = రాజకుమారునకు, హేమ ఖగము = పసిడి పిట్ట, మనుజ భాషల, ఇట్లు అనె = ఈ రీతిగా పలికెను.

తా.	హంసలకు ఇలాంటి బంగారు ఈకలవల్ల పుట్టిన సౌందర్యశోభ ఎక్కడైనా ఉంటుందా? అనుకొనుచు ఆశ్చర్యపడి తననే చూచుచున్న ఆ రాజకుమారునితో ఆ పసిడిపిట్ట మానవ భాషలో ఈ రీతిగా పలికెను

**105 క. ఱెక్కల కొనలం గలిగిన**
**యిక్కాంచన మాసపడియెదే నృప నీకే**
**యక్కఱ దీనం దీరెడు**
**నక్కట! నీహారలేశ మబ్ధికిఁ బోలెన్**

నృప = రాజా!, తెక్కల కొనలన్, కలిగిన, ఈ కాంచనము = ఈ బంగారమునకు, ఆస పడియెదే = ఆశ పడుచున్నావా? అక్కట = అయ్యో, నీహారలేశము = మంచు చుక్క, అబ్ధికి పోలెన్ = సముద్రమునకువలె, దీనన్ = దీనివలన, నీకు, ఏ అక్కఱ తీరెడు = ఏ అవసరము తీరుతుంది కనక. (ఉపమాలంకారము)

తా. రాజా! నా తెక్కల చివరనున్న ఈ బంగారానికి ఆశపడుతున్నావా? అయ్యో! చిన్న మంచు చుక్క సముద్రునకు వలె దీనివల్ల నీకు ఏ అవసరము తీరుతుందికనక.

**106 చ. ఎఱుఁగనె నీవు ప్రాంతమున నింతట నంతట నున్కి యింత యే**
**మఱుదునె నిన్ను విశ్వజనమాన్యుఁడవంచును విశ్వసించి యి**
**త్తఱి సుఖనిద్రఁ బొందితి వృథామతి నెట్టన యాత్మ నమ్మినం**
**జెఱుపఁ దలంతురే ఘనులు చిత్తమునం బగవారినేనియున్**

నీవు, ప్రాంతమునన్ = ఈ సమీపమున, ఇంతటన్ అంతటన్ = ఇక్కడను అక్కడను, ఉన్కి = ఉండుటను, ఎఱుగనె = తెలియనిదాననా?, ఇంత ఏమఱుదునె = ఇంత అజాగ్రత్తగా ఉంటానా? నిన్ను, విశ్వజనమాన్యుడవు అంచును = ప్రపంచ జనులచే గౌరవింపదగినవాడవని, విశ్వసించి = నమ్మి, ఈ తఱిన్ = ఈ సమీపమున, వృథామతిన్ = మూర్ఖపు తెలివితో, సుఖనిద్రన్ పొందితిన్ = సుఖముగా నిద్రపోయితిని, నెట్టనన్ = మిక్కిలిగా, ఆత్మన్ = మనసునందు, నమ్మినన్ = నమ్మియుండగా, ఘనులు = గొప్పవారు, పగవారినేనియున్, చిత్తమునన్ = మనసునందైనను, చెఱుపన్ తలంతురే = పాడుచేయుటకు ఆలోచించెదరా? (అర్థాంతరాలంకారము)

తా. ఓ రాజా! నీవు ఈ ప్రాంతమున ఇక్కడ అక్కడ ఉండటాన్ని తెలియనిదాననా? ఇంత అజాగ్రత్తగా ఉంటానా? ప్రపంచ జనులందఱిచేతను గౌరవింపదగినవాడవని నిన్ను నమ్మి ఈ సమీపంలోనే మూర్ఖంగా సుఖంగా నిద్రపోయాను. మనసులో అమితంగా నమ్మియుండగా పగవారినైనా గొప్పవారు మనసులోనైనా పాడుచేయాలనుకుంటారా?

**107 ఉ. హింసయ నీకు వేడ్కయగునేని గృపాశ్రయమైన యీ సరో**
**హంసము జంపనేల? కఱవా తరువాత వసుంధరాధిపో**
**త్తంస! విజృంభమాణ భుజదర్ప నిరంకుశ సాహస క్రియా**
**మాంసల చిత్తవృత్తులయి మత్తిలియుండు నరాతి భూపతుల్**

వసుంధర అధిప ఉత్తంస = ఓ రాజశ్రేష్ఠా!, నీకు, హింసయ, వేడ్క అగునేని, గృప ఆశ్రయమైన = దయకు పాత్రమైన, ఈ సరోహంసము = ఈ చెఱువులోని పక్షిని, చంపన్ ఏల = చంపడమెందుకు? తరువాత = బయట, విజృంభమాణ = అతిశయించుచున్న, భుజ దర్ప = భుజ గర్వముచే, నిరంకుశ = అడ్డులేని, సాహస క్రియా = సాహస కృత్యములచే, మాంసల = దట్టమైన, చిత్తవృత్తులయి = మనోవ్యాపారములు కలవారై, మత్తిలి ఉండు = మదించినట్టి, అరాతి భూపతుల్ = శత్రు రాజులు, కఱవా = లేకపోయిరా?

తా. ఓ రాజశ్రేష్ఠా! నీకు హింసయందే వేడుకయైన కరుణాపాత్రమైన ఈ నీటిపక్షిని చంపడమెందుకు? బయట అతిశయించిన భుజగర్వముచే అడ్డులేని సాహసకృత్యములనాచరించువారైన మదించినట్టి శత్రురాజులు లేకపోయిరా?

**108 వ. ఫల కుసుమ మూల మాత్రంబున శరీరయాత్ర నడుపుచు మునులంబోలె సలిలంబులలోనం దపంబు చేయుచున్నవారము మా మీఁద దండనీతిం బ్రయోగింప నీకుం దగునే యదియునుంగాక**

తా. ఫల, కుసుమ, దుంపలు మాత్రముచేతనే శరీరయాత్ర నడుపుచు మునులవలె జలములలో తపము చేయుచున్నవారము, ఏ నేఱము చేయని మామీద శిక్షను ప్రయోగింప నీవంటివానికి తగునే, అదియును కాక

**109 సీ. తల్లి మదేకపుత్రక పెద్ద కన్నులు**
**గాన దిప్పుడు మూఁడు కాళ్ళ ముసలి**
**యిల్లాలు గడు సాధ్వి యేమియు నెఱుఁగదు**
**పరమ పాతివ్రత్య భవ్య చరిత**
**వెనుక ముందర లేరు నెవ్వరైన చుట్టంబు**
**లేవడి యెంతేని జీవనంబు**
**గానక కన్న సంతానంబు శిశువులు**
**జీవనస్థితి కేన తావలంబు**
**తే. కృపఁ దలంపఁ గదయ్య యో నృపవరేణ్య**
**యభయ మీవయ్య యో తుహినాంశు వంశ**
**కావఁ గదవయ్య యర్థార్థి కల్పశాఖి**
**నిగ్రహింపకుమయ్య యో నిషధరాజ!**

నృపవరేణ్యా = ఓ రాజశ్రేష్ఠా!, తల్లి, మత్ ఏక పుత్త్రక = నేనొక్కడినే కొడుకుగా కలది, పెద్ద = వృద్ధురాలు, కన్నులు కానదు = చూపు కనబడదు, ఇప్పుడు, మూడు కాళ్ళ ముసలి = కఱ్ఱలేనిదే నడువలేనిది, ఇల్లాలు = భార్య, కడు సాధ్వి = మిక్కిలి సాధుస్వభావముకలది, ఏమియును ఎఱుగదు, పరమ = గొప్ప, పాతివ్రత్య, భవ్య చరిత = ప్రశస్తమైన ప్రవర్తన కలది, వెనుక ముందరన్ = ఇరువంకలను, నెనరైన = కావలసిన, చుట్టంబులు, లేరు, జీవనంబు = బ్రతుకు, ఎంతేని లేవడి = ఎంతయును పేదఱికము, కానక కన్న సంతానంబు = లేక లేక పుట్టిన పిల్లలు, శిశువులు = పసివారు, జీవనస్థితికి = కుంటుంబపోషణకు, ఏన = నేనే, తావలంబు = ఆధారమైనవాడను, కృప తలంపన్ కదయ్యా = దయచూపవయ్యా!, ఓ తుహిన అంశు వంశ = చంద్రవంశమందు పుట్టినవాడా! అభయము ఈవయ్య = శరణు నిమ్ము, అర్థార్థి కల్పశాఖి = యాచకులకు కల్పవృక్షమువంటివాడా!, కావన్ కదవయ్య = రక్షింపుము, ఓ నిషధ రాజ = ఓ నలమహారాజా!, నిగ్రహింపకుమయ్య = చంపకుము.

తా. మా తల్లికి నే నొక్కడనే కుమారుడను, ఆమె వృద్ధురాలు, కళ్ళు కనబడవు, ఇప్పుడు కఱ్ఱ లేనిదే నడువలేదు కూడా. ఇక నా భార్య సాధు స్వభావురాలు, ఏమీ తెలియనిది, పతివ్రత, ప్రశస్తమైన ప్రవర్తన కలది. మాకు వెనుక ముందర కావలసిన బంధువు లెవరూ లేరు. మా బ్రతుకా చాల పేదది. లేక లేక పుట్టిన పిల్లలు పసివాళ్ళు. కుటుంబ పోషణకు నేనే ఆధారమైనవాడను. ఓ రాజశ్రేష్ఠా! దయచూపించు, ఓ చంద్రవంశమందు పుట్టినవాడా! శరణు నియ్యి, యాచకుల కల్పవృక్షమా! రక్షించు, ఓ నిషధరాజా! నన్ను చంపకు.

**110 వ. అక్కటకటా! దైవంబ! నీ కంటికిం బేలగింజయుం బెద్ద యయ్యెనే? జననీ! ముదిసి ముప్పు కాలంబున సుత శోక సాగరం బెబ్భంగి నీఁదఁగలదానవు? ప్రాణేశ్వరీ! యే చందంబున మద్విరహ వేదనా దవానలంబునం దరికొనియెదవు? సఖులారా! యే ప్రకారంబునం బుటపాక ప్రతీకాశంబైన కరుణరసంబునఁ బురపురం బొక్కెదరు? బిడ్డలార! యే లాగున నతి క్షుత్పిపాసాకులంబులై కులాయ కూలంబులం గులకులం గూసెదరని విలాపంబు సేయుచు దృగ్గోళకంబుల వేఁడి కన్నీరు వెడల గోలుగోలున నేడ్చినం గృపాళుండై యా భూపాలుండు హస్త పల్లవంబులు వదలి రాజహంసంబ పొమ్ము సుఖంబుండుమని విడిచిపుచ్చె ననంతరంబ**

తా. అయ్యయ్యో, దేవుడా!, నీ కంటికి పేల గింజ(అల్పవస్తువును) పెద్ద అయ్యిందా? అమ్మా! ముసలిదానవయి పోయే కాలమునందు పుత్ర శోక సముద్రమును ఏ రీతిగా దాటగలదానవు? ప్రియురాలా! ఏ విధముగా నా విరహ బాధయనెడి కార్చిచ్చుచే దహింపబడుదువోకదా!, స్నేహితులారా! ఏ ప్రకారంగా పుటము పెట్టు వేడితో సమానమైన, శోక రసమునందు బాధ పడుదురోకదా!, బిడ్డలార! ఏ లాగున అధికమైన ఆకలిచేతను, దాహముచేతను పీడింపబడినవారలై, గూటి అంచులయందు గోలుగోలున అరిచెదరని ఏడ్చుచు నేత్రములనుండి వేడి కన్నీరు వెడల గోలు గోలున ఏడ్చిన దయకలవాడై ఆ రాజు (నలుడు) చిగుళ్ళవంటి చేతులను వదలి రాజహంసంబ పొమ్ము, సుఖంబుండుమని, విడిచిపుచ్చెను, అనంతరంబ

**111 శా. భారద్వాజ పవిత్ర గోత్ర విమలాపస్తంబ సత్సూత్ర వి**
**ద్యా రాజార్ధ కిరీట రాజహిత కార్యారంభ నిర్ధారణా**
**దౌరంధర్య కళా యుగంధర సమిద్గాండీవి శ్రీఖండ క**
**ర్పూర క్షోద విపాండు నిర్మలయశఃపూర్ణ క్షమామండలా**

భారద్వాజ పవిత్ర గోత్ర, విమల = స్వచ్ఛమైన, ఆపస్తంబ, సత్ సూత్ర = మంచి సూత్రముకలవాడా, విద్యా రాజార్ధ కిరీట = విద్యలలో చంద్రరేఖ కిరీటముగాగల శివుడా!(సర్వజ్ఞుడా), రాజహిత = రాజునకు మేలుచేయు, కార్యారంభ = పని మొదలుపెట్ట, నిర్ధారణా = నిశ్చయమునకు, దౌరంధర్య = బాధ్యత వహించుటయొక్క కళా = నేర్పునందు, యుగంధర = యుగంధరుని వంటివాడా!, సమిత్ = యుద్ధమునందు, గాండీవి = అర్జుననివంటివాడా!, శ్రీఖండ = మంచిగంధము వలె, కర్పూర క్షోద = కర్పూరము గుండవలెను, విపాండు = మిక్కిలి తెల్లని, నిర్మల = స్వచ్ఛమైన, యశస్ = కీర్తిచే, పూర్ణ = నిండిన, క్షమామండలా = భూమండలముకలవాడా!

తా. భారద్వాజ పవిత్రగోత్రా! ఆపస్తంబ సూత్రా! విద్యలలో పరమశివుడా! రాచకార్య నిర్ధారణ బాధ్యతలో యుగంధరుడా! యుద్ధమందు అర్జుననివంటివాడా! మంచిగంధము, కర్పూరపు పొడివలె మిక్కిలి తెల్లని, స్వచ్ఛమైన కీర్తితో నిండిపోయిన భూమండలుడా!

**112 క. కేళాదిరాయ యభినవ**
**లీలా మకరాంక చంద్ర లేఖాంకుర చూ**
**డాలంకార పదాంబురు**
**హాలింగన సుఖిత నిర్మలాంతఃకరణా!**

కేళాదిరాయ (ఇది బిరుదు), అభినవ = క్రొత్తవైన, లీలా = విలాసములకు, మకరాంక = మన్మథునివంటివాడా!, చంద్ర లేఖ అంకుర = బాలచంద్రుడు (చంద్రరేఖ), చూడాలంకార = శిరోభూషణముగాకల (శివుని), పద అంబురుహ =

పద్మమువంటి పాదమును, ఆలింగన = కౌగలింతచేత, సుఖిత = సుఖముకలదైన, నిర్మల = స్వచ్ఛమైన, అంతఃకరణా = మనస్సు కలవాడా!

తా. కేళాదిరాయ! సరిక్రొత్త విలాసములకు మన్మథునివంటివాడా! చంద్రరేఖ శిరోభూషణముగాకల శివుని పాద పద్మమును తాకుటచే సుఖించు నిర్మల మనస్సుకలవాడా!

**113 మాలిని. జరఠ కమఠరాజ స్తబ్ధరోమప్రధాన**
**ద్విరసనపతి భూభృ ద్దిగ్గజ గ్రామ భూమ**
**స్థిరతర ధృత సంపద్గేహ బాహాగ్రపీఠీ**
**పరిచయ సుఖలక్ష్మీ పక్ష్మల క్షోణిచక్రా**

జరఠ = కఱకైన, కమఠరాజ = కూర్మరాజును, స్తబ్ధ రోమ ప్రధాన = ఆదివరాహము, ద్విరసన పతి = ఆదిశేషుడు, భూభృత్ = కులపర్వతములు, దిగ్గజ = దిగ్గజములు, గ్రామ = సమూహములచే, భూమ = నిండుగా, స్థిరతర = మిగుల దృఢముగా, ధృత = ధరించుటచే, సంపత్ గేహ = సంపదలకు నిలయమైన, బాహాగ్రపీఠ = బాహుపీఠముతోనున్న, పరిచయ = పరిచయమువలన కలిగిన, సుఖలక్ష్మీ = సౌఖ్య సమృద్ధులచేత,పక్ష్మల = సాంద్రమైనట్టియు, క్షోణిచక్రా = భూమండలము కలవాడా!

తా. కఱకైన కూర్మము, ఆదివరాహము, ఆదిశేషుడు, కులపర్వతములు, దిగ్గజములు సమర్ధముగా మోయుటచేత సంపదలు నిలయమైన బాహుపీఠ పరిచయము కలిగిన సౌఖ్య సమృద్ధులచేత దట్టమైన భూమండలముకలవాడా!

**గద్య**
**ఇది శ్రీమత్కమలనాభ పౌత్త్ర మారయామాత్య పుత్త్ర**
**సకల విద్యా సనాథ శ్రీనాథభట్ట ప్రణీతమయిన**
**శృంగార నైషధ కావ్యమునందు**
**ప్రథమాశ్వాసము**

**వ్యాఖ్యాతృ గద్యము**
**ఇది బుధజన విధేయుండును, బులుసు వంశ సంభూతుండును,**
**కీ.శే. శేషమ్మ, వెంకటరమణయ్య పుణ్యదంపతీ తనూజుండును,**
**గౌతమ గోత్రజుండునగు వేంకటసత్యనారాయణమూర్తి**
**ప్రణీతంబైన శృంగార నైషధ మహాకావ్యంబునందు**
**ప్రథమాశ్వాసమునకు టీక-తాత్పర్యములు**
**సంపూర్ణము**

# శృంగార నైషధము

ద్వితీయాశ్వాసము

**శ్రీ రాజరాజ వేమ**
**క్ష్మారమణ కృపా కటాక్ష సంవర్ధిత ల**
**క్ష్మీ రక్షిత బుధలోక యు**
**దార గుణాధార సింగనామాత్యనిధీ**

శ్రీ = శోభాయుతుడును, రాజరాజ = రాజులకు రాజునైన, వేమ క్ష్మారమణ = వేమ భూపాలునియొక్క, కృపా కటాక్ష = దయారసముకల చూపులచే, సంవర్ధిత = వృద్ధిపొందింపబడిన, లక్ష్మీ = సంపదలచే, రక్షిత = పోషింపబడుచున్న, బుధలోక = పండితసమూహముకలవాడా!, ఉదార గుణ = గొప్ప గుణములకు, ఆధార = ఆధారమైనట్టి, సింగన అమాత్య నిధీ = సింగన మంత్రిశ్రేష్ఠా!

తా. శోభాయుతుడు, రాజరాజునైన వేమభూపాలుని దయారసముచే వృద్ధిపొందింపబడిన సంపదలచే పోషింపబడుచున్న పండితసమూహముకలవాడా! గొప్ప గుణములకు ఆధారమైనట్టి సింగన మంత్రిశ్రేష్ఠా!

**2 వ. అవధరింపుము**

**3 తే. అట్లు పురుషోత్తముండైన యతనివలనఁ**
**ముక్తి గాంచిన యా ద్విజముఖ్యుఁ డెలమిఁ**
**డెందమునకును వాక్కున కందరాని**
**యధికతరమైన యానంద మనుభవించె**

అట్లు = ఆ ప్రకారముగా, పురుషోత్తముండు ఐన = పురుష శ్రేష్ఠుడైన, అతని వలనన్ = ఆ నలునివలన, ముక్తి = విడుదలను, కాంచిన = పొందిన, ఆ ద్విజ ముఖ్యుడు = ఆ పక్షి శ్రేష్ఠుదు (బ్రాహ్మణుడు), ఎలమిన్ = సంతోషముచే, డెందమునకును = మనస్సునకును, వాక్కునకు = మాటలకు, అందరాని = అందనటువంటి, అధికతరమైన = మిక్కిలి గొప్పదైన, ఆనందము = సంతోషమును, అనుభవించె. (శ్లేషాలంకారము)

తా. ఆ విధముగా పురుషశ్రేష్ఠుడైన నలునివలన విముక్తిని పొంది ఆ రాయంచ సంతోషముతో మనస్సునకు, మాటలకు అందని గొప్ప ఆనందమును అనుభవించెను.

(బ్రాహ్మణపరంగా) పురుషోత్తముడైన విష్ణువువలన మోక్షమును పొంది ఆ బ్రాహ్మణుడు సంతోషముతో భావనాతీత, అనిర్వచనీయ బ్రహ్మానందమును అనుభవించెను.

**4 క. చుట్టంబులుఁ జెలులుం దనుఁ**
**జుట్టుఁ దిరిగియుండ ముదము సొంపెసలారన్**
**నెట్టిపడి చచ్చి క్రమ్మఱఁ**
**బుట్టిన చందమున హంసము దటాకములోన్**

సొంపెసలారన్ = అతిశయింపగా, నెట్టిపడి = త్రోసికొనిపడి, క్రమ్మఱన్ = మరల

తా. బంధువులు, స్నేహితులు తనను చుట్టిముట్టియుండగా చచ్చి మఱల పుట్టిన విధముగ మిక్కిలి సంతోషముతో హంస చెఱువులో (ఉత్ప్రేక్షాలంకారము)

**5 సీ. ఱిక్కించుకొనియున్న రెక్క మొత్తముతోడి**
**యొడలు జాడించి నెవ్వడి విదిర్చుఁ**
**జేదోయి యొత్తునఁ జేసి నెత్తురులైన**
**యవయవంబులు నోర సవరఁ జేయుఁ**
**గుటిల చంచూపుట కోటి కుట్టనములఁ**
**దను కీటముల నిరోధంబు మాన్చుఁ**
**దొడగ జుంజుఱు మేని దుర్వికారంబునఁ**
**బులుఁగుఁ జుట్టాల బిట్టులుకఁ జేయు**

తే. నూర్మి పంక్తుల నుయ్యాల లూఁగియాడుఁ
దివుటఁ దియ్యని తమ్మి పూఁదేనెఁ గ్రోలుఁ
బ్రమదమున నాఁచుఁదీఁగ జొంపములఁ దూఱు
నరుగుఁ గేళి కులాయ శుద్ధాంతములకు

తిక్కించుకొనియున్న = నిక్కపెట్టబడియున్న, రెక్క మొత్తముతోడి = ఈకల సమూహముతో, ఒడలు = దేహమును, జాడించి, నెవ్వడిన్ = వేగముగా, విదిర్చున్ = విదుల్చును, చేదోయి = (నలుని) రెండుచేతులయొక్క, ఒత్తునన్ చేసి = రాపిడిచే, నెత్తురులైన, అవయవంబులు, నోర = నోటితో, సవరన్ చేయున్ = చక్కబరచుకొనును, కుటిల = వక్రములైన, చంచూపుట = ముక్కుపుటములయొక్క, కోటి = అంచులతో, కుట్టనములన్ = పొడుచుకొనుటచే, తను = శరీరమందలి, కీటముల = క్రిములయొక్క, నిరోధంబు = బాధను, మాన్చు = పోగొట్టుకొనును, తొడగన్ = దేహమును చాచగా, జుంజుఱు మేని = చింపిరిగానున్న శరీరముయొక్క, దుర్వికారంబునన్ = చెడు ఆకారముచేత, పులుగున్ చుట్టాలన్ = బంధువులైన పక్షులను, బిట్టు = మిక్కిలి, ఉలుకన్ చేయున్ = ఉలిక్కిపడునట్లు చేయును, ఊర్మి పంక్తులన్ = తరంగ మాలికలయందు, ఉయ్యాలలు ఊగి ఆడున్, తివుటన్ = కోర్కెతో, తియ్యని తమ్మి పూ తేనెన్, గ్రోలు = త్రాగును, ప్రమదమునన్ = సంతోషముతో, నాచు తీగ, జొంపములన్ = గుబురులను, తూఱున్ = దూరును, కేళి = క్రీడకొఱకై, కులాయ = గూళ్లనెడి, శుద్ధాంతములకున్ = అంతఃపురములకు, అరుగున్ = పోవును.(స్వభావోక్తి అలంకారము)

తా. నిక్కపెట్టబడిన ఈకల సమూహముతో దేహమును వేగముగా విదుల్చుకొనును. నలుని చేతుల ఒత్తిడిచే నెత్తురులైన దేహ భాగములను నోటితో చక్కబరచుకొనును. ముక్కుపుటముల అంచులతో పొడుచుకొనుచు శరీరమందలి క్రిముల బాధను పోగొట్టుకొనును. దేహమును చాచగా చింపిరిగానున్న తన మలిన శరీరముచేత పక్షిచుట్టాలను ఉలిక్కిపడునట్లు చేయును. తరంగమాలికలయందు ఊయ్యాల లూగి ఆడును. కోరికతో తమ్మిపూవులయందలి తేనెను త్రాగును. సంతోషముతో నాచు గుబురులను దూరును, క్రీడగా గూళ్ళనెడి అంతఃపురములకు పోవును.

**6 వ. ఇవ్విధంబునం గొంతదడవు గ్రీడించు యానీదోద్భవంబు భవార్చనాయోగ్యంబును రుద్రాక్ష మధువ్రత పరీవృతంబును బహు శైవలక్ష్మతా సమన్వితంబును నగుటఁ బద్మంబునుంబోని నిషధరాజు హస్తంబునకుఁ గ్రమ్మఱ నరుగుదెంచె నమ్మహాభుజుండును భుజంబు సాఁచి యమ్మానసౌకంబు మన్నించి యిమిడికొని యుండెనప్పుడు**

తా. ఈ ప్రకారముగా కొంతసేపు క్రీడించు ఆ హంస శివపూజకు తగినదియును, తుమ్మెదలవంటి రుద్రాక్షలచేత చుట్టబడినదియును, అనేకములైన శివసంబంధమైన లక్షణములతో కూడినట్టిదియునగు విస్తారమైన నాచుకల ప్రదేశముతో కూడినట్టి తామరవలె ఉన్న నలుని చేతికి తిరిగి వచ్చెను. ఆ గొప్ప భుజములుకల నలుడును చేయి చాచి ఆ రాయంచను ఆదరించి తన చేతులలో ఇముడ్చుకొనెను. ఆ సమయమున

**7 తే. ఇష్టమానసమయిన యా హేమఖగము
నలుని మానస మానంద జలధియందుఁ
గర్ణ శష్కులి కలశంబుఁ గౌఁగిలించి
యీఁదఁ జేయుచు మృదుభాష నిట్టులనియె**

ఇష్ట మానసము అయిన = తన మనసునకు నచ్చిన, ఆ హేమ ఖగము = ఆ బంగారు పక్షి, కర్ణ శష్కులి = చక్కిలములవంటి చెవులనెడి, కలశంబున్, కౌగలించి, నలుని = నలునియొక్క, మానసము = మనస్సును, ఆనంద జలధియందున్ = సంతోష సముద్రమునందు, ఈదన్ చేయుచు, మృదుభాషన్, ఇట్టులు అనియె. (అలంకారము – రూపకము.)

తా. తన మనసుకు నచ్చిన నలుని ఆ బంగారు పక్షి చక్కిలములవంటి చెవులనబడే కలశమును కౌగలించుకొని ఆతని మనస్సును సంతోష సముద్రమునందు ఈదునట్లుచేయుచు మెత్తని పలుకులతో ఇట్లనెను.

**8 వ. దేవా! యవధరింపుము. ధర్మశాస్త్ర మర్మపారగులైన పెద్దలు దుర్బలకుల జిఘాంసువులైన ఝషంబులను నీడద్రుమపీడాకరంబులైన నీడజంబులను ననవద్య తృణ హింసా నృశంసంబులగు మృగంబులను మృగయా వినోదంబుల వధియించి మహీధవుండు కిల్బిషంబునఁ బొందండని చెప్పుదు రిప్పట్టునం బట్టువడిన నన్ను విడిచిపెట్టి ప్రాణంబు రక్షించిన యుపకారికిం బ్రియంబు సేయుదునన నేర్తునే యైనను నీకు నొక్క ప్రియంబు చేసెద నయాచితోపపన్నంబైన హితంబు పరిహరింపం బనిలేదు. నిఖిల భువననాయకుండవైన నీకు మముబోంట్లు సేయు నుపకారం బపేక్షణీయంబు గాకుండుట యెఱుంగుదు నైనను గృతజ్ఞతాగుణలేశంబు క్లేశపఱచుచున్నయది. సన్నంబు దొడ్డ యను విశేషంబు విచారింపక హస్తకల్ప జనాంతరంబయిన దైవంబు ప్రశస్తి విమర్శించి నాచేయు ప్రయోజనం బంగీకరింపుము.**

తా. ఓ రాజా! విను. ధర్మశాస్త్ర రహస్యముల నెఱిగినటువంటి పెద్దలు అల్పజంతు సమూహముల చంప నిష్టపడు పెద్ద చేపలను, తాము గూళ్ళుకట్టుకున్న చెట్లకే పీడ కలిగించు పక్షులను, అడ్డులేకుండా గడ్డికి హింసచేయు ఘాతుక మృగములను వేటయను వినోదముచే చంపి రాజు పాపమును పొందడని చెప్పుదురు. ఈ సమయమున పట్టువడిన నన్ను

విడిచిపెట్టి నా ప్రాణము కాపాడి, ఉపకారము చేసినట్టి నీకు ప్రియము చేయుదునని చెప్పలేను. అయినను నీకు ఒక్క ఉపకారము చేసెదను. యాచింపకుండ లభించినటువంటి మేలును విడిచిపెట్ట నవసరము లేదు. సమస్త లోకములకు అధిపతివయిన నీకు మము బోంట్లు చేసెడు మేలు కోరదగినది కాకుండుట యెఱుగుదు నైనను చేసిన మేలు మఱువకుండుట యను గుణలేశము బాధించుచున్నది. చిన్నదా పెద్దదాయను భేదము నాలోచింపక ఈ చేతితో సమానమైన మఱియొక చేయి కలవాడయినట్టి బ్రహ్మదేవునియొక్క ఉత్తమత్వమున నీకిచ్చుచున్నాడని తలంచి నా చేయు నుపకారమును అంగీకరింపుము. (బ్రహ్మదేవునిపైగల గౌరవముచేతనైనను అంగీకరింపుము)

9 **సీ. ప్రత్యర్థిరాజసార్థక నామధేయుండు**
**భూమీశ్వరుం డొప్పు భీముఁడనగ**
**నారాజు త్రిదివంబు నమరేంద్రుఁడును బోలెఁ**
**దేజంబున విదర్భ దేశ మేలు**
**దమనాహ్వయుండైన తపసి సద్వరమునఁ**
**గాంచె నాతఁడు గన్యకాలలామ**
**సర్వలోకాంగనా సౌభాగ్య గరిమంబు**
**దమియించు కతమున దాని నామ**
**తే. మభ్రభారతి దమయంతి యంచు నొడివెఁ**
**దద్గుణంబులు వర్ణింప ధరణినాథ!**
**యబ్జసూతికినైన శక్యంబుగాదు**
**పలుకుఁ బూఁబోఁడికైనను నలవిగాదు**

ప్రత్యర్థి రాజ = శత్రురాజుల విషయమై, సార్థక నామధేయుండు = సార్థకమైన పేరుగలిగినట్టి, భూమీశ్వరుండు = రాజు, భీముడు అనగన్ = భీముడు అనబడుచూ, ఒప్పున్ = ఒప్పుచుండును. ఆ రాజు = ఆ భీమరాజు, త్రిదివంబున్ = స్వర్గ లోకమును, అమరేంద్రుడును బోలెన్ = దేవేంద్రునివలె, తేజంబున = పరాక్రమముతో, విదర్భదేశము, ఏలున్ = పరిపాలించును, దమన ఆహ్వయుండు ఐన = దమనుడను పేరుగల, తపసి = తపస్వియొక్క, సద్వరమునన్ = మంచి వరముచేత, ఆతడు = ఆ రాజు, కన్యకాలలామన్ = కన్యకాతిలకమును, కాంచెన్ = పొందెను. సర్వలోక = సమస్త లోకములందలి, అంగనా = స్త్రీలయొక్క, సౌభాగ్య = సౌందర్యముయొక్క, గరిమంబున్ = శ్రేష్టత్వమును, దమియించు = అణచివేయు, కతమునన్ = కారణముచే, దాని నామము = ఆ కన్యకయొక్క పేరు, దమయంతి యంచున్ = దమయంతి యని, అభ్రభారతి = ఆకాశవాణి, నొడివెన్ = పలికెను. ధరణినాథ= రాజా!, తత్ గుణంబులు = ఆమె గుణములను, వర్ణింపన్ = వర్ణించుటకు, అబ్జసూతికిన్ ఐన = బ్రహ్మకైనను, శక్యంబు కాదు = సాధ్యము కాదు, పలుకు పూబోడికి ఐననున్ = సరస్వతీదేవికైనను, అలవి కాదు = వీలుకాదు. (అలంకారము – ఉపమ)

తా. శత్రురాజుల విషయమై సార్థకమైన పేరుగలిగినట్టి ఆ భీమమహారాజు పరాక్రమముతో ఇంద్రుడు స్వర్గమునువలె విదర్భదేశమును పరిపాలించుచుండెను. ఆ రాజు దమనుడను తపస్వి శుభ వరముచే ఒక కుమార్తెను పొందెను. సర్వలోక స్త్రీల సౌందర్యాతిశయమును జయించు కారణమున ఆకాశవాణి ఆ కన్యకకు దమయంతి అని పేరిడెను. ఓ రాజా! ఆమె గుణములను వర్ణించుటకు బ్రహ్మకును సాధ్యము కాదు. సరస్వతీదేవికిని వీలుకాదు.

10 **తే. విదుషి యా యింతి తలఁదాల్చు వెంద్రుకలకు**
**నహహ! యెబ్బంగి సాటి సేయంగ వచ్చుఁ**
**బశువుచేతఁ బురస్కృతిఁ బడయ లేక**
**చాపలంబున వర్తించు చామరములు.**

విదుషి = విద్వాంసురాలయిన, ఆ యింతి = ఆ దమయంతి, తలన్ తాల్చు = తలను ధరించు, వెంద్రుకలకు, పశువు చేత = చమరీ మృగముచేత, పురస్కృతిన్ = ముందిడుకొను గౌరవమును, పడయలేక = పొందలేక, చాపలంబునన్ = చాంచల్యముచే, వర్తించు = ప్రవర్తించు, చామరములు = చమరీమృగముయొక్క తోకలు (సవరములు), అహహ = ఆహా, ఎబ్బంగి = ఏరీతిగా, సాటి సేయంగ వచ్చున్ = సామ్యమును చేయవచ్చును? (అలంకారము – కావ్యలింగము)

తా. తోకలుగా ధరింపబడినవై పశువుచేత కూడా ముందిడుకొను గౌరవమును పొందలేక చపలత్వమున ప్రవర్తించు చమరీమృగముయొక్క తోకలు (సవరములు) విద్వాంసురాలయిన ఆ దమయంతి తలను ధరించు వెంద్రుకలకు ఏరీతిగా సాటి అని చెప్పవచ్చును? సాటి కాదు అని చెప్పుట.

11 **క. ఖుర కండూయన మిషమున**
**హరిణంబులు సాంత్వనంబు నాపాదించున్**

**దరుణి విలోచనములచేఁ**
**బరిభూతములైన తమ చపల దృష్టులకున్**

తరుణి = ఆ దమయంతియొక్క, విలోచనములచేన్ = నేత్రములచే, పరిభూతములు ఐన = తిరస్కరింపబడినట్టి, తమ = తమయొక్క, చపల = చంచలమైన, దృష్టులకున్ = చూపులకు, ఖుర = డెక్కలతో, కండూయన = గోకుకొనుటయనెడి, మిషమున = వంకతో, హరిణంబులు = లేళ్ళు, సాంత్వనంబున్ = అనునయమును, ఆపాదించున్ = చేయును.

తా. ఆ దమయంతి నేత్రములచే పరాభవింపబడిన తమయొక్క చంచలమైన నేత్రములను లేళ్ళు డెక్కలతో గోకుకొనుట యనెడి వంకతో ఓదార్చుకొనుచుండును. (అలంకారము – అపహ్నుతి)

12 **క. లలన కనుదోయి ముందట**
**నలవడ నలినంబు మలినమయ్యెను హరిణం**
**బులు పూరిమేయఁ దొణఁగెను**
**గలితద్యుతి ఖంజమయ్యె ఖంజనకులమున్**

లలన = ఆ దమయంతియొక్క, కనుదోయి ముందటన్ = కన్నుల జంట ముందు, అలవడన్ = ఏర్పడగా (ఉండగా), నలినంబు = పద్మము, మలినమయ్యెను = కాంతిహీనమై దూషితమయ్యెను. హరిణంబులు = లేళ్ళు, పూరి = గడ్డిని, మేయన్ = తినుటకు, తొణగెను = మొదలిడెను. ఖంజనకులమున్ = కాటుకపిట్టలును, కలిత = ఒప్పుచున్న, ద్యుతి = కాంతియొక్క, ఖంజము అయ్యె = నాశముకలవయ్యెను. (అలంకారము – వ్యతిరేకము)

తా. ఆ దమయంతియొక్క నేత్రముల ముందర పద్మములు కాంతిహీనములై దూషితములయ్యెను. లేళ్ళు ఓటమి నంగీకరించి గడ్డిని తినుటకు మొదలిడెను. కాటుకపిట్టలును తమ కాంతిని కోల్పడినవయ్యెను.

13 **తే. రాజబింబంబునందు సారము హరించి**
**చేసినాఁడు విధాత యా చెలువమోము**
**నడిమి రంధ్రంబునందుఁ గానంగవచ్చు**
**ఖనిక నీలిమ యది నిదర్శనము గాదె**

విధాత = బ్రహ్మ, రాజబింబంబునందు = చంద్రబింబమునందలి, సారమున్ = నిగ్గును, హరించి = తీసికొని, ఆ చెలువ మోము = ఆ దమయంతియొక్క ముఖమును, చేసినాడు, నడిమి రంధ్రంబునందున్ = మధ్యనున్న కన్నమునందు, కానంగ వచ్చు = కనబడుచున్న, ఖనిక నీలిమ = గోతియొక్క నల్లదనము, అది = ఆ నల్లదనము, నిదర్శనము కాదె = సాక్ష్యమేకదా!

తా. బ్రహ్మ చంద్రబింబమునందలి సారమును తీసుకొని ఆ దమయంతియొక్క ముఖమును చేసియున్నాడు. ఆ చంద్ర బింబము మధ్య కనబడుచున్న గోతియొక్క నల్లదనము దానికి సాక్ష్యమేకదా! (అలంకారము – కావ్యలింగము, ఉత్ప్రేక్ష)

14 **క. ప్రవిలేపన పాండురమును**
**నవ లాంఛన గోమయాంచనమునగు రాకా**
**ధవళాంశుమండలము విధి**
**నివాళి సేయును లతాంగి నెమ్మొగమునకున్**

విధి = బ్రహ్మ, లతాంగి నెమ్మొగమునకున్ = దమయంతియొక్క అందమైన ముఖమునకు, ప్రవిలేపన = పిష్టోదకమువలె, పాండురమును = తెల్లనిదియు, నవ = నూతనమైన, లాంఛన = కళంకమనెడు, గోమయాంచనమును అగు = గోమయ పూజ కలిగినట్టి, రాకా = పున్నమినాటి, ధవళ అంశుమండలము = చంద్రబింబమును, నివాళి చేయును = ఆరతి ఇచ్చును.

తా. పిండినీటివలె తెల్లనిదియు, కళంకమనెడి గోమయపూజ కలిగినదియునగు పున్నమినాటి చంద్రబింబమును బ్రహ్మ దమయంతీ ముఖమునకు నివాళి ఇచ్చును. (అలంకారము – రూపకము)

(చంద్రుని తెల్లదనమను సున్నపు పూతయు, కళంకమను పేడముద్దయు, కిరణములనెడు దీపశిఖయుగల చంద్రబింబ మనెడి మూకుడుతో దమయంతికి బ్రహ్మ దిష్టి తీసెను. అనగా పున్నమినాటి చంద్రబింబము ఆమె ముఖమును పోలలేదు)

15 **సీ. జగము లొక్కుమ్మడి సాధింప నెత్తిన**
**రతిమన్మథుల విండ్లు రమణి బొమలు**
**కాంతి నిర్ఝర మీఁదు కామ యౌవనముల**
**కుంభ ప్లవము లింతి కుచయుగంబు**
**నడు మింతయని కేలఁ దొడికి పట్టిన ధాత**
**యంగుళి రేఖ లబ్జాస్య వళులు**
**యువమనో మృగరాజిఁ దవిలింపఁ దీర్చిన**
**మదన వాగుర లిందువదన కురులు**

**తే. బాల్య తారుణ్య సీమా విభాగమునకు**
**నజుఁడు వ్రాసిన రేఖ తన్వంగి యారు**
**భాను వరమునఁ బడసిన పంకజముల**
**యపర జన్మంబు పూఁబోఁడి యడుగు లధిప**

అధిప = ఓ రాజా!, రమణి బొమలు = దమయంతి కనుబొమలు, జగములు = లోకములను, ఒక్క ఉమ్మడి = ఒకేమారు, సాధింపన్ = జయించుటకు, ఎత్తిన = ఎక్కుపెట్టిన, రతి మన్మథుల, విండ్లు = ధనస్సులు. ఇంతి కుచయుగంబు = దమయంతి స్తనములు, కాంతి నిర్ఝురము = కాంతియనెడు నదిని, ఈదు = ఈదునట్టి, కామ యౌవనముల = కామ, యౌవనములయొక్క కుంభ ప్లవములు = కడవలవంటి పడవలు, అబ్జాస్య = పద్మమువంటి ముఖముకల దమయంతియొక్క, వళులు = కడుపుమీది ముడతలు, నడుము, ఇంత అని = ఇంతేనని, ధాత = బ్రహ్మ, కేలన్ = చేతితో, తొడికి పట్టిన = ఒడిసి పట్టుకొనిన, అంగుళి రేఖలు = వేలిముద్రలు. ఇందువదన = చంద్రునివంటి ముఖముకల దమయంతియొక్క, కురులు = కేశములు, యువమనోమృగరాజిన్ = యువకుల మనస్సులనెడి లేళ్ళ సమూహమును, తవిలింపన్ = చిక్కించుకొనుటకు, తీర్చిన = పన్నిన, మదన వాగురలు = మన్మథుని వలలు, తన్వంగి = సన్నని శరీరముకల దమయంతియొక్క, ఆరు = నూగారు, బాల్య = బాల్యముయొక్కయు, తారుణ్య = యౌవనముయొక్కయు, సీమా విభాగమునకు = హద్దును ఏర్పాటుచేయుటకు, అజుడు = బ్రహ్మ, వ్రాసిన రేఖ = వ్రాసిన గీత. పూబోడి = పూవువలె సుకుమారియైన దమయంతియొక్క, అడుగులు = పాదములు, భానువరమునన్ = సూర్యుని వరముచే, పడసిన = పొందిన, పంకజముల = పద్మముల, అపర జన్మంబు = మరియొక పుట్టుక.

తా. ఓ రాజా! దమయంతి కనుబొమలు ఒకేసారి లోకాలన్నింటిని జయించడానికి రతిమన్మథులు ఎక్కుపెట్టిన విండ్లు, ఆమె స్తనములు కాంతి అనే నదిని ఈదుతున్నట్టి కామ, యౌవనముల కడవలవంటి పడవలు, ఆమె కడుపుమీది ముడతలు నడుమింతేనని బ్రహ్మ చేతితో ఒడిసిపట్టుకొనగా పడిన వేలిముద్రలు. ఆమె కేశములు యువకుల మనస్సులనెడి లేళ్ళ గుంపును చిక్కించుకోడానికి మన్మథుడు పన్నిన వలలు, ఆమె నూగారు బాల్య యౌవనముల సరిహద్దును ఏర్పాటు చేయుటకు బ్రహ్మ వ్రాసిన గీత, ఆమె పాదములు సూర్యుని వరముచే పద్మములు పొందిన అపరజన్మము. (అలంకారము – ఉత్ప్రేక్ష)

**16** **క. జలదుర్గస్థ మృణాళా**
**వలిజిత్కమనీయ బాహు వల్లరి యగు నా**
**జలజానన నీకుం దగుఁ**
**బలుకులు వేయేల యధిక బల శౌర్యనిధీ!**

అధిక బలశౌర్యనిధీ = గొప్ప బలము, పరాక్రమములకు నిధియైనవాడా!, పలుకులు = మాటలు, వేయేల = పెక్కు ఎందులకు?, జలదుర్గస్థ = జలదుర్గమందున్న, మృణాళా = తామరతూండ్లయొక్క, ఆవలి = సమూహమును, జిత్ = జయించినట్టి, కమనీయ = మనోహరమైన, బాహువల్లరి అగు = లతలవంటి బాహువులుకలదైన దమయంతి, ఆ జలజానన = ఆ పద్మముఖి, నీకున్ = నీకే, తగున్ = తగినది.(అలంకారము – కావ్యలింగము)

తా. అధిక బల,శౌర్యములకునిధివైన ఓ రాజా! పెక్కు మాటలెందులకు? జలదుర్గమందున్న తామరతూండ్ల సమూహమును జయించినట్టి మనోహరమైన బాహులతలు కలిగిన ఆ పద్మముఖి నీకే తగినది.

**17** **క. హాటక కలశంబులకును**
**బాటియగు వధూటి మెఱుగుఁ బాలిండ్లు నిరా**
**ఘాట స్ఫురణ ప్రభ యను**
**నేటికిఁ జక్కవల కవవహి విరాజిల్లెన్**

వధూటి = దమయంతియొక్క, మెఱుగు పాలిండ్లు = కాంతివంతములగు స్తనములు, హాటక కలశంబులకును = బంగారు కడవలకు, పాటి అగు = సరిపడవచ్చును. నిరాఘాట = అడ్డులేని, స్ఫురణ = నిండారిన, ప్రభ అను = కాంతి అనునట్టి, ఏటికిన్ = నదికి, చక్కవల కవవహి = చక్రవాకపక్షులజంటవలె, విరాజిల్లెన్ = ఒప్పుచుండెను.(ఉపమ)

తా. దమయంతి కాంతివంతములగు స్తనములు బంగారు కడవలకు సరిపడవచ్చును. అడ్డులేని, నిండారిన కాంతి యను నదికి చక్రవాకపక్షుల శోభవలె ఒప్పుచుండెను.

**18** **తే. వలుఁదయును వట్రువయుఁ గాఁగ నలినభవుఁడు**
**భీమభూపాలపుత్త్రికిఁ బిఱుఁ దొనర్చె**
**నర్కరథ శిల్పశిక్షఁ బుష్పాస్త్రు తేరు**
**నేక చక్రంబు సేయ నూహించి యొక్కొ**

నలినభవుడు = బ్రహ్మ, అర్క రథ = సూర్యునియొక్క రథమును, శిల్ప = చెక్కుటయందలి, శిక్షన్ = నేర్పుచే, పుష్పాస్త్రు = మన్మథునియొక్క, తేరు= రథమును, ఏకచక్రంబు = ఒకే చక్రముకలదానినిగా, చేయన్ = తయారుచేయుటకు, ఊహించి

ఒక్కొ = ఊహించి కాబోలు, భీమభూపాల పుత్త్రికిన్ = దమయంతికి, పిఱుదు, వలుదయును = పెద్దదియును, వట్రువయున్ = గుంద్రనిదియును, కాగ = అగునట్లుగా, ఒనర్చెన్ = చేసెను.(ఉత్ప్రేక్ష)

తా. బ్రహ్మ సూర్యుని రథమును చెక్కడంవలన కలిగిన నేర్పుతో మన్మథుని రథమును ఒకే చక్రముకలదానినిగా తయారుచేయడానికి ఊహించినాడేమో అందుకని దమయంతికి పిఱుదును పెద్దదిగాను, గుద్రనిదిగాను చేసినాడు.

**19 మ. వనజాతేక్షణ యూరుయుగ్మమున లావణ్యంబునం గేళికా**
**నన సంక్రందన పట్టణ ప్రకట జన్మస్థానలన్ రంభలన్**
**ధనదాపత్య తపఃఫలస్తనుల నత్యంతాభిరామాంగులన్**
**మనుజాధీశ యధఃకరించుఁ బొగడన్ మాబోంట్లకున్ శక్యమే**

మనుజ అధీశ = ఓ నలమహారాజా!, వనజాత ఈక్షణ = పద్మములవంటి నేత్రములుకల దమయంతి, ఊరు యుగ్మమున = రెండు తొడలయందలి, లావణ్యంబునన్ = సౌందర్యముచేత, సంక్రందన పట్టణ = ఇంద్రుని నగరమగు అమరావతి, కేళికావన = ఉద్యానవనములందలి, ప్రకట = ప్రసిద్ధమైన, జన్మస్థానలన్ = జన్మభూములుగాగల, రంభలన్ = అరటిచెట్లను; ధనద అపత్య = కుబేరుని కుమారుడైన నలకూబరునియొక్క, తపఃఫల = తపస్సునకు ఫలితమైన, స్తనులన్ = స్తనములుకల, అత్యంత = మిక్కిలి, అభిరామ = మనోహరమైన, అంగులన్ = అవయవములుకల స్త్రీలను, అధఃకరించున్ = తిరస్కరించును. మాబోంట్లకున్ = మావంటివారికి, పొగడన్, శక్యమే = వీలగునా?(యథాసంఖ్యము)

తా. ఓ నలమహారాజా! పద్మనేత్రియగు దమయంతి ఊరువుల జంట లావణ్యముచే అమరావతియందలి ఉద్యాన వనములందు ప్రసిద్ధమై జన్మభూములుగాకల అరటిచెట్లను; నలకూబరుని తపోఫలములైన స్తనములుకల అత్యంత మనోహరమైన అవయవసౌందర్యముకల రంభాదులను తిరస్కరించును. ఇక మావంటివారికి ఆమెను పొగడ శక్యమా?

**20 మ. మృదురీతిం బ్రతివాసరంబు గమికర్మీభూత నానా నదీ**
**నద కాంతార పురీ శిలోచ్చయుఁడనై నైకాద్భుత శ్రీ జిత**
**త్రిదివంబైన విదర్భ దేశమున నారీరత్నముం గాంచితిన్**
**సదసత్సంశయ గోచరోదరి శరత్సంపూర్ణ చంద్రాననన్**

ప్రతివాసరంబు = ప్రతిదినంబును, మృదురీతిన్ = తగినరీతిగా, గమికర్మీభూత = గమనవిషయములైయున్న, నానా = పలువిధములైన, నదీ = నదులు, నద = యేరులు, కాంతార = అరణ్యములు, పురీ = నగరములు, శిలోచ్చయుడనై = పర్వతములు కలవాడనై, నైక = అనేకములైన, అద్భుత = అద్భుతములైన, శ్రీ = సంపదలచేత, జిత = జయింపబడిన, త్రిదివంబు ఐన = స్వర్గపట్టణమైన, విదర్భ దేశమున, సత్ అసత్ = ఉన్నదా లేదా యనెడి, సంశయ = సందేహమును, గోచర = కల్పించెడి, ఉదరిన్ = కడుపుకలదానిని, శరత్ = శరత్కాలమందలి, సంపూర్ణ = నిండు, చంద్రాననన్ = చంద్రముఖిని, నారీరత్నమున్ = స్త్రీరత్నమును, కాంచితిన్ = చూచితిని.(ఉపమాలంకారం)

తా. ప్రతిదినము అనేక నదులు, యేరులు, అడవులు, నగరములు, పర్వతములు తగినరీతిగా తిరుగుచున్న ప్రదేశములు కాగా స్వర్గముకంటె అద్భుత సంపదలచే జయింపబడిన విదర్భదేశమున ఉందా లేదా అని సందేహమును కల్పించెడి నడుముకలదానిని, శరత్కాలమందలి నిండు చంద్రునివంటి ముఖముకల స్త్రీరత్నమును చూచితిని.

**21 మ. కమలేందీవరషండ మండిత లసత్కాసార సేవారతిన్**
**గమికర్మీకృత నైకనీవృతుఁడనై కంటిన్ విదర్భంబునన్**
**రమణిం బల్లవపాణిఁ బద్మనయనన్ రాకేందుబింబాననన్**
**సమపీనస్తని నస్తినాస్తి విచికిత్సా హేతు శాతోదరిన్**

కమల = పద్మములయొక్క, ఇందీవర = నల్లకలువలయొక్క, షండ = సమూహముచే, మండిత = అలంకరింపబడిన, లసత్ = ప్రకాశించుచున్న, కాసార = చెఱువులను, సేవారతిన్ = సేవించుటయందలి ఆసక్తితో, గమికర్మీకృత = గమనవిషయములైయున్న, నైక = పలువిధములైన, నీవృతుడనై = ప్రదేశములు కలవాడనై, విదర్భంబునన్ = విదర్భ దేశమున, పల్లవపాణిన్ = చిగురువంటి చేతులుకలదానిని, పద్మనయనన్ = పద్మములవంటి నేత్రములుకలదానిని, రాకేందుబింబాననన్ = పున్నమిచంద్రునివంటి ముఖముకలదానిని, సమపీనస్తనిన్ = సమానముగా బలిసిన స్తనములు కలదానిని, అస్తి నాస్తి = ఉందా లేదా యనెడి, విచికిత్సా = సందేహమునకు, హేతు = కారణమైన, శాత ఉదరిన్ = కృశించిన కడుపుకలదానిని, రమణిన్ = దమయంతిని, కంటిన్ = చూచితిని.

తా. పద్మములు, నల్లకలువలతో శోభాయమానమైన చెఱువులను ఈదాలనే కోరికతో వెళ్లడానికి వీలైన పలు దేశములు కలవాడనై, విదర్భదేశమున చిగురువంటిచేతులుకలదానిని, పద్మములవంటి నేత్రములుకలదానిని, పున్నమి చంద్రునివంటి ముఖము కలదానిని, సమమై బలిసిన స్తనములు కలదానిని, ఉందా లేదాయను సందేహమునకు కారణమైన నడుము కలదానిని దమయంతిని చూచితిని.

**22** **వ. కాంచి విబుధ పుర పురంధ్రీ రామణీయకం బీ రమణీరత్నంబు ముందట నిస్సారంబు పొమ్మనియును, విధాత చిత్తంబున నీ మత్తకాశినికిం దగిన యుత్తముండగు వరుం డెవ్వండు గలిగియున్నవాఁడొకో యనియును జింతించుచుఁ గొంత తడవు నివ్వెఱపడి చూచుచుండితి. అనంతరంబ అనురూప లావణ్య రేఖా సంపన్నుండైన పిన్నవయసు రాకొమరుని నవలోకింతునని లోకాలోక పర్యంతంబుగా నీ లోకంబు విశ్వంబునుం బరిభ్రమించి యుర్వీశ్వర కుమారకులనెల్లం బూర్వ పక్షంబు గావించుచు వచ్చివచ్చి యిచ్చోట నిన్నుం గనుంగొని సిద్ధాంతీకరించితి. సాదృశ్య నిబంధనంబై పొడమిన సంస్కార బోధంబునఁ జిరకాలావలోకితయగు నబ్బాల యిప్పుడు నామనంబునం బొడఁ గానవచ్చుచున్నయది.**

తా. చూచి అమరావతీ అంతఃపుర స్త్రీల సౌందర్యము ఈ స్త్రీరత్నము ముందు సారహీనము పొమ్మనియును, బ్రహ్మ మనసునందు ఈ కాంతకు తగిన ఉత్తముడైన భర్త ఎవడు కలిగియున్నాడో అనియును ఆలోచించుచు కొంచెముసేపు ఆశ్చర్యపడి చూచుచునే యుంటిని. ఆ తరువాత తగిన రూపు రేఖా విలాసుడైన చిన్న వయసువాడైన రాజకుమారుని చూసెదనని చక్రవాళ పర్వతమువరకు ఈ లోకము సమస్తమును తిరిగి రాజకుమారులనందరను పనికిరాని వారినిగా తీసివేయుచు వచ్చివచ్చి ఇక్కడ నిన్ను చూచి నిశ్చయమునకు వచ్చితిని. మీ ఒండొరుల సమత్వము కారణమున కలిగిన సంస్కార జ్ఞానముచే చాలకాలము క్రిందట చూడబడిన ఆ కన్య ఇప్పుడు నా మనసునందు తలపునకు వచ్చుచున్నది.

**23** **క. దమయంతీ కిలికించిత**
**మమృతాంశు కులావతంస యలరించు నినున్**
**విమలతర తారహారము**
**రమణీ రమణీయ కుచభరంబునుబోలెన్**

అమృతాంశు కులావతంస = చంద్రవంశకులాభరణమా!, దమయంతీ = దమయంతియొక్క, కిలికించితము = శృంగార భావచేష్ట, విమలతర = స్వచ్ఛమైన, తారహారము = ముత్యాలహారము, రమణీ = స్త్రీయొక్క, రమణీయ = సుందరమైన, కుచభరంబునుబోలెన్ = స్తనములయొక్క అతిశయమువలెనే, నినున్ = నిన్ను, అలరించున్ = సంతోషపరచును.

తా. చంద్రవంశకులాభరణమా! దమయంతియొక్క శృంగారచేష్ట స్వచ్ఛమైన ముత్యాలహారము స్త్రీయొక్క అందమైన స్తనములకిచ్చు అతిశయమువలెనే నిన్ను సంతోషపరచును. (దృష్టాంతము)

**24** **తే. సౌరభము లేనియట్టి పుష్పంబువోలె**
**గండుఁ గోయిల వెలియైన కానవోలె**
**నధిప! దమయంతితోడి సఖ్యంబు లేని**
**నీదు సౌందర్య విభవంబు నిష్ఫలంబు**

అధిప = రాజా!, దమయంతి తోడి సఖ్యంబు, లేని, నీదు = నీయొక్క, సౌందర్య విభవంబు = సౌందర్య సంపద, సౌరభము లేనియట్టి = పరిమళము లేనటువంటి, పుష్పంబువోలె = పూవువలె, గండుకోయిల = మగ కోకిల, వెలియైన = దూరమైన, కానవోలె = అడవివలె, నిష్ఫలంబు = వ్యర్థమైనది. (అలంకారము – వినోక్తి)

తా. ఓ నలమహారాజా! దమయంతితో స్నేహము లేని నీ సౌందర్య సంపద పరిమళము లేని పూవువలె, కోకిలకూత లేని అడవివలె వ్యర్థమైనది.

**25** **వ. కావున నిఖిల వైమానిక నికాయ కామ్యమానయైన నమ్మానవతికిం నిన్నుం గూర్ప నాకు నేర్పు గలదు. అక్కొమ్మ నెమ్మనంబున నిన్నుం దక్కఁ దక్కొరుం బరిగ్రహింపకుండునట్లుగా భవద్గుణంబులు ప్రశంసించెద. నన్నుం బనిగొమ్ము. లెమ్ము. కార్యంబునన యార్యులు నిజప్రయోజనంబు నెఱిఁగింతురు గాని మాటలం బ్రకటింపరని పరిస్ఫుటంబుగాఁ బలికిన**

తా. కాబట్టి సమస్త దేవతా సమూహములచే కోరబడుచున్న ఆ మానవతికి నిన్ను కూర్చుటకు నాకు నేర్పు కలదు. ఆ దమయంతి మనసులో నిన్ను తప్ప వేరొకరని చేపట్టకుండునట్లుగా నీ గుణములను కీర్తించెదను. లేచి నన్ను పంపుము. కార్యముచేతనే పెద్దలు తమ ప్రయోజనమును తెలియపరచెదరు. అంతేకాని మాటలతో ప్రకటింపరని స్పష్టముగా పలికిన

**26** **తే. ఆ ద్విజాధిపువలన సంప్రాప్తమయిన**
**వాక్సుధాధారఁ గ్రోలి భూవల్లభుండు**
**లలితలీలఁ దదుద్గార లవము వోలె**
**మొలక నవ్వు వహించెఁ గెమ్మోవి మీఁద**

ఆ ద్విజాధిపు వలనన్ = ఆ హంస శ్రేష్ఠమువలన, సంప్రాప్తము అయిన = లభించినదైన, వాక్సుధాధారన్ = మాటల అమృతరసమును, గ్రోలి = త్రాగి, భూవల్లభుండు = రాజు, లలిత లీలన్ = సుందర విలాసముచే, కెమ్మోవి మీదన్ = ఎఱ్ఱని పెదవిమీద, మొలకనవ్వు = చిఱునవ్వు, తత్ = ఆ త్రాగిన అమృతరసమును, ఉద్గార = కక్కుటవలన బయల్పడిన, లవము వోలె = లేశమువలెనే, వహించెన్ = ప్రకాశించెను. (అలంకారము –ఉత్ప్రేక్ష)

తా. ఆ హంసశ్రేష్ఠమువలన లభించిన మాటలనెడు అమృతమును త్రాగి రాజు సుందర విలాసముచే ఎఱ్ఱని పెదవి

మీద ఆ త్రాగిన అమృతము కక్కుటవలన బయల్పడిన లేశమువలె చిరునవ్వు ప్రకాశించెను.

27 **వ. ఇవ్విధంబున మందస్మిత సుందరవదనారవిందుండై కరారవిందంబునం పతంగ పుంగవు నంగంబు నివురుచు మృదుభాషణంబుల నిట్లనియె.**

తా. ఈ రీతిగా చిరునవ్వుచే సొగసైన ముఖపద్మము కలవాడై పద్మమువంటి చేతితో ఆ హంస శ్రేష్ఠుని శరీరమును నివురుచు రాజు మృదు వాక్యముల నిట్లు పలికెను.

28 **సీ. అండజాధీశ! నీ యాకార రేఖతోఁ**
**దులఁదూఁగలేవు వస్తువులు జగతి**
**నీడోద్భవశ్రేష్ఠ! నీదు సౌశీల్యంబు**
**పలుకుల కందంగఁ గొలఁది గాదు**
**పతగపుంగవ! నీ సుభాషితంబుల యట్ల**
**యవయవంబులు సువర్ణాత్మకములు**
**పక్షివంశవతంస! పక్షపాతము నీకు**
**గతియంద కాదు సద్వితతియందు**
**తే. నధిక తాప పరీతాత్ముఁడైన నాకు**
**నెట్లు వచ్చితి చలిగాడ్పు నట్లు నీవు**
**పూర్వజన్మ మహా తపఃస్ఫురణఁ జేసి**
**నీదు సన్నిధి సమకూరె నిధియుఁ బోలె**

అండజాధీశ = ఓ పక్షిరాజా!, (అండజము = గ్రుడ్డునుండి పుట్టినది), జగతి = లోకమందు, నీ యాకార రేఖతోన్ = నీ రూపముతో, వస్తువులు = ఏ వస్తువులును, తులతూగలేవు = సాటిరావు, నీడోద్భవశ్రేష్ఠ = ఓ పక్షిరాజా! (నీడోద్భవ = గూటిలో పుట్టినది), నీదు సౌశీల్యంబు = నీ మంచి నడవడి, పలుకులకున్ = మాటలతో, అందంగన్ కొలది కాదు = అందుకొనశక్యముకాదు. పతగపుంగవ = ఓ పక్షిశ్రేష్ఠా!, నీ సుభాషితంబులయట్ల = నీ మంచి మాటలవలెనే, అవయవంబులు = నీ దేహ భాగములును, సువర్ణాత్మకములు = స్వర్ణ మయములు. పక్షివంశవతంస = పక్షికులశ్రేష్ఠమా! నీకు, పక్షపాతము = ఱెక్కలు వాలుట, గతియంద కాదు = నడచుటయందే కాదు, సద్వితతియందున్ = సజ్జనులయందును, అధిక = మిక్కిలి, తాప పరీత ఆత్ముడైన = తాపముచే ఆవరింపబడిన మనస్సుకలవాడనైన, నాకు, చలిగాడ్పునట్లు = చల్లని గాలివలెనే, నీవు, ఎట్లు వచ్చితి = ఎలా వచ్చావు?, పూర్వజన్మ, మహా = గొప్పదైన, తపఃస్ఫురణన్ చేసి = తపోమహిమనుచేసి, నిధియున్ పోలె = నిధివలెనే, నీదు సన్నిధి = నీ సామీప్యము. సమకూరె = లభించెను.

తా. ఓ పక్షిరాజా! లోకంలోని ఏ వస్తువులును నీరూపంతో సాటిరావు. ఓ పక్షిశ్రేష్ఠమా! నీ మంచి నడవడి మాటలతో కొలవశక్యముకానిది, ఓ పక్షిరాజా! నీ మంచి మాటలవలెనే నీ దేహభాగములును స్వర్ణ మయములు. పక్షికులశ్రేష్ఠమా! నీకు ఱెక్కలు ముడుచుకొనుట నడచుటయందేకాదు సత్పురుషులయందును కూడా. మిక్కిలి తాపమునకు గురియైన నా మనస్సునకు చల్లని గాలివలె నీవు ఎలా వచ్చితివి? పూర్వజన్మలో చేసిన గొప్ప తపోమహిమచే నిధివలెనే నీ సన్నిధి లభించినది.

29 **మ. త్రిజగన్మోహ మహౌషధీ లతిక ధాత్రీపాల కన్యావరో**
**ధ జనోత్తంస మణి ప్రరోహమగు నా తన్వంగి వే రీతులం**
**బ్రజలెల్లన్ వినుతింప విందు మొదలం పక్షీంద్ర యూహింప న**
**క్కజ మీ విప్పుడు సంస్తుతింప నది సాక్షాత్కారమున్ బొందెడున్**

త్రిజగత్ = మూడు లోకములను, మోహ = మోహింపచేసెడి, మహత్ = గొప్పదైన, ఓషధీ లతిక = ఔషధ లతవంటిదియు, ధాత్రీపాల = రాజులయొక్క, కన్యా అవరోధజన = కన్యాంతఃపుర స్త్రీలయొక్క, ఉత్తంస = శిరోభూషణమువంటిదియు, మణి ప్రరోహము అగు = రతనంపు మొలకయగు, ఆ తన్వంగిన్ = ఆ దమయంతిని, ప్రజలు ఎల్లన్ = లోకులందరును, వే రీతులన్ = వేయి విధముల, వినుతింప = స్తుతింపగా, మొదలన్ = ఇంతకు ముందే, విందు = వినుచుందును. పక్షీంద్ర = ఓ పక్షిశ్రేష్ఠమా!, ఊహింపన్ = తలంచుటకు, అక్కజము = ఆశ్చర్యము, ఈవు = నీవు, ఇప్పుడు, సంస్తుతింపన్ = నుతించగా, అది = ఆ స్తుతి, సాక్షాత్కారమున్ పొందెడున్ = ప్రత్యక్షమును పొందుచున్నది. (అలంకారము – భావికము)

తా. ముల్లోకములను మోహింపచేసెడి గొప్ప ఔషధ తీగవంటిదియును, రాజుల కన్యాతఃపుర స్త్రీల శిరోభూషణము వంటిదియును, రత్నంపు మొలకయగు ఆ దమయంతిని ప్రజలందరును వేయివిధములుగా స్తుతించుచుండగా ఇంతకు పూర్వమే వినియుంటిని. ఓ పక్షిరాజా! ఆలోచింపగా ఆశ్చర్యమగుచున్నది. నీవు ఇప్పుడు ఆమెను నుతించగా ఆ ప్రజల స్తుతి ప్రత్యక్షమగుచున్నది.

30 తే. సహృదయుండును హృదయంబు సమ్మతింప
నరయువారికి నఖిలంబు నకలుషంబు
చెంతనైనను సూక్ష్మ మీక్షింపఁ జాల
దాన నాలంక్రియామాత్ర మక్షియుగము

సహృదయుండును = మంచి మనసుకలవారును, హృదయంబు = మనసు, సమ్మతింపన్ = అంగీకరించగా, అరయు వారికి = చూచువారికిని, అఖిలంబు = సమస్తమును, అకలుషంబు = దోషరహితమైన, అక్షియుగము = కనుల జంట, చెంతను ఐనను = చెంతనే యున్ననూ, సూక్ష్మము = నలుసును, ఈక్షింపన్ = కనుగొనుటకు, చాలదు = సమర్ధము కాదు, ఆనన = ముఖమునకు, అలంక్రియా మాత్రము = అలంకారము మాత్రమే.

తా. మంచి మనసుకలవారును, మనసంగీకరించగా చూచువారికిని సమస్తమును దోషరహితమైన రెండు కన్నులు తమవే యైనను అతిచిన్న వస్తువును కనుగొనుటకు సరిపడకున్నవి. అపుడవి ముఖమునకు అలంకారము మాత్రమే.

31 ఉ. తియ్యని తేనెవోలె సుదతీతిలకంబు గుణంబు లుత్సవం
బయ్యె శ్రుతిద్వయంబునకు నాదిమకాలమునందు నిప్డు దా
తొయ్యలి నీవు సమ్మదముతో వినుతింపఁగ మన్మథాగ్నికిన్
ధాయ్యయుఁ బోలెనయ్య మది ధైర్యము పల్లటిలెన్ ఖగేశ్వరా!

ఖగ ఈశ్వరా = ఓ పక్షిరాజా!, ఆదిమకాలమునందు = ఇంతకుముందు, సుదతీ తిలకంబు గుణంబులు = స్త్రీరత్నమును గూర్చిన గుణములు, తియ్యని తేనెవోలె = తియ్యనైన తేనెలాగ, శ్రుతి ద్వయంబునకున్ = చెవుల జంటకు, ఉత్సవంబు అయ్యె = సంతోషమును కలిగించినవి. ఇప్పుడు, నీవు, సమ్మదముతో = సంతోషముగా, ఆ తొయ్యలిన్ = ఆ దమయంతిని, వినుతింపగ = స్తుతించుచుండగా, మన్మథాగ్నికిన్ = కామపరవశమునకు, ధాయ్యయున్ పోలెనయ్యా = అగ్నిని ప్రజ్వలింపచేయు ఋక్ మంత్రమే అయినదిసుమా!, మది ధైర్యము =మనసులోని ధైర్యము, పల్లటిలెన్ = చలించిపోయినది.

తా. ఓ పక్షిరాజా! ఇంతకుముందు ఆ స్త్రీరత్నమును గూర్చిన గుణములు తియ్యని తేనెలాగ చెవులకి సంతోషమును కలిగించుచుండెడివి. ఇపుడు నీవు సంతోషంతో ఆ స్త్రీని వర్ణిస్తూంటే కామాగ్నికి అగ్నిని ప్రజ్వలింపచేయు ఋక్ మంత్రమే అవుతోందిసుమా! మనసులోని ధైర్యము చలించిపోతోంది. (అలంకారము – కావ్యలింగము)

32 శా. కాలాంతఃపుర కామినీ కుచతటీ కస్తూరికా సౌరభ
శ్రీ లుంటాకము చందనాచల తట శ్రీఖండ సంవేష్టిత
వ్యాల స్ఫార ఫణా కఠోర విష నిశ్వాసాగ్ని పాణింధమం
బేలా? నాపయి దక్షిణానిలము పక్షీ! చేయు దాక్షిణ్యమున్

పక్షీ, కాల = యమునియొక్క, అంతఃపుర కామినీ = అంతఃపుర స్త్రీలయొక్క, కుచతటీ = స్తన ప్రదేశములందున్న, కస్తూరికా = కస్తూరియొక్క, సౌరభ శ్రీ = పరిమళ శోభను, లుంటాకము = దొంగిలించునట్టిదియును, చందన అచల = మలయపర్వతముయొక్క, తట = చఱియలందున్న, శ్రీఖండ = మంచిగంధపు చెట్లను, సంవేష్టిత = చుట్టుకొని యున్న, వ్యాల = పాములయొక్క, స్ఫార = గొప్పవైన, ఫణా = పడగలవల్ల, కఠోర = క్రూరమైన, విష = విషమును చిమ్మెడి, నిశ్వాస అగ్ని = బుసకొట్టే అగ్నికి, పాణింధమము = కొలిమితిత్తివంటి, దక్షిణానిలము = మలయమారుతము, నా పయిన్ = నా మీద, దాక్షిణ్యమున్ = దయను, ఏలా చేయున్ = ఎందుకు చూపును?(రూపకము)

తా. ఓ హంసమా! యముని అంతఃపుర స్త్రీలయొక్క స్తనప్రదేశములందున్న కస్తూరీ పరిమళ శోభను దొంగిలించునట్టి మలయపర్వత చఱియలందున్న మంచిగంధపు చెట్లను చుట్టుకొనియున్న పాములయొక్క గొప్పవైన పడగలనుండి వెలువడు క్రూరమైన విషాగ్నికి కొలిమితిత్తివంటి మలయమారుతము నామీద దయను ఎందులకు చూపుతుంది?

33 క. నెలనెలఁ దప్పకయుండఁగ
నెలభాస్కరుఁ జొచ్చుటెల్ల నియమముతోడం
గలహంస! వేఁడివెన్నెల
సొలయక నా యంగకములు సూఁడుటకుఁజుమీ!

కలహంస = ఓ రాజహంసా! నెలనెలన్ = ప్రతినెలయందును, తప్పకయుండగ = తప్పిపోకుండగ, నియమముతోడన్ = నిష్ఠగా, నెల = చంద్రుడు, భాస్కరున్ = సూర్యుని, చొచ్చుట ఎల్లన్ = ప్రవేశించుటయంతయు, వేడి వెన్నెలన్ = వెన్నెలను వేడెక్కించి, సొలయక = వెనుదీయక, నా అంగకములు = నా అవయవములను, చూడుటకు సుమీ = కాల్చివేయుటకే సుమా! (ప్రతి అమావాస్యకు చంద్రుడు సూర్యునితో కలియునని ప్రసిద్ధము)

తా. ఓ రాజహంసా! ప్రతి నెలలోను తప్పకుండగా నియమముతో చంద్రుడు సూర్యుని ప్రవేశించడం అంతా కూడా తన వెన్నెలను వేడెక్కించుకొని నా అవయవములను కాల్చివేయడానికేసుమా! (అలంకారము – ఉత్ప్రేక్ష)

**34.** **ఉ. మోహము దాహమున్ మదికి మూడ్చుచునున్నవి పాయ దెప్ప సం**
**దేహము మీనకేతనుని దివ్యశరంబులు పువ్వు మొగ్గలో**
**యూహ యొనర్పఁగాఁ బిడుగులో కులిశంబులవెట్లు భారతీ**
**వాహకులావతంస! విషవల్లి సముద్భవముల్ ప్రసూనముల్**

భారతీవాహ కులావతంస = సరస్వతీదేవి వాహనకులమున శ్రేష్ఠా!, మీనకేతనుని దివ్యశరంబులు = మన్మథుని దివ్య బాణములు, మదికిన్ = మనస్సునకు, మోహము, దాహమున్ = తాపమును, మూడ్చుచునున్నవి = కలిగించుచున్నవి. ఊహయొనర్పగాన్ = ఆలోచింపగా, మీనకేతనుని దివ్య శరంబులు, పువ్వు మొగ్గలో = పూలును మొగ్గలునా?, పిడుగులో, అవి ఎట్లు, కులిశంబులు = వజ్రాయుధములు. ప్రసూనముల్ = ఆ పుష్పములు, విషవల్లి = విషపు తీగకు, సముద్భవముల్ = పుట్టినవి.

తా. ఓ రాజహంసా! మన్మథుని దివ్యశరములు మనస్సునకు మోహమును, తాపమును కలిగించుచున్నవి. ఆలోచింపగా ఆ మన్మథుని బాణములు పూలును మొగ్గలునా? పిడుగులా? మోహమును కలిగించుచుండ అవి వజ్రాయుధము లెలా అవుతాయి. ఆ పుష్పములు విషపు తీగకు పుట్టివుంటాయి.(అనుమానాలంకారము)

**35** **వ. కావునం దీరంబు లేని విరహ భారంబను పారావారంబున మునుంగం బాఱుచున్న నాకుం దెప్పగా విరించి నిన్నుఁ గల్పించినాఁడు. మిము బోంట్లగు పెద్దల గుణంబులు పరార్థ ప్రవణంబులుగదా ! పొమ్ము గార్యమ్ము సాధింపుము. పునస్సమాగమం బయ్యెడు. నీవు వచ్చునంతకు నిచ్చోటన యుండుదుం జుమీ. చూతముగదా నీ గమన వేగంబని పల్కి యన్నీడజంబు వీడుకొల్పి క్రీడావనంబులో నొక్క నికుంజ క్రోడంబునీడ నన్నరేంద్రుండు చంద్రకాంత శిలాతలంబున విశ్రమించి రాయంచ పలుకులు మనంబునం దలపోయుచుండెఁ గలహంసంబును నలుని వీడ్కొని భూమండల మండనాయితం బైన కుండిననగరంబున కభిముఖంబై ప్రార్థనా సిద్ధి సూచకంబులగు ననుకూల గంధవాహాది నానావిధ శుభ నిమిత్తంబులను సంధించుచు నికష పాషాణ పట్టనిభంబైన నభస్థ్సలంబునం దన పసిండి ఱెక్క లొరపెట్టు చందంబున నందంబుగా ఝూంకారిత పతత్త్ర ధారా విహారంబున గోడివడి డిగ్గునప్పు డల దిగువనున్న పతంగంబులు వడవడ వడంకుచు నొంటికంటఁ గనుంగొన నొక్కొక్కమాఱు విధూత పక్షతియును, నొక్కొక్కసారి యూర్ధ్వాయన దుర్విభావంబును, నొక్కొక్కమాటు వితతీకృత నిశ్చలచ్ఛద గుచ్ఛంబును నగుచు వనంబులు గడచి శైలంబులు దాటి నదులు లంఘించి చనిచని ముందట.**

తా. కాబట్టి, తీరములేని విరహభారమనెడి సముద్రమున మునుగబోవుచున్న నాకు తెప్పగా బ్రహ్మ నిన్ను కలిపినాడు. మీవంటి వారి పెద్దల గుణములు పరోపకారమునకే పాటుపడుచుండునుకదా! పొమ్ము, కార్యమును సాధింపుము. తిరిగి కలుసుకొందుముగాక. నీవు వచ్చువరకును ఇక్కడనే ఉంటాను సుమా! నీ గమన వేగం చూస్తానుకదా! అని పలికి ఆ పక్షిని సాగనంపి క్రీడావనములో ఒక పొదరింటి మధ్యభాగమున నీడలో చంద్రకాంత శిలాతలమున ఆ రాజు విశ్రమించి ఆ హంస మాటలను మనసునందు తలపోయుచుండెను. ఆ హంసయును నలుని వదలిపెట్టి భూమండలమున కలంకార మైనట్టి కుండిననగరమునకు బయలుదేరినదై కోరిక నెరవేఱుటకు సూచకములగు అనుకూల వాయువు మొదలుగాగల పలువిధములైన శుభ శకునములను కలుపుకొనుచు సానపెట్టు ఱాతిపలకతో సమానమైన ఆకాశమార్గాన తన బంగారు ఱెక్కలను పదునుపెట్టుచున్న విధముగా సొగసుగా ఝుంకారధ్వనిగల ఱెక్కలయొక్క గతిభేదములతో విహరించుటచేత వేగము తగ్గి క్రిందకు దిగుచున్న సమయమందు ఆ క్రిందనున్న పక్షులు వణికిపోయి ఒక్క కంటితోనే చూచుచుండగా, ఒక్కొక్కమాఱు కదల్పబడిన ఱెక్కలు కలదియు, ఒక్కొక్కసారి ఎత్తులో ఎగురుటచే చూడరానిదియు, విస్తరింపబడినట్టిదియు, చలింపనిదియునగు పిల్లఱెక్కలయొక్క సమూహముకలదియునగుచు అడవులు, పర్వతములు, నదులు దాటి, ముందుకు సాగి యెదుట–

**36** **ఉ. అండజరాజు గాంచె లవణాంబుధి వేష్టిత మేదినీ వధూ**
**కుండలమండనంబయిన కుండినమున్ నిజకీర్తి కల్పితా**
**ఖండల పట్టణ ప్రథన ఖండనమున్ గ్రథ కైశికేంద్ర దో**
**ర్దండ బలాభిగుప్తము నుదగ్ర హిరణ్మయ వప్రదీప్తమున్**

అండజరాజు = ఆ రాజహంస, నిజ = తనయొక్క, కీర్తి కల్పిత = కీర్తిచే కల్పింపబడిన, ఆఖండల పట్టణ = ఇంద్రుని నగరమైన అమరావతియొక్క, ప్రథన = ప్రసిద్ధిని, ఖండనమున్ = తిరస్కరించుచున్నదియును, క్రథ కైశిక ఇంద్ర = క్రథ కైశికుల ప్రభువగు భీమరాజుయొక్క, దోర్దండ = బాహుసంబంధమైన, బల = బలముచే, అభిగుప్తమున్ = రక్షింపబడు చున్నదియును, ఉదగ్ర = మిక్కిలి పొడవైన, హిరణ్మయ = బంగారుమయమైన, వప్రదీప్తమున్ = ప్రాకారములచే ప్రకాశించునదియు, లవణాంబుధి = సముద్రముచే, వేష్టిత = చుట్టబడిన, మేదినీ వధూ = భూదేవియొక్క, కుండల = కుండలమనెడి, మండనంబు అయిన = అలంకారమైన, కుండినమున్ = కుండిన నగరమును, కాంచె = చూచెను.

తా. తన కీర్తిచే కల్పింపబడిన అమరావతియొక్క ప్రశస్తిని తిరస్కరించుచున్నదియును, విదర్భరాజగు భీమునియొక్క బాహుబలముచే రక్షింపబడుచున్నదియును, మిక్కిలి ఎత్తైన, బంగారుమయమైన ప్రాకారములచే ప్రకాశించునదియును, సముద్రముచే చుట్టబడిన భూదేవియొక్క కుండలాలంకారమైన కుండిన నగరమును అ పక్షిరాజు చూచెను.

**37 వ. అప్పట్టణంబున కరుగఁ కనకగిరి వప్ర దీప్రాకారంబులగు ప్రాకారంబులవలనను, నారసాతల గంభీర సలిల సంచారంబులగు పరిఖాకూపారంబులవలనను, బ్రస్ఫుట స్ఫటికోపల విగ్రహంబులగు గృహంబులవలనను, శశిభిత్తి విమలభిత్తి సముత్సేధంబులగు సౌధంబులవలనను, నింద్రనీలమణి చ్ఛాయా కల్పితాకాల కాలికలగు చంద్రశాలికలవలనను, లేలీ విలోల బాలికాకుచ లికుచ ఘుసృణ పంక కషాయితాంభఃపూరంబులగు కాసారంబులవలనను, ఘనఘనాఘనఘటా కఠోర ఘుర్ఘురధ్వాన గోధూమ ఘరట్టంబులగు హట్టంబులవలనను, అనిల చలచ్చేలాంచల దండ తాడనా విహిత హేళి హయాళీ కాలన క్రియాదత్తానూరు విశ్రాంతులగు ప్రాసాద వైజయంతులవలనను, నవ వికచ వివిధ కుసుమవాసనా పేటికలగు లీలోద్యాన వాటికలవలనను, బటీర కస్తూరి కర్పూరికా కుంకుమ సంకుమద హిమాంబు ప్రముఖ నిఖిల పరిమళ వస్తు విస్తార సౌరభోద్గార సముత్పణంబులగు నాపణంబులవలనను, హావ భావ విలాస విభ్రమైక భాజనంబులగు వనితా జనంబులవలనను, జవవిజితమరుత్కురంగంబులగు తురంగంబులవలనను, అసమ సమర విజయ కారణంబులగు వారణంబులవలనను, నభిరామంబై యక్కలహంసంబునకు గౌతుకం బాపాదించె వెండియు**

తా. ఆ కుండిన నగరమునకు వెళ్ళగా మేరుపర్వతమువలె ప్రకాశించుచున్న ప్రాకారములవలనను, పాతాళము వరకు లోతైన నీటి ప్రవాహము కలవైన సముద్రములవంటి అగడ్తలవలనను, గొప్ప స్ఫటికములచే నిర్మితములైన బొమ్మలుకల గృహములవలనను, చంద్రఖండములవలె తెల్లనైన గోడలుకల ఎత్తైన మేడలవలనను, ఇంద్రనీలమణి కాంతులచే కల్పింపబడిన మేఘసమూహములుకల చంద్రశాలలచేతను, ఆటలయందు ఆసక్తికల బాలికల నిమ్మపండ్లవంటి స్తనముల యందున్న కుంకుమ బురదచే ఎఱ్ఱనైన ఉదక సమూహముకల సరస్సులవలనను, దట్టమైన వర్షాకాల మేఘములయొక్క సమూహమువలె నిష్ఠురములై ఘుర్ఘుర ధ్వనులుచేయుచున్నట్టి గోధుమలను విసరుచున్న తిరగళ్ళుకల అంగడి వీధుల వలనను, గాలిచే కదలాడుచున్న గుడ్డఅంచుగల కొయ్యయొక్క తాకుడుచే కల్పింపబడిన సూర్యుని గుఱ్ఱముల ప్రేరణా వ్యాపారముచే నీయబడిన సూర్యసారథికి విశ్రాంతినొసగు మేడలయందలి వైజయంతులవలనను, క్రొత్తగా వికసించిన పలురకముల పువ్వులయొక్క పరిమళములకు పేటికలగు లీలోద్యాన వనములవలనను, మంచిగంధము, కర్పూరము, కస్తూరి, కుంకుమ, జవ్వాది, పన్నీరు మొదలైన పరిమళ వస్తువుల విస్తారమైన పరిమళమును వెదజల్లుచున్న నుతింపదగు అంగళ్లవలనను, హావ భావ విలాస విభ్రమములకు ముఖ్య పాత్రమగు స్త్రీ సమూహమువలనను, వేగముచే జయింపబడిన వాయు వాహనములైన లేళ్ళుకల గుఱ్ఱములవలనను, సాటిరాని యుద్ధములయందు గెలుపునకు కారణములగు ఏనుగుల వలనను సొగసైనదై ఆ కుండిననగరము హంసకు కుతూహలమును కలిగించెను. ఆ పైన

**38 తే. పరిఖ గుడివోలెఁ దనచుట్టుఁ దిరిగియుండఁ**
**బరుల కేరికి గ్రహణగోచరము గాక**
**విషధరాధీశ భాషిత విషమభాష్య**
**ఫక్కికయుఁబోలె నొప్పె నప్పట్టణంబు**

ఆ పట్టణంబు = ఆ కుండిన నగరము, పరిఖ = కందకము, తన చుట్టున్, గుడివోలెన్ = వలయాకారముగ, తిరిగియుండన్ = చుట్టుకొనియుండగా, పరులకున్ = ఇతరులకు, ఏరికిన్ = ఎవరికిని, గ్రహణగోచరము కాక = ప్రవేశింప వీలుకాక, విషధర అధీశ = సర్పముల ప్రభువగు పతంజలిచే, భాషిత = పలుకబడిన, విషమ = దురవగాహ్యమైన, భాష్య ఫక్కికయు పోలె = మహాభాష్య గ్రంథమాయాయనునట్లు, ఒప్పెన్ = ఉండెను.

తా. ఆ కుండిన నగరము అగడ్త తనచుట్టును వలయాకారముగా చుట్టుకొనియుండగా ఇతరులెవరికిని ప్రవేశింప వీలుకాక పతంజలి రచిత మహాభాష్య గ్రంథమాయనునట్లుండెను. (అలంకారము – ఉత్ప్రేక్ష)

**39 క. నెలపొడుపుల సురనది ని**
**ర్మలతర తదగార కుట్టిమ స్రవదిందూ**
**పల తుందిలాప యగుచుం**
**దెలివొందుఁ బతివ్రతౌచితీ సంపత్తిన్**

సురనది = గంగ, నెలపొడుపులన్ = చంద్రోదయ కాలములయందు, నిర్మలతర = మిక్కిలి స్వచ్ఛమైన, తత్ = ఆ కుండిన పురమందలి, అగార = ఇండ్లయొక్క, కుట్టిమ = అరుగులనుండి, స్రవత్ = స్రవించుచున్న, ఇందూపల = చంద్రకాంతపు శిలలచేత, తుందిల = వృద్ధిచెందిన, ఆప = నీటిసమూహము కలది, అగుచున్, పతివ్రత = పతివ్రతా స్త్రీలయొక్క, ఔచితీ సంపత్తిన్ = ఔచిత్య సంపదచే, తెలివొందున్ = సంతసించును, (భర్త సుఖ దు:ఖములను పంచుకొనుట పతివ్రతల ధర్మము. నెలపొడుపున సముద్రముప్పొంగగా గంగయును చంద్రకాంత శిలా ద్రవముచే పొంగి పతివ్రతాధర్మము పాటించినది)

తా. గంగ చంద్రోదయకాలములయందు మిక్కిలి స్వచ్ఛమైన ఆ కుండిన నగరమందలి ఇండ్లయొక్క కుట్టిమములనుండి

స్రవించుచున్న చంద్రకాంత శిలా ద్రవములచే వృద్ధిచెందిన నీటి సమూహములు కలదగుచు పతివ్రతా స్త్రీలయొక్క ఔచిత్య సంపదను పాటించును. (అలంకారము – అతిశయోక్తి)

**40 తే. క్రుంకఁబాఱు సహస్రాంశుఁ గూడలేక**
**వెనుకఁ జిక్కిన జరదంశు వితతిఁబోలెఁ**
**బొలుచు నపరాహ్ణవేళ నప్పురమునందు**
**భాసురాలేప కాశ్మీర పణ్యవీథి**

ఆ పురమునందు, భాసుర = ప్రకాశించుచున్న, ఆలేప = సుగంధద్రవ్యములయొక్క, కాశ్మీర = కుంకుమపువ్వుయొక్క, పణ్యవీథి = అంగడివీథి, అపరాహ్ణవేళన్ = సాయంకాలములందు, క్రుంగన్ = అస్తమించుటకు, పాఱు = పరుగెత్తుచున్న, సహస్రాంశున్ = సూర్యుని, కూడలేక = కలిసికొనలేక, వెనుకన్ చిక్కిన = వెనుకబడిపోయిన, జరత్ = ముసలివైన, అంశు వితతి పోలెన్ = కిరణములసమూహమాయనునట్లు, పొలుచు = ప్రకాశించును.

తా. ఆ పట్టణమునందు సుగంధ ద్రవ్యములచేతను, కుంకుమపువ్వుచేతను ప్రశాశించుచున్న అంగడివీథి సాయంకాలమందు అస్తమించుటకు త్వరపడుచున్న సూర్యుని కలిసికొనలేక వెనుక నిలిచిపోయిన సంధ్యాకాల సూర్య కిరణ సమూహమాయనునట్లు ప్రకాశించుచుండెను. (అలంకారము – ఉత్ప్రేక్ష)

**41 శా. వేదాభ్యాస విశేష పూతరస నావిర్భూత భూరిస్తవా**
**సాది బ్రహ్మ ముఖౌఘ విఘ్నిత నవస్వర్గ క్రియాకేళిచే**
**నాదిన్ గాధితనూజుచే సగము సేయంబడ్డ మిన్నేఱు ప్రా**
**సాద స్వచ్ఛ దుకూల కైతవమునం జాలంగ నొప్పున్ పురిన్**

పురిన్ = ఆ నగరమందు, వేద అభ్యాస = వేదముల నభ్యసించుటయొక్క, విశేష = ఆధిక్యముచే, పూత = పవిత్రమైన, రసనా = నాలుకలవలన, ఆవిర్భూత = పుట్టిన, భూరి = పెద్దవైన, స్తవ = స్తోత్రములను, ఆసాది = చేయుచున్న, బ్రహ్మ = బ్రహ్మదేవునియొక్క, ముఖ ఓఘ = ముఖ సమూహముచే, విఘ్నిత =విఘ్నముచేయబడిన, నవ = క్రొత్తదైన, స్వర్గ = స్వర్గమును, క్రియా = చేయుటయనెడి, కేళిచేన్ = లీలగల, గాధితనూజుచేన్ = విశ్వామిత్రునిచేత, ఆదిన్ = పూర్వమందు సగము, చేయంబడ్డ = చేయబడిన, మిన్నేఱు = గంగానది, ప్రాసాద = భవనములపైనున్న, స్వచ్ఛ = తెల్లనైన, దుకూల = వస్త్రములయొక్క, కైతవమునన్ = మిషచే, చాలంగన్ = అధికముగా, ఒప్పున్ = ప్రకాశించుచుండును.
(త్రిశంకుడికోసం విశ్వామిత్రుడు నవ స్వర్గాన్ని నిర్మించ తలచాడు)

తా. వేదాభ్యాసముచే మిక్కిలి పవిత్రమైన నాలుకలవలన పుట్టిన స్తోత్రములచే బ్రహ్మ విశ్వామిత్రుని స్తుతించి తాను సంకల్పించిన క్రొత్త స్వర్గసృష్టిని మాన్పించెను. ఆ ఆపివేయబడ్డ సృష్టిలోని గంగానదియను మిషచే సౌధములపైనున్న తెల్లని పతాక వస్త్రములు ఆ కుండినపురమందు ప్రకాశించుచుండెను. (అలంకారము – అపహ్నవము)

**42 తే. అమరు హాటకమయ కవాటములతోడ**
**గురుతరంబైన యవ్వీటి కోట గవను**
**కులిశధారకుఁ దప్పి ఱెక్కలును దాను**
**బయటఁ గొలువున్న పసిఁడి కొండయునుఁబోలె**

హాటకమయ = కనకమయములైన, కవాటములతోడ = తలుపులతో, గురుతరంబైన = మిక్కిలి గొప్పదైన, ఆ వీటి = ఆ పట్టణమునందలి, కోట గవను = కోట ద్వారము, కులిశధారకున్ = వజ్రాయుధము దెబ్బకు, తప్పి = తప్పించుకుని, ఱెక్కలును, తాను, బయట కొలువున్న = నగరమునకు బయట విడిదిచేసియున్న, పసిడి కొండయునున్ పోలె = మేరు పర్వతమువలె, అమరున్ = ఒప్పును.

తా. బంగారుమయములైన తలుపులతో మిక్కిలి గొప్పదైన ఆ నగరమునందలి కోటద్వారము వజ్రాయుధము దెబ్బకు తప్పించుకుని తన ఱెక్కలును తాను నగరమునకు బయట విడిదిచేసియున్న మేరుపర్వతమా యన ఒప్పుచున్నది. (ఉత్ప్రేక్ష)

**43 మహాస్రగ్ధర**
**దమయంతీ కేళి ధాత్రీధర శిఖర హరిద్రత్న భా దర్భ సందో**
**హ మజాం డాఘాత భగ్న స్యద భవ మదతా వాప్త లజ్జావనమ్ర**
**త్వముమై నుత్తానగామర్త్య సురభి వదనాంతఃస్థమై లీల నత్య**
**ర్థము గోగ్రాస ప్రదాన వ్రత సుకృతము తోరంబుగా వీటి కిచ్చున్**

దమయంతీ = దమయంతియొక్క, కేళి ధాత్రీధర = క్రీడా పర్వతముయొక్క, శిఖర = శిఖరములయందున్న, హరిత్ రత్న = మరకతమాణిక్యములయొక్క, భా = కాంతియనెడు, దర్భ = దర్భలయొక్క, సందోహము = సమూహము, అజాండ = బ్రహ్మాండముయొక్క, ఆఘాత = దెబ్బచే, భగ్న = కొట్టబడిన, స్యద = వేగమువలన, భవ = పుట్టిన, మదతా = గర్వము

కలదగుటచే, అవాప్త = పొందబడిన, లజ్జా = సిగ్గుచేత, అవనమ్రత్వముమై = పంచుకొనుటకలదై, ఉత్తానగా = వెలికిల నడచుచున్న, అమర్త్య సురభి = కామధేనువు, వదన = నోటికి, అంతఃస్థ = లోపలనున్నదై, లీలన్ = విలాసముగా, అత్యర్థము = మిక్కిలి, తోరంబుగాన్ = అధికముగా, గోగ్రాస ప్రదాన = గోవులకు మేత ఇచ్చుటయనెడు, వ్రత సుకృతము = వ్రతమువలన కలిగెడు పుణ్యమును, ఆ వీటికిన్ = ఆ కుండిన నగరమునకు, ఇచ్చున్ = ఇచ్చును.

తా. దమయంతీ క్రీడా పర్వతమందలి మరకత మాణిక్యములయొక్క కాంతియనెడు దర్భల మొలకలు ఊర్ధ్వముఖముగా వేగముగా పెరుగుచుండగా బ్రహ్మాండము అడ్డుతగిలి వెళ్లలేక ఆగిపోవుటచే సిగ్గుపడుచుండగా వెల్లకిల నడచుచున్న కామధేనువు నోటికి ఆహారమై గోవులకు మేతనిడిన వ్రతపుణ్యమును ఆ కుండినపురమునకు ఇచ్చుచున్నది.(రూపకము – అతిశయోక్తి)

**44 వ. ఇట్టి విచిత్ర శోభా వైభవంబులకుం బట్టైన యప్పట్టణంబు గలయంగనుంగొని పతంగపుంగవుడు కన్యాంతఃపుర ప్రదేశంబున నొక్క శృంగారవనంబులోన సఖీ మధ్యంబునఁ దారకా మధ్యంబున శీతాంశు రేఖయుంబోలె నున్న యా రాజపుత్త్రిని వీక్షించి యభ్రమండలంబుననుండి విభ్రమ భ్రమణ రయ వికీర్ణ స్వర్ణమయ పర్ణపాళి చ్ఛాయా పటలంబు దిక్కులఁ బిక్కటిల్ల మెఱుంగు మెఱసిన చందంబునం గొఱవి ద్రిప్పిన పోల్కి దమయంతీ వదన చంద్రబింబంబు సేవింపం బనిఋని వచ్చు పరివేష చక్రంబు చాడ్పున వలయాకారంబున నవతరించుచు నాకుంచిత పక్షమూలంబును నివేశ దేశాతత ధూత పక్షంబునుంగా నాక్షణంబ వ్రాలిన**

తా. ఇటువంటి అద్భుత వస్తువులయొక్క కాంతి సంపదలకు నిలయమైన ఆ నగరమును కలయచూచి హంస కన్యాతఃపురమందలి ఒక్క ఉద్యానవనములో చెలికత్తెల నడుమ నక్షత్రముల నడమ చంద్రరేఖవలె నున్న ఆ రాజపుత్రిని చూచి ఆకాశ మార్గమునుండి లీలగా వలయాకారమున తిరుగుటలో వేగమువలన వ్యాప్తమైన బంగారు వికారమైన ఱెక్కల పంక్తియొక్క కాంతిసమూహము దిక్కులంతటా నిండుచుండగా మెఱపు మెరసిన రీతిగా, నిప్పుల కఱ్ఱను త్రిప్పినట్లుగా, దమయంతీ ముఖ చంద్రబింబమును సేవించుటకు పనికట్టుకుని వచ్చిన పరివేష మండలమువలె వలయాకారముగ క్రిందకు దిగుచు, ముడుచుకున్న ఱెక్కలు కలదై దిగుటకు తగు ప్రదేశముకొరకు విస్తరింపబడి కదల్చుచున్న ఱెక్కలు కలదై ఆ క్షణంలోనే వ్రాలగా

**45 ఉ. దుందుభి వాద్య నిస్వనముతోఁ దులఁదూఁగెడు పక్షనాదమం**
**దంద యతర్కితోపనతమై వినఁబడ్డ విహార లీలలం**
**జెంది పరాకునన్ మెలఁగు చిత్తము లుద్దవిడిం గలంగఁగా**
**నిందునిభాస్య లప్పుడు సమీక్షణ చేసిరి రాజహంసమున్**

దుందుభి = భేరీలయొక్క, వాద్య నిస్వనముతోన్ = వాయిద్యముల ధ్వనితో, తులతూగెడు = సరిపడెడు, పక్షనాదము = ఱెక్కల చప్పుడు, అందంద = అక్కడక్కడ, అతర్కిత ఉపనతమై = ఆకస్మికముగా వచ్చినదై, వినబడ్డన్ = వినబడగా, విహారలీలలన్ చెంది = క్రీడా విలాసములను పొంది, పరాకునన్ = ఏమరుపాటుగా, మెలగు = ఒప్పుచున్న, చిత్తములు = హృదయములు, ఉద్దవిడిన్ = వేగముగా, కలంగగా = కలతచెందగా, అప్పుడు, ఇందునిభాస్యలు = చంద్రముఖులగు వనితలు, రాజహంసమున్, సమీక్షణ చేసిరి = చూచిరి.

తా. భేరీల వాయిద్యమువలె ఆ రాజహంస ఱెక్కల చప్పుడు ఆకస్మికముగా వచ్చినదై వినబడగా క్రీడా విలాసములలో ఏమరుపాటుగానున్న ఆ చంద్రముఖులు కలతచెంది వేగముగా దిగిన ఆ హంసను చూచిరి. (అలంకారము – స్వభావోక్తి)

**46 వ. అమ్మత్తకాశినులు తమ చిత్తంబులు విముక్త తత్తద్విషయ గ్రహణంబులై యా హంసంబునందుఁ బరబ్రహ్మంబునందునుంబోలె వర్తించుచుండం జూచుచుండిరి. విదర్భరాజుపట్టి తన నెమ్మనంబునం బుట్టిన కౌతూహలంబున నమ్మరాళంబుఁ బట్టఁ దలంచి యొయ్యనొయ్యన గదియ నేతెంచిన నజ్జాలపాదంబును నబ్బాల తలంపెఱింగి యెగసియు దప్పఁ గ్రుంకియుఁ దాఁటుకొనియుఁ దనమీఁద వ్రాలు కేలుదోయి యొదుపు దప్పించుకొనియెం. గాంచనపత్త్ర రథగ్రహణలీలా వ్యవసాయంబు నిష్ఫలంబైన రాచూలిం జూచి చెలులు గలకలం జేచఱచి నగిరి. హస్తతల తాళ కోలాహలంబునం బులుఁగు బెదరించితిరి. దీన మీకు నేమి లాభం బయ్యెనని సఖీజనంబులం గనలి పలుకుచు మార్తాండు ననువర్తించు ఛాయాదేవియుం బోలె నత్తోయజాక్షి మానసౌకంబు వెనుకొని చనియె. అన్నారీ నివహంబును మేలంపుమాటలకైవడి హంసగమన హంసాభిముఖియైన యాత్రఁ బెద్దలు నిషేధింతురుసుమీ యనుచు మందగతిం బిఱుందన యేతెంచిరి. నీడోద్భవంబును నచ్చేడియ మందగమన విలాసంబు పరిహాసమునకై యనుకరించు నదియునుంబోలె ముందటం జరియించుచుం జేయాక యాఁకలు ముడిఁగించుకొని యీఱంబైన యొక్క లతాగేహంబుఁ దూఱె. అట్లు దూఱిన వెలరువాఱి చేయునది లేక నిషేధ జనిత రోష నిరుద్ధాశేష నిజవయస్యయు, నాత్మ చ్ఛాయా ద్వితీయయుఁ బ్రస్వేదాంభఃకణ విభూషితాంగియు నిశ్వాస వేగ కంపిత స్తనభారయునై యూరకుండె నప్పు దయ్యండజంబు మనుష్యభాషణంబుల**

తా. ఆ వనితలు తమ మనసులు విడిచిపెట్టబడిన ఆయా విషయజ్ఞానములుకలవై పరమాత్మయందును వలె ప్రవర్తించుచుండగా ఆ హంసనే చూచుచుండిరి. విదర్భరాజకుమారి తన మనమున కలిగిన కుతూహలముచే ఆ హంసను పట్టుకొనదలచి మెల్లమెల్లగా సమీపించగా ఆ హంసయును ఆ దమయంతి మనసెఱింగి ఎగురుచు, ప్రక్కకు దుముకుచు,

గెంతుచు తనమీద పడే చేతిని ఒడుపుగా తప్పించుకొనుచుండెను. బంగారు హంసను పట్టుకొనవలెననే వేడుకకైన ప్రయత్నము జరుగకపోగా ఆ దమయంతిని చూచి చెలికత్తెలు కలకలమని చప్పట్లు చఱచి నవ్విరి. ఆ చప్పట్ల చప్పుడుకు 'హంసను బెదరించితిరి. దీనివల్ల మీకేం లాభమొచ్చింద'ని చెలికత్తెలపై కోపించి పలుకుచు సూర్యుని అనుసరించు ఛాయాదేవివలె ఆ దమయతి హంసను అనుసరించి వెళ్ళెను. ఆ స్త్రీ సమూహమును పరిహాసములాడుచున్నట్లు 'ఓ హంసగమన! హంస (సూర్యునకు – అసూర్యంపశ్యలు కనుక) కఠిముఖమైయున్న నడక వలదందురుసుమా!' యనుచు మెల్లగా ఆమె వెనుకనే వచ్చిరి. ఆ హంసయు ఆ దమయంతి మెల్లని నడకయొక్క లీలను పరిహాసమునకై అనుకరించుచున్నదివలె ముందుకు సాగుచు చేతికి దొరకక చిన్న ఱెక్కలను ముడుచుకొని దట్టమైన ఒక్క లతాగృహమున దూఱెను. అలా దూఱగా తెల్ల బోయి చేయునదిలేక వద్దని ఆటంకపరచుటచే పుట్టిన కోపముచే తన చెలికత్తెలనందరను రావలదని నిరోధించి, తన నీడే తనకు తోడుగా ఒక్కతెయే చెమటనీటిచే అలంకరింపబడిన దేహముకలదై, నిట్టూర్పు వేగముచే చలించుచున్న స్తనభారమున నిలచిపోయెను. అప్పుడు ఆ హంస మనుజ భాషణమున **47 శా. కాంతా! శైశవ చాపలంబున లతా కాంతార వీథిం బరి**

**శ్రాంతిం బొందెదవేల? బేలవె? ననున్ శక్యంబె పట్టంగ నీ**
**వెంతే దవ్వగ నేఁగుదెంచితికదే? యేలమ్మ నీ బోటు లం**
**తంతం జిక్కిరి; చిక్కకుండుదురె? నీ వాక్షేపముల్ పల్కఁగన్**

కాంతా = ఓ దమయంతీ, శైశవచాపలంబునన్ = బాల్య చాపల్యముచే, లతా కాంతార వీధిన్ = తీగలతో అడవిలా వున్న ప్రదేశమందు, పరిశ్రాంతిం పొందెదవేల = అలసట పొందుతావెందుకు? బేలవె = అమాయకురాలివా?, ననున్ = నన్ను, పట్టంగ = పట్టుకొనుటకు, శక్యంబె = వీలవుతుందా? నీవు, ఎంతేదవ్వు = ఎంతో దూరము, ఏగుదెంచితికదే = వచ్చేసేవు కదా!, ఏలమ్మ = ఎందుకమ్మా! నీ బోటులు = నీ చెలికత్తెలు, అంతంత = అక్కడక్కడనే, చిక్కిరి = నిలచిపోయిరి. నీవు, ఆక్షేపముల్ = నిరోధవచనములను, పల్కగన్ = మాటలాడగా, చిక్కకుందురె = ఆగిపోకుండా ఉంటారా?

తా. ఓ దమయంతీ! నీవు బాల్యచాపల్యముచే తీగలతో అడవిలావున్న ప్రదేశమున అలసిపోతావెందుకు? వెఱ్ఱిదానా! నన్ను పట్టుకోడం వీలవుతుందా? నువ్వు ఎంత దూరం వచ్చేసేవోకదా! ఎందుకమ్మా! నీ చెలికత్తెలు నువ్వు ఆక్షేపించడంతో అక్కడక్కడే నిలిచిపోయారు. నువ్వు వద్దంటే ఆగిపోక ఏంచేస్తారు?

**48. ఉ. ఆళియుఁబోలె నిప్పుడు వనాళి యమార్గమునం జరించు ని**
**న్నో లలితాంగి! కాదనుచునున్నది మందసమీరణంబునం**
**గ్రాలు ప్రవాళమంజరులు కమ్రకరంబుల విభ్రమంబుగా**
**బాలరసాల పుష్ప రసపాయి వనప్రియ కంఠ హుంకృతిన్**

ఓ లలితాంగి = ఓ సుందరీ!, వనాళి = వనసమూహమునందు, అమార్గమునన్ = వెళ్లకూడని తావులందు, చరించు = సంచరించు, నిన్ను, ఇప్పుడు, ఆళియు పోలెన్ = స్నేహితురాలివలె, మందసమీరణంబునన్ = మలయమారుతముచే, క్రాలు = కదలాడుచున్న, ప్రవాళమంజరులు = చిగురు గుత్తులు, కమ్ర = సుందరమైన, కరంబుల = చేతులయొక్క, విభ్రమంబుగాన్ = విలాసముగా, బాలరసాల = గున్నమావియొక్క, పుష్ప రస పాయి = మకరందమును త్రాగిన, వనప్రియ = కోయిలయొక్క, కంఠ హుంకృతిన్ = కంఠధ్వనియనెడు హుంకారముచే, కాదనుచున్నది = వలదనుచున్నది.

తా. ఓ సుందరీ! వెళ్లకూడని మార్గమునందు వెళ్ళుచున్న నిన్ను ఇప్పుడు స్నేహితురాలివలె ఈ వనపంక్తి మలయ మారుతముచే కదలాడుచున్న చిగురు గుత్తులనెడు సుందర కరములచే విలాసముగా గున్నమావియొక్క మకరందమును త్రాగిన కోయిలయొక్క కంఠధ్వనియనెడు హెచ్చరికచే వలదనుచున్నది. (అలంకారము – ఉపమ, రూపకము)

**49 సీ. నలినసంభవు సాహిణము వారువంబులు**
**కులముసాములు మాకుఁ గువలయాక్షి**
**చదలేటి బంగారు జలరుహంబుల తూండ్లు**
**భోజనంబులు మాకుఁ బువ్వుబోఁడి**
**సత్యలోకము దాఁక సర్వలోకంబులు**
**నాటపట్టులు మాకు నబ్జవదన**
**మధురాక్షరములైన మా మాటలు వినంగ**
**నమృతాంధసులు యోగ్యు లనుపమాంగి**
**తే. భారతీదేవి ముంజేతి పలుకుఁ జిలుక**
**సమదగజయాన! సబ్రహ్మచారి మాకు**
**వేదశాస్త్ర పురాణాది విద్యలెల్లఁ**
**దరుణి! నీ యాన ఘంటాపథమ్ము మాకు**

కువలయాక్షి = కలువలవంటినేత్రములుకల దమయంతీ!, నలినసంభవు = బ్రహ్మయొక్క, సాహిణము = గుఱ్ఱపుశాలలోని, వారువంబులు = గుఱ్ఱములు, మాకున్, కులముసాములు = వంశకర్తలు, పువ్వుబోడి = పూవువంటి శరీరముకలదానా!, చదలేటి = ఆకాశగంగయందున్న, బంగారు, జలరుహంబుల తూండ్లు = తామర తూడులు, మాకున్, భోజనంబులు, అబ్జవదన = పద్మమువంటిముఖముకలదానా!, సత్యలోకము దాక = బ్రహ్మలోక పర్యంతము, సకల లోకంబులు, మాకున్, ఆటపట్టులు = క్రీడాస్థలములు, అనుపమాంగీ = సాటిలేని శరీరముకలదానా!, మధురాక్షరములు ఐన = తియ్యని అక్షరములుకల, మా మాటలు, వినంగన్ = వినుటకు, అమృతాంధసులు = దేవతలు, యోగ్యులు = అర్హులు, సమదగజయాన = మదపుటేనుగునడక కలదానా!, భారతీదేవి = సరస్వతీదేవియొక్క, ముంజేతి = చేతిలో ముందున్న, పలుకు చిలుక = మాటలాడు చిలుక, మాకు, సబ్రహ్మచారి = సహాధ్యాయి, తరుణి = ఓ కన్యా!, వేద శాస్త్ర పురాణ, ఆది విద్యలు ఎల్లన్ = మొదలైన విద్యలన్నియును, మాకున్, ఘంటాపథమ్ము = రాజమార్గమువంటివి, నీ ఆన = నీమీద ఒట్టు.

తా. ఓ దమయంతీ! బ్రహ్మ గుఱ్ఱపుశాలలోని గుఱ్ఱములు మాకు వంశకర్తలు. పువ్వుబోడీ! ఆకాశగంగలోని బంగారు తామరుతూడులు మాకు ఆహారము, అబ్జవదన! బ్రహ్మలోక పర్యంతము అన్ని లోకములు మాకు విహారభూములు, అనుపమాంగీ! తేనెలొలుకు మా మాటలు వినుటకు దేవతలే అర్హులు. సమదగజయాన! సరస్వతీదేవియొక్క చేతియందున్న మాటలాడు చిలుక మాకు సహాధ్యాయి. ఓ తరుణీ! వేదము శాస్త్రములు పురాణములు మొదలైన విద్యలన్నీ మాకు రాజమార్గముల వంటివి. నమ్ముము. నీమీద ఒట్టు.

**50 వ. ఒక్కనాఁడు విధాత వినోదార్థంబు వాహ్యాళి వెడలి మఱలి వచ్చునపుడు మా కులస్వాములైన యతని రథ రథ్యంబులు శ్రమంబున డీలుపడియున్నం జూచి యేను విమానదండంబు కంఠంబున ధరియించి విరించిచేతం బారితోషికంబు వడిసితి. నేను దివ్య తిర్యగ్జాతిని. మము బోంట్లు పాశాదికంబులం గట్టువడుదురే! గుణపాశంబులం గాక. భూలోకంబున రాజబృందారకులు కొందఱు కలరు. వారితోఁ జెలికారంబు వాటించి యుందుదు. విశేషించియు నిషధ దేశాధీశ్వరుండగు నలుండను రాజు మీఁద మిగులం బక్షపాతంబు గలిగియుందు.**

తా. ఒకనాడు బ్రహ్మ వినోదార్థము వాహ్యాళికి వెళ్ళి తిరిగి వచ్చేటప్పుడు మా వంశకర్తలైన ఆతని రథ గుఱ్ఱములు అలసటచే నీరసపడియున్న చూచి నేను ఆ విమానపు కాడిని మెడపై మోసి బ్రహ్మదేవునిచేత బహుమానము పొందితిని. నేను దేవజాతికి చెందినదానను, మావంటివారు గుణములనెడి త్రాళ్ళచే కాక మామూలు త్రాళ్ళకు కట్టుపడుతారా! భూలోకంలో కొంతమంది రాజశ్రేష్ఠులున్నారు. వారితో స్నేహం పాటిస్తూంటాను. అందులోనూ అధికంగా నిషధ దేశాధీశుడైన నలమహారాజు మీద చాలా అభిమానంతో ఉంటాను.

**51 తే. కనకశైలంబు డిగ్గి యాకాశ సింధు**
**సలిలములఁ దోఁగి మిగులంగఁ జల్లనైన**
**చారు హాటకమయ గరుచ్చామరముల**
**వీతు నతనికి వైశాఖ వేళలందు**

కనకశైలంబు = మేరుపర్వతమును, డిగ్గి = దిగి, ఆకాశ సింధు = ఆకాశగంగయొక్క, సలిలములన్ = జలములందు, తోగి = స్నానమాడి, మిగులంగ = మిక్కిలి, చల్లనైన, చారు = మనోహరమైన, హాటకమయ = బంగారుమయమైన, గరుత్ = ఱెక్కలనెడు, చామరముల = వింజామరలతో, అతనికి = ఆ నలమహారాజునకు, వైశాఖ వేళలందు = వేసవి సమయమందు, వీతును = వీచెదను.

తా. ఓ దమయంతీ! నేను మేరుపర్వతమునుండి దిగి ఆకాశగంగలో స్నానమాడి మిక్కిలి చల్లనైన సుందరములైన బంగారుమయమైన నా ఱెక్కలనే వింజామరలతో అతనికి వేసవి వైశాఖమాస సమయములందు వీచుచుందును.

**52 మ. రణకండూభర దుస్సహంబయిన యా రాజన్య దేవేంద్రు ద**
**క్షిణ బాహాగ్రమునన్ జనించిన మహాకీర్తి ప్రవాహంబు గా**
**రణ సంక్రాంత గుణానుషంగముననో ప్రస్ఫీత దిఙ్మత్త వా**
**రణ గండస్థల కుంభ కూటములతో రాచుం దివారాత్రముల్**

రణ = యుద్ధమునందలి, కండూభర = మిక్కిలి దురద, దుస్సహంబయిన = మిక్కిలి సహింపరానిది కాగా, ఆ రాజన్య దేవేంద్రు = దేవేంద్రునివంటి ఆ రాజశ్రేష్ఠుని, దక్షిణ బాహాగ్రమునన్ = కుడి భుజాగ్రమునందు, జనించిన = పుట్టిన, మహత్ = గొప్పదైన, కీర్తి ప్రవాహంబు = కీర్తియొక్క వ్యాప్తి, కారణ = కారణముగ, సంక్రాంత = తగుల్కొన్న, గుణ అనుషంగముననో = గుణముల (దురద) సంబంధముచేతనే కాబోలు, ప్రస్ఫీత = మహోన్నతములైన, దిక్ = దిక్కులయందలి, మత్త = మదించిన, వారణ గండస్థల = ఏనుగుల చెక్కిళ్ళతోను, కుంభ కూటములతో = కుంభాగ్రములతోను, దివారాత్రముల్ = రేయింబవళ్ళు, రాచున్ = ఒరయుచుండును.

తా. యుద్ధోత్సాహము సహింపశక్యముకానిది కాగా ఆ నలమహారాజు దక్షిణ బాహాగ్రమున జనించిన గొప్పదైన

కీర్తి వ్యాప్తి కారణముగా తగుల్కొన్న దురదచేతనేమో మహోన్నతములైన దిగ్గజముల చెక్కిళ్ళతోను, కుంభాగ్రములతోను రేయిం బవళ్ళు రాయుచుండును. (అలంకారము – ఉత్ప్రేక్ష)

**53 తే. అతని బాహాపరాక్రమం బభినుతింప**
**నలవియే పద్మజునికైన నబ్జవదన!**
**శాత తద్బాణధారా భుజంగభుక్తి**
**వైరిరాజ వ్రజీయాసు మారుతంబు**

అబ్జవదన = పద్మమువంటి ముఖముకలదానా!, అతని = ఆ నలమహారాజుయొక్క, బాహా పరాక్రమంబు = భుజబలమును, అభినుతింప = పొగడుటకు, పద్మజునికైన = బ్రహ్మకైనను, అలవియే = శక్యమా?, శాత = పదునైన, తత్ = అతనియొక్క, బాణ ధారా = బాణముల వరుసయనెడు, భుజంగ భుక్తి = పాములకు ఆహారము (వాయువు), వైరిరాజ = శత్రురాజులయొక్క, వ్రజీయ = సమూహమునకు, ఆసు మారుతంబు = ప్రాణవాయువు.

తా. ఓ దమయంతీ! ఆ నలమహారాజుయొక్క భుజబలమును పొగడుటకు బ్రహ్మకైనను శక్యము కాదు. పదునైన ఆతని బాణ పంక్తియనెడు పాములకు ఆహారమగు వాయువు శత్రురాజుల ప్రాణవాయువే. (అలంకారము – రూపకము)

**54 చం. వినుకలి కూర్మిc జిక్కి పృథివీ భువనంబునకుం డిగంగ నే**
**యనువును లేక రంభయను యచ్చర లేమ నలున్ వరింపc బూ**
**నిన తన కోర్కి నొక్కమెయి నిండcగc జేయుటకై భజించెc దా**
**గొనకొని వేల్పులందు నలకూబరుc దచ్ఛుభనామవాసనన్**

రంభ అను అచ్చర లేమ = రంభ అనే అప్సరస స్త్రీ, వినుకలి = నలునిగూర్చి వినుటవలన కలిగిన, కూర్మిన్ = వలపుచే, చిక్కి = వశురాలై, పృథివీ భువనంబునకు = భూమండలమునకు, డిగంగ = దిగుటకు, ఏ అనువును = ఏ ఉపాయమును, లేక, నలున్ వరిపం బూనిన తన కోర్కిన్, ఒక్కమెయిన్ = ఏదో ఒక విధముగా, నిండంగ చేయుటకై = తీర్చుకొనుటకొరకై, తాన్ = రంభ, గొనకొని = పూనుకొని, వేల్పులందు = దేవతలందు, తత్ = ఆ నలునియొక్క, శుభనామ వాసనన్ = మంగళకరమైన పేరు పోలికచే, నలకూబరున్, భజించెన్ = సేవించెను

తా. రంభ అనే అప్సరస స్త్రీ నలుని గూర్చి విన్నదై వలపుచే వశురాలై తాను భూమండలమునకు దిగుటకు ఏ ఉపాయమును లేకపోవుటచే నలుని వరింపబూనిన తన కోరికను ఏదో ఒక విధముగ పూర్తిచేసుకొనుటకై పూనుకొని దేవతలలో ఆ నలుని శుభ నామమునకు పోలికకల నలకూబరుని సేవించెను, (అలంకారము – అతిశయోక్తి)

**55 వ. ఆ రాజు కడం జనువు గలిగి వర్తింతు మఱియును**

తా. ఆ నలమహారాజు దగ్గఱ చనువుతో తిరుగుచుందును. ఇంకను

**56 మ. స్మర వాత్స్యాయన కూచిమార కృత శాస్త్ర గ్రంథ సందర్భముల్**
**పరిశీలించినవాcడ దంపతుల కుత్పాదింతు సారస్యముల్**
**మురిపెం బొప్పcగ మందమంద గమనంబుల్ నేర్పుదు న్మేదినీ**
**శ్వర శుద్ధాంత నితంబినీ జనులకున్ సంపూర్ణ చంద్రాననా!**

సంపూర్ణ చంద్రాననా = నిండుచంద్రునివంటి ముఖముకలదానా!, స్మర = స్మరునిచేతను, వాత్స్యాయన = వాత్స్యాయనుని చేతను, కూచిమార = కూచిమారునిచేతను, కృత = వ్రాయబడిన, శాస్త్ర గ్రంథ = శాస్త్ర గ్రంథములయొక్క, సందర్భముల్ = విశేషములను, పరిశీలించినవాడన్ = నేర్చినవాడను, దంపతులకు, సారస్యముల్ = సరసత్వమును, ఉత్పాదింతున్ = కలిగింతును, మేదినీశ్వర = రాజులయొక్క, శుద్ధాంత = అంతఃపురమందలి, నితంబినీ జనులకున్ = స్త్రీలకు, మంద మంద గమనంబుల్ = మెల్లని చక్కని నడకలను, నేర్పుదు = నేర్పుచుందును.

తా. దమయంతీ! స్మరుడు, వాత్స్యాయనుడు, కూచిమారుడు వ్రాసిన శాస్త్రగ్రంథములయొక్క విశేషములను నేర్చినవాడను. భార్యాభర్తలకు సరసత్వమును కలిగింతును. రాజుల అంతఃపుర స్త్రీలకు మెల్లని చక్కని నడకలను నేర్పుచుందును.

**57 వ. భామినీ జనంబులకు భావ భవ దివ్య జ్ఞాన విశ్వాస ముద్రా నిక్షేప భూమినై యుండుదు. తిర్యగ్జాతి మాత్రంబుగాc దలంపవలదు. విరించి వదనకమల వినిర్గత వివిధ శాస్త్ర వాసనాపూర్ణ కర్ణుండనైన యేను సామాన్యుండనే? నన్నుం బనిగొమ్ము. ఈ శరీరంబు పరోపకారార్థముగదా! పద్మాసను శిల్ప ప్రయాసంబు లక్ష్మీనారాయణులయెడలను గౌరీ వృషభాంకుల పట్టునను బోలెc బరస్పర యోగ్య సమాగమంబునకుం బాల్పడుంగాక. వేలాతిక్రాంత కాంత గుణాబ్ధి వేణివగు నీవు నలుని పాణిపల్లవంబు పరిగ్రహింప నర్హురాలవు. కోమలంబగు మల్లికా ముకుళ దామంబు కర్కశంబగు కుశ సూత్రంబునం గట్టc బాత్రంబుగానితెఱంగున నిషధరాజు దక్క వేఱొక్కండు నిన్ను వరియింపc బాత్రుండు గాcడు. మఱియు నొక్క విశేషంబు.**

తా. స్త్రీజనములకు మన్మథసంబంధమైన దివ్యజ్ఞానమందలి నమ్మక మనెడు ముద్రను ఉంచుటకు తగిన ప్రదేశమునై యున్నాను. పక్షిమాత్రముగా నన్ను తలంపవద్దు. బ్రహ్మ ముఖమునుండి బయల్వడిన అనేక శాస్త్రములయొక్క అనుభవ

విశేషములను విన్నవాడనైన నేను సామాన్యుడనా? నన్ను ఉపయోగించుకొనుము, ఈ శరీరంబు ఇతరులకు ఉపకారము చేయుటకే కదా!, బ్రహ్మయొక్క సృష్టివలన కలిగిన అలసట లక్ష్మీ నారాయణుల యెడలను, పార్వతీ పరమేశ్వరులందువలెను, ఒకరికొకరి తగినటువంటి కలయికకు ఉపయోగపడుగాక, హద్దుమీఱిన మనోహరమైన గుణములనెడు సముద్రముయొక్క ప్రవాహమువంటిదానవగు నీవు నలుని చేపట్టుటకు తగినదానవు. సుకుమారమైన మల్లెమొగ్గల దండ కఠినమైన దర్భ త్రాటితో కట్టుటకు అర్హముకాని విధమున నలమహారాజు తప్ప ఇతరులెవ్వరును నిన్ను వరించుటకు తగినవారు కాదు. ఇంకను ఒక్క విశేషము –

**58 చ. అడిగితి నొక్కనాఁడు గమలాసను తేరికి వారువంబనై**
**నడుచుచు నుర్విలో నిషధనాథుని కెవ్వతెయొక్కొ భార్య య**
**య్యెడునని చక్రఘోషమున నించుకయించుక గాని యంత యే**
**ర్పడ వినఁగాని నీవనుచుఁ బల్కిన చందము దోఁచె మానినీ!**

మానినీ = ఓ దమయంతీ!, కమలాసను తేరికిన్ = బ్రహ్మదేవుని రథమునకు, వారువంబనై = గుఱ్ఱమనై, ఒక్కనాడు = ఒకరోజున, నడుచుచు = వెళ్ళుచు, ఉర్విలోన్ = భూఖండములో, నిషధనాథునికి = నలమహారాజుకి, భార్య, ఎవ్వతె = ఎవరు, అయ్యెడునొక్కొ అని = అవుతారని, అడిగితి = అడిగినాను. చక్రఘోషమునన్ = చక్రముల ధ్వనిలో, ఇంచుక ఇంచుక కాని = కొంచెము కొంచెము కాని, అంత = పూర్తిగా, ఏర్పడన్ = చక్కగా, వినన్ కాని = వినలేదు కాని, నీవు అనుచు, పల్కిన = పల్కినట్టి, చందము = విధము, తోచె = తోచినది.

తా. ఓ దమయంతీ! బ్రహ్మదేవుని రథమునకు గుఱ్ఱమునై ఒకరోజున వెళ్ళుచు భూమండలములో నలమహారాజుకి భార్య ఎవరవుతారని అడిగియున్నాను. రథచక్రముల ధ్వనిలో సరిగా వినబడలేదుకాని నీవేనని పలికిన విధము తోచుచున్నది.

**59 ఉ. నిర్ణయ మా నృపాలునకు నీకును సంగతి యెల్లి నేఁటిలోఁ**
**దూర్ణము సేయఁగా గలఁడు దోయజసూతి తదన్యథావృథా**
**దుర్ణయ వృత్తికిన్ మనసు దూర్చెనయేని జగజ్జనాపవా**
**దార్ణవ ముత్తరించుటకు నాతని కెయ్యది దెప్ప చెప్పుమా!**

తోయజసూతి = పద్మజుడు బ్రహ్మ, ఆ నృపాలునకున్ = ఆ నలమహారాజునకు, నీకును, సంగతి = సంబంధము, ఎల్లి నేటిలోన్ = నేడో రేపో, తూర్ణము = త్వరితముగా, చేయగా గలడు = ఒనర్పగలడు.తత్ = దానికి, అన్యథా = వేరుగా, వృథా = వ్యర్థమైన, దుర్ణయవృత్తికిన్ = దుర్మార్గ ప్రవర్తనకు, బ్రహ్మ, మనసు, దూర్చెనయేని = ప్రవేశపెట్టినచో, జగత్ జనాపవాద అర్ణవము = లోకాపవాదమనెడు సముద్రమును, ఉత్తరించుటకు = దాటుటకు, ఆతనికి = ఆ బ్రహ్మకు, తెప్ప, ఎయ్యది = ఏదుంది?, చెప్పుమా = చెప్పుము.

తా. బ్రహ్మ ఆ నలమహారాజునకు, నీకు సంబంధము నేడో రేపో త్వరితముగా నొనర్పగలడు. అలా కాకుండా వ్యర్థమైన వేరు దుర్మార్గ ప్రయత్నమునకు బ్రహ్మ మనసున తలపెట్టినచో లోకాపవాదమను సముద్రమును దాటుటకు తెప్ప ఏముంది చెప్పు. (కావున బ్రహ్మ నిన్ను నలునితో కూర్చగలడు.)

**60 వ. అనిన విని ముహూర్తమాత్రంబు చింతించి యా యింతి శకుంతవల్లభున కిట్లనియె**

తా. హంస చెప్పినది విని క్షణకాలము ఆలోచించి ఆ దమయంతి ఆ పక్షిరాజునకు ఇట్లు పలికెను.

**61 తే. బాల్యమునఁ జేసి యేను చాపలముఁ బూని**
**నిన్ను నాయాస పెట్టితి నిగ్రహమున**
**దప్పుఁ జేసితి లోఁగొమ్ము దయ దలిర్ప**
**బ్రహ్మవాహనకులముఖ్య ! పక్షిరాజ!**

బ్రహ్మవాహనకులముఖ్య = హంసకులమునకు ప్రధానుడవయిన, పక్షిరాజ, బాల్యమున చేసి = అజ్ఞానముచే, ఏను = నేను, చాపలము పూని = చపలత్వము వహించి, నిగ్రహమున = తొట్రుపాటుతో, తప్పు చేసితి, దయ దలిర్ప = కరుణ కలుగునట్లుగా, లోగొమ్ము = మనసున స్వీకరింపుము

తా. హంసకుల ప్రధానుడవయిన ఓ పక్షిరాజా!అజ్ఞానముచేత నేను చపలత్వము వహించి తొందరపాటుతో తప్పు చేశాను. నా పై దయకలుగునట్లుగా నీవు దీనిని మనసున స్వీకరింపుము.

**62 సీ. దర్శనీయంబు నీ తనువిలాసం బెప్ప**
**నీమనం బత్యంత నిర్మలంబు**
**మధురాక్షరములు నీ మహిత భాషణములు**
**కీర్తనీయంబు నీ వర్తనంబు**
**ప్రౌఢియుక్తంబు నీ ప్రతిభా విశేషంబు**

**కమనీయతరము నీ కలితనంబు**
**శ్లాఘనీయంబు నీ సౌహార్ద గరిమంబు**
**ప్రార్థనీయంబు నీ ప్రాభవంబు**
**ఆ. మత్స్యమూర్తియైన మధుకైటభారాతి**
**భాతి నీవు భువన పావనుఁడవు**
**నిండు నెలయుఁబోలె నేత్రోత్సవంబవై**
**యున్నవాఁడ విట్టి యొప్పు గలదె**

నీ తనువిలాసంబు = నీ దేహ సౌందర్యము, ఎప్డు = ఎప్పుడునూ, దర్శనీయంబు = చూడతగినది, నీ మనంబు = నీ మనస్సు, అత్యంత = మిక్కిలి, నిర్మలంబు = స్వచ్ఛమైనది, నీ మహిత భాషణములు = నీ గొప్ప మాటలు, మధురాక్షరములు = తీయని అక్షరములు, నీ వర్తనంబు = నీ ప్రవర్తన, కీర్తనీయంబు = స్తుతిపాత్రము, నీ ప్రతిభా విశేషంబు = నీ బుద్ధి విశేషము, ప్రౌఢియుక్తంబు =నేర్పుతో కూడినది. నీ కలితనంబు = నీ సామర్థ్యము, కమనీయతరము = మనోహరమైనది, నీ సౌహార్ద గరిమంబు = నీయొక్క స్నేహాతిశయము, శ్లాఘనీయము = కొనియాడతగినది, నీ ప్రాభవంబు = నీ దొరతనము, ప్రార్థనీయంబు = కోరదగినది, మత్స్యమూర్తియైన = మత్స్యావతారుడైన, మధుకైటభారాతి భాతిన్ = విష్ణువు వలె, నీవు = నీవును, భువన పావనుడవు = లోకమును పవిత్రముచేయువాడవు. నిండునెలయున్ పోలెన్ = పున్నమినాటి చంద్రునివలె, నేత్రోత్సవంబవై = కన్నుల పండువైనవాడవై, ఉన్నవాడవు, ఇట్టి = ఇటువంటి, ఒప్పు = కుదిరిక, కలదె = ఎటనైన ఉన్నదా?

తా. నీ శరీర సౌందర్యము సతతమూ చూడతగినది, నీ మనస్సు మిక్కిలి స్వచ్ఛమైనది, నీ గొప్పమాటలు తీయనైనవి, నీ ప్రవర్తన స్తుతిపాత్రము, నీ బుద్ధి విశేషము నేర్పుతోకూడినది, నీ సామర్థ్యము మనోహరమైనది, నీ స్నేహాతిశయము కొనియాడతగినది, నీ దొరతనము కోరదగినది, మత్స్యావతారుడైన విష్ణువువలె నీవును లోకమును పవిత్రముచేయువాడవు. ఇటువంటి కుదిరిక ఎక్కడనైన కలదా?

**63 వ. నా మనోరథంబు కంఠ పథంబున వర్తించుచున్నయది. దుర్లభ జనానురాగంబును సమ ప్రాధాన్యంబు నధిష్ఠించి యున్నయది. అందని మ్రాఁకులపండ్లుఁ గోయం దలంచెద. రాజుం బాణిగ్రహణంబున వశీకరింపఁ గోరెద. బాల్య చాపలంబున బేలనై యున్నదాననని సాభిప్రాయంబుగాఁ బలికె నప్పుడు**

తా. నా కోరిక నా కంఠమార్గమందే నడయాడుచున్నది. పొందశక్యముకాని జనులయందున్న ప్రేమ సమానమైన ప్రాధాన్యమును వహించియున్నది. అందని చెట్ల పండ్లను కోయ ప్రయత్నించుచున్నాను. చంద్రుని చేతబట్టుకొని సొంతముచేసికొన కోరెదను (నలుని పెండ్లితో సొంతముచేసికొనగోరెదను). బాల్యచాపల్యముచే వెఱ్ఱిదాననై ఉన్నానని దమయంతి తన అభిప్రాయము సూచితమగునట్లుగా పలికెను. అప్పుడు

**64 తే. రమణి మందాక్ష మందాక్షరంబుగాగ**
**బరిమితోక్తుల నిబ్భంగిఁ బలుకుటయును**
**సంశయాళువై హంస దచ్ఛంసితంబు**
**హృదయమున నొయ్యఁ జింతించు చిట్టులనియె**

ఇబ్భంగిన్ = ఈ రీతిగా, రమణి = దమయంతి, మందాక్ష = సిగ్గుచే, మందాక్షరంబుగాగ = మెల్లగ పలుకుచున్నదై, పరిమితోక్తులన్ = మితభాషణమున, పలుకుటయును = మాటలాడగా, హంస, సంశయాళువై = సందేహించినదై, తత్ = ఆ దమయంతి, శంసితంబు = చెప్పినమాటను, హృదయమునన్ = తన మనస్సునందు, ఒయ్యనన్ = క్రమముగా, చింతించుచు = విచారించుచు, ఇట్టులు అనియె = ఇట్లు పలికెను.

తా. ఈ విధముగా దమయంతి సిగ్గుచే మెల్లగ పలుకుచున్నదై మితభాషణమున మాటలాడగా హంస సందేహించినదై ఆ దమయంతి చెప్పినమాటను తన మనస్సునందు క్రమముగా విచారించుచు ఇట్లు పలికెను.

**65 వ. ఓ రాజవదన! రాజు పాణిగ్రహంణంబు దృష్టాంతీకరించి పలికిన నీ సుభాషితంబులకు నర్థంబెయ్యది? అంతిమవర్ణంబునకు వేదవర్ణంబునుంబోలె నయ్యర్థంబు నా వీనులు ప్రవేశింప నర్హంబుగాదె! తిర్యగ్జాతినై యుండియు మా యేలిక నాళీకభవుని యాన నేను జన్మించినయది యాదిగా నెన్నండును మృషాభాషణంబులు వలుక. సత్యంబ వలుకుదు. పలికిన ప్రయోజనంబు సాధింతు. లోకాలోక పర్యంతంబైన ధాత్రీమండలంబునందు నీ వెయ్యది యపేక్షించితి నప్పదార్థంబు గొనివచ్చి నీకు సమర్పింపం జాలుదు. కందర్పాకారులైన రాజకుమారు లెల్లను నాకు వశవర్తులై యుండుదురు. విశేషించి యన్నిషధభూవల్లభుండు నన్నుం బ్రాణంబుగా మన్నించియుండు.**

తా. ఓ చంద్రునివంటిముఖముకలదానా! చంద్రుని చేత పట్టుట నిదర్శనముగా చేసికొని పలికిన నీ సుభాషితమునకు అర్థమేమిటి? శూద్రజాతికి వేదాక్షరమువలె ఆ అర్థము నా చెవుల ప్రవేశించుటకు అర్హములుకావా? పక్షిజాతిలో పుట్టినదాన నైనను మా ప్రభువగు బ్రహ్మమీద ఒట్టు. నేను జన్మించినది మొదలుగా ఎన్నడును అసత్యములు పలుకను. సత్యమునే

పలుకుదును. పలికిన మాటకు ప్రయోజనమును సాధింతును. చక్రవాళపర్యంతమైన ఈ భూమండలమునందు నీవేది కోరుకొన్నను ఆ పదార్థమును తీసుకొనివచ్చి నీకు ఈయ సమర్థురాలను. మన్మథాకారులైన రాజకుమారులందరును నా అధీనులై ఉంటారు. ప్రధానముగా ఆ నిషధరాజు నలుడు నన్ను ప్రాణసమానంగా గౌరవిస్తాడు.

**66 సీ. అతఁడు పాణిగ్రహణార్హుండు విను నీకు**
**నతనిఁ గూర్పఁగ నేర్తు నతివ! యేను**
**పిన్న పాపవు నీవు పితృ పరాధీనవు**
**కార్య నిర్ణయ శక్తి గలదె నీకు**
**నావల నిషధరాజఖిలలోకేశ్వరుం**
**డీవలఁ బరమేష్ఠి హితుఁడ నేను**
**సందేహడోలాధిశాయియైన ప్రసంగ**
**మిప్పట్టునందు నే నెట్లొనర్తు**
**తే. మొదల సంఘటించినఁ బొంది పిదపనున్న**
**గార్య మఘటించెనేనియు ఘనత దప్పి**
**ప్రాణమై నన్ను రమ్ము పొమ్మను నృపాలు**
**నెదురఁ దలవంచికొనియుండ నెట్లు నేర్తు**

అతివ = ఓ దమయంతీ!, అతడు = ఆ నలుడు, నీకు, పాణిగ్రహణ = చేపట్టుటకు, అర్హుండు = తగినవాడు, విను = వినుము, ఏను = నేను, అతనిన్ = ఆ నలమహారాజుని, కూర్పంగన్ = చేకూర్చుటకు, నేర్తున్ = సమర్థుడను, నీవు, పిన్న పాపవు = చిన్న పిల్లవు, పితృపరాధీనవు = తండ్రి అధీనములోనిదానవు, నీకు, కార్య నిర్ణయశక్తి = పని సాధించు సామర్థ్యము, కలదె = ఉన్నదా?, ఆవల = అటువైపు, అఖిల లోకేశ్వరుండు = సమస్త లోకాలకు అధిపతియైన, నిషధ రాజు = నలుడు, ఈవల = ఇటువైపు, నేను, పరమేష్ఠి = బ్రహ్మకు, హితుడ = ఇష్టుడను, సందేహడోలాధిశాయియైన = అనుమానముతో ఊగులాడుచున్న, ప్రసంగము = మాటలను, ఈ పట్టునందు = ఈ పరిస్థితులలో, నేను, ఎట్లొనర్తు = ఎలా చేయగలను, మొదలన్ = ముందుగా, సంఘటించినన్ = సంఘటితపరుపగా, పొంది = నావలన కూడిక పొంది, పిదపన్ = తరువాత, ఉన్న కార్యము = అనుకున్న పని, అఘటించెనేనియు = జరుగకపోయినచో, ఘనత తప్పి = గౌరవము పోయి, ప్రాణమై = ప్రాణసమానంగా, నన్ను, రమ్ము, పొమ్ము, అను, నృపాలున్ = రాజుయొక్క, ఎదురన్ = ఎదుట, తలవంచికొనియుండన్, ఎట్లు = ఏ రీతిగా, నేర్తు = సమర్థుడనగుదును.

తా. ఓ దమయంతీ! ఆ నలమహారాజు నిన్ను చేపట్టడానికి తగినవాడు. అతన్ని నీకు జతకలపడానికి నేను సమర్థుడను. నువ్వా చిన్న పిల్లవు, తండ్రి అధీనంలోనిదానవు, అందువల్ల నీకు కార్య నిర్ణయశక్తి ఉందంటావా? ఆ పక్కనేమో సమస్త లోకాధిపతియైన నిషధరాజు నలుడు, ఈ పక్కనేమో బ్రహ్మకు ఇష్టుడనైన నేను. సందేహంతో ఊగులాట మాటలను నేను ఎలా మాటలాడగలను? ముందుగా సంఘటితపరచి, నావల్ల కూడిన తరువాత అనుకున్న పని జరుగకపోయినచో నా గౌరవముపోయి ప్రాణసమానంగా నన్ను రమ్మని, పొమ్మని పలికే ఆ రాజు ముందర తలవంచుకొని నేను ఎలా నిలబడగలను?

**67 ఉ. ఇప్పటి నీ తలంపు తెఱఁగిట్టిద పో యిటమీఁద నెప్పుడే**
**చొప్పున నుండునో నిజము సుద్ది యెఱుంగముగాని యుగ్మలీ!**
**చెప్పెడిదేమి బాలికల చిత్తము లంబు తరంగ లోలముల్**
**తప్పునొ తాఁకునో కుసుమధన్వుని యేటులు దైవికంబునన్**

ఉగ్మలీ = ఓ మగువా!, ఇప్పటి = ఈ సమయమునకు, నీ తలంపు = నీ ఆలోచన, తెఱగు = విధానము, ఇట్టిద పో = ఇటువంటిదే కావచ్చు, ఇటమీదన్ = ఇకపైన, ఎప్పుడు, ఏ చొప్పున = ఏ రీతిగా, ఉండునో = ఉంటుందో, నిజము సుద్ది = నిజమైన సంగతి, ఎఱుంగము కాని = తెలుసుకోలేము కాని, చెప్పెడిది ఏమి = ఏం చెప్పగలము?, బాలికలచిత్తములు = కన్నెపిల్లల మనస్సులు, అంబు తరంగ లోలముల్ = నీటి కెరటములవలె చంచలములు, కుసుమధన్వుని = మన్మథుని యొక్క, ఏటులు = దెబ్బలు, తాకునో = తగులునో, దైవికంబునన్ = దైవవశాత్తూ, తప్పునొ = తప్పిపోవునో!

తా. ఓ మగువా! నీ ఆలోచనా విధానము ఈ సమయంలో ఇలాంటిదే కావచ్చు. ఇకపైన ఎప్పుడు ఏ రీతిగా మారుతుందో ఆ యదార్థము చెప్పలేము. ఏం చెప్పగలం? కన్యల చిత్తములు నీటి కెరటల్లా చంచలములు. మన్మథుని బాణపు దెబ్బలు తగలవచ్చు దైవికంగా తప్పిపోవచ్చును.

**68 వ. శంకా కళంకితంబయిన యివ్విషయంబునందుఁ బ్రామాణికుండనై యేను వర్తింప నంగీకరింపం గాని వేఱొక్క కార్యంబునకు నన్ను నియోగింపుము. దుర్ఘటంబయిన నది సంఘటించెదనని పలికిన నా పతత్త్రిపుంగవునకు ధాత్రీపురుహూత పుత్త్రి యిట్లనియె.**

తా.	సందేహాస్పదమయిన ఈ విషయమునందు నిర్ణయాత్మకుడనై నేను ప్రవర్తించుటకు సమ్మతించను కాని వేరే ఏదయిన పనికి నన్ను ఆజ్ఞాపింపుము. అసాధ్యమయినను దానిని సంఘటితపరచగలనని పలికిన ఆ పక్షిరాజునకు భూమీంద్రుని పుత్రి దమయంతి ఇట్లు పలికెను.

**69	తే. నిషధ భూపాలు నొల్ల కే నృపతి నొరుని**
**నభిలషించితినేని హంసాగ్రగణ్య!**
**యామవతి చంద్రు నొల్లక యన్యునొకని**
**నభిలషింపంగ నోంకార మాచరించు**

హంసాగ్రగణ్య = ఓ హంస శ్రేష్ఠమా!, ఏన్ = నేను, నిషధ భూపాలున్ = నల మహారాజును, ఒల్లక = ఇష్టపడక, నృపతిన్ ఒరుని = వేరొక రాజును, అభిలషించితినేని = ఇష్టపడినట్లయితే, యామవతి = రాత్రి, చంద్రున్ ఒల్లక = చంద్రుని ఇష్టపడక, అన్యున్ ఒకనిన్ = వేరొకనిని, అభిలషింపంగన్ = ఇష్టపడుటకు, ఓంకారము ఆచరించు = సమ్మతిని తెల్పును
తా.	ఓ హంస శ్రేష్ఠమా! నేను నలమహారాజును కాదని వేరొక రాజును ఇష్టపడినట్లయితే అది రాత్రి చంద్రుని కాదని వేరొకరిని ఇష్టపడుటకు సమ్మతించుటయే అగును.

**70	తే. అబ్జినీ మానసానురాగాభివృద్ధి**
**యర్క సంపర్కమునఁ దక్క నగునె యొంట?**
**నలునిఁ దక్కంగ నొరుని నేఁ దలఁతు నెట్లు?**
**విడువు సందేహ మోహంబు విహగరాజ!**

అబ్జినీ = తామరతీగయొక్క, మానస = చిత్తమందున్న, అనురాగ అభివృద్ధి = ప్రేమాభివృద్ధి, అర్క సంపర్కమునన్ = సూర్య సంయోగముచేతనే, తక్క = కాక, ఒంటన్ = వేఱొకటిచే, అగునె = అవుతుందా? నేన్ = నేను, నలుని తక్కంగ = నలుని విడిచిపెట్టి, ఒరుని = ఇతరుని, ఎట్లు తలతున్ = ఏ విధముగా తలంచెదను. విహగరాజ = ఓ పక్షిరాజా!, సందేహ మోహంబు = సందేహాభిప్రాయమును, విడువు = విడిచిపెట్టుము.
తా.	తామర తీగకు సూర్య సంయోగముచే కాక వేఱొకటిచే ప్రేమాభివృద్ధి జరుగుతుందా? నేను నలుని తక్క ఇతరుని ఏ విధంగా తలుస్తాను. ఓ పక్షిరాజా! నీ సందేహాభిప్రాయమును విడిచిపెట్టుము.

**71	తే. అ నల సంబంధ వాంఛ నా కగునయేని**
**ననల సంబంధ వాంఛ నా కగును చూవె**
**చాలు సందేహ వక్రభాషణము లింకఁ**
**దరళ! చక్రాంగ! పాథఃపతంగశక్ర!**

తరళ =సంశయాత్మా!, చక్రాంగ = హంసా!, పాథః పతంగశక్ర = నీటి పక్షీంద్రా!, అ నల సంబంధ వాంఛ = నలుడు కాని కోరిక, నాకు, అగునయేని = కలిగినట్లయితే, అనల సంబంధ వాంఛ = అగ్ని సంయోగము కోరిక, నాకు, అగును చూవె = అవుతుంది సుమా! ఇంకన్ = ఇంక, సందేహ = అనుమానముతో కూడిన, వక్ర భాషణములు = వంకర మాటలు, చాలు = నిలిపివేయుము.
తా.	సంశయాత్మా! హంసా! నీటి పక్షీంద్రా! నలుడు కాని కోరిక నాకు కలిగినట్లయితే నిప్పుతో సంబంధమైన కోరిక నాకు కలిగినట్లే. ఇంక అనుమానంతోకూడిన వంకరమాటలు చాలు.

**72	ఉ. దివ్యఖగేంద్ర! నమ్మవు మది న్నను నియ్యెడ నాకు విప్రలం**
**భ వ్యవహారము న్నిలువఁ బట్టఁగ నేమి ఫలం బశక్య శం**
**కా వ్యభిచార హేతువనఁ గల్గిన మాటయ వేదవాక్యముల్**
**భవ్య విచార! కావనిన భావన సేయుమ యెవ్వి వేదముల్**

దివ్య ఖగేంద్ర = దేవసంబంధమైన పక్షిరాజా!, ననున్ = నన్ను, మదిన్ = మనస్సునందు, నమ్మవు = నమ్మకున్నావు, ఇయ్యెడన్ = ఈ సమయమున, నాకు, విప్రలంభ వ్యవహారము = ఎడబాటు కలిగించే ప్రయత్నము, నిలువన్ పట్టంగన్ = నిలుచునట్లుగా పట్టుకొనుటవలన, ఏమి ఫలంబు = ఏమి ప్రయోజనము?, అశక్య = శక్యముకాని, శంకా = అనుమానము వలన, వ్యభిచార హేతువనన్ = అజ్ఞాన కారణముననే అని, కల్గిన మాటయే = ఉన్నటువంటి మాటే, వేదవాక్యముల్, భవ్య విచార = చక్కగా అలోచించువాడా!, కావు అనిన, ఎవ్వి వేదముల్ = మరి వేదములేవి? భావన సేయుమ = ఆలోచించు.
తా.	దేవసంబంధ పక్షిరాజా! నన్ను మనసులో నమ్మకున్నావు. ఈ సమయంలో నాకు ఎడబాటు కలిగించే ప్రయత్నం నిలుపకపోవడంవలన ఏం ప్రయోజనము? శక్యముకాని అనుమానమువలన అది అజ్ఞానము కారణంగానని ఉన్న మాటే. అవి వేదవాక్యములు. వేదవాక్యములు కాదంటే మరి వేదములేవి? భవ్య విచారా! ఆలోచించు.

**73 తే. తం[డ్రి నిషధాధిపతి కీక తక్కి యొరున**
**కీఁ దలంచిన నే విహగేం[ద్ర! వినుము**
**దేహ మనలంబునకు నాహుతిగ నొనర్చి**
**యతనిఁ బొందంగఁ గందు జన్మాంతరమున**

విహగేం[ద్రా = పక్షిరాజా!, తం[డ్రి = నా తం[డ్రియగు భీమరాజు, నిషధాధిపతికిన్ = నలునకు, ఈక = ఈయక, తక్కి = మిగిలిన, ఒరునకు = ఇతరునకు, ఈ తలంచిన = ఈయ తలపెట్టిన, వినుము, నే = నేను, దేహంబు = శరీరమును, అనలంబునకు = అగ్నికి, ఆహుతిగన్ = అర్పణముగా, ఒనర్చి = చేసి, జన్మాంతరమున = మరియొక జన్మమున, అతనిన్ = ఆ నలమహారాజును, పొందంగన్ = పొందుటను, కందు = పొందెదను.

తా. పక్షిరాజా! నా తం[డ్రి భీమరాజు నన్ను నలునకు ఈయక మిగిలిన ఇతరునకు ఈయ తలపెట్టిన విను, నేను నా శరీరాన్ని అగ్నికి ఆహుతిచేసి వచ్చే జన్మలో అతనిని పొందగలుగుతాను.

**74 శా. తద్దాసీత్వ పదంబు గైకొని కృతార్థత్వంబునుం బొందుదుం**
**దద్దివ్యాంఘ్రి సరోజ వందనవిధిం తాత్పర్యముం జెందుదుం**
**దద్దాక్షిణ్య మపేక్ష సేయుదు మదిం దత్సేవకుం జొత్తునేఁ**
**దద్దోరంతర పీఠిఁ జేరుతుఁ గుచద్వంద్వంబు నీ సత్కృపన్**

తత్ దాసీత్వ పదంబు = అతనికి సేవచేయు స్థానమును, గైకొని= పొంది, కృతార్థత్వంబునున్ = ధన్యత్వమును, పొందుదున్ = పొందుదును. తత్ = ఆ నలునియొక్క, దివ్య = మనోహరమైన, అంఘ్రి సరోజ = పాదపద్మములయొక్క, వందన విధిం = నమస్కరించు విధానమునందు, తాత్పర్యమున్ = ఆసక్తిని, చెందుదుం = పొందుదును. తత్ = ఆ నలునియొక్క, దాక్షిణ్యము = కరుణను, మదిన్ = మనసునందు, అపేక్ష చేయుదు = కోరుకొందును, తత్ = ఆతని, సేవకున్ = సేవించుటకు, చొత్తును = పూనుకొందును. నీ సత్కృపన్ = నీ దయతో, ఏన్ = నేను, తత్ = ఆతని, దోరంతరపీఠిన్ = బాహు మధ్యభాగమున, కుచద్వంద్వమున్ = స్తనముల జంటను, చేరుతున్ = చేర్చెదను.

తా. ఓ పక్షిరాజా! ఆ నలునికి సేవచేయు స్థానమును పొంది ధన్యత్వమును పొందెదను. ఆతని మనోహరమైన పాదపద్మములకు నమస్కరించు విధానమునందు ఆసక్తిని పొందుదును. మనసులో ఆతని కరుణను కోరి ఆతని సేవకు పూనుకొందును. నీదయచే ఆతని వక్షస్థలమున కౌగిలి సుఖము నందెదను.

**75 తే. అతనిఁ గోరుదు నే నంతరంగసీమ**
**నంతఁ జింతామణికిఁ జింత యాచరింపఁ**
**బద్మముఖుఁడైన యతఁడు నాపాలి కనఘ**
**పెన్నిధానంబు మాటలు పెక్కు లేల**

అనఘ = దోషరహితుడా!, నేను, అంతరంగ సీమన్ = మనసులో, అతనిన్ = అతనినే, కోరుదు = కోరుకొనుచున్నాను. అంతన్ = అతడు లభించిన, చింతామణికిన్ = కోరికలు తీర్చు చింతామణికొరకును, చింత = ఆలోచనను, ఆచరింపన్ = చేయను, పద్మముఖుడు ఐన = పద్మమువంటి ముఖముకలవాడైన, అతడు = ఆ నలమహారాజు, నా పాలికిన్ = నా కొరకు, పెను నిధానంబు = పెద్ద నిధివంటివాడు. పెక్కు మాటలు ఏల.

తా. ఓ రాజహంసమా! నేను మనసులో ఆ నలమహారాజునే కోరుకొనుచున్నాను. అతడు లభించిన చింతామణి కొరకును ఆలోచింపను. పద్మముఖుడైన ఆ నలమహారాజు నా పాలికి పెద్ద నిధివంటివాడు. ఇంకను పెక్కు మాటలు ఎందులకు?

**76 తే. వింటి తద్గుణ నికరంబు వీను లలర**
**గంటి నాతని మోహసం[కాంతిఁ దిశలఁ**
**బోలఁ దలఁచితి నీరం[ధ్ర బుద్ధిధారఁ**
**జాల వలచితి నతని నే సత్య మిదియ**

తత్ = ఆ నలమహారాజుయొక్క, గుణ నికరంబు = గుణ సమూహమును, వీనులు అలర = చెవుల కింపగునట్లుగా, వింటి = వింటిని. దిశలన్ = దిక్కులందు, ఆతని, మోహసం[కాంతిన్ = మోహసం[క్రమణమును, కంటిన్ = చూచితిని. నీరం[ధ్ర = వేరు ఆలోచనలేని, బుద్ధిధారన్ = ఎడతెగని బుద్ధిచే, పోలన్ తలచితిన్ = సరిపోల తలచితిని, అతనిన్ = అతనిని, ఏన్ = నేను, చాల = ఎక్కువగా, వలచితి = [పేమించితిని. ఇదియ = ఇదే, సత్యము = నిజము.

తా. ఓ పక్షిరాజా! ఆ నలమహారాజుయొక్క గుణాలను చెవులపండువుగా వినియున్నాను, దిక్కులన్నిట అతని మోహ సం[క్రమణమును చూచితిని. వేరు ఆలోచనలేని ఎడతెగని బుద్ధిచే అతనికి సరిపోల్చుకొనుచుంటిని. ఆ నలుని నేను చాల ఎక్కువగా [పేమించితిని. ఇదే సత్యము.

77 సీ. ఆతనిఁ గూర్చి నా ప్రాణంబు రక్షింపు
మింతయు నీచేతి దేమి సెప్ప
నాశ్రిత సంరక్షణాభ్యుత్థితంబైన
పరమ పుణ్యంబు చేపట్టు మిపుడు
మిథ్యా విశంక యేమిటికిఁ బాటింపుమీ
యవలంబనంబు సేయకు విలంబ
మనురాగ జలధి వేలాంతర్విమగ్నఁ
దెప్పవై ననుఁ జేర్పు తీరమునకు
తే. ధర్మపరులు వరాటికా దానమాత్ర
లాభమునకై మెత్తు రుల్లములలోనఁ
బ్రాణనాథ ప్రదాన తత్పరుఁడవైన
నిన్ను నేమని మెత్తునో నిర్మలాత్మ!

ఆతనిన్ = ఆ నలమహారాజును, కూర్చి = జతకలిపి, నా ప్రాణంబు రక్షింపుము, ఇంతయు = ఇదంతయును, ఏమి చెప్ప = ఏం చెప్పను!, నీ చేతిది = నీవల్ల కావలసినది. ఆశ్రిత = ఆశ్రయించినవారలను, సంరక్షణ = రక్షించుటవలన, అభ్యుత్థితంబైన = పుట్టినట్టి, పరమ పుణ్యంబు, ఇపుడు, చేపట్టుము = స్వీకరింపుము. మిథ్యా విశంక = పనికిరాని సందేహమును, ఏమిటికి = ఎందులకు?, అవలంబనంబు = ఆశ్రిత రక్షణమును, పాటింపుమీ = అనుసరించుమా! విలంబము = ఆలస్యము, చేయకు = చేయకుము. అనురాగ జలధిన్ = ప్రేమ సముద్రమున, వేలాంతర్ = నట్టనడుమ, నిమగ్న = మునిగిన, ననున్ = నన్ను, తెప్పవై = నావవై, తీరమునకు = దరికి, చేర్పు = చేర్చుము. ధర్మపరులు = ధర్మాత్ములు, వరాటికా దానమాత్ర లాభమునకై = గవ్వమాత్ర దాన లాభమునకు, ఉల్లములలోనన్ = మనసులందు, మెత్తురు = మెచ్చుకొందురు. నిర్మలాత్మ = స్వచ్ఛమైన మనసుకల ఓ హంసా!, ప్రాణనాథ ప్రదాన = భర్తను ఇచ్చుటయందు, తత్పరుడవైన = నిమగ్నుడవైన, నిన్నున్ = నిన్ను, ఏమని మెత్తునో = ఏమని మెచ్చుకొందును.

తా. ఆ నలమహారాజును జతకలిపి ఓ నిర్మలాత్మ నా ప్రాణంబు కాపాడుము. ఇదంతయును నీ వల్లే కావలసియుంది. ఇంక ఏంచెప్పను? ఆశ్రయించినవారలను సంరక్షించుటవలన పుట్టినట్టి పరమ పుణ్యమును ఇపుడు స్వీకరింపుము. పనికిరాని సందేహము ఎందులకు? అశ్రితరక్షణమును పాటించుము. ఆలస్యము చేయకుము. ప్రేమ సంద్రమున నట్టనడుమ మునిగిన నన్ను నావవై ఒడ్డుకు చేర్చుము. ధర్మాత్ములు గవ్వమాత్ర లాభమునకు మనసులందు మెచ్చుకుంటారు. భర్తను ఇచ్చుటయందు ఆసక్తిపరుడవైన నిన్ను ఏమని మెచ్చుకోను.

78. చ. మనమున లోకపాలు రెనమంద్రను మెచ్చఁ దృణీకరింతుఁ ద
క్కిన సురకోటి, రాసుతులఁ గీడ్పడఁ జూచుటఁ జెప్పనేటికిం
గొనకొని యా నృపాలునకుఁ గూర్చుటకై శపథంబు చేసెదన్
ననవిలుకాని పాదనలినంబులపై రతి చన్నుదోయిపై

మనమునన్ = మనసునందు, లోకపాలురు ఎనమంద్రను = ఎనిమిదిమంది దిక్పాలకులను, మెచ్చన్ = ఇష్టపడను, తృణీకరింతున్ = తిరస్కరింతును, తక్కిన = మిగిలిన, సురకోటి = దేవతాసమూహమును, రాసుతులన్ = రాజకుమారులను, కీడ్పడన్ చూచుట = తిరస్కరించుటను, చెప్పను ఏటికిన్ = చెప్పుట ఎందులకు? గొనకొని = పూనుకొని, ఆ నృపాలునకున్ = ఆ నలమహారాజునకు, కూర్చుటకై = జతపడుటకై, ననవిలుకాని = మన్మథునియొక్క, పాదనలినంబులపై = పాద పద్మములపై, రతి = రతీదేవియొక్క, చన్నుదోయిపై = స్తనయుగ్మముపై, శపథంబు చేసెదన్ = ప్రతిజ్ఞ చేసెదను.

తా. ఎనిమిదిమంది దిక్పాలకులను మనసులోనైనను ఇష్టపడను, తిరస్కరించెదను. మిగిలిన దేవతా సమూహమును, రాజకుమారులను తిరస్కరించుట ఇక చెప్పుట ఎందులకు? పూనుకొని ఆ నలమహారాజునకు జతపడుటకై మన్మథుని పాదపద్మములపైనను, రతీదేవి స్తనయుగ్మముపైనను ప్రతిజ్ఞ చేసెదను.

79 క. కార్యమిది కాలయాపన
ధైర్యసహము కాదు చను ముదంచిత గతి నో
యార్య భవన్నయ ధౌరం
ధర్యము చూతముగదా యుదాత్త స్ఫురణన్

ఓ ఆర్య = ఓ పూజ్యుడా!, కార్యము ఇది = ఇది చేయవలసిన పని, కాలయాపన = వ్యర్థముగా కాలము గడపుట, ధైర్యసహము కాదు = ధైర్యముచే సహింపదగినది కాదు, ఉదంచిత గతిన్ = తగిన మార్గమున, చనుము = వెళ్ళుము, భవత్ = నీయొక్క, నయ ధౌరంధర్యము = నీతి చాతుర్యమును, ఉదాత్త స్ఫురణన్ = గొప్ప ఔదార్యమును, చూతము కదా = చూస్తానుకదా!

తా.	ఓ పూజ్యుడా! ఇది చేయవలసిన పని. కాలయాపన చేయుట ధైర్యవంతుల లక్షణముకాదు. తగిన మార్గమున వెళ్ళుము. నీ నీతి  చాతుర్యమును, గొప్ప ఔదార్యమును చూచెదముగాక.

**80	తే. అతఁడు శుద్ధాంతగతుఁడైన యపుడు నీవు**
**నా ప్రసంగంబు సేఁత విన్నపువు గాదు**
**భామినీ ముఖ దాక్షిణ్య బలము కలిమి**
**నితర కాంత నిషేధించు నెవ్వఁడైన**

అతడు, శుద్ధాంతగతుడైన = అంతఃపురమునందున్న, అపుడు = ఆ సమయమున, నీవు, నా ప్రసంగంబు, సేత = చేయుట, విన్నపువు కాదు = తగినది కాదు, భామినీ ముఖ = తన స్త్రీలయొక్క, దాక్షిణ్య బలము కలిమి = మొగమాట బలము కలిగియుండుటచే, ఎవ్వడైన = ఎవరైనను, ఇతర కాంత = వేరే స్త్రీని, నిషేధించును = తిరస్కరించును.
తా.	ఆ నలమహారాజు అంతఃపురమునందున్న సమయమున నీవు నా ప్రసక్తిని చేయడం తగినది కాదు. తన భార్యలయొక్క మొగమాట బలము కలిగియుండడంచేత ఎవరయినా సరే వేరే స్త్రీని తిరస్కరిస్తారు.

**81	ఉ. నాగతి  విన్నవించుట యనర్హము సుమ్ము నిజావరోధ సం**
**భోగ నితాంతతృప్తుఁడగు భూపతికిన్ సలిలంబు దప్పి పోఁ**
**ద్రాగినవారి కింపగునె తన్పును దియ్యఁదనంబు వాసనా**
**యోగము గల్గెనేని విహగోత్తమ! నిర్మల వారి పూరముల్**

నిజ అవరోధ = తన అంతఃపుర స్త్రీలయొక్క, సంభోగ = రతిక్రీడచే, నితాంత = మిక్కిలి, తృప్తుడు అగు, భూపతికిన్ = రాజునకు, నాగతిన్ = నా పరిస్థితిని, విన్నవించుట = తెలియపరచుట, అనర్హము సుమ్ము = తగదు సుమా!, దప్పి = దప్పిక, పోన్ = పోవునట్లు, సలిలంబు = నీటిని, త్రాగినవారికి, విహగ ఉత్తమ = పక్షిశ్రేష్ఠా!, తన్పును = చల్లదనమును, తియ్యదనము, వాసనాయోగము = పరిమళ సంబంధము, కల్గెనేని = కలిగినప్పటికిని, నిర్మల వారిపూరముల్ = స్వచ్ఛమైన నీటిపూరములు, ఇంపు అగునె = రుచిస్తాయా?
తా.	తన అంతఃపుర స్త్రీల రతిక్రీడచే అత్యంతము తృప్తుడైన రాజునకు నా విషయమును వివరించుట తగదు సుమీ! దప్పిక పోవునట్లు నీటిని త్రాగినవారికి పక్షిశ్రేష్ఠా! చల్లదనమును, తియ్యదనము, పరిమళము కలిగినట్టి నీటిపూరములు ఇష్టములవుతాయా!

**82	తే. అధిక రోష కషాయిత స్వాంతుఁడైన**
**నరపతికి విన్నవింపకు నా యవస్థ**
**పైత్య దోషోదయంబునఁ బరుసనైన**
**జిహ్వికకుఁ బంచదారయుఁ జేఁదుగాదె**

అధిక = మిక్కిలి, రోష = కోపముచే, కషాయిత = కలుషమైన, స్వాంతుడైన = మనసుకలవాడైన, నరపతికిన్ = రాజునకు, నా అవస్థ = నా పరిస్థితి, విన్నవింపకు = చెప్పకుము. పైత్యదోషోదయంబునన్ = పైత్యదోషముయొక్క ఆధిక్యముచే, పరుసనైన = బిరుసుబారిన,  జిహ్వికకున్ = నాలుకకు, పంచదారయున్, చేదు కాదె.
తా.	పైత్యాధిక్యము కలవాని నాలుకకు పంచదార సహితము చేదుగానుండు విధమున అధిక కోపముతో కలుషాత్ముడైన రాజునకు నా విషయమును వివరింపకుము.

**83	ఆ. కదిసి నా తెఱంగు కార్యాంతరాసక్త**
**చిత్తుఁడైన పతికిఁ జెప్ప వలవ**
**దనవబోధ నిద్ర యవమాన ముద్రకుఁ**
**బ్రథమ కారణంబు పక్షిరాజ!**

పక్షిరాజ!, కార్యాంతరాసక్తచిత్తుడైన = వేరే కార్యమునందు ఆసక్తికల మనస్కుడైన, పతికి = రాజునకు, కదిసి = చేరి,  నా తెఱంగు = నా పరిస్థితి, చెప్ప వలవదు = చెప్పవద్దు, అనవబోధ నిద్ర = చెప్పుకొన్న మనవి తెలియనట్టి నిద్ర,  అవమాన ముద్రకున్ = అవమానమనెడు గుఱుతునకు, ప్రధమ కారణంబు = తొలి కారణము.
తా.	పక్షిరాజా! కార్యాంతరమునందు ఆసక్తిచూపు మనస్సు కలవాడైన రాజునకు చేరి నా పరిస్థితి చెప్పవద్దు. చెప్పుకొన్న మనవి తెలియనట్టి నిద్ర అవమాన గుఱుతునకు తొలికారణమగును.

**84	వ. కావున నవసరం బెఱింగి యాత్యంతికా సిద్ధి విలంబ సిద్ధులయందు నీకు నెయ్యది శుభంబై తోఁచునదియ చూచుకొనునది యని యవ్వైదర్భి మదనోన్మాదంబునం జేసి లజ్జాభరం బుజ్జగించి కులకన్యా జనంబులకు నుచితంబులు కాని యతి ప్రౌఢ వచనంబులం బలికిన**

తా.	కాబట్టి సమయము తెలుసుకొని త్వరగా పనియగుట, ఆలస్యముగా పనియగుట రెంటిలో నీకు ఏది శుభకరమై

తోచునో దానిని చూచుకొనుము అని ఆ దమయంతి మన్మథ తాపముతో సిగ్గు విడిచి కులకన్యలకు తగని మిక్కిలి ప్రౌఢ వచనములను పలుకగా (స్త్రీలు మూడు రకములు ముగ్ధ, మధ్య, ప్రౌఢ)

**85 ఉ. ఆ పరమేష్ఠి వాహన కులాగ్రణి భీమతనూజ మన్మథా**
**జ్ఞా పరతంత్రతన్ నలవశంవద మానసఁగా నెఱింగి చం**
**చూపుట మౌనముద్రఁ దఱిఁ జూచి వినిద్ర వివేకశాలి యు**
**ద్యాపనచేసెఁ గన్నుఁగొనలందుఁ దొలంకఁగ మందహాసమున్**

వినిద్ర = సందేహములేని, వివేకశాలి = జ్ఞానశాలియైన, ఆ పరమేష్ఠి = ఆ బ్రహ్మయొక్క, వాహన కుల అగ్రణి = వాహన కులములో శ్రేష్ఠమైన హంస, భీమతనూజ = దమయంతియొక్క, మన్మథ ఆజ్ఞా = మన్మథుని ఆదేశమునకు, పరతంత్రతన్ = లొంగినదగుటచే, నలవశంవద మానసగాన్ = నలునకు వశమైన మనస్సుకలదానినిగా, ఎఱింగి = తెలుసుకొని, తఱిన్ చూచి = సమయము చూచి, కన్ను కొనలందు, మందహాసమున్ = చిరునవ్వు, తొలంకగన్ = తొణికిసలాడగా, చంచూపుట = చంచూపుటముయొక్క, మౌనముద్ర, ఉద్యాపన చేసెన్ = చాలించెను.

తా. ఏమాత్రము సందేహములేని జ్ఞానశాలియైన ఆ బ్రహ్మవాహనకులశ్రేష్ఠమైన హంస దమయంతియొక్క మన్మథుని ఆదేశమునకు లొంగినదానినిగా, నలునకు వశమైన మనస్సు కలదానినిగా తెలుసుకొని సమయము చూచి కనుకొలకులందు చిరునవ్వు తొణికిసలాడగా, చంటూపుటముయొక్క మౌనముద్రను చాలించెను.

**86 సీ. విను మింతి! యీ యర్థమును ఘటింపఁగఁ జేయఁ**
**బుష్పనారాచుండు పూఁటకాఁపు**
**సమరూప లావణ్య సౌందర్యమగు మిథు**
**నంబుఁ గూర్పకపోదు నలినజునకు**
**నినుఁజేరి నిషధనాథుని యింద్రియములకు**
**నిజదేవ భూయంబు నివ్వటిల్లు**
**గన్నులు చల్లఁగాఁ గనుఁగొందు నేను మి**
**మిమ్మిరువుర దేవి దేవరను బోలె**
**తే. నీవు మా రాజుపైఁ గూర్మి నిలుపు గలిగి**
**చిత్త మఱసేయ కున్నట్లు చెప్పితిపుడు**
**వినుము నీవును నతని నెమ్మనమునందుఁ**
**గలుగు నీమీఁది ప్రేమంబు నలినవదన**

ఇంతి = దమయంతి, ఈ అర్థమును = ఈ పనిని, ఘటింపంగన్ చేయన్ = సమకూర్చుటకు, పుష్పనారాచుండు = మన్మథుడు, పూటకాపు = బాధ్యతదారుడు, నలినజునకు = బ్రహ్మకు, సమ = సమానమైన, రూప = రూపము, లావణ్య = సొగసు, సౌందర్యము అగు = సౌందర్యము కలిగినటువంటి, మిథునంబు = జంటను, కూర్పకపోదు = కూర్చక కుదరదు. నినున్, చేరి = కూడుటచేత, నిషథనాథుని ఇంద్రియములకు = నలుని పంచేంద్రియములకు, నిజదేవ భూయంబు = తమయొక్క దేవత్వము, నివ్వటిల్లు = ప్రవర్తిల్లును. మిమ్ము ఇరువుర = మీ ఇద్దరిని, కన్నులు చల్లగా, దేవి దేవరను పోలె, నేను, కనుగొందు = చూచెదను. నీవు, మా రాజుపైన్, కూర్మి = ప్రేమ, నిలుపు కలిగి = నిలకడ కలిగి, చిత్తము = మనస్సు, అఱసేయక ఉన్నట్లు = చలింపక యున్నట్లు, ఇపుడు, చెప్పితి, అతని = ఆ నలునియొక్క, నెమ్మనమునందు = నిండుమనసునందు, కలుగు = ఉన్నటువంటి, నీ మీది ప్రేమంబు, నలినవదన = దమయంతీ, విను = వినుము.

తా. దమయంతీ! ఈ పనిని సమకూర్చటానికి మన్మథుడు బాధ్యుడు. బ్రహ్మకు సమాన రూపము, సొగసు, సౌందర్యము కలిగిన జంటను కూర్చక కుదరదు. నిన్ను కూడుటచేత నలుని పంచేంద్రియములకు తమ దేవత్వము ప్రవర్తిల్లును. మీ ఇద్దరిని కన్నులు చల్లగా దేవిని దేవరనువలె నేను చూచెదను. నీవు మారాజుపై నిలకడ కలిగిన ప్రేమను ఏమాత్రము మనసు చలింపకయున్నట్లు ఇపుడు చెప్పితివి. ఇక ఆ నలుని మనసునందు ఉన్నట్టి నీమీది ప్రేమను దమయంతీ చెబుతాను వినుము.

**87 తే. వెలఁది సంకల్ప సోపాన వితతియందు**
**నతఁడు సూడంగ సంచరిం తహరహంబుఁ**
**ధరణిపుఁడు దీర్ఘ నిశ్వాస భరమునించుఁ**
**నద్భుతముగాదె యీచంద మరసిచూఁడ**

వెలది = దమయంతీ!, అతడు = ఆ నలుడు, చూడంగన్ = చూచుచుండగా, సంకల్ప = నలుని కోరికలనెడు, సోపాన వితతియందు = మెట్ల సమూహమునందు, అహరహంబు = ప్రతినిత్యము, సంచరింతు = తిరుగుచుందును. ధరణిపుడు = రాజు, దీర్ఘ నిశ్వాస భరమునించు = నిట్టూర్పు వాయువులను విడుచుచుండును. ఈ చందము = ఈ సంగతి, అరసి

చూడ = పరిశీలించి చూడగా, అద్భుతము కాదె = ఆశ్చర్యమే కదా!

తా. దమయంతీ! ఆ నలుడు చూస్తూండగా ఆతని కోరికలనెడు మెట్ల సమూహమునందు ప్రతినిత్యము నేను తిరుగుతూంటాను. రాజు నిట్టూర్పు వాయువులు విడిచిపెడుతూ ఉంటాడు. పరిశీలించి చూస్తే ఈ సంగతి ఆశ్చర్యముకదా!

**88 తే. హంసతూలికా తల్పంబునందు మేనిఁ**
**జేర్చి నప్పుడు నేత్ర రాజీవయుగము**
**చేరి చుంబించి మోహింపఁ జేయుదురన**
**నతివ! నిద్రయు నీవు నేమౌదురొక్కొ**

హంసతూలికా తల్పంబునందున్, మేనిన్ = దేహమును, చేర్చిన అప్పుడు, నేత్ర రాజీవయుగమున్ = పద్మములవంటి కన్నుల జంటను, చేరి, చుంబించి = ముద్దిడి, మోహింపన్, చేయుదురు = చేయుచుందురు. అన = అనగా, అతివ = ఓ దమయంతీ! నిద్రయున్, నీవును, ఏమౌదురొక్కొ = ఏమవుతారోకదా!

తా. హంసతూలికా తల్పమునందు శయనించినప్పుడు పద్మములవంటి ఆతని కనులజంటను చేరి ముద్దాడి మోహింపచేస్తూంటారంటే ఓ దమయంతీ! నీకు ఆ నిద్రకు ఉన్న సంబంధమేమిటో?

**89 వ. బాల! యాలేఖ్యమయ భవన్మూర్తి సౌందర్య సందర్శన లాలసుండును, నశ్రుధారాధౌత దీర్ఘ లోచనుండును, నిశ్వాస పరంపరా సంపాత పరిమ్లాన పాటలాధరుండును, ప్రవాళ శయ్యాచరణ కంపిత శరీరుండును, మదన దాహ జ్వరారంభ కంపితస్వాంతుండుననై విప్రలంభ వేదనా వికారంబున నకాండహాసంబును, నకారణ భయంబును, ననవసర శయ్యా సముత్థాన సంభ్రమంబును, నలక్ష్య ప్రేక్షణంబును, నప్రతివచన వాగారంభణంబునుం గలిగి యార్తి ధారా ప్రవాహంబున మూర్ఛాంధకార పంకంబున మునుంగుచున్నవాడు. భవత్ప్రాపకంబైన దోషంబునకు వెఱవఁడు దాస్యంబునకైన లజ్జింపఁడు.**

తా. ఓ దమయంతీ! చిత్రరూపములోనున్న నీ చక్కదనమును చూచుటయందు ఆసక్తికలవాడును, కన్నీటి ధారలచే కడుగబడని విశాల నేత్రములుకలవాడును, నిట్టూర్పుల పరంపరచే వాడిపోయిన తెల్లబాఱిన క్రిందిపెదవికలవాడును, చిగుళ్ళచే కల్పింపబడిన తల్పమునందు చలించు దేహముకలవాడును, మన్మథ తాపమువలన జ్వరకంపిత హృదయము కలవాడును, విరహ వేదనా వికారముచే అకారణ హాసము, అకారణ భయము, అకారణముగ పక్కనుండి లేచుటయందు తొట్రుపాటు, వెఱ్ఱి చూపులు, ప్రతివచనము లేని మాటలు, పీడ యను ధారా ప్రవాహమున మూర్ఛాంధకారమైన బురదయందు మునుంగుచున్నాడు. నిన్ను పొందెడి పాపమునకు వెఱవడు, నీ దాస్యమునకైనను సిగ్గుపడడు.

**90 చ. మదనుడు రెండు చేతులను మార్చడ నేయఁగఁ దూపులై దునుం**
**బదియయి వేఱువేఱ పరిపాటి నవస్థలు సంఘటింపఁగాఁ**
**దుదిదశ రాజునందుఁ దగఁ దోఁచుచునున్నది యేనువచ్చుచో**
**నది చిగురాకుబోఁడి యట యంబర పుష్ప వికాసమయ్యెడున్**

మదనుడు = మన్మథుడు, రెండు చేతులను, మార్చడన్ = మార్చి మార్చి, ఏయగన్ = వేయగా, తూపులు = బాణములు, ఐదునుం, పదియయి, వేఱువేఱ = వేరువేరుగా, పరిపాటిన్ = వరుసగా, అవస్థలు = పది అవస్థలను, సంఘటింపగాన్ = కలిగించగా, తుదిదశ = చివరిదశ, ఏనువచ్చుచోన్ = నే వచ్చే సమయమునకు, రాజునందున్, తగన్ = ఒప్పునట్లుగా, తోచుచునున్నది = కనబడుచున్నది. అది = ఆ అవస్థ, చిగురాకు బోడి = ఓ దమయంతీ!, అట = అచ్చట, అంబర పుష్ప వికాసము = ఆకాశ పుష్పము వికసించుటవంటిది, అయ్యెడున్ = అగును. (పది అవస్థలు – 1 చక్షుఃప్రీతి, 2 మనస్సంగమము, 3 సంకల్పము, 4 జాగరణ, 5 కృశించుట, 6 విషయనివృత్తి, 7 త్రపానాశనము, 8 మూర్ఛ, 9 ఉన్మాదము, 10 మరణము)

తా. మన్మథుడు రెండు చేతులతోను మార్చి మార్చి బాణములు వేయగా అవి ఐదును పదియయి వేరువేరుగా వరుసగా పదిఅవస్థలను కలిగించినవి. నే వచ్చే సమయానికి రాజునందు చివరిదశ తగ కనబడుచున్నది. ఆ అవస్థ ఓ దమయంతీ! అక్కడ ఆకాశపుష్పము వికసించుటవంటిదే అగుచున్నది. (నీ పొందు లభించును).

**91 వ. మదనశరవేదనా దూయమాన మానసుండైన యతండు పుత్తేర నీ సమ్ముఖంబునకు వచ్చితి. నీ చిత్తంబులోని భావంబు నెఱింగితి.**

తా. మన్మథ బాణ వేదనా బాధిత మనస్కుడైన ఆ నలమహారాజు పంపగా నీ ఎదుటకు వచ్చితిని. నీ మనస్సులోని భావమును తెలుసుకొంటిని.

**92 తే. తరుణి వైదర్భి నీవెట్టి ధన్యవొక్కొ**
**భావ హావ విలాస విభ్రమ నిరూఢిఁ**
**గౌముదీ లక్ష్మి యప్పాల కడలిఁ బోలె**
**నలరఁ జేసితి నిషధరాజంతవాని**

తరుణి = ఓ యౌవనవతీ!, వైదర్భి = దమయంతీ! కౌముదీలక్ష్మి = వెన్నెలసంపద, ఆ పాలకడలిన్ పోలెన్, భావము,

హావము, విలాసము, విభ్రమము శృంగారచేష్టలయొక్క, నిరూఢిన్ = ప్రసిద్ధిచేత, నిషధరాజు, అంతవాని, అలర చేసితివి = ఆనందపరచితివి, నీవు, ఎట్టి ధన్యవు ఒక్కొ = ఎటువంటి ధన్యురాలవోకదా! (అలంకారమ - ఉపమ)
తా. ఓ యౌవనవతీ! దమయంతీ! వెన్నెల తన సంపదతో పాలసముద్రమును వలె నీవు నీ శృంగారచేష్టలైన భావము, హావము, విలాసము, విభ్రమములను ప్రసిద్ధిచేత నిషధరాజంతవానిని సంతోషపరచితివి. నీవెంతటి ధన్యురాలవోకదా!

**93 వ. చంద్రుఁడును చంద్రికయుఁబోలెఁ బువ్వునుం దావియుంబోలె రసంబును భావంబునుంబోలె నవినాభావసంబంధంబున నతండును నీవును నన్యోన్య ప్రేమానుబంధంబున ధన్యత్వంబు నొందుండు. పాణిద్వయంబుచేతం బల్లవితంబును, మందస్మితంబుచేతం గోరకితంబును, శరీర సౌకుమార్యంబుచేతం బుష్పితంబును, గుచభరంబుచేత ఫలితంబునునైన భవన్మూర్తి కల్పపాదపంబునకు నృపతినందనుండు నందనోద్యానంబయ్యెడుంగాక మఱియును**

తా. చందమామ వెన్నెలవలె, పూవు పరిమళమువలె, రసమున భావమువలె అతడును నీవును ఒకప్పుడును విడివడని సంబంధముచేత పరస్పర ప్రేమాతిశయముచే ధన్యులు కండి. రెండు చేతులచేతను చిగిర్చినదియు, చిరునవ్వుచే మొగ్గ తొడిగినదియు, శరీర సౌకుమార్యముచే పుష్పించినదియు, స్తనభారముచేత ఫలించినదియునైన నీ స్వరూపమనెడు కల్ప వృక్షమునకు నలుడు నందనోద్యానవనము అగుగాక. ఇంకను

**94 తే. మహిత బంధాఢ్య రతికేళి మల్లయుద్ధ**
**సమయములయందుఁ జెలి మరుత్సముదయంబు**
**గుసుమవర్షంబు మీ మీఁదఁ గురియుఁ గాక**
**వనజదళనేత్ర! శృంగారవనములోన**

వనజదళనేత్ర = పద్మ పత్రములవంటి నేత్రములుకలదానా!, శృంగార వనములోన = క్రీడావనములో, మహిత = గొప్పవైన, బంధ = 84 రతి బంధములచే, ఆఢ్య = ఒప్పుచున్న, రతికేళి = సంభోగమనెడి, మల్లయుద్ధ సమయములందు, చెలి మరుత్ సముదయంబు = చెలులైన వాయు సమూహములు, మీ మీదన్ = మీపైన, కుసుమవర్షంబు = పూలవానను, కురియుగాక = కురియునుగాక.
తా. ఓ దమయంతీ! క్రీడావనములో గొప్పవైన ఎనుబదినాలుగు రతి బంధములచే ఒప్పుచున్న రతికేళియను మల్లయుద్ధ సమయములందు చెలులైన వాయుసమూహములు మీ పైన పూలవానను కురియుగాక.

**95 చం. నెలఁతుక యా నృపాలునకు నీకుఁ బరస్పర సంగమంబునం**
**గలయఁగ దాసి మానసయుగంబు వికాసము నొందుఁగాక పూ**
**విలుతుని దేహయష్టిఁ బ్రభవింపగఁ జేయ సమర్థమైన ని**
**ర్మల పరమాణు యుగ్మకము మాడ్కిని దైవ మనోనుకూలతన్**

నెలతుక = ఓ దమయంతీ!, ఆ నృపాలునకున్ = ఆ నలునకు, నీకున్, పరస్పర సంగమంబునన్ = ఒకరినొకరు కూడుట యందు, మానస యుగంబు = మీ రెండు మనసులు, కలయగన్ దాసి = కలిసి ఏకమై, దైవమనోనుకూలతన్ = దైవము అనుకూలించుటచేత, పూవిలుతుని = మన్మథుని, దేహయష్టి = శరీరము, ప్రభవింపగన్ చేయన్ = బ్రతికించుటకు, సమర్థమైన, నిర్మల = స్వచ్ఛమైన, పరమాణు = పరమాణువులయొక్క, యుగ్మకము మాడ్కిని = జతవలె, వికాసమున్ = ఆనందమును, ఒందుగాక = పొందుదురుగాక. (మన్మథుడు శివుని కోపమున భస్మమయ్యెను)
(మనస్సు పరమాణు రూపమని, రెండు పరమాణువుల కలయిక ద్వ్యణుకమగునని సిద్ధాంతము)
తా. ఓ దమయంతీ! ఆ నలునకు నీకు పరస్పర సంగమమున మీ రెండు మనసులు కలిసి ఏకమై దైవమనుకూలించుట చేత మన్మథుని శరీరము బ్రతికించుటకు సమర్థమైన స్వచ్ఛమైన పరమాణువులయొక్క జతవలె ఆనందమును పొందుడు.

**96 శా. గ్రీవాలంకృతి పట్టసూత్ర లతికా శ్రీకార రేఖాంకితన్**
**దేవీ! యవ్రణవంశసంభవ గుణాన్వీతన్ నినున్ గాయజుం**
**డావిర్భూత రతిం ధనుర్లతికఁగా నంగీకరించుం బలే**
**పూవింటన్ నిషధాధినాథు గెలువం బూనంగ రాకుండుటన్**

దేవీ = దమయంతీ!, పూవింటన్ = పూలధనువుతో, నిషధాధినాథున్ = నలుని, గెలువం బూనంగ = గెలవాలనుకోవడం, రాకుండుటన్= వీలుకాకపోవుటచే, గ్రీవ = మెడకు, అలంకృతి = అలంకారమైన, పట్టసూత్ర లతికా = తీగవంటి పట్టు దారముయొక్క, శ్రీకార రేఖాంకితన్ = శ్రీకారరేఖచే చిహ్నితవును, (వెదురులో సింధూరమును పెట్టి దాని చేవను పరీక్షించుట) అవ్రణ సంభవ = దోషరహితమైన కుటుంబమునందు జన్మించినదానవు, (నుసిపురుగులు డొల్లచేయడం వంటివి లేకుండుట) గుణాన్వీతన్ = చక్కని గుణములుకలదానవు,(అల్లె త్రాటితో కూడినదానిని) నినున్ = నిన్ను, కాయజుండు = మన్మథుడు, బలే = ఆహా! ఆవిర్భూత రతిన్ = పుట్టిన ప్రేమచే, ధనుర్లతికగాన్ = తీగవంటి ధనుస్సుగా, అంగీకరించున్.
(మన్మథుడు చెఱకుధనువుచే నలుని జయించలేనివాడయి దమయంతిని తన ధనుస్సుగా చేసికొనినాడు)

తా.	పూలధనువుతో నలుని గెలవడం వీలుపడక దమయంతీ! మెడకు అలంకారమైన తీగవంటి పట్టుదారముయొక్క శ్రీకారరేఖచే చిహ్నితవును, దోషరహితమైన కుటుంబమునందు జన్మించినదానవును, చక్కని గుణములుకలదానవునునైన నిన్ను ప్రేమ పుట్టి మన్మథుడు ధనుస్సుగా అంగీరించును. ఓహో!

**97	తే. తరుణి నతనాభి మండలోదంచనాభి**
**రామ రోమావళీ జ్యా విరాజమాన**
**నీదు తనువుండ విలుసేసి నెఱకులేయు**
**రతివరుఁ దురోజగుళికల రాజవదన**

తరుణి = దమయంతీ!, రాజవదన = చంద్రునివంటి ముఖముకలదానా! నత = లోతైన, నాభిమండల = నాభి ప్రదేశమునుండి, ఉదంచన = మీదుగా బయలుదేరిన, అభిరామ = మనోహరమైన, రోమావళీ = నూగారనెడి, జ్యా = నారిచే, విరాజమాన = ప్రకాశించునట్టి, నీదు = నీయొక్క, తనువు ఉండన్ = నీ శరీరము ఉండగా, విలుసేసి = ధనుస్సును చేసుకొని, రతివరుడు = మన్మథుడు, ఉరోజ గుళికల = కుచములనెడి గుళికలచే, నెఱకులన్ = మర్మస్థానముల, ఏయున్ = వేయును.

తా.	చంద్రునింటి ముఖముకల ఓ దమయంతీ! లోతైన నాభీ ప్రదేశము మీదుగా బయలుదేరిన మనోహరమైన నూగారనెడి నారితో ప్రకాశమానమైన నీ శరీరమును విల్లుగా చేసుకొని మన్మథుడు నీ స్తనములనెడి గుళికలను నలుని మర్మస్థానములపై వేయును.

**98	వ. అని పలికి వీరె సఖులు వచ్చుచున్నవారు మంత్రరహస్యంబులు బయలుపడకుండవలయు. నన్ను వీడుకొల్పు పోయివచ్చెదనని తదనుమతి వడసి గగనమార్గంబున నిషధాధిపరాజధానికి నభిముఖుండై చనియె నప్పుడు.**

తా.	హంస ఆ రీతిగా పలికి నీ చెలికత్తెలు వచ్చుచున్నారు. మన ఆలోచనా రహస్యములు తెలియరాదు. నన్ను పంపుము పోయి వచ్చెదను అని దమయంతివద్ద సెలవు తీసుకొని ఆకాశమార్గమున నలుని రాజధాని దిశగా వెళ్ళినప్పుడు.

**99	మ. మరు వాలారు శరంబులం దొరఁగు కమ్మందేనెతోఁ గూడి య**
**య్యరవిందాక్షికిఁ బక్షిపుంగవ గవీహైయంగవీనంబు ని**
**ర్భర హర్షంబు నొనర్చె మున్ను రుచి సౌరభ్యంబులం బిమ్మటన్**
**మురియం ద్రోయుచు నూన్చె నెమ్మనమునన్ మూర్ఛా సముచ్ఛ్రాయమున్**

మరు = మన్మథునియొక్క, వాలారు = వాడియైన, శరంబులన్ = బాణములను, తొరగు = కారు, కమ్మం తేనెతోన్ = మకరందముతో, కూడి, అరవిందాక్షికి = దమయంతికి, పక్షిపుంగవ = హంసశ్రేష్ఠునియొక్క, గవీ = మాటలనెడి, హైయంగవీనంబు = తాజా నేయియొక్క, రుచి సౌరభ్యంబులన్ = రుచి సువాసనలచే, మున్ను = ముందుగా, నిర్భర = సహింపశక్యముకాని, హర్షంబు = సంతోషమును, ఒనర్చె = కలిగించెను, పిమ్మటన్ = తరువాత, నెమ్మనమునన్ = నిండుమనసున, మూర్ఛా సముచ్ఛ్రాయమున్ = మూర్ఛాతిశయమును, మురియన్ = ముక్కలుగా, త్రోయుచున్ = వెడలగొట్టుచు, ఊన్చెన్ = ఒప్పుచుండెను.

తా.	మన్మథుని వాడిబాణములనుండి కారు మకరందముతో కూడి దమయంతికి రాజహంసయొక్క మాటలనెడి తాజా నేయియొక్క రుచి, సువాసనలచే ముందుగా అంతులేని ఆనందము కలిగినది తరువాత మనసున మూర్ఛాతిశయమును ముక్కలుగా బయటకు వెడలగొట్టుచు ఒప్పుచుండెను. (అలంకారము – విరోధాభాసము)

**100	తే. ప్రాణబాంధవుఁడైన యప్పక్షిరాజు**
**నభ్రమార్గంబునం దొయ్య ననుచరింప**
**నశ్రుధారా ప్రవాహంబ యవధి గాఁగ**
**దైన్యమందుచు మరలె వైదర్భి చూడ్కి**

ప్రాణబాంధవుడు ఐన = ప్రాణముతో సమానమైన బంధువైన, ఆ పక్షిరాజును, అభ్రమార్గంబునందు = ఆకాశమార్గాన, ఒయ్యన్ = క్రమముగా, అనుచరింపన్ = సాగనంపుచు, అశ్రుధారాప్రవాహంబ = కన్నీటి ధారా ప్రవాహమే, అవధి కాగ = హద్దుకాగా, దైన్యము = దీనత్వమును, అందుచు = పొందుచు, వైదర్భి = దమయంతియొక్క, చూడ్కి = చూపు, మరలెన్ = వెనుతిరిగెను.

తా.	ప్రాణబంధువైన ఆ పక్షిరాజును ఆకాశమార్గాన పోవుటకు సాగనంపుచు కన్నీటి ధారాప్రవాహమే హద్దుకాగా దీనత్వమునందుచు దమయంతి తన చూపులను మరల్చెను.

**101	వ. ఇవ్విధంబునఁ బక్షవిక్షేప సూచిత నిజకార్య ప్రయోజన సద్భావుండయి యమ్మహానుభావుండు దనరాక కెదురుచూచుచుం దటాకప్రాంత కేళీవనాంతరమున నశోకానోకహచ్ఛాయా శీతల శిలాతలంబున నుపవిష్టుండైన నిషధరాజుం గనుంగొని తన పోయివచ్చిన వృత్తాంతంబంతయు నెఱింగించిన ముదితస్వాంతుడై**

తా.	ఈ ప్రకారముగా విప్పిన ఱెక్కలచే సూచింపబడుచున్న తన కార్య సాఫల్యముయొక్క ప్రాప్తికలవాడయి ఆ మహానుభావుడు తన రాకకొరకు ఎదురుచూచుచు చెఱువు సమీపమునందలి క్రీడావనమున అశోకవృక్షముల నీడయందు చంద్రకాంత శిలావేదికపై ఆసీనుడైన ఆ నలుని చూచి తను పోయి వచ్చిన విషయమును వివరింప సంతోషించినవాడై.

**102	మ. సరసత్వంబు నిగూఢకార్యఘటనా చాతుర్య సంపత్తియుం**
**బురుషార్థైక పరాయణత్వమును నభ్యుత్థాన లీలాధురం**
**ధరతా ప్రౌఢిమయుం గృతజ్ఞతయు వాత్సల్యంబు సద్భావమున్**
**సరసీజాసన వాహనాన్వయ వతంసా! హంస! నీకందముల్**

సరసీజ ఆసన వాహన = బ్రహ్మయొక్క వాహనమైన హంసయొక్క, అన్వయ వతంసా = వంశ శ్రేష్ఠుడా!, హంస; సరసత్వంబున్ = సంకల్పమును, నిగూఢ = రహస్యముగా, కార్య ఘటనా = పనిని సాధించుటయందు, చాతుర్య = నేర్పుయొక్క, సంపత్తియున్ = సమృద్ధియును, పురుషార్థ = పురుషార్థములను, ఏక = ప్రధానముగా, పరాయణత్వమునున్ = నెఱవేర్చుటయందాసక్తియును, అభ్యుత్థాన = పూనినదానిని, లీల = క్రీడగా, దురంధరతా ప్రౌఢిమయున్ = నిర్వహించుట యందు నేర్పును. కృతజ్ఞతయు = చేసినమేలు మఱువకుండుటయు, వాత్సల్యంబు = అనురాగమును, సద్భావమున్ = మంచి మనసును, నీకు, అందముల్ = అందమైయున్నవి.

తా.	ఓ బ్రహ్మ వాహన వంశ శ్రేష్ఠా! హంసా! సరసత్వము, రహస్య కార్యసాధన చాతుర్యము, పురుషార్థ పరత్వము, అనుకున్నది సాధించునేర్పు, కృతజ్ఞత, వాత్సల్యము, సద్భావము, నీకు అందమైయున్నవి.

**103	క. పరవతియగు దమయంతిని**
**ధరణీధవ కన్య నల్ప తారుణ్య సఖీ**
**పఱివార మెఱుఁగ కుండఁగ**
**బరిచిత నిమిషమునఁ జేయఁ బరులకు వశమే?**

పరవతియగు = పరాధీనురాలైన, ధరణీధవ కన్యను = రాజ కుమారిని, అల్ప తారుణ్యన్ = లే ప్రాయముదానిని, సఖీ పరివారము ఎఱుక కుండగ = చెలికత్తెలకు తెలియకుండగ, నిమిషమున = కొద్ది క్షణములలోనే, పరిచితన్ చేయన్ = పరిచయస్థురాలని చేయుట, పరులకు వశమే = ఇతరులకు సాధ్యమా?

తా.	స్వాంతంత్ర్యము లేనట్టియు, రాజ కుమార్తెయు, లే ప్రాయముదానిని, చెలికత్తెలకు తెలియకుండగ కొద్ది క్షణములలోనే పరిచయస్థురాలిని చేయుట ఇతరులకు సాధ్యముకాదు. (నీవల్లనే సాధ్యమయినది)

**104	వ. అని గారవించి**

**105	శా. ఏమేమీ యని విన్నమాటయ వినున్ వీక్షించు నెమ్మోము సాం**
**ద్రామోదంబునఁ బక్షముల్ నివురు హస్తాంభోజ యుగ్మంబునన్**
**భామారత్నము రూపసంపదఁ దగన్ భావించు నానంద మా**
**ధ్వీమత్తుండయి చొక్కుఁ జిత్తమునఁ బృథ్వీనాయకుండెంతయున్**

పృథ్వీనాయకుండు = రాజు, విన్న మాటయ = విన్నటువంటి మాటనే, ఏమేమీ అని, వినున్, నెమ్మోము = ఆ హంస ముఖమును, వీక్షించు = చూచును, సాంద్ర = అధికమైన, మోదంబునన్ = సంతోషముతో, హస్తాంభోజ యుగ్మంబునన్ = పద్మములవంటి చేతులతో, పక్షముల్ = ఱెక్కలను, నివురు = దువ్వును, భామారత్నము = దమయంతియొక్క, రూప సంపదన్ = సౌందర్యము, తగన్ = తనకు తోచిన రీతిగా, భావించును = ఊహించును, ఆనంద మాధ్వీ మత్తుండయి = సంతోషమనెడి సారాయిచే మత్తెక్కినవాడై, ఎంతయున్ = మిక్కిలి, చిత్తమునన్ = మనసునందు, చొక్కున్ = పరవశుడగును.

తా.	నలమహారాజు ఆ హంస చెప్పు మాటలనే మరల మరల అడిగి వినును. ఆ హంస ముఖమును చూచుచుండును. మిక్కిలి సంతోషముతో తన పద్మములవంటి చేతులతో దాని ఱెక్కలను దువ్వును. దమయంతియొక్క రూపమును పలురీతుల ఊహించుకొని సంతోషాంతరంగుడై మనసున మిక్కిలి పరవశుడగును.

**106	వ. ఇవ్విధంబున నానందరసమగ్నుండైన యన్నరేంద్రుం గనుంగొని విహంగపుంగవుండు కార్యంబు సంఘటితంబయ్యె నింక నాకుం బంకజాసనునకుం బరిచర్య సేయం బోవలయునని పలికి యతనిచేత సముచిత ప్రకారంబున వీడుకోలు వడసి, బ్రహ్మలోకంబునకుం జనియె నప్పుడు**

తా.	ఈ ప్రకారముగా ఆనందరసములో మునిగినవాడైన ఆ రాజును చూచి హంస పని సఫలంబైనది, ఇంక నాకు బ్రహ్మదేవునకు సేవ చేయుటకు వెళ్ళవలయునని పలికి ఆ నలునిచేత తగిన విధముగ సెలవు తీసుకొని బ్రహ్మలోకమునకు వెళ్ళెను. అప్పుడు

**107	తే. నిషధభూవల్లభుం డాత్మ నిండియున్న**
**కౌతుకంబు ప్రకాశంబు కాకయుండ**

**వనము వెలువడి పరివారజనము గొలువ**
**వచ్చెఁ గ్రమ్మఱ నాత్మ నివాసమునకు**

నిషధభూవల్లంభుండు = నలమహారాజు, ఆత్మ నిండియున్న = మనసంతా నిండిన, కౌతుకంబు = సంతోషము, ప్రకాశంబు కాకయుండ = వెల్లడి కాకుండగా, వనము వెలువడి = క్రీడావనమునుండి బయటకువచ్చి, పరివారజనము = సేవకజనము, కొలువన్ = సేవింపగా, క్రమ్మఱన్ = తిరిగి, ఆత్మ నివాసమునకు = తన నివాసమునకు, వచ్చెన్ = వచ్చెను.

తా. నలమహారాజు మనసంతా నిండిన సంతోషము వెల్లడి కాకుండునట్లుగా క్రీడావనమునుండి బయటకు వచ్చి సేవకజనము కొలుచుచుండగా తిరిగి తన నివాసమునకు వచ్చెను.

**108 వ. వచ్చి విదర్భరాజకన్యా వియోగ విహ్వాలుండగుచుఁ గాలంబు గడపుచుండె నంత నక్కడ**

**109 చ. నలవసుధాకళత్రుని గుణంబె గుణంబుగ సారసౌరభా**
**కలిత తదీయ కీర్తి కళికామయమైన శరాసనంబునన్**
**విలసిత సౌమనస్య పదవీరుచిరంబగు తద్విలాసమున్**
**ములికిగఁజేసి మన్మథుఁడు ముద్దియనేయఁ దొడంగెనెవ్వడిన్**

నలవసుధాకళత్రుని = నలమహారాజుయొక్క, గుణంబె = సద్గుణమే, గుణంబుగ = వింటినారిగా, సార = గొప్పదైన, సౌరభ ఆకలిత = పరిమళముతో కూడిన, తదీయ = ఆ నలునియొక్క, కీర్తి = కీర్తియనెడి, కళికామయమైన = మొగ్గలతో కూర్చబడిన, శరాసనంబునన్ = ధనుస్సుచేత, విలసిత = ఒప్పునట్టి, సౌమనస్య = సహృదయతకు, పదవీ = స్థానమగుటచే, రుచిరంబగు = మనోహరమైన, తత్ విలాసమున్ = అతిని సొగసును, ములికిగన్ చేసి = బాణముగా చేసుకొని, మన్మథుడు, ముద్దియన్ = దమయంతిని, ఎవ్వడిన్ = శీఘ్రముగా, ఏయన్ తొడంగెన్ = వేయసాగెను.

తా. మన్మథుడు నలుని సద్గుణమును వింటి నారిగా చేసుకొని, అతని వ్యాప్తి చెందిన కీర్తియనెడి మొగ్గలతో కూర్చబడిన ధనుస్సుచేత సహృదయతకు చోటగు మనోహరమగు అతని సొగసును బాణముగా చేసుకొని శీఘ్రముగా దమయంతిని కొట్టసాగెను. (అలంకారము – రూపకము.)

**110 తే. అతను తాపజ్వరంబు మై నమరియుండఁ**
**జపలలోచన ప్రియకథాసరసిఁ దేలె**
**నా యపథ్యంబునన కదా యంతకంత**
**కలరుబోఁడికి సంతాప మతిశయిల్లె**

చపలలోచన = దమయంతి, అతను తాప జ్వరంబు = మన్మథ తాప జ్వరము, మైన్ = దేహమునందు, అమరియుండ = ప్రవేశించియుండగా, ప్రియ = నలునియొక్క, కథాసరసిన్ = చరిత్రమనెడు సరస్సునందు, తేలెన్ = తేలియాడెను, ఆ అపథ్యంబునన కదా = ఆ అపథ్య దోషముచేతనేకదా!, అలరు బోడికిన్ = దమయంతికి, సంతాపము, అతిశయిల్లె = హెచ్చెను.

(జ్వరముతో నున్నవారు చన్నీట స్నానమాడిన జ్వరము హెచ్చును)

తా. దమయంతి మన్మథ తాప జ్వరముచే బాధపడుచు నలుని చరిత్రమనెడి సరస్సులో ఈదులాడెను. ఆ అపథ్య దోషము కారణముగా దమయంతికి సంతాపము అధికమయ్యెను.

**111 తే. కమలనేత్ర కవస్థాన విముఖమైన**
**చంచలత్వంబు మదిఁ బ్రకాశించుచుండె**
**బాల యాలీల నభ్యసింపంగఁ బోలు**
**రమణ దూత పతంగ శక్రంబుతోడ**

కమలనేత్రకు = దమయంతికి, అవస్థాన = స్థితికి, విముఖమైన = వ్యతిరేకమైన, చంచలత్వంబు = చాంచల్యగుణము, మదిన్ = మనసునందు, ప్రకాశించుచుండె = ఒప్పుచుండెను. బాల = దమయంతి, ఆ లీలన్ = ఆ చాంచల్య గుణమును, రమణ దూత = ప్రియుని దూతయైన, పతంగ శక్రంబుతోడ = పక్షిరాజునొద్ద, అభ్యసింపంగన్ పోలు = నేర్చుకుని ఉండవచ్చును

తా. దమయంతికి తన స్థితికి వ్యతిరేకమైన చంచలత్వము మనసున ఒప్పుచుండెను. ఆ చాంచల్యగుణమును దమయంతి తన ప్రియుని దూతయైన పక్షిరాజగు హంసవద్ద నేర్చుకుని యుండవచ్చును. (అలంకారము – ఉత్ప్రేక్ష, అర్థాంతరము)

**112 ఉ. బాలిక చెక్కుటద్దముల పజ్జలఁ గోమల మందహాస రే**
**ఖాలవ మంకురింపదు వికాసము నొందదు నెమ్మనంబునన్**
**వాలిక మించు కన్గొనల వాకిట నల్లన సంచరింపనుం**
**జాలక చాలఁ గుంటుపడెఁ జారు నిరీక్షణ ఖంజరీటముల్**

బాలిక = దమయంతియొక్క, చెక్కుటద్దముల = అద్దములవంటి చెక్కిళ్ళయొక్క, పజ్జలన్ = ప్రక్కలయందు, కోమల =

మృదువైన, మందహాసరేఖ = చిరునవ్వుయొక్క, లవము = లేశము, అంకురింపదు = మొలకెత్తదు, నెమ్మనంబునన్ = మనసునందు, వికాసము = సంతోషము, ఒందదు = పొందదు, వాలిక = బాణమును, మించు = మించినట్టి, కన్గొనల = క్రీగంటియొక్క, వాకిటన్ = వాకిలియందు, చారు = సుందరములయిన, నిరీక్షణ = చూపులనెడి, ఖంజరీటముల్ = కాటుక పిట్టలు, అల్లన = మెల్లగా, సంచరింపనుం = తిరుగాడుటకు, చాలక = సమర్థముకాక, చాల = మిక్కిలి, కుంటువడెన్ = కుంటివి అయ్యెను.

తా. దమయంతియొక్క చెక్కుటద్దముల ప్రక్కలందు కోమలమైన చిఱునవ్వు లేశమైనను మొలకెత్తుట లేదు. మనసున ఆనందమును పొందుట లేదు. బాణమును మించిన క్రీగంటి వాకిలియందు సుందరములైన చూపులనెడి కాటుకపిట్టలు మెల్లగా తిరుగాడుటకు సమర్థములు కానివై మిక్కిలి కుంటివి అయిపోయినవి. (అలంకారము – రూపకము)

**113 సీ. అతివ సమ్ముఖ వాస్తువగు వస్తువును గాన**
**దాత్మ యంతర్ముఖంబౌటఁ జేసి**
**చెలువ క్రొమ్మించు లేఁజెక్కు టద్దంబొయ్యఁ**
**బాణిపల్లవశయ్యఁ బవ్వళించె**
**కోమలి నిట్టూర్పు క్రొవ్వేఁడి నెత్తావి**
**ముసరు తేంట్లును మూతి ముట్ట వెఱచెఁ**
**దరుణి లోచన బాష్ప ధారా లవంబులు**
**ముత్యాలసరులతో ముద్దు గురిసె**
**తే. జామ! శరకాండ పాండిమ చ్ఛాయనొందె**
**బోటి మదికింపు గాదయ్యె నాట పాట**
**మృగవిలోచన కంతంత మేను డస్సె**
**నంతకంతకు సంతాప మతిశయిల్లె**

ఆత్మ = మనస్సు, అంతర్ముఖంబు = నలునే ధ్యానించుచున్నట్టిది, ఔట చేసి = కాబట్టి, అతివ = దమయంతి, సమ్ముఖ వాస్తువు = ఎదుటనున్నదియగు, వస్తువును= వస్తువునైనను, కానదు = చూడదు. చెలువ = దమయంతియొక్క, క్రొమ్మించు = క్రొత్తకాంతులుగల, లే = కోమలములైన, చెక్కుటద్దంబు = అద్దమువంటి చెక్కిళ్ళు, ఒయ్యన్ = మెల్లగా, పాణి పల్లవ శయ్యన్ = చిగురువంటి కరమనెడు శయ్యయందు, పవ్వళించెన్ = శయనించెను. కోమలి = దమయంతియొక్క, నిట్టూర్పు, క్రొవ్వేడి = క్రొత్త వేడి, నెత్తావి = పరిమళమునకు, ముసురు, తేంట్లును = తుమ్మెదలును, మూతి ముట్టన్, వెఱచెన్ = భయపడెను. తరుణి = దమయంతియొక్క, లోచన బాష్ప ధారా = కన్నీటి ధారలయొక్క, లవంబులు = బిందువులు, ముత్యాలసరులతో = ముత్యాల హారములతో, ముద్దు కురిసె = ముద్దులొలికెను. చామ = దమయంతి, శరకాండ పాండిమ చ్ఛాయన్ = తామర తూడుయొక్క తెల్లదనమును, ఒందెన్ = పొందెను. బోటి మదికి = దమయంతి మదికి, ఆట పాట, ఇంపు కాదయ్యె = ఇష్టము కాకపోయినవి, మృగ విలోచనకున్ = లేడి చూపులవంటి చూపులుకల దమయంతికి, మేను = శరీరము, డస్సె = చిక్కెను. అంతకంతకు = క్రమక్రమముగా, సంతాపము = మన్మథ తాపము, అతిశయిల్లె = అధికమాయెను.

తా. దమయంతి మనస్సు నలునే ధ్యానించుచున్నది కాబట్టి ఎదుటనున్న వస్తువునుకూడ ఆమె చూచుటలేదు. ఆమె కోమలములైన చెక్కిళ్ళు మెల్లగా చిగురువంటి చేతినానుకొని శయనించెను. ఆమె నిట్టూర్పుయొక్క క్రొత్త వేడికి పరిమళమునకు మూగు తుమ్మెదలు కూడా మూతి పెట్టడానికి భయపడుచున్నవి. ఆమె కన్నీటి బిందువులు ముత్యాల హారములతో ముద్దు లొలుకుచుండెను. ఆ దమయంతి దేహము తామర తూడువలె తెల్లనయ్యెను. దమయంతి మదికి ఆట పాట ఇష్టము కాక పోయినవి. లేడి చూపులవంటి చూపులుకల దమయంతికి శరీరము చిక్కిపోయెను. మన్మథ తాపము క్రమక్రమముగా అధికమగుచుండెను.

**114 చ. ఉదిత మనోనురాగ దహనోష్మ భరంబున నా లతాంగికిన్**
**హృదయమునందు జొబ్బిల వహించిన చందన కర్దమంబు బు**
**ద్బుదదముల నీనెఁ గల్పిత విభూషణ జాల మృణాలవల్లరీ**
**వదనములం దమందగతి వారక పిచ్చిలఁ జొచ్చె ఫేనముల్**

ఆ లతాంగికిన్ = ఆ దమయంతికి, హృదయమునందు = వక్షస్థలముపై, జొబ్బిలన్ = నిండుగా, వహించిన = పూసిన, చందన కర్దమంబు = మంచి గంధము, ఉదిత = ఉదయించిన, మనోనురాగ = మనసునందలి ప్రేమయనెడు, దహన = అగ్నియొక్క, ఊష్మ భరంబునన్ = తాపముచే, బుద్బుదంబులన్ = నీటబిందువులను, ఈనెన్ = వెడలగ్రక్కెను, కల్పిత = కూర్చబడిన, విభూషణ జాల = అలంకార రూపములైన, మృణాలవల్లరీ = తామరతూండ్లయొక్క, వదనములందు = ముఖములందు, ఫేనముల్ = నురుగులు, అమందగతిన్ = ఆగక, వారక = ఎడతెగకుండా, పిచ్చిలన్ చొచ్చెన్ = వెదజల్ల

బడుచుండెను.

తా. ఆ దమయంతికి మనసునందలి తాపము పోవుటకై వక్షస్థలముపై నిండుగా పూసిన మంచిగంధము ప్రేమయనెడు అగ్నిచే నీటిబిందువులను వెడలగ్రక్కుచుండెను. మన్మథతాపముచే శరీరమున కూర్చబడిన తామరతూండ్లు ఎడతెరపి లేకుండా నురుగలు గ్రక్కుచుండెను. (అలంకారము – అతిశయోక్తి)

**115 మ. దశ లంతంతకు నెక్కఁగా విరహ సంతాపాతి రేకంబునన్**
**శశిబింబాననకుం దమస్వసకుఁ గార్శ్యంబొందె దేహం బహ**
**ర్నిశమున్ సాంద్ర నిరంతర స్మృతి సమున్మేషంబునం గాంతకుం**
**దశ దిగ్భిత్తులయందుఁ గానఁబడియెం దద్రూప చిత్రావళుల్**

శశిబింబాననకున్ = చంద్రబింబమువంటి ముఖముకల, దమస్వసకున్ =దమయంతికి, దశలు = మన్మథావస్థలు, అంతంతకు = క్రమక్రమముగా, ఎక్కన్‌గా = ఎక్కువకాగా, విరహసంతాపాతిరేకంబునన్ = విరహబాధ అతిశయముచే, దేహంబు = శరీరము, కార్శ్యంబు ఒందెన్ = కృశించెను, అహర్నిశమున్ = పగలు రాత్రి, సాంద్ర = దట్టమైన, నిరంతర = ఎడతెగని, స్మృతి = నలునే తలచుటయను, సమున్మేషంబునన్ = అతిశయముచే, కాంతకు = దమయంతికి, దశ దిగ్భిత్తులయందున్ = పది దిక్కులనెడు గోడలయందు, తద్రూప చిత్రావళుల్ = ఆ నలుని చిత్తరువుల సమూహములు, కానంబడియెన్ = కనబడసాగెను.

తా. చంద్రబింబాననయగు దమయంతికి మన్మథావస్థలు క్రమక్రమముగా పెరుగుచుండగా విరహబాధాతిశయముచే దేహము కృశించసాగెను. పగలు రాత్రి నిరంతరము ఆ నలునే స్మరించుటచే దమయంతికి పది దిక్కులనెడి గోడలయందు ఆ నలుని చిత్తరువులు సమూహమూలే కనబడసాగెను. (అలంకారము – రూపకము)

**116 తే. చెలులు శిశిరోపచారముల్ సేయుపొంటెఁ**
**బ్రోవు లిడ్డ మృణాళ కర్పూర వితతిఁ**
**గాంచి వైదర్భి మదిలోనఁ గళవళించె**
**జాల కాయాత చంద్రికా జాలమనుచు**

చెలులు = చెలికత్తెలు, శిశిర ఉపచారముల్ = తాపశాంతికి సేవలు, చేయుపొంటెన్ = చేయుటకుగాను, ప్రోవులు ఇడ్డ = పోగులుగా పెట్టబడిన, మృణాళ = తామరతూండ్లయొక్కయు, కర్పూర = కర్పూరముయొక్కయు, వితతిన్ = సమూహమును, కాంచి = చూచి, వైదర్భి = దమయంతి, జాలక ఆయాత = కిటకీలనుండి వచ్చిన, చంద్రికా జాలము అనుచు = వెన్నెల సమూహము అని, మదిలోనన్ = మనస్సులో, కళవళించె = కలవరపడసాగెను.

తా. చెలికత్తెలు తాపశాంతికి సేవలు చేయుటకుగాను ప్రోగులు పెట్టిన తామరతూండ్లు, కర్పూరము సమూహమును చూచి దమయంతి కిటకీలనుండి వచ్చిన వెన్నెల సమూహమని మనస్సులో కలవరపడసాగెను. (భ్రాంతిమదలంకారము)

**117 క. బిస పన్నగ భూషణయును**
**బ్రసవ రజో భూతి మతియుఁ బాండిమ లక్ష్మీ**
**వసతియునై చూపెను సతి**
**యసమాయుధునకుఁ బినాకి యాటోపంబున్**

బిస పన్నగ భూషణయును = తామరతూడులనెడి పాములు అలంకారముగా కలదియు, ప్రసవరజస్ = పుష్పపరాగమనెడి, భూతి మతియున్ = విభూతి కలదియు, పాండిమలక్ష్మీ = తాపముచే తెల్లనైన, వసతియునై = దేహసంపదయు కలదియై, సతి = దమయంతి, అసమాయుధునకు = మన్మథునకు, పినాకి = శివునియొక్క, ఆటోపంబున్ = భ్రాంతిని, చూపెను.

తా. తామరతూడులనెడి పాములు అలంకారముగా కలదియై, పుష్ప పరాగమనెడి విభూతి కలదియై, తాపముచే తెల్లనైన దేహసంపద కలదియై, దమయంతి మన్మథునకు శివుడను భ్రాంతిని చూపెను. (అలంకారము – రూపకము)

**118 తే. మన్మథానల తాపంబు మాన్ప వేఁడి**
**డెందమునఁ జేర్పఁ బూను కెందమ్మి విరులు**
**వెలఁది నిట్టూర్పు గాడ్పుల వెచ్చఁ దాఁకి**
**బెరసి యరత్రోవయంద మర్మరములయ్యె**

మన్మథానల = కామాగ్నియనెడు, తాపంబు = తాపమును, మాన్ప = పోగొట్టుటకు, వేడి డెందమునన్ = వెచ్చనైన హృదయమునందు, చేర్పన్ = చేర్చుటకు, పూను = సిద్ధపడు, కెందమ్మి విరులు = ఎఱ్ఱ తామర పూలు, వెలది = దమయంతియొక్క, నిట్టూర్పు గాడ్పుల = నిట్టూర్పు గాలులయొక్క, వెచ్చన్ = వెచ్చదనమును, తాకి, బెరసి = ఎండిపోయి, అర త్రోవయంద = మధ్యమార్గమునందే, మర్మరములు అయ్యె = పనికిరానివి అయ్యెను.

తా. మన్మథతాపమును పోగొట్టుటకు వేడెక్కిన హృదయమునందు చేర్చుటకు సిద్ధపరచబడిన ఎఱ్ఱతామరపూలు దమయంతియొక్క నిట్టూర్పు గాలులయొక్క వేడికి ఎండిపోయి మధ్యమార్గమునందే పనికిరాకుండపోయినవి. (అతిశయోక్తి)

**119 సీ. చిగురు దామరపాకు చివ్వనఁ జనుదోయి**
**మొనల క్రొవ్వేఁడిని ముడుఁగఁ బాఱెఁ**
**దరుణ రంభా గర్భ దళ తాళవృంతంబు**
**పైగాలి సోఁకిన బలుకఁ బాఱె**
**లలిత ముక్తాహార గుళికా కలాపంబు**
**ఘ్రాణానిలంబునఁ గందఁ బాఱెఁ**
**గర్ణపూర కలాప కల్హార దళరాజి**
**యశ్రుధారల నురియంగఁ బాఱె**
**తే. దర్ప మొలయ నాలీఢ పాదమున నిల్చి**
**మండలీకృత చాపుఁడై మన్మథుండు**
**గనలి సవ్యాపసవ్య మార్గములఁ దొడిగి**
**పువ్వుఁ దూపులు పుంఖానుపుంఖమేయ**

దర్పము = అహంకారము, ఒలయన్ = అతిశయింపగా, మన్మథుండు, ఆలీఢ పాదమున నిల్చి = కుడికాలు ముందుకు చాచి నిలబడి, మండలీకృత చాపుడై = ఎక్కుపెట్టబడిన ధనస్సు కలవాడై, కనలి = కోపించి, పువ్వున్ తూపులు = పూల బాణములను, సవ్యాపసవ్య మార్గములన్ = రెండు చేతులతోను, తొడిగి = సంధించి, పుంఖానుపుంఖము = ఆగకుండా, ఏయన్ = వేయగా, చిగురు తామరపు ఆకు, చివ్వనన్ = వెంటనే, చనుదోయి మొనలన్ = స్తనాగ్రములయొక్క, క్రొవ్వేడిని = క్రొత్తగ వచ్చిన తాపపు వేడిచే, ముడుగ పాఱెన్ = ముడుచుకుపోయెను. తరుణ = లేత, రంభాగర్భదళ = విచ్చుకోని అరటిఆకుయొక్క, తాళవృంతంబు = విసనకఱ్ఱ, పై గాలి = ఆమె దేహముపైనుండి వచ్చు గాలి, సోకిన = తగులగా, పలుకన్ పాఱె = కాంతిని కోల్పోయెను. లలిత = సుందరమైన, ముక్తాహార గుళికా = ముత్యాల సరుల పూసల సమూహము, ఘ్రాణ అనిలంబున = నిశ్వాస వాయువుచే, కంద బాఱెన్ = కందిపోయెను. కర్ణపూర = తాటంకములకు, కలాప = అలంకారమైన, కల్హార దళ = ఎఱ్ఱకలువ రేకులయొక్క, రాజి = సమూహము, అశ్రుధారల = కన్నీటి ధారలచే, ఉరియంగ బాఱెన్ = చలింపసాగెను.

తా. అహంకార మతిశయింపగా మన్మథుడు ఆలీఢపాదుడై ధనుస్సు నెక్కుపెట్టినవాడై కోపంతో పూలబాణాలను తన రెండుచేతులతోను సంధించి పుంఖానుపుంఖంగా వేయగా చిగురు తామరపాకు దమయంతి స్తనాగ్రముల వేడికి ముడుచుకుపోయెను. లేత అరటియాకు వీవన ఆమె దేహమునుండి వచ్చు గాలి తగులగా కాంతిని కోల్పోయెను. సుందరమైన ముత్యాలసరుల పూసలు ఆమె నిశ్వాసములకు కందిపోయెను. తాటంకములైన ఎఱ్ఱకలువరేకులు ఆమె కన్నీటి ధారలచే చలించిపోయెను.

**120 వ. ఇవ్విధంబునం బ్రతిపచ్చంద్రరేఖయుంబోలెఁ గళామాత్రావశేషయై విషమశరశరాశీ విషవేదనా దూయమాన మానసయగుచు శిశిరశైవాల పలాశ గుచ్ఛంబునను, సరస బిసకిసలయ చ్ఛేదంబులను, దుషార సలిలధారాసేకంబులను, గర్పూర పరాగపాళి సముద్ధూళనంబులను, జందన చర్చా మచర్చికా క్షాళనంబులను, జంద్రకాంత శిలా తల్పంబులను, గదళీ దళ తాళవృంత సంతానంబులను వాసరంబులు గడపుచు, నొక్కనాఁడు విభావరీ సమయంబునఁ గేళి సౌధమణి చంద్రశాలా ప్రదేశంబున సఖీజనులు పరివేష్టించియుండ నిండుచందురుం జూచి వైదర్భి యుపాలంభగర్భంబుగా నిట్లనియె**

తా. ఈ రీతిగా శుక్ల పక్ష పాడ్యమినాటి చంద్రరేఖవలె కళమాత్రమే మిగులుకలదై మన్మథునియొక్క పాములవంటి బాణములయొక్క విషబాధచే తాపమొందుచున్న మనస్సు కలదగుచు, చల్లని నాచు ఆకుల గుత్తులచేత, వాడని తామర తూండ్ల ముక్కలచేతను, మంచు నీటిధారలు చల్లుటచేతను, కప్పురపు పొడి నలదుటచేతను, మంచిగంధపు పూతల కడుగుటవలనను, చంద్రకాంతపు శిలా వేదికలందును, అరటియాకు వీవనల సమూహముచేతను దినములు గడపుచు ఒకరోజున రాత్రిపూట క్రీడా గృహమున చంద్రశాలా ప్రదేశమున చెలికత్తెలు చుట్టియుండగా పౌర్ణమినాటి చంద్రుని చూచి దమయంతి నిందాగర్భముగా ఇట్లు పలికెను.

**121 ఉ. హాలహలద్వయంబు గలశాంబుధిఁ బుట్టె వినీల పాండుర**
**జ్వాలలతోడ నందొక విషం బొక వేలుపు మ్రింగె నెందఱే**
**వేలుపు లోలిమై ననుభవించిన రెండవ యీ విషంబు ని**
**ర్మూలముగాక యున్నయది ముద్దియ! పాంథుల పాపమెట్టిదో**

కలశాంబుధిన్ = పాలసంద్రమందు, హాలహలద్వయంబు = రెండు విషములు (హాలాహలము, చంద్రుడు), వినీల = మక్కిలి నల్లనివియు, పాండుర = తెల్లనివియునగు, జ్వాలలతోడ = మంటలతో, పుట్టె, అందు = అందులో, ఒక విషంబు, ఒక వేలుపు = శివుడు, మ్రింగెను, ఎందఱే వేలుపులు = దేవతలెందరో, ఓలిమైన్ = క్రమముగా, అనుభవించిన = అనుభవించుచున్నను, రెండవ యీ విషంబు, ముద్దియ = చెలియా!, నిర్మూలము కాక, యున్నయది. పాంథుల = విరహులయొక్క, పాపము, ఎట్టిదో = ఎటువంటిదో కదా!

తా. పాలసముద్రమందు రెండు విషములు నల్లని, తెల్లని జ్వాలలతో పుట్టినవి. అందు ఒక విషమును శివుడు మ్రింగివేసెను. రెండవ విషమును దేవతలెందరో అనుభవించుచున్నను ఓ చెలియా! నిర్మూలము కాకయున్నది. మరి విరహులుచేసుకున్న పాపము ఎటువంటిదోకదా!

**122** **సీ. విరహిణీ వధ మహాదురిత పంక కళంక**
**కలుషితాత్ముకుఁడైన ఖలుఁడు వీఁడె**
**గరళకూట కఠోర కల్పాంతవహ్నికిఁ**
**దోఁబుట్టువైన ఘాతుకుఁడు వీఁడె**
**చండదీధితికర జ్వాల మండలములోఁ**
**బ్రోదిఁ బొందిన మహోగ్రుండు వీఁడె**
**బాడబంబునుఁ దాను బాథోధికుక్షిలో**
**సరిఁబొత్తుమన్న దుర్జాతి వీఁడె**
**తే. సైంహికేయ నిశాత దంష్ట్రా విటంక**
**విషరస ప్రతిభాక భావితుఁడు వీఁడె**
**గగనమను రుద్రభూమి నేకతమ తిరుగు**
**చదరు లుమిసెడి కొఱవి దయ్యంబు వీఁడె**

విరహిణీ వధ = విరహముతోనున్న స్త్రీలను చంపుట, మహాదురిత = మహాపాతకరూపమయిన, పంక = బురదయనెడి, కళంక = దోషముచే, కలుషిత = మలినమైన, ఆత్మకుడు ఐన = మనసుకలవాడైన, ఖలుడు = దుర్మార్గుడు, వీడె, గరళ కూట = కాలకూట సంబంధమైన, కఠోర = భయంకరమైన, కల్పాంత వహ్నికి = ప్రళయాగ్నికి, తోబుట్టువైన = సోదరుడైన, ఘాతుకుడు = దుర్మార్గుడు, వీడె, చండదీధితి = సూర్యునియొక్క, కర = కిరణములనెడి. జ్వాల మండలములోన్ = మంటల సమూహములో, ప్రోదిన్ = వృద్ధిని, పొందిన = పొందినట్టి, మహా ఉగ్రుండు = మిక్కిలి క్రూరుడు, వీడె, బాడబంబును = బడబాగ్నియు, తాను = తానును, పాథోధి కుక్షిలో = సముద్ర గర్భమునందు, సరి పొత్తు మన్న = ఒకే పొత్తున జీవించుచున్న, దుర్జాతి = దుర్మార్గపు జాతి, వీడె, సైంహికేయ = రాహువుయొక్క, నిశాత = వాడియైన, దంష్ట్ర = కోరలనెడి, విటంక = గూటియందు, విషరస = విషరసముతో కూడి, ప్రతిభాక = సరిపడినవానినిగా, భావితుడు = భావించుకునేవాడు, వీడె, గగనమను = ఆకాశమను, రుద్రభూమిని = స్మశానభూమిలో, ఏకతమ = ఒంటరిగా, తిరుగు, చదరులు ఉమిసెడి = అగ్నికణములను వెదజల్లెడి, కొఱవి దయ్యంబు, వీడె,

తా. విరహిణులగు స్త్రీలను చంపే మహాపాతకరూపమయిన బురద అనే దోషముచే మలినమైన మనసుకల దుర్మార్గుడు వీడె, కాలకూట సంబంధమైన భయంకర ప్రళయాగ్నికి తోడబుట్టిన దుర్మార్గుడు వీడె, సూర్య కిరణములనెడి మంటలలో అభివృద్ధిని పొందిన దుర్మార్గుడు వీడె, బడబాగ్నియును తానును సముద్రగర్భమందు ఒకే పొత్తున జీవించుచున్న దుర్మార్గపు జాతి వీడె, రాహువుయొక్క వాడియైన కోఱలలోనున్న విషముతో కూడి సరిపడినవానినిగా ఊహించుకొనే దుర్మార్గుడు వీడె. ఆకాశమనే స్మశానభూమిలో ఒంటరిగా తిరుగు అగ్నికణములను వెదజల్లే కొఱవిదయ్యం వీడె.

**123** **సీ. జనన కాలమునాఁడు జలరాశి కుక్షిలోఁ**
**దరిగొండ పొరివోవఁ దాఁకెనేని**
**గ్రహణ వేళలయందు రాహు వాహారించి**
**తృప్తిమై గబ్బునఁ ద్రేఁచెనేని**
**విషమనేత్రుఁడు చేతి విషమారగించుచోఁ**
**బ్రతిపాకముగఁ జేసి త్రావెనేని**
**నపర పక్షము పేరి యపమృత్యుదేవత**
**యొకమాటుగా నామ ముడిపెనేని**
**తే. కుంభసంభవుఁ డబ్ధితోఁ గూడఁ గ్రోలి**
**తజ్జలముతోడ వెడలింపఁ దలఁపఁడేని**
**విరహిజను లింతపడుదురే వీనిచేత**
**నక్కటా! దైవ మటుసేయఁ దయ్యెఁగాక**

జనన కాలమునాడు = పుట్టినప్పుడే, జలరాశికుక్షిలోన్ = సముద్రగర్భమునందే, తరి కొండ = కవ్వపు కొండ, పొరి పోవన్ = చచ్చునట్లు, తాకెనేని = తగులుకొని ఉంటే, గ్రహణ వేళలయందు, రాహువు, ఆహారించి = మింగేసి, తృపిమైన్ = తృప్తిగా, గబ్బున త్రేచెనేని = గబ్బుని త్రేనిచి ఉంటే, విషమనేత్రుడు = శివుడు, చేతి = చేతిలోని, విషము, ఆరగించుచోన్ =

తినేటప్పుడు, ప్రతిపాకముగా = నంజుకొనేదానినిగా, చేసి = చేసుకొని, త్రావెనేని = త్రాగేసియుండి ఉంటే, అపర పక్షము పేరి = కృష్ణపక్షమను పేరుగల, అపమృత్యుదేవత, ఒకమాటుగా = ఒక్కసారిగా, నామము = పేరును, ఉడిపెనేని = లేకుండ చేసి ఉంటే, కుంభసంభవుడు = అగస్త్యుడు, అబ్ధితోన్ కూడ = సముద్రంతోసహా, గ్రోలి = త్రాగి, తజ్జలముతోడ = ఆ నీటితో, వెడలింపన్ = బయటకు వదలుటకు, తలపడు ఏని = తలంచకుండా ఉంటే, వీని చేతన్ = ఈ చంద్రుని చేత, విరహిజనులు, ఇంత పడుదురే = ఇంత బాధ పడుదురా?, అక్కటా = అయ్యో, దైవము, అటు = ఆ విధముగా, చేయడయ్యెన్ కాక = చేయలేకపోయాడుకదా!

తా. ఈ చంద్రుని పుట్టినప్పుడే సముద్రగర్భమునందే కవ్వపుకొండ చచ్చేలా తగులుకొని ఉంటే, గ్రహణసమయంలో రాహువు మింగేసి తృప్తిగా గట్టిని తేన్చి ఉంటే, పరమశివుడు విషం స్వీకరించేటప్పుడు నంజుకొనేదానినిగా చేసుకొని త్రాగేసి ఉంటే, కృష్ణపక్షమని పేరుగల అపమృత్యుదేవత ఒక్కసారిగా ఆ పేరును నాశనంచేసి ఉంటే, అగస్త్యుడు సముద్రంతో పాటు ఈ చంద్రుణ్ణికూడా తాగేసి ఆ నీటితో బయటకు వదలకుండా ఉంటే ఈ చంద్రునివల్ల విరహిజనులు ఇంత బాధ పడకుండా ఉందురుకదా! అయ్యో దైవమా! నీ కలాంటి ఆలోచన రాలేదుకదా!

**124 తే. ప్రాణసఖులార! వెన్నెల బయలి కిపుడు**
**మించు టద్దంబుఁ గోలయుఁ గొంచు రండు**
**చోరుఁ డల చంద్రుఁ డద్దంబు సొచ్చినపుడ**
**వంచనము లేక వ్రేయుఁడీ పొంచి యుండి**

ప్రాణసఖులార = ప్రాణ స్నేహితులార!, వెన్నెల బయలికి = బయటి వెన్నెలలోనికి, ఇపుడు = ఇప్పుడే, మించు అద్దంబున్ = మెరిసే అద్దమును, కోలయు = కఱ్ఱను, కొంచు రండు = తీసుకొని రండి, చోరుడు = దొంగయైన, అల చంద్రుడు = ఆ చంద్రుడు, అద్దంబున్ చొచ్చినపుడ = అద్దంలో ప్రవేశించగానే, వంచనములేక = ఏమాత్రం ఆలోచించక, పొంచి ఉండి = ప్రక్కనే ఉండి, వ్రేయుడీ = కొట్టండి.

తా. ప్రాణస్నేహితులార! బయటి వెన్నెలలోనికి ఇప్పుడే మెరిసే అద్దమును, ఒక కఱ్ఱను తీసుకొని రండి. ఆ దొంగ చంద్రుడు అద్దంలో ప్రవేశించగానే ఏ మాత్రం ఆలోచించకుండా ప్రక్కనే ఉండి కొట్టండి.

**125 తే. మనము గారానఁ బోషించి కనక పంజ**
**రముల నిడ్డ కేళీ చకోర వ్రజంబు**
**వీని వెన్నెల దిగఁ గ్రోలు గాన విడువుఁ**
**డొక్క గ్రుక్కనఁ కుంభజుఁ డుదధిఁ బోలె**

మనము, గారానన్ = ప్రేమతో, పోషించి, కనక పంజరములన్ = బంగారు పంజరములలో, ఇడ్డ = ఉంచిన, కేళీ చకోర వ్రజంబు = క్రీడా చకోరపక్షులు, వీని = ఈ చంద్రునియొక్క, వెన్నెల, కుంభజుడు = అగస్త్యుడు, ఉదధిన్ పోలెన్ = సముద్రమునువలె, ఒక్క గ్రుక్కనన్, దిగన్ గ్రోలుగాన = త్రాగుతాయి కనుక, విడువుడు = విడిచిపెట్టేయండి

తా. మనం ప్రేమతో పోషించి బంగారు పంజరములలో ఉంచిన చకోర పక్షులు ఈ చంద్రుని వెన్నెలను అగస్త్యుడు సముద్రాన్ని వలె ఒక్క గ్రుక్కలో త్రాగుతాయి కనుక వాటిని విడిచిపెట్టండి (వెన్నెల నశిస్తే విరహులు సుఖంగా ఉంటారు)

**126 తే. శ్రవణపూర తమాల పల్లవచయంబు**
**మేపుదము వీనిలోనున్న మృగశిశువున**
**కది ప్రవర్ధన మొందెనే ముదితలార!**
**మండలంబెల్లఁ దానయై యుండుఁగాన**

ముదితలార = ఓ స్త్రీలార!, వీనిలోనున్న = ఈ చంద్రునిలో ఉన్న, మృగశిశువునకు = లేడిపిల్లకు, శ్రవణపూర = కర్ణాభరణ రూపములయిన, తమాల పల్లవ = చీకటిమ్రాని చిగుళ్ళ, చయంబు = సమూహమును, మేపుదము, అది = ఆ లేడిపిల్ల, ప్రవర్ధనమొందెనేన్ = పెరిగినచో, మండలంబు ఎల్లన్ = ఆ చంద్రమండలమంతయు, తానయై = తానే అయి, ఉండు కాన = ఉండును కనుక

తా. ఓ ముదితలార! ఈ చంద్రునిలోని జింకపిల్లకు కర్ణాభరణరూపములయిన చీకటిమ్రాని చిగుళ్ళను మేపుదము. అపుడు ఆ లేడిపిల్ల పెరిగి చంద్రమండలమునందను తానే అయి ఆక్రమించును.

**127 క. రాహుగ్రహ వదన గుహా**
**గేహాంతర్ధ్వాంత పటల కేళీరస కౌ**
**తూహల నవ ఖద్యోతం**
**బీ హరిణాంకుండు వీని కేటికి వెఱవన్**

ఈ హరిణాంకుడు = ఈ చంద్రుడు, రాహుగ్రహ, వదన = ముఖమనెడి, గుహా గేహ = గుహవంటి గృహముయొక్క,

అంతర్ = మధ్యభాగమునందున్న, ధ్వాంత = చీకట్ల, పటల = సమూహముయొక్క, కేళీరస = క్రీడారసమునందు, కౌతూహల = కుతూహలముకల, నవ = నూతనమైన, ఖద్యోతంబు = మిణుగురు పురుగు, వీనికిన్ = ఇటువంటి వీనికి, వెఱవన్ ఏటికి = భయపడుట ఎందులకు?

తా. ఈ చంద్రుడు రాహువుచే గ్రహింపబడిన ముఖమనెడి గుహా గృహమునందు చీకట్లయందు సంతోషముగా క్రీడించు మిణుగురు పురుగు. ఇటువంటి వీనికి భయపడడ మెందులకు?

**128 వ. అని మఱియును**

**129 మ. అవతంసంబవు పార్వతీపతికి దుగ్ధాంబోధికిం గూర్మి ప**
**ట్టివి బృందారక ధేను కల్పతరు వాటీ కౌస్తుభ శ్రీసుధా**
**సవ దిగ్వారణ సోదరుండవు జగచ్ఛ్లాఘ్యుండ వీ విట్టి నీ**
**కవునే ధర్మువు శోచ్య పాంథజన సంహారంబు తారాధిపా!**

తారాధిపా = ఓ చంద్రా!, ఈవు = నీవు, పార్వతీపతికి = శివునకు, అవతంసంబవు = శిరోభూషణమవు, దుగ్ధ అంబోధికిన్ = పాలసముద్రమునకు, కూర్మి పట్టివి = ప్రియ పుత్రుడవు, బృందారక ధేను = దేవతలకు చెందిన కామధేనువు, కల్పతరు = కల్పవృక్షము, వాటీ = సముదాయమునకు, కౌస్తుభ = కౌస్తుభ మణికి, శ్రీ = లక్ష్మికి, సుధాసవ = అమృతమునకు, దిక్ వారణ = దిగ్గజములకు, సోదరుండవు, జగత్ శ్లాఘ్యుండవు = జగముచే నుతింపబడువాడవు, ఇట్టి నీకు = ఇటువంటి నీకు, శోచ్య = కనికరింపదగిన, పాంథజన = విరహిజనులను, సంహారంబు = చంపుట, ధర్మువు అవునే = ధర్మమగునా?

తా. ఓ చంద్రా! నీవు శివునకు శిరోభూషణము, పాలసముద్రమునకు ప్రియ పుత్రుడవు, కామధేనువు, కల్పవృక్షము, కౌస్తుభమణి, లక్ష్మీదేవి, అమృతము, దిగ్గజములకు తోడబుట్టినవాడవు. లోకముచే నుతింపబడువాడవు. ఇటువంటి నీకు కనికరింపదగిన విరహి జనులను చంపుట న్యాయమా!

**130 క. చేయకుము చంద్ర సుమన**
**స్సాయకునింగూడి విరహిజన పీడనమున్**
**వ్రేయకు మందంద పయ**
**స్తోయధి వంశమున కపయశో డిండిమమున్**

చంద్ర = ఓ చంద్రుడా!, సుమనస్సాయకునిం గూడి = మన్మథునితో కలిసి, విరహిజన, పీడనమున్ = బాధించుటను, చేయకుము, అందంద = అలాగే, పయస్తోయధి వంశమునకు = పాలసముద్రునియొక్క వంశమునకు, అపయశో డిండిమమున్ = అపకీర్తి చాటింపును, వ్రేయకు = వేయకుము.

తా. చంద్రా! నీవు మన్మథునితో కలిసి విరహిజనులను పీడింపకుము. అలాగే పాలసముద్రవంశమునకు అపకీర్తి చాటింపును వేయకుము.

**131 వ. అని బహుప్రకారంబుల**

**132 తే. ఇవ్విధంబునఁ గ్రథకైశికేంద్రతనయ**
**మదన వేదన దోదూయమాన యగుచు**
**బహువిధంబుల విధు దూఱి పలుకుచుండి**
**తొడఁగి మధురంబుగా విధుంతుదునిఁ బొగడె**

ఈ విధంబునన్, క్రథ కైశికేంద్రతనయ = క్రథ కైశిక ప్రదేశముల కధిపతియగు భీమరాజు కుమార్తె, మదనవేదన దోదూయమనాయగుచు = మన్మథతాపముచే పీడింపబడినదగుచు, బహువిధంబుల, విధు = చంద్రుని, దూఱి = నిందించి, పలుకుచుండి, తొడగి = పూనుకొని, మధురంబుగాన్ = మృదువుగా, విధుంతుదుని = రాహువుని, పొగడె.

తా. ఈ ప్రకారముగా దమయంతి మన్మథతాపముచే పీడింపబడినదగుచు చంద్రుని నిందించి, పూనుకొని మృదువుగా రాహువుని పొగడసాగెను.

**133 వ. తదనంతరంబ**

**134 తే. అంతరిక్షంబునం దతి వ్యవహితుఁడగు**
**నిందు నిందింపఁ గారణంబేమి నాకు**
**నెమ్మనంబునయంద సన్నిహితుఁడైన**
**కంతుఁ బాపాత్ము నిందింతుఁ గాక యనుచు**

అంతరిక్షమునందు = ఆకాశమునందు, అతి వ్యవహితుడగు = చాల దూరమునందున్నవాడగు, ఇందున్ = చంద్రుని, నిందింపన్ = నిందించుటకు, నాకు, కారణంబు ఏమి = కారణము ఏది కలదు? నెమ్మనంబునయంద = మనసునందే, సన్నిహితుడైన = చేరువనేయున్న, కంతున్ = మన్మథుని, పాపాత్మున్ = పాపాత్ముని, నిందింతు గాక యనుచు

తా. ఆకాశమునందు చాల దూరములోనున్నవాడైన చంద్రుని నిందించుటకు నాకు కారణం ఏముంది? మనసులోనే ఉన్న పాపాత్ముడైన మన్మథుని నిందించెను అనుచు

**135 చ. ననవిలుకాడ! మన్మథ! యనాథ వధూవధ పాతకంబు నిన్**
**గొని మునిఁగించెఁ గ్రూరహర కోప కటాక్ష శిఖి స్వరూపమై**
**మనమున నీవు నిర్దయత మానవు చూడగ నే ముహూర్త వే**
**ళను జనియించితో యకట లచ్చికి నమ్మధుకైటభారికిన్?**

ననవిలుకాడ = పుష్పమే ఆయుధముగా కలవాడా, మన్మథ, అనాథ వధూ = తాపముచే దిక్కులేని స్త్రీలను, వధ పాతంకంబు = చంపిన పాపము, నిన్ = నిన్ను, క్రూర = కఠినమైన, హర = శివునియొక్క, కోప = కోపముతో కూడిన, కటాక్ష = క్రీగంటిచూపులయొక్క, శిఖి స్వరూపమై = అగ్నిజ్వాల స్వరూపమై, కొని = చుట్టుముట్టి, మునిగించె = ముంచివేసెను. చూడగన్ = అంత జరిగినా, నీవు, మనమున, నిర్దయత, మానవు, అకట = అయ్యో, లచ్చికి = లక్ష్మీదేవికి, ఆ మధు కైటభారికిన్ = విష్ణువునకు, ఏ ముహూర్తమున, ఏ వేళను = ఏ సమయమున, జనియించితో = పుట్టావోకదా!

తా. పూవే ఆయుధముగా కలవాడా! మన్మథా! దిక్కులేని స్త్రీలను చంపిన పాపమే నిన్ను క్రూరమైన శివుని కంటి చూపనే అగ్నిజ్వాల చుట్టుముట్టి ముంచివేసెను. అయినా నువ్వు మారలేదు. నీ మనసున నిర్దయత మానుకోవు. అయ్యో! లక్ష్మికి, విష్ణువునకు నువ్వు ఏ ముహూర్తమున, ఏ సమయంలో పుట్టావోకదా!

**136 తే. కామ! పరమేష్ఠి నీ మనఃక్రౌర్య మెఱిఁగి**
**పుష్పములు నీకు నాయుధమ్ములుగఁ జేసె**
**నవియు బహుళంబుగాఁ జేయ కైదు చేసె**
**నింతకైనను బ్రతుకునే యిజ్జగంబు**

కామ = మన్మథా!, పరమేష్ఠి = బ్రహ్మ, నీ మనఃక్రౌర్య మెఱిఁగి = నీ మనసులోని కాఠిన్యమును తెలుసుకొని, పుష్పములు, నీకున్, ఆయుధమ్ములుగన్, చేసెన్, అవియు, బహుళముగాన్ = ఎక్కువగా, చేయక, ఐదు చేసె, ఇంతకైనను = ఈమాత్రానికైనా, ఈ జగంబు = ఈ లోకము, బ్రతుకునే = బ్రతుకుతోందా?

తా. మన్మథా! బ్రహ్మ నీ మనసులోని కాఠిన్యమును తెలుసుకొనే పూవులు నీకు ఆయుధములనుగా చేసెను. అవికూడా ఎక్కువగా కాకుండా ఐదే చేసెను. ఇంతచేసినా ఈ లోకము నీవల్ల బ్రతుకుతోందా? లేదే!

**137 ఉ. రాక సుధాంశు మండలము రాకకు మాఱుమొగంబు సేయుచో**
**దీకొని వచ్చు దండధర దిక్పవమాన మదక్షిణంబవుం**
**గాక వియోగికిం కుసుమ కార్ముకశృంగము వంగఁజేయు నీ**
**యీ కర పంకజాతము రతీశ్వర దక్షిణమైన నాఁటికిన్**

రతీశ్వరా = ఓ మన్మథా!, రాకా సుధాంశు మండలము = పున్నమినాటి చంద్ర బింబము, రాకకు = ఉదయించుటకు, మాఱుమొగంబు చేయుచో = ముఖము ప్రక్కకు త్రిప్పుకున్నచో, కుసుమ కార్ముక శృంగమున్ = పూవింటి కొప్పును, వంగన్ చేయు = వంగునట్లుచేయు, నీ = నీయొక్క, యీ కరపంకజాతము = ఈ పద్మమువంటి చేయి, వియోగికి = విరహముతో నున్నవానికి, దక్షిణమైన నాటికిన్ = దయకలది ఐనప్పటికీ, దీకొని వచ్చు = విజృంభించి వచ్చుచున్న, దండధర దిక్ పవమానము = దక్షిణపు గాలి, అదక్షిణంబ అవుంగాక = దయలేనిదే అవుతోందికదా!,

తా. ఓ మన్మథా! పున్నమినాటి చంద్రోదయమునకు ముఖము త్రిప్పుకున్నను, నీవు దయచూపి విరహులపై విల్లు నెక్కుపెట్టకున్నను విజృంభించి వచ్చెడు దక్షిణమలయానిలము దయలేనిదే అవుతోందికదా!

**138 సీ. భువనమోహన సముద్భవమైన యఘమున**
**నశరీర భూతంబవైతి మదన!**
**విరహ మాలిన్య దుర్విధుఁగాని సోఁకవు**
**కలిదోషమవె నీవు కాయజుండ?**
**బ్రాల్గల రతిదేవి భాగ్యసంపదఁ గదా**
**ప్రసవసాయక! చచ్చి బ్రతికితీవు**
**చాలదా? యేలెదీ సకల ప్రపంచంబు**
**పంచత్వమొందియుఁ బంచబాణ!**
**తే. తమ్మి పూఁజాలి నీ యాగ్రహ మ్మెఱింగి**
**లోక మవ్యాకులతఁ బొందుఁగాక యనుచు**
**దక్కఁగల కైదువలు మాని దర్పకుండ!**
**విరులు నీ కాయుధములు గావించినాడు**

మదన = ఓ మన్మథా!, భువనమోహన = లోకములను మోహించేయుటచే, సముద్భవమైన = పుట్టిన, అఘమునన్ = పాపమున, అశరీర భూతంబవు ఐతి = శరీరంలేని జీవానివి అయితివి. విరహ మాలిన్య = విరహమను మాలిన్యముకల, దుర్విధున్ కాని = మలినాత్మునికాని, సోకవు = ఆవహించవు. కాయజుండ = మన్మథుడా! నీవు, కలిదోషమవె = కలిదోషానివా ఏమిటి? ప్రాల్గల రతిదేవి = సౌభాగ్యవతియగు రతీదేవియొక్క, భాగ్య సంపదన్ కదా = సౌభాగ్య సంపద చేతనేకదా!, ప్రసవసాయక = మన్మథా! చచ్చి బ్రతికితి ఈవు = చచ్చి బ్రతికావు నువ్వు. చాలదా = సరిపోదా? పంచబాణ = మన్మథా!, పంచత్వము ఒందియున్ = చచ్చికూడా, ఈ సకల ప్రపంచంబు, ఏలెదు = ఏలుతున్నావు. తమ్మిపూ చూలి = బ్రహ్మ , నీ ఆగ్రహమ్ము ఎఱింగి = నీకున్న కోపాన్ని గ్రహించి, లోకము = ఈ ప్రపంచము, అవ్యాకులతన్ పొందు కాక అనుచు = వ్యాకులత్వము లేకుండుగాకయని, దర్పకుండ = మన్మథుడా! తక్కుగల = లోహమయములైన, కైదువలు = ఆయుధములు, మాని, విరులు = పూవులనే, నీకు, ఆయుధమలు కావించినాడు.

తా. ఓ మన్మథా! లోకములను మోహింపచేయుటచే కలిగిన పాపముచేతనే దేహము లేనివాడవైతివి. విరహ మాలిన్యముకల మలినాత్ములనే కాని ఆవహించవు. నువ్వు కలిదోషానివా ఏమిటి? సౌభాగ్యవతియగు రతీవేవి సౌభాగ్యం చేతనే నువ్వు చచ్చీ బ్రతికేవు. చాలదా? చచ్చికూడా ఈ సమస్త ప్రపంచాన్ని ఏలుతున్నావు. నీ కోపం సంగతి తెలిసే బ్రహ్మ ఈ లోకం వ్యాకులత్వం పొందకూడదని నీకు లోహపు ఆయుధాలను ఈయక పూవులను ఆయుధములుగా ఇచ్చాడు.

**139 వ. అని పలికియు సవిధ లీలోద్యానంబునందు సరస రసాల కోమల కిసలయాస్వాదన కషాయ కంఠ కలకంఠ కామినీ కుహూకార కోలాహల పంచమంబు వీతెంచిన నప్పల్లవాధరి యుల్లంబు జల్లన నొల్లంబోయి మూర్ఛిల్లిన**

తా. అని పలికియును చేరువనేయున్న క్రీడోద్యానవనమున గున్నమామిడి చిగుళ్ళను భక్షించి బొంగురుపోయిన గొంతుకల ఆడు కోయిలయొక్క కుహూ ధ్వనుల పంచమస్వర కోలాహలము రాగా ఆ దమయంతి మనసు ఝల్లని ఖిన్నురాలయి మూర్ఛనొందగా

**140 ఉ. గొజ్జఁగ నీరు సల్లె నొక కోమలి ద్రిప్పె లతాంగి యోర్తు లా**
**మజ్జక తాలవృంత మొక మానిని చందనకర్దమంబునన్**
**మజ్జన మాచరించెఁ గుచమండలి నొక్క వధూటి యెంతయున్**
**బుజ్జనమొప్పఁ బాదములఁ బుప్పొడి యొత్తె విదర్భకన్యకున్**

విదర్భ కన్యకున్ = దమయంతికి, ఒక కోమలి = ఒక స్త్రీ, గొజ్జగ నీరు = పన్నీటిని, చల్లె = చల్లెను. లతాంగి యోర్తు = ఒక స్త్రీ, లామజ్జక తాలవృంతము = వట్టివేళ్ళ విసనకఱ్ఱ, త్రిప్పెన్ = విసరెను, ఒక మానిని = ఒక స్త్రీ, చందన కర్దమంబునన్ = మంచిగంధపు నీటిచే, కుచమండలిన్ = స్తన ప్రదేశమును, మజ్జనము ఆచరించెన్ = స్నానము చేయించెను. ఒక్క వధూటి = ఒక స్త్రీ, ఎంతయున్ = మిక్కిలి, బుజ్జనము ఒప్పన్ = లాలనతో, పాదములన్, పుప్పొడి = పద్మపరాగమును, ఒత్తెన్ = పూసెను.

తా. దమయంతికి ఒక కోమలి పన్నీటిని చల్లెను. ఒక లతాంగి వట్టివేళ్ళ విసనకఱ్ఱతో విసరెను. ఒక మానిని మంచి గంధపు నీటితో స్తనయుగ్మమును స్నానము చేయించెను. ఒక వధూటి లాలించుచు పాదములకు పద్మపరాగమున పూసెను.

**141 సీ. పద్మిని! కన్నీరు పన్నీటఁ దుడువుము**
**రంభా దళంబు సారంగి! వీవు**
**కల్పవల్లి! యొనర్పు కర్పూర తిలకంబు**
**చక్రవాకి! యలందు చందనంబు**
**చలిగావి వలిపంపు వలువుఁగట్టు చకోరి!**
**బిసకాండ హారంబు వెట్టు హరిణి!**
**కలకంఠి! చేర్పు చెంగలువ యెత్తు దలాడ**
**కలికి! పైఁ జిలికించు గమ్మఁదేనె**
**తే. బాల శైవాల మంజరీ జాలకంబు**
**నిందుమతి! యొత్తు మతీ చేతులందుఁ గదియ**
**నప్పళింపు మందారిక! యడుగులందుఁ**
**జల్లగాఁ బుండరీక కింజల్క ధూళి**

తా. ఓ పద్మిని! కన్నీటిని పన్నీరుతో తుడువుము. ఓ సారంగి! అరటి ఆకుతో విసరుము, ఓ కల్పవల్లి! కర్పూర తిలకమును పెట్టుము, ఓ చక్రవాకి! మంచిగంధము నలదుము, ఓ చకోరి! సన్నని తెల్లని వస్త్రమును కట్టుము, ఓ హరిణి! తామర తూడు దండను పెట్టుము, ఓ కలకంఠి! ఎఱ్ఱకలువల ఎత్తు తలగడను చేర్చుము, ఓ కలికి! తీయని తేనెను పైన చిలికించుము, ఓ ఇందుమతీ! లేత నాచుగుత్తుల సమూహాన్ని చేతుల కంటుకునేలా ఒత్తుము, ఓ మందారిక! పాదములందు

తెల్లతామర పరాగమును చల్లదనముకొరకు అద్దుము.

142 **వ. అని పలుకుచు సంభ్రమించు సఖీజనంబుల కలకలం బాలించి యిదియేమి కోలాహలంబని భీమ భూపాలుండు దేవీసహితుండై యడుగఁ దద్వయస్యా జనంబులు దారెఱింగిన తెఱంగెల్లను విన్నవింప నన్నరనాథుండు ముద్దుఁగూఁతు మనోభిలాషంబునకు ననుకూలంబుగా జగంబునందెల్ల స్వయంవరంబుఁ జాటింపం బంచిన**

తా. అని పలుకుచు సంభ్రమ పడుచున్న చెలికత్తెల కోలాహలము విని ఇదేమి హడావుడి అని బీమరాజు భార్యతో కూడి వచ్చి అడుగగా, ఆ దమయంతి చెలికత్తెలు వారికి తెలిసిన విషయమునంతను తెలియపరచగా ఆ రాజు తన ముద్దులకూతురు మనోభిప్రాయమునకు తగినరీతిగా లోకమంతటను స్వయంవరమును చాటించుటకు పంపగా

143 **తే. సప్త సాగర పరివృత క్ష్మాతలమునఁ**
**జాటఁబడియెను వాదిత్ర సంయుతముగ**
**ధరణినాథ కుమార హృద్ధైర్యహారి**
**భోజకన్యా స్వయంవరాభ్యుదయ మహము**

సప్తసాగర పరివృత = ఏడు సముద్రములచే చుట్టబడిన, క్ష్మాతలమునన్ = భూమండలమునందు, ధరణినాథ కుమార = రాజకుమారులయొక్క, హృత్ ధైర్య = మనసులందలి ధైర్యమును, హారి = పోగొట్టునట్టి, భోజకన్యా = దమయంతియొక్క, స్వయంవర = వివాహమనెడి, అభ్యుదయ మహము = గొప్ప ఉత్సవము, వాదిత్ర సంయుతముగ = వాద్యములతో కూడ, చాటన్ పడియెను = చాటిపంబడెను.

తా. సప్తసాగర పర్యంత భూమండలమందున్న రాజకుమారుల మనోధైర్యములు పోగొట్టునట్లుగా దమయంతియొక్క స్వయంవరమనెడి గొప్ప ఉత్సవము వాద్యములతోకూడ చాటింపబడెను.

144 **మ. నవరత్నోపల దివ్యలింగ వరదాన ప్రీత దాక్షాయణీ**
**ధవ! కర్పూర వసంతరాయ! యనవద్య ద్వాదశీ వాసరో**
**త్సవ రుక్మాంగద! వేమభూపతి మహా సామ్రాజ్య రక్షామణీ!**
**యవనాధీశ సభా నిరంకుశ వచో వ్యాపార పారంగతా!**

నవ రత్న ఉపల = తొమ్మిదిరకముల రత్నపు రాళ్ళతోను, దివ్యలింగ = దివ్యమైన శివలింగములను, వరదాన = ఇచ్చుటచే, ప్రీత = సంతోషపెట్టబడిన, దాక్షాయణీ ధవ = భీమేశ్వరుడుకలవాడా!, కర్పూర వసంతరాయ, అనవద్య = అడ్డులేని, ద్వాదశీ వాసర = ద్వాదశి దినమునందు, ఉత్సవ = ఉత్సవమునకు, రుక్మాంగద = రుక్మాంగదునివంటివాడా!, వేమభూపతి = వేమరాజు యొక్క, మహా సామ్రాజ్య = విశాల సామ్రాజ్యమునకు, రక్షామణీ = కవచమైనవాడా! యవనాధీశ = తురుష్కరాజుల యొక్క, సభా = సభలయందు, నిరంకుశ = జడుపులేకుండా, వచో వ్యాపార = మాటాడుటయందు, పారంగతా = నేర్పు కలవాడా!

తా. నవరత్నముల దివ్యలింగములను దానము చేయుటచే ప్రీతుడైన భీమేశ్వరుడుకలవాడా! కర్పూర వసంతరాయ! లోపములేని ద్వాదశీ ఉత్సవమునకు రుక్మాంగదుని వంటివాడా! వేమ భూపాలుని విశాల సామ్రాజ్యమునకు కవచము వంటివాడా! తురుష్క సభలో స్వేచ్ఛగా మాట్లాడగలిగిన నేర్పుకలవాడా!

145 **క. ఆ చక్రవాళ శైల**
**క్ష్మాచక్ర మహా మహీశ కటకాస్థానీ**
**వాచాట చాటు కవితా**
**గోచర కీర్తి ప్రతాప! కులమణిదీపా!**

ఆ చక్రవాళశైల = చక్రవాళ పర్వత పర్యంతముకల, క్ష్మాచక్ర = భూమండలమందున్న, మహా మహీశ = గొప్ప రాజుల యొక్క, కటకాస్థానీ = రాజసభలయందున్న, వాచాట = పండితులయొక్క, చాటుకవితా = చాటు కవిత్వమునకు, గోచర = విషయమగుచున్న, కీర్తి ప్రతాపా = కీర్తి ప్రతాపము కలవాడా! కులమణి దీపా = కులమునకు రత్నదీపమువంటివాడా!

తా. చక్రవాళపర్వత పర్యంతముకల భూమండలమందలి గొప్ప రాజులయొక్క సభాస్థానములందున్న పండితుల చాటుకవిత్వమునకు విషయమగుచున్న కీర్తి ప్రతాపము కలవాడా! కులమునకు రత్నదీపము వంటివాడా!

146 **పృథ్వీవృత్తము.**
**చతుర్ముఖ విలాసినీ శయవిలాస పంకేరుహ**
**స్రుతామృత మధూళికా సురభి సార సారస్వతా!**
**వితీర్ణ మహిమార్ణవా! విభవయోగ సంక్రందనా!**
**ప్రతాపగుణ భూషణా! పరిణతార్థ సంభాషణా!**

చతుర్ముఖ విలాసినీ = సరస్వతీ దేవియొక్క, శయ = చేతియందున్న, విలాస = విలాసవంతమైన, పంకేరుహ = పద్మమునుండి,

స్రుత = జారుచున్న, అమృత = అమృతము, మధూళికా = పుప్పొడియొక్క, సురభి = పరిమళముగల, సార = శ్రేష్ఠమైన, సారస్వతా = వాక్ సంపద కలవాడా! వితీర్ణ = ఈవియొక్క, మహిమ = గొప్పతనమునకు, అర్ణవా = సముద్రునివంటివాడా! విభవయోగ సంక్రందనా = వైభవయోగమునందు ఇంద్రునివవంటివాడా!, ప్రతాప గుణ = తేజస్సనెడి గుణమే, భూషణా = అలంకారముగాకలవాడా! పరిణత = పరిపక్వమైన, అర్థ = ప్రయోజనమునే, సంభాషణా = పలుకువాడా!

తా. సరస్వతీదేవి చేతిలోని విలాసవంతమైన పద్మమునుండి జారు మకరందము, పుప్పొడియొక్క పరిమళముగల గొప్ప వాక్ సంపద కలవాడా! దానమహిమచే సముద్రము వంటివాడా! వైభవయోగమున ఇంద్రునివంటివాడా! తేజస్సనెడి గుణమే అలంకారముగా కలవాడా! ఫలించు ప్రయోజనమునే మాటలాడువాడా!

**గద్య**

**ఇది శ్రీమత్కమలనాభ పౌత్త్ర మారయామాత్య పుత్త్ర**
**సకల విద్యా సనాథ శ్రీనాథభట్ట ప్రణీతమయిన**
**శృంగార నైషధ కావ్యమునందు**
**ద్వితీయాశ్వాసము**

**వ్యాఖ్యాతృ గద్యము**

**ఇది బుధజన విధేయుండును, బులుసు వంశ సంభూతుండును,**
**కీ.శే. శేషమ్మ, వెంకటరమణయ్య పుణ్యదంపతీ తనూజుండును,**
**గౌతమ గోత్రజుండునగు వేంకటసత్యనారాయణమూర్తి**
**ప్రణీతంబైన శృంగార నైషధ మహాకావ్యంబునందు**
**ద్వితీయాశ్వాసమునకు టీక-తాత్పర్యములు**
**సంపూర్ణము**

# శృంగార నైషధము
# తృతీయాశ్వాసము

**శ్రీహర్ష సుకవి కవితా**
**వ్యాహార కథా సుధా రసాస్వాద సుఖ**
**శ్రీ హర్షోదయ! సత్య స**
**మాహిత! మహితాంతరంగ! మామిడి సింగా!**

శ్రీహర్ష సుకవి = శ్రీహర్షుడనెడి కవిశ్రేష్ఠునియొక్క, కవితా వ్యాహార = కవిత్వములో చెప్పబడిన, కథా = కథయనెడి, సుధా రస = అమృత రసముయొక్క, ఆస్వాద = త్రాగుటచేతనయిన, సుఖ శ్రీ = సుఖ సమృద్ధివలన, హర్షోదయ = సంతోషించినవాడా! సత్య సమాహిత = సత్యమునే నమ్మినవాడా!, మహిత అంతరంగా = గొప్ప మనసుకలవాడా!, మామిడి సింగా!

తా. శ్రీహర్షుడనెడి కవిశ్రేష్ఠునియొక్క కవిత్వములో చెప్పబడిన కథామృతము త్రాగుటవల్లనైన సుఖ సమృద్ధివలన సంతోషించినవాడా! సత్యమునే నమ్మినవాడా! గొప్ప మనసుకలవాడా! మామిడి సింగా!

2 **వ. ఆకర్ణింపు మా యవసరంబున నిఖిల భువన వృత్తాంత వేదియు, నశేష భాషా కుశలుండును, సర్వ విజ్ఞాన నిధియును, సమస్త శాస్త్ర ప్రవీణుండును, సకల పురాణేతిహాస సంహితా రహస్య విజ్ఞాన విశారదుండుననగు నారదుండు బాల్యసఖుండైన పర్వతుండునుం దానును**

తా. వినుము. ఆ సమయమున సమస్త లోకముల విషయములు తెలిసినవాడును, సాటిలేని భాషా నిపుణుడును, సమస్త విజ్ఞానములకు నిధియైనవాడును, సకల శాస్త్ర విశారదుడును, సమస్తమైన పురాణములు, ఇతిహాసముల సంహితల యందు గల రహస్య విజ్ఞానము నెఱిగినవాడుననగు నారదుడు తన బాల్యస్నేహితుడైన పర్వతునితో తానును

3 **ఉ. పంబిన వేడ్కతో భిదురపాణి సురాసుర మౌళిమాలికా**
**చుంబిత పాదపీఠు బలసూదనుఁ జూడఁగఁ గోరి నాకలో**
**కంబునకుం జనంగ సమకట్టెఁ బితామహు కూర్మిపట్టి హ**
**స్తాంబురుహాంగుళీ నఖ శిఖాంకుర కోటి విపంచి మీటుచున్**

పితామహు కూర్మి పట్టి = బ్రహ్మ ప్రియ కుమారుడు, హస్తాంబురుహ అంగుళీ = పద్మమువంటి చేతి వ్రేళ్ళయొక్క, నఖ శిఖాంకుర కోటిన్ = కొనగోళ్ళ సమూహముచే, విపంచి = వీణెను, మీటుచున్, పంబిన = అతిశయించిన, వేడ్కతో = సంతోషముతో, భిదురపాణిన్ = వజ్రాయుధము ధరించువానిని, సురాసుర = దేవ దానవులయొక్క, మౌళిమాలికా = కిరీట పంక్తులచే, చుంబిత = తాకబడుచున్న, పాదపీఠున్ = పాదపీఠము కలవానిని, బలసూదనున్ = దేవేంద్రుని, చూడగన్ కోరి = చూడాలనే కోరికతో, నాకలోకంబునకు = స్వర్గలోకమునకు, చనంగ = వెళ్ళుటకు, సమకట్టె = సిద్ధపడెను.

తా. కొనగోళ్ళతో వీణెను మీటుచున్న బ్రహ్మదేవుని ప్రియ పుత్రుడు నారదుడు సంతోషముతో వజ్రాయుధమును ధరించువాడు, దేవ దానవులచే నమస్కరింపబడువాడునగు దేవేంద్రుని దర్శించు కోరికతో స్వర్గలోకమునకు వెళ్ళుచుండెను.

4 **చ. భువన గురుత్వ వైభవము పూనెన యేనియుఁ బూనెఁగాని పొం**
**దవుఁ జరియింప నారదున కభ్ర పథంబునఁ బర్వతుండుఁ దాఁ**
**దివురుట యెట్లు వెంటఁ జనుదేరఁగ యుక్తమ యివ్విధంబునుం**
**బ్రవితత పక్షపాతగతి భంగి మదిం తలఁపంగ వచ్చినన్**

భువన గురుత్వ వైభవము = లోకపూజ్యతా సంపద, పూనెన ఏనియు పూనె కాని = పొందితే పొందాదు కాని, నారదునకున్ (మేఘునకు), అభ్రపథంబునన్ = ఆకాశమార్గమున, చరింపన్ = పయనించుటకు, పొందు అవున్ = సరిపడినదే అగును, పర్వతుండు = నారదుని స్నేహితుడు పర్వతుడు (పర్వతము) తాన్ = తాను, వెంటన్ = నారదుని వెనుక, చనుదేరగన్ = వచ్చుటకు, తివురుట = ప్రయత్నించుట, ఎట్లు?, ప్రవితత = విస్తారమైన, పక్ష పాత = అభిమానమువలన (ఱెక్కలు నరుకబడుటవలన), గతి భంగి = గమన రీతి, మదిన్ = మనస్సునందు, తలపంగ వచ్చినన్ = తలచినచో, ఇవ్విధంబునున్ = ఈ పద్ధతియును, యుక్తమ = పర్వతుని ఆకాశగమనము తగినదే.

తా. లోకపూజ్యతనందిన నారదునకు ఆకాశగమనము న్యాయమే. కాని పర్వతున కాకాశగమన మెట్లు వీలుపడును? బరువైన వస్తువు ఆకాశమున ఎట్లు నిలబడును? పర్వతముల ఱెక్కలు నరుకబడుటవలన అవి ఎగురలేవు. కాని, ఆలోచిస్తే నారదుని అభిమానముచే పర్వతుడు ఆకాశమార్గమున పయనించుట యుక్తమే.

**5 తే. గగనవీథి విమాన మెక్కకయ చనిరి**
**యోగవిద్యా బలంబు చేయూఁత గాఁగఁ**
**దపము గల్గంగ సాధనాంతరము లేల**
**సకల కార్యంబులందును సంయములకు**

యోగవిద్యాబలంబు = యోగవిద్యయొక్క మహిమ, చేయూత కాగన్ = ఆధారము కాగా, విమానము ఎక్కకయ, గగన వీథిన్ = ఆకాశవీధిని, చనిరి = పోయిరి. సంయములకున్ = మునీశ్వరులకు, తపము కల్గంగన్ = తపోశక్తి కలిగియుండగా, సకల కార్యంబులందును, సాధన అంతరములు ఏల = వేఱు సాధనములు ఎందుకు?

తా. నారద, పర్వతులు విమాన అవసరము లేకుండగనే యోగవిద్యామహిమచే ఆకాశమార్గమున పయనించిరి. మనీశ్వరులకు తపోశక్తియుండగా కార్యసాధనకు ఇతర సాధనములు ఎందులకు?

**6 సీ. అంతరాంతరముల నాకాశచరకోటి**
**మోడ్పుఁ జేతులు మస్తముల ఘటింపఁ**
**దన కాంతి చంద్రికాధవళయయ్యును బేర్మి**
**నాదిత్య దీప్తుల నతకరింపఁ**
**జదలేఱు వీచి హస్తముల నిర్మలవారి**
**నంఘ్రుల కర్ఘ్య పాద్యంబు లొసఁగ**
**నాహవ సంవహాద్యనిల ఘట్టనముల**
**శతతంత్రి మూర్ఛనా స్వరములీన**
**తే. గహన సంసార ఘోర సాగరము దాఁటి**
**పరమ యోగీశ్వరుడు మోక్షపదముఁబోలె**
**బహుళతరమైన ఆకాశపథము దాఁటి**
**నాకభువనంబు సొత్తెంచె నారదుండు**

నారదుండు, అంతరాంతరములన్ = మధ్య మధ్య, ఆకాశచర కోటి = దేవతా సమూహములు, మోడ్పు చేతులు = జోడించిన చేతులు, మస్తముల = శిరసులందు, ఘటింపన్ = కూర్చుచుండగా, తన కాంతి = శరీర ఛాయ, చంద్రికా ధవళయయ్యును = వెన్నెలవలె తెల్లనిదయ్యును, పేర్మిన్ = ఆధిక్యముచే, ఆదిత్య దీప్తులన్ = సూర్యకాంతులను, అతకరింపన్ = క్రిందుపరచగా, చదలేఱు = ఆకాశగంగ, వీచి హస్తముల = కెరటములనెడి చేతులతో, నిర్మలవారిన్ = స్వచ్ఛమైన నీటితో, అంఘ్రులకు = పాదములకు, అర్ఘ్య పాద్యంబులు = అర్ఘ్యమును, పాద్యమును, ఒసగన్ = ఈయగా, ఆహవ సంవహాది = ఆవహము సంవహము మొదలైన, అనిల ఘట్టనముల = వాయు రాపిడులచే, శతతంత్రి = నూరు తంత్రులు గల నారదుని వీణె, మూర్ఛనా స్వరములు = ఆరోహణ,అవరోహణాది సంగీత సప్తస్వరములు, ఈన = ప్రకటించుచుండగా, గహన = కష్టసాధ్యమైన, సంసార, ఘోర సాగరము, దాటి, పరమ యోగీశ్వరుడు, మోక్షపదము పోలె, బహుళతరమైన = విశాలమైన, ఆకాశపథము దాటి = ఆకాశమార్గమును దాటి, నాకభువనంబు = స్వర్గమును, సొత్తెంచె = ప్రవేశించెను.

తా. నారదుడు మధ్య మధ్య దేవతలు నమస్కరించుచుండగా, తన శరీరచ్ఛాయ వెన్నెలవలె తెల్లనిదైనా సూర్యకాంతులను అధ:కరింపగా, ఆకాశగంగ కెరటములనెడి హస్తములతో అర్ఘ్య పాద్యము లీయగా, ఆహవ సంవహ వాయు రాపిడులచే వీణె ఆరోహణ, అవరోహణవంటి సప్త స్వరములను ప్రకటించుచుండగా, దుష్కరమైన సంసార సాగరమును దాటి పరమ యోగీశ్వరుడు మోక్షపదము చేరువిధమున విశాలమైన ఆకాశమార్గమును దాటి స్వర్గలోకమున ప్రవేశించెను.

**7 వ. ఇట్లు నారద పర్వతులు నాకలోకంబునకుం జని సర్వ గీర్వాణులుం గొల్వ బేరోలగంబున్న సుపర్వాధీశ్వరు సన్నిధికి నేతెంచి యాశీర్వాదంబు చేసిరి. అతండును సుముఖోల్లాసంబున సముచితాసన విన్యాసంబు మొదలయిన యుపచారంబు**

**లాచరించి యిష్టగోష్ఠీ వినోదంబులఁ గొంతప్రొద్దు నడపి ప్రసంగవశంబున**

తా. ఈప్రకారంగా నారద పర్వతులు స్వర్గలోకమునకు వెళ్ళి దేవతలందరూ సేవించుచుండగా సభలోనున్న దేవేంద్రుని దగ్గరకు వచ్చి ఆశీర్వాదములు చేసేరు. ఆ ఇంద్రుడును సంతోషించి సముచిత ఆసనము మొదలయిన ఉపచారములు చేసి యిష్టాగోష్ఠిని కొంతసేపు గడపి ప్రసంగవశమున

8 **తే. అనఘ జగములఁ గల్గు వృత్తాంత మెల్లఁ**
**దెలియఁగా నీకుఁ గరతలామలకమగును**
**గారణంబేమి నడిమి లోకముననుండి**
**నరపతులు రారు మునుపోలె నాకమునకు**

అనఘ = దోషరహితుడా!, జగములన్, కల్గు, వృత్తాంతము ఎల్ల = సంగతులన్నియు, తెలియగా = తెలిసికొనుట, నీకున్, కరతలామలకము = అరచేతిలోని ఉసిరికవంటిది, అగును, నరపతులు = రాజులు, మునుపోలె = ఇంతకు ముందువలె, నడిమి లోకమునుండి = భూలోకమునుండి, నాకమునకు = స్వర్గమునకు, రారు = వచ్చుటలేదు, కారణంబు ఏమి?

తా. అనఘా! లోకాల్లో జరిగే విషయాలన్నీ నీకు కరతలామలకములు. భూలోకమునుండి రాజులు ఇంతకుముందువలె స్వర్గమునకు రావడం లేదు. కారణమేమిటి?

9 **క. రా రిపు డిచ్చోటికి నసి**
**ధారా మార్గమున ధరణిధవు లెవ్వారున్**
**నారద! నృపవంశంబున**
**వీరకరీరంబు లుద్భవింపవె ధరణిన్**

నారద!, ధరణిధవులు = రాజులు, ఎవ్వారున్ = ఎవరును, అసిధారామార్గమున = కత్తి అంచు దారిలో (యుద్ధంలో), ఇపుడు, ఇచ్చోటికి = ఇక్కడికి, రారు = వచ్చుటలేదు. ధరణిన్ = భూమండలమున, నృపవంశంబున = రాజవంశమనెడి వెదురుపొదయందు, వీరకరీరంబు = వీరులనెడు వెదురుబోదులు, ఉద్భవింపవె = పుట్టుటలేదా?

తా. నారదా! యుద్ధమందు వీరమరణము పొంది రాజులెవ్వరు స్వర్గానికి రావడంలేదు. భూలోకంలో రాజవంశమనెడి వెదురుపొదయందు వీరులనెడు వెదురుబోదులు పుట్టటంలేదా? ఏమిటి?

10 **ఉ. ఏలొకొ మా గృహంబునకు నిప్పుడు రారు మునీంద్ర! భద్రశుం**
**డాల సమానులైన నరనాథ తనూజులు మోముఁ దమ్ములన్**
**వాలిక పోటుగంట్లు చెలువంబుగ విప్పుగు పేరురంబులం**
**గ్రాలఁగ లీలమై దివిజకాంతలు వైచిన పుష్పమాలికల్**

మునీంద్ర = నారదా!, భద్రశుండాల సమానులైన = భద్రగజములతో సమానులైన, నరనాథ తనూజులు = రాజ కుమారులు, మోము తమ్ములన్ = ముఖ పద్మములందు, వాలిక పోటు గంట్లు = గొప్ప యుద్ధపు గాయములు, చెలువంబుగ = అందమగుచుండగా, విప్పుగు = విశాలమైన, పేరురంబులన్ = వక్షస్థలములందు, దివిజకాంతలు = దేవకాంతలు, లీలమై = విలాసముగా, వైచిన = వేసిన, పుష్పమాలికల్ = పూలదండలు, క్రాలగన్ = ప్రకాశింపగా, మా గృహంబునకు = మా స్వర్గమునకు, ఇప్పుడు, రారు = వచ్చుటలేదు, ఏలొకొ = ఎందుచేతనో!

తా. నారదా! భద్రగజ సమానులైన రాజకుమారులు ముఖపద్మములందు గొప్ప యుద్ధపు గాయములు అందమగుచుండగా మరణించి విశాలములైన వారి వక్షస్థలములందు దేవకాంతలు విలాసముగా పూలదండలు వేయుటచే ప్రకాశించుచుండెడివారు. వారు ఎందుచేతనో ఇప్పుడు మా స్వర్గమునకు వచ్చుటలేదు.

11 **చ. అతి నిశితాసి ధార సమరాంగణభూములఁ ద్రెస్సి శోణిత**
**స్రుతిఁ గడుఁజుల్కనై యెగసి సూర్యపథంబున నేఁగుదెంచుచో**
**గతిఁ గయికొంద్రు లాఘవము గాంతురు మా భువనంబునందుఁ దా**
**రతిథి సమర్చనా ప్రభవమైన గురుత్వము పార్థివోత్తముల్**

పార్థివోత్తముల్ = రాజశ్రేష్ఠులు, అతి నిశిత అసిధారన్ = మిక్కిలి వాడియైన కత్తి అంచుచే, సమర అంగణ భూములన్ = యుద్ధభూములయందు, త్రెస్సి = తెగినవారై, శోణిత స్రుతిన్ = రక్తము ప్రవహించుటచే, కడున్ = మిక్కిలి, చుల్కనై = తేలికైనవారై, ఎగసి = ఎగిరి, సూర్యపథంబునన్ = ఆకాశమార్గమునందు, ఏగుదెంచుచో = మా లోకమునకు వచ్చునపుడు, గతిన్ = గమనమునందు, లాఘవము = తేలికదనమును, కయికొంద్రు = స్వీకరింతురు, తారు = ఆ రాజశ్రేష్ఠులు, మా భువనంబునందు = మా లోకమునందు, అతిథి సమర్చనా ప్రభవమైన = అతిథి సత్కారము కలిగినదైన, గురుత్వము = పూజ్యత్వమును, కాంతురు = పొందుదురు.

తా. రాజశ్రేష్ఠులు యుద్ధరంగమున వాడియైన కత్తి అంచుచే తెగినవారై రక్తము కారిపోగా దేహము మిక్కిలి తేలికై

ఎగిరి ఆకాశమార్గమున మా లోకమునకు వచ్చునపుడు వచ్చుటలో తేలికతనమును స్వీకరింతురు. కాని వారు మా లోకమునందు అతిథి సత్కారము పొందినవారై పూజ్యత్వమునే పొందుదురు.(యుద్ధమున లఘుత్వము పొందినను మా దగ్గఱ పూజ్యత్వమునే పొందెదరు)

**12 క. అభిముఖులై యేలకొ నా**
**సభ కిప్పుడు రారు నృపతిసత్తము లనఘా!**
**యభిశాప మొనర్పరుగా**
**త్రిభువన సంస్తుత్య! నాదు దెస నరనాథుల్**

అనఘా = దోష రహితుడా!, నృపతి సత్తముల్ = రాజశ్రేష్ఠులు, ఏలకొ = ఎందుచేతనో, నా సభకు = నా కొలువుకూటమునకు, అభిముఖులై = నా కెదురుగా, ఇప్పుడు = ఈ మధ్యన, రారు = వచ్చుటలేదు, త్రిభువన సంస్తుత్య = మూడు లోకములందు కీర్తింపబడువాడా!, నరనాథుల్ = రాజులు, నాదు దెస = నా విషయమై, అభిశాపము = తిరస్కారమును, ఒనర్పరుగా = చేయుటలేదుకదా!

తా. అనఘా! నారదా! రాజశ్రేష్ఠులు ఎందుచేతనో స్వర్గమునకు ఈమధ్యన నాకెదురుగా వచ్చుటలేదు. రాజులకి నామీద ఏదైనా తిరస్కారభావము ఏర్పడలేదుకదా!

**13 చం. కొలకొలమంచునుండు సితకోకనద ప్రభవ ప్రసూత! నా**
**కొలువిది తొంటినాఁ డతిథి కోటుల సందడి; నిప్పు డెంతయుం**
**బలపలనయ్యె బందుగులు పల్మరుఁ బైకొనిరాక యున్కి నా**
**కలిమి నిజోదరైకభృతి కార్యకదర్యతఁ జిన్నఁ బోయెడిన్**

సిత = తెల్లని, కోకనద = ఎఱ్ఱని తామరయందు, ప్రభవ = పుట్టిన బ్రహ్మవలన, ప్రసూతా = పుట్టినవాడా!, నా కొలువు ఇది = ఈ నా సభ, తొంటినాడు = ఇంతకుపూర్వము, అతిథికోటుల సందడిన్ = అతిథులసమూహముయొక్క సందడితో, కొలకొలమంచున్ = కలకలలాడుతూ, ఉండు = ఉండేది. ఇప్పుడు, బందుగులు = అతిథులు, పల్మరున్ = వరుసగా, పైకొని = పూనుకొని, రాకయున్కి = రాకపోవుటచే, పలపల అయ్యెన్ = వెలితిపడినది. నా కలిమి = నా సంపద, నిజ ఉదర = నా పొట్టమాత్రమే, ఏకభృతి = ముఖ్యముగా పోషించుకొనుటయనెడి, కార్య = కార్యముయొక్క, కదర్యతన్ = కృపణత్వముచేత, చిన్న పోయెడిన్ = వెలవెలపోవుచున్నది.

తా. బ్రహ్మకుమారా! నా యీ సభ ఇంతకు పూర్వము అతిథుల సందడితో కలకలలాడుతూ ఉండేది. ఇప్పుడు బంధువులు రాకపోవడంతో వెలితిపడిపోయాను. నా సంపద నాపొట్టను మాత్రమే పోషించుకోవడమనే పనిచేత కృపణత్వమునంది వెలవెలపోతున్నది.

**14 చ. వదలక పూర్వపుణ్య విభవ వ్యయ హేతువులౌట సంపదల్**
**మదిఁ దలఁపంగ నాపదలె మాన్య సుహృజ్జన బంధుకోటికిన్**
**హదనున మేలుసేఁత చతురాననసంభవ! శాస్త్ర పద్ధతిం**
**దదుచితమైన శాంతిక విధానము నిక్క మెఱుంగ వచ్చినన్**

చతురానన సంభవ = బ్రహ్మకుమారా! పూర్వ పుణ్య, విభవ = వైభవముచే సంపాదింపబడిన, సంపదల్ = సంపదలను, వ్యయ = ఖర్చుపెట్టుటే, హేతువులు ఔట = కారణముగా కలవగుటచే, వదలక = విడువక, మదిన్ = మనసునందు, తలపంగన్ = అలోచింపగా, ఆపదలె = కష్టములే, హదనున = మంచికాలమునందు, మాన్య = ఆదరణీయులైన, సుహృత్‌జన = స్నేహితులకు, బంధు = బంధువులయొక్కయు, కోటికిన్ = సమూహమునకు, మేలు చేత = మంచిని చేయుట, నిక్కము = సత్యమును, ఎఱుంగన్ వచ్చినన్ = తెలిసికొన్నచో, శాస్త్ర పద్ధతిన్ = శాస్త్రము ప్రకారముగా, తత్ = ఆ సంపదరూపములగు ఆపదలకు, ఉచితము ఐన = తగినదయిన, శాంతిక విధానము = శాంతిని కలిగించే మార్గము,

తా. నారదా! పూర్వపుణ్య వైభవముచే సంపాదింపబడిన సంపదను ఖర్చుపెట్టుటే కారణముగా కలవగుటచే మనుసునందు బాగుగా అలోచించగా అవి ఆపదలే. శాస్త్రము ప్రకారము సత్యమును తెలిసికొన్నచో తగినకాలమందు వానిని ఆదరింపదగిన స్నేహితులు, బంధువుల సమూహమునకు మంచిని చేయుట ఆ సంపదరూపములగు ఆపదలకు తగిన శాంతిక విధానము.

**15 వ. కావున నఘమర్షణ ఋక్కులం బోలు నీ వాక్కుల మత్సంశయాఘం బపనయింపుమని సహస్రాక్షుండు నిజచక్షు స్సహస్రంబు తన ముఖంబున నిల్పి యూరకున్న నారదుండు పాకశాసనుని వినయ పరిపాకంబునకు మనంబునం బరితోషంబు నొందుచు నిట్లనియె.**

తా. కాబట్టి అఘమర్షణ మంత్రములను పోలిన నీ వాక్కులచేత నా సందేహమనెడి పాపమును తొలగింపుమని ఇంద్రుడు తన వేయికన్నులను తన ముఖముమీదనే నిల్పి ఊరకున్న నారదుడు ఇంద్రుని వినయాతిశయమునకు మనసున సంతోషించుచు ఇట్లు పలికెను.

16 **తే. అతిథి బాంధవ సంభావనాభిలాష**
**గర్భమగు నీదు వాక్య సందర్భమునకు**
**సంతసంబయ్యె సురరాజ! సాధు సాధు**
**సార్వకాలంబు నీవ యిజ్జగము లేలు**

అతిథి = న తిథి = అతిథి, తిథితో సంబంధములేకుండా వచ్చినట్టి, బాంధవ = బంధువులను, సంభావన అభిలాష = గౌరవించడమనే కోరిక, గర్భము అగు = లోన దాగియున్న, నీదు, వాక్య సందర్భమునకు = వాక్యముల సంబంధమునకు, సంతసంబు ఆయ్యె = సంతోషమైనది. సురరాజ = ఇంద్రా!, సాధు సాధు = బాగు బాగు, సార్వకాలంబు = ఎల్లకాలమును, నీవ= నీవే, ఈ జగము, ఏలు = పాలింపుము.

తా. అతిథులుగా వచ్చిన బంధువులను గౌరవించడమనే కోరిక లోన దాగియున్న నీ మాటలకు సంతోషమైనది. ఓ ఇంద్రా! కలకాలము నీవే ఈ స్వర్గమును పరిపాలించు.

17 **వ. నాకభువనంబునకు రాజలోకంబు భూలోకంబుననుండి రాకుండుటకుం గారణంబు వినుము.**

18 **మ. ఒక రత్నంబు విదర్భదేశమున యందుద్భూతమై పార్థివ**
**ప్రకరంబుం భ్రమియించుచున్నయది సౌభాగ్య ప్రభా నిత్య ల**
**క్ష్మికి సంకేత నివాసమై మదన నిస్త్రింశంబు నా భీమక**
**న్యకనాఁగా దమయంతినాఁ గలుగు పర్యాయాభిధానంబులన్**

ఒక రత్నంబు, విదర్భదేశమునయందు, ఉద్భూతమై = పుట్టినదై, సౌభాగ్య ప్రభా = సౌందర్యముయొక్క కాంతిచేత, నిత్య = శాశ్వతమైన, లక్ష్మికి = సంపదకు, సంకేత నివాసమై = చిరునామాయై, మన్మథ నిస్త్రింశంబునాన్ = మన్మథుని కత్తియనియు, భీమకన్యకనాన్ కాన్ = భీమరాజపుత్రియనియు, దమయంతినాన్ = దమయంతియనియు, కలుగు = ఉన్నటువంటి, పర్యాయ అభిధానంబులన్ = పర్యాయ నామములతో, పార్థివ ప్రకరంబున్ = రాజసమూహమును, భ్రమియించుచున్నయది = మోహింపచేయుచున్నది.

తా. ఒక కన్యారత్నము విదర్భదేశంలో పుట్టి, సౌందర్య కాంతిచేత నిత్య లక్ష్మికి సంకేతమై మన్మథుని ఖడ్గమనీ, భీమరాజపుత్రియనీ, దమయంతియనీ కలిగిన పర్యాయనామములతో రాజసమూహమును మోహింపచేయుచున్నది.

19 **తే. ప్రతి ముహూర్తంబు మధుర సౌభాగ్యరేఖ**
**యౌవనముతోడఁ బెరుఁగు నా యలరుఁబోడి**
**ధరణియందొక్క రాజనందనుని మీఁద**
**నిలిపెనఁట బయల్వోకుండ నెమ్మనంబు**

ప్రతి ముహూర్తంబు = ప్రతి క్షణము, మధుర, సౌభాగ్య రేఖ = సౌందర్య రేఖ, యౌవనముతోడన్, పెరుగు, ఆ యలరుబోడి = ఆ దమయంతి, ధరణియందున్ = భూమండలమున,ఒక్క రాజనందనుని మీదన్, నెమ్మనంబు = నిండు మనసును, బయల్ పోకుండ = ఏకాగ్రతతో, నిలిపెను అట = నిలిపిందట.

తా. ఆ దమయంతి ప్రతిక్షణము తన సౌందర్యరేఖ యౌవనముతోపాటు పెరుగుచుండగా భూమండలములోని ఒక రాజకుమారుని నిశ్చయంగా ప్రేమించిందట.

20 **వ. పురాకృత సంభవంబైన భాగ్యంబునకు దానకంబైన యమ్మానవేంద్రుం డెవ్వండొకో యని యడుగం దలంచెదేని**

తా. పూర్వపుణ్యమువలన కలిగిన భాగ్యమునకు స్థానమైన ఆ రాజేంద్రుడు ఎవ్వరోయని అడుగ తలచినచో

21 **తే. అడుగఁ బూఁచినమాట యే యెడకు నెక్కె**
**నంతనుండియ మగిడింపు మమరరాజ**
**ప్రశ్నమున కుద్గమన పరిశ్రాంతి వలదు**
**తెలిసి యుత్తర మీ నాకు వలను లేమి**

అమర రాజా = దేవేంద్రా!, అడుగన్ = అడుగుటకు, పూచినమాట = ప్రయత్నించిన మాట, ఏ యెడకున్ = ఎంతవరకు, ఎక్కెన్ = వెళ్ళిందో, అంతనుండియె = ఆ స్థలమునుండియే, మగిడింపుము = మరల్చుకొనుము, ప్రశ్నమునకున్ = నీ ప్రశ్నకు, తెలిసి = తెలిసినను, ఉత్తరము ఈన్ = సమాధాన మిచ్చుటకు, నాకు వలను లేమి = నాకు వీలుపడక పోవుటచే, ఉద్గమన పరిశ్రాంతి = అడగాలనే ఆయాసము, వలదు = చేయకుము.

తా. దేవేంద్రా! అడగాలనుకున్న ప్రశ్న ఎంతవరకు వెళ్ళిందో అక్కడే ఆపుచెయ్యి. నాకు తెలిసినప్పటికీ నీ ప్రశ్నకు సమాధానమివ్వడానికి నాకు వీలుపడకపోవుటచే నీ అడగాలనే ఆయాసము చేయకుము.

22 **వ. నీవు యోగీశ్వరుండవు నీ హృదయంబు పరమాణు దర్శన సమర్థంబు. మనంబులు నణుపరిమాణంబులు**

**గావున నక్కాంతా రత్నంబు మనం బెఱుంగవే? యని యడిగెదేని**

తా. నీవు యోగీశ్వరుడవు. నీ మనస్సు పరమాణువును కూడా చూడ సమర్థము. మనములు అణుపరిమాణములు కనుక ఆ కాంతారత్నము మనసు నెఱుంగవా? అని అడుగ తలచినచో

**23 చ. అలయక యోగిబుద్ధి పరమాణువుఁ గాంచినఁ గాంచుఁగాక కే**
**వలము దదంతరస్థమగు వస్తువు గానఁగ నెట్లు నేర్చు న**
**న్నలినదళాయతేక్షణ మనః పరమాణువునందు హ్రీ దరీ**
**నిలయ హరీకృతుం డతఁడు నేరఁగ వచ్చునె వానిఁ గానఁగాన్**

యోగి బుద్ధి, అలయక = శ్రమలేకుండగా, పరమాణువున్, కాంచినన్ = చూచిన, కాంచుగాక = చూడవచ్చును. కేవలము = ముఖ్యముగా, తత్ అంతరస్థము అగు = ఆ పరమాణువు లోనయున్నదియగు, వస్తువున్ = వస్తువును, కానంగన్ = చూచుటకు, ఎట్లు నేర్చున్ = ఎలా సాధ్యపడుతుంది?, ఆ నలినదళాయత ఈక్షణ = ఆ తామరరేకులవలె విశాలమైన కన్నులుకల దమయంతి, మనః పరమాణువునందు = మనస్సను పరమాణువునందు, హ్రీ = సిగ్గనెడి, దరీనిలయ = గుహకి, అతడు = ఆ రాజకుమారుడు, హరీకృతుండు = సింహమువంటివాడు. వానిన్ = ఆ రాజ కుమారుని, కానగాన్ = చూచుటకు, నేరగ వచ్చునె = వీలుపడుతుందా?

తా. యోగబుద్ధితో ఏ శ్రమలేకుండగా పరమాణువును చూచిన చూడవచ్చును. కాని ప్రధానముగా అ పరమాణువులో నున్న వస్తువును చూచుటకు ఎలా సాధ్యపడుతుంది? ఆ పద్మనేత్ర దమయంతి మనస్సను పరమాణువునందు సిగ్గనెడి గుహకి ఆ రాజకుమారుడు సింహమువంటివాడు. మరి, ఆ రాజకుమారుణ్ణి చూడ్డానికి వీలుపడుతుందా?

**24 వ. అన్నీలవేణి కుసుమబాణ పరంపరా శరవ్యంబైన తన హృదయంబు విరహ పరితాప పాండురంబులైన యవయంబులం బ్రకాశించుటం గనుంగొని గురుజనంబు తద్భావ పరిజ్ఞానార్థంబు పంచాశత్కోటి విస్తీర్ణంబైన భూమండలంబున స్వయంవర మహోత్సవంబు చాటింపం బంచిన**

తా. ఆ దమయంతి మన్మథ భావపరంపరకు గురియైన తన మనస్సు విరహ పరితాపముచే తెల్లనైనట్టి అవయవములతో ప్రకాశించుటను చూచి పెద్దలు ఆమె అభిప్రాయమును తెలుసుకొనుటకు ఏబదికోట్లచే విశాలమైన భూమండలమున స్వయంవర మహోత్సవమును చాటింపువేయించగా

**25 ఉ. అంగదఁ దత్స్వయంవర మహామహ వైభవ కేలి హూతికిన్**
**గ్రంగున ఘంటపైఁ గొడుపు గ్రాలుట యెన్నఁడు నాఁటనుండియున్**
**సంగరమున్ గరంబుగ మనంబున భావన సేయుదు ర్వధూ**
**మంగళ కార్య నిష్ఠులయి మధ్యమలోకమునన్ మహీపతుల్**

మధ్యమలోకమునన్ = భూలోకమున, మహీపతుల్ = రాజులు, అంగదన్ = ఉత్సాహముతో, తత్ = ఆ దమయంతియొక్క స్వయంవర = స్వయంవరమనెడి, మహామహ = గొప్పదైన, వైభవ, కేలి హూతికిన్ = ఉత్సవమునకు పిలుచుటకుగా, క్రంగునన్ = క్రంగుమని, ఘంటపైన్ కొడుపు క్రాలుట = ఘంటమీద కఱ్ఱ ఆడుట, ఎన్నడు = ఎప్పటినుండో, నాట నుండియున్ = ఆనాటినుండియును, వధూమంగళకార్యనిష్ఠులై = వివాహ ప్రయత్నపరులై, సంగరమున్ = యుద్ధమును, గరంబుగన్ = విషముగా, మనంబునన్ = మనసునందు, భావన చేయుదురు = తలంతురు.

తా. భూలోకమున రాజులు ఉత్సాహముతో ఆ దమయంతియొక్క స్వయంవరమనెడి గొప్ప ఉత్సవమునకు పిలుచుటకై ఘంట మ్రోగినది మొదలుగా నాటినుండియు వివాహప్రయత్నపరులై యుద్ధమును విషముగా మనసున భావన చేయుచున్నారు.

**26 తే. అఖిలమోహిని యయిన యయ్యలరుఁబోడి**
**శైశవము వీడుకొన్నది సందుగాఁగ**
**ననుదినంబును రాజనందనులమీఁద**
**వేఁటలాడుచునున్నాఁడు విషమశరుఁడు**

అఖిలమోహినియయిన = సమస్తమును మోహిపంచేయునదైన, ఆ అలరుబోడి = ఆ దమయంతి, శైశవమున్ = బాల్యమును, వీడుకొన్నది సందుగాన్ = విడిచిపెట్టినది అవధిగా, విషమశరుడు = మన్మథుడు, అనుదినంబు = ప్రతి దినమును, రాజ నందనులమీదన్ = రాజకుమారులమీద, వేటలాడుచున్ ఉన్నాడు.

తా. లోకమును మోహింపచేయునదైన ఆ దమయంతి బాల్యమును విడిచిపెట్టడమే తరువాయిగా మన్మథుడు ప్రతిరోజును రాజకుమారులను తన బేసి బాణములతో వేధించుచునే ఉన్నాడు.

**27 వ. అది కారణంబుగా రాజలోకం బీలోకంబునకు రాదు, భూమండలంబున భండనంబు లేకుండుటం జేసి నా విలోచనంబు లుపవసించి యున్నయవి, యే నిప్పుడు వీనికి సుఖపారణంబుగా రణక్రీడాడంబరంబు రాక్షసులతో నీకు సంభవించునొకో యనునాస నిచ్చోటికిఁ జనుదెంచితినని పలికిన**

తా.	ఆ కారణమువలన రాజలోకము ఈ లోకమునకు వచ్చుటలేదు. భూలోకమున యుద్ధములు లేకపోవుటవలన నా కన్నులు ఉపవాసముతో ఉండిపోయినవి, ఇప్పుడు నేను నా నేత్రములకు విందుభోజనముగా యుద్ధక్రీడాతిశయము రాక్షసులతో నీకు కలుగునేమో అను ఆశతో ఇక్కడికి వచ్చితిని అని పలుకగా

**28	ఉ. అమ్మఘవంతుఁ డల్ల నగి యంబురుహాసన సూతి కిట్లనున్**
**సమ్మద మొప్ప లేదు రణచర్చ దివంబున నాదు నెయ్యపుం**
**దమ్ముఁడు కైటభాంతకుఁడు దక్షతఁ బ్రెగ్గడయై సమస్త భా**
**రమ్ము వహింపఁగాఁ ద్రిదశరాజ్యము నెమ్మదిఁ జేయుచుండుదున్**

ఆ మఘవంతుడు = ఆ యజ్ఞాధిపతియగు ఇంద్రుడు, అల్ల నగి = చిఱునవ్వు నవ్వి, అంబురుహాసన సూతికి = నారదునకు, సమ్మదము ఒప్పన్ = సంతోషము వెల్లడియగునట్లుగా, ఇట్లనున్ = ఇట్లు పలికెను, దివంబున = స్వర్గమున, రణచర్చ = యుద్ధవిచారము, లేదు, నాదు నెయ్యపుం తమ్ముడు = నా ప్రియ సోదరుడు, కైటభాంతకుడు = కైటభుని చంపినవాడు (విష్ణువు), దక్షతన్ = సమర్థతతో, ప్రెగ్గడయై = నాయకుడై, సమస్త భారమ్ము వహింపగా, త్రిదశరాజ్యమున్ = స్వర్గమును, నెమ్మదిన్ = నిశ్చింతగా, చేయుచుండుదున్ = పరిపాలించుచుందును.

తా.	ఆ ఇంద్రుడు చిఱునవ్వు నవ్వి ఆ బ్రహ్మకుమారుడైన నారదునకు సంతోషముతో ఇట్లు పలికెను 'నారదా! స్వర్గమున ఆ యుద్ధ ఆలోచన ఏమియు లేదు. నా ప్రియ సోదరుడు, కైటభాంతకుడునైన విష్ణువు సమర్థతతో నాయకత్వము వహించి సమస్త కార్యభారము వహించగా నేను స్వర్గమును నిశ్చింతగా పరిపాలన చేయుచున్నాను.

**29	తే. సాక్షి మాత్రంబుగాఁ గరస్థలమునందు**
**నెపుడు వజ్రాయుధము వహింతుఁగాని**
**యతని యాజ్ఞయె చాలు సంయమివరేణ్య!**
**త్రిదశ లోకాధిరాజ్యంబు దిరముసేయ**

ఎపుడున్, వజ్రాయుధము, కరస్థలమునందున్ = చేతియందు, సాక్షిమాత్రంబుగాన్, వహింతు కాని = ధరింతునే కాని, సంయమివరేణ్య = మునిశ్రేష్ఠా!, త్రిదశ లోక అధిరాజ్యంబు = స్వర్గమును, తిరము చేయన్ = సుస్థిరము చేయుటకు, అతని ఆజ్ఞయె చాలు = ఆ విష్ణుని మాటయే చాలును.

**30	వ. అని పలికినం గలహభోజనుండు నిట్టూర్పు నిగిడించి యిట్లనియె**

**31	శా. పాతాళంబున నున్న యప్పుడు గడుం బ్రార్థింతు భూలోకముం**
**జేతోవీథి ధరిత్రి నున్నపుడు గాంక్షింతున్ సురావాసమున్**
**దైతేయాంతక! యొక్కచోట నిలువం దాత్పర్య మిబ్భంగినా**
**కేతోయంబున లేకపోయెను సమిద్వీక్షాభిలాషంబునన్**

దైతేయాంతక = ఇంద్రా!, పాతాళంబునన్ ఉన్న అప్పుడు, సమిత్ = యుద్ధమును, వీక్ష = చూడాలనే, అభిలాషంబునన్ = కోరికతో, కడుం = ఎక్కువగా, భూలోకమున్, చేతోవీథిన్ = మనస్సున, ప్రార్థింతున్ = కోరుచుందును, ధరిత్రిన్ = భూలోకమందు, ఉన్నపుడు, సురావాసమున్ = స్వర్గలోకమును, కాంక్షింతున్ = కోరుచుందును, ఇబ్భంగిన్ = ఈ రీతిగా, ఒక్కచోటన్, నిలువన్ = నిలుచుటకు, తాత్పర్యము = ఆసక్తి, నాకు, ఏ తోయంబునన్ = ఏరీతిచేతను, లేకపోయెను.

తా.	ఇంద్రా! నాకు పాతాళంలో ఉన్నప్పుడు యుద్ధం చూడాలనే కోరికతో భూలోకాన్ని మనస్సులో కోరుకుంటాను. భూలోకమందున్నపుడు స్వర్గలోకాన్ని కోరుకుంటాను. ఈ రీతిగా ఒక్కచోటే నిలవడానికి నాకు ఆసక్తి లేకుండాపోయింది.

**32	వ. నిన్నుం గనుగొంటి, నా రాక కిదియ లాభంబు. నన్ను వీడుకొల్పుము. మధ్యమలోకంబునకుం గ్రమ్మఱఁ బోయెద. దమయంతీ స్వయంవరోత్సవావసరంబున మాత్సర్యంబు పుట్టి జట్టి బిరుదులగు రాచపుట్టువులు దమలోనం బ్రతిఘటించి నిల్చి శస్త్రాశస్త్రిం గదిసి మొత్తులాడిరేనిఁ జిత్తంబునం గుత్తుకబంటిగా సమర సంరంభంబు భుజియింతుంగదా యని పలికి సముచిత ప్రకారంబున నముచిసూదనుచేత ననుజ్ఞాతుండై పర్వతుండునుం దానును నరిగెఁ దదనంతరంబ**

తా.	'నిన్ను చూశాను. నేను రావడానికి ఇదే లాభము. నన్ను పంపించు. భూలోకానికి తిరిగి పోతాను. దమయంతీ స్వయంవరం సందర్భంలో అసూయలు పుట్టి వీరులైన రాచపుట్టువులు తమలోతాము ఎదుర్కొని నిలబడి శస్త్రాస్త్రములతో ఢీకొని పోరాడితే అపుడు నేను మనస్సులో పీకవరకు ఆ యుద్ధ సంరంభాన్ని ఆస్వాదిస్తానుకదా!' అని పలికి తగినవిధంగా ఇంద్రునిచేత అంగీకరింపబడినవాడై పర్వతుడును, తానును వెళ్ళెను, ఆ తరువాత

**33	తే. దేవముని మాట లమృతంపుఁ దేట లగుచు**
**నధికతరమైన యాహ్లాద మాచరింప**
**వేడ్కపడె నెమ్మనంబులో విబుధరాజు**
**భోజకన్యా స్వయంవరంబునకుఁ బోవ**

దేవముని మాటలు = నారదుని మాటలు, అమృతంపున్ తేటలు అగుచు = స్వచ్ఛమైన అమృతమువంటివియగుచు, అధికతరమైన = మిక్కిలి గొప్పదైన, ఆహ్లాదమున్ = సంతోషమును, ఆచరింప = కలిగింపగా, విబుధరాజు = దేవేంద్రుడు, భోజకన్యా స్వయంవరమునకున్ పోవ, నెమ్మనములో = మనసులో పూర్తిగా, వేడ్కపడె = కుతూహలపడెను.

తా. నారదుని మాటలు అమృతపు తేటలయి అంతులేని ఆనందమును కలిగింపగా దేవేంద్రుడు దమయంతీ స్వయంవరమునకు వెళ్ళాలని మనసులో పూర్తిగా కుతూహలపడెను.

**34 మ. పవిసంగంబునఁ దాప మొందిన శచీ ప్రాణేశు కెంగేలికిం**
**జివురుం గైదువు జోదు వైద్య ముపదేశించెన్ రహస్యంబుగా**
**నవ నీహార పయో మిళన్మలయజ స్నానార్ద్ర పర్యంతమై**
**యివతాళించు విదర్భరాజతనయా హృద్య స్తనద్వంద్వమున్**

పవి సంగంబునన్ = వజ్రాయుధ సంబంధముచే, తాపము ఒందిన = సంతాపమును పొందిన, శచీ ప్రాణేశు = ఇంద్రునియొక్క, కెంగేలికిన్ = ఎఱ్ఱనిచేతికి, చిగురుం కైదువు జోదు = మన్మథుడు, నవ = నూతనమైన, నీహార = మంచుసంబంధమైన, పయస్ = నీటితో, మిళత్ = కలిసిన, మలయజ = మంచిగంధముయొక్క, స్నాన = చిలుకుటచే, ఆర్ద్ర = తడిసిన, పర్యంతమై = ప్రక్కలు గలదై, ఇవతాళించు = మిక్కిలి చల్లదనము కలిగియున్న, విదర్భరాజతనయా, హృద్య = మనోహరమైన, స్తన ద్వంద్వమున్ = స్తనముల జంటను, రహస్యంబుగా, వైద్యము ఉపదేశించెన్

తా. వజ్రాయుధము రాపిడిచే నలిగిన ఇంద్రునియొక్క ఎఱ్ఱని చేతి తాపము పోవుటకు మంచిగంధము కలిసిన క్రొత్త మంచు నీటితో అభిషేకింపగా తడిసిన ప్రక్కలు గలదై మిక్కిలి చల్లదనము కలిగియున్న దమయంతి అందమైన స్తనద్వంద్వమును చేకొనుటయే వైద్యముగా మన్మథుడు రహస్యముగా ఉపదేశించెను.

**35 వ. అప్పుడు**

**36 సీ. రంభ విస్రంభ సంరంభంబు దిగనాడె**
**మానరోషము పూనె మంజుఘోష**
**దళుకొత్తె మదిఁ దిలోత్తమకు నుత్తలపాటు**
**ప్రమ్లోచ ప్రమ్లాన భావమొందె**
**నూర్వశి సౌభాగ్య గర్వంబు పొరివోయె**
**హరిణి సంతాపాగ్ని కరణి యయ్యె**
**వంతఁ బానుపుమీఁద వైచె మేను ఘృతాచి**
**మేనక సన్మాన మూనమయ్యె**
**తే. నచ్చరలు దక్కుఁ గలవారు నలసి సొలసి**
**ప్రాణముక్తియ యుక్తిగా ననుమతించి**
**రాత్మ వల్లభు డింద్రుండ యవనినాథ**
**తనయ వరియింప ధరకుఁబోఁ దలఁచుటెఱిగి**

ఆత్మవల్లభుడు = మనోవల్లభుడైన, ఇంద్రుడ = ఇంద్రుడే, అవనినాథ తనయ = రాకుమార్తె దమయంతిని, వరియింప = వరించుటకు, ధరకున్ పోన్ = భూలోకమునకు వెళ్ళుటకు, తలచుట, ఎఱిగి = తెలుసుకొని, రంభ, విస్రంభ సంరంభంబు = విశ్వాసాతిశయమును, దిగనాడెన్ = విడిచిపెట్టెను. మంజుఘోష, మానరోషము = ప్రణయకోపమును, పూనె = వహించెను. తిలోత్తమకు, మదిన్ = మనసునందు, ఉత్తలపాటు = తొట్రుపాటు, తళుకొత్తెన్ = అధికమాయెను. ప్రమ్లోచ, ప్రమ్లాన భావము = వెలవెలపోవుటను, ఒందెన్ = పొందెను. ఊర్వశి, సౌభాగ్య గర్వంబు = సౌందర్యాతిశయము, పొరిపోయె = నశించెను. హరిణి, సంతాపాగ్ని కరణి = సంతాపమనెడి అగ్నికాష్ఠము, ఆయ్యెన్. ఘృతాచి, వంతన్ = బాధతో, మేను = దేహమును, పానుపుమీద వైచె. మేనక, సన్మానము = గౌరవము, ఊనము అయ్యె = తగ్గిపోయెను. తక్కు కలవారు అచ్చరలు, అలసి సొలసి, ప్రాణముక్తియ = ప్రాణములను విడచుటయే, యుక్తిగా = ఉపాయముగా, అనుమతించిరి = అంగీకరించిరి.

తా. మనోవల్లభుడైన ఇంద్రుడే రాకుమార్తె దమయంతిని వరించుటకు భూలోకమునకు వెళ్ళుటకు సిద్ధపడుట తెలుసుకొని రంభ విశ్వాసాతిశయమును దిగనాడెను. మంజుఘోష ప్రణయకోపమును వహించెను. తిలోత్తమకు మనసున తొట్రుపాటు హెచ్చసాగెను. ప్రమ్లోచ వెలవెలపోయినది. ఊర్వశి సౌందర్యాతిశయము నశించెను. హరిణి సంతాపాగ్ని కాష్ఠమయ్యెను. ఘృతాచి బాధతో పానుపు చేరెను. మేనక గౌరవము తగ్గిపోయెను. ఇక మిగిలిన అప్సరసలు అలసి సొలసి ప్రాణములను విడచుటయే ఉపాయముగా తలంచిరి.

**37 వ. ఇట్లు జంభారి విశ్వంభరా భువనంబునకుం బోవ సమకట్టి కట్టాయితంబయ్యె. అతనితోడం గూడఁ బావక పరేతరాజ పాశపాణులు పయనంబైరి. అప్పు దప్పురందరాది బృందారక చతుష్టయంబు మున్నాడి ప్రోడలగు వేల్పుఁ**

**జేడియలచేత దమయంతికిం గానుకలుగా నిగూఢ ప్రకారంబున మందార కుసుమ దామంబులు మొదలుగా దేవలోకంబునం గల వస్తువులు పంచిరి. యనంతరంబ**

తా. ఇలా ఇంద్రుడు భూలోకమునకు వెళ్ళడానికి పూనుకొని సిద్ధపడెను. అతనితో కూడా అగ్ని, యముడు, వరుణుడు ప్రయాణమైరి. అప్పుడు ఆ ఇంద్రాది నలుగురును ముందుగా ప్రౌఢలగు దేవతా స్త్రీలచేత దమయంతికి కానుకలుగా రహస్యముగా కల్పవృక్షపు పూల దండలు మొదలైన దేవలోకమునందలి వస్తువులను పంపించిరి. ఆ తరువాత

**38 శా. ఆ దిక్పాలురు దివ్యకాంచన విమానారూఢులై సమ్మదా**
**పాదివ్యోమ తరంగిణీ లహరికా పర్యంత వాతంబు ప్ర**
**స్వేదాంభఃపృషతంబులం గముపఁగా శీఘ్రంబ యేతెంచి రా**
**హ్లాదం బొప్ప వసుంధరా స్థలి కమర్త్య వ్రాతముల్ గొల్వగన్**

ఆ దిక్పాలురు, దివ్య కాంచన విమాన ఆరూఢులై = దివ్యమైన బంగారు విమానముల నెక్కినవారై, సమ్మద = సంతోషమును, ఆపాది = కలిగించుచున్న, వ్యోమ తరంగిణీ = గంగానదియొక్క, లహరికా = కెరటముల, పర్యంత = ప్రాంతములనుండివచ్చు, వాతంబు = గాలి, ప్రస్వేదాంభఃపృషతంబులన్ = చెమట బిందువులను, కముపగాన్ = పోగొట్టుచుండగా, అమర్త్య వ్రాతముల్ = దేవతా సమూహములు, కొల్వగన్ = సేవించుచుండగా, ఆహ్లాదంబు = సంతోషము, ఒప్పన్ = ఒప్పునట్లుగా, వసుంధరా స్థలికి = భూలోకమునకు, శీఘ్రంబ = వేగముగా, ఏతెంచిరి = వచ్చిరి.

తా. ఆ దిక్పాలకులు దివ్యమైన బంగారు విమానములనెక్కి సంతోషము కలిగించుచున్న గంగానది కెరటముల ప్రాంతములనుండి వచ్చు గాలి చెమట బిందువులను పోగొట్టుచుండగా, దేవతాసమూహములు సేవించుచుండగా సంతోషము ఒప్పునట్లుగా భూలోకమునకు వేగముగా వచ్చిరి.

**39 వ. ఇట్లు గగనంబు డిగ్గి యమరులు సజలజలధరధ్వాన గంభీరంబై దూరంబుననుండి వీతెంచు నొక్క మ్రోఁత యాలకించి యిదియేమి ఘోషంబొకో యని యద్దిక్కుఁ గనుంగొను నప్పుడు నిస్వన శ్రుతి సహోపయాతంబైన రథంబునందు**

తా. ఈ విధముగా ఆకాశమునుండి దిగివచ్చి దేవతలు వర్షాకాల మేఘ గర్జనవలె గంభీరముగా దూరమునుండి వచ్చు నొక ధ్వనిని విని, ఇదియేమి చప్పుడో అని ఆ దిక్కు చూచునప్పుడు ధ్వని వినికిడితో కూడి వచ్చుచున్న రథమునందు

**40 ఉ. కాంచిరి నిర్జరేశ్వరు లఖండిత రూప విలాస సంపదన్**
**వంచిత పంచబాణుఁ డగువాని సమంచిత సార ధీరతం**
**గాంచన భూధరంబునకు గాదిలి నెచ్చెలి యైనవాని ని**
**ర్వంచిత దానశక్తి సురరత్నముఁ బోలెడువాని నైషధున్**

నిర్జరేశ్వరులు = దిక్పాలకులు, అఖండిత = తక్కువకాని, రూప విలాస సంపదన్ = సౌందర్యముయొక్క, కాంతియొక్క సంపదచే, వంచిత = జయింపబడిన, పంచబాణుడగు వానిన్ = మన్మథుడు కలవాడైనట్టి వానిని, సమంచిత = ఒప్పుచున్న, సార ధీరతన్ = సారమైన ధైర్యగుణముచే, కాంచన భూధరంబునకు = మేరుపర్వతమునకు, గాదిలి నెచ్చెలియైన వానిన్ = ప్రియ స్నేహితుడైనవానిని, నిర్వంచిత = కపటములేని, దానశక్తిన్, సురరత్నమున్ = చింతామణిని, పోలెడువానిని = పోలియున్నవానిని, నైషధున్ = నలమహారాజును. కాంచిరి = చూచిరి.

తా. అంతులేని రూప విలాస సంపదలచే జయింపబడిన మన్మథుడు కలవాడైనవానిని, ఒప్పుచున్న సారమైన ధైర్యగుణముచే మేరుపర్వతమునకు ప్రియస్నేహితుడైనవానిని, కపటములేని దానశక్తిచే చింతామణిని పోలినవానినిన నల మహారాజును చూచిరి.

**41 వ. కాంచి వరుణుం డతని తరుణత్వంబునకు నిబిడంబగు జడభూయంబును లులాయధ్వజుం డతని రూపధేయంబునకు ధూమలత్వంబును వైశ్వానరుం డతని యైశ్వర్యంబునకుం బరితాపంబును సుత్రాముం డతని కామనీయకంబునకుం జూపోపమియును నిక్కంబుగా వహించి**

తా. చూచి, వరుణుడు అతని యౌవనమునకు దట్టమైన జడత్వమును, యముడు అతని సౌందర్యమునకు నల్లదనమును, అగ్ని అతని ఐశ్వర్యమునకు సంతాపమును, ఇంద్రుడు అతని కమనీయత్వమునకు మాత్సర్యమును నిజముగా వహించి

**42 మ. శ్రుతపూర్వంబగు విశ్వమోహనకళా శోభావిశేషంబు స**
**మ్మతి నూహింపఁగఁ జాయవాఱుటయుఁ బ్రేమంబాత్మలోఁ గీలుకో**
**నితఁడే నైషధుఁడంచు నొండొరులతో నేకాంత మొయ్యయ్యనా**
**శతమన్యు ప్రముఖామరుల్ మునుకుచుం జర్చించి రుత్కంఠతోన్**

శ్రుత పూర్వంబగు = ఇంతకుముందు వినినదగు, విశ్వమోహన కళా = లోకమునకు మోహమును పుట్టించెడు, శోభా విశేషంబునన్ = శోభాతిశయముచే, సమ్మతిన్ = మనసునందు, ఊహింపగన్, చాయవాఱుటయున్ = సరిపోలగా,

ప్రేమంబు, ఆత్మలోన్, కీలుకోన్ = జనించుచుండగా, ఆ శతమన్యు ప్రముఖ అమరుల్ = ఆ ఇంద్రాది దేవతలు, ఉత్కంఠతోన్ = తహతహతో, మునుకుచు = ఆరాటపడుచు, ఇతడే, నైషధుడు అంచు = నలమహారాజనుచు, ఒండొరులతోన్ = ఒకరితోనొకరు, ఏకాంతము = రహస్యముగా, ఒయ్యయ్యన్ = మెల్లమెల్లగా, చర్చించిరి

తా. ఇంతకుముందు విన్నటువంటి, లోకానికి మోహాన్ని పుట్టించే శోభాతిశయముచేతను మనసున ఆలోచింపగా సరిపోలడంతో ప్రీతి జనించి ఆ ఇంద్రాది దేవతలు తహతహతో ఆరాటపడుచు ఇతడే నలమహారాజు అని ఒకరితోనొకరు రహస్యముగా మెల్లమెల్లగా చర్చించుకొనిరి.

**43 వ. ఇట్లు విమర్శించుచుండ**

**44 తే. విమలతర దివ్య గగనయానముల మీఁద**
**ధరణిఁ గొలువున్న యా దిగీశ్వరులఁ జూచి**
**యద్భుతాక్రాంత చిత్తుఁడై యధిపసుతుఁడు**
**చేరఁ జనుదెంచి యంతంతఁ దేరు డిగ్గె**

విమలతర = మిక్కిలి స్వచ్ఛమైన, దివ్య గగనయానములమీద = దివ్యమైన విమానములమీద, ధరణిన్ కొలువున్న = భూమికి వేంచేసియున్న, ఆ దిగీశ్వరులన్ చూచి = ఆ దిక్పాలకులను చూచి, అద్భుతాక్రాంత చిత్తుడై = ఆశ్చర్యముచే ఆక్రమింపబడిన మనస్సు కలవాడై, చేరన్ చనుదెంచి = సమీపించి, అంతంతన్ = మెల్లగా, తేరు డిగ్గె = రథము దిగెను.

తా. మిక్కిలి స్వచ్ఛమైన దివ్య విమానములమీద భూమికి వేంచేసియున్న ఆ దిక్పాలకులను చూచి ఆశ్చర్యముతో నిండిన మనస్సు కలవాడై చేరి రాజకుమారుడు మెల్లగా రథమును దిగెను.

**45 వ. ఇవ్విధంబున రథంబు డిగ్గి మూర్తంబైన రామణీయక గుణాద్వయ వాదంబునుంబోని యమ్మేదినీ రమణుండు సుత్రామాది విబుధ రాజ చతుష్టయంబునకు నభివాదనం బాచరించి ప్రాంజలియై పార్శ్వంబున నిలిచియుండె. అయ్యమృతాశను లతనిం జూచి దమయంతీ నిరాశంబులైన యాశయంబులతో బరస్పర ముఖావలోకనంబులు చేసిరి. అప్పుడు వంచనా కపట నాటక సూత్రధారుండైన సునాసీరుం డా నృపకుమారున కిట్లనియె**

తా. ఈ రీతిగా రథము దిగి మూర్తీభవించిన సౌందర్యమనెడు గుణమునకు అద్వైత వాదమువలెనున్న ఆ నలమహారాజు ఇంద్రుడు మొదలగు దిక్పాలురు నలుగురకు నమస్కరించి చేతులు జోడించినవాడై ప్రక్కను నిలబడియుండెను. దేవతలు అతనిని చూచి దమయంతియందు ఆశలేనివారై, కోర్కెలతో ఒకరి ముఖము నొకరు చూసుకొనుచుండిరి. అపుడు మోసముతో కూడిన కపటమనెడు నాటకమునకు సూత్రధారుడైన ఇంద్రుడు ఆ రాజకుమారునితో ఇట్లు పలికెను.

**46 సీ. అన్న! యెవ్వరివాడవయ్య సేమమె? నీకు**
**నైషధుండను బుద్ధి నాకుఁ బొడమె**
**గారాపుఁ జెలికాఁడు వీరసేనుఁడు మాకు**
**నాతని రేఖ నీయందుఁ దోఁచె**
**నేమి కార్యముఁ గోరి యెట వోవుచున్నాఁడ**
**వెపుడు నీ చారిత్ర మేము విందు**
**మెఱుగుదో నీవు మమ్మిందఱ లెస్సగా**
**నెఱుఁగకుండిననేమి యెఱిఁగికొనుము**
**తే. దండపాణి యితం డనలుం డతండు**
**వరుణుఁ డితఁ డేను నిర్జరవల్లభుండఁ**
**బిండితార్థంబు విను మేల పెక్కుమాట**
**లర్థులై వచ్చితిమి మము నాదరింపు**

అన్న = నాయనా!, ఎవ్వరి వాడవయ్య!, నీకున్, సేమమె = కుశలమేకదా!, నాకున్, నైషధుండను బుద్ధి = నలమహారాజను తలంపు, పొడమెన్ = పుట్టెను. మాకు, వీరసేనుడు గారాపు చెలికాడు = ప్రియ స్నేహితుడు, నీయందున్, ఆతని రేఖ = ఆతని పోలిక, తోచె = కనబడెను. ఏమి కార్యము కోరి, ఎటకు, పోవుచున్నాడవు, ఎపుడు = ఎల్లప్పుడును, ఏము = మేము, నీ చారిత్రము, విందుము, నీవు, మమ్ము ఇందఱన్ = మమ్మల్నందరినీ, లెస్సగా = బాగుగా, ఎఱుగుదో = ఎఱుగుదువా?, ఎఱుగకుండినన్ ఏమి = తెలియకపోతే ఏమి., ఎఱిగికొనుము = తెలిసికొనుము, ఇతండు, దండపాణి = యముడు, అతండు, అనలుండు = అగ్ని, ఇతడు, వరుణుడు, ఏను = నేను, నిర్జరవల్లభుండ = దేవతలకు ప్రభువును, పెక్కుమాటలు ఏల, పిండితార్థంబు వినుము = కావలసిన కార్యమును వినుము. అర్థులమై = యాచకులమై, వచ్చితిమి, మమున్ ఆదరింపు

తా. నాయనా! ఎవరి వాడవయ్యా! నీకు కుశలమేకదా! నా బుద్ధికి నలమహారాజువని తోస్తోంది. మాకు వీరసేనుడు మంచి స్నేహితుడు, అతని రూపు నీలో కనబడుతోంది. ఏం పనిమీద ఎక్కడికి వెళుతున్నావు? మేము ఎల్లప్పుడు నీ చరిత్రనే

వింటూ ఉంటాము. నువ్వు మమ్మలందర్నీ బాగా ఎఱుగుదువా? తెలియకపోతే ఏంలే? ఇపుడు తెలిసికో! ఇతడు యముడు, అతడు అగ్ని, ఇతడు వరుణుడు, నేను ఇంద్రుడను. పెక్కుమాటలెందుకు? కావలసిన కార్యాన్ని విను. కార్యార్థులమై వచ్చాము మమ్మల్ని ఆదరించు.

**47 వ. ముహూర్తమాత్రంబున మార్గఖేదనం బపనయించి కార్యనివేదనం బొనర్చెదమని పలికి యభిధాన కుశలుండైన యవ్విబుధనాయకుం దూరకుండిన**

తా. క్షణకాలంలో మార్గాయాసాన్ని పోగొట్టి పనిని తెలుపుటను చేసెదమని పలికి మాటలనేర్పరియైన దేవేంద్రుడు మౌనమువహించగా

**48 తే. అర్థియను పేరు చెవి సోఁకినంత మాత్ర**
**జాదుకోఁ బులకించె నజ్జనవిభుండు**
**ప్రావృషేణ్య పయోధర ప్రభవమైన**
**గాలి ననిచిన నీపవృక్షంబ పోలె**

అజ్జనవిభుండు = ఆ నలమహారాజు, అర్థి అను పేరు, చెవి సోకినంత మాత్ర = చెవిలో పడినంత మాత్రమున, ప్రావృషేణ్య = వర్షాకాలముయొక్క, పయోధర = మేఘము, ప్రభవమైన = కారణముగా కలదైన, గాలిన్ = గాలిచేత, ననిచిన = పుష్పించిన, నీపవృక్షంబ పోలె = కడిమిచెట్టు వలె, జాదుకోన్ = దట్టముగా, పులకించెన్

తా. ఆ నలమహారాజు అర్థి యనుపేరు చెవిసోకినంతమాత్రమున వర్షాకాల మేఘము కారణముగా కలదైన గాలిచేత పుష్పించిన కడిమిచెట్టువలె దట్టముగా పులకిత శరీరము కలవాడయ్యెను.

**49 వ. ఇట్లు సంతసిల్లి భూవల్లభుం డంతర్గతంబున**

తా. ఈ విధంగా సంతోషించి నలమహారాజు మనస్సునందు

**50 క. త్రిదశులకును దుర్లభమై**
**మదధీనంబైనయట్టి మంచి పదార్థం**
**బది యెట్టిదొక్కొ వేగమ**
**యొదవునొకో? యడిగినపుడ యుచితంబునకున్**

త్రిదశులకును = దేవతలకును, దుర్లభమై = అశక్యమై, మదధీనంబైనయట్టి = నా వశములో ఉన్నటువంటి, మంచి పదార్థము, అది ఎట్టిది ఒక్కొ = అది ఎటువంటిదో, వేగమ = శీఘ్రముగా, అడిగినపుడ = కోరినయపుడే, ఉచితంబునకున్ = ఊరకనే, ఒదవునొకో = లభించునా?

తా. దేవతలకును దుర్లభమై, నా వశములోనున్న ఆ మంచి పదార్థము అది ఎటువంటిదో? అది నాకు తొందరగా, అడగ్గానే, ఉచితంగా లభిస్తుందా?

**51 తే. అడిగినప్పుడ యిత్తు నేఁ బ్రాణమైన**
**నర్థిమాత్రంబునకు వేడ్క నతిశయిల్ల**
**యట్టి యే నింద్రుఁడంతవాఁడాసపడిన**
**నకట యేమిచ్చి పరితోష మందువాఁడ**

ఏను, అడిగినప్పుడ, వేడ్క అతిశయిల్లన్ = సంతోషము అతిశయింపగా, అర్థిమాత్రంబునకున్ = సామాన్య యాచకునికి కూడా, ప్రాణమైన, ఇత్తును, అట్టి ఏను = అలాంటి నేను, ఇంద్రుడంతవాడు ఆసపడిన = ఇంద్రుడంతవాడు కోరగా, అకట = అయ్యో!, ఏమి ఇచ్చి, పరితోషము = సంతోషమును, అందువాడ = పొందగలవాడను

తా. నేను అడిగినవారు సంతోషించేలా సామాన్య యాచకునికైనా ప్రాణమైనా ఇస్తాను. అలాంటి నేను సాక్షాత్తు ఇంద్రుడంతటివాడు కోరితే అయ్యో! ఏమిచ్చి సంతోషము పొందగలవాడను.

**52 క. ప్రాణంబుకంటె భీమ**
**క్షోణిపతి తనూజ మీఁద గూర్మి గలదు గీ**
**ర్వాణాధీశ్వరు డయ్యలి**
**వేణిన్ మదిఁ గోరెనేని వేగమ యిత్తున్**

ప్రాణంబు కంటెన్, భీమక్షోణి తనూజ మీదన్ = దమయంతి మీద, కూర్మి = ప్రేమ, కలదు, గీర్వాణ అధీశ్వరుడు = ఇంద్రుడు, ఆ అలివేణిన్ = తుమ్మెదలవంటి కేశములుగల ఆ దమయంతిని, మదిన్ = మనసునందు, కోరేనేని = కోరినచో, వేగమ = వెంటనే, ఇత్తున్ = ఇచ్చివేసెదను.

తా. నాకు నా ప్రాణంకంటే దమయంతిమీద ప్రేమ ఎక్కువగా కలదు. ఒకవేళ ఇంద్రుడు ఆ దమయంతిని మనసున కోరుకున్నా నేను వెంటనే ఇచ్చివేస్తాను.

**53 తే. ఎద్దియొకొ వీరి యభిలాష మెఱుఁగుభంగి**
**నడుగకయ మున్న యీవి భాగ్యంబుగాదె**
**వాంఛ నెఱిగియు నర్థార్థి వచన దైన్య**
**మాత్మ సైరింపఁ జాలువాఁ డధమదాత**

వీరి అభిలాషము = వీరి కోరిక, ఎఱుగు భంగి = తెలుసుకొనే రీతి, ఎద్దియొక్కొ = ఏముందోకదా!, అడుగకయ మున్న = అడక్కుండానే, ఈవి = దానమిచ్చుట, భాగ్యంబు కాదె = అదృష్టమేకదా!, వాంఛను ఎఱిగియు = కోర్కెను తెలిసికొనియు, అర్థార్థి = యాచకునియొక్క, వచన దైన్యము = మాట దీనత్వమును, ఆత్మన్ = మనసునందు, సైరింపన్ చాలువాడు = సహించుటకు చాలినవాడు, అధమ దాత = దాతలలో నీచుడు

తా. వీరి కోరిక తెలుసుకొనే విధానము ఏముందోకదా! అడగకుండానే దానమివ్వడం అదృష్టమేకదా! యాచకుని కోర్కెను తెలుసుకొనియు మాట దీనత్వమును మనసునందు సహింపజాలినవాడు దాతలందరిలోను నీచుడు.

**54 చ. కటికితనంబు బూని చటుకాకు విడంబముఁ గూర్చి లజ్జ సం**
**కటపడఁజేసి యర్థిఁ గడుఁ గారియ వెట్టిన పాతకంబు న**
**క్కట తలఁగంగఁజాలునొకొ కాలవిలంబము నాచరించి పి**
**మ్మటఁ దదభీప్సితార్థము సమర్పణ సేయు ప్రదాత్మ యెమ్మెయిన్**

కటికితనంబు = కాఠిన్యమును, పూని = వహించి, చటు కాకు విడంబమున్ = చటులోక్తులు, కాకోక్తుల పరిహాసమును, కూర్చి = కలిగించి, లజ్జన్ = సిగ్గుచే, సంకటపడన్ చేసి = బాధపడునట్లుచేసి, అర్థిన్ = యాచకుని, కడున్ = మిక్కిలి, కారియ వెట్టిన = బాధపెట్టిన, పాతకంబున్ = పాపమును, అక్కట = అయ్యో, కాలవిలంబమున్ = ఆలస్యమును, ఆచరించి = చేసి, పిమ్మటన్ = తరువాత, తత్ అభీప్సితార్థము = వాని కోరికను, సమర్పణ చేయు = ఇచ్చునట్టి, ప్రదాత్మ = గొప్పదాత, ఎమ్మెయిన్ = ఏ విధముగానైనను, తలుగంగ చాలునొకొ = తొలగించుకొనుటకు వీలగునా?

తా. కాఠిన్యము వహించి చటులోక్తుల, కాకోక్తుల పరిహాసమును కలిగించి సిగ్గుతో బాధపడునట్లుచేసి యాచకుని మిక్కిలి బాధపెట్టిన పాపము అయ్యో! ఆలస్యము చేసి ఆ తరువాత వాని కోరికను తీర్చేటటువంటి గొప్పదాత ఏవిధంగానైన పోగొట్టుగోకలడా?

**55 చ. కమలము పంక సంకర విగర్హిత మర్హముగాదు నిల్వఁగాఁ**
**గమలకు నంచు నెంతయును గౌతుక మింపెసలార నర్థిదోః**
**కమలము నిర్మలంబు నతి గాఢ వివేకులు తద్విహార స**
**ద్మముగ నొనర్తు రప్రతిమ దాన కళా కలనా ధురీణతన్**

కమలకున్ = లక్ష్మీదేవికి, పంక సంకర = బురద సంబంధముచే, విగర్హితము = నిందింపబడెడు, కమలము = పద్మము, నిల్వగాన్ = నిలుచుటకు, అర్హము కాదు = తగినదికాదు, అంచున్ = అనుచు, ఎంతయును = మిక్కిలి, కౌతుకము = వేడుక, ఇంపు ఎసలారన్ = ఆసక్తి పెరుగునట్లుగా, నిర్మలంబు = స్వచ్ఛమైన, అర్థిదోఃకమలము = యాచకుని హస్త పద్మమును, అతిగాఢ వివేకులు = మిక్కిలి గొప్ప బుద్ధికలవారు, అప్రతిమ = సాటిలేని, దాన కళా కలనా = దానచాతుర్యమును నెఱపుటయందు, ధురీణతన్ = నేర్పుచే, తత్ = ఆ లక్ష్మీదేవికి, విహారసద్మంబుగన్ = క్రీడాభవనముగా, ఒనర్తురు = చేయుదురు.

తా. లక్ష్మీదేవికి బురదనంటిన పద్మము నిలుచుటకు తగినది కాదనుచు మిక్కిలి వేడుకయందు ఆసక్తి అధికమగు నట్లుగా మిక్కిలి గొప్ప బుద్ధికలవారు సాటిలేని దానచాతుర్యమును నెఱపుటయందు నేర్పుకలవారగుచు స్వచ్ఛమైన యాచకుని హస్త పద్మమును ఆ లక్ష్మీదేవికి క్రీడాభవనముగా నొనర్తురు.

**56 ఉ. దానకళాకలాప సముదంచిత సార వివేకసంపదన్**
**మానిత యాచమాన జనమానస వృత్త్యభిపూర్తి బుద్ధి యె**
**వ్వానికి లేదొకింతయును వాఁడొకరుండు భరంబు ధాత్రికిన్**
**గానలు గావు శైలములు గావు పయోధులు గావు భారముల్**

దానకళా కలాప = దానకళా కార్య సమూహముచే, సముదంచిత = ప్రకాశించుచున్న, సార వివేకసంపదన్ = సారమైన విజ్ఞాన సంపదచే, మానిత = గౌరవింపదగిన, యాచమాన జన = యాచక జనులయొక్క, మానసవృత్తి = మనసునందలి కోరికను, అభిపూర్తి = తీర్చవలెననెడు, బుద్ధి = ఆలోచన, ఒకింతయును = కొంచెమైనను, ఎవ్వానికి లేదు = ఎవరికి లేదో, వాడొకరుండు = వాడొక్కడే, ధాత్రికిన్ = భూమికి, భరంబు = భారము, కానలు = అడవులు, కావు = భారము కావు, శైలములు = కొండలు, కావు, పయోధులు = సముద్రములు, భారముల్ కావు

తా. దానకథా కార్య సమూహముచే ప్రకాశించుచున్న సారమైన విజ్ఞానసంపదచే గౌరవింపదగిన యాచకజనులయొక్క

మనసునందలి కోరికను తీర్చవలెననెడు ఆలోచన కొంచెమైనను ఎవరికి లేదో వాడొక్కడే భూమికి భారము, అడవులు, కొండలు, సముద్రములు భారము కావు.

**57 తే. తలప నథమర్ణుఁ డొకఁడు ప్రదానపాత్ర**
**మిచట నొక్కటి గొని మీఁద నిచ్చుఁ గోటి**
**సుకృతసంపదఁ బారలౌకికకుసీద**
**మాసపడువారి కిదియ బేహారమరయ**

తలపన్ = ఆలోచింపగా, ప్రదాన పాత్రము = దానమున కర్హుడగు, అథమర్ణుడు ఒకడు = ఒక యాచకుడు, ఇచటన్ = ఈ లోకమందు, ఒక్కటి గొని = ఒక్కటే తీసుకొని, మీద = తరువాత, కోటిన్ = అనంతముగా, ఇచ్చున్, సుకృతసంపదన్ = పుణ్యసంపదచే, పారలౌకిక కుసీదము = పరలోక జీవనోపాయమును, ఆసపడువారికి = కోరువారికి, అరయ = పరిశీలింపగా, ఇదియ బేహారము = ఇదియే వ్యవహారము.

తా. ఆలోచింపగా దానమునకర్హుడగు ఒక యాచకుడు ఈ లోకంలో ఒక్కటే (దానము) తీసుకొని తరువాత అనంతముగా (పుణ్యము) ఇచ్చును. పుణ్యసంపదచే పరలోకజీవనోపాయమును కోరువారికి పరిశీలింపగా ఇదియే వ్యవహారము.

**58 వ. అని ముహూర్తమాత్రంబు చింతించి యా నిషథరాజు ప్రసన్నముఖుండై యా బర్హిర్ముఖుల కిట్లనియె**

తా. అని క్షణకాలము ఆలోచించి ఆ నలమహారాజు నగుమోముకలవాడై యా దిక్పాలకులతో ఇట్లనెను

**59 తే. జన్య జనకంబులకు భేదశంక లేదు**
**దేహ మన్నజ మిందు సందేహ మెద్ది**
**మీర లమృతాశు లమృతంబు మిమ్ముఁ జూడఁ**
**దృప్తి సంపద నొందె మద్వీక్షణములు**

జన్య జనకంబులకున్ = కార్య కారణములకు, భేదశంక = భేదమనెడు సందేహము, లేదు. దేహము = ఈ శరీరము, అన్నజము = అన్నమువలన పెరిగినది, ఇందు సందేహము, ఎద్ది = ఏమున్నది? మీరలు = మీరు, అమృతాశులు = అమృతమును భక్షించువారు, అమృతంబు = అమృతస్వరూపులు, మిమ్ము చూడ, మద్వీక్షణములు = నా కన్నులు, తృప్తి సంపదన్ = తృప్తియను సంపదను, ఒందెన్ = పొందెను.

తా. కార్య కారణములకు భేదమనెడు సందేహము లేదు. ఈ శరీరము అన్నమువలన పెరిగినది. ఇందులకు సందేహము ఏమియు లేదు. మీరు అమృతమును భక్షించువారు. అలాంటి అమృతస్వరూపులైన మిమ్ము చూడ నా కన్నులు తృప్తి సంపదను పొందినవి.

**60 తే. ఏను చేసిన పుణ్యంబు లెట్టివొక్కొ**
**ఫలితమయ్యెను మత్పూర్వ పరమ తపము**
**లింత కల్యాణకరమౌనె యీ దినంబు**
**కౌతుకంబార దర్శింపఁ గంటి మిమ్ము**

ఏను చేసిన పుణ్యంబులు, ఎట్టివి ఒక్కొ = ఎటువంటివో కదా!, మత్ పూర్వ తపములు = నా పూర్వజన్మ తపస్సులు, ఫలితమయ్యెను, ఈ దినంబు, ఇంత, కల్యాణకరము ఔనె = మంగళకరమౌనా?, కౌతుకంబార = వేడుక నిండునట్లుగా, మిమ్ము, దర్శింపన్ కంటి = చూడగలిగితిని.

తా. నేను చేసిన పుణ్యములు ఎట్టివోకదా? నా పూర్వజన్మ తపస్సు ఫలించినది. ఈ రోజు ఇంత శుభకరమౌతుందా? వేడుకనిండుగా మిమ్మల్ని చూడగలిగితిని.

**61 చ. నలువు దలిర్ప సర్వసహనవ్రత జన్మములైన కర్మముల్**
**ఫలితములయ్యెఁ గావలయు భాగ్యము పెంపున భూతధాత్రికిన్**
**లలితములైన పాదకమలంబుల నర్చన మాచరింపఁగాఁ**
**దలతురె వేల్పులార! ప్రమదంబున మీరటుగాక తక్కినన్**

వేల్పులార = దేవతలారా!, భూతధాత్రికిన్ = భూమండలమునకు, సర్వ సహన = అన్నిటిని ఓర్చుటయనెడి, వ్రత = నియమమువలన, జన్మములైన = పుట్టుక కలవైన, కర్మముల్ = కర్మలు, భాగ్యము పెంపునన్ = భాగ్యాతిశయముచేత, నలువు = మనోజ్ఞత, తలిర్పన్ = చిగుర్చునట్లు, ఫలితములు అయ్యె = ఫలితములైనవి, కావలయు, అటుకాక తక్కినన్ = అలా కాక పోయియున్నచో, మీరు, ప్రమదంబునన్ = సంతోషముతో, లలితములైన = సుందరములైన, పాద కమలంబులన్ = పాదపద్మములను, (భూదేవికి) అర్చనము ఆచరింపగా = పూజ చేయగా, తలతురె = సిద్ధపడుదురా!

తా. దేవతలారా! సమస్తమును ఓర్చుటయనెడి వ్రతమువలన భూమండలమునకు జన్మములైన కర్మములు భాగ్యాతిశయముచే మనోజ్ఞత చిగురించునట్లు ఫలితములిచ్చినవి కావలయును. అలా కాకపోయియున్నచో మీరు సంతోషముతో

లలితములైన పాదపద్మములతో భూదేవిని పూజచేయుటకు పూనుకుంటారా!

**62 నాయందు మీ రపేక్షించిన ప్రయోజనం బానతిండు. ప్రాణంబైనను, ప్రాణాధికంబైనను నెద్దియేని పదార్థంబైన నిచ్చెదనని నిర్విశంకంబుగాఁ బలికిన యుర్వీశ్వరునకు గీర్వాణవల్లభుం డిట్లనియె**

తా. నావలన మీరు కోరిన కార్యమును ఆజ్ఞాపించండి. ప్రాణమైనను, ప్రాణముకంటె గొప్పదైనను ఎట్టి దుర్లభమైన పదార్థమునైనను ఇచ్చెదనని ఏమాత్రము సందేహము లేకుండగా పలికిన రాజునకు ఇంద్రుడు ఇట్లు పలికెను.

**63 ఉ. ఓ మిహిరాంశు వంశ కలశోదధి కౌస్తుభరత్న! భూపతి**
**గ్రామణి! యస్మదీయమగు కాంక్షితమున్ విను భీమపుత్రిపైఁ**
**గామన సేసి వచ్చితిమి గమ్ము సహాయము మాకు నిక్కపుం**
**బ్రేమయు భక్తియుం గృపయుఁ బెంపుగఁ జేయుము దూతకృత్యమున్**

మిహిరాంశు వంశ = చంద్ర వంశమనెడు, కలశ ఉదధి = పాలసముద్రమునకు, కౌస్తుభ రత్న!, భూపతి గ్రామణి = రాజ శ్రేష్ఠా!, అస్మదీయమగు కాంక్షితమున్ = మా సంబంధమైన కోరికను, వినుము, భీమపుత్రిపైన్, కామన చేసి = కోరికతో, వచ్చితిమి. మాకున్, సహాయము, కమ్ము, నిక్కపున్ ప్రేమయున్ = నిజమైన ప్రేమయును, భక్తియున్, కృపయున్ = దయయును, పెంపుగన్ = అధికమగునట్లుగా, దూతకృత్యమున్ = దూతకార్యమును, చేయుము.

తా. చంద్రవంశమనెడి పాలసముద్రమునకు కౌస్తుభరత్నమా! ఓ రాజశ్రేష్ఠా! మాదగు కోరికను వినుము. దమయంతిపై కోరికతో వచ్చాము. మాకు సహాయం చెయ్యి. మామీద నిజమైన ప్రేమ, భక్తి, దయ వృద్ధిపొందునట్లుగా దూతకార్యమును నిర్వర్తించుము.

**64 వ. భూమండలంబున రాజనందను లెందఱు లేరు? వారి ప్రయోజనం బేమి? తక్కిన గ్రహంబులు గ్రహరాజుం బోలనేర్చునె? అగాధగుణాంభోధివగు నీవు సహాయంబుగా మాకు సాధింపరాని కార్యంబు గలదే యని పలికిన**

తా. భూలోకంలో రాజకుమారు లెంతమంది లేరు? కాని వారివల్ల ప్రయోజన మేమిటి? తక్కినటువంటి గ్రహాలేన్నున్నా గ్రహరాజు సూర్యుడకి సరిపోతాయా? అగాధమైన గుణములతో సముద్రునివంటివాడవగు నువ్వు సహాయంగా ఉంటే మాకు సాధించలేని కార్యమంటూ ఉంటుందా? అని పలికిన

**65 తే. బలనిషూదను కపటంపు భాషణములు**
**విని నృపాలుండు పలికెఁ దద్విధమ కాఁగఁ**
**గుటిల బుద్ధుల గెలువంగఁ గుటిలమతియ**
**యర్హమగుఁగాని నీతిగా దార్జవంబు**

బలనిషూదను = బలుడనే రాక్షసుని చంపిన ఇంద్రుని, కపటంపు భాషణములు = మాయ మాటలను, నృపాలుండు = రాజు, విని, తద్విధమకాగన్ = ఆ మాటలకు సరిపడునట్లుగానే, పలికెన్, కుటిల బుద్ధుల = కపటబుద్ధికలవారిని, గెలువంగన్ = జయించుటకు, కుటిల మతియ = కపట బుద్ధియే, అర్హమగున్ కాని = తగినది ఔతుందేకాని, ఆర్జవంబు = నిష్కాపట్యము, నీతి కాదు (అర్థాంతరన్యాసాలంకారము)

తా. ఇంద్రుని మాయ మాటలు విని నలుడు ఆ మాటలకు సరిపడునట్లుగానే తానునూ పలికెను. కపటబుద్ధికలవారిని జయించుటకు కపటబుద్ధియే తగినదౌతుందే కాని నిష్కాపట్యము నీతికాదు.

**66 వ. అఖిల భూతాంతర్వర్తనముల నెఱింగెడు మీకు నెఱుంగంబడని యర్థంబునుం గలదె? అట్టి మీ రివ్విధంబున నానతిచ్చిన నేమి యనం గలదు? ఏ నయ్యంగనం గోరి వరియింపం బోవుచున్నవాడ. అమ్మచ్చెకంటికిం గుంటెనతనం బెట్లు సేయనేర్తు? విరహవేదనా దూయమాన మానసుండనైన యేను మీ రహస్యం బెట్లు రక్షింప నోపుదు. మనోరథ పరంపరానుధావనంబునఁ బరవశుండనైన నాకు భావగోపనం బెట్లు సిద్ధించు. వివిధ రక్షాధికృత పాలితంబులైన రాజ శుద్ధాంత భవన కక్ష్యాంతరంబు లేప్రకారంబునం బ్రవేశింతు? పెద్ద కాలంబుననుండియు నాయందు వినుకలిం దద్దయుం దగిలియున్న యమ్ముద్దియతో మీ ప్రసంగం బెట్భంగిఁ జేయుదు? కావున హాస్య కారణంబగు నిక్కార్యంబునకు నన్ను భారకుం జేయకుండని పలికిన**

తా. భూలోకమునందలి సమస్త ప్రాణుల మనోభిప్రాయములను తెలిసికొనెడు మీకు తెలిసికొనలేని విషయమేదైనా ఉందా? అలాంటి మీరు ఈ విధంగా ఆజ్ఞాపిస్తే ఏమనాలి? నేను ఆ యువతిని కోరి వరించాలని వెళ్ళుతున్నవాడిని. అలాంటిది ఆ యువతికే తార్చుతనమును ఎలా చేయగలను? విరహబాధతో కలుషితమైన మనసుకలవాడనైన నేను మీ గుట్టును ఎలా రక్షింపగలను? కోర్కెల వెంట పరుగిడుచు పరవశుడనైన నాకు మీ అభిప్రాయాన్ని రహస్యంగా ఉంచడం ఎలా కుదురుతుంది? అనేకమంది రక్షకభటులచే రక్షింపబడుచున్న రాజ అంత:పుర భవన కక్ష్యలలోనికి ఎలా ప్రవేశిస్తాను? చిరకాలంగ నాగురించి మిక్కిలి విన్నదైయున్న ఆ ముద్దరాలితో మీ విషయం ఏవిధంగా ప్రస్తావిస్తాను? కాబట్టి పరిహాసాస్పదమైన ఈ పనికి నన్ను నిర్వాహకుణ్ణి చేయకండని పలికిన

**67** **క. మేలపు మైవడి నగవున**
**వేలుపులం దోడివారి వీక్షించి మహీ**
**పాలునితో నిట్లనియెను**
**పౌలోమీవల్లభుండు ప్రస్ఫుటఫణితిన్**

పౌలోమీ వల్లభుండు = శచీదేవి భర్త (ఇంద్రుడు), మేలపుమైవడి = పరిహాసము తెలిపెడు, నగవున = నవ్వుతో, వేలుపులం తోడివారి = కూడావున్న దేవతలను, వీక్షించి = చూచి, ప్రస్ఫుటఫణితిన్ = స్పష్టమయిన మాటలతో, మహీపాలునితో = రాజుతో, ఇట్లనియెను.

తా. ఇంద్రుడు కూడావున్న దేవతలను చూచి పరిహాసము తెలిపెడు నవ్వుతో ఆ నలమహారాజున కిట్లనెను.

**68** **సీ. ఈమాట లాడకు ఇందువంశవతంస!**
**యాడి తప్పఁగ వచ్చునయ్య నీకు**
**క్షణభంగురంబైన సంసారమునకుఁగా**
**ధర్మంబుఁ గీర్తియుఁ దగునె విడువ**
**నన్వయంబున కాదియగు చందురుడుఁబోలె**
**నకట! కళంకి వేలయ్యెదీవు?**
**చిరకాలమున నుపార్జింపఁబడ్డ ప్రసిద్ధి**
**సేగిఁ బొందఁగ నుపేక్షింపవలదు**
**తే. పరుసనైన చింతామణిఁ బసరమైన**
**కామధేనువు మ్రానైన కల్పకంబు**
**నడిగి వైఫల్యమును బొంద రర్థిజనులు**
**మిన్నకయ పోదుమే యేము నిన్ను నడిగి**

ఇందువంశవతంస = చంద్రవంశమునకు శిరోభూషణమువంటివాడా!, ఈ మాటలు ఆడకు = ఇటువంటి మాటల మాట్లాడకు. నీకు, ఆడి = పలికి, తప్పగ వచ్చునయ్య = తప్పి పోవచ్చునా?, క్షణభంగురంబైన = క్షణములో నశించునట్టిదైన, సంసారమునకుగాన్ = సంసారము కొఱకై, ధర్మంబున్, కీర్తియున్, విడువ తగునె, అన్వయంబునకు = వంశమునకు, ఆదియగు = మూలపురుషుడైన, చందురుడున్, పోలె = వలె, అకట = అయ్యో!, ఈవు = నీవు, కళంకివి = మచ్చకలవాడివి, ఏల అయ్యెదు?, చిరకాలమున, ఉపార్జింపన్ బడ్డ = సంపాదించుకొనిన, ప్రసిద్ధి = ఖ్యాతి, సేగిన్ = ఆపదను, పొందంగ, ఉపేక్షింపవలదు = ఊరుకోరాదు, అర్థిజనులు = యాచకులు, పరుసనైన = కఠినమైన, చింతామణిన్ = చింతామణిని, పసరమైన = పశువైన, కామధేనువును, మ్రానైన = చెట్టైన, కల్పకంబు = కల్పవృక్షమును, అడిగి = యాచించి, వైఫల్యమును = విఫలత్వమును, పొందరు, ఏము = మేము, నిన్నున్, అడిగి, మిన్నకయ = ఊరకనే, పోదుమే = పోతామా?

తా. ఓ నలమహారాజా! ఇటువంటి మాటలు మాట్లాడకు. మాటయిచ్చి నీకు తప్పిపోవడం తగునా? క్షణములో నశించే సంసారంకోసం ధర్మాన్ని, కీర్తిని విడిచిపెట్టవచ్చా? నీ వంశానికి మూలమైన చంద్రుడిలా ఎందుకు మచ్చ తెచ్చుకుంటావు? చిరకాలంగా సంపాదించుకొన్న ఖ్యాతికి ఆపదసంభవిస్తే ఊరుకోకూడదు. యాచకులు చింతామణిని, కామధేనువును, కల్పవృక్షాన్ని యాచించి విఫలత్వమును పొందరు. మేమును నిన్ను అడిగి ఊరకనే పోము.

**69** **చ. అసదృశ దానవైభవ మహాగుణ ధన్యుని నిన్ను దేవతా**
**విసరము యాచకత్వమున వేఁడఁగ వచ్చుట కారణంబుగాఁ**
**బ్రసవ వికాసమాత్రమునఁ బాండురభావము నొందుఁగాక యా**
**కసము యశో విహీనమగుఁ గల్పమహీరుహ పంచకంబుచేన్**

అసదృశ = సాటిలేని, దాన వైభవ, మహాగుణ ధన్యుని = గొప్ప గుణములచే ధన్యుడైనవానిని, నిన్ను, దేవతా విసరము = దేవతా సమూహము, యాచకత్వమున = యాచకవృత్తిచే, వేడగ వచ్చుట = యాచించుట, కారణంబు కాన్ = కారణముగా, ఆకసము = స్వర్గము, కల్ప మహీరుహ పంచకంబుచేన్ = ఐదు కల్పవృక్షములచే (మందారము, పారిజాతము, సంతానము, కల్పవృక్షము, హరిచందనము), ప్రసవ వికాస మాత్రమునన్ = పూవులు వికసించుట మాత్రముచేతనే, పాండురభావము = తెల్లదనమును (కీర్తిని), ఒందున్ కాక = పొందిన పొందవచ్చునుకాని, యశోవిహీనము = యాచకుల కోర్కెలు తీర్చుటచే కలిగిన కీర్తి లేనిది, అగున్ = అయిపోవును.

తా. సాటిలేని దానవైభవ మహాగుణ ధన్యుడవైన నిన్ను దేవతలు యాచకవృత్తితో యాచించుట కారణముగా స్వర్గము ఐదు కల్పవృక్షముల పుష్ప వికాసముచే కీర్తిని పొందినపొందవచ్చును కాని యాచకుల కోరికలను తీర్చకపోతే ఆ కీర్తి లేనిదే అయిపోతుంది. (మేము నిన్ను యాచించుటచే కల్పవృక్షముల ఖ్యాతి తగ్గిపోయినది)

**70** **ఉ. అక్షరముల్ పఠించు సమయంబునఁ బాఠము సేయఁడయ్యెనో**
**వీక్షిత వర్ణమధ్యమున విస్మృతిఁ బొందెనొ యంచు నర్థు లు**
**త్ప్రేక్ష యొనర్తు రీ క్రియ నభీష్ట ఫలప్రతిపాదన క్రియా**
**దక్షుని నిన్నుఁగూర్చి నయధర్మవికారము నన్నకారమున్**

అర్థులు = యాచకులు, అక్షరముల్, పఠించు సమయంబునన్, పాఠము చేయడయ్యెనో = (నకారము)పఠించుట మానివేసెనో, వీక్షిత వర్ణ మధ్యమున = అభ్యసించిన అక్షరములను మధ్యలో, విస్మృతిన్ పొందెనొ = (నకారమును)మఱచిపోయెనో, అంచున్ = అనుచు, ఈ క్రియన్ = ఈ విధముగా, అభీష్ట = ఇష్టమైన, ఫల = ఫలితములను, ప్రతిపాదన క్రియా = ఇచ్చుటయనెడు వ్యాపారమునందు, దక్షునిన్ = సమర్థుని, నిన్నున్ కూర్చి = నిన్ను గుఱించి, నయ ధర్మ వికారమునన్ = నీతికి, ధర్మానికి వ్యతిరేకమగుటవలన, నకారమున్ = వ్యతిరేకముగా, ఉత్ప్రేక్ష యొనర్తురు = ఊహించుకొందురు.

తా. అక్షరములు పఠించే సమయంలో నకారమును పఠించడం మానేసాడా? లేదా పఠించిన అక్షరములను మధ్యలో మరచిపోయేడా? అని ఈ విధంగా ఇష్టమైన ఫలితాలను ఇవ్వడానికి సమర్థుడవైన నిన్ను యాచకులు నీతికి, ధర్మానికి వ్యతిరేకమవడం వలన అలా వ్యతిరేకంగానే ఊహించుకొంటారు.(అతిశయోక్తి, సందేహము అలంకారములు)

**71** **శా. ఈ యర్థంబు ఘటింపవన్న నృప! నీ కెంతేని మేలయ్యెడిన్**
**మా యాశీర్వచనంబులం ద్రిజగతీ మధ్యంబునన్ నీ యశ**
**శ్ఛాయామండల మిందు కుంద కుముద స్వచ్ఛంబు సంధించు సం**
**ధాయుక్తిన్ శితి పీత రోహిత హరి ద్వర్ణోపసంహారమున్**

నృప = రాజా!, ఈ యర్థంబు = ఈ పనిని, ఘటింపవన్న = సాధింపుమా!, నీకు, ఎంతేని, మేలు, అయ్యెడిన్ = అవుతుంది, మా ఆశీర్వచనంబులన్, త్రిజగతీ మధ్యంబునన్ = మూడు లోకములందును, నీ యశః ఛాయామండలము = నీ కీర్తి కాంతుల సమూహము, ఇందు = చంద్రుడు, కుంద = మల్లెలు, కుముద = కలువలువలె, స్వచ్ఛంబు = నిర్మలమై, సంధాయుక్తిన్ = నశింపచేయు ఉపాయముచే, శితి = నలుపు, పీత = పసుపు, రోహిత = ఎఱుపు, హరిత్ = ఆకుపచ్చ, వర్ణ = రంగులయొక్క, ఉపసంహారమున్ = లేకుండచేయుటను, సంధించు = కలిగించును.

తా. రాజా! ఈ పనిని సాధించు. నీకు ఎంతైనా మేలు కలుగుతుంది. మా ఆశీస్సులతో ముల్లోకాలలోను నీ కీర్తి కాంతులు చంద్రుడు, మల్లెలు, కలువలవలె నిర్మలమై మిగిలిన రంగులను నశిపంచేసే ఉపాయంతో నలుపు, పసుపు, ఎఱుపు, ఆకుపచ్చ రంగులను లేకుండచేయుటను కలిగించును. (నీ కీర్తివల్ల మొత్తమంతా తెలుపు అయిపోతుంది)

**72** **చ. వసుమతి వేయిపాదములవానికిఁ బుట్టిన చాయపట్టికి**
**న్విసవిసగాదు కాలొకటి నిత్యము తండ్రి సుతుండు వోలఁగాఁ**
**బొసఁగదె? దీని కుత్తరము వో యిది నీ ప్రకట ప్రతాపముం**
**గసమస దాఁటఁబోయి యతి ఖంజతఁ జిక్కె సహస్రపాదుఁడున్**

వేయిపాదములవానికి = సహస్ర కిరణములవానికి (సూర్యుడు), పుట్టిన, చాయపట్టికిన్ = ఛాయ కుమారునికి (శని), నిత్యము = ఎల్లప్పుడు, కాలొకటి = ఒక కాలు, విసవిస కాదు = ప్రసరింపదు (కుంటివాడు) (తండ్రికి వేయిపాదాలున్నా కొడుకు కుంటివాడయ్యేడు) వసుమతి = లోకంలో, సుతుండు = కొడుకు, తండ్రిన్, పోలగాన్ = సరిపోలుటకు, పొసగదె = కుదరలేదుకదా! దీనికిన్ = ఈ ప్రశ్నమునకు, ఇది = నీ ప్రవర్తన, ఉత్తరము పో = సమాధానమే, నీ ప్రకట ప్రతాపమున్ = నీ వెల్లడైన ప్రతాపమును, సహస్రపాదుడున్ = సూర్యుడును, కసమసన్ = సంభ్రమముచే, దాటబోయి, అతి ఖంజతన్ = మిక్కిలి కుంటితనమున, చిక్కెన్ = తగులుకొనెను

తా. వేయి పాదాలున్న సూర్యుడికి పుట్టిన శని కుంటివాడయ్యేడు. లోకంలో కొడుకు తండ్రిని పోలి ఉంటాడు అనేది కుదరలేదుకదా? ఈ ప్రశ్నకి నీ ప్రవర్తన సమాధానమే. నీ ప్రకటమైన ప్రతాపమును సూర్యుడును దాటబోయి కుంటితనమున తగుల్కొన్నాడు.

**73** **వ. అని యప్పుడు**

**74** **తే. అధిప! మాకిది పురుషార్థమనియె వహ్ని**
**ప్రార్థనము చేకొనుమటంచుఁ బలికె జముఁడు**
**రాజ! యన్యోపకార సంప్రభవమైన**
**యశముఁ గైకొనవయ్య నీవనియెఁ బాశి**

అధిప = రాజా!, మాకు, ఇది, పురుషార్థము = ప్రయోజనకారి, అనియె, వహ్ని = అగ్ని, ప్రార్థనము = మా కోరికను, చేకొనుము అటంచు = స్వీకరించమని, పలికె, జముడు = యముడు, రాజ!, అన్య ఉపకార సంప్రభవమైన = పరోపకారము వలన కలిగినదైన, యశమున్ = కీర్తిని, నీవు, కైకొనవయ్య = పొందుమయ్య, అనియెన్, పాశి = వరుణుడు

తా. రాజా! ఈ దూతకృత్యము మాకు ప్రయోజనకారి అన్నాడు అగ్ని. మా కోరికను మన్నించమన్నాడు యముడు. పరోపకారం వల్ల కలిగిన కీర్తిని నీవు పొందవయ్య అన్నాడు వరుణుడు.

**75 వ. ఇత్తెఱంగునం జాటుగర్భంబులైన వేల్పుల వాక్య సందర్భంబు లాకర్ణించి వైదర్భీ కాముకుండయ్యును నయ్యాదిగర్భేశ్వరుండు తద్దూతభారంబు భరించె. రాజపుంగవు నంగీకారం బెఱింగి దేవత లతని కంతఃపుర ప్రవేశంబున కుచితంబుగాఁ దిరస్కరణీ విద్య యుపదేశించి పొమ్ము కార్యసిద్ధి యయ్యెడుమని వీడుకొల్పిన**

తా. ఈ విధంగా పొగడ్తలలోకూడిన దేవతల మాటల సందర్భమును విని దమయంతియందు ప్రీతి కలవాడయ్యును ఆ భూనాథుడు నలుడు ఆ ద్యూతకార్యముయొక్క భారమును వహించెను. నలుని అంగీకారమును తెలిసికొని దేవతలు అతనికి అంత:పుర లోనికేగుటకు తగిన తిరస్కరణీ విద్యను ఉపదేశించి వెళ్ళుము పని ఫలించునని పంపిన

**76 ఉ. ఆ పరమోపకార నిధి యప్పుడు వేల్పుల రాయబార మ**
**నోపు వహించి యా దివిజముఖ్యుల వీడ్కొని చిత్తవృత్తికిం**
**జూపునకున్ శతాంగరయశుద్ధికి లక్ష్యముఁ జేసె భూత ధా**
**త్రీపతి రాజధాని జగతీ రమణీ మణి హారవల్లరిన్**

అప్పుడు, ఆ పరమోపకార నిధి = ఆ గొప్ప ఉపకారమునకు నిధియైన యా నలుడు, వేల్పుల రాయబారముఅను = దేవతల రాయబారము అనెడి, మోపు = భారమును, వహించి, ఆ దివిజముఖ్యులన్ = ఆ దేవతా శ్రేష్ఠులను, వీడ్కొని = విడిచిపెట్టి, జగతీ రమణీ = భూమియనెడు స్త్రీయొక్క, మణిహారవల్లరిన్ = రత్నమయమైన హార లతవలెనున్న, భూతధాత్రీపతి = భీమరాజుయొక్క, రాజధానియగు కుండిననగరమును, చిత్తవృత్తికిన్ = మనోవ్యాపారమునకు, చూపునకున్ = దృష్టికిని, శతాంగ = రథముయొక్క, రయశుద్ధికి = వేగాతిశయమునకు, లక్ష్యము చేసెను = గుఱిచేసెను. (ఉత్ప్రేక్ష అలంకారము)

తా. అపుడు పరోపకార నిధియైన నలుడు దేవతల రాయబార భారమును వహించి, ఆ దేవతాశ్రేష్ఠులను విడిచిపెట్టి భూరమణికి రత్నాలహారలతవలెనున్న భీమరాజు రాజధానియగు కుండిననగరము పోవుటకు మనోవ్యాపారమునకు, దృష్టికిని రథముయొక్క వేగాతిశయమును లక్ష్యము చేసెను.

**77 తే. విరహ భారంబుతోన యుర్వీధవుండు**
**ప్రబలమగు దేవకార్య భారము వహించె**
**నౌర్వశిఖితోన జలరాశి యంబుపూర**
**మౌర్వసేయుండు భరియింపఁడయ్యె నిట్లు**

ఉర్వీధవుండు = భూపాలుడగు ఆ నలమహారాజు, విరహభారంబుతోన = విరహబాధతోనే, ప్రబలమగు = గొప్పదైన, దేవ కార్యభారము, వహించె, ఔర్వసేయుండు = అగస్త్యుడు, ఔర్వశిఖితోన = బడబాగ్నితో, జలరాశి, అంబుపూరము = సముద్రపు నీటిని, ఇట్లు = ఈ విధముగా, భరియింపదు ఆయ్యె = సహింపలేదాయెను. (వ్యతిరేకము అలంకారము)

తా. భూపాలుడగు ఆ నలమహారాజు విరహబాధతోనే గొప్పదైన దేవకార్యభారమును వహించెను. అగస్త్యుడు బడబాగ్నితో కూడిన సముద్రమును పానముచేసినప్పుడు కూడా ఇలా సహింపలేదయ్యెను.

**78 మ. బలభిద్వహ్ని పరేతరాజవరుణుల్ పర్యుత్సుకత్వంబు సం**
**ధిలఁ గూర్చుండిరి యొండొరుం గదిసి యర్థిం తత్ప్రదేశంబున**
**న్నల నాళీక మృణాళనాళ లతికా నవ్య ప్రణాళీ మిళ**
**ల్లలనాలాప కథాసుధానుభవ లీలాలోల చేతస్కులై**

బలభిత్ = ఇంద్రుడు, వహ్ని = అగ్ని, పరేతరాజ = యముడు, వరుణుల్, పర్యుత్సుకత్వంబు = తమ ప్రయత్నము, సంధిలన్ = జరుగునట్లుగా, అర్థిన్ = కోరికతో, తత్ ప్రదేశంబునన్ = ఆ ప్రదేశమునందే, నల = నలుడనెడి, నాళీక మృణాళ నాళ లతికా = లతవంటి తామరతూండ్ల సంబంధమైన, నవ్య = క్రొత్తదైన, ప్రణాళీ = కాలువనుండి, మిళత్ = ప్రవహించుచున్న, లలనాలాప కథాసుథా = దమయంతి మాటలనెడి కథామృతమును, అనుభవ = అనుభవించుటయనెడి, లీలా = విలాసమందు, లోల = ఆసక్తిగల, చేతస్కులై = చిత్తములుకలవారై, ఒండొరుం గదిసి = ఒకరినొకరు చేరి, కూర్చుండిరి. (రూపకాలంకారం)

తా. దిక్పాలకులు నలుగురు తమ ప్రయత్నము జరగాలనే కోరికతో ఆ ప్రదేశమందే నలుడనెడి తామరతూండ్ల సంబంధమైన క్రొత్త కాలువనుండి ప్రవహించుచున్న దమయంతి మాటలనెడి కథామృతమును అనుభవించుచూ విలాసాక్త మనస్కులై ఒకరినొకరు చేరి కూర్చుండిరి.

**79 తే. అమ్మహారథు రథముఁ దాయంగ నరిగె**
**సత్వరమున విదర్భ రాజన్యు వీడు**
**సారమగు భాగ్యవంతు మనోరథంబు**
**కార్య సంసిద్ధిఁబోలె నస్ఖలిత లీల**

ఆ మహారథు రథము = ఆ నలమహారాజు రథము, సత్వరమున = శీఘ్రముగా, అస్ఖలిత లీలన్ = నిరాటంకమైన రీతిచే, సారమగు = దృఢమైన, భాగ్యవంతు = అదృష్టవంతునియొక్క, మనోరథంబు = కోరిక, కార్య సంసిద్ధిన్ పోలె = కార్య సాఫల్య మగునట్లుగా, విదర్భరాజన్యు వీడు = విదర్భరాజు పట్టణమును, డాయంగ నరిగెన్ = సమీపించెను

తా. ఆ నలుని రథము శీఘ్రముగా ఏ అడ్డు లేకుండగా అదృష్టవంతుని దృఢమైన కోరికవలె కార్య సాఫల్యమగునట్లుగా కుండిన నగరమును సమీపించెను.

**80 మ. దమయంతీ సుకుమార పాదకమల ద్వంద్వార్పణా ధన్య కు**
**ట్టిమ హర్మ్యంబగు పట్టణం బపుడు గంటిన్ మంటినంచెంతయుం**
**బ్రమదంబందె దిగీశ కార్యఘటనా భారంబు చింతించి దీ**
**ర్ఘము నుష్ణంబునుగా నొనర్చె ధరణీకాంతుండు నిశ్వాసమున్**

అపుడు, దమయంతీ, సుకుమార, పాద కమల = పాదపద్మములయొక్క, ద్వంద్వార్పణా = జతచేయడంచేత, ధన్య = కృతార్థత చెందిన, కుట్టిమ = అరుగులుగల, హర్మ్యంబగు = భవనములుకల, పట్టణంబు = కుండిననగరమును, కంటిన్ = చూచితిని, మంటిన్ = బ్రతికాను, అంచు = అనుచు, ధరణీకాంతుండు = నలుడు, ఎంతయున్, ప్రమదంబు = ఆనందమును, అందె = పొందెను. దిగీశ = దిక్పాలురయొక్క, కార్యఘటనా = కార్యమును కూర్చుటయనెడి, భారమును = బరువును, చింతించి = ఆలోచించి, దీర్ఘంబును = నిడుపును, ఉష్ణంబునుగాన్, నిశ్వాసమున్ = నిట్టూర్పును, ఒనర్చె = చేసెను

తా. అపుడు దమయంతీ సుకుమార పాదపద్మములయొక్క జతచేయడంచేత కృతార్థమైన అరుగులుకల భవనములు కల కుండిననగరమును చూచితిని బ్రతికాను అని నలుడు ఎంతయును ఆనందమును పొందెను. దిక్పాలుర కార్యమును కూర్చుటయనెడి బరువును ఆలోచించి నిడుపును, ఉష్ణమునైన నిట్టూర్పును విడిచెను

**81 వ. ఇట్లు కుండిననగరంబు చేరం జనుదెంచి యప్పురుష ప్రకాండుండు వలయు నమాత్యులం దగిన వారల నొక్క రమ్య ప్రదేశంబున సైన్యంబు విడియింప నియమించి బృందారక సందేశ కార్యంబు నిర్వర్తింపం దలంచి ససారథికంబగు తన రథంబు నచ్చోటన నిలిపి యొక్కరుండునుఁ బాదచారంబున నప్పురంబు ప్రవేశించె నప్పుడు**

తా. ఈ రీతిగా కుండిన నగరము సమీపించి ఆ పురుష శ్రేష్ఠుడు తగిన మంత్రులను మిగిలిన వారలను ఒక సుందర ప్రదేశమున సైన్యముతో విడిది చేయవలసినదిగా ఆజ్ఞాపించి, దేవతలసందేశ కార్యమును నిర్వర్తించ తలంచి సారథితో సహా తన రథాన్ని అప్పుడు అక్కడనే ఉంచి ఒక్కడే కాలినడకన అ పట్టణంలో ప్రవేశించెను.

**82 శా. చూడం జూడఁగ దేవతా వరమునం జోద్యంబుగా భూమిభృ**
**చ్చూడారత్న మదృశ్యుఁడయ్యె నతఁడచ్చో నద్భుతంబంద న**
**వ్వాడం బౌరజనంబు లెల్ల నితఁడెవ్వాఁడొక్కొ నేత్రోత్సవం**
**బై డాయం జనుదెంచె నంతటన మాయంబయ్యె నంచెంతయున్**

చూడం చూడగ, దేవతా వరమునన్, చోద్యంబుగా = ఆశ్చర్యముగా, భూమిభృత్ చూడారత్నము = రాజశేఖరుడు, అవ్వాడన్ = ఆ ప్రాంతమందలి, పౌరజనంబు, ఎల్లన్ = అందరును, ఇతడు = ఈ పురుషుడు, ఎవ్వాడొక్కొ = ఎవరోకదా! నేత్రోత్సవంబయి = కన్నులపండువయి, డాయం చనుదెంచెన్ = చేరువకు వచ్చెను, అంతటన్ = అంతలోనే, మాయంబయ్యె, అంచు, ఎంతయున్, అద్భుతంబు అందన్, అతడు, అచ్చో = అక్కడ, అదృశ్యుడయ్యెను

తా. చూస్తుండగానే దేవతా వరంవల్ల ఆశ్చర్యంగా ఆ రాజశేఖరుడు ఆ ప్రాంతంలోని పౌరజనం అందరూ 'ఈ పురుషుడు ఎవ్వరోకదా! కన్నులపండువయి చెంతకు వచ్చెను. అంతలోనే మాయమైపోయెను' అనుచు ఎంతయు ఆద్భుతమందగా ఆ నలమహారాజు అక్కడ అదృశ్యుడయ్యెను.

**83 వ. ఇట్లంతర్హితుండై రాజమార్గంబున నిరర్గళ వేగంబునం జని యా రాజకుంజరుండు మద కుంజర ఘటా సుందరంబగు రాజమందిరంబు డాసి**

తా. ఈ ప్రకారముగా అంతర్హితుడై రాజమార్గమున అడ్డులేక వేగముగా వెళ్ళి ఆ రాజశ్రేష్ఠుడు మదపుటేనుగుల సమూహముచే సుందరమైన రాజమందిరమును సమీపించి

**84 సీ. వంచనమై డాఁగి వర్తించు టిదియేమి**
**ప్రాభవంబని సిగ్గుపాటు నొందు**
**నాయుధ హస్తులై యాయితంబై యున్న**
**రక్షివర్గముల తీవ్రతకు నవ్వు**
**నది యెవ్వరని ప్రతీహారు లెవ్వరినన్నఁ**
**దన్నుగాఁ దలఁచి చిత్తమున నెసఁగు**
**నెదురుగాఁ జనుదెంచు నిందీవరాక్షుల**

**కొయ్యొయ్యఁ దెరువిచ్చి యోసరిల్లుఁ**
**తే. దలఁచి తలఁచి యలీక వైదర్భిఁ గాంచుఁ**
**గాంచి వేల్పుల ప్రియ వాచికంబు నొడువు**
**నొడివి తనమాట కచ్చెరు పడు జనంబు**
**క్రందు సందడిఁ దెలివొందు రాజసుతుఁడు**

రాజసుతుడు = నలుడు, వంచనమై = మోసంతో, డాగి = దాగి, వర్తించుట = తిరుగుట, ఇదియేమి = ఇదేమి, ప్రాభవంబని = వైభవమని, సిగ్గుపాటును, ఒందున్ = పొందును. ఆయుధహస్తులై = ఆయుధములు ధరించినవారై, ఆయితంబై యున్న = సిద్ధముగానున్న, రక్షివర్గముల తీవ్రతకు = రక్షక భటుల సమూహముయొక్క పరాక్రమమునకు, నవ్వు = నవ్వుకొనును. అది = ఆ వచ్చెడువాడు, ఎవ్వరు అని, ప్రతీహారులు = కావలివారు, ఎవ్వరిని అన్నన్, తన్నుగా = తననే అని, తలచి = ఊహించి, చిత్తమునన్ = మనసున, ఎసగున్ = తొట్రుపడును. ఎదురుగన్, చనుదెంచు = వచ్చు, ఇందీవరాక్షులకు = కలువ నేత్రలకు, ఒయ్యొయ్యన్ = మెల్లమెల్లగా, తెరువు ఇచ్చి = దారి వదలి, ఓసరిల్లు = తప్పుకొనును. తలచి తలచి, అలీక వైదర్భిన్ = బూటకపు దమయంతిని, కాంచున్ = చూచును. కాంచి = చూసి, వేల్పుల = దేవతలయొక్క, ప్రియ వాచికంబు = సందేశ సమాచారమును, నొడువు = పలుకును. నొడివి = పలికి, తన మాటకు, అచ్చెరుపడు = ఆశ్చర్యపడు, జనంబు, క్రందు సందడిన్ = కలకలధ్వనిచేత, తెలివొందున్ = తెలివి తెచ్చుకొనును.

తా. నలుడు దేవతలిచ్చిన విద్యతో అదృశ్యుడై తాను రాజుగనుక దాగి మోసంతో తిరగడం ఇదేమి వైభవమని సిగ్గు పడుతున్నాడు. ఆయుధాలు ధరించి సిద్ధంగావున్న రక్షకభటులు పరాక్రమానికి నవ్వుకుంటున్నాడు. ఆ వచ్చేవాడెవరని కావలివారు అంటే తననే అని ఊహించుకొని మనసున తొట్రుపడుతున్నాడు. ఎదురుగా వచ్చే స్త్రీలకు దారి వదిలి తప్పుకొంటున్నాడు. దమయంతినే తలచుచుండటం వలన కానివారిని చూచి దమయంతి అనుకొని దేవతల సందేశ సమాచారాన్ని చెప్పేస్తున్నాడు. ఆ తరువాత కాదని తెలుసుకొని జనాల కలకలధ్వనితో తెలివి తెచ్చుకొని ఆశ్చర్యపడుతున్నాడు.

**85** **వ. ఇవ్విధంబున నేనుంగు మొగసాల గడచి కక్ష్యాంతరంబులు ప్రవేశించి** యంతః**పురంబు సొత్తెంచె నప్పుడు**

తా. ఈ ప్రకారంగా గజశాలను దాటి భవనసముదాయములోనికి ప్రవేశించి అంత:పురము ప్రవేశించు సమయాన

**86** **చ. ప్రిదిలిన నీవిఁ గేల సవరించు తలోదరి నోర్తుఁ గాంచి లోఁ**
**గదిరిన పాపభీతిఁ బతి కన్నులు మోడ్వ నొకొళ్ళొకళ్ళకై**
**యెదురుగ వచ్చివచ్చి యొకరిద్దఱు ముద్దియ లొత్తి రవ్విభున్**
**మదగజరాజ కుంభముల మచ్చరికించు కుచద్వయంబులన్**

ప్రిదిలిన నీవిన్ = జాఱిన కోకముడిని, కేల సవరించు = చేతితో సవరించుకొనుచున్న, తలోదరిన్ ఓర్తున్ = ఒక చెలికత్తెను, కాంచి = చూచి, లోన్ కదిరిన = మనసులో అతిశయించిన పాపభీతిన్ = పాపభయంచేత, పతి = నలుడు, కన్నులు మోడ్వన్ = కనులు మూసుకొనగా, ఒకొళ్ళొకళ్ళకై = ఒకరికొకరు, ఎదురుగ వచ్చి వచ్చి, ఒక రిద్దరు ముద్దియలు = ఒకరిద్దరు స్త్రీలు, మదగజరాజ కుంభములన్ = మదించిన ఏనుగుల కుంభస్థలములను, మచ్చరికించు = తిరస్కరించు, కుచద్వయంబులన్ = స్తన ద్వయముతో, ఆ విభున్ = ఆ రాజును, ఒత్తిరి = హత్తుకొనిరి

తా. జాఱిపోతున్న కోకముడిని చేతితో సవరించుకొంటున్న ఒక స్త్రీని చూచి మనసులో అధికంగా కలిగిన పాపభయంచేత నలుడు కనులు మూసుకొనగా, ఒకరికొకరు ఎదురెదురుగా వచ్చి వచ్చి ఒకరిద్దరు స్త్రీలు మదించిన ఏనుగు కుంభస్థలములను తిరస్కరించు స్తనద్వయముతో ఆ రాజును హత్తుకొనిరి.

**87** **వ. మఱియు శుద్ధాంత భవనాంతరమ్ములఁ జరియించువాఁడు హృదయోత్కంఠాతిరేకంబున**

తా. ఇంకా, అంత:పుర భవనము లోపల సంచరించుచున్న ఆ నలుడు మనసులో అతిశయించిన వేడుకతో

**88** **సీ. సమనుభూతానాది సర్గపరంపరా**
**స్రక్సమాకలిత సంసర్గముననొ**
**లలితకేళీ చిత్ర ఫలకాభి విలిఖిత**
**ప్రతిమా విలోకనాభ్యాసముననొ**
**యాస్వాదనీయ విహంగ పుంగవ గవీ**
**హైయంగవీన పానాభిరతినొ**
**భువనైక మోహనాద్భుత శంబరారాతి**
**శాంబరీ లీలా విడంబముననొ**
**తే. వివిధ సంకల్ప కల్పనావేశముననొ**

**కన్నె క్రొక్కాఱు మెఱుఁగుఁదీగయునుబోలెఁ**
**బొలసి యప్పుడ యడఁగు పూఁబోఁడిమూర్తి**
**నక్కుమారుండు నలుదిక్కులందుఁ గాంచు**

సమనుభూత = అనుభవింపబడిన, అనాది సర్గ = అనాదులైన సృష్టులయొక్క, పరంపరా స్రక్ = మాలికల వరుసనుండి, సమాకలిత = లభించిన, సంసర్గమువనొ = సంపర్కముచేతనో, లలిత = సుందరమైన, కేళీ = విలాసార్థమైన, చిత్రఫలక = చిత్తరువు పలకయందు, అభివిలిఖిత = లిఖింపబడిన, ప్రతిమా = దమయంతి చిత్రమును, విలోకనా = చూచుటయందలి, అభ్యాసమునవొ = అభ్యాసముచేతనో, ఆస్వాదనీయ = అనుభవింపదగియున్న, విహంగపుంగవ = పక్షి శ్రేష్ఠునియొక్క, గవీ = వాక్కులయొక్క, హైయంగవీన = తాజా నేతిని, పాన = త్రాగుటయందలి, అభిరతినొ = కోరికచేతనో, భువనైకమోహన = ప్రధానముగా లోకానికి మోహాన్ని కలిగించు, అద్భుత = ఆశ్చర్యము కలిగించు, శంబర అరాతి = మన్మథునియొక్క, శాంబరీ లీలా = మాయా విలాసములయొక్క, విడంబమునవొ = అనుసరించుటచేతనో, వివిధ = అనేకములైన, సంకల్ప కల్పన = మనసులో కల్పించుటయొక్క, ఆవేశమునవొ = ఆవేశముచేతనో, కన్నె క్రొక్కాఱు మెఱుగు తీగయును పోలె = క్రొత్త తొలకరి మెఱుపుతీగవలె, పొలసి = సంచరించి, అప్పుడ = ఆ క్షణముననే, అడగు = మాయమగు, పూబోడి మూర్తి = దమయంతి రూపమును, ఆ కుమారుండు = ఆ నలుడు, నలుదిక్కులందున్ = నాలుగు దిక్కులయందును, కాంచున్ = చూచును.

తా. తాననుభవించిన పూర్వజన్మల సంస్కారముచేతనో, దమయంతి సుందరరూపమును విలాసార్థముగ చిత్రఫలకమున చిత్రించిన రూపమును చూచుటయందలి అభ్యాసముచేతనో, అనుభవింపదగిన హంసయొక్క వాక్యముల తాజా నేతిని త్రాగుటయందలి కోరికచేతనో లోకానికి మోహాన్ని కలిగించు ఆశ్చర్యకరమైన మన్మథుని మాయావిలాసముచేతనో, మసనులో కలుగు ఆవేశముచేతనో క్రొత్త తొలకరి మెఱుపుతీగవలె కనబడి ఆ క్షణముననే మాయమగు దమయంతి రూపమును ఆ నలుడు నాలుగు దిక్కులయందును చూడసాగెను. (భ్రాంతిమదలంకారము)

**89 ఉ. సోరణగండ్ల మార్గమునఁ జొచ్చిన సన్నని గాలి యొక్క యం**
**భోరుహ పత్రనేత్ర నునుఁ బొంకపుఁ జన్నుల మీఁది సన్నపుం**
**జీరచెఱంగు వాయగిలఁ జేసిన విశ్వధరాతలేశ్వరుం**
**డోరయొనర్చెఁ బాపభయమొంది నిజానన చంద్రబింబమున్**

సోరణగండ్ల మార్గమునన్ = కిటికీల మార్గమునుండి, చొచ్చిన = ప్రవేశించిన, సన్నని గాలి = చిఱుగాలి, ఒక్క అంభోరుహ పత్రనేత్ర = ఒక పద్మపత్రనేత్రయగు స్త్రీయొక్క, నునున్ = నున్నని, పొంకపున్ = పొందికైన, చన్నుల మీది, సన్నపుం చీర చెఱంగు = పలుచని పైటకొంగు, వాయగిలన్ చేసిన = తొలగునట్లు చేయగా, విశ్వధరాతలేశ్వరుండు = సమస్తభూమికి అధిపతియైన నలుడు, పాపభయమొంది, నిజానన చంద్రబింబమున్ = తన చంద్రబింబమువంటి ముఖమును, ఓర ఒనర్చె = ప్రక్కకు త్రిప్పుకొనెను.

తా. కిటికీలనుండి వచ్చు చిఱుగాలికి ఒక యువతి నున్నని, పొందికైన చన్నులమీది సన్నని పైటకొంగు తొలగగా ఆ మహారాజు నలుడు పాపభీతితో తన చంద్రబింబమువంటి ముఖమును ప్రక్కకు త్రిప్పుకొనెను.

**90 తే. ఇరుల గెలిచిన యంతఃపురేందుముఖుల**
**కురుల మరుఁడను వేఁటకాఁ డురులు సేసి**
**మరులు గొలుపంగ లేఁడయ్యె మనుజవిభుని**
**సరులు లేని దృక్ఖంజన శాబకముల**

ఇరుల గెలిచిన = చీకట్లను గెలిచిన, అంత:పుర, ఇందుముఖుల = స్త్రీలయొక్క, కురులన్ = కేశములను, మరుడను = మన్మథుడనెడి, వేటకాడు, ఉరులు చేసి = వలలు పన్ని, మనుజవిభుని = నలునియొక్క, సరులులేని = సాటిలేని, దృక్ఖంజన శాబకముల = నేత్రములనెడు కాటుకపిట్టల పిల్లలను, మరులు గొలుపంగ = మోహమునందునట్లు, లేడయ్యె = చేయ లేకపోయెను. (రూపకాలంకారము)

తా. చీకట్లను గెలిచిన అంత:పుర స్త్రీల కేశములను మన్మథుడనెడి వేటకాడు వలలు పన్ని నలునియొక్క సాటిలేని నేత్రములనెడి కాటుకపిట్టల పిల్లలను మోహము చెందునట్లు చేయలేకపోయెను.

**91 ఉ. కష్టపుఁ బ్రత్యవాయ మిది గల్గుచునున్నది మీలనక్రియా**
**స్పష్ట విలోకనంబుల నపాంగపుఁ జూపనురాగ విక్రియా**
**పుష్టికరంబు బాహ్య గృహభూమిఁ బ్రచారము సేయు చోట నా**
**దృష్టికి మార్గ మొందు గలదే యని చింత వహించె రా జెదన్**

బాహ్య గృహభూమిన్ = ఇంటా బయట, ప్రచారము చేయుచోట = తిరుగునప్పుడు, మీలనక్రియా = మూసుకొనుటచేతను, స్పష్ట విలోకనంబులన్ = బాగుగా చూచుటచేతను, కష్టపు ప్రత్యవాయము ఇది = భరింపరాని పాపమిది, కల్గుచునున్నది,

అపాంగపు చూపు = క్రీగంటి చూపు, అనురాగ విక్రియా = ప్రేమయనెడి వికారమును, పుష్టికరంబు = వృద్ధిచేయునది, నా దృష్టికిన్ = నా చూపునకు, మార్గము ఒండు = వేరొక మార్గము, కలదే అని = ఉందా అని, రాజు, ఎదన్ = మనసున, చింత వహించె = ఆలోచించెను.

తా. ఆ నలుడు నేను అంత:పురంలోను బయట తిరుగుచున్నప్పుడు కళ్ళు మూసుకోవడంచేత, బాగుగా చూడటం చేత అమితమైన పాపమునకు గురియగుచున్నాను. పోనీ క్రీగంటి చూపందామా! అది అనురాగ వికారమును వృద్ధి చేసేది. ఇంక నాదృష్టికి వేరే మార్గమేదైనా ఉందా అని రాజు మనసులో ఆలోచించసాగెను.

**92 తే. రాజ శుద్ధాంత భామినీ రత్నరాజి**
**దీము గావించి వలరా జధీశు నేసె**
**నతని తాల్మికి నది పూజయయ్యె నట్ల**
**యతను తూపులు పుష్పంబు లౌనొ కావొ**

వలరాజు = మన్మథుడు, రాజశుద్ధాంత భామినీ రత్న రాజిన్ = అంత:పుర స్త్రీరత్నముల సమూహమును, దీము కావించి = సాధనముగా చేసికొని, అధీశున్ = రాజును, ఏసెన్ = కొట్టెను. అతని తాల్మికిన్ = అతని ఓరిమికి, అది = ఆ మన్మథుని బాణములైన పుష్పములు, పూజ అయ్యెన్ = పూజచేసినట్లే అయ్యెను. అట్ల = అది నిజమే. అతను తూపులు = మన్మథుని బాణములు, పుష్పంబులు = పూవులు, ఔనొ కావొ = ఔనా కాదా?

తా. మన్మథుడు అంత:పుర స్త్రీలను సాధనముగా చేసికొని రాజుపై పుష్పబాణములను ప్రయోగించెను. నలుని ఓరిమిచేత ఆ మన్మథుడు వేసిన పుష్ప బాణములు రాజుకు పూజ చేసినట్లే అయ్యెను. అలా నిజంగానే జరిగింది, మరి ఆ మన్మథుని బాణములు పుష్పము లౌనా? కాదా?

**93 ఉ. చీటికి మాటి కేకపథ సీమఁ దొలంగఁగఁ బాటుగామి శృం**
**గాటక వీథి కేఁగెఁ బతి కాంతల సందడి కల్మియైన న**
**ప్పాట వసించి యుండుట యుపాయమె చూడఁగ నాల్గు త్రోవలన్**
**బాటలగంధు లొక్కతఱిఁ బైకొని వచ్చినఁ జిక్కుఁ జిక్కఁడో**

పతి = నలమహారాజు, చీటికి మాటికిన్ = మాటిమాటికి, ఏకపథసీమన్ = ఒక్కరే పోదగిన మార్గమందు, తొలంగగన్ = తప్పుకొనుటకు, పాటు కామి = వీలుపడక, కాంతల సందడి కల్మియైనన్ = స్త్రీల సందడి ఎక్కువకాగా, శృంగాటక వీథికి ఏగెన్ = నాలుగు త్రోవలు కలిసున్న చోటికి, ఏగెన్ = వెళ్ళెను. ఆప్పాటన్ = ఆ మార్గమున, వసించి యుండుట = నిలిచి ఉండుట, ఉపాయమె = తగినదేనా?, చూడగ = పరిశీలింపగ, నాల్గు త్రోవలన్, పాటలగంధులు = స్త్రీలు, ఒక్క తఱిన్ = ఒకే సమయంలో, పైకొని వచ్చినన్ = మీదకు వస్తే, చిక్కున్ = చిక్కులో, చిక్కడో = పడిపోడా?

తా. నలమహారాజు మాటిమాటికి స్త్రీల సందడి ఎక్కువవడంతో, ఒక్కరే పోదగిన మార్గమందు తప్పుకోడానికి వీలుపడక నాలుగు త్రోవలు కలిసున్న చోటికి వెళ్ళిపోయెను. అక్కడ ఉండటం మాత్రం తగినదేనా? ఎంచేతనంటే నాలుగు త్రోవలనుండి స్త్రీలు ఒక్కసారిగా మీదకు వస్తే రాజు చిక్కులో పడిపోడా?

**94 చ. ఉరవడి నేఁగుచోట నొక యుగ్మలి యొల్లె చెఱంగు మేదినీ**
**శ్వరుని భుజా విభూషణము వజ్రములన్ దవులంగ జాఱినన్**
**విరిసెను నీవి బంధ మది విస్మయమందగఁ దోడి భామినుల్**
**పరిహాసనం బొనర్పఁ బతి పాప భయంబునఁ గంపమొందఁగన్**

ఉరవడిన్ = మిక్కిలి వేగముగా, ఏగుచోట = వెళ్ళునప్పుడు, ఒక యుగ్మలి = ఒక స్త్రీ, ఒల్లె చెఱంగు = పైటకొంగు, మేదీనీశ్వరుని = రాజుయొక్క, భుజా విభూషణము = భుజములకు అలంకారమైన, వజ్రములన్ = వజ్రములయందు, తవులగన్ = తగులుకొనగా, జాఱినన్ = జారిపోగా, అది = ఆ సంఘటనకు, విస్మయము అందగా = ఆశ్చర్యపడగా, తోడిభామినుల్ = చెలికత్తెలు, పరిహాసనంబున్ ఒనర్పన్ = పరిహాసము చేయగా, పతి = నలుడు, పాపభయంబునన్, కంపము ఒందగా = వణకిపోగా, ఈవి బంధము = కోక ముడి, విరిసెన్ = విడిపోయెను.

తా. ఒక స్త్రీ వేగముగా వెళ్ళునప్పుడు ఆమె పైటకొంగు రాజుయొక్క భుజాభరణముల వజ్రములకు తగులుకొనగా ఆమె కోకముడి జారిపోయెను. ఆ సంఘటనకు ఆమె ఆశ్చర్యపడగా, చెలికత్తెలు వేళాకోళము చేయగా, నలుడు పాపభయముతో వణకిపోయెను.

**95 చ. ఇరువురు నీలనీరజనిభేక్షణ లించిన వేడ్కతోఁ బర**
**స్పర మెదిరించి కాంచనపు బంతులఁ గ్రచ్చఱవాటులాడఁగా**
**ధఱణిపుఁ డడ్డమై చనుఁడుఁ దద్భుజదండముఁ దాఁకి మిట్టి బి**
**ట్టురవడిఁ జెండు క్రమ్మఱిన నుబ్బరవోయిరి భామినీ జనుల్**

ఇరువురు, నీలనీరజనిభేక్షణలు = నల్లని కలువవంటి నేత్రములుగల స్త్రీలు, ఇంచిన వేడ్కతోన్ = మిక్కిలి కుతూహలముతో, పరస్పరము ఎదిరించి = ఒకరినొకరు ఎదుర్కొని, కాంచనపు బంతులన్ = బంగారు బంతులను, క్రచ్చఱన్ = వేగముగా, వాటులాడగా = ఒకరిపై ఒకరు విసరుకొనుచుండగా, ధరణిపుడు = రాజు, అడ్డమై = వారికి అడ్డముగా, చనుడున్ = పోవుచుండగా, తద్భుజదండము తాకి = ఆ రాజు భుజములకు తగిలి, మిట్టి = మీదికెగిరి, బిట్టు = వేగముగా, చెండు = బంతి, క్రమ్మఱిన = తిరిగి రాగా, భామినీ జనుల్ = స్త్రీజనము, ఉబ్బర పోయిరి = ఆశ్చర్యపడిరి.

తా. ఇరువురు స్త్రీలు మంచి కుతూహలముతో ఒకరి కొకరు ఎదుర్కొని బంగారు బంతులను వేగముగా ఒకరిపై ఒకరు విసరుకొనుచుండగా రాజు వారికి అడ్డముగా పోవుచుండగా ఆ రాజు భుజములకు తగిలి మీది కెగిరి వేగముగా బంతి వెనుతిరిగి రాగా స్త్రీజనము ఆశ్చర్యపడిరి.

**96 సీ. చెలువారు క్రొమ్మించు నిలువు టద్దములలోఁ**
**ప్రతిబింబములు గానబడుట కతన**
**సికతామయంబైన సీమాంతరంబులఁ**
**బాదపద్మంబు లేర్పడుట కతన**
**నలవోకయునుఁ బోలె నాకస్మికంబైన**
**యంగాంగ సంస్పర్శమైన కతన**
**దిక్పాలు రొసఁగిన దివ్య పుష్పంబుల**
**బహుళంబులగు సౌరభముల కతన**
**తే. విరహ విభ్రాంతి నొక్కొక్క వేళఁ బలుకు**
**కలవరింత భాషణముల కతన నప్పు**
**డెవ్వఁడే నొక్క మాయావి యేఁగుదెంచె**
**నంతిపురమున కని లోఁగి రబ్జముఖులు**

చెలువారు = అందమైన, క్రొమ్మించు = క్రొత్త కాంతులుగల, నిలువు అద్దములలోన్, ప్రతిబింబములు, కానబడుట కతన, సకితామయంబు = ఇసుకమయమైన, సీమాంతరంబులన్ = ప్రదేశములయందు, పాదపద్మంబులు, ఏర్పడుట కతన, అలవోకయును పోలె = యాదృచ్ఛికముగా, ఆకస్మికంబు ఐన, అంగాంగ సంస్పర్శమైన కతన = అవయవసంస్పర్శ చేతను, దిక్ పాలురు, ఒసగిన = ఇచ్చిన, దివ్య పుష్పంబులన్, బహుళంబులగు = అధికమైన, సౌరభములకతన = పరిమళముచేతను, విరహ విభ్రాంతిన్ = దమయంతీ విరహ భ్రాంతిచేత, ఒక్కొక్కవేళ = ఒకోసమయమందు, పలుకు కలవరింత భాషణముల కతనన్ = పలికే కలవరింత పలుకులచేతను, ఎవ్వడేని = ఎవరైనా, ఒక్క మాయావి, అంతిపురమునకు, ఏగుదెంచెనని, అబ్జముఖులు = చెలికత్తెలు, లోగిరి = భయపడిరి.

తా. అలంకరణకోసం నిలుపుకున్న నిలువుటద్దములలో నలుని నీడ కనబడుటచేతను, ఇసుక ప్రదేశములందు పద్మములవంటి కాలి ముద్రలు ఏర్పడుటచేతను, అనుకోకుండగా తగిలిన అవయవ స్పర్శచేతను, దిక్పాలురిచ్చిన దేవతా పుష్పముల పరిమళముచేతను, దమయంతీ విరహబాధచే ఒకోసమయంమందు పలికే కలవరింతలచేతను ఎవరో ఒక మాయావి అంత:పురంలో ప్రవేశించాడని చెలికత్తెలు భయపడిరి

**97 వ. ఇవ్విధంబునం బరస్త్రీ పరాఙ్ముఖుండును జగన్మోహనాకారుండునగు నా రాజకుమారుండు శుద్ధాంత కాంతామధ్యంబున నిర్వికారుండై చరించుచు నుపకారికాభవనంబు గడచి యెడనెడం చంద్రకాంత వేదికా విటంకంబుల విశ్రమించుచుం బ్రబోధ మోహ శబరితంబగు చిత్తంబుతో విరహవేదనా భరంబునం దూఁగాడుచుం బాదచారంబున నతి దూరం బరిగి యభ్రంకషంబును, బ్రతోళికా రత్నవేదికా మధ్యాధ్యాసీన సిద్ధ గంధర్వాంగనా ప్రవర్తిత సంగీతకంబును, దార హార గుంభన వ్యాపార పారంగత శంభళికా నికాయంబును, బంచశర లేఖ లేఖనావియాత దూతికా నీతికానీత కేతకీ గర్భ పలాశంబును, గల్హార బిసకిసలయ ప్రధాన నానా శిశిరోపచార ద్రవ్యసమానయన సత్వర సంచారికా జనాసార ప్రసార సంకులంబును నగు దమయంతీ ప్రాసాదంబు డాయం జని యచ్చట**

తా. ఈ విధముగా పరాయి స్త్రీ విముఖుడును, లోకమును మోహింపచేయు సౌందర్యము కలవాడునైన ఆ రాజ కుమారుడు అంత:పురంలో స్త్రీలమధ్య ఏ వికారము లేకుండగ తిరుగుచు రాజగృహములు దాటి, అక్కడక్కడ చంద్రకాంత వేదికలపై అలసట తీర్చుకొనుచు, జ్ఞానాజ్ఞాన సమ్మిశ్రమైన మనస్సుతో దమయంతీ విరహ వేదనా భారంతో తూలిపోతూ కాలినడకనే చాల దూరం వెళ్ళి ఆకాశమునంటుచున్నదియు, రాజవీథియందున్న రత్నమయములైన అరుగుల మధ్య కూర్చుండియున్న సిద్ధ గంధర్వ స్త్రీలచే గానముచేయబడుచున్న సంగీతముకలదియు, ముత్యాలహారములను గ్రుచ్చుట యను పనియందు నేర్పరులైన కుంటెనకత్తెలయొక్క సమూహముకలదియు, ప్రేమలేఖలు వ్రాయుటయందు నేర్పరులైన దూతికల నేర్పరితనముచే తీసుకొనిరాబడిన కేతకీగర్భదళములుకలదియు, కలువలు, తామరతూండ్లు ప్రధానంగ అనేక

విధములైన శైత్యోపచారములకు తగిన పదార్ధములను తీసుకువచ్చుటయందు కంగారుపడుచున్న పరిచారికా జనముల రాకపోకలచే నిండియున్న దమయంతీ భవనమును సమీపించి, అచట

**98 ఉ. లేమ యొకర్తు వేడుక నలీక నలీకరణంబు జాతిగా**
**బూమియ దాను బన్నుకొని పోకలఁ బోవుచునుండఁగా మృషా**
**భీమభవీ భవంతియయి బింబఫలాధరి యోర్తు పార్థివ**
**గ్రామణి చూడ దాని మెడ గ్రక్కున వైచె మధూకదామమున్**

లేమ యొకర్తు = ఒక యువతి, వేడుకన్ = సంతోషముతో, అలీక నలీకరణంబు జాతిగా = కపట నలరాజ రీతిగా, బూమియ = మాఱువేషమును, తాను, పన్నుకొని = వేసుకొని, పోకలన్ పోవుచునుండగా = నలునివలె ప్రవర్తించుచుండగా, బింబఫలాధరి యోర్తు = దొండపండువంటి పెదవిగల ఒక స్త్రీ, పార్థివ గ్రామణి చూడ = నలమహారాజు చూచుచుండగా, మధూక దామమున్ = ఇప్పపూలదండను, గ్రక్కున = తొందరగా, దాని మెడ వైచె = దాని మెడలో వేసెను.

తా. ఒక స్త్రీ సంతోషంగా నలునిగా మాఱువేషం వేసుకొని తాను నలునిలా ప్రవర్తించుచుండగా మరియొక స్త్రీ అదృశ్యంగావున్న నలుడు చూచుచుండగనే ఇప్పపూలదండను ఆ మాయానలరూపంలోవున్న ఆమె మెడలో వేసెను.

**99 తే. వ్రాసె నొక్క లతాంగి క్రొవ్వాడిఁ గోర**
**వర్ణములు తోడుతో మషీవర్ణములుగఁ**
**బసిఁడి గేదంగి రేకునఁ బ్రస్ఫుటముగ**
**మదన రేఖంబు నర్మ మర్మంబు మెఱయ**

ఒక్క లతాంగి = ఒక చెలికత్తె, పసిడి గేదంగి రేకునన్ = పచ్చని మొగలిరేకుపై, ప్రస్ఫుటముగన్ = స్పష్టముగా, నర్మ మర్మంబు = సురతాభిప్రాయము, మెఱయ = స్పష్టమగునట్లుగా, మన్మథ రేఖంబున్ = ప్రేమలేఖను, క్రొవ్వాడి గోరన్ = క్రొత్త పదునైన గోరుతో, వర్ణములు = అక్షరములు, తోడుతోన్ = వెంటనే, మషీ వర్ణములుగన్ = నల్లనివగుచుండగా, వ్రాసెన్

తా. ఒక లతాంగి పచ్చని మొగలిరేకుమీద స్పష్టంగా కనబడేలా సురతాభిప్రాయం స్పష్టమయ్యేటట్లుగా ప్రేమలేఖను తన వాడియైన గోరుతో వ్రాసిన అక్షరములు వెంటనే నల్లదనమును పొందుచుండగా వ్రాసెను

**100 తే. చంద్రరజమున నొక పూర్ణచంద్రవదన**
**చంద్రమండల తిలకంబు సఖికిఁ దీర్చె**
**చంద్రశాలాంతర ప్రదేశంబునందు**
**నావహిల్లంగ నపుడు చంద్రానవస్థ**

ఒక పూర్ణచంద్రవదన = ఒక చెలికత్తె, చంద్రరజమునన్ = కప్పురపు పొడిచే, చంద్రశాల అంతర ప్రదేశంబునందు = చంద్రశాల మధ్య ప్రదేశమందు, అప్పుడు = ఆ సమయమందు, చంద్రానవస్థ = చంద్రునివలె కనబడునట్లు, చంద్రమండల తిలకంబు, ఆవహిల్లంగన్ = ఉండునట్లుగా, సఖికిన్ = చెలికత్తెకు, తీర్చెన్ = దిద్దెను.

తా. ఒక చెలికత్తె కప్పురపు పొడితో చంద్రశాలలో అదేసమయంలో చంద్రునిలా కనబడేటట్లు చంద్రతిలకమును మరొక చెలికత్తె ముఖమున తీర్చి దిద్దెను.

**101 తే. మహిత లావణ్య వార్ధిలో మదనుఁ డెక్కు**
**కప్పురపు జోగు కంటిమి కంటిమనుచు**
**నర్మ గర్భంబుగా నొక్క నలినవదన**
**పొగడె సఖి చంటిమీఁది యొప్పుల నఖంబు**

ఒక నలినవదన = ఒక చెలికత్తె, మహిత = గొప్పదైన, లావణ్య వార్ధిలో = సౌందర్య సముద్రములో, మదనుడు ఎక్కు, కప్పురపు జోగు = కర్పూరపు ఓడను, కంటిమి కంటిమి అనుచు = చూశాం చూశాం అంటూ. సఖి= చెలికత్తెయొక్క, చంటిమీది = స్తనముమీది, ఒప్పుల నఖంబున్ = అందమైన నఖక్షతమును, నర్మ గర్భంబుగా = పరిహాసమును కనబడకుండు నట్లుగా, పొగడెన్

తా. ఒక చెలికత్తె గొప్ప సౌందర్య సముద్రములో మన్మథుడెక్కు కర్పూరపు ఓడను చూశాం చూశాం అని చెలికత్తెయొక్క స్తనముమీది అందమైన నఖక్షతమును నర్మ గర్భముగా పొగడెను

**102 ఉ. భావము పల్లవింప నొక పంకజలోచన వ్రాసె నొక్క ల**
**జ్జావతి మించు గుబ్బవలి చన్నులపై మకరీ కలాపమున్**
**వావిరి గమ్మనీరు మృగనాభి రసంబున మేళవించి యే**
**కావళి నాక సింధువున కన్వయలీల ఘటించునట్లుగాన్**

ఒక పంకజలోచన = ఒక పద్మనేత్రి, భావము పల్లవింపన్ = మనసు చిగురొత్తగా, ఒక్క లజ్జావతి = ఒక స్త్రీయొక్క మించు గుబ్బవలి చన్నులపై = ప్రకాశించు గుండ్రని స్తనములపై, వావిరి = క్రమముగా, కమ్మనీరు = పన్నీరు, మృగనాభిరసంబునన్ = కస్తూరి రసముతో, మేళవించి = కలిపి, యేకావళి నాక సింధువునకున్ = ముత్యాలహారమనెడి గంగానదికి, అన్వయలీల = సంబంధము, ఘటించునట్లుగా = కలుగునట్లుగా, మకరీకలాపమున్ = మకరీ రేఖల సమూహమును, వ్రాసెన్

తా. ఒక స్త్రీ మనసు చిగురొత్తగా మరొక స్త్రీయొక్క కాంతివవంతమైన గుండ్రని స్తనములపై క్రమముగా పన్నీరు కస్తూరి రసముతో కలిపి ముత్యాలహారమనెడి గంగానదికి సంబంధము కలుగునట్లుగా మకరీ రేఖల సముదాయమును వ్రాసెను.

**(గంగానదికి మొసలి వాహనము – హారము స్తనములపై ఉంటుంది కనుక మకరీ రేఖల నక్కడ చిత్రించుట– సంబంధము)**

**103 క. శారి యదె పొడువుమని యొక**
**సారి యొకతె యక్షకేళి సమయంబున ని**
**చ్చారతి నొకతెకుఁ జెప్పిన**
**శారి కనకపంజరమున సాధ్వసమొందెన్**

ఒకసారి, ఒకతె, అక్షకేళి సమయంబున = పాచికలాడునప్పుడు, శారి అదె = పాచిక అదిగో, పొడువుమని = పందెం వేయమని, ఇచ్చారతిన్ = ఆటమీద ఆసక్తితో, ఒకతెకు చెప్పిన, కనకపంజరమున = బంగారుపంజరంలోవున్న, శారి = గోరువంక, సాధ్వసము ఒందెన్ = భయపడెను.

తా. ఒకసారి పాచికలాడుచుండగా ఒకామె పాచిక అదిగో పందెంవేయమని (పొడువుమని) ఆటమీద ఆసక్తితో చెలికి చెప్పిన అది తననే పొడువమన్నదని భావించి బంగారు పంజరములోని గోరువంక భయపడెను.

**104 ఉ. వీఁడె నలుండు విశ్వపృథివీ వలయైక విభుండు వచ్చుచు**
**న్నాఁడని భీమభూమిపతి నందన యూరడిలంగఁ బల్కు పూఁ**
**బోఁడుల మాట నేర్చికొని ప్రోది శుకాంగన యట్ల పల్కినన్**
**ఱేఁడిది నన్ను నేక్రియ నెఱింగెనొకోయని యుండె నాత్మలోన్**

విశ్వపృథివీవలయ ఏక విభుండు = సమస్త భూమండలానికి తానే ప్రభువైన, నలుండు = నలమహారాజు, వీడె = ఇదుగో, వచ్చుచున్నాడని, భీమభూమిపతి నందన = భీమరాజు కూతురగు దమయంతి, ఊరడిలంగన్ = శాంతించునట్లుగా, పల్కు = పల్కునట్టి, పూబోడుల మాట = చెలికత్తెల మాటను, నేర్చికొని, ప్రోది శుకాంగన = పెంపుడు చిలుక, అట్ల పల్కినన్ = అలాగే పలుకగా, ఱేడు = రాజగు నలుడు, ఆత్మలోన్ = మనసులో, ఇది నన్ను, ఏక్రియన్ = ఏ విధముగా, ఎఱింగెనొకో అని ఉండె = తెలుసుకుందాయని ఆశ్చర్యముతో ఉండిపోయెను

తా. సమస్త భూమండలానికి ప్రభువైన నలమహారాజు ఇదుగో వస్తున్నాడని దమయంతి శాంతి పొందునట్లుగా చెలికత్తెలు పలుకు మాటను నేర్చికొని పెంపుడుచిలుక అలాగే పలుకగా రాజు ఇది తననెట్లు తెలిసికొనెనా యని ఆశ్చర్యముతో ఉండిపోయెను.

**105 తే. అంబుజానన కొల్వు కూటంబునందు**
**కనక కలహంస శాబకాకారమైన**
**వీడియపుఁ బెట్టె చూచి యుర్వీధవుండు**
**దలఁచెఁ దన కూర్మి దూత చిత్తంబులోన**

అంబుజానన = పద్మమువంటి ముఖముకల దమయంతియొక్క, కొల్వు కూటంబునందు = సభలో, కనక కలహంస శాబక ఆకారమైన = బంగారు రాజహంస పిల్లవంటి రూపముగల, వీడియపు పెట్టె = తాంబూలపు పెట్టెను, చూచి, ఉర్వీధవుండు = రాజు, తన కూర్మి దూతన్ = తనకు ప్రియమైన దూతయగు హంసను, చిత్తంబులోన = మనసులో, తలచెన్

తా. దమయంతి కొల్వుకూటంలో బంగారు రాజహంస పిల్ల రూపంలోవున్న తాంబూలపు పెట్టెను చూచి రాజు తన ప్రియదూతయైన హంసను మనసులో స్మరించెను.

**106 వ. ఇట్లు కన్యాంతఃపురంబుఁ బ్రవేశించి దమయంతి సభాభవన ద్వారంబు నొక్క పసిండి యరుగుమీఁదఁ గూర్చుండె నప్పు డబ్బాలికా రత్నంబును జననీ ప్రయత్నంబునం దత్సమ్ముఖంబున కరుగుటయును స్వయంవర కల్యాణ మహోత్సవంబు సంపాదింపంబడుటయు శోభనారంభ సంభ్రమంబులవలన నెఱింగినవాఁడు గావున నయ్యంభోరుహాక్షి సమాగమనం బపేక్షించుచుండె నప్పుడు**

ఇట్లు = ఈ విధముగా, కన్య అంత:పురంబు ప్రవేశించి = యువతుల భవనములో ప్రవేశించి, దమయంతి సభాభవన ద్వారంబున, ఒక్క పసిండి అరుగుమీద = ఒక బంగారు అరుగుమీద, కూర్చుండెను. అప్పుడు, ఆ బాలికారత్నంబును = ఆ దమయంతియు, జననీ ప్రయత్నంబునన్ = తల్లి కోరుటచే, తత్ సమ్ముఖంబునకు = ఆమె యొద్దకు, అరుగుటయును = వెళ్ళుటయును, స్వయంవర కల్యాణ మహోత్సవంబు, సంపాదింపంబడుటయు = నిర్ణయింపబడుటయు, శోభన

ఆరంభ సంభ్రమంబులవలనన్ = శుభ కార్యారంభ తొందరను, ఎఱింగినవాడు కావున, ఆ అంభోరుహాక్షి = ఆ దమయంతి యొక్క రాకను, అపేక్షించుచుండెన్ = కోరుచు ఉండెను, అప్పుడు

**107 తే. అనుగు తల్లికి వందనం బాచరించి**
**వరుస నిలువేల్పులకు మ్రొక్కి వలను మిగుల**
**బ్రాహ్మణులచేత దీవనల్ వడసి పుణ్య**
**భామలిచ్చు హేమాక్షత ప్రతతిఁ దాల్చి**

అనుగు తల్లికి = ప్రియమైన మాతృమూర్తికి, వందనంబు = నమస్కారమును, ఆచరించి = చేసి, వరుస = క్రమముగా, ఇలు వేల్పులకు = గృహదేవతలకు, మ్రొక్కి = నమస్కరించి, వలను మిగుల = అన్యోన్యతను కోరుచు, బ్రాహ్మణులచేత, దీవినల్ పడసి = ఆశీస్సులు పొంది, పుణ్యభామలు ఇచ్చు = పుణ్యస్త్రీలు ఇచ్చు, హేమ అక్షత ప్రతతిన్ = బంగారు అక్షతలను, తాల్చి = ధరించి

తా. ప్రియమైన మాతృమూర్తికి నమస్కరించి, క్రమముగా ఇలవేల్పులకు మ్రొక్కి, సతీపతుల అన్యోన్యతను కోరుచు బ్రాహ్మణుల ఆశీస్సులను తీసుకొని, పుణ్యస్త్రీలు ఇచ్చు బంగారు అక్షతలను శిరసున ధరించి

**108 ఉ. తల్లి మనఃప్రసాద సహితంబుగ నిచ్చిన పుష్ప దామమున్**
**బల్లవ పాటలంబయిన పాణి సరోజమునన్ ధరించి యా**
**యల్లక తీవ్ర సంజ్వరభ రాలస కోమల గాత్ర వల్లియై**
**యల్లన యేఁగుదెంచు కమలానన గాంచె విభుండు దవ్వులన్**

తల్లి, మన:ప్రసాద సహితంబుగన్ = స్వచ్ఛమైన మనసుతో కూడి, ఇచ్చిన, పుష్ప దామమున్ = పూలమాలను, పల్లవ పాటలంబు = చిగురువలె ఎఱ్ఱనిరంగుకల, పాణి సరోజమునన్ = పద్మముంటి చేతియందు, ధరించి = పట్టుకొని, ఆ యల్లక = విరహసంబంధమైన, తీవ్రసంజ్వరభర = తీవ్రమైన తాప భారముచే, అలస = వివశమైన, కోమల గాత్రవల్లియై = సుకుమారమైన తనూలత కలదియై, అల్లన ఏగుదెంచు = మెల్లగా వచ్చుచున్న, కమలాననన్ = దమయంతిని, విభుండు = రాజు, దవ్వులన్ = దూరముగా, కాంచె = చూచెను

తా. తల్లి నిర్మలమైన మనస్సుతో ఇచ్చిన పూలమాలను చిగురువలె ఎఱ్ఱనైన తన పద్మమువంటి చేతియందు పట్టుకొని విరహబాధచే వివశమైన శరీరలతకలదియగుచు మెల్లగా వచ్చుచున్న దమయంతిని దూరములో నలుడు చూచెను.

**109 వ. ఇట్లు వీక్షించి నిషధాధ్యక్షుండు సాక్షాత్కరించిన మదన సారమాజ్య లక్ష్మియుంబోని యా ధవళాక్షి సమక్షంబు చేరంబోయె నప్పుడు**

తా. అలా చూచి, నలుడు ప్రత్యక్షమైన మన్మథ సామ్రాజ్య లక్ష్మివలెనున్న ఆ దమయంతి ఎదుటకు చేరబోయెను. అప్పుడు

**110 ఉ. ఎంతయు డాయనేఁగియు మహీశుఁ డెఱుంగఁగ నేరఁడయ్యె వి**
**భ్రాంతి విదర్భ రాడ్దుహితృ పంక్తులలోన మృగాక్షి నప్పు డ**
**య్యింతి యెఱుంగదయ్యె దిగధీశ చతుష్టయ దత్త శాంబరీ**
**ధ్వాంత నిగూఢుఁడైన వసుధాధవునిన్ నికటస్థలంబునన్**

మహీశుడు = నలుడు, ఎంతయు = మిక్కిలి, డాయన్ ఏగియు = సమీపించియును, విభ్రాంతిన్ = మోహముచే, విదర్భ రాట్ = విదర్భరాజుయొక్క, దుహితృ = కూతురి, పంక్తులలోన = గుంపులో, మృగాక్షిన్ = దమయంతిని, ఎఱుగంగ నేరడయ్యె = తెలుసుకొనలేకపోయెను. అప్పుడు = ఆ సమయమున, ఆ ఇంతి = ఆ దమయంతి, దిగధీశ చతుష్టయదత్త = దిక్పాలకులు నలుగురిచే ఈయబడిన, శాంబరీ = శాంబరీ విద్యచే, ధ్వాంత = చీకటిలో, నిగూఢుడైన = దాగియున్న, వసుధాధవునిన్ = నలుని, నికటస్థలంబునన్ = సమీపమున, ఎఱుంగదయ్యె = తెలుసుకొనినది కాకపోయెను

తా. నలుడు చాల చేరువకు చేరినను మోహముచే దమయంతిని గుంపులో గుర్తుపట్టలేకపోయెను, దమయంతియు దిక్పాలకులు ఇచ్చిన శాంబరీ విద్యచే చీకటిలో దాగియున్న నలుని తెలుసుకొనలేకపోయెను.

**111 తే. అతివ యుద్భ్రాంతి వీక్షితుఁడయిన నృపతి**
**కంఠమున వైచెఁ జేతి చెంగలువ దండ**
**యది నిజంబుగ నికటస్థుడైన విభుని**
**యఱుత సంలగ్నమయ్యె నత్యద్భుతముగ**

అతివ = ఆ దమయంతి, ఉద్భ్రాంతి వీక్షితుడయిన = భ్రాంతిచే కనబడుచున్న, నృపతి కంఠమునన్ = రాజు మెడలో, చేతి చెంగలువ దండ, వైచెన్ = వేసెను. అది = ఆ దండ, నిజంబుగ, నికటస్థుడైన = చేరువనేయున్న, విభుని = నలునియొక్క, అఱుతన్ = మెడలో, అతి అద్భుతముగ = మిక్కిలి ఆశ్చర్యకరముగా, సంలగ్నమయ్యెన్ = తగుల్కొనెను.

తా. ఆ దమయంతి భ్రాంతిచే కనబడుచున్న నలుని మెడలో చేతిలోని ఎఱ్ఱకలువలదండను వేసెను. అది నిజముగ

చేరువనేయున్న నలుని మెడలో  మిక్కిలి ఆశ్చర్యకరముగా పడెను.

**112 తే. వాసనాదృష్టయగు కాంత వైచినట్టి**
**పొందు నిజమయ్యెనని చోద్యమందె రాజు**
**తాను వైచిన కల్హార దామకంబు**
**మాయమగుటయుఁ దరుణి విస్మయమునొందె**

వాసనాదృష్టయగు = తలపున కనుచున్న, కాంత = దమయంతి, వైచినట్టి = వేసినటువంటి. పొందు = కలయిక, నిజమయ్యెనని, రాజు, చోద్యమందె = ఆశ్చర్యపడెను. తాను వైచిన = తాను వేసిన, కల్హార దామకంబు = కలువల దండ, మాయమగుటయు, తరుణి = దమయంతి, విస్మయమును ఒందె = అశ్చర్యమును పొందెను.

తా. మనసులో నలుని దర్శించుచున్న దమయంతి వేసిన ఎఱ్ఱకలువలమాల తమ కలయికను నిజముచేసెనని రాజు ఆశ్చర్యపడెను. తాను వేసిన దండ మాయమవడంతో దమయంతి ఆశ్చర్యమును పొందెను.

**113 తే. ఒక్కచో నుండియును బాసి యున్నభంగి**
**భ్రాంతి నన్యోన్య మీక్షించి పతియు సతియు**
**జేరి మిథ్యా పరస్పరాశ్లేష కలన**
**సత్య పరిరంభ ఖేలనాసక్తు లైరి**

ఒక్కచోన్ ఉండియును = ఒకేచోట ఉన్నప్పటికినీ, పాసియున్న భంగి = వేరుగా నున్నట్లుగా, భ్రాంతిన్ = మోహముచే, పతియు సతియు, అన్యోన్యము ఈక్షించి = పరస్పరము చూసుకొని, చేరి = సమీపించి, మిథ్యా = అసత్యమైన, పరస్పరాశ్లేష కలన = ఒండొరుల కౌగలింత కలుగుటవలన, సత్య = నిజమైన, పరిరంభ ఖేలన = కౌగలింతయను క్రీడయందు, ఆసక్తులయిరి = ఇష్టముకలవారయిరి.

తా. ఇరువురును ఒకేచోట ఉన్నప్పటికినీ వేరుగానున్నట్లుగా మోహముచే సతియు పతియు పరస్పరము చూసుకొని సమీపించి ఊహించుకున్న ఒండొరుల కౌగలింతల లభ్యముచే నిజమైన కౌగలింతల క్రీడయందు ఇష్టముకలవారయిరి.

**114 శా. అంభోజానన భూమి పాలకునిచే నాశ్లిష్టయయ్యున్ మదిన్**
**సంభావింప దతం డదృశ్యుఁడగుటన్ సత్యోపగూహంబుగా**
**స్తంభావిష్కృతి వైరసేనియును వైదర్భిన్ గ్రహింపంగఁ బ్రా**
**రంభంబుం దగఁజేయ నించుకయు నేరండయ్యె నీక్షించియున్**

అంభోజ ఆనన = పద్మమువంటి ముఖముకల దమయంతి, భూమి పాలకునిచేన్ = రాజుచే, ఆశ్లిష్టయయ్యున్ = కౌగలించుకొనబడినదయ్యును, అతండు = ఆ నలుడు, అదృశ్యుడగుటన్ = కనబడకుండుటచే, సత్యోపగూహంబుగా = నిజమైన కౌగలింతగా, మదిన్ = మనసునందు, సంభావింపదు = అనుకొనదు. వైరసేనియున్ = వీరసేనుని కుమారుడైన నలుడును, వైదర్భిన్ = దమయంతిని, ఈక్షించియున్ = చూచియును, స్తంభావిష్కృతిన్ = స్తంభమను సాత్వికభావము కలుగుటచే, గ్రహింపంగన్ = పట్టుకొనుటకు, ప్రారంభంబున్ = ప్రయత్నమును, తగన్ చేయన్ = తగినట్లుగా చేయుటకు, ఇంచుకయు = కొంచెమైనను, నేరండు అయ్యె = సమర్థుడు కాకపోయెను.

తా. పద్మముఖియగు దమయంతి రాజుచే కౌగలించుకొనబడినదయ్యును ఆ నలుడు అదృశ్యుడగుటచే నిజమైన కౌగలింతగా మనసునందు అనుకొనలేకపోయెను. నలుడు దమయంతిని చూచుచున్నను స్తంభమను సాత్త్వికభావముచే పట్టుకొనుటకు ప్రయత్నమును కూడా తగినట్లు చేయుటకు కొంచెమైనా సమర్థుడు కాకపోయెను.

**115 చ. మొదల శరీర సంగమ సముద్గత సత్యమతిప్రకాశతన్**
**బిదప నళీకసంవిదుప బృంహిత భావతఁ బొంద నిద్దఱుం**
**బదపడి యంతరంగములఁ బ్రత్యయ మొంద రొకించుకేనియున్**
**గదిసి యొకళ్ళొకళ్ళ నిఱి గౌఁగిట జేర్చియునుం బ్రముగ్ధతన్**

మొదలన్ = మొట్టమొదట, శరీర సంగమ = శరీర సంస్పర్శవలన, సముద్గత = పుట్టిన, సత్యమతి ప్రకాశతన్ = సత్యమనెడు బుద్ధిని తెలియజేయుటను, పిదపన్ = తరువాత, అళీక సంవిత్ = మిధ్యా జ్ఞానముచే, ఉపబృంహిత = వృద్దిపొందింపబడిన, భావతన్ = మసను కలవారగుటను, పొందన్ = పొందగా, ఇద్దఱున్, కదిసి = సమీపించి, ఒకళ్లొకళ్ల = పరస్పరము, ఇఱి కౌగిటను = బిగి కౌగిలిని, చేర్చియున్ = పొందించియు, ప్రముగ్ధతన్ = మిక్కిలి తెలియని వారగుటచే, పదపడి = వెనుక, అంతరంగములన్ = మనసులలో, ఒకించుకేనియున్ = కొంచెమైనను, ప్రత్యయము ఒందరు = విశ్వసించరు.

తా. మొట్టమొదట శరీర సంస్పర్శవలన పుట్టిన సత్యమను బుద్ధిని తెలియజేసినను, తరువాత మిధ్యాజ్ఞానముచే వృద్ధిపొందిన మనసుకలవారగుటచే ఇద్దఱును సమీపించి పరస్పరము బిగి కౌగిలిని పొందినప్పటికిని ఆ విషయము

తెలియనివారగుటచే తమ మనసులలో కొంచెమైనను నమ్మలేకపోయిరి.

116 **ఉ. ఆ రతి బోటికిన్ విభున కప్డు మనంబుల విప్రలంభ శృం**
**గార మొకళ్ళొకళ్ళ యిఱి గౌఁగిటఁ బుట్టిన నిండు వేడ్కచే**
**బోరన నారఁగూరి మదిఁ బొంగె ఘృతం బతిమాత్ర వోసినన్**
**గూరికి కూర్కి యా క్షణమ గొబ్బున మండిన దీపమోయనన్**

ఆ రతిన్ = ఆ క్రీడయందు, బోటికిన్ = దమయంతికిని, విభునకు = నలునకు, అప్డు = ఆ సమయమందు, మనంబుల = మనసులలోనున్న, విప్రలంభ శృంగారము = విరహమువలన కలిగిన శృంగారరసము, ఒకళ్ళొకళ్ళ = పరస్పరము, ఇఱి కౌగిటన్ = బిగి కౌగలింతయందు, పుట్టిన = కలిగినటువంటి, నిండు వేడ్కచే = గొప్ప ఉత్కంఠచే, ఘృతంబు అతిమాత్ర పోసినన్ = నేయి ఎక్కువగా పోయుటచే, కూరికి కూర్కి = తగ్గి తగ్గి, యా క్షణమ = ఆ క్షణంలోనే, గొబ్బునన్ = ఒక్కసారిగా, మండిన దీపమోయనన్ = మండుచున్న మంటో అనునట్లుగా, బోరనన్ = వేగముగా, ఆరన్‌గూరి = లెస్సగానయి, మదిన్ = మనసునందు, పొంగెన్ = ఉద్రేకించెను

తా. ఆ కౌగలింతయందు దమయంతికిని, నలునకు ఆ సమయమందు మనసులలోనున్న విప్రలంభ శృంగారము పరస్పరము బిగి కౌగలింతయందు కలిగినటువంటి గొప్ప ఉత్కంఠచే నేయిపోయగానే అంతవరకు తగ్గి తగ్గియున్న మంట ఒక్కసారిగా ప్రజ్వరిల్లినట్లు లెస్సగానయి మనసున ఉద్రేకించెను.

117 **వ. ఇవ్విధంబున సంయోగ వియోగంబులవలన బోధమోహంబులు వహించుచు నవ్వరారోహ హృదయ నిర్విశేషంబగు సఖీజనంబు మెత్తమెత్తనఁ దోడ్కొనిపోవ నిజసభాభవనంబునకు నెట్టకేలకుం జనియె.ధరాధీశ్వరుండును ధారావాహిక జ్ఞాన ప్రవాహంబునం దేలియాడుచు నంతనంతఁ గాంతారత్నంబుఁ గదియ నేతెంచె. అట్లు కొలువుకూటంబుఁ జొచ్చి యబ్బోటి హాటకపీఠం బలంకరించి సఖీ పరివార పరివృతయై, తారకాగణ పరివృతయగు చంద్రరేఖయుంబోలె బొలుపారె నా సమయంబున**

తా. ఈ ప్రకారంగా కలయిక విడిపోవుటవలన జ్ఞానమును, మోహమును పొందుచు ఆ దమయంతిని మనసులు కలిసిన చెలికత్తెలు మెల్లమెల్లగా తీసుకొనివెళ్ళగా తన సభాభవనమునకు అతికష్టముచే వెళ్ళెను. నలుడును ధారాపాతమైన జ్ఞాన ప్రవాహమునందు ఈదులాడుచు క్రమక్రమముగా దమయంతిని సమీపించెను. అలా సభాభవనమును ప్రవేశించి ఆ దమయంతి బంగారు పీఠమున కూర్చుండి చెలికత్తెల బృందముచే చుట్టబడి నక్షత్రములచే చుట్టబడిన చంద్రరేఖవలె ఒప్పెను

118 **ఉ. భావముఁ జూడఁగోరి యొక పార్శ్వమునన్ దమయంతిఁ జేరి ధా**
**త్రీవరుఁడుండె శాంబరి ధరించియు భీమసుతా వినోద సం**
**భావనకై సఖీజనులు పన్నిన యాత్మ మనోజ్ఞ పుంస్వరూ**
**పావళిలో నిజాకృతి బయల్పడకుండగ రత్న వేదికన్**

భావమున్ = దమయంతి మనస్సును, చూడన్ కోరి = పరీక్షింప దలచి, ఒక పార్శ్వమునన్ దమయంతిన్ చేరి = దమయంతికి ఒక ప్రక్కకు చేరి, శాంబరి ధరించియు = శాంబరీ విద్యా ప్రయోగములో నున్నను, భీమసుతా = దమయంతియొక్క, వినోద సంభావనకై = వేడుక కూర్చుటకై, సఖీజనులు పన్నిన = చెలికత్తెలు కూర్చిన, ఆత్మ = తనయొక్క, మనోజ్ఞ = సుందరమైన, పుం స్వరూపావళిలో = పురుషాకార స్వరూపములలో, నిజాకృతి = తన ఆకారము, బయల్పడకుండగ = బహిర్గతము కాకుండగ, రత్నవేదికన్ = ఆ మణిమయమైన అరుగుపై, ఉండెన్ = ఉండెను

తా. శాంబరీ విద్యా ప్రయోగములోనున్నను నలుడు దమయంతి మనసును పరీక్షింప దలచి దమయంతికి ఒక ప్రక్కకు చేరి ఆమెకు వేడుక కూర్చుటకై చెలికత్తెలు కూర్చిన తన సుందరమైన పురుషాకార స్వరూపములలో తన రూపము బహిర్గతము కాకుండగ ఆ మణిమయ వేదికపై ఉండెను.

119 **వ. ఇవ్విధంబున యబ్బాల పేరోలగంబున్న సమయంబునఁ బ్రతిహారిణి యేతెంచి యింద్రాగ్నియమవరుణులు పుత్తెంచిన దూతికలు మందిరద్వారమున నున్నవారని విన్నపంబుచేసి తదనుమతి వడసి ప్రవేశింపఁ జేయుటయు నా సందేశ హారిణులు మందమందగమనంబున నా త్రైలోక్యసుందరిం జేరం జనుదెంచి సముచిత సత్కారంబులు వడసి సఖీ నిర్దిష్టంబులగు మణిమయాసనంబులం గూర్చుండిరి. ఆ సంచారికా చతుష్టయంబునందు విస్పష్ట మధురాలాపయు నర్మోక్తి నిపుణయు నింగితాకారాచేష్టా వివేక విశారదయునుం బువత్రపగల్భయునగు జంభారి గారాపు శంభళి హస్తాంభోరుహంబులు మోడ్చి యిట్లనియె**

తా. ఈ ప్రకారముగా ఆ దమయంతి సభలోనున్న సమయమున ద్వారపాలిక వచ్చి ఇంద్ర అగ్ని యమ వరుణులు పంపిన దూతికలు మందిరద్వారమున ఉన్నవారని మనవి చేసి, ఆమె అనుమతి పొంది వారిని ప్రవేశింప చేసిన, ఆ సందేశము తెచ్చిన దూతికలు మెల్లమెల్లని నడకలతో ఆ త్రిలోకసుందరియగు దమయంతిని చేరుకొని తగిన గౌరవములను పొంది చెలికత్తెలు చూపిన మణిమయములగు ఆసనములపై కూర్చుండిరి. ఆ నలుగురు దూతికలయందును స్పష్టముగను,

మధురముగను మాట్లాడగలదియు, పరిహాస వచనములందు నేర్పుకలదియు, మనసును, శరీర చేష్టలను తెలిసికొనుటయందు పండితురాలును, పురుషునివలెనే ప్రతిభగలదియునగు ఇంద్రుని ప్రియ దూతిక పద్మములవంటి చేతులను జోడించి ఈ రీతిగా పలికెను

**120 సీ. అవధారు దేవి దివ్య కిరీట కోటి సం**
**దానిత వికచ మందారదామ**
**సందోహ మకరంద బిందు ధారా ధౌత**
**సందీప్త చరణారవిందుఁడైన**
**సంక్రందనుండు నా స్వామి నన్నా యింద్రు**
**గారాబు సంచారిగా నెఱుంగు**
**పాలిండ్ల కొత్తుగాఁ బరిరంభణము సేసి**
**యడిగె నీ సేమ మయ్యమరవిభుఁడు**
**తే. పారిజాతక మాల్యం బుపాయనముగ**
**నముచిదమనుండు పుత్తెంచినాఁడు నీకుఁ**
**గైకొనుము దీనినని యిచ్చె నాకవనిత**
**పూర్ణ చంద్రనిభాస్య కప్పూవుదండ**

దేవి = ఓ దమయంతీ, అవధారు = వినుము, దివ్య కిరీట కోటి = దేవతల కిరీట సమూహములయందు, సందానిత = కూర్చబడిన, వికచ = వికసించిన, మందార దామ = మందార మాలలయొక్క, సందోహ = సమూహముయొక్క, మకరంద బిందు ధారా = తేనె బిందువుల ధారచే, ధౌత = కడుగబడిన, సందీప్త = ప్రకాశించు, చరణ అరవిందుడైన = పాదపద్మములు కలవాడైన, సంక్రందనుండు = ఇంద్రుడు, నా స్వామి = నా ప్రభువు, నన్ను, ఆ యింద్రు, గారాబు సంచారిగాన్ = ప్రియ దూతికగా, ఎఱుంగు = తెలిసికొనుము. పాలిండ్లకున్, ఒత్తుగాన్ = అదుమునట్లుగా, పరిరంభణము చేసి = కౌగలించుకొని, ఆ యమరవిభుడు = ఆ ఇంద్రుడు. నీ సేమము అడిగె, పారిజాతక మాల్యంబు = పారిజాతముల మాలను, ఉపాయనముగ = కానుకగా, నముచి దమనుండు = నముచియను రాక్షసుని సంహరించిన ఇంద్రుడు, నీకు, పుత్తెంచినాడు = పంపినాడు. గైకొనుము దీనిని అని = దీనిని తీసుకొనుమని, పూర్ణచంద్ర నిభాస్యకున్ = నిండు చంద్రునివంటి ముఖముకల దమయంతికి, నాకవనిత = దేవతా స్త్రీ, ఆ పూవుదండ, ఇచ్చెన్

తా. ఓ దమయంతీ వినుము. దేవతల కిరీట సముదాయమందు కూర్చబడిన వికసించిన మందారమాలలయొక్క సమూహమందలి తేనెబిందువుల ధారచే కడుగబడిన ప్రకాశించు పాదపద్మములు కలవాడైన ఇంద్రుడు నాకు ప్రభువు. నన్ను ఆ ఇంద్రుని ప్రియదూతికగా తెలిసికొనుము. స్తనములకు అదుమునట్లుగా కౌగలించుకొని ఆ ఇంద్రుడు నీ కుశల మడిగెను. పారిజాత మాలను నీకు కానుకగా పంపినాడు. దీనిని తీసికొనుమని దమయంతికి ఆ దేవతాస్త్రీ ఆ పూవుల దండను ఇచ్చెను.

**121 వ. ఇట్లు కనక కదళీపలాశ గర్భితంబై, నిర్భరామోద మధురంబగు దివ్యదామం బయ్యాదిగర్భేశ్వరికి సమర్పించి యిట్లనియె**

తా. ఈరీతిగా బంగారపు అరటియాకులచే కప్పబడినదియు, గొప్ప పరిమళముచే అందమైన ఆ దేవమాలను ఆ భూమికధిపురాలగు దమయంతికి ఇచ్చి యిట్లు పలికెను.

**122 ఉ. చంచలనేత్ర! దివ్యలిపి సంతతి భూజనముల్ పఠింప లే**
**రంచును మానెఁగాని నఖరాగ్రమునన్ లిఖియించి నీకుఁ బు**
**త్తెంచుఁజుమీ మహేంద్రుఁడు మదీయ కరంబున దేవతావనీ**
**కాంచన కేతకీ కుసుమగర్భ దళంబునఁ గార్యపద్ధతుల్**

చంచలనేత్ర = దమయంతీ!, దివ్యలిపిసంతతిన్ = దేవతల అక్షర సమూహమును, భూజనముల్ = నరులు, పఠింప లేరంచును, మానెన్, కాని, దేవతావనీ = నందనవనమునందలి, కాంచన కేతకీ కుసుమ = బంగారు మొగలి పూవుయొక్క, గర్భదళంబునన్ = లోపలి రేకునందు, కార్యపద్ధతుల్ = జరుగవలసిన విధానమును, నఖరాగ్రమునన్ = గోటి కొనచే, లిఖియించి = వ్రాసి, మహేంద్రుడు, మదీయకరంబునన్ = నా చేత, పుత్తెంచు చుమీ = పంపునుసుమా!

తా. ఓ దమయంతీ! దేవతల అక్షరములను నరులు చదువలేరని మానేసేడే కాని లేకపోతే నందనవనములోని బంగారు మొగలిపూవు లోపలి రేకునందు తన ప్రేమను గోటి కొనచే వ్రాసి ఇంద్రుడు నాచేత పంపేవాడే సుమా!

**123 తే. తెఱవ! యిన్నాళ్ళు నడిగి పుత్తేఁడు నిన్ను**

**నరయ నిది తప్పుగాదె? సంవరణ వేళఁ**
**గట్టు మమరేంద్రు కంఠంబుఁ గప్పురంపు**
**పలుకు లెడఁబెట్టి కట్టిన యలరుదండ**

తెఱవ = దమయంతీ, (ఇంద్రుడు) ఇన్నాళ్ళు, నిన్నున్, అడిగి పుత్తేదు = అడిగియుండలేదు, అరయన్ = ఆలోచింపగా, ఇది= ఈ అడగకపోవడం, తప్పు కాదె = తప్పేకదా!, సంవరణ వేళ = స్వయంవర సమయమున, కప్పురంపు పలుకులు, ఎడన్ పెట్టి = దూరము పెట్టి, కట్టిన, అలరుదండ = పుష్పమాలతో, అమరేంద్రు కంఠంబు = ఇంద్రుని మెడను, కట్టుము = బంధింపుము.

తా. దమయంతీ! ఇంద్రుడు ఇన్నాళ్ళు నిన్ను అడిగియుండకపోవడం ఆలోచిస్తే ఇది తప్పేకదా! అందుకు శిక్షగా స్వయంవరసమయమున కర్పూరపు పలుకులు దూరముపెట్టి కట్టిన పూలమాలతో ఇంద్రుని మెడను బంధింపుము.

**124** **చ. భువనమునందు నెల్లఁ గడు పూజ్యము నాకము నాకభూమిలో**
**దివిజులు ప్రాభవాధికులు దివ్యకదంబములోఁ బులోమజా**
**ధవుఁడు వరేణ్యుఁడా నముచి దర్పహరుండు దృఢానురాగుఁడై**
**యువిద! నిను న్వరింప మది నువ్విళులూరెడు నెట్టి ధన్యవో**

భువనమునందున = లోకమున, ఎల్లన్ = అంతటను, నాకము = స్వర్గము, కడు పూజ్యము = మిక్కిలి పూజనీయము, నాకభూమిలోన్ = ఆ స్వర్గములో, దివిజులు = దేవతలు, ప్రాభవ అధికులు = మహిమచే గొప్పవారు, దివ్య కదంబములోన్ = ఆ దేవతా సమూహములో, పులోమజా ధవుడు = శచీభర్త, వరేణ్యుడు = శ్రేష్ఠుడు, ఆ నముచి దర్పహరుండు = ఆ నముచి గర్వాన్ని అణిచినవాడైన ఇంద్రుడు, దృఢ అనురాగుడై = దృఢమైన ప్రేమకలవాడై, నినున్, వరింపన్, మదిన్ = మనసున, ఉవ్విళులు ఊరెడు = ఉబలాటపడుచుండెను, ఎట్టి ధన్యవో = ఎంతటి ధన్యురాలవోకదా!

తా. లోకమునందంతటను స్వర్గము మిక్కిలి పూజనీయము. ఆ స్వర్గములో దేవతలు మహిమచే గొప్పవారు. ఆ దేవతా సమూహములో ఇంద్రుడు శ్రేష్ఠుడు. అలాంటి ఇంద్రుడు నిన్ను వరించాలని మనసులో తెగ ఉబలాటపడుతున్నాడు. అంటే, మరి నువ్వు ఎంతటి పుణ్యాత్మురాలివో!

**125** **శా. ఏలోకంబునకై మహాక్రతు శతం బేకాగ్రతం జేసి నాఁ**
**డాలోకంబు నలంకరించుటకు నిన్నర్థించె జంభారి నీ**
**వాలేఖర్షబు నాజ్ఞ సేయఁదగదే యబ్జాక్షి! మైకోలుమై**
**నాలస్యంబునుబోలె నైన నొక మాటల్లార్పు భ్రూవల్లరిన్**

అబ్జ అక్షి = దమయంతీ!, జంభారి = ఇంద్రుడు, ఏ లోకంబునకై, మహా క్రతు శతంబు = గొప్పవైన నూరు యజ్ఞములను, ఏకాగ్రతన్ చేసినాడు = తదేకముగా చేసినాడో, ఆ లోకంబును, అలంకరించుటకు, నిన్ను, అర్థించె = అడుగుచున్నాడు, నీవు, ఆలేఖార్షభుని ఆజ్ఞన్ = ఇంద్రుని యాజ్ఞను, సేయన్ తగదే = చేయరాదా?, మైకోలుమైన్ = అంగీకారముగా, ఆలస్యంబునుబోలెనైన = అలసటచేతనైతే, భ్రూవల్లరిన్ = కనుబొమలను, ఒకమాటు, అల్లార్చు = ఆడించుము

తా. దమయంతీ! ఏ లోకంకోసం ఇంద్రుడు నూరు క్రతువులు ఏకాగ్రతతో చేశాడో ఆ లోకాన్ని అలంకరించడంకోసం నిన్ను అడుగుతున్నాడు. నీవు ఆ ఇంద్రుని కోరికను తీర్చరాదా! అంగీకారముగా అలసటచేతనైతే కనీసం కనుబొమలు ఒకసారి ఆడించు.

**126** **సీ. నందనోద్యాన మందారక చ్ఛాయల**
**విశ్రమింపఁగ నీకు వేడ్కగాదె**
**మందాకినీ పొందు మహిత సైకతములఁ**
**గ్రీడసల్పఁగ నీకుఁ బ్రియముగాదె**
**దుగ్ధాబ్ధి కన్యక తోడికోడలు గాఁగ**
**నొరిమమై నుండ నీ కొప్పుగాదె**
**మధుకైటభారాతి మఱఁది రమ్మని పిల్చి**
**పనిగొంట నీకుఁ బ్రాభవముగాదె**
**తే. మూడు సంధ్యల నీచేత మ్రొక్కుగొందు**
**రెవ్వరిటు తొల్లి యా వేల్పులెల్ల నీకు**
**నర్థి మ్రొక్కంగ నునికి భాగ్యంబుగాదె**
**యేల సందేహ మమరేంద్రు నేలుకొనుము**

నందనోద్యాన = నందనవనమునందు, మందారక ఛాయల = మందార వృక్షముల నీడయందు, విశ్రమింపంగ =

అలసట తీర్చుకోవాలని, నీకు, వేడ్క కాదె = కోరికగా లేదా?, మందాకినీ = ఆకాశగంగయొక్క, పాండు = తెల్లని, మహిత = గొప్పవైన, సైకతములన్ = ఇసుకతిన్నెలయందు, క్రీడసల్పగ = ఆటలాడగ, నీకు, ప్రియము కాదె = ఇష్టంలేదా?, దుగ్ధాబ్ధి కన్యక = లక్ష్మీదేవి, తోడికోడలు కాగన్, ఒరిమమైన్ ఉండన్ = కలిసియుండుటకు, నీకు, ఒప్పుకాదె = అంగీకారము కాదా? మధుకైటభ అరాతి = విష్ణువును, మఱది, రమ్మని, పిల్చి, పనిగొంట, నీకున్, ప్రాభవము కాదె = గొప్పేకదా!, మూడు సంధ్యలన్ = మూడు కాలములందును (ఉదయం,మధ్యాహ్నం, సాయంత్రం), ఎవ్వరు = ఏ దేవతలు, తొల్లి = ఇంతకు పూర్వము, ఇటు = ఈ రీతిగా, మ్రొక్కు కొందురు = నమస్కరింపబడుతున్నారో, ఆ వేల్పులు ఎల్లన్ = ఆ దేవతలందరూ, నీకు, అర్థిన్ = కోరి, మ్రొక్కంగన్ ఉనికి = సమస్కరిస్తూండటం, భాగ్యంబు కాదె = అదృష్టమే కాదా?, సందేహము, ఏల, అమరేంద్రున్ = ఇంద్రుని, ఏలుకొనుము = వరించుము

తా. నందనవనమునందు మందారవృక్షముల నీడయందు విశ్రమించాలని నీకు కోరికగా లేదా? ఆకాశగంగ తెల్లని చక్కని ఇసుకతిన్నెలపై ఆటలాడడం నీకు ఇష్టంకాదా? లక్ష్మీదేవి తోడికోడలై కలిసితిరగడం నీకు అంగీకారంకాదా? విష్ణువు మఱదికాగా రా అని పిలిచి పనులుచేయించుకోవడం నీకు గొప్పేకదా? మూడు సంధ్యాకాలములందును ఏ దేవతలనైతే నువ్వు ఇంతకు ముందు నమస్కరిస్తున్నావో ఆ దేవతలు అందరూ నీకు కోరి నమస్కరిస్తూండటం నీ అదృష్టమే కాదా? సందేహపడతావెందుకు? ఇంద్రుని వరించు.

**127 ఉ. అద్దివిజాధినాయకుని యానతి సేయుము చిత్తవృత్తి నొం**
**దెద్దియునుం దలంపకు మహీన పరాక్రమ నీతిశాలి నీ**
**ముద్దు మఱంది కుఱ్ఱ హరి మోసల కార్యభరంబు దీర్పఁగా**
**గద్దియ మీఁదనుండి త్రిజగంబులు నేలుకొనంగ నొల్లదే**

ఆ దివిజ అధినాయకుని = ఆ ఇంద్రునియొక్క, ఆనతి = ఆజ్ఞను, చేయుము, చిత్తవృత్తిన్ = మనసులో, ఒందు ఎద్దియునున్ = వేరుగానేమియు, తలంపకుము = ఆలోచింపకుము, అహీన పరాక్రమ నీతిశాలి = గొప్ప పరాక్రమము రాజనీతి కలవాడైన, మఱంది కుఱ్ఱ, హరి, మోసల కార్యభరంబు = సభా కార్యక్రమ భారమును, తీర్పగా = తీర్చుచుండగా, గద్దియమీదనుండి = సింహాసనమీదనుండి, త్రిజగంబులు = మూడులోకములను, ఏలుకొనంగన్, ఒల్లదే = అంగీకారంకాదా?

తా. ఆ ఇంద్రుని ఆనతిని చేయుము. మనసులో వేరే ఆలోచనలేమియు చేయకుము. గొప్ప పరాక్రమము, రాజనీతి కలవాడైన విష్ణువు సభా కార్యక్రమములను నెరవేరుస్తూండగా సింహాసనమీద కూర్చొని మూడులోకాల్ని పరిపాలించడం నీకు అంగీకారంకాదా?

**128 వ. అనిన విని యక్కన్నియ మిన్నకుండె. అప్పు డా పేరోలగంబున నున్న బోటికత్తియ లిది యుత్తమకార్యం బనువారును, నీ ప్రయోజనంబునకు విచారింపఁ బనిలేదనువారును, దీనికిం దగిన యుత్తరం బంగీకారంబనువారును నై తమలోన గుజగుజలం బోవుచుండిరి. అనంతరంబ మందస్మిత సుందర వదనారవిందయగు భీమనందన హస్తారవిందంబులు మోడ్చి సంక్రందనుం దలంచి, వందనం బాచరించి తత్సందేశహారిణిం గనుంగొని యిట్లనియె**

తా. అని దూతిక పలుకగా విని ఆ దమయంతి మౌనముగా ఉండిపోయెను. అప్పుడు ఆ సభలోనున్న చెలికత్తెలు ఇది మంచి పని అనువారును, ఈ పనికి అలోచించాల్సిన అవసరం లేదనువారును, దీనికి తగిన సమాధానం ఒప్పుకోవడమే అనువారునుయై తమలో గుసగుసలు పోవుచుండిరి. అనంతరం చిరునవ్వుతో పద్మమువంటి అందమైన ముఖంతో దమయంతి పద్మములవంటి రెండుచేతులను జోడించి ఇంద్రుని మనసున తలచుకొని, నమస్కరించి ఆ దూతికను చూచి ఇట్లు పలికెను.

**129 తే. వేదములు నాల్గు వేవేల విధులఁ బొగడ**
**మనము పొగడెడు వారమే యనిమిషేంద్రు**
**వేఁడికొనియెదఁ జిగురాకుఁబోఁడి నిన్ను**
**హరిగుణస్తుతి సాహసిక్యంబు మాను**

వేదములు, నాల్గు, వేవేల విధులన్ = అనేక రీతులుగా, పొగడన్, అనిమిషేంద్రున్ = ఇంద్రుని, మనము = సామాన్యులమైన మనము, పొగడెడు వారమే = స్తుతించేవారమా?, చిగురాకుబోడి = ఓ దూతికా!, నిన్ను, వేడికొనియెదన్, హరి = ఇంద్రుని, గుణ స్తుతి = గుణములను పొగడుటయను, సాహసిక్యంబు = సాహసమును, మాను = మానుము.

తా. నాలుగు వేదములు అనేక విధములుగా ఇంద్రుని స్తుతించుచుండగా సామాన్యులమైన మనము ఆ ఇంద్రుని స్తుతించగలవారమా? ఓ దూతికా నిన్ను వేడుకొనుచున్నాను. ఇంద్రుని గుణములను స్తుతించు సాహసం మానెయ్యి.

**130 సీ. శ్రుతి నుతింపగ నీవు నుతియించెదే యింద్రు**
**నతివ యీ సాహసిక్యంబు మాను**
**సకలాత్మసాక్షికి శతమన్యునకు వేఱ**
**చెప్పంగ వలయునే చిత్తవృత్తి**

**హరియాజ్ఞ లక్షించి నాక్షరోచ్చార పౌ**
**రుష్య భారమున కోరుచునె జిహ్వ**
**సంక్రందనుని దివ్య సందేశ వాక్యంబు**
**ధరియింతు మౌళిఁ బూదండఁ బోలె**
**తే. రాజునాఁగ నిజాంశ సంప్రభువుఁడైన**
**జిష్ణునకు నేను బరిచర్య సేయఁగలను**
**మున్నె నలునకు నన్నిచ్చుకున్నదాన**
**నింక నొరునకు నెబ్భంగి నిత్తు చెపుమ**

శ్రుతి నుతింపగన్ = వేదము స్తుతించుచుండగా, ఇంద్రున్, నీవు, నుతియించెదే = స్తుతిస్తావా?, అతివ = ఓ కాంతా!, ఈ సాహసిక్యంబు = ఈ సాహసమును, మాను = మానుము, సకలాత్మసాక్షికి = అన్ని జీవులకు సాక్షీభూతుడైన, శతమన్యునకు = ఇంద్రునకు, చిత్తవృత్తి = నా మనసును, వేఱ చెప్పంగవలయునే = వేరుగా చెప్పవలెనా?, హరి ఆజ్ఞ = ఇంద్రుని ఆజ్ఞ, లక్షించి = తెలిసికొని, 'న' అక్షర = న (లేదు) అను అక్షరమును, ఉచ్చార = పలుకుటకు, జిహ్వ = నాలుక, పౌరుష్య భారంబునకున్ = కాఠిన్యాతిశయమునకు, ఓరుచునె = సహించునా?, సంక్రందనుని = ఇంద్రుని, దివ్య = గొప్పదైన, సందేశ వాక్యంబు, మౌళిన్ = శిరసున, పూదండ పోలెన్ = పూలదండను వలె, ధరియింతున్ = ధరించెదను, రాజు నాగ = రాజశబ్దముచే, నిజాంశ సంప్రభవుడైన = తన అంశచే జన్మించినవాడైన, జిష్ణునకున్ = ఇంద్రునకు, నేను, పరిచర్య = సేవను, చేయగలను, మున్నె = ఇంతకు ముందే, నలునకున్, నన్ను, ఇచ్చుకున్నదానన్, ఇంకన్, ఒరునకు, ఎబ్భంగి = ఏరీతిగా, ఇత్తు = ఇస్తాను, చెపుమ = చెప్పు

తా. వేదములచే స్తుతింపబడు ఇంద్రుని నీవు స్తుతింపగలవా? ఓ కాంతా! ఈ సాహసమును మానుము. అన్ని జీవులకు సాక్షీభూతుడైన ఇంద్రునకు నా మనసును వేరే చెప్పాలా? ఇంద్రుని ఆజ్ఞ తెలిసికొని 'న' అక్షరమును పలుకుటకు నా నాలుక కాఠిన్యాతిశయమును సహిస్తుందా? ఇంద్రుని గొప్పదైన సందేశ వాక్యాన్ని శిరసున పూలదండనువలె ధరిస్తాను. రాజ శబ్దంచేత తన అంశతోనే జన్మించినవాడైన ఇంద్రునకు (నలునకు) నేను సేవచేసుకుంటాను. ఇంతకు ముందే ఆ నలునకు నన్ను ఇచ్చుకున్నాను. ఇంక వేరొకరికి ఏరీతిగా ఇస్తాను చెప్పు.(ఒకరి కిచ్చిన మనసు ఇంకొకరికి ఎలా ఇస్తాం)

**131 తే. నలుని వరియింప గోరెదు నాకు నిప్పు**
**డింద్రు పలుకు లయుక్తంబు లింపు గావు**
**గామసుఖములు నిర్వాణ కామమతికిఁ**
**గరము రుచియింపకునికి యుక్తంబ గాదె**

నలునిన్, వరియింపన్, కోరెదు నాకున్, ఇప్పుడు, ఇంద్రు పలుకులు, అయుక్తంబులు = తగినవి కావు, ఇంపు కావు = ఇష్టము కావు, నిర్వాణ కామ మతికిన్ = మోక్షము కోరువానికి, కామసుఖములు = ఇంద్రియసుఖములు, కరము = మిక్కిలి, రుచియింపక ఉనికి = ఇష్టము కాకుండుట, యుక్తంబ కాదె = తగినదేకదా!

తా. నలుని పెండ్లాడాలనుకొనే నాకు ఇపుడు ఈ ఇంద్రుని మాటలు తగినవి కావు. ఇష్టములును కావు. మోక్షము కోరువానికి ఇంద్రియసుఖములు పూర్తిగా ఇష్టముకాకపోవడం తగినదేకదా!

**132 మ. ఇల వర్షంబులలోన భారతము భూయిష్ఠంబు నాల్గాశ్రమం**
**బులలోనన్ గృహమేధి యాశ్రమమునుంబోలెం బయోజాక్షి యి**
**చ్చులఁ గావించెద భర్తృభక్తి గరిమన్ శర్మోర్మి కిమ్మీర ని**
**ర్మల ధర్మాగమ మర్మ నర్మసఖి సమ్యక్కర్మ కాండంబులన్**

పయోజాక్షి = పద్మనేత్రీ!, నాల్గు ఆశ్రమంబులలోనన్ = బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్యాసమనెడి నాలుగు ఆశ్రమములలోను, గృహమేధి ఆశ్రమంబును పోలె = గృహస్థాశ్రమమువలెనే, ఇలన్ = భూలోకమునగల, వర్షంబులలోన = దేశములలో, భారతము = భారతదేశము, భూయిష్ఠంబు = శ్రేష్ఠమైనది, ఇచ్చులన్ = కోరికతో, భర్తృభక్తిగరిమన్ = పతిభక్తిపెంపుచే, శర్మోర్మి = సుఖపరంపరలతో, కిమ్మీర = చిత్రమైన, నిర్మల= స్వచ్ఛమైన, ధర్మ ఆగమ = ధర్మశాస్త్రములయొక్క, మర్మ = రహస్యములకు, నర్మసఖి = చెలికత్తెలైన, సమ్యక్ = తగిన కర్మ కాండంబులన్ = కర్మసమూహములను, కావించెదన్ = చేసెదను.(నవ వర్షములు – భారత కిన్నర హరి కురు హిరణ్మయ రమ్యక భద్రాశ్వ కేతుమాల ఏలా)

తా. ఓ పద్మనేత్రీ! నాలుగు ఆశ్రమములలోను గృహస్థాశ్రమమే శ్రేష్ఠమైనది. అలాగే దేశములన్నిటిలోన భారతవర్షమే శ్రేష్ఠమైనది. అందువలన నేను కోరికతో పతిభక్తిపెంపున సుఖపరంపరలతో చిత్రమైన స్వచ్ఛమైన ధర్మశాస్త్రములయొక్క రహస్యములకు చెలికత్తెలైన తగిన కర్మకాండలను చేసి దేవతలను సంతృప్తి పరచెదను.

**133 ఉ. శర్మమె కాని యివ్విబుధ సద్మమునందుఁ దలంచి చూడఁగా**

**ధర్మము సేయలేదిచట ధర్మము సేయఁగ నిర్విశంకతన్**
**శర్మము నొందనుంగలదు శర్మము ధర్మముఁ గాంచుటొప్పునో**
**శర్మము గాంచు టొప్పునొ విచారము సేయుము నెమ్మనంబునన్**

తలంచి చూడగాన్ = ఆలోచించి చూడగా, ఆ విబుధ సద్మమునందున్ = ఆ స్వర్గ లోకములో, శర్మమెకాని = సుఖము అనుభవించుటే కాని, ధర్మము, చేయన్ = చేయుటకు, లేదు = వీలుపడదు, ఇచటన్ = ఈ భూలోకమునందు, నిర్విశంకతన్ = నిస్సందేహముగా, ధర్మము, చేయగన్ = చేయుటకు, శర్మమున్ = సుఖమును, ఒందనున్ = పొందుటకు, కలదు, శర్మము ధర్మమున్ = సుఖమును, ధర్మమును రెంటిని, కాంచుట = పొందుట, ఒప్పునో = తగునో, శర్మమున్ = ఒక్క సుఖమునే, కాంచుట = పొందుట, ఒప్పునొ = తగునో, నెమ్మనంబునన్ = నిండు మనసుతో, విచారము = ఆలోచనను, చేయుము

తా. ఆలోచించిచూడగా ఆ స్వర్గలోకంలో సుఖములనుభవించడమేకాని ధర్మము చేయడానికి వీలుపడదు. ఈ భూలోకంలో అయితే నిస్సందేహంగా ధర్మము చేయడానికి, సుఖాలను అనుభవించడానికి వీలుపడుతుంది. ధర్మము, సుఖము రెంటిని పొందుట తగినదో, సుఖమును మాత్రమే పొందుట తగినదో నిండుమనస్సుతో ఆలోచనచేయుము.

**134 క. ఇందుండి యూర్ధ్వగతియును**
**నందుండి యధోగతియును నవసానమునన్**
**బొందును సజ్జనుఁ డిందును**
**నందును గలవాసి చూడుమా డెందమునన్**

**పజ్జనుడు = పుణ్యాత్ముడు, అవసానమునన్ = అంతమందు, ఇందుండి = ఈ లోకమునుండి, ఊర్ధ్వగతియును = ఊర్ధ్వ లోకమును, అందుండి = ఆ లోకమునుండి, అధోగతియును = క్రింది లోకమును, పొందును, డెందమునన్ = మనసునందు, ఇందును = ఈ లోకమునందును, అందును = ఆ లోకమునందును, కల వాసి = ఉన్న తేడాను, చూడుమా?**

**తా. పుణ్యాత్ముడు అంతమందు ఈ లోకమునుండి ఊర్ధ్వలోకమును అక్కడినుండి పుణ్యాంతమందు భూలోకమును పొందును. ఈ లోకానికి ఆ లోకానికి గల తేడాను మనసునందు ఆలోచించి చూడుము.**

**135 ఉ. ఆతతమైన కర్మగతి నాయువు వీడ్కొనునప్పు డాత్మలోఁ**
**గౌతుక మావహించునది గావున నాకసుఖం బపథ్య మా**
**పాత సుఖోన్ముఖుండయిన పంచజనుండు భజించు దానిఁ గా**
**మాతురితాతిరేకమున నార్యుల కింపవు తత్ప్రకారముల్**

ఆతతము ఐన = విస్తారమైన, కర్మగతిని = కర్మ మార్గముచేత, ఆయువు వీడ్కొనునప్పుడు = ప్రాణము పోవునపుడు, ఆత్మలోన్ = మనసునందు, కౌతుకము = క్రొత్తదనముపై కుతూహలమును, ఆవహించునది కావున = కలిగించేది కాబట్టి, నాకసుఖంబు = స్వర్గ సుఖము, అపథ్యము = కోరదగినదికాదు, ఆపాత = వచ్చిపడిన, సుఖోన్ముఖుండయిన = సుఖముల ఆసక్తుడైన, పంచజనుండు = సామాన్య మనుజుడు, కామ ఆతురిత అతిరేకమున = కోరిక త్వరపెట్టు అతిశయముచే, దానిన్ = ఆ స్వర్గసుఖమును, భజించు = కోరుకొనును. తత్ ప్రకారముల్ = ఆ విధానములు, నార్యులకు = నీచులకు, ఇంపు అవున్ = ఇష్టములగును.

తా. విపులమైన కర్మమార్గముచేత ప్రాణము పోవునపుడు మనసున క్రొత్తదనముపై కుతూహలమును కలిగిస్తుంది కాబట్టి స్వర్గసుఖము కోరదగినది కాదు. అనుకోకుండా వచ్చిపడే సుఖములయందు ఆసక్తుడైన సామాన్య మనుజుడు కోరిక త్వరపెట్టుచుండుటచే ఆ స్వర్గసుఖములను కోరుకొనును. ఆ విధానములు ఆర్యులుకానివారికి మాత్రమే ఇష్టములగును.

**136 వ. అని పలికి ఇంద్రదూతికా వాక్యంబులకు మనసువెట్టిన బోటికత్తియల తలంపెఱింగి వారి వదనంబులు వీక్షించి యిట్లనియె**

తా. దమయంతి ఈ రీతిగా మాట్లాడి ఇంద్రుని దూతిక మాటలకు మనసుపడుతున్న చెలికత్తెల మనసు తెలిసి వారి ముఖములను చూచుచు ఇల్లు పలికెను

**137 తే. మీ తలం పే నెఱుంగుదు మిన్నకుండుఁ**
**డంబుజాననలార! యాయాస ముడిగి**
**యే ననాది సంచారిణియైన యాత్మ**
**హేతుపంక్తికి విధికి నధీనబుద్ధి**

అంబుజాననలార = పద్మముఖులారా! మీ తలంపు = మీ ఆలోచన, ఏను = నేను, ఎఱుంగుదు = ఎఱుగుదును, ఆయాసము ఉడిగి = ఆయాసపడక, మిన్నక ఉండుడు = మౌనంగా ఉండండి, ఏను = నేను, అనాది సంచారిణియైన = అనాదిగా వచ్చుచున్నదైన, ఆత్మ = దేహముయొక్క, హేతుపంక్తికిన్ = కర్మల సమూహమునకు, విధికిన్ = దైవమునకును,

అధీనబుద్ధి = లోబడిన బుద్ధికలదానను.

తా. ఓ పద్మముఖులారా! మీ ఆలోచన నాకు తెలుసు. ఆయాస పడక మౌనంగా ఉండండి. నేను ఆనాదిగా వస్తున్న దేహముయొక్క కర్మల సమూహమునకు, దైవమునకును లొంగినదానను.

**138 క. నియతి యచేతన యఖిలము**
**నియతి పరాధీన మిట్టి నిజ మెఱిఁగినచో**
**నియతివశున్ నియమించుట**
**నియతి గుఱిచి గర్హసేత నిష్ఫలమరయన్**

అరయన్ = ఆలోచింపగా, నియతి = దైవము, అచేతన = చైతన్యములేనిది, అఖిలము = సమస్తలోకము, నియతి పరాధీనము = దైవాధీనమైనది, ఇట్టి నిజము = ఈ సత్యమును, ఎఱిగినచోన్ = తెలిసికొన్నచో, నియతివశున్ = దైవాధీనుని, నియమించుట = శాసించుటయు, నియతి గుఱిచి = దైవమును గురించి, గర్హసేత = నిందించుటయు, నిష్ఫలము = వ్యర్థము

తా. ఆలోచింపగా దైవము చైతన్యము లేనిది. కాని సమస్తలోకము దైవాధీనము. ఈ సత్యమును తెలిసికొన్నచో దైవాధీనుని శాసించడం, దైవాన్ని నిందించడం వ్యర్థము.

**139 క. లోకంబున నాకీటం**
**బా కైటభవైరి యెల్ల యాత్మలకు నభీ**
**ష్టా కాంక్ష లొక్క చందమ**
**యీ కీలెరుఁగంగవలదె హృదయములోనన్**

లోకంబునన్, ఆ కీటంబు = పురుగు మొదలుకొని, కైటభవైరి = కైటభవైరియయిన భగవంతుని వరకు, ఎల్ల ఆత్మలకు = అన్ని జీవులకును, అభీష్టాకాంక్షలు = ఇష్టములను కోరుకొనుట, ఒక్క చందమ = ఒకే రీతిగానుండును, ఈ కీలు = ఈ రహస్యము, హృదయములోనన్ = మనసులో, ఎరుగంగవలదె = తెలుసుకోవద్దా?

తా. లోకంలో పురుగు మొదలుకొని భగవంతుని వరకు సమస్త జీవులకు ఇష్టములను కోరుకొనడమనేది ఒక్క రీతిగానే ఉంటుంది. ఈ రహస్యం మనసులో తెలుసుకోవద్దా?

**140 తే. కొన్ని జీవులు చిదిపి ఱాల్గొఱికి బ్రదుకుఁ**
**కొన్ని నునుసోఁగ వెన్నెల గ్రోలి పొదలు**
**భిన్న రుచులైన వారికిఁ బ్రీతి సరియ**
**తగవు గా దిందులోన నేకతరగర్హ**

కొన్ని జీవులు, చిదిపి = పిండిచేసి, ఱాల్ కొఱికి = ఱాళ్ళను తిని, బ్రదుకున్ = జీవించును, కొన్ని, నునుసోగ వెన్నెలన్ = మృదువైన వెన్నెలను, క్రోలి = త్రాగి, పొదలున్ = జీవించును. భిన్న రుచులైన, వారికిన్ = ఆ జీవులకు, ప్రీతి = తృప్తి, సరియ = సమానమే!, ఇందులోన్, ఏకతర గర్హ = ఒకదానిని నిందించుట, తగవు కాదు = న్యాయము కాదు.

తా. కొన్ని జీవులు ఱాళ్ళను తిని జీవించును, మరికొన్ని జీవులు వెన్నెలను త్రాగి జీవించును. వేఱు వేఱు రుచులైన ఆ జీవులకు తృప్తిమాత్రము సమానమే. ఇందులో ఒకదానిని నిందించడం న్యాయము కాదు.

**141 తే. అగ్రమార్గజాగ్రన్నిభృతాపదంధు**
**బంధుసంరక్షణము పాడి బాంధవులకు**
**నైన కార్యంబు గాని కార్యమును దెలిసి**
**యాడుఁడా యేను మీమాట కడ్డమాడ**

అగ్రమార్గ = దారిలో ఎదుట, జాగ్రత్ = సమీపముననే, నిభృత = ఉన్నటువంటి, ఆపద అంధు = ఆపదయనెడికూపమునుండి, బంధు సంరక్షణము = బంధువులను కాపాడుట, బాంధులకున్ = బంధువులైనవారికి, పాడి = న్యాయము. ఐన కార్యంబున్ = తగినపనిని, కాని కార్యమును = తగనిపనిని, తెలిసి = తెలిసికొని, ఆడుడా = పలకండి, ఏను = నేను, మీ మాటకు, అడ్డము ఆడ = అడ్డు పలుకను

తా. వెళుతున్న దారిలో ఎదురుగ ఉన్నటువంటి ఆపద అనెడి బావినుండి బంధువులను కాపాడుట బంధువులైనవారికి న్యాయము. తగినపనిని, తగనిపనిని తెలిసికొని మాటలాడండి. నేను మీ మాటకు అడ్డుపలుకను

**142 వ. అని సఖులనెల్ల నివారించి పురుహూత దూతికం గనుంగొని మఱియు నిట్లనియె**

తా. అని చెలికత్తెలనందరను అడ్డగించి ఇంద్రుని దూతికను చూచి ఇంకను ఇట్లు పలికెను

**143 ఉ. స్వర్పతి చిత్తవృత్తి గలుషత్వము నొందునొ యన్భయంబు నా**
**కేర్పడలేదు విన్ము దివిజేశ్వర దూతిక సప్తతంతు భా**

**గార్వణ మాచరించి కరమాదరణంబున నేను రాజ కం**
**దర్పుఁడు నైషధాధిపుఁడు దన్ను నుపాస్తి యొనర్పఁ జాలుటన్**

దివిజేశ్వర దూతిక = ఓ ఇంద్రుని దూతికా!, విన్ము = విను, నేనును, రాజకందర్పుడు = రాజులలో మన్మథుడగు, నైషధాధిపుడు = నల మహారాజును, కరము = మిక్కిలి, ఆదరణంబున = ప్రీతితో, సప్తతంతు సమర్పణము = యజ్ఞభాగ హవిస్సులనిచ్చుటను, ఆచరించి = చేసి, తన్నున్ = ఆ దేవేంద్రుని, ఉపాస్తి = పూజను, ఒనర్పన్ చాలుటన్ = చేయగలుగుటచే, స్వర్పతి = ఇంద్రునియొక్క, చిత్తవృత్తి = మనోవ్యాపారము, కలుషత్వమున్, ఒందునో = పొందునేమో, అను భయంబు, నాకున్, ఏర్పడన్ లేదు = కలుగుట లేదు

తా. ఓ ఇంద్రదూతికా! విను. నేనును నలమహారాజును మిక్కిలి ప్రీతితో యజ్ఞభాగ హవిస్సులను ఇచ్చి ఆ దేవేంద్రుని ఉపాసనను చేయగలుగుటచే ఇంద్రుని మనస్సు కలుషత్వమగునని నాకు భయము కలుగుట లేదు

**144 చ. తన హృదయాధినాయకుని దక్కఁగఁ దక్కొరు సన్నుతింపఁగా**
**వినుట పతివ్రతంబునకు విగ్రహ మిట్టిది ధర్మశాస్త్ర వా**
**సన యటుగాన యో దివిజ శంభళి! యింకిటఁ బట్టి నీకు మీ**
**యనిమిషరాజు పాదముల యాన సుమీ మఱియేమి పల్కినన్**

ఓ దివిజ శంభళి = ఓ ఇంద్ర దూతికా!, తన హృదయాధినాయకుని = తన మనోనాయకుని, తక్కగన్ = తప్ప, తక్కొరున్ = వేరొకరిని, సన్నుతింపగా = స్తుతింపగా, వినుట, పతివ్రతంబునకు = పాతివ్రత్యమునకు, విగ్రహము = విరోధము, ధర్మశాస్త్ర వాసన ఇట్టిది = ధర్మశాస్త్ర సమాచారము ఇటువంటిది, అటుగానన్ = ఆ కారణముచే, ఇంకిటబట్టిన్ = ఇక మీదట, మఱి = ఇంకను, ఏమి పల్కినన్, నీకు, మీ అనిమిషరాజు పాదముల ఆన సుమీ = మీ ఇంద్రుని పాదములపై ఒట్టుసుమా!

తా. ఓ ఇంద్ర దూతికా! తన మనోనాయకుని తక్క వేరొకరిని స్తుతింపగా వినుట పాతివ్రత్యమునకు విరోధమైనది. ధర్మశాస్త్ర సమాచారము కూడా ఇటువంటిదే! కాబట్టి ఇకమీదట నువ్వు ఇంకేమి మాటలాడినా మీ ఇంద్రుని పాదాలపై ఒట్టేసుమా!

**145 వ. అని తెగనాడి యచ్చేడియ సముచిత ప్రకారంబున బిడౌజసుని దూతికను వీడుకొల్పె. అగ్నియమ వరుణుల సంచారికలునుఁ దమతమకు నదియ యుత్తరంబుగాఁ గైకొని యయ్యుత్తమాంగనం దగిన తెఱంగున నామంత్రణంబు చేసి చనిరి. అంతర్హితుండైన ధరణీకాంతుం దా వృత్తాంతంబంతయు నెఱింగి సంతోషభరితాంతఃకరణుండై యక్కాంతారత్నంబునుం గనుంగొనియె నప్పుడు**

తా. అని చెప్పి తిరస్కరించి ఆ దమయంతి తగిన రీతిగా ఆ ఇంద్రుని దూతికను సాగనంపెను. అగ్ని యమ వరుణ దూతికలును తమతమకు అదే సమాధానమని తీసుకొని ఆ దమయంతిని తగిన రీతిగా గౌరవమును చూపి వెళ్లిరి. కనబడకుండ నున్న నలమహారాజు ఆ విషయమునంతను తెలిసికొని సంతోషముతో నిండిన మనస్సు కలవాడై ఆ కాంతా రత్నమును చూచెను. అప్పుడు

**146 తే. ముదిత క్రొమ్మేని కాంతిలో మునిఁగె మొదల**
**నంత నానందరస వార్ధియందుఁ దేలె**
**బిదప సమ్మోద బాష్పాంబు బిందుధార**
**యందు నవగాహనము చేసె నధిపు దృష్టి**

అధిపు దృష్టి = నలమహారాజు చూపు, మొదలన్ = మొదట, ముదిత = దమయంతియొక్క, క్రొమ్మేని కాంతిలో = క్రొత్తదైన శరీరకాంతిలో, మునిగెన్, అంతన్ = అంతట, ఆనందరస వార్ధియందున్ = ఆనందరస సముద్రమునందు, తేలె, పిదపన్ = తరువాత, సమ్మోద = ఆనందమువలన కలిగిన, బాష్పాంబు = కన్నీటియొక్క, బిందుధారయందు = బిందువుల ధారయందు, అవగాహనము చేసెన్ = స్నానము చేసెను, (అలంకారము – పర్యాయోక్తి)

తా. నలుని చూపు మొట్టమొదట దమయంతియొక్క నూతన శరీరకాంతిలో మునిగిపోయి అంతట ఆనందరస సముద్రములో తేలింది. ఆ తరువాత ఆ ఆనందంవల్ల కలిగిన కన్నీటి బిందువుల ధారలలో స్నానం చేసేడు.

**147 తే. మానవతి మూర్తి యాపాదమస్తకముగఁ**
**దివుట వీక్షించి నిషధపృథ్వీ కళత్రుఁ**
**డపుడు బ్రహ్మాద్వయ ప్రమోదాతిశాయి**
**మన్మథాద్వైత సుఖవార్ధి మగ్నుడయ్యె**

నిషధపృథ్వీకళత్రుడు = నిషధదేశప్రభువైన నలుడు, మానవతి మూర్తి = దమయంతియొక్క రూపమును, ఆపాదమస్తకముగన్ = పాదములనుండి తలవరకు, తివుటన్ = కోరికతో, వీక్షించి = చూచి, అపుడు = ఆ సమయమందు, బ్రహ్మాద్వయ

ప్రమోద = అంతులేని బ్రహ్మానందమును, అతిశాయి = అతిక్రమించిన, మన్మథ అద్వైత సుఖ = అద్వితీయమైన మన్మథ సుఖమనెడు, వార్ధిన్ = సముద్రమునందు, మగ్నుడయ్యె = మునిగిపోయెను.

తా. నలుడు ఆ దమయంతియొక్క రూపమును ఆపాదమస్తకముగ కోరికతో చూచి, ఆ సమయమందు అంతులేని బ్రహ్మానందమును అతిక్రమించిన అద్వితీయమైన మన్మథసుఖమనెడు సముద్రములో మునిగిపోయెను.

**148 చ. సుదతి ముఖేందుమండలము సొంపున రాగరసాంబురాశి య**
**భ్యుదయముఁ బొంది యెంతయును నుబ్బున వేల నతిక్రమించుడున్**
**మదిఁగడు భీతిబొందిన క్రమంబున భూవరు దృష్టి సేరె న**
**మ్మద గజరాజయాన కుచమండల తుంగ మహీధ్రశృంగమున్**

సుదతి = మంచిదంతములుకల దమయంతియొక్క, ముఖ ఇందుమండలము = చంద్రబింబమువంటి ముఖముయొక్క, సొంపునన్ = కాంతిచేత, రాగరస అంబురాశి = అనురాగమనెడి సముద్రము, ఎంతయునున్ = మిక్కిలి, అభ్యుదయమున్ పొంది = అభివృద్ధిని పొంది, ఉబ్బునన్ = అతిశయముచే, వేలన్ = తీరమును, అతిక్రమించుడున్ = దాటగానే, భూవరు దృష్టి = నలుని చూపు మదిన్ = మనసునందు, కడు భీతి బొందిన క్రమంబునన్ = చాల భయపడిన క్రమంలో, ఆ మదగజయాన = ఆ దమయంతియొక్క, కుచమండల = స్తనమండలమనెడు, తుంగ = ఎత్తయిన, మహీధ్ర = పర్వతముయొక్క, శృంగమున్ = శిఖరమును, చేరెన్ = చేరెను (అలంకారము – సమాసోక్తి, ఉత్ప్రేక్ష)

తా. దమయంతియొక్క చంద్రబింబమువంటి ముఖముయొక్క కాంతిచేత నలుని అనురాగ సముద్రము పెరిగిపోయి తీరమును దాటగానే ఆ నలుని చూపు మనసులో భయపడుతూనే ఆ దమయంతియొక్క స్తనమండలమనే ఎత్తయిన పర్వతముయొక్క శిఖరమును చేరెను. (పున్నమినాడు సముద్రము పొంగుట సహజము)

**149 చ. మగువ ముఖేందునం దమృత మద్యమునన్ మునుఁగంగఁ బాటియో**
**మగువ కుచద్వయంబు నడుమంబడి రాయిడి దందసిల్లియో**
**మగువ గభీర నాభిబిల మార్గము దూఱి పరిభ్రమించియో**
**సొగపున రాజనందనుని చూపులు నిల్చుఁ దదంతరంబులన్**

రాజనందనుని చూపులు, మగువ ముఖేందునందున్ = దమయంతియొక్క చంద్రునివంటి ముఖమునందున్న, అమృత మద్యమునన్ = సుధారసములో, మునుగంగన్ పాటియో = మునిగిపోవుటచేతనేమో, మగువ = దమయంతియొక్క, కుచద్వయంబు నడుమం బడి = స్తనములమధ్య పడి, రాయిడి = రాపిడిచే, దందసిల్లియో = అణగిపోవుటచేతనో, మగువ, గభీర = లోతైన, నాభిబిలమార్గము = నాభి గుహలో, దూఱి = ప్రవేశించి, పరిభ్రమించియో = తిరుగుటచేతనో, సొగపున = పారవశ్యముతో, తదంతరంబులన్ = వాటి మధ్య, నిల్చున్ = నిలబడిపోవును

తా. నలుని దృష్టి దమయంతి చంద్రునివంటి ముఖమునందున్న అమృతమనెడి మద్యమున మునిగిపోవుటచేతనేమో ఆ మత్తులో ఆమె స్తనముల మధ్య పడి రాపిడిచే అణగిపోయింది. లోతైన నాభిగుహలో ప్రవేశించి దారితెలియక తిరగడంచేత వాటిమధ్యే నిలబడిపోయింది

**150 ఉ. కాంత మెఱుంగు చన్నులకు గ్రమ్మఱి క్రమ్మఱి వచ్చుచుండి యం**
**గాంతర సన్నివేశములకై యట యేఁగియు నేఁగలేక భూ**
**కాంతుని దృష్టి దిగ్భ్రమము గైకొనఁబోలు బలే తదీయ ప**
**ర్యంతమునం దలందిన కురంగ మదంబను జిమ్మఁజీఁకటిన్**

భూకాంతుని దృష్టి = నలమహారాజు చూపు, కాంత మెఱుంగు చన్నులకున్ = దమయంతి కాంతివంతమైన స్తనములకు, క్రమ్మఱి క్రమ్మఱి = తిరిగి తిరిగి, వచ్చుచుండి, అంగాంతర సన్నివేశములకై = ఇతరావయవముల ప్రదేశములకై, అట ఏగియున్ = అక్కడకు పోయియును, ఏగలేక = పోలేక, తదీయ పర్యంతమునందున్ = ఆ స్తనముల ప్రక్కలయందు, అలందిన = పూసిన, కురంగమదంబను = కస్తూరియను, చిమ్మచీకటిన్ = గాఢాంధకారమునందు, బలే = ఓహో!, దిగ్భ్రమమున్ = దిగ్భ్రాంతిని, కైకొనబోలున్ = పొందినది కాబోలు

తా. నలుని చూపు దమయంతియొక్క స్తనములకు తిరిగి తిరిగి వచ్చుచుండి ఇతర అవయవములపైకి పోయినను అక్కడకు పోలేక, ఆ స్తనముల ప్రక్కలయందు పూసిన కస్తూరిఅనే చిమ్మచీకటికి దిగ్భ్రాంతిని పొందినది కాబోలు.

**151 క. రమణీ నితంబ చక్ర**
**భ్రమణంబునఁ జిట్టి దిరిగి పడఁ బాటియొ భూ**
**రమణుని చూపు పరిష్వం**
**గ మొనర్చెఁ దదూరు కదళికా స్తంభములన్**

భూరమణుని చూపు = నలుని దృష్టి, రమణీ = దమయంతియొక్క, నితంబ చక్ర = పిరుదులనెడి చక్రముయొక్క,

భ్రమణంబునన్ = తిరుగుటచేత, జిబ్జి తిరిగి = సుడి తిరిగి, పడన్ పాఱియొ = పడుటచేతను కాబోలు, తత్ = ఆ దమయంతి యొక్క, ఊరు = తొడలనెడి, కదళికా స్తంభములన్ = అరటికాండములను, పరిష్వంగము ఒనర్చెన్ = కౌగలించుకొనెను

తా. నలుని చూపు దమయంతియొక్క పిరుదులనెడి చక్రముయొక్క తిరుగుటచేత సుడితిరిగి పడుటచేతను కాబోలు ఆ దమయంతియొక్క తొడలనెడి అరటికాండములను కౌగలించుకొనెను.

**152 ఉ. నేత్రమ నేను జీరయును నేత్రమ చీరకు నాశ్రయింపఁగాఁ**
**బాత్రత గల్గె నాకు నిట పాత్రత లేదని నామ సామ్యవై**
**చిత్రికతంబునన్ బలిమిఁ జేకొనినట్టులు రాజుదృష్టి యా**
**క్షత్రియకన్య చారు కటిచక్రము నూరుయుగంబు దూకొనెన్**

నేను, నేత్రమ, చీరయును, నేత్రమ (నేత్రమునకు కన్ను, చీర అని రెండర్థములును కలవు), చీరకున్, ఆశ్రయింపగాన్ = ఊరువులను పొందుటకు, పాత్రత కల్గె = అవకాశము కలిగెను, నాకున్, ఇట = ఈ ప్రదేశమున, పాత్రత లేదని = అవకాశము లేదని, నామసామ్య వైచిత్రి కతంబునన్ = ఒకే పేరు ఉండడమనే విచిత్రతవలన, రాజు దృష్టి = నలుని చూపు, బలిమిన్ = బలాత్కారముగా, చేకొనినట్టులు = లాగుకొనినట్లు, ఆ క్షత్రియ కన్య = ఆ దమయంతియొక్క, చారు = అందమైన, కటి చక్రము = నితంబ ప్రదేశమును, ఊరుయుగంబున్ = తొడలజంటను, దూకొనెన్ = అంటుకొనిపోయెను.

తా. నాకూ నేత్రమనే పేరు ఉంది చీరకును నేత్రమనే పేరు ఉంది. కాని చీరకే ఆమె ఊరువుల నాశ్రయించే అవకాశము కలిగింది. నాకు ఆ అవకాశము కలుగలేదని రాజు చూపు బలాత్కారముగా లాగుకొన్నట్లు ఆ దమయంతి యొక్క అందమైన కటి ప్రదేశమును, తొడలజంటను అంటుకొనిపోయెను.

**153 వ. ఇత్తెఱంగున సఖీ పరివార పరివృతయగు నక్కాంతం గనుంగొని యంతర్గతంబున**

తా. ఈ విధముగా చెలికత్తెలతో చుట్టబడియున్న ఆ దమయంతిని చూచి నలుడు మనసులో

**154 క. వితతా ప్రతిమాకారా**
**ద్భుత రూప విలాస విభవ భూషితయగు నీ**
**రతి బోటి తేటపఱుచుం**
**జతురానన హస్త శిల్ప చాతుర్యంబున్**

వితత = ప్రసిద్ధమైన, అప్రతిమ = సాటిలేని, ఆకార = రూపముచేతను, అద్భుత = ఆశ్చర్యకరమైన, రూప విలాస విభవ = సౌందర్య విలాస సంపదచే, భూషితయగున్ = అలంకరింపబడినదగు, ఈ రతి బోటి = ఈ రతీదేవివలెనున్న దమయంతి, చతురానన = బ్రహ్మయొక్క, హస్త = చేతియొక్క, శిల్ప చాతుర్యంబున్ = సృష్టి నైపుణ్యమును, తేటపఱుచున్ = స్పష్ట పఱచును.

తా. ప్రసిద్ధమైన సాటిలేని రూపముయొక్కయు, అద్భుతమైన సౌందర్య విలాస సంపదచేతను అలంకరింపబడినదగు రతీదేవిని పోలియున్న ఈ దమయంతి బ్రహ్మయొక్క సృష్టి నైపుణ్యాన్ని స్పష్ట పరుస్తోంది.

**155 యౌవనాంభోధరోద్భూత హావభావ**
**వారిధారాభిపూర్ణ శృంగారసరసి**
**యబ్జభవ సృష్టి విద్యారహస్యభూమి**
**నిఖిల లావణ్యసీమ యీ నీరజాక్షి**

ఈ నీరజాక్షి = ఈ దమయంతి, యౌవన అంభోధర = యౌవనమనెడి మేఘమువలన, ఉద్భూత = పుట్టిన, హావ భావ = హావభావములనెడు, వారిధారా = నీటిధారలచే, అభిపూర్ణ = నిండిన, శృంగార సరసి = శృంగార ప్రవాహము, అబ్జభవ = బ్రహ్మయొక్క, సృష్టి విద్యా రహస్య = సృష్టి చాతుర్య రహస్యములకు, భూమి = నిలయమైనది, నిఖిల లావణ్య సీమ = సమస్త లావణ్యములకు నిధియైనది,

తా. ఈ దమయంతి యౌవనమనెడి మేఘమువలన పుట్టిన హావభావములనెడు నీటిధారలచే నిండిన శృంగార సరస్సు. బ్రహ్మయొక్క సృష్టి చాతుర్య రహస్యములకు నిలయమైనది.సమస్త లావణ్యములకు నిధియైనది.

**156 తే. సాటి జంబేటి జంబాల జాలమునకుఁ**
**బాటి నూత్న హరిద్రావిభంగమునకుఁ**
**దరము సౌదామినీ దామ ధామమునకుఁ**
**కరముఁ బొలుపొందు దీని యంగముల కాంతి**

కరము = మిక్కిలి, పొలుపొందు = ప్రకాశించు, దీని = ఈ దమయంతియొక్క, అంగములకాంతి = అవయవ సొంపు, జంబు ఏటి జంబాల జాలమునకున్ = బంగారపు రాశికి, సాటి = సమానము. నూత్న = క్రొత్తదైన, హరిద్రా = పసుపు యొక్క, విభంగమునకు = తునుకకు, పాటి = సమానము, సౌదామినీ దామ = మెరుపుమాలలయొక్క, ధామమునకున్

= కాంతికి, తరము = సమానము.

తా. మిక్కిలి ప్రకాశించు ఈ దమయంతియొక్క అవయవ కాంతి బంగారపు రాశికి సమానము, పసుపు తునుకకు సమానము, మెరుపు సమూహముల కాంతికి సమానము.

**157 ఉ. చంచలనేత్ర మేని నునుఁజాయకు సాటి యొనర్పఁగాఁదగుం**
**గాంచన కేతకీకుసుమ గర్భదళంబులు ధూళి బ్రుంగవే**
**నంచిత భీతి నీ సరసిజాక్షి తనుద్యుతి కోడిగాదె సే**
**వించెను వారిదుర్గ మరవింద వరాటక చక్రవాళముల్**

కాంచన = బంగారపు, కేతకీ కుసుమ = మొగలి పూవులయొక్క, గర్భదళంబులు = లోపలిరేకులు, ధూళిన్ = పరాగమందు, బ్రుంగవేని = మునిగియండనియెడల, చంచలనేత్ర = దమయంతియొక్క, మేని నును చాయకు = శరీరపు నున్నని కాంతికి, సాటి ఒనర్పగా తగున్ = సాటి చేయతగును. ఈ సరిసిజాక్షి = ఈ దమయంతియొక్క, తనుద్యుతికి = శరీర కాంతికి, ఓడి కాదె = ఓడిపోయెకదా!, అరవింద వరాటక = పద్మ కర్ణికలయొక్క, చక్రవాళముల్ = సమూహములు, అంచితభీతిన్ = మిక్కిలి భయముతో, వారి దుర్గము = జలదుర్గమును, సేవించెను = పొందెను,

తా. బంగారు మొగలిపూవుల లోపలి రేకులు పరాగమందు మునిగిపోకపోతే దమయంతియొక్క శరీరకాంతికి సాటి చెప్పవచ్చును. దమయంతి శరీరకాంతికి ఓడిపోయేకదా! పద్మకర్ణికల సమూహములు మిక్కిలి భయంతో జలదుర్గమును పొందినవి.

**158 తే. ఇంద్రుఁ డింతికి రక్షగా నిడఁగఁబోలు**
**నాభరణ వజ్రమూర్తి వజ్రాయుధంబు**
**నాతఁ డంతటఁ బోక బాణాసనంబు**
**నిఖిల మణిదీప్తి యనుపేర నిలుపఁబోలు**

ఇంద్రుడు, ఆభరణ వజ్రమూర్తి = ఆభరణ వజ్రరూపమైన, వజ్రాయుధంబున్ = తన వజ్రాయుధమును, ఇంతికి = దమయంతికి, రక్షగాన్ = రక్షణగా, ఇడగబోలు = ఉంచినాడు కాబోలు, అంతట పోక = అంతతో ఊరుకొనక, ఆతడు = ఆ ఇంద్రుడు, నిఖిల మణిదీప్తియను పేరన్ = సమస్త మణికాంతులనెడుపేరుతో, బాణాసనంబున్ = తన వింటిని కూడా, నిలుపబోలు = ఉంచెను కాబోలు

తా. ఇంద్రుడు తన వజ్రాయుధమును ఆభరణ వజ్రరూపముగా దమయంతికి రక్షణగా ఉంచెను కాబోలు, అంతతోపోక అతడు తన వింటినికూడా సమస్త మణికాంతులనే పేరుతో ఉంచినాడేమో!

**159 తే. నెమలి పింఛమ్ముతోడ నీ రమణి వేణి**
**చెలిమి సేయుట బగగొంట దెలియ నరిది**
**యందుఁ బువ్వుల బూజించినట్టి తెఱగు**
**నర్ధచంద్రప్రహార చిహ్నముల కలిమి**

నెమలిపింఛముతోడన్, ఈ రమణి, వేణి = జడ, చెలిమి చేయుట, పగగొంట, తెలియన్ = తెలిసికొనగా, అరిది = అశక్యము, అందున్ = అ పింఛములో, పువ్వులన్ = పూలతో, పూజించినట్టి = పూజించినటువంటి, తెఱగు = పద్ధతియును, అర్ధచంద్రప్రహార= మెడపట్టి బయటకు గెంటుటవలనకలిగిన, చిహ్నముల = గుర్తుల, కలిమి = ఉండుటవలన

తా. నెమలిపింఛముతో ఈ దమయంతి జడ చెలిమి చేసెనో, పగ గొనెనో, తెలిసికొనుట అశక్యము. ఎందుచేతనంటే, ఆ పింఛములో పూలతో పూజించినట్టి పద్ధతియును, మెడపట్టి బయటకు గెంటినపుడు కలిగిన గుఱుతులును ఉండుటవలన.

**160 తే. అలక తిమిరాభిదృశ్య ఫాలార్ధచంద్ర**
**మెలఁత యిది కృష్ణపక్షాష్టమీ త్రియామ**
**దీని ప్రాపున నేల సాధింపకుండు?**
**విషమబాణుండు త్రిజగతీ విజయసిద్ధి**

అలక = ముంగురులను, తిమిర = చీకటిచే, అభిదృశ్య = చూడదగిన, ఫాల = లలాటమను, అర్ధచంద్ర = అర్ధచంద్రుడుకల, మెలత = దమయంతి, ఇది, కృష్ణపక్ష అష్టమీ = కృష్ణపక్ష అష్టమినాటి, త్రియామ = రాత్రి, విషమబాణుడు = మన్మథుడు, త్రిజగతీ విజయసిద్ధిన్, దీని ప్రాపున = ఈ దమయంతి సాయమున, ఏల సాధింపకుండు = ఎందుకు జయింపకుండును?

తా. దమయంతి ముంగురులను చీకటిచే చూడదగిన లలాటమను అర్ధచంద్రుడుకలది. ఇది కృష్ణపక్ష అష్టమినాటి రాత్రి మన్మథుడు ముల్లోకములను జయించడాన్ని ఈ దమయంతి సాయమున సాధింపగలడు.

**161 తే. హరుని కోపాగ్నిఁ బొగచూరి మరునిచాప**
**మసిత కేసర పరివేషమైననాఁడు**

**హృదయ మోహనశక్తి నీ యిందువదన**
**యంచిత భ్రూలతా రేఖకైన యుపమ**

మరుని చాపము = మన్మథుని ధనుస్సు, హరుని కోపాగ్నిన్ = శివుని కోపాగ్నిచే, పొగచూరి = పొగపట్టి, అసిత కేసర = నల్లని కింజల్కములుగల, పరివేషము = మండలము, ఐననాడు = అయినప్పుడు, హృదయ = మనసులను, మోహనశక్తి = మోహింపచేయు శక్తికల, ఈ ఇందువదన = ఈ చంద్రముఖి, అంచిత = ఒప్పుచున్న, భ్రూలతారేఖకున్ = కనుబొమలకు, ఐన ఉపమ = తగిన ఉపమానము

తా. మన్మథుని చాపము శివుని కోపాగ్నిచే పొగపట్టి నల్లని కింజల్కములుకల మండలమయినప్పుడే మనసులను మోహింపచేయు శక్తికల ఈ దమయంతియొక్క కనుబొమలకు తగిన ఉపమానమైనది

**162 తే. సాయకంబులు మూట ముజ్జగములు గెలువఁ**
**బాలుపెట్టి శేషించిన బాణయుగళి**
**మదనుఁ డేతద్దృగంభోజ పదమునందు**
**గౌరవంఁ బొప్ప పట్టంబు గట్టఁబోలు**

సాయకంబులు మూటన్ = మూడు బాణములచేతను, ముజ్జగములు = మూడు లోకములను, గెలువన్ = గెలుచుటకు, పాలుపెట్టి = భాగములిచ్చి, శేషించిన బాణయుగళిన్ = మిగిలిన రెండు బాణములను, మదనుడు = మన్మథుడు, ఏతత్ = ఈ దమయంతియొక్క, దృక్ అంభోజపదమునందు = నేత్రపద్మముల స్థానమునందు, గౌరవము ఒప్పన్ = మర్యాదపూర్వకముగా, పట్టంబున్ = పట్టాభిషేకమును, కట్టబోలు = చేసెను కాబోలు. (మన్మథుడు పంచబాణుడు)

తా. మన్మథుడు మూడుబాణములను మూడులోకములను గెలుచుటకు భాగములు పంచి మిగిలిన రెండు బాణములను ఈ దమయంతియొక్క నేత్రపద్మముల మహాసంస్థానమునందు మర్యాదపూర్వకముగా పట్టాభిషేకమును చేసెనుకాబోలు

**163 తే. అతివ ముష్టి ప్రతిగ్రహార్హావలగ్న**
**సందియము లేదు వలరాజు చాపయష్టి**
**యట్టుగాకున్నఁ గురియంగ నెట్టు నేర్చెఁ**
**బ్రకృతిశాత కటాక్ష నారాచవృష్టి**

**ముష్టి** = పిడికిలిచే, ప్రతిగ్రహ = పట్టుకొనుటకు, అర్హ = తగిన, అవలగ్న = నడుముగల, అతివ = దమయంతి, వలరాజు చాపయష్టి = మన్మథుని చాపమే, సందియము లేదు, అట్టు కాకున్నన్, ప్రకృతి = స్వభావముచేత, శాత = వాడియైన, కటాక్ష = క్రీగంటి చూపులనే, నారాచ = బాణములయొక్క, వృష్టి = వర్షమును, కురియంగన్ = వర్షించుటకు, ఎట్టు నేర్చె?

తా. పిడికిలితో పట్టుకోడానికి తగిన నడుముగల దమయంతి మన్మథుని చాపమే అవడంలో సందేహము లేదు. అలా కాకపోతే స్వభావముచేత వాడియైన క్రీగంటిచూపులనే బాణాల వర్షాన్ని కురిపించడానికి ఎలా నేర్చుకుంది?

**164 క. చలదింద్రనీలగోళా**
**మల కోమల తార తార మండలములు ప**
**క్ష్మలము లుపాంతశ్వేతం**
**బులు చపలము లౌర మెఱుగుఁబోడి నయనముల్**

ఔర = ఆహా, పక్ష్మలములు = దట్టమైన కనుఱెప్పలు కలవియు, ఉపాంత శ్వేతంబులు = ప్రాంతములందు తెల్లదనముకలవియు, చపలములు = చంచలములైనవియు, మెఱుగుబోడి = దమయంతియొక్క, నయనముల్ = కన్నులు, చలత్ = చలించుచున్న, ఇంద్రనీలగోళ = ఇంద్రనీలమణి గోళములవలె, అమల = స్వచ్ఛమైనవి, కోమల = మృదువైనవి, తార = స్థూలములైనవి, తారమండలములు = గుండ్రని నల్లని గ్రుడ్లు కలవి

తా. ఆహా! దట్టమైన కనురెప్పలుకలవియు, ప్రాంతములందు తెల్లదనము కలవియు, చంచలములైనవియునైన దమయంతి యొక్క నేత్రములు చలించుచున్న ఇంద్రనీలమణి గోళములవలె స్వచ్ఛమైనవి, మృదువైనవి, స్థూలములైనవి, గుండ్రని నల్లని గ్రుడ్లు కలవి.

**165 మ. దళదిందీవర కాంతిఁ బంచమ దళత్వక్పాటనానంతరో**
**జ్జ్వల రంభాతరు గర్భ సంపుట లసచ్ఛాయా కలాపంబుతోఁ**
**గలయంగూర్చి చతుర్ముఖుం డొనరిచెం గాబోలు నాకర్ణ శ**
**ష్కులికాపాంగములైన యీ చిగురుటాకుంబోడి నేత్రాబ్జముల్**

చతుర్ముఖుడు = బ్రహ్మ, ఆకర్ణశష్కులికాపాంగములు = కర్ణాంతముల వరకు వ్యాపించినవైన, ఈ చిగురుటాకుంబోడి = ఈ దమయంతియొక్క, నేత్రాబ్జముల్ = నేత్రపద్మములను, దళత్ ఇందీవర కాంతిన్ = వికసించిన నల్లకలువల కాంతిని, పంచమ = అయిదారు, దళత్వక్ = ఆకులపట్టలను, పాటన = ఒలిచివేసిన, అనంతర = పిమ్మట, ఉజ్జ్వల = ప్రకాశించుచున్న,

రంభాతరుగర్భ = అరటిచెట్టు లోపలిభాగమనెడి, సంపుట = భరణిలో, లసత్ = ఒప్పుచున్న, ఛాయా = కాంతియొక్క, కలాపంబుతోన్ = సమూహములో, కలయన్ కూర్చి = నిండుగా ఉంచి, ఒనరించెం కాబోలు = చేసినాడు కాబోలు

తా. బ్రహ్మ కర్ణాంతములవరకు వ్యాపించినవైన ఈ దమయంతియొక్క నేత్రపద్మములను వికసించిన నల్లకలువల కాంతిని అయిదారు ఆకులపట్టలను ఒలిచివేసిన పిమ్మట ప్రకాశించుచున్న అరటిచెట్టు లోపలి భాగమనెడి భరణిలో ఒప్పుచున్న కాంతియొక్క సమూహములో నిండుగా ఉంచి చేసినాడు కాబోలు

**166 చ. కలువలనుం జకోరములఁ గారుమెఱుంగుల గండుమీల వె**
**న్నెలలను దమ్మిరేకులను నిర్మల మౌక్తిక రత్నశుక్తులం**
**దలఁచి పయోజగర్భుఁడు సుధారసధారలు రెంటిలో విసం**
**బులు చిలికించి చేసెనొకొ పొల్పెసలారఁగ దీని నేత్రముల్**

పయోజగర్భుడు = పద్మగర్భుడైన బ్రహ్మ, కలువలనున్, చకోరములన్, కారు మెఱుంగులన్ = వర్షకాలమందలి మెఱుపుతీగలను, గండుమీలన్ = పెద్ద చేపలను, వెన్నెలలను, దమ్మిరేకులను = పద్మపు రేకులను, నిర్మల = స్వచ్ఛమైన, మౌక్తిక రత్న శుక్తులన్ = ముత్యపుచిప్పలను, తలచి = తలచుకొని, రెంటిలోన్ = రెండు నేత్రములలోను, సుధారస ధారలు = అమృత ధారలు, విసంబులు = విషములు, చిలికించి = చల్లి, పొల్పు = అందము, ఎసలారంగన్ = ఒప్పునట్లుగా, దీని = ఈ దమయంతియొక్క, నేత్రముల్ = కన్నులను, చేసెనొకొ = చేసినాడేమో!

తా. బ్రహ్మ కలువలను, చకోరములను, మెఱుపుతీగలను, గండుమీలను, వెన్నెలలను, పద్మపు ఱేకులను, స్వచ్ఛమైన ముత్యపు చిప్పలను సేకరించుకొని రెండు నేత్రములలోను అమృతధారలను, విషమును చల్లి అందము ఒప్పునట్లుగా ఈ దమయంతి నేత్రములను చేసినాడేమో! (చూచుటకు ఆకర్షణీయముగానున్నా ప్రేమికులను బాధించుచున్నవి)

**167 తే. శ్రవణపుట కూప వినిపాత సాధ్వసమున**
**నిగిడి యవ్వలి కటుపోక నిల్చెఁగాక**
**యధిక చపలస్వభావంబులైనయట్టి**
**దీని కన్నులు దలచుట్టు దిరిగి రావె**

శ్రవణ పుట = కర్ణపుటములనెడు, కూప = నూతులందు, వినిపాత = పడుదుమేమోనని, సాధ్వసమునన్ = భయముచేత, అవ్వలికిన్ = బయటకు, అటుపోక = అటు వెళ్ళక, నిల్చెగాక = నిలిచెనే కాని, అధిక చపల స్వభావంబులు, ఐనయట్టి, దీని = ఈ దమయంతియొక్క, కన్నులు, నిగిడి = ముందుకు జరిగి, తలచుట్టున్, తిరిగి రావె = తిరిగిరాకపోనా?

తా. కర్ణపుటములనెడు నూతులందు పడిపోతామేమోనని భయంచేత బయటకు వెళ్లక నిలిచేయి కాని అధిక చపల స్వభావములుకల ఈ దమయంతి నేత్రములు ముందుకు జరిగి తలనుచుట్టి తిరిగిరాకపోనా?

**168 క. కేదారములో శిశిర**
**ప్రాదుర్భావమునఁ జొచ్చి పడసిన యురు పు**
**ణ్యోదయమున నొకొ యీ శా**
**తోదరికిం గన్నులగుచు నున్నవి దమ్ముల్**

కేదారములోన్ = సరస్సులో, శిశిర ప్రాదుర్భావమునన్ = శిశిరఋతువు ప్రారంభమునందు, చొచ్చి = ప్రవేశించి, పడసిన = పొందిన, ఉరు = గొప్పదైన, పుణ్య ఉదయమునన్ ఒకొ = పుణ్యము కలుగుటవలననేమో, తమ్ముల్ = పద్మములు, ఈ శాతోదరికిన్ = ఈ దమయంతికి, కన్నులు అగుచును ఉన్నవి (అలంకారము – ఉత్ప్రేక్ష)

తా. శిశిర ప్రారంభములో సరస్సులో ప్రవేశించి చేసిన తపస్సుచే పొందిన గొప్ప పుణ్యము కలుగుటవల్లనేమో పద్మములు ఈ దమయంతికి కన్నులగుచున్నవి

**169 తే. త్రిభువన న్యస్త సాయక త్రితయుఁడైన**
**మరుని తిలపుష్ప తూణ మీ మగువ ముక్కు**
**మానిత శ్వాస నవ సౌరభానుమేయ**
**పుష్పమయ బాణయుగళాభి పూర్ణమగుట**

మానిత = ఒప్పుచున్న, శ్వాస, నవ = క్రొత్తదగు, సౌరభ = పరిమళముచే, అనుమేయ = ఊహింపదగిన, పుష్పమయ, బాణ యుగళ, అభిపూర్ణము = నిండినది, అగుటన్ = అగుటచే, ఈ మగువ ముక్కు, త్రిభువన = మూడులోకములయందు, న్యస్త = ఉంచబడిన, సాయకత్రితయుడైన = బాణత్రయముకలవాడైన, మరుని = మన్మథునియొక్క, తిలపుష్ప = నువ్వు పువ్వనెడి, తూణము = అమ్ములపొది, ఈ మగువ ముక్కు.

తా. ఒప్పుచున్న శ్వాస పరిమళముచే ఊహింపదగిన పుష్పమయ బాణయుగళముతో నిండినదగుటచే ఈ దమయంతి

ముక్కు మూడులోకములందు ఉంచబడిన బాణత్రయముకలవాడైన మన్మథునియొక్క నువ్వుపువ్వనెడి అమ్ములపొదియే

**170 సీ. నిబిడశైశవ యౌవనీయ సంధ్యావేళ**
**యాననచంద్ర బింబామృతంబు**
**లపనామృతాంశు బాలప్రభా జాలంబు**
**బంధుజీవనలతా బాంధవంబు**
**పరిపక్వ బింబికాఫల విడంబన ముద్ర**
**విద్రుమ ద్రుమలతా వినిమయంబు**
**మదననారాచ కోమల హింగుళచ్ఛాయ**
**యస్మన్మనోనురాగాంకురంబు**
**తే. మహిత లావణ్యగుణ జాయమాన బహుళ**
**మాధురీ చిత్ర శోభా సమన్వితంబు**
**ప్రార్థనాకల్ప పాదప ప్రాజ్యఫలము**
**తియ్యపూఁదేనియల క్రోవి దీని మోవి**

దీని మోవి = ఈ దమయంతి పెదవి, నిబిడ = సాంద్రమైన, శైశవ యౌవనీయ = బాల్య యౌవనములకుచెందిన, సంధ్యావేళ = సంధ్యాసమయము, ఆనన చంద్రబింబ = ముఖ చంద్రబింబమువలన కలిగిన, అమృతంబు = అమృతరసము, లపన = ముఖమనెడి, అమృతాంశు = చంద్రబింబముయొక్క, బాలప్రభా జాలంబు = లేత కాంతిసమూహము, బంధుజీవన లతా బాంధవంబు = మంకెనతీగకు చుట్టము, పరిపక్వ = పండిన, బింబికాఫల = దొండపండును, విడంబన ముద్ర = అనుకరించుచున్న స్వరూపము. విద్రుమ ద్రుమలతా వినిమయంబు = పగడపు తీగెకు సమానము, మదన నారాచ = మన్మథుని బాణములయొక్క, కోమల = మృదువైన, హింగుళచ్ఛాయ = ఎఱ్ఱనిఛాయ, అస్మత్ = నాయొక్క, మన: = మనస్సులోనుండు, అనురాగాంకురంబు = ప్రేమ మొలక, మహిత = గొప్ప, లావణ్యగుణ = సౌందర్యగుణమువలన, జాయమాన = పుట్టిన, బహుళ= విస్తారమైన, మాధురీ = చక్కదనముయొక్క, చిత్ర = ఆశ్చర్యకరమైన, శోభా = కాంతితో, సమన్వితంబు = కూడుకొన్నది, ప్రార్థనా = కోరుకొనుటకు, కల్పపాదప = కల్పవృక్షముయొక్క, ప్రాజ్య ఫలము = గొప్పదైన ఫలము, తియ్య పూదేనియల = తీయనైన మకరందమునకు, క్రోవి = నిలయము

తా. ఈ దమయంతి మోవి సాంద్రమైన బాల్య యౌవన సంబంధమైన సంధ్యాసమయము, ముఖచంద్రబింబమువలన కలిగిన అమృతరసము, ముఖమనెడి చంద్రబింబముయొక్క లేతకాంతి సమూహము, మంకెనతీగకు చుట్టము, పండిన దొండపండును అనుకరించుచున్న స్వరూపము, పగడపు తీగెకు సమానము, మన్మథుని బాణములయొక్క మృదువైన ఎఱ్ఱని ఛాయ, నాయొక్క మనసునందలి ప్రేమ మొలక, గొప్ప సౌందర్యగుణమువలన పుట్టిన విస్తారమైన చక్కదనముయొక్క ఆశ్చర్యకరమైన కాంతితో కూడుకొన్నది. కోరుకొనుటకు కల్పవృక్షముయొక్క గొప్పదైన ఫలము, తీయనైన మకరందమునకు నిలయము

**171 ఉ. భాసురమధ్యరేఖ కిరుపక్కియలందును మోవి కించి దు**
**చ్ఛ్వాసము నొందియున్నయది చంద్రనిభాస్యకు నేనొకప్డు ని**
**ద్రాసమయంబులం గలలరాకల నీ కలకంఠిఁ గూడి వ**
**క్త్రాసవ మాని యాని దశనాంకుర మొత్తఁగఁ దారసోద్ధతిన్**

నేను, ఒకప్డు, నిద్రాసమయంబులన్, కలల రాకలన్ = కలలు రావడంతో, అ కలకంఠిన్ కూడి = ఈ దమయంతితో కలిసి, వక్త్రాసవము = అధరామృతము, ఆని ఆని = త్రాగి త్రాగి, రసోద్ధతిన్ = రసాతిశయముచే, దశనాంకురము = దంతముయొక్క కొనను, ఒత్తగన్ = నొక్కగా (దంతక్షతము), చంద్రనిభాస్యకున్ = చంద్రముఖికి, భాసుర మధ్య రేఖకున్ = క్రిందిపెదవి మధ్య ప్రకాశించు రేఖకు, ఇరుపక్కియలందును = రెండు ప్రక్కలయందును, మోవి = పెదవి, కించిత్ ఉచ్ఛ్వాసము = కొంచెము ఉబ్బియుండుటను, ఒంది ఉన్నయది = పొంది ఉన్నది

తా. నేను ఒకప్పుడు నిద్రాసమయంలో కల రావడంతో ఈదమయంతిలో కలిసి అధరామృతము త్రాగిత్రాగి రసాతిశయముతో దంతముయొక్క కొనను నొక్కగా చంద్రముఖియగు దమయంతి క్రింది పెదవి మధ్య ప్రకాశించు రేఖకు రెండు ప్రక్కలయందును పెదవి కొంచెము ఉబ్బియుండుటను పొందియున్నది.

**172 ఉ. ఈ యెలఁదీఁగెఁబోడి కృపయేర్పడఁగాఁ దన లేఁత నవ్వులో**
**వేయవ పా లపాంగముల వెంటఁ బ్రసాదము చేసిన న్నిశా**
**నాయకుఁ డెంతయుం బ్రియమునం గయికోఁడొకొ నాల్గుదిక్కులం**
**బ్రాయము చంద్రిక ల్వడిగఁ బాఱగ వైచుచు నప్పదార్థమున్**

ఈ ఎలతీగెబోడి = ఈ లేతతీగవంటి మేనుగల దమయంతి, కృప = దయ, ఏర్పడగాన్ = స్పష్టమగునట్లుగా, తన లేతనవ్వులోన్ = తన చిఱునవ్వులో, వేయవ పాలు = వెయ్యోవంతు, అపాంగములవెంటన్ = క్రీగంటి చూపులమూలమున, ప్రసాదము చేసిననన్ = ఇచ్చినచో, నిశానాయకుడు = చంద్రుడు, ప్రాయపు చంద్రికల్ = విస్తారమైన వెన్నెలలను, నాల్గుదిక్కులన్, వడిగన్ = శీఘ్రముగా, పాఱగన్ వైచుచున్ = పారవేయుచు, ఆ పదార్థమున్ = ఆ దమయంతి చిఱునవ్వును, ఎంతయున్ = మిక్కిలి, ప్రియమునన్ = ప్రీతితో, కయికోడొకొ = స్వీకరింపడా?

తా. ఈ దమయంతి దయతో స్పష్టముగా తన చిఱునవ్వులో వెయ్యోవంతును క్రీగంటి చూపులమూలమున ఇచ్చినచో చంద్రుడు తన వెన్నెలలను నాల్లుదిక్కులయందును వేగముగా పాఱవైచి ఆ దమయంతి చిఱునవ్వును ప్రీతితో స్వీకరించును.

**173 తే. దాడిమీ పక్వ ఫలబీజ తతుల గెలిచి**
**దంత కురువింద పంక్తి యీ తరుణికమరు**
**సాంధ్య శీతాంశుమండల స్యందమాన**
**నవరససుధారసబిందు బృందంబుఁబోలె**

దంతకురువిందపంక్తి = కెంపులవంటి దంతములవరుస, దాడిమీ పక్వఫలబీజతతులన్ = దానిమ్మ పండ్ల గింజల సమూహములను, గెలిచి = జయించి, సాంధ్య = సంధ్యాసమయమందు, శీతాంశుమండల = చంద్రమండలమునుండి, స్యందమాన = స్రవించుచున్న, నవ = కొత్తదయిన, సుధారస బిందు = అమృత బిందువులయొక్క, బృందంబుబోలెన్ = సమూహమువలె, ఈ తరుణికిన్ = ఈదమయంతికి, అమరున్ = ఒప్పును.

తా. ఈ దమయంతియొక్క కెంపులవంటి దంతములవరుస దానిమ్మపండ్ల గింజలను గెలిచి, సంధ్యాసమయమందు చంద్రమండలమునుండి స్రవించుచున్న క్రొత్త అమృతబిందువులయొక్క సమూహమువలె ఒప్పుచుండెను.

**174 తే. మాటి కుద్వేగ రాగాది మార్జనమున**
**నతి విశుద్ధంబులయిన దంతాంకురములు**
**విమల ముక్తావళీ సమానములు దాల్చు**
**నీ సరోజాక్షి ముఖపద్మ కేసరములు**

మాటికిన్ = మాటిమాటికి, ఉద్వేగ = పోకయొక్క , రాగాది = ఎఱుపు మొదలైనవాటిని, మార్జనమున = కడుగుటచే, అతివిశుద్ధంబులయిన = మిక్కిలి శుభ్రములయిన, దంతాంకురములు = దంతములు, విమల = స్వచ్ఛమైన, ముక్తాళీ = ముత్యాలహారముతో, సమానములు, ముఖపద్మ, కేసరములు = కింజల్కములవలెనున్నవానిని, ఈ సరోజాక్షి = ఈ దమయంతి, తాల్చున్ = ధరించును

తా. తాంబూలముయొక్క ఎఱుపు మొదలైనవాటిని కడుగుటచే మిక్కిలి శుభ్రములైన దమయంతి దంతములు స్వచ్ఛమైన ముత్యాలహారముతో సమానములై ముఖపద్మ కింజల్కములవలె నున్నవి

**175 తే. వరశిరీషప్రసూన కేసర శిఖాగ్ర**
**పేలవంబుగ మేను గల్పించి ధాత**
**కలిత సుకుమార సర్గ ప్రకర్షుఁడగుచు**
**నిలిపె మార్దవ మీ యింతి పల్కులందు**

ధాత = బ్రహ్మ, వర = శ్రేష్ఠములైన, శిరీషప్రసూన కేసర = దిరిసెనపువ్వు కింజల్కములయొక్క, శిఖాగ్ర = చిట్టచివరలవలె, పేలవంబుగన్ = మృదువుగ, మేను = దమయంతి శరీరమును, కల్పించి = నిర్మించి, కలిత = ఒప్పుచున్న, సుకుమార = మృదువైన, సర్గ = సృష్టిచేకలిగిన, ప్రకర్షుడు = అతిశయముకలవాడు, అగుచున్, ఈ ఇంతి పల్కులందున్ = ఈ దమయంతి పల్కులందు, మార్దవము = మృదుత్వమును, నిలిపెన్ = స్థాపించెను.

తా. బ్రహ్మ శ్రేష్ఠములైన దిరిసెనపువ్వు కింజల్కములయొక్క చిట్టచివరలవలె మృదువుగ శరీరమును కల్పించి, మృదువుగా సృష్టించకలిగిన అతిశయముకలవాడగుచు ఈ దమయంతిమాటలందు మృదుత్వమును స్థాపించెను

**176 ఉ. పచ్చని వృక్షవాటికల పండుల బిక్ష భుజించి నిచ్చలున్**
**వచ్చి పఠింపఁబోలుఁ బ్రతివారముఁ గోకిల బ్రహ్మచారి పెం**
**పచ్చుపడంగ నీ సరసిజాక్షి ముఖ ద్విజరాజునొద్ద వా**
**విచ్చి లసత్ప్రసూన శర వేదరహస్యములైన పల్కులన్**

కోకిల బ్రహ్మచారి = కోకిలయనెడి బ్రహ్మచారి, ప్రతివారమున్ = ప్రతిదినమును, పచ్చని వృక్షవాటికల = పచ్చని వృక్షపంక్తులయందు, పండుల భిక్ష భుజించి = పండులనే బిక్షను తిని, నిచ్చలున్ = నిత్యమును, వచ్చి, పెంపు = గొప్పతనము, అచ్చుపడంగన్ = స్పష్టమగునట్లుగా, ఈ సరసీజాక్షి = ఈ దమయంతియొక్క, ముఖద్విజరాజునొద్ద = ముఖమనెడి బ్రాహ్మణోత్తమునిదగ్గర, వా విచ్చి = నోరు విప్పి (స్పష్టముగా), లసత్ = ఒప్పుచున్న, ప్రసూన శర = మన్మథుని

యొక్క, వేద రహస్యములైన, పల్కులన్ , పఠింపబోలు = చదివింది కాబోలు.

తా. కోకిలయనెడి బ్రహ్మచారి ప్రతిరోజు పచ్చని వృక్షపంక్తులయందు వాటి పండ్లు అనే బిక్షను తిని నిత్యమును వచ్చి గొప్పగా, స్పష్టమగునట్లుగా ఈ దమయంతియొక్క ముఖమును బ్రాహ్మణోత్తమునిదగ్గర స్పష్టముగా మన్మథుని యొక్క వేదరహస్యములైన పల్కులను చదివిందికాబోలు

**177 తే. దీని కంఠంబునందు వాగ్దేవియుండి**
**వీణ మొరయించుచున్నది వీను లలర**
**నదియ ముఖమున వాగ్భావమాశ్రయించి**
**యమృత ధారాప్రవాహ రూపముగ నిల్చె**

వాగ్దేవి = సరస్వతి, దీని కంఠంబునందు, ఉండి, వీనులు అలరన్ = చెవులకింపుగా, వీణ మొరయించుచున్నది = వీణ మ్రోయించుచున్నది, అదియ = ఆ వీణా ధ్వనియే, ముఖమున, వాగ్భావమున్ = వాక్ స్వరూపమును, ఆశ్రయించి = పొంది, అమృత ధారా ప్రవాహ రూపముగ, నిల్చె = నిలిచిపోయెను

తా. సరస్వతి ఈ దమయంతి కంఠమునందుండి చెవులకింపుగా వీణ మ్రోయించుచున్నది. ఆ వీణాధ్వనియే దమయంతి ముఖమున వాక్ స్వరూపమును పొంది అమృతధారాప్రవాహరూపముగ నిలిచిపోయెను

**178 తే. అబ్జగర్భుండు సుషమా సమాప్తియందు**
**నెత్తి చూడంగఁబోలు నీ యింతివదన**
**మంగుళీ యంత్రణక్రియాభంగి నమరెఁ**
**జిబుకమున నుండు నా నిమ్నసీమసంధి**

అబ్జగర్భుండు = బ్రహ్మ, సుషమా సమాప్తియందున్ = గొప్ప శోభానిర్మాణముయొక్క సమాప్తియందు, ఈ ఇంతి వదనము, ఎత్తి = పైకెత్తి, చూడంగన్ పోలు = చూసియుండెను కాబోలు, చిబుకమునన్ = గెడ్డమునందు, ఉండు = ఉన్నటువంటి, ఆ నిమ్నసీమసంధి = లోతుగానున్న ప్రదేశముయొక్క మధ్యభాగము, అంగుళీ = వ్రేలియొక్క, యంత్రణ క్రియాభంగి = ముద్రవేసినట్లు, అమరెన్ = ఒప్పెను.

తా. బ్రహ్మ గొప్ప శోభా నిర్మాణ సమాప్తియందు ఈ దమయంతి ముఖమును వేలితో పైకెత్తి చూసినాడు కాబోలు. కావుననే గెడ్డమునందున్నటువంటి లోతుగానున్న ప్రదేశ మధ్యభాగమున వ్రేలియొక్క ముద్రవేసినట్లు ఒప్పినది.

**179 క. కమలాధిరాజ్యపదవీ**
**సమధిష్ఠిత మీ వధూటి చారుముఖాంభో**
**జము మఱియటు గాదననే**
**నిమిత్తమున సేవఁజేయు నేత్రాంబుజముల్**

ఈ వధూటి = ఈ దమయంతి, చారుముఖ అంభోజము = సుందర ముఖపద్మము, కమల అధిరాజ్య = పద్మముల సామ్రాజ్యముయొక్క పదవీ = స్థానమునందు, సమధిష్ఠితము = పట్టాభిషిక్తమయినది, మఱి అటు కాదనన్, నేత్రాంబుజములు = నేత్రపద్మములు, ఏనిమిత్తమున = ఏ కారణమున, సేవ చేయున్

తా. ఈ దమయంతి సుందర ముఖపద్మము పద్మసామ్రాజ్యమునకు పట్టాభిషిక్తమయినది. మఱి అట్లు కాదంటే నేత్ర పద్మములు ఎందుకు సేవచేస్తున్నాయి?

**180 చ. కమలము తండ్రియైన యుదకంబు గళానిధి మిత్రమైన య**
**ద్దమును నహర్నిశంబు నుపధారణ సేసి వహించెనో సుమీ**
**క్రమమున నీ వధూమణి ముఖ ప్రతిబింబ విలాస సంపదన్**
**సముచిత లీల యాచితక చారు విభూషణరాజి కైవడిన్**

కమలము = పద్మము, తండ్రియైన, ఉదకంబున్ = నీరును, కళానిధి = చంద్రుడు, మిత్రమైన, అద్దమును, అహర్నిశంబు = పగలు రాత్రియును, ఉపధారణ చేసి = ఆశ్రయించి, క్రమమునన్, ఈ వధూమణి = ఈ దమయంతియొక్క, ముఖ ప్రతిబింబ విలాస సంపదన్, సముచితలీలన్ = తగినరీతిగా, యాచితిక = ప్రార్ధనచే లభ్యమైన, చారు = మనోహరమైన, విభూషణరాజి కైవడిన్ = అలంకారముల పంక్తివలె, వహించెనో సుమీ = తాల్చిందేమో కదా!

తా. పద్మము తండ్రియైన ఉదకమును, చంద్రుడు మిత్రమైన అద్దమును రాత్రిపగలు ఆశ్రయించి ఈ దమయంతియొక్క ముఖ ప్రతిబింబ విలాససంపదను తగినరీతిగా యాచించి లభ్యమైన మనోహరమైన అలంకార పంక్తివలె ధరించెనేమోకదా!

**181 సీ. రాహుదంష్ట్రాంకుర క్రకచ ఘాతంబుల**
**నొక్కొక్కమరి నొప్పి నొందకున్నఁ**
**పరివేష మిషమైన పాశబంధంబున**

బహువారములు గట్టువడకయున్నఁ
ప్రతిమాసమును గుహూరాత్రివేళలయందు
నత్యంత నాశంబు నందకున్నఁ
బలవత్కళంక కజ్జలపంక సంకర
స్ఫూర్తిమాలిన్యంబుఁ బొరయకున్నఁ
తే. గాక సరిపోలఁ జాలునే కమలవైరి
యనధిగత దోషమైన యీ యతివమొగము
మధుర బింబాధరోష్ఠంబు మాఱుగాఁగ
అమృతపూరంబు గల్గినయంతమాత్ర

రాహుదంష్ట్రాంకుర క్రకచ = రాహువుయొక్క అంపమువంటి కోరపండ్లయొక్క, ఘాతంబులన్ = దెబ్బలచే, ఒక్కొక్కమరిన్ = ఒక్కొక్కసారి, నొప్పిని ఒందకున్నన్, పరివేషమిషమైన = వలయాకార రేఖ నెపమైన, పాశబంధంబున = త్రాటిచే, బహు వారములు = అనేక పర్యాయములు, కట్టువడకయున్న = బంధింప బడకయున్నచో, ప్రతి మాసమును, కుహూరాత్రివేళలయందు = అమావాస్యరాత్రులయందు, అత్యంత = మిక్కిలి, నాశంబును = నాశమును, అందకున్నన్ = పొందకున్నచో, బలవత్ = అధికమైన, కళంక కజ్జల పంక = కాటుకబురదవంటి మచ్చచే, సంకర = కలిసి, స్ఫూర్తి = స్పష్టతపొందిన, మాలిన్యంబున్ = దోషమును, పొరయకున్న = పొందకపోయినచో, కాక = పై దోషములు లేకపోకుండగా, కమలవైరి = చంద్రుడు, అనధిగత దోషమైన = పొందబడని దోషముకలదైన, ఈ అతివ మొగము = ఈ దమయంతి ముఖమును, మధుర బింబాధ రోష్ఠంబు = తియ్యని దొండపండువంటి అధరోష్ఠమునకు, మాఱుగాగ = బదులుగా, అమృతపూరంబు = అమృతరసమును, కల్గినయంత, మాత్ర = మాత్రమున, సరిపోలన్ జాలునే = సామ్యము పొందగల్గునా?

తా. రాహువుయొక్క అంపమువంటి పండ్లయొక్క దెబ్బలచే ఒక్కొక్కసారి నొప్పిని పొందకున్నచో, వలయాకార రేఖ నెపమైన త్రాటిచే అనేక పర్యాయములు బంధింపబడకున్నచో, ప్రతి నెలయందు అమావాస్యరాత్రులయందు మిక్కిలి నాశమును పొందకున్నచో, అధికమైన కాటుకబురదవంటి మచ్చతో కలిసి స్పష్టమైన దోషాన్ని పొందకున్నచో, ఈ పై దోషములు లేకపోయినట్లయితే చంద్రుడు ఏ దోషమును లేని ఈ దమయంతి ముఖమును తియ్యని దొండపండువంటి అధరోష్ఠమునకు మారుగా అమృతరసమును కల్గినంతమాత్రమున సరిపోతానంటే కుదురుతుందా?

**182** సీ. సకల శాస్త్రౌఘ నిష్యంద ధారాసార
నవసుధారస వాఃప్రణాళులొక్కొ
రతిపంచబాణ దైవతయుగ్మ పూజనా
వసర నైవేద్య పూపంబులొక్కొ
ధన్యరేఖాంచితై తద్భ్రూలతావేణు
శాఖాశిఖత్వగంశంబులొక్కొ
బలభేది ముఖ చతుర్బర్హి ర్ముఖోన్మనః
ప్రతిబంధ వాగురా పాశమొక్కొ
తే యధిక దీర్ఘ కటాక్ష బాణాగ్ర కషణ
శాణచక్ర ప్రసాదానుసార సరళ
భర్మ తాటంక నేపథ్య భాసురములు
దీని వీనులు శ్రీకారమానదములు

అధిక = మిక్కిలి, దీర్ఘ = నిడుపైన, కటాక్ష = క్రీగంటి చూపులనెడి, బాణాగ్ర = బాణముల కొనలను, కషణ = సానపెట్టుటకు, శాణచక్ర = సానపెట్టు చక్రముయొక్క, ప్రసాద = నైర్మల్యమును, అనుసార = అనుసరించుచున్నవియు, సరళ = సుందరములైన, భర్మ తాటంక = బంగారు చెవికమ్మలనెడి, నేపథ్య = అలంకారములచేత, భాసురములు = ప్రకాశించుచున్నవియును, శ్రీకార = శ్రీయను అక్షరముయొక్క, మానదములు = గర్వమును పోగొట్టునవియునునైన, దీని వీనులు = ఈ దమయంతి చెవులు, సకల శాస్త్రౌఘ = సమస్త శాస్త్రముల సమూహములనుండి, నిష్యంద = కారుచున్న, ధారాసార = ధారల ప్రవాహమువలె, నవ = నూతనమైన, సుధారస = అమృతమనెడి, వాః = నీటియొక్క, ప్రణాళులొక్కొ = నిర్గమనద్వారములేమో!, రతి పంచబాణ = రతీమన్మథులనెడి, దైవతయుగ్మ = దేవతలజంటయొక్క, పూజనా = పూజయందు, అవసర నైవేద్య = ఆ పూజకుసరిపడు నైవేద్యమైన, పూపంబులొక్కొ = అప్పములేమో!, ధన్య = శ్రేష్ఠమైన, రేఖా =రేఖలచే, అంచిత = ఒప్పుచున్న, ఏతత్ = ఈ, భ్రూలతావేణు = కనుబొమలనెడి వెదురుయొక్క, శాఖా = కొమ్మలయొక్క, శిఖా = కొనలయందున్న, త్వగంశంబులొక్కొ = చర్మములేమో!, బలభేది ముఖ

= ఇంద్రుడు మొదలుగాగల, చతుర్బర్హిర్ముఖ = నలుగురు దిక్పాలురయొక్క, ఉన్మనః = మనస్సులను, ప్రతిబంధ = బంధించెడి, వాగురాపాశమొక్కొ = వలత్రాడేమో!

తా. మిక్కిలి నిడుపైన క్రీగంటిచూపులనెడి బాణములకొనలను సానపెట్టుటకు సానపెట్టు చక్రముయొక్క నైర్మల్యమును అనుసరించుచున్నవియును, సుందరములైన బంగారు చెవికమ్మలనెడి అలంకారములచేత ప్రకాశించుచున్నవియును, శ్రీయను అక్షరముయొక్క గర్వమును పోగొట్టునవియునైన ఈ దమయంతి చెవులు సమస్త శాస్త్రముల సమూహములనుండి కారుచున్న ధారల ప్రవాహమువలె నూతనమైన అమృతమనెడి నీటియొక్క నిర్గమనద్వారములేమో!, రతీమన్మథులనెడి దేవతలజంటయొక్క పూజయందు నైవేద్యమైన అప్పములేమో!, శ్రేష్ఠమైన రేఖలచే ఒప్పుచున్న ఈ కనుబొమలనెడి వెదురుయొక్క కొమ్మలకొనలయందున్న చర్మములేమో!, ఇంద్రుడు మొదలుగాగల నలుగురు దిక్పాలకులయొక్క మనస్సులను బంధించెడి వలత్రాడేమో!

**183 తే. పదియునెనిమిది విద్య లీ పద్మనయన**
**శ్రవణముల రెంట నర్ధమర్ధము గ్రహించె**
**నంతరుత్తీర్ణ గంభీర హార లేఖ**
**యదికదా వీనులందుఁ దొమ్మిదవ లెక్క**

ఈ పద్మనయన, పదియునెనిమిది విద్యలు, శ్రవణముల రెంటన్ = రెండుచెవులతోను, అర్ధమర్ధమ గ్రహించె = సగము సగము గ్రహించెను, అంత: = లోపలినుండి, ఉత్తీర్ణ = వ్యాపించినదియు, గంభీర = లోతైనదియు, హార = మనోహరమైనదియు, లేఖ = గీత, అదికదా = ఆ గీతయేకదా!, వీనులందున్ = చెవులందు, తొమ్మిదవ లెక్క = తొమ్మిదవ సంఖ్యను తెల్పు అంకెయయి యున్నది.

తా. ఈ దమయంతి పదునెనిమిది విద్యలను రెండు చెవులతోను సగము సగము (తొమ్మిది తొమ్మిది) గ్రహించెను. దానిని తెలుపుటకు లోపలినుండి వ్యాపించినదియును, లోతైనదియును, మనోహరమైనదియును గీత. ఆ గీతయేకదా చెవులందు తొమ్మిదవసంఖ్యను తెలుపు అంకెయయియున్నది.

**184 తే. అవటు శోభిత మాణవకాభిరామ**
**యంచితోర్ధ్వక, యాలింగ్యతాతిహృద్య**
**యద్భుతైక నిదాన, శోభాస్పదంబు,**
**కంబు బిబ్బోకవతి దీని కంఠలక్ష్మి**

దీని కంఠలక్ష్మి = ఈ దమయంతియొక్క కంఠశోభ, అవటు శోభిత = బ్రహ్మచారిచే శోభితముకాకపోయినను, మాణవకాభిరామ = బ్రహ్మచారిచే మనోహరమయినది, (అవటు = ముచ్చలిగుంటచే, శోభిత = ప్రకాశించుచున్నది, మాణవక = ముత్యాల హారముచే, అభిరామ = మనోహరమైనది), అంచిత = ఒప్పుచున్న, ఊర్ధ్వక = ఊర్ధ్వకమను వాద్యవిశేషము కలదైనను, ఆలింగ్యత = ఆలింగ్యమను వాద్యవిశేషముయొక్క ధర్మముచే, అతి హృద్య = మిక్కిలి మనోహరమైనది. (అంచిత = ఒప్పుచున్న, ఊర్ధ్వక = మీదిభాగములుకలదియు, ఆలింగ్యత = కౌగలించుకొనుటకు తగియుండుటచే, అతిహృద్య = మిక్కిలి మనోహరమైనది), అద్భుతైకనిదాన = అద్భుతములకు ముఖ్యస్థానము, శోభాస్పదంబు = కాంతికి చోటైనది, కంబు బిబ్బోకవతి = శంఖమువంటి విలాసముకలది

తా. ఈ దమయంతియొక్క కంఠము ముచ్చిలిగుంటచేతను, ముత్యాలహారములచేతను ప్రకాశించుచు, ఒప్పుచున్న ఊర్ధ్వభాగముకలిగి ఆలింగనయోగ్యమయి యుండుటచే మిక్కిలి మనోహరమయి, అద్భుతమునకు స్థానమయి, మిక్కిలి శోభకలదయి, శంఖమువంటి విలాసముకలదయి ఒప్పుచున్నది.

**185 క. కవితా గాన ప్రియవా**
**గ్వివరణ సీమావిభాగ విధిరేఖలు నా**
**ధవళాక్షి కంఠసీమం**
**బ్రవిమల రేఖాత్రయంబుఁ బ్రస్ఫుటమయ్యెన్**

ధవళాక్షి కంఠసీమన్ = తెల్లని కన్నులుకల దమయంతి కంఠ ప్రదేశమందు, ప్రవిమల రేఖాత్రయంబున్ = స్వచ్ఛమైన మూడు రేఖలును, కవితా = కవిత్వమునకును, గాన = సంగీతమునకును, ప్రియవాక్ = మధురవాక్యములకును, వివరణ సీమ = ప్రత్యేకముగా సరిహద్దులను, విభాగ = ఏర్పరచుటకయిన, విధిరేఖలు = బ్రహ్మగీసిన గీతలు, నాన్ = అనునట్లుగా, ప్రస్ఫుటము అయ్యెన్ = స్పష్టమయ్యెను.

తా. దమయంతియొక్క కంఠ ప్రదేశమందు స్వచ్ఛమైన మూడు రేఖలును కవిత్వమునకు, గానమునకు, మధుర వాక్యములకు ప్రత్యేకముగా సరిహద్దులను ఏర్పరచుటకయి బ్రహ్మగీసిని గీతలే అనునట్లుగా స్పష్టముగానున్నవి.

**186** **క. కాంతా బాహుద్వంద్వా**
**త్యంత పరాజయ సమాశ్రితాంభోదుర్గా**
**భ్యంతరములైన బిసముల**
**కంతర్నిర్వ్యథనకలన మది యెట్లొక్కో**

కాంతా = దమయంతియొక్క, బాహుద్వంద్వ = భుజముల జంటచే కలిగిన, అత్యంత = మిక్కిలి, పరాజయ = పరాభవముచే, సమాశ్రిత = ఆశ్రయింపబడిన, అంభోదుర్గ = జలదుర్గముయొక్క, అభ్యంతరములైన = మధ్యప్రదేశములుకలవైన, బిసములకు = తామరతూండ్లకు, అంతర్నిర్వ్యథనకలనము = లోపల దు:ఖములేకపోవుట, ఎట్లొక్కో = ఏలాగోకదా!

తా. దమయంతియొక్క భుజములజంటచే కలిగిన పరాభవముచే జలదుర్గములయొక్క మధ్యప్రదేశములను ఆశ్రయించిన తామరతూండ్లకు లోపల దు:ఖము లేకపోవుట ఎట్లోకదా!

**187** **క. తరుణి యతిలులిత పర్వ**
**స్మర పంచశరీ సమాన మహనీయ నఖాం**
**కుర మృదులాంగుళి విలస**
**త్కర పంకజయుగళి దీనిఁ దరమె నుతింపన్**

తరుణి = దమయంతి, అతిలులిత = మిక్కిలి నునుపుచేయబడిన, పర్వ = కణుపులుకలదియగు, స్మర = మన్మథునియొక్క, పంచశరీ = అయిదు బాణములతోను, సమాన = సమమయి, మహనీయ = ఒప్పుచున్న, నఖాంకుర = నఖాగ్రములుకల, మృదుల = మెత్తని, అంగుళి = వ్రేళ్ళుగల, విలసత్ = ప్రకాశించుచున్న, కరపంకజయుగళి = పద్మములవంటి రెండుచేతులూ కలది, దీనిన్ = ఈ దమయంతిని, నుతింపన్ = స్తుతించుటకు, తరమె = శక్యమా?

తా. మిక్కిలి నునుపుచేయబడిన కణుపులుకల మన్మథునియొక్క అయిదు బాణములతోను సమమయి ఒప్పుచున్న నఖాగ్రములుకల మెత్తని వ్రేళ్ళుకలిగి ప్రకాశించుచున్న పద్మములవంటి చేతులుకల ఈమెను స్తుతించుటకు శక్యమా?

**188** **తే. జలరుహానన దోర్లీల గెలువఁబోలుఁ**
**గేలిమై నీ మృణాళికా కిసలయములఁ**
**గాక యివియేల మిన్న కే కరణి మునుఁగుఁ**
**గీర్తిఁ బొలియఁగ బహుళ దుష్కీర్తియందు**

జలరుహానన = పద్మమువంటి ముఖముగల దమయంతియొక్క, దోర్లీల = బాహువిలాసము, కేలిమై = క్రీడగా, ఈ మృణాళికా కిసలయములన్ = ఈ తామరతూండ్ల చిగురులను, గెలువన్‌బోలున్ = గెలిచెను కాబోలు, కాక = కానిచో, ఇవి = తామరతూండ్లు, ఏల = ఎందుకు, మిన్నక = ఊరకనే, కీర్తి పొలియగన్ = కీర్తి నశించునట్లుగా , బహుళ = విస్తారమైన, దుష్కీర్తియందున్ = బురదయనెడి చెడుకీర్తియందు, ఏకరణిన్ మునుంగున్ = ఎందులకు మునుగును?

తా. దమయంతియొక్క బాహువిలాసము క్రీడగా ఈ తామరతూండ్లను గెలిచెను కాబోలు, కానిచో ఈ తామరతూండ్లు ఎందుకు ఊరకనే తమ కీర్తి నశించునట్లుగా విస్తారమైన దుష్కీర్తియందు మునుగుతాయి?

**189** **సీ. గంధవారణ కుంభ గౌరవ స్ఫురణంబు**
**కనక కుంభములకుఁ గల్గెనేని**
**లికుచ కోమలకాంతి లీలా విశేషంబు**
**చక్రవాకములందు జరిగెనేని**
**మాలూర సౌభాగ్య మహిమానుభావంబు**
**దాడిమీ ఫలములఁ దగిలెనేని**
**నసకలోన్మీలిత ప్రసవగుచ్ఛ చ్ఛాయ**
**యబ్జకోరకముల కబ్బెనేని**
**తే. గాని సరిఁజేయగారాదు వానివాని**
**హారి నిర్ఝర సలిల ధారావధౌత**
**కాంచనాచల శృంగభాగంబు లగుచు**
**రాజితములైన దీని వక్షోజములకు**

గంధవారణ = గంధజాతి ఏనుగు, కుంభ = కుంభస్థలముయొక్క, గౌరవ = గొప్పతనముయొక్క, స్ఫురణంబు = అతిశయము, కనక కుంభములకున్ = బంగారు కలశములకు, కల్గెనేని = కలిగినచో, లికుచ = నిమ్మపండ్లయొక్క, కోమల కాంతి = మృదువైన కాంతులయొక్క, లీలా విశేషంబు = విలాసాతిశయము, చక్రవాకములందు, జరిగెనేని, మాలూర = మారేడు పండ్లయొక్క, సౌభాగ్య మహిమ = సౌందర్య మహిమయొక్క, అనుభావంబు = అతిశయము, దాడిమీ ఫలయులన్ =

దానిమ్మపండ్లను, తగిలెనేని, అసకలోన్మీలిత = సంపూర్ణముగా వికసింపని, ప్రసవగుచ్ఛ చ్ఛాయ = పూలగుత్తులయొక్క కాంతి, అబ్జకోరములకు = తామరమొగ్గలకు, అబ్బెనేని, కాని = అలా జరిగిననే కాని, వానిన్ వానిన్ = ఆయా వాటిని, హారి = మనోహరములైన, నిర్ఝర = సెలయేళ్ళ, సలిల ధార = ఉదక ధారలచే, అవధౌత = కడుగబడిన, కాంచనాచల = బంగారుకొండయొక్క, శృంగభాగములగుచు = శిఖర ప్రదేశములగుచు, రాజితములైన = ప్రకాశించుచున్న, దీని వక్షోజములకు = ఈ దమయంతి స్తనములకు, సరిచేయగా రాదు = పోల్చుటకు కుదరదు

తా. ఏనుగు కుంభస్థలపు గొప్పతనపు అతిశయము బంగారు కలశములకు కలిగినచో, నిమ్మపండ్లయొక్క కోమలకాంతి విలాసాతిశయము చక్రవాకములకు కలిగెనేని, మారేడుపండ్ల సౌందర్య మహిమాతిశయము దానిమ్మపండ్లకు కలిగెనేని, సంపూర్ణముగా వికసింపని పూలగుత్తులకాంతి తామరమొగ్గలకు కలిగెనేని, అలా జరిగిననే కాని వాటిని మనోహరములైన సెలయేళ్ళ ఉదక ధారలచే కడుగబడిన మేరుపర్వత శిఖరప్రదేశములగుచు ప్రకాశించుచున్న ఈ దమయంతి స్తనములకు పోల్చుటకు కుదరదు.

**190 తే. నలువ సన్నంబుగా దీని నడుము కినిసి**
**యౌవనమునకు నిచ్చె నా యంశమెల్ల**
**నది యుపాదానమునఁగదా యది సృజించె**
**నున్నతములైన యేతత్పయోధరముల**

నలువ = బ్రహ్మ, కినిసి = కోపించి, దీని నడుము, సన్నంబుగాన్ = కృశింపచేసి, ఆ అంశమెల్ల = ఆ భాగమునంతను, యౌవనమునకున్, ఇచ్చెన్ = ఇచ్చివేసెను, అది = ఆ యౌవనము, ఉపాదానమునకదా = పొందుటచేతనేకదా!, ఉన్నతములైన = ఎత్తైన, ఏతత్పయోధరములన్ = ఈ స్తనములను, సృజించెన్ = పుట్టించెను

తా. బ్రహ్మ కోపించి నడుమును కృశింపచేసి ఆ భాగమునంతను యౌవనమునకు ఇచ్చివేసెను. అది పొందుటచేతనే కదా! యౌవనము ఉన్నతములైన ఈ దమయంతి స్తనములను పుట్టించెను.

**191 చ. అరయ ననంగరాజ్య విభవాభ్యుదయంబు ప్రకార మిట్లపో**
**కర మరుదైన యీ సుదతి కౌను వళి త్రితయంబుచే నిరం**
**తరమయి యాక్రమింపఁబడె దానికిఁ దోడొకొ ప్రొద్దునుం బయో**
**ధరములు చూచుచున్నయవి దర్ప విజృంభణ లీల యేర్పడన్**

కరము = మిక్కిలి, అరుదైన = ఆశ్చర్యకరమైన, ఈ సుదతి కౌను = ఈ దమయంతి నడుము, వళిత్రితయంబుచేన్ = మూడు రేఖలైన వళులచే, నిరంతరమయి = అవకాశములేనిదై, ఆక్రమింపబడెన్, దానికిన్, తోడు ఒకొ = తోడేమో, పయోధరములు = స్తనములు, దర్ప = గర్వముయొక్క, విజృంభణలీలన్ = అతిశయము, ఏర్పడన్ = ఒప్పునట్లుగా, ప్రొద్దునుం = ఎల్లవేళలా, చూచుచున్నయవి, అరయ = పరిశీలింపగా, అనంగరాజ్య విభవ = మన్మథరాజ్యసంపదయొక్క, అభ్యుదయంబు ప్రకారము = అభివృద్ధి విధానము, ఇట్లపో = ఇలాగే ఉంటుందేమో!

తా. మిక్కిలి ఆశ్చర్యకరమైన ఈ దమయంతి నడుము మూడు వళుల రేఖలచే అవకాశములేకుండగ ఆక్రమింపబడింది. దానికి తోడేమో, స్తనములు గర్వాతిశయముతో ఎల్లవేళలా చూస్తునేవున్నాయి. పరిశీలించగా మన్మథరాజ్యసంపదయొక్క అభివృద్ధివిధానము ఇలాగే ఉంటుందేమో!

**192 తే. ప్రబల వక్షోజ హేమకుంభములు చూచి**
**లలిత రోమావళీ రజ్జులతికఁ జూచి**
**నాభికూపంబుఁ జూచి నా నయనయుగము**
**తృప్తి వహియించుచున్నది దీనియందు**

నా నయనయుగము = నా రెండు కన్నులును, ప్రబల = గొప్పవయిన, వక్షోజ హేమకుంభములు = బంగారు కుండలవంటి స్తనములను, చూచి, లలిత = సుందరమైన, రోమావళీ రజ్జులతికన్ = త్రాటితీగవంటినూగారును, చూచి, నాభికూపంబు = బావివలె లోతైన పొక్కిలిని, చూచి, దీనియందు = ఈ కాంతయందు, తృప్తి వహియించుచున్నది.

తా. నా రెండుకన్నులును గొప్పవయిన బంగారుకుండలవంటి స్తనములను చూచి, సుందరమయిన నూగారును చూచి, లోతైన పొక్కిలిని చూచి ఈ కాంతయందు తృప్తిచెందుచున్నది.

**193 తే. నాభి యుత్పాటితాలాన నవ్య బిలము**
**రోమవల్లరి శృంఖలా దామకంబు**
**కామ మదవారణమున కీ కంబుకంఠి**
**వలుఁద చనుదోయి గిరివప్రవాస్తుభూమి**

నాభి, ఉత్పాటిత = పెల్లగింపబడిన, ఆలాన = ఏనుగు కట్టు కంబముయొక్క, నవ్య = నూతనమైన, బిలము = గొయ్యి,

రోమవల్లరి = నూగారు, శృంఖలా దామకంబు = ఏనుగును కట్టు గొలుసువంటిది, ఈ కంబుకంఠి = ఈ దమయంతియొక్క, వలుద చనుదోయి = స్థూలమైన స్తనముల జంట, కామ మదవారణమునకు = మన్మథుడనెడి మదగజమునకు, గిరివప్ర = కొండచరియల క్రిందిభాగముల, వాస్తు = నివసించుటకు తగిన, భూమి = నేల

తా. దమయంతి నాభి పెల్లగింపబడిన ఏనుగును కట్టు కంబముయొక్క రంధ్రమువలెను, నూగారు ఏనుగును కట్టు గొలుసువలెను, స్తనములు మన్మథుడనెడి ఏనుగు నివసించు ప్రదేశమువలెను ప్రకాశించుచున్నది.

**194 తే. ప్రతిఫలించు ప్రవేణికా భారఖచిత**
**మల్లికలు రాజితాక్షర మాలికలుగ**
**శంబరారాతి విజయశాసన సువర్ణ**
**పట్టికయుఁబోలె నొప్పు నిప్పడఁతి వీఁపు**

ప్రవేణికా భార = జటాభారమునందు, ఖచిత = కూర్చబడిన, మల్లికలు, ప్రతిఫలించు = ప్రతిబింబించుచున్న, రాజితాక్షర మాలికలుగ = వెండి అక్షరముల పంక్తివలెను, శంబర అరాతి = మన్మథునియొక్క, విజయశాసన = జయశాసనముయొక్క, సువర్ణ పట్టికయున్ పోలెన్ = బంగారు పలకవలె, ఈ పడతి వీపు = ఈ దమయంతి వీపు, ఒప్పున్ = ప్రకాశించును

తా. దమయంతి జటాభారమునందు కూర్చబడిన మల్లెపూలు వీపునందు ప్రతిబింబించుచున్న వెండి అక్షరముల పంక్తివలెను, మన్మథునియొక్క జయశాసన బంగారు పలకవలెను ప్రకాశించుచున్నది.

**195 క. తన జనకుడు శౌరి సుద**
**ర్శన చక్రమునను జయించె జగమని మరుఁడీ**
**వనిత యదర్శన కటితటి**
**ఘన చక్రంబున జయింపఁగాఁ దలచుఁ జుమీ!**

మరుడు = మన్మథుడు, తన జనకుడు = తన తండ్రియైన, శౌరి = విష్ణువు, సుదర్శన చక్రమునన్, జగము, జయించెనని, ఈ వనిత = ఈ దయయంతియొక్క, అదర్శన = కనిపించని, కటితటి = నితంబమనెడు, ఘన చక్రంబున = గొప్ప చక్రముతో, జయింపగాన్, తలచున్ చుమీ!

తా. మన్మథుడు తన తండ్రి విష్ణువు సుదర్శన చక్రముతో లోకమును జయించెనని, ఈ దమయంతియొక్క చీరచే కప్పబడి కనిపించని నితంబమనెడు గొప్ప చక్రముతో తానుకూడా లోకమును జయింప తలచేడేమో!

**196 శా. ఏదే నొక్క మనోహరాంగకముచే నీ యిందుబింబాస్య హే**
**లా దర్పంబునఁ బిప్పలచ్ఛదము గెల్వంగాఁ దలంచెంజుమీ**
**లేదే నన్య మహీజపత్రములు వోలెంగాక యేలా భయ**
**ప్రాదుర్భావమునం జలించు నది నిర్వాత ప్రదేశంబునన్**

ఏదేని = ఏదైనా, ఒక్క మనోహర, అంగకముచే = శరీరములోని చిన్ని భాగముచే, ఈ ఇందునిభ ఆస్య = ఈ దమయంతి, హేలా దర్పంబునన్ = విలాస గర్వముతో, పిప్పలచ్ఛదము = రావి ఆకును, గెల్వంగాన్ తలచెం చుమీ, లేదేని = కాకున్నచో, అన్య మహీజపత్రముల వోలెంగాక = ఇతర వృక్షముల ఆకులవలెకాక, అది= ఆ రావి యాకు, ఏలా = ఎందుకు?, భయ ప్రాదుర్భావమునన్ = భయము పొడముటచేత, నిర్వాత ప్రదేశంబునన్ = గాలిలేని ప్రదేశంలోకూడా, చలించును = ఊగుచుండును,

తా. దమయంతి విలాస గర్వముతో తన శరీరములోని ఏదైనా చిన్ని భాగముచే రావి ఆకును గెలవాలని తలచిందేమో! కానిచో ఇతర వృక్షముల ఆకులవలె కాక, ఎందుకు? అది భయంతో గాలిలేని ప్రదేశంలోకూడా చలిస్తూ ఉంటుంది.

**197 తే. చిగురుఁబోడి భ్రూవల్లరి చిత్రరేఖ**
**యింతి నాస తిలోత్తమ యింత నిజము**
**చెలువ యూరుకాండద్వయీ సృష్టి రంభ**
**మానినీమణి మధురోక్తి మంజుఘోష**

చిగురుబోడి = దమయంతియొక్క, భ్రూవల్లరి = కనుబొమలు, చిత్రరేఖ = చిత్రమైన రేఖలు కలది (చిత్రరేఖ అను అచ్చర వంటిది). ఇంతి నాస = దమయంతి ముక్కు, తిలోత్తమ = నువ్వుపువ్వువలె శ్రేష్ఠమైనది (తిలోత్తమ అను అచ్చర వంటిది), చెలువ = దమయంతియొక్క, ఊరుకాండద్వయీ సృష్టి = రెండుతొడలయొక్క నిర్మాణము, రంభ = అరటికంబమే ( రంభ అను అచ్చర వంటిది), మానినీమణి = దమయంతియొక్క, మధురోక్తి = మధురమైన భాషణములు, మంజుఘోష = మృదువైన ధ్వని కలవి (మంజుఘోష అను అచ్చర వంటిది), ఇంత = ఇదంతయు, నిజము = సత్యము

తా. దమయంతియొక్క కనుబొమలు చిత్రరేఖను, ముక్కు తిలోత్తమను, తొడలు రంభను, భాషణములు మంజుఘోషను

పోలియున్నవి. ఇదంతయు నిజము.

198 **తే. ఊరుకాండద్వయమున నీ యుత్పలాక్షి**
**సమదవారణరాజ హస్తంబు గెలిచె**
**యదియ కారణమునఁగదా యధిక లజ్జ**
**బొంది ముడిఁగించునది యాస్య పుష్కరంబు**

ఈ ఉత్పలాక్షి = కలువలవంటి కన్నులుకల దమయంతి, ఊరుకాండద్వయమునన్ = రెండు తొడలద్వారా, సమద = మదముతో కూడిన, వారణరాజ = ఏనుగులకు రాజైన ఐరావతముయొక్క, హస్తంబు = తొండమును, గెలిచె, అదియ కారణమున కదా, అధిక లజ్జ పొంది = చాలా సిగ్గుపడి, ఆస్య పుష్కరంబు = ముఖపద్మమును, ముడుగించునది = ముడుచుకొనేది

తా. దమయంతి తన రెండు తొడలద్వారా మదించిన ఏనుగులకు రాజైన ఐరావతముయొక్క తొండమును గెలిచెను. ఆ కారణముచేతనేకదా! అది చాలా సిగ్గుపడి ముఖపద్మమును ముడుచుకొనేది

199 **తే. వనిత నానారదాహ్లాద వదనకమల**
**నీలకుంతల కుచశైల శీలి భృగువు**
**చామ శ్రీమహాభారత సర్గ కార్య**
**కారణ వ్యాస లలితోరు గౌరమహిమ**

వనిత = దమయంతి, నానారద (న అనారద) = నారదమహామునిని, ఆహ్లాద = సంతోషపెట్టెడి, వదన కమల = ముఖపద్మము కలది, నీలకుంతల = నల్లని ముంగురులుకల దమయంతి, కుచశైల = స్తనములనెడి పర్వతములను, శీలి = కోరుచున్న, భృగువు = భృగుమహాముని కలది, చామ = దమయంతి, శ్రీ = శోభాయుక్తమైన, మహాభారత = భారత గ్రంథమనెడి, సర్గకార్య = సృష్టి కార్యమునకు, కారణ = కారణమైన, వ్యాస = వ్యాసమహామునికి, లలిత = సుందరములైన, ఊరు = తొడలయొక్క, గౌర మహిమ = తెల్లనికాంతుల మహిమకలది.

వనిత, నానా = అనేకములైన, రద = దంతములచే, ఆహ్లాద = యువకుల నానందపరిచెడి, వదన కమల = ముఖపద్మము కలది, నీలకుంతల, కుచశైల = స్తనపర్వతములయొక్క, శీలి = ఉత్తమమైన, భృగువు = చరియలుకలది, చామ, శ్రీ = శోభా యుక్తమైన, మహాభా = ఎక్కువ కాంతిగల, రత = సంభోగముయొక్క, సర్గ కార్య = నిర్మాణ కార్యక్రమమునకు, కారణ = హేతువయిన, వ్యాస = విస్తృతములయిన, లలిత = సుందరములయిన, ఊరు = తొడలయొక్క, గౌర మహిమ = గౌర కాంతులయొక్క అతిశయముకలది

తా. ఈ దమయంతి ముఖపద్మము అనేకములైన దంతములచేత నొప్పుచున్నది, ఈమె కుచములు గొప్ప తటములచే ప్రకాశించుచున్నవి, ఈమె తొడలు సురత సంపాదకములయి గౌర కాంతులచే మిగుల మనోహరమైనవి

200 **చ. సుదతి మనంబునం దలఁచి చూడఁ జతుర్దశియౌ నరుంధతీ**
**మదన పురంధ్రి దైత్యరిపు మానవతీ నవమాతృకాజన**
**త్రిదశవరేణ్య భామలకు దివ్య మహామహిమానుభావ సం**
**పద నటుగాక గుల్ఫ పరిపాటి నదృశ్యత సంఘటిల్లునే!**

దివ్య = శ్రేష్ఠమైన, మహత్ = గొప్పదగు, మహిమ = మహిమయొక్క, అనుభావ సంపదన్ = ప్రభావ సమృద్ధిచే, మనంబునన్ = మనసునందు, తలచిచూడన్ = ఆలోచించి చూడగా, సుదతి = మంచి దంతములుకల దమయంతి, అరుంధతీ = వశిష్ఠుని భార్య అరుంధతికిని, మదన పురంధ్రి = మన్మథుని భార్య రతీదేవికిని, దైత్యరిపు మానవతీ = విష్ణుమూర్తి భార్యయగు లక్ష్మీదేవికిని, నవమాతృకాజన = తొమ్మండుగురు బ్రహ్మాణి మొదలగు మాతలకును, త్రిదశ వరేణ్య భామలకు = ఇంద్రుని భార్యయగు శచీదేవికిని, చతుర్దశి = పదునాల్గు సంఖ్యను పూరించునది, ఔన్ = అగును. అటుగాక = అట్లుకానిచో, గుల్ఫ పరిపాటిన్ = చీలమండలయొక్క రీతిచే, అదృశ్యత = కంటికి కనబడకపోవుట, సంఘటిల్లునే = కలుగునా. (పై పదముగ్గురకు దమయంతితో పదునాలుగు)(చీలమండలు మాంసముతో కప్పబడియుండుట సులక్షణమని సాముద్రికులు చెప్పుదురు) (బ్రహ్మాణీ, మాహేశీ, కౌమారీ, వైష్ణవీ, వారాహీ, నారసింహీ, మాహేంద్రీ, చండికా, మహాలక్ష్మీ – నవ మాతృకలు)

తా. శ్రేష్ఠమైన, గొప్పదైన ప్రభావ సమృద్ధిచే మనసునందు ఆలోచించి చూడగా దమయంతి అరుంధతిని, రతీదేవిని, లక్ష్మీదేవిని, తొమ్మండుగు మాతృకలను, శచీదేవిని కలిపి పదునాల్గు సంఖ్యను పూరించుచున్నది. అలాకానిచో చీలమండలు కంటికి కనబడకపోవడం జరుగుతుందా?

201 **సీ. పల్లవంబులు దీని పదకాంతి లవములై**
**పల్లవ శబ్ద లాభంబు నొందెఁ**

**బవడంబుమీఁది కోపముననో యీ కాంత**
**పాదంబు లత్యంత పాటలములు**
**శుద్ధపార్ష్ణులుగానఁ జూడ దీ నంఘ్రులు**
**కరియూథపతి యాన గరిమ గెలిచెఁ**
**దోయజ భ్రాంతినో యీ యింతి యడుగుల**
**నలువొప్పఁ బాయకున్నదియె లక్ష్మి**
**తే. తరుణి పదముల యది యలక్తక రసంబొ**
**కాక త్రైలోక్య భామా నికాయ మౌళి**
**భాగ విన్యాస సంలగ్న బహుళ నూత్న**
**చారు సీమంత సీమ సిందూరరజమొ**

పల్లవంబులు = చిగుళ్ళు, దీని = ఈ దమయంతియొక్క పదకాంతి లవములై = పాదకాంతి లేశముకలవై, పత్ లవ శబ్ద లాభంబున్ = పల్లవ అను పద లాభమును, ఒందెన్ = పొందెను. పవడంబు మీది, కోపముననో, ఈ కాంత, పాదంబులు, అత్యంత = మిక్కిలి, పాటలములు = రక్తవర్ణముకలవి. చూడన్, దీని, అంఘ్రులు = పాదములు, శుద్ధపార్ష్ణులుగాన = పగులులులేని మడమలుకావున, కరియూథపతి = ఐరావతముయొక్క , యాన గరిమ = గమనాతిశయమును, గెలిచెన్ = జయించెను. తోయజ భ్రాంతినో = పద్మమనెడి భ్రాంతినేమో!, లక్ష్మి, ఈ ఇంతి అడుగులన్ = ఈ దమయంతి పాదములను, నలువొప్పన్ = అందము కులుకునట్లుగా, పాయకున్నదియె = విడువకున్నదికదా!, తరుణి పదముల = దమయంతి పాదములకు, అది = ఆ ఉన్నది, అలక్తక రసంబొ = లాక్షారసమొ, కాక, త్రైలోక్య భామా నికాయ = ముల్లోకములందలి స్త్రీల సమూహముయొక్క, మౌళి భాగ = శిరస్సునందు, విన్యాస = ఉంచుటచే, సంలగ్న = అంటుకొనియున్న, బహుళ = విస్తారమైన, నూత్న = క్రొత్తదైన, చారు = మనోహరమైన, సీమంతసీమ = పాపటయందున్న, సిందూర రజమొ.

తా. ఈ దమయంతియొక్క పాదకాంతి లేశముకలవై చిగుళ్ళు పల్లవశబ్దమును పొందియున్నవి.పగడముమీద కోపంతో దమయంతి పాదములు రక్తవర్ణముకలవి. దమయంతి మడమలు పగుళ్ళులేని శుద్ధములగుటచే ఐరావతముయొక్క గమన అతిశయమును జయించెను. పద్మమని భ్రాంతిపడిందేమో లక్ష్మి ఈ దమయంతి పాదములను విడువకున్నది. దమయంతి పాదములకు ఉన్నది లాక్షారసమొ కాక ముల్లోకముల స్త్రీ సమూహముయొక్క శిరస్సులందంటుకొనియున్న నవ మనోహరమైన పాపటయందలి సిందూర పరాగమొ తెలియకున్నది

**202 తే. శిశిర కాలంబునందు నిశ్శేషమయిన**
**జలజసస్యంబు సృజియింపఁ దలఁచి బ్రహ్మ**
**యాచరింపఁడె యీ కాంత యాస్య హస్త**
**పాద సౌభాగ్యములయందుఁ బంచభిక్ష**

బ్రహ్మ, శిశిర కాలంబునందు, నిశ్శేషమయిన, జలజ సస్యంబు = తామర పంటను, సృజియింపన్ తలచి, ఈ కాంత, అస్య = ముఖము, హస్త = చేతులు, పాద = పాదములయొక్క, సౌభాగ్యములయందున్ = సౌందర్యములయందు, పంచభిక్ష = మధుకరవృత్తిని, ఆచరింపడె = చేయడా?(బ్రహ్మచారి అయిదు గృహములకుపోయి భిక్ష చేకొనుట పంచభిక్ష)

తా. బ్రహ్మ శిశిరకాలమునందు మిగులకుండాపోయిన తామరపంటను మరల సృష్టింప దలచి దమయంతియొక్క ముఖము, చేతులు, పాదముల వంటి సౌందర్యములయందు మధుకరవృత్తిని చేయుచున్నాడు.

**203 క. వినుత యశః పాదాంగు**
**ష్ఠ నఖాస్యములందుఁ బూర్ణచంద్ర చతుష్కం**
**బును ధరియించుటనొకొ యీ**
**వనిత చతుష్షష్టికళల వాసనకెక్కెన్**

ఈ వనిత = ఈ దమయంతి, వినుత = కొనియాడబడుచున్న, యశః = కీర్తియందును, పాదాంగుష్ఠ నఖ = కాలి బొటనవ్రేలి గోళ్ళయందును, ఆస్యములందున్ = ముఖమునందును, పూర్ణచంద్ర చతుష్కంబును = నలుగురు పూర్ణచంద్రులను, ధరించుటనొకొ = తాల్చుటచేకాబోలు, చతుష్షష్టి కళలన& = అరువదినాల్గు విద్యలయందును, వాసనకు ఎక్కెన్ = ప్రసిద్ధికి ఎక్కెను. (చంద్రునికి పదునారు కళలు, నలుగురు చంద్రులు ($4\times16=64$)కనుక అరువదినాలుగు విద్యలును నేర్వగలిగినది) తా. ఈ దమయంతి స్తుతింపబడు కీర్తియందును, కాలిబొటనవ్రేలి గోళ్ళయందును, ముఖమునందును నలుగురు పూర్ణ చంద్రులను ధరించడంచేత కాబోలు అరువదినాలుగు విద్యలందును ప్రసిద్ధికెక్కినది.

**204 చ. అని చికురాదియుం బదనఖాంతముగాఁ జికురాకుఁబోఁడి నె**
**మ్మనమున సంస్తుతించి యసమాన విలాస కళా వినిర్జితా**

**తనుcదును నవ్వధూమణికిc దత్సమయంబునcజూపవేcడి యొ**
**య్యన దిగcదాచె భూపతి దిశాధిపకల్పితయైన శాంబరిన్**

అసమాన = సాటిలేని, విలాసకళా = విలాస సంపదచే, వినిర్జిత = జయింపబడిన, అతనుడున్ = మన్మథుడునైన, భూపతి = నలమహారాజు, అని = ఇట్లని, చికురాదియున్ = కేశములు మొదలు, పదనఖాంతముగాన్ = కాలిగోటి అంతమువరకు, చిగురాకుబోడిన్ = దమయంతిని, నెమ్మనమున = నిండుమనసుతో, సంస్తుతించి = బాగుగా స్తుతించి, తత్సమయంబునన్ = ఆ సమయములో, అవ్వధూమణికిన్ = ఆ దమయంతికి, చూపన్ వేడి = చూపించదలచి, దిశాధిపకల్పితయైన = దిక్పాలకులచే కల్పింపబడిన, శాంబరిన్ = తిరస్కరణీ విద్యను, దిగదాచెన్ = విడిచిపెట్టెను.

తా. సాటిలేని విలాససంపదచే జయింపబడిన మన్మథుడుకల నలమహారాజు ఈ రీతిగా కేశములు మొదలు కాలిగోటి వరకు దమయంతిని బాగుగా స్తుతించి, ఆ సమయంలో ఆ దమయంతికి తనను చూపించదలచి దిక్పాలకులచే కల్పింప బడిన తిరస్కరణీ విద్యను విడిచెపెట్టెను.

**205 ఉ. భానుసమాన మానగుణ బంధుర బంధు రమా నిదాన దా**
**నానుకృతాంబువాహ ధనదాంబుదవాహన కామధేను సం**
**తానక కర్ణ కర్ణసుఖదాయి వచో రచనా ధురీణ రీ**
**ణా నతరాజ రాజమకుటాంఘ్రి సరోరుహ భావితాత్మకా**

భానుసమాన = సూర్యతేజస్సుతో సమానమైన తేజస్సు కలవాడా!, మానగుణ = ఆత్మాభిమాన గుణముచేత, బంధుర = ప్రకాశించువాడా!, బంధు = యాచక బంధువుల, రమా = లక్ష్మికి (సంపదకు), నిదాన = కారణమైనవాడా!, దాన = దానముచే, అనుకృత = అనుసరింపబడుచున్న, అంబువాహ = మేఘము, ధనద = కుబేరుడు, అంబుదవాహన = జీమూతవాహనుడు, కామధేను, సంతానక = కల్పవృక్షము, కర్ణ = కర్ణుడు కలవాడా! కర్ణసుఖదాయి = చెవులకు సౌఖ్యమునిచ్చుచున్న, వచోరచనా ధురీణ = వాగ్రచనల భారమువహించినవాడా!, రీణా నతిరాజ = పరాజితులై నమస్కరించుచున్న రాజులు కలవాడా!, రాజమకుట = శివునియొక్క, అంఘ్రి సరోరుహ = పాదపద్మములయందు, భావిత = పొందింపబడిన, ఆత్మకా = మనస్సు కలవాడా!

తా. సూర్యతేజస్సుతో సమానమైన తేజస్సుకలవాడా! ఆత్మాభిమానగుణముచే ప్రకాశించువాడా!, యాచకబంధువుల సంపదకు కారణమైనవాడా!, దానముచే అనుసరింపబడుచున్న మేఘము, కుబేరుడు, జీమూతవాహనుడు, కామధేనువు, కల్పవృక్షము, కర్ణుడు కలవాడా! చెవులకు సౌఖ్యమునిచ్చు వాగ్రచనల భారము వహించువాడా! పరాజితులై నమస్కరించు శత్రురాజులుకలవాడా!, శివుని పాదపద్మములను పొందిన మనసుకలవాడా! మామిడి సింగనామాత్యా!

**206 క. కమలభవవంశ పావన!**
**విమలాంతఃకరణ! బాహు విక్రమకేళీ**
**యమళార్జున మదభంజన!**
**సమరార్జున నిరభిసంధి సౌజన్యనిధీ!**

కమలభవ వంశ పావన = బ్రహ్మవంశమును పవిత్రముచేయువాడా!, విమలాంతఃకరణ = నిర్మలమైన మనస్సుకలవాడా!, బాహువిక్రమకేళీ = భుజబలక్రీడయందు, యమళ అర్జున మదభంజన = యమళ అర్జున అను మద్దిచెట్లరూపముననున్న గంధర్వుల గర్వము నణచినవాడా!(కృష్ణునిగా భావన), సమర అర్జున = యుద్ధమందు అర్జునా!, నిరభిసంధి = నిష్కపటమైన, సౌజన్య = సుజనత్వమునకు, నిధీ = నిధియైనవాడా!

తా. బ్రహ్మవంశమును పవిత్రముచేయువాడా! నిర్మలమైన మనస్సుకలవాడా! భుజబలక్రీడయందు యమళ అర్జున అను మద్దిచెట్లరూపముననున్న గంధర్వుల గర్వమునణచినవాడా! యుద్ధమునందు అర్జునా! నిష్కపటమైన సౌజన్యమునకు నిధియైనవాడా! మామిడి సింగనామాత్యా!

**207 స్రగ్విణి. తల్లమాంబాసుతా! ధైర్యహేమాచలా!**
**పల్లవాదిత్య సౌభాగ్య భాగ్యోదయా!**
**పల్లవోష్ఠీ కుచప్రాంతభాగద్వయీ!**
**గల్లపాళీ లసత్కామ ముద్రాంకురా!**

తల్లమాంబా సుతా, ధైర్య హేమాచలా = ధైర్యమునందు మేరుపర్వతమువంటివాడా!, పల్లవాదిత్య = పల్లవాదిత్యుడను రాజుయొక్క, సౌభాగ్య = మంచి భాగ్యమువలన, భాగ్యోదయా = భాగ్యాభివృద్ధికలవాడా!, పల్లవోష్ఠీ = స్త్రీలయొక్క కుచ = స్తనములయొక్క, ప్రాంతభాగద్వయీ = రెండు ప్రాంతభాగములయందును, గల్లపాళీ = చెక్కులయందును, లసత్ = ఒప్పుచున్న, కామ = మన్మథసంబంధమైన, ముద్రాంకురా = ముద్రలుకలవాడా!

తా. తల్లమాంబా కుమారా! ధైర్యమునందు మేరుపర్వతమువంటివాడా! పల్లవాదిత్యుడను రాజుయొక్క మంచి భాగ్యము

వలన భాగ్యాభివృద్ధికలవాడా! స్త్రీలయొక్క కుచప్రాంతభాగములయందును, చెక్కులయందును ఒప్పుచున్న మన్మథ సంబంధమైన ముద్రలుకలవాడా! మామిడి సింగనామాత్యా!

**గద్య**
**ఇది శ్రీమత్కమలనాభ పౌత్త్ర మారయామాత్య పుత్త్ర**
**సకల విద్యా సనాథ శ్రీనాథభట్ట ప్రణీతమయిన**
**శృంగార నైషధ కావ్యమునందు**
**తృతీయాశ్వాసము**

**వ్యాఖ్యాతృ గద్యము**
**ఇది బుధజన విధేయుండును, బులుసు వంశ సంభూతుండును,**
**కీ.శే. శేషమ్మ, వెంకటరమణయ్య పుణ్యదంపతీ తనూజుండును,**
**గౌతమ గోత్రజుండునగు వేంకటసత్యనారాయణమూర్తి**
**ప్రణీతంబైన శృంగార నైషధ మహాకావ్యంబునందు**
**తృతీయాశ్వాసమునకు టీక-తాత్పర్యములు**
**సంపూర్ణము**

# శృంగార నైషధము

## చతుర్థాశ్వాసము

**శ్రీమచ్చరణాంభోరుహ**
**చామీకర కటక ఘటిత సమదారాతి**
**స్తోమ! దయా రఘురామ! ర**
**మా మందిర లసదపాంగ! మామిడిసింగా!**

శ్రీమత్ = శోభాయుక్తమైన, చరణాంభోరుహ = పాదపద్మములయందున్న, చామీకర = బంగారు, కటక = కడియమునందు, ఘటిత = కూర్చబడిన, సమద = మదముతోకూడిన, అరాతి = శత్రువులయొక్క, స్తోమ = సమూహముకలవాడా!, దయా = కారుణ్యమునందు, రఘురామ = రామునివంటివాడా!, రమా = లక్ష్మీదేవికి, మందిర = నివాసస్థలమై, లసత్ = ఒప్పుచున్న, అపాంగ = క్రీంగటి చూపులుకలవాడా!, మామిడిసింగా!

తా. శోభాయుక్తమైన పాదపద్మములయందున్న బంగారు కడియమునందు కూర్చబడిన మదముతోకూడిన శత్రువుల యొక్క సమూహముకలవాడా!, దయాగుణమునందు రఘురామునివంటివాడా!, లక్ష్మీదేవికి నివాసస్థలమై ఒప్పుచున్న క్రీగంటిచూపులుకలవాడా! మామిడి సింగనామాత్యా!

**2 వ. అవధరింపు మివ్విధంబున విబుధ మాయాంధకారంబు దూరంబగుటయుం గట్టెదుర నా జగజెట్టి జవనిక వాయందట్టినం బొడసూపు బహురూపు తెఱంగున, జలధర తిరోధానంబు వాసినం బ్రకాశించు నా హిమధాముని పగిది, నవిద్యావరణంబు విరిసినం దోఁచు పరమాత్ముని ప్రకారంబున, దోహద పలాల జాలంబు విరిసినం బ్రేక్షణీయంబగు పుండ్రేక్షు కాండంబు భంగిఁ బరమాద్భుతాస్త నిమేష ముద్రుండును, నిర్భిద్రరోమ ప్రరోహుండును, నిశ్చలాంగుండును, వైశాఖ స్థానకలితుండును, నిర్వికారుండునునై భీమభూపాల పుత్త్రికకు నేత్రవిషయీభావంబు భజియించె. అప్పు డప్పుడమితేనిం కనుంగొని సంభ్రమంబును, భయంబును, లజ్జయు మనంబునం బెనంగొనంగ, నంగనాజనులు సమయ సముత్థాన ఝుళంఝుళాయమాన మణితులాకోటి వాచాటీ భవత్సభాభవనాళిందంబుగా నందఱుం బ్రత్యుత్థానంబు సేసిరి. ధీరోదాత్త గావున నయ్యాదిగర్భేశ్వరి సమున్నత కనకాసనంబున మున్నున్న యునికిన యుండి యనిర్వచనీయంబైన యానందంబు డెందంబున ననుభవించుచు నెవ్వండ వెందుండి యేతెంచితి వెట్లు వచ్చితివని యడుగకుండి మరలఁ చంద్రుడో యుపేంద్రుండో జయంతుండో యని సందియంబందుచు మొదల హంసంబు సరసబిసినీపలాశంబు మీఁదఁ జరణ నఖాగ్రంబున లిఖియించి చూపినం జూచిన చిత్రరూపంబుతో రూపంబు సంఘటించుటం జేసి యీతండు నిషధరాజని యెఱింగియు శుద్ధాంత సదన ప్రవేశంబు దుర్లభంబు గావున మిగుల విశ్వసింపక నిమేష నిస్పృహంబులైన విలోచనంబుల సాద్భుతంబును సకౌతుకంబును సానురాగంబునుంగా విలోకించుచు**

తా. వినుము. ఈ ప్రకారముగా దేవతల తిరస్కరిణీ మాయాంధకారము తొలగిపోగా, యెట్టయెదుట నా పరాక్రమవంతుడు తెర తొలగింపగా కనబడు నటునివలె, మేఘముయొక్క అడ్డు తొలగిపోగా ప్రకాశించు ఆ చంద్రునివలె, అజ్ఞానమనే అడ్డు తొలగిపోగా కనబడు పరమాత్మునివలె, దోహదముకొఱకు వేయబడిన ఆకుపోచగుంపు నశింపగా కనబడునదయిన తెల్లని చెఱకుగడవలె, మిక్కిలి ఆశ్చర్యముచే నశించిన రెప్పపాటులు కలవాడును, మొలకలెత్తిన పులకలుకలవాడును, నిశ్చలమైన దేహముకలవాడును, విలుకాడు నిలిచియుండునట్లు నిలిచియున్నవాడును, అచటి జగన్మోహనాకార స్త్రీలను చూచి వికారము పొందనివాడునునై దమయంతి నేత్రములకు ప్రత్యక్షమయ్యెను. అపుడు ఆ నలమహారాజును చూసి తొందరపాటు, భయము, సిగ్గు మనసును చుట్టిపెట్టగా చెలికత్తెలు ఒక్కసారిగా లేచుటచేత ఝుళఝుళమని ధ్వనిచేయుచున్న రతనాల అందెలచేత ప్రతిధ్వనిస్తున్న సభాభవనము, నడవలు కలుగగా అందఱును లేచిరి. ఆ దమయంతి గంభీరస్వభావముకలది కావున ఉన్నతమైన బంగారుగద్దెయందు నలుని చూడకపూర్వము ఉన్నరీతిగానే కూర్చుండి చెప్పతరముకాని యానందమును మనసున అనుభవించుచు 'ఎవ్వడవు? ఎక్కడనుంచి వచ్చితివి? ఎలా వచ్చితివి?' అని అడుగుట మానివేసి మళ్లీ చంద్రుడో, ఉపేంద్రుడో, మన్మథుడో అని సందేహపడుచు ఇంతకు పూర్వము హంస లేత తామరాకుమీద కాలి గోటికొనచే వ్రాసి చూపినపుడు చూచిన చిత్రమునందలి రూపముతో జతకూర్చుకొని ఈతడు నలమహారాజేయని తెలిసికొనియు అంత:పురప్రవేశము అశక్యము కావున పూర్తిగా నమ్మకము లేక ఱెప్పపాటులేని నేత్రములతో ఆశ్చర్యమును, ఆనందమును, ప్రీతిపూర్వకముగా చూచుచు

3 **తే. అతివ మిధ్యావలోకనాభ్యాసకలన**
**నిజముగా రాజుఁ జూచియు నెమ్మనమునఁ**
**దాల్పదయ్యెను శాలీనతాభరంబు**
**తథ్య మిథ్యా వివిక్తి ముగ్ధలకుఁ గలదె**

అతివ = దమయంతి, మిధ్య అవలోకన = భ్రాంతిచే చూచుటయందు, అభ్యాసకలన = అలవాటుపడినదగుటచే, నిజముగా = సత్యముగా, రాజున్, చూచియు, నెమ్మనమునన్ = నిండుమనసుతో, శాలీనతాభరంబున్ = మిక్కిలి సిగ్గును, తాల్పదయ్యెను = వహించినదికాకపోయెను. ముగ్ధలకు = మోహమునందున్నవారికి, తథ్యమిథ్యా వివిక్తి = సత్యాసత్యముల వివేకము, కలదె = ఉండునా?(అర్థాంతరన్యాసాలంకారము)

తా. దమయంతి భ్రాంతిచే నిత్యము నలుని చిత్రమున చూచుటకు అలవాటుపడినదగుటచే సత్యముగా రాజును చూచినా నిండుమనసుతో పూర్తిగా సిగ్గును పొందినది కాకపోయెను. మోహమునందున్నవారికి సత్యాసత్యముల వివేకము కలుగదుకదా! (నలుడు ప్రత్యక్షమైననూ అది మిధ్యగానే భావించుచున్నది)

4 **ఉ. కేవల సాధ్వసంబున సఖీజను లూరక యుండఁగా మనో**
**భావపిధాన యత్న పరిపాటి యనాదర ముద్రచేఁ దిరో**
**భావము నొందఁజేసి ముఖపద్మ మొకించుక వ్రాల్చి పల్కె నా**
**నావిధ చిత్రవాక్యరచనాచణ భీమతనూజ నేర్పునన్**

సఖీజనులు = చెలికత్తెలు, కేవల = మిక్కిలి, సాధ్వసంబున = తొట్రుపాటుతో, ఊరక ఉండగా, మనోభావ = మనసులోని అభిప్రాయమును, పిధాన = కప్పియుంచుటకు, యత్న పరిపాటి = ప్రయత్నముల వరుసను, అనాదరముద్రచే = తిరస్కారముద్రచే, తిరోభావమును ఒంద చేసి = వెనక్కుపోవునట్లుచేసి, ముఖ పద్మము = పద్మమువంటి ముఖమును, ఒకించుక = కొంచెము, వ్రాల్చి, నానావిధ = పలువిధములైన, చిత్రవాక్యరచనాచణ = అద్భుతవాక్యములను చెప్పుటలో నేర్పుకలదైన, భీమతనూజ = దమయంతి, నేర్పునన్ = నేర్పుతో, పల్కెన్

తా. చెలికత్తెలు మిక్కిలి తొట్రుపాటుతో మౌనముగా నుండగా, మనసులోని అభిప్రాయమును కప్పియుంచుటకు ప్రయత్నములు విఫలమగుచుండగా పద్మమువంటి ముఖమును కొంచెము వ్రాల్చి పలువిధములైన అద్భుత వాక్యములను చెప్పుటలో నేర్పుకలదైన దమయంతి ఈ రీతిగా నేర్పుతో పలికెను.

5 **సీ. ప్రణతమౌళిమణి ప్రభా నికాయంబుతోఁ**
**బానీయమున నర్ఘ్యపాద్య మీఁగి**
**యత్యంత మధుర వాక్య ప్రపంచములతో**
**శర్కరాదుల మధుపర్క మీఁగి**
**ప్రవిమలంబైన సద్భావ వైభవముతోఁ**
**బృథుల కాంచనరత్న పీఠ మీఁగి**
**పరమసేవా విధా విరచితాంజలితోడఁ**
**బ్రముదితంబగు మనఃపద్మ మీఁగి**
**తే. యాతిథేయుల కభినవాయాతుఁడైన**
**యతిథి తనయింటి కేతెంచునపుడు చేయు**
**సత్క్రియాచార విధికలా సరణియంద్రు**
**ధర్మశాస్త్రోపనిషదర్థ మర్మవిదులు**

ప్రణత = వంచిన, మౌళి = కిరీటమందలి, మణిప్రభా = మణులకాంతుల, నికాయంబుతో = సమూహముతో, పానీయమునన్ = జలమున, అర్ఘ్యపాద్యము = పూజకు పాదప్రక్షాళనమునకు తగిన జలమును, ఈగి = ఇచ్చి, అత్యంత, మధుర వాక్య, ప్రపంచములతో = సమూహములతో, శర్కర ఆదుల = పంచదార మొదలగువానితో, మధుపర్కము = మధుర ఉపహారములను, ఈగి, ప్రవిమలంబైన = మిక్కిలి స్వచ్ఛమైన, సద్భావవైభవముతోన్ = మంచి స్వభావ సమృద్ధితో, పృథుల = గొప్పదయిన, కాంచనరత్నపీఠము = బంగారు రత్నపీఠమును, ఈగి, పరమసేవా విధా = గొప్ప సేవా రీతులచేత, విరచిత = కూర్చబడిన, అంజలితోడన్ = దోసిలితో, ప్రముదితంబగు = మిక్కిలి సంతోషముకల, మన:పద్మము = హృదయ పద్మమును, ఈగి, అభినవ ఆయాతుడైన = క్రొత్తగా వచ్చిన, అతిథి, తన యింటికి, ఏతెంచునపుడు = వచ్చు నప్పుడు, ఆతిథేయులకున్ = గృహస్థులకు, చేయు = చేయునట్టి, సత్క్రియాచార = సత్కారముల నాచరించుటయనెడి, విధి = పనియందు, కలా సరణి = చాతుర్య రీతియని, ధర్మశాస్త్ర, ఉపనిషత్ అర్థవిదులు = ధర్మశాస్త్రముల, ఉపనిషత్తుల అర్థమును తెలిసినవారు, అంద్రు = అంటారు. (అర్ఘ్యములు (8) – పెరుగు, తేనె, నెయ్యి, అక్షతలు, గరిక, నువ్వులు, దర్భ, పుష్పము)

తా. అతిథి తన యింటికి వచ్చునపుడు గృహస్థులకు చేయవలసిన సత్కారముల నాచరించుటయనెడి పనియందు చాతుర్యరీతి

అని ధర్మశాస్త్ర, ఉపనిషత్ అర్థములను తెలిసినవారు చెప్పువిధముగా దమయంతి వంచిన కిరీటమందలి మణులకాంతుల సమూహముతో అర్ఘ్యపాద్యము నిచ్చి, అత్యంత మధుర వాక్యంబులతో పంచదార మొదలగువానితో మధురోపహారముల నిచ్చి, నిర్మలమైన స్వభావసమృద్ధితో గొప్ప బంగారు రత్నపీఠము నిచ్చి, గొప్ప సేవారీతులచే కూర్చబడిన దోసిలితో సంతోషముగా హృదయపద్మము నిచ్చి మర్యాద చేసినది.

**6 తే. అనఘ! యిదె హేమరత్న సింహాసనంబు**
**నిచ్చఁ గలదేనిఁ గూర్చుండు మిందువచ్చి**
**కాక కార్యాంతరాసక్తి కారణముగ**
**నేఁగఁ దలఁచినవాఁడవో యెచటికైన**

అనఘ = దోషరహితుడా!, హేమరత్న సింహాసనంబు = బంగారు రత్న సింహాసనము, ఇదె = ఇదిగో, ఇచ్ఛగలదేని = ఇష్టమైనచో, ఇందు వచ్చి = ఇక్కడకు వచ్చి, కూర్చుండుము, కాక = అలాకాక, కార్యాంతరాసక్తి = వేరొకపనిమీద ఆసక్తి, కారణముగ = కారణముచేత, ఎచటికైన = ఎక్కడికైనను, ఏగ తలచినవాడవో = వెళ్ళాలనుకుంటున్నావా!

తా. అనఘా! ఇదె బంగారు రత్నసింహాసనము. ఇష్టమైతే ఇక్కడకు వచ్చి కూర్చో. అలాకానిచో ఎక్కడికైనా వేరే పనిమీద ఆసక్తితో వెళ్ళాలనుకుంటున్నావా?

**7 తే. నవ శిరీషసుమంబుల నవకమునకు**
**నన్నదమ్ములవోని నీ యడుగుఁదమ్ము**
**లెంత దూరంబు నడపింప నిచ్చగించె**
**నొక్కొ! నిర్దయమైన నీ యుల్లమిపుడు**

నవ = క్రొత్తవైన, శిరీషసుమంబుల= దిరిసెన పువ్వులయొక్క, నవకమునకు = మార్దవమునకు, అన్నదమ్ములవోని = అన్నదమ్ములవలెనున్న, నీ అడుగు తమ్ములన్ = నీ పాదపద్మములను, నిర్దయమైన, నీ ఉల్లము = నీ మనస్సు, ఇపుడు, ఎంత దూరంబు, నడపింపన్, ఇచ్ఛగించెన్ ఒక్కొ = తలంచెనోకదా!

తా. అనఘా! శిరీష పుష్పముల మార్దవమునకు అన్నదమ్ములవలెనున్న నీ పాదపద్మములను దయలేని నీ మనస్సు ఇపుడు ఎంతదూరము నడిపించాలని తలంచిందోకదా!

**8 సీ. ఏ దేశముననుండి యెచ్చటి కేఁగెదు**
**సంకేత మెయ్యది సంజ్ఞ నీకు**
**రక్షాధికృత జనవ్రాత పాలితమైన**
**శుద్ధాంత మెబ్బంగిఁ జొచ్చితిపుడు**
**ఫలమేమియొక్కొ యీ పటు సాహసమునకు**
**మముఁ గృతార్థులఁ జేయు క్రమముదక్క**
**నాభీల దౌవారికాంధంకరణియైన**
**శక్తి నీ కీ విద్య సంభవించె**
**తే. ఐలుఁడవో యైలబిలు కూర్మి యాత్మజుఁడవొ**
**పంచబాణుండవో దేవపతి సుతుఁడవొ**
**చంద్రుఁడవొ యింకఁ బెక్కు భాషణములేల**
**నిజము దప్పక చెప్పుము నిషధపతివొ**

ఏ దేశముననుండి, ఎచ్చోటికి, ఏగెదవు = వెళ్లెదవు, నీకున్, సంకేతము = గుర్తింపదగిన, సంజ్ఞ = పేరు, ఎయ్యది = ఏది?, రక్షా = సంరక్షించుటయందు, అధికృత = అధికారముగల, జనవ్రాత = జనులసమూహముచేత, పాలితమైన = రక్షింప బడుచున్న, శుద్ధాంతము = అంత:పురము, ఇపుడు, ఎబ్బంగిన్ చొచ్చితి = ఏవిధంగా ప్రవేశించగలిగావు?, మమున్, కృతార్థులన్ = ధన్యులనుగా, చేయు క్రమము తక్కన్ = చేయు రీతియేకాని, ఈ పటు సాహసంబునకున్ = ఈ గొప్ప సాహసకృత్యానికి, ఫలము = ప్రయోజనము, ఏమి ఒక్కొ = ఏమిటోకదా!, ఆభీల = భయంకరులైన, దౌవారిక = ద్వారపాలకులను, అంధం కరణియైన = గ్రుడ్డివారలనుగా చేయునట్టిదైన, శక్తి = సామర్థ్యము, నీకున్, ఏ విద్యచేన్, సంభవించెన్ = కలిగెను. ఐలుడవో = పురూరవ చక్రవర్తివో, ఐలబిలు = కుబేరునియొక్క, కూర్మి తనుజుడవొ = ప్రియపుత్రుడైన నలకూబరుడవొ, పంచబాణుండవో = మన్మథుడవో, దేవపతి సుతుడవొ = ఇంద్రుని కుమారుడగు జయంతుడవొ, చంద్రుడవొ, ఇంకన్, పెక్కుభాషణములు. ఏల, నిషధ పతివొ, నిజము తప్పక, చెప్పుము.

తా. ఏ దేశంనుండి ఎక్కడికి వెళుతున్నావు? నీ గుర్తుగావున్న పేరేమిటి? రక్షణవున్న ఈ అంత:పురంలోకి ఎలా ప్రవేశించగలిగావు? మమ్మల్ని కృతార్థులను చేయటానికి చేసిన పనే కాని ఈ గొప్ప సాహసానికి వేరే ప్రయోజనం ఏమిటో కదా! భయంకరులైన ద్వారపాలకులను గ్రుడ్డివారిని చేసిన నీకీ విద్య ఎలా కలిగింది? పురూరవ చక్రవర్తివా? కుబేరుని

కుమారుడగు నలకూబరుడివా? మన్మథుడవా? ఇంద్రుని కుమారుడగు జయంతుడివా? చంద్రుడివా? ఇంకా ఎక్కువ మాటలెందుకు? నలమహారాజువా? నిజం తప్పకుండా చెప్పు.

**9** **క. ఆరయ నీ యుదయమునకుఁ**
**గారణమై యే కులంబు గాంభీర్యమునం**
**దారాపతిఁ గన్న పయః**
**పారావారంబుతోడఁ బ్రతిఘటియించెన్**

అరయన్ = అలోచింపగా, నీ ఉదయమునకున్ = నీ పుట్టుకకు, కారణమై, ఏ కులంబు, గాంభీర్యమునన్, తారాపతిన్ = చంద్రుని, కన్న, పయ:పారావారంబుతోడన్ = పాలసముద్రముతో, ప్రతిఘటియించెన్ = సామ్యమునుపొందెను.

తా. నీ పుట్టుకకు కారణమైన కులమేది? ఆలోచింపగా నీ పుట్టుకకు కారణమైన కులము గాంభీర్యములో చంద్రుని కన్న పాలసముద్రముతో పోలియున్నది.

**10** **తే. మానవుడవైతివేని నిమ్మహి కృతార్థ**
**విబుధ లోకంబె లోకంబు వేల్పవేని**
**భువనములకెల్ల మీఁదధోభువనమీవు**
**భుజగరాజాన్వయమునందుఁ బుట్టితేని**

ఈవు = నీవు, మానవుడవు ఐతివేని, ఈ మహి = ఈనేల, కృతార్థ = చరితార్థమైనది. ఈవు, వేల్పవు ఏని = దేవతవైనచో, విబుధ లోకంబె = దేవలోకమే, లోకంబు = లోకము, ఈవు, భుజగరాజాన్వయమునందున్ = నాగరాజవంశమునందు, పుట్టితి ఏని , అధోభువనము = పాతాళలోకము, భువనములకెల్లన్ = లోకములన్నిటిలోను, మీదు = పైది (గొప్పది) తా. నువ్వు మానవుడవైతే ఈ భూమండలము చరితార్థమైనది. కాక దేవతవైనచో దేవలోకమే మంచి లోకము. అదియుకాక నీవు సర్వరాజ వంశమునందు పుట్టినవాడవైనచో పాతాలలోకము లోకములన్నిటిలోను గొప్పది.

**11** **ఉ. వానిఁ బ్రశంస సేయఁదగు వాఁడు కృతార్థతముండు వానిచే**
**నీ నిఖిలంబు పావన మహీన కృపా విభవం బెలర్ప నె**
**వ్వాని గృహాంగణంబునకు వచ్చిన త్రోవరజంబులందు నీ**
**మానిత పాదయుగ్మక మమర్చుఁ బ్రపుల్ల సరోజదామమున్**

అహీన కృపా విభవంబు = గొప్ప దయాసంపద, ఎలర్పన్ = ఒప్పునట్లుగా, ఎవ్వాని గృహాంగణంబునకున్ = ఎవనియొక్క ఇంటి వాకిలికి, వచ్చిన = వచ్చినట్టి, త్రోవరజంబులందు = మార్గమందున్న ధూళియందు, నీ మానిత పాదయుగ్మకము = నీ పూజనీయమైన రెండుపాదములు, ప్రపుల్ల సరోజదామమున్ = వికసించిన పద్మమాలికను, అమర్చున్ = కూర్చునో, వానిన్, ప్రశంస చేయ తగున్, వాడు, కృతార్థతముండు = మిక్కిలి కృతార్థుడు, వానిచేన్, ఈ నిఖిలంబు = ఈ సమస్తము, పావన = పవిత్రమైనది.

తా. గొప్ప దయాసంపద ఒప్పునట్లుగా ఎవని ఇంటివాకిలికి వచ్చు త్రోవలోని ధూళియందు నీ పూజనీయమైన పాదములు వికసించిన పద్మమాలికను కూర్చునో వానిని స్తోత్రము చేయవలెను. వాడు మిక్కిలి కృతార్థుడు, వానిచే ఈ సమస్తము పవిత్రమగును

**12** **వ. గుణాద్భుతంబైన పదార్థంబు వర్ణింపకునికి యసహ్యశల్యంబైన వాగ్జన్మ వైఫల్యంబు. ధూర్జటి జటా కిరీటాలంకారంబైన శశాంకుని సౌకుమార్యంబును, నమృతంబునకు నుత్పత్తిస్థానంబగు పయోనిధానంబు గాంభీర్యంబును, విశ్వవిశ్వంభరాంభోజ కర్ణికాయమానంబగు సువర్ణాహార్యంబు ధైర్యంబును, విభ్రమ భ్రూలతాభంగ లీలావిజిత సుమనస్సాయక విలాస రేఖాసారంబై నిర్వికారంబైన యాకారం బెవ్వరియందును గలదె? మేము కృతార్థులమైతిమి. మా జన్మంబులు సఫలంబులయ్యె. మా విలోచనంబులు భాగ్యంబులు సేసె. వీనులు భవదుదంత శ్రవణ కుతుహలాధీనంబులయి యున్నయవి. వాగమృతంబు వానికిం బ్రసాదింపుమనుటయు**

తా. గుణాద్భుతమైన వస్తువును వర్ణింపకపోవడం సహింప తరముకాని శల్యమువంటిదైన వాగ్జన్మ వైఫల్యమే. ఈశ్వరుని జటాకిరీటమునకు భూషణమైన చంద్రుని సౌకుమార్యమును, అమృతమునకు పుట్టుకస్థానమగు పాలసముద్రము గాంభీర్యమును, సమస్త భూమండలమనెడి పద్మమునకు కర్ణికయైన మేరుపర్వతముయొక్క ధైర్యమును, విలాసములుకల లతవంటి కనుబొమల ముడిచేత హేలగా జయింపబడిన మన్మథుని లీలాసమృద్ధియొక్క నిగ్గుగలదై ఏ వికారమును లేని రూపము ఎవరియందైనను ఉంటుందా? మేము కృతార్థులమయ్యేం. మా జన్మములు సఫలములయ్యాయి. మా కనులు అదృష్టం చేసుకున్నాయి. చెవులు నీ విషయాన్ని వినాలనే కోరికకు అధీనములయి ఉన్నాయి. నీ మాటల అమృతమును ఆ చెవులకు దయచేయుము అనుటతో

**13** **ఉ. అంకిలి లేక యప్పు దరుణాధర పల్లవ నిర్గతంబులై**

**పంకరుహాయతాక్షి నునుఁబల్కులు తేనియలొల్కుచున్ శ్రవో**
**లంకృతులై నృపాలు మది లగ్నములయ్యె వినోదలీలకై**
**మంకెనపూవు చాపమున మన్మథుఁ డేసిన తూపులోయనన్**

అప్పుడు = ఆ సమయమందు, అంకిలి లేక = అడ్డులేకుండగ, అరుణ = ఎఱ్ఱనైన, అధరపల్లవ = చిగురువంటి పెదవినుండి, నిర్గతంబులై = బయల్పడినవై, పంకరుహాయతాక్షి = పద్మములవంటి కన్నులుకల దమయంతియొక్క, నును పల్కులు = మృదు వచనములు, తేనియలు ఒల్కుచున్, శ్రవోలంకృతులై = చెవులకలంకారభూతములై, వినోదలీలకై = వినోదము కొఱకు, మంకెనపూవు, చాపమున = వింటితో, మన్మథుడు, ఏసిన, తూపులో అనన్ = బాణములో అనునట్లుగా, నృపాలు మదిన్, లగ్నములు అయ్యెన్ = తాకెను

తా. ఆ సమయమందు ఏ అడ్డు లేకుండగా ఎఱ్ఱనైన చిగురువంటి పెదవులనుండి బయల్పడిన దమయంతియొక్క మృదువచనములు తేనెల నొల్కబోయుచు చెవుల కలంకారభూతములై వినోదంకోసం మన్మథుడు మంకెనపూవు వింటితో వేసిన బాణములోయనునట్లుగా రాజుమదిని తాకెను.

14 **వ. అనంతరంబ దమయంతీ శాసనంబున సఖీజనంబు కనకాసనంబు వెట్టిన**

15 **ఆ. అవ్వరాసనంబునందు నాసీనుఁడై**
**యర్కుఁడుదయశిఖరియందుఁబోలెఁ**
**గొనియె నిషధరాజు వనజాతముఖులచే**
**నాతిథేయమైన యర్ఘ్య పూజ**

అవ్వరాసనంబునందున్ = ఆ శ్రేష్ఠమైన సింహాసనమనందు, అర్కుడు = సూర్యుడు, ఉదయశిఖరియందున్‌పోలె = ఉదయాద్రి యందునువలె, ఆసీనుడై = కూర్చున్నవాడై, నిషధరాజు, వనజాతముఖులచే = చెలికత్తెలచేత, ఆతిథేయమైన = అతిథులకుచేయదగిన, అర్ఘ్యపూజ = అర్ఘ్య పూజను, గొనియె = స్వీకరించెను.

తా. ఆ బంగారు సింహాసనమున సూర్యుడు ఉదయాద్రియందునువలె కూర్చున్నవాడై నలమహారాజు చెలికత్తెలచేత అతిథులకు చేయదగిన పూజను స్వీకరించెను.

16 **వ. ఇట్లు సంభావితుండై యంభోరుహాక్షులు తన్ను వీక్షించుచు సంజాతకౌతుకంబున** వింజమాకిఁడిన **భంగి నూరకుండ నప్పుణ్యశ్లోకుండు ప్రావృషేణ్య పయోధరధ్వాన గంభీరంబైన యెలుంగున దమయంతి నుద్దేశించి**

తా. ఈ విధంగా పూజింపబడినవాడై చెలికత్తెలు తనను చూచుచు సందేహము పుట్టినవారలై సూర్యగమనమునకు వింధ్యపర్వతము అడ్డుపడిన విధముగా ఊరుకొనగా ఆ పుణ్యకీర్తిగల నలమహారాజు వర్షాకాల మేఘధ్వనివలె గంభీరమైన కంఠధ్వనితో దమయంతిని ఉద్దేశించి

17 **సీ. ఏను దిక్పతుల యాస్థానంబునందుండి**
**యరుగుదెంచితి నీకు నతిథి నగుచుఁ**
**బ్రాణంబులునుబోలె నంతరంగమునందుఁ**
**దత్కార్యభరమును దాల్చినాఁడఁ**
**చరితార్థమునుజేయఁ జను నాదు దూత్యంబు**
**నాతిథ్య సత్కారమదియ నాకుఁ**
**గాలయాపన సేయఁగాదు నిశ్చయముపైఁ**
**గర్తవ్యమగునట్టి కార్యమునకు**
**తే. నుల్ల మిప్పు డేకాగ్రమై యున్నయదియె**
**యవసరంబౌనె దేవరహస్యమునకు**
**వింతవారలు లేరుగా నింత నంత**
**నువిద! మనవారలేకదా! యున్నవారు**

ఏను = నేను, దిక్పతుల యాస్థానంబునుండి, నీకున్, అతిథిని అగుచు, అరుగుదెంచితి = వచ్చితిని. అంతరంగమునందున్ = హృదయమునందు, తత్కార్యభరమును = వారి కార్యభారమును, ప్రాణంబులునుపోలె = ప్రాణములనువలెనే, తాల్చినాడ = వహించినాను. నాదు దూత్యంబు = నా దూత కార్యమును, చరితార్థమును చేయన్ చనున్ = సఫలమగునట్లుగా చేయదగును, నాకు, అదియ, ఆతిథ్య సత్కారము. కాలయాపన, చేయ కాదు = చేయుట కుదరదు. నిశ్చయముపైన్ = నీ నిర్ణయముపైననే, అగునట్టి కార్యమునకు = జరగబోయేపనికి(స్వయంవరమునకు), కర్తవ్యము = ప్రయోజనము. ఇప్పుడు, ఉల్లము = మనస్సు, ఏకాగ్రమై ఉన్నయదియె = నిశ్చలముగా ఉందికదా!, దేవరహస్యమునకు, అవసరంబు ఔనె = సమయమేనా? ఇంతన్ అంతన్ = ఇక్కడ అక్కడ, వింతవారలు = పరాయివారు, లేరుగా = లేరుకదా!, ఉవిద = ఓ కాంతా! ఉన్నవారు

మనవారలేకదా!

తా. నేను దిక్పాలకుల యాస్థానమునుండి వచ్చితిని. వారి కార్యభారమును హృదయమునందు ప్రాణములనువలెనే వహించినాను. నా దూతకార్యమును ఫలవంతమగునట్లుగా చేయదగును. నాకు అదియే అతిథి సత్కారము. కాలయాపన చేయుట కుదరదు. నీ నిర్ణయముపైననే జరుగబోవు స్వయంవరము ఆధారపడియున్నది. ఇపుడు నీ మనస్సు నిశ్చలముగా ఉందికదా! దేవరహస్యం చెప్పడానికి సమయమేనా? ఇక్కడ అక్కడ పరాయివారెవరూ లేరుకదా? ఓ కాంతా! ఉన్నవాళ్ళంతా మనవాళ్లేకదా!

**18 క. నాకౌకః ప్రవరులు ని**
**న్నాకాంక్షించిన ప్రయోజనాంశము దిరమై**
**యాకర్ణింపుము చెప్పెద**
**నాకర్ణపుటాయతాక్షి! యవధానమునన్**

ఆకర్ణపుటాయతాక్షి = విశాలమైన కన్నులుకలదానా!, నాకౌకః ప్రవరులు = స్వర్గ శ్రేష్ఠులు, నిన్ను, ఆకాంక్షించిన = కోరిన, ప్రయోజనాంశము = సమాచారమును, చెప్పెద, తిరమై = నిశ్చలముగా, అవధానమునన్ = సావకాశముగా, ఆకర్ణింపుము = వినుము.

తా. విశాలమైన కన్నులుకలదానా! స్వర్గ శ్రేష్ఠులు నిన్ను కోరిన సమాచారమును చెపుతాను, నిశ్చలముగా, సావకాశముగా వినుము.

**19 వ. పాకశాసన పావక పరేతరాజ పాశపాణులు పుత్తేరం బనిబూని వచ్చితి. చిత్తగించి యక్కార్యంబు వినుము. అప్పరమ పురుషులు పరిషన్మధ్యంబునం బంకజాసను తనూభవుని వలనం ద్రిభువనమోహనంబులైన నీ రూప లావణ్య విలాస విభ్రమాది గుణంబులు విని వినుకలి వలవంత నెంతయుఁ జలించి పంచేషు లుంఠిత ధైర్య విత్తంబులగు తమ చిత్తంబులంగల వృత్తాంతంబు లంతయుం దెలియంజెప్పిరి. ఇప్పు డయ్యాశాపతు లాశాపాశంబులఁ గట్టువడినారు. వారియందును సంక్రందనుండు**

తా. ఇంద్రుడు, అగ్ని, యముడు, వరుణుడు పంపగా పనిమీద వచ్చాను. మనసుపెట్టి ఆ పనిని వినుము. ఆ పురుష శ్రేష్ఠులు సభా మధ్యమున నారదునివలన త్రిలోక మోహనమైన నీ రూప లావణ్య విలాస విభ్రమాది గుణంబులు విని, వినుటవలన మన్మథబాధతో మిక్కిలి పీడితులయి, మన్మథునిచే అపహరింపబడిన ధైర్యసంపదకలవారగుచు వారి మనసులలో గల విషయమునంతను తెలియచెప్పిరి. ఇప్పుడు ఆ దిక్పతులు ఆశాపాశాలతో బంధింపంబడియున్నారు. వారిలోను ఇంద్రుడు.

**20 తే. నందనోద్యాన వీథికాంతరములందుఁ**
**బూర్ణచంద్రాస్య! విహరింపఁబోవ వెఱచుఁ**
**గల్పతరు పల్లవంబులు గమిచి మేసి**
**కోకిలం బెప్డు గూయునో కొసరియనుచు**

పూర్ణచంద్రాస్య = నిండుచంద్రునివంటి ముఖముకలదానా!, కల్పతరు పల్లవంబులు = కల్పవృక్షపు చిగుళ్ళు, కమిచి మేసి = కబళించి, కోకిలంబు, కొసరి = మిగులునట్లుగా, ఎప్డు కూయునో అనుచు, నందనోద్యాన, వీథికా = చెట్లపంక్తులయొక్క, అంతరములందున్ = మధ్యభాగములందు, విహరింపన్ పోవన్ = విహారమునకు వెళ్ళుటకు, వెఱచున్ = భయపడును

తా. ఓ పూర్ణచంద్రాస్య! కల్పవృక్షపు చిగుళ్ళు కబళించి కోకిల మళ్ళీ మళ్ళీ ఎప్పుడు కూస్తుందోనని విరహముతో నందనోద్యానవన చెట్లపంక్తుల మధ్యభాగమున విహరించుటకు వెళ్ళుటకు భయపడుచున్నాడు.

**21 తే. పరమమగు కోటి కెక్కెనో పద్మనయన!**
**నవనవంబైన నీ జవ్వనంబుతోన**
**యసమబాణుని చాపంబునందు గుణము**
**భామ! నీయందు సుత్రాము ప్రేమగుణము**

ఓ పద్మనయన!, నవనవంబైన = మిక్కిలి క్రొత్తదైన, నీ జవ్వనంబుతోన = నీ యౌవనముతోడనే, అసమబాణుని = మన్మథుని యొక్క, చాపంబునందు = వింటియందు, గుణము = అల్లెత్రాడు, పరమమగు కోటికిన్ = గొప్పదగు వింటికొనకు, ఎక్కెను, భామ = కాంతా!, నీయందు, సుత్రాము = ఇంద్రునియొక్క, ప్రేమ గుణము = ప్రేమాతిశయము, పరమమగు = ఉత్కృష్టమగు, కోటికి = అంచునకు, ఎక్కెనో = చేరిందో (అలంకారము – తుల్యయోగిత, సహోక్తి)

తా. ఓ పద్మనయన! మిక్కిలి క్రొత్తదైన నీ యౌవనముతోడనే మన్మథుని వింటియందు అల్లెత్రాడు వింటికొనకు ఎక్కింది, కాంతా! నీయందు ఇంద్రుని ప్రేమాతిశయము ఉత్కృష్టమగు అంచునకు చేరింది!

**22 ఉ. ఆరసి చూచి తాపమునయందును, రూపమునందుఁ బూర్ణిమా**
**తారకరాజుగాఁ దలఁచి తన్వి! భవద్విరహాతురుండు జం**

భారి నిగుడ్చు భ్రాంతి నుదయావసరంబుల నొద్దనుండి రో
షారుణమైన లోచన సహస్రము బాలసహస్రభానుపైన్

తన్వి = ఓ కాంతా!, భవద్విరహాతురుండు = నీ విరహముతో బాధపడుచున్న, జంభారి = ఇంద్రుడు, భ్రాంతిన్, ఉదయావసరంబులన్ = ఉదయ సమయములందు, ఒద్దన్ ఉండి = దగ్గరగా ఉండి, అరసి చూచి = నిదానించి చూచి, తాపమునయందున్ = వేడియందును, రూపమునందున్ = ఆకారమునందును, పూర్ణిమా తారకరాజుగాన్ = పున్నమి చంద్రునిగా, తలంచి, బాలసహస్రభానుపైన్ = బాలసూర్యునిపైన, రోష = కోపముచే, అరుణమైన = ఎఱ్ఱనైన, లోచన సహస్రము = వేయి కన్నులను, నిగుడ్చున్ = ప్రసరింపచేయును

తా. ఓ కాంతా! నీ విరహముతో బాదపడుచున్న ఇంద్రుడు భ్రాంతితో ఉదయసమయములందు దగ్గరగా ఉండి, నిదానించి చూసి వేడియందును, రూపమునందును పున్నమినాటి చంద్రునిగా తలచి బాలసూర్యునిపైన కోపంతో తన ఎఱ్ఱనైన వేయికన్నులను ప్రసరిపంచేస్తాడు.

**23 తే. మూఁడు కన్నుల వేల్పుతో మోహరించి**
**నేఁడు దేహంబు లేక యున్నాఁడు దాను**
**వేయిగన్నుల వేల్పుతో విగ్రహించి**
**వనిత! యింకేమి గానున్నవాఁడొ మరుఁడు**

వనిత = ఓ లలనా!, మూడుకన్నులవేల్పుతో = శివునితో, మోహరించి = విరోధించి, మరుడు = మన్మథుడు, నేడు = ఈనాడు, తాను, దేహంబులేక, ఉన్నాడు. వేయి కన్నుల వేల్పుతో = ఇంద్రునితో, విగ్రహించి = విరోధించి, ఇంకేమి, కానున్నవాడొ

తా. ఓ లలనా! శివునితో విరోధించి మన్మథుడు ఇప్పటికి శరీరంలేకుండా ఉన్నాడు. మరి ఇంద్రునితో విరోధించి ఇంకేమి కానున్నాడో?

**24 చ. చిలుకలు వల్కునో చెవులు చిల్లులువోవఁగనంచు నెన్నఁడున్**
**వెలలఁడు నందనోపవన వీథులకై యటు మౌళిభాగ ని**
**ర్మల శశిరేఖమీఁది యపరాధమునన్ గజదైత్యశాసనుం**
**గొలువఁడు పాకశాసనుఁడు గోమలి నీపయి కూర్మిపెంపునన్**

పాకశాసనుడు = ఇంద్రుడు, చిలుకలు, చెవులు చిల్లులు పోవగన్ = చెవులు చిల్లులుపడునట్లుగా, పల్కునో, అంచు = అనుచు, ఎన్నడున్, నందనోపవన వీథులకై = నందనోద్యాన పంక్తులకు, వెలలడు = వెళ్ళడు. అటు = ఆ రీతిగానే, కోమలి, నీపయి కూర్మి పెంపునన్ = నీపయి ప్రేమాతిశయముతో, మౌళి = శిరమునందున్న, నిర్మల = స్వచ్ఛమైన, శశిరేఖ మీది = చంద్రరేఖమీద, అపరాధమునన్ = దోషముచేత, గజదైత్యశాసనున్ = గజాసురుని చంపిన శివుని, కొలువడు = సేవింపడు.

తా. చెవులు చిల్లులుపడేలా కూస్తాయని ఇంద్రుడు ఎన్నడూ నందనోద్యానానికి వెళ్ళడు. ఆ రీతిగానే నీమీది ప్రేమాతిశయముచే నెత్తిన చంద్రరేఖ ధరించిన దోషముచేత శివుణ్ణి సేవింపడు.

**25 తే. స్మరశిలీముఖ కుసుమ కేసర పరాగ**
**ధూళిపాళికఁ జిలికించెఁ దూర్పుదిక్కు**
**యింతి వేగన్నులను గానఁ డింద్రుఁ డిపుడు**
**నీ విలాసంబు పెంపు వర్ణింపఁ దరమె**

స్మర = మన్మథునియొక్క, శిలీముఖ = బాణములయిన, కుసుమ = పుష్పములయొక్క, కేసర = కింజల్కములయొక్క, పరాగ ధూళి పాళికన్ = పరాగమనెడి దుమ్మునంతను, తూర్పుదిక్కు, చిలికించెన్ = ఒలకబోసెను. ఇపుడు, ఇంద్రుడు, వేగన్నులను = వేయికన్నులున్నను, కానడు = చూడలేకపోవుచున్నాడు. ఇంతి = ఓ పడతీ!, నీ విలాసంబు = సీ సౌందర్యముయొక్క, పెంపు = అతిశయము, వర్ణింపన్ దరమె = వర్ణించుటకు శక్యమగునా?

తా. మన్మథుని బాణములయిన పుష్పముల కింజల్కములయొక్క పరాగ ధూళినంతను తూర్పుదిక్కున ఒలకపోసెను. కావున ఇపుడు ఇంద్రుడు వేయికన్నులున్నను చూడలేకపోవుచున్నాడు. ఓ పడతీ! నీ సౌందర్యము వర్ణింప శక్యమా?

**26 తే. విరహతాప ప్రశాంతికై విబుధపతికి**
**నార్ద్రపర్యంక విధికిఁగా నపచయింపఁ**
**బరుల లేములు వాపంగఁ బాలుపడిన**
**యమరతరువుల కొదవెఁ బుష్పముల లేమి**

విబుధపతికిన్ = ఇంద్రునికి, విరహతాపప్రశాంతికై = విరహతాపమును పోగొట్టుటకై, ఆర్ద్ర = చల్లని, పర్యంక = పానుపులను,

విధికిగాన్ = ఏర్పరచు నిమిత్తము, అపచయింప = కోయగా (పూవులను), పరుల లేములు = ఇతరుల లేమితనమును, పాపంగన్ = పోగొట్టుటకు, పాలుపడిన = ప్రయత్నించిన, అమరతరువులకు = కల్పవృక్షములకు, పుష్పముల లేమి = పూవులు లేకపోవుట, ఒదవె = కల్గెను.

తా. ఇంద్రునికి విరహతాపశాంతికై చల్లని పానుపులను ఏర్పరచు నిమిత్తము కోసివేయుటచే, ఇతరుల లేమితనమును పోగొట్టుటకు పాటుపడిన కల్పవృక్షములకు పూవుల లేమి కలిగినది.

**27 మ. విను వైదర్భి భవద్వియోగదవధూద్వేగంబు వారించుచున్**
**దినముల్ పుచ్చుచు నున్నవాఁడు విబుధాధీశుండు మందాకినీ**
**కనకాంభోరుహ నాళ కల్పిత నవాకల్పంబులం జారు నం**
**దన మందార తరు ప్రవాళమయ చింతారత్న తల్పంబులన్**

వైదర్భి = విదర్భరాజపుత్రీ!, విను, భవత్ = నీయొక్క, వియోగ దవధూ = విరహాగ్నియొక్క, ఉద్వేగంబున్ = ఆధిక్యమును, వారించుచున్ = అడ్డుకొనుచు, మందాకినీ = ఆకాశగంగయందలి, కనకాంభోరుహ = బంగారు పద్మములయొక్క, నాళ = తూండ్లచే, కల్పిత = ఏర్పరచబడిన, నవ ఆకల్పంబులన్ = క్రొత్త ఆభరణములచేతను, చారు = మనోహరమయిన, నందన = నందనవనమందలి, మందార తరు = కల్పవృక్షములయొక్క, ప్రవాళమయ = చిగుళ్ళతోనిండిన, చింతారత్న పానుపులన్ = చింతామణిరత్న పానుపులయందు, దినముల్, పుచ్చుచునున్నవాడు = జరుపుచున్నాడు.

తా. విదర్భరాజపుత్రీ! విను. నీ విరహాగ్నియొక్క ఆధిక్యము నడ్డుకొనుచు, ఆకాశగంగయందలి బంగారుపద్మములయొక్క తూండ్లచే ఏర్పరచబడిన సరిక్రొత్త ఆభరణములచేతను, మనోహరమయిన నందనవనమందలి మందారవృక్షముల చిగుళ్ళతో నిండిన చింతామణిరత్న పానుపులయందును రోజులు గడపుచున్నాడు.

**28 ఉ. పుష్ప ధనుర్లతా మధుపపుంజ గుణక్వణనం బొనర్చి వా**
**స్తోష్పతి కర్ణముల్ మనసిజుండు చెవుడ్పడఁ జేసె నక్కటా!**
**గీష్పతి యేమి చెప్ప నిటఁ గ్రింద బలారికిఁ గామవిక్రియా**
**దుష్పథవృత్తికిన్ మనసు దూర్పమికై బహునీతిశాస్త్రముల్**

మనసిజుండు = మన్మథుడు, పుష్పధనుర్లతా = తీగెవంటి పూలధనువుయొక్క, మధుప పుంజ = తమ్మెదలసమూహముల, గుణ = నారిని, క్వణనంబొనర్చి = ధ్వనిని చేసి, అక్కటా = అయ్యో, వాస్తోష్పతి కర్ణముల్ = ఇంద్రుని చెవులను, చెవుడ్పడన్ చేసె = వినపడకుండా చేసెను, గీష్పతి = బృహస్పతి, ఇటన్ క్రింద = ఇంతకుముందు, కామవిక్రియా = మన్మథవికారమనెడి, దుష్పథ = చెడుమార్గమందు, వృత్తికిన్ = ప్రవర్తించుటకు, మనసు దూర్పమికై = మనసు పోకుండుటకై, బలారికిన్ = ఇంద్రునకు, బహునీతి శాస్త్రముల్, చెప్పన్, ఏమి = ఏమి ప్రయోజనము?

తా. మన్మథుడు పూలధనువుయొక్క తుమ్మెదల నారిని ధ్వనిని చేసి అయ్యో! ఇంద్రుని చెవులు వినపడకుండ చేసెను. బృహస్పతి ఇంతకుముందు మన్మథవికారమనెడి చెడుమార్గమందు వెళ్ళుటకు మనసు పోకుండుటకై ఇంద్రునకు ఎన్ని నీతి శాస్త్రములు చెబితే ఏం ప్రయోజనము?

**29 తే. చెలువ! జంభారి యాసకుఁ గొలఁది యేది**
**తా సహస్రాక్షుఁడై యుండి దైన్యవృత్తి**
**నభిలషించుచునున్నవాఁ డాత్మలోనఁ**
**జంచలంబైన నీ కటాక్షాంచలంబు**

తాన్, సహస్రాక్షుడైయుండి, దైన్యవృత్తిన్ = దీనత్వముతో, ఆత్మలోన్ = మనస్సులో, చంచలంబైన = చలించుచున్నదైన, నీ కటాక్షాంచలంబు = నీ క్రీగంటిచూపును, అభిలషించుచున్ = కోరుచూ, ఉన్నవాడు, చెలువ = కాంతా!, జంభారి యాసకున్ = ఇంద్రుని ఆశకు, కొలది ఏది = మితి ఏది?

తా. తాను సహస్రాక్షుడైయుండి దీనత్వంతో మనస్సులో చలించుచున్న నీ క్రీగంటిచూపును కోరుచూ ఉన్నాడు. కాంతా! ఇంద్రుని ఆశకు అంతు ఉందా?

**30 క. ఏ వేల్పు సోమపీథులు**
**సేవింతురు ముఖ్య తనువు శివునకు నే వే**
**ల్పేవేల్పు వెలుఁగులకు గని**
**యా వేలుపు నిను వరింప నాకాంక్షించెన్**

ఏ వేల్పున్, సోమపీథులు = యాగము చేయువారు, సేవింతురు, ఏ వేల్పు, శివునకున్, ముఖ్య తనువు = ప్రధాన శరీరమో, ఏ వేల్పు, వెలుగులకు గని = కాంతులకు స్థానమో, ఆ వేలుపు, నిను వరింపన్, ఆకాంక్షించెన్ = కోరెను

తా. ఏ దేవతను యాగముచేయువారు సేవింతురో, ఏ దేవత శివునకు నేత్రమో, ఏ దేవత కాంతులకు నిలయమో, ఆ దేవత నిన్ను వరించుటకు కోరుచున్నాడు.

**31 ఉ. స్థాణుని లోచనాంచలము దాఁపుగఁ దీవ్రతరార్చులన్ నిజ**
**ప్రాణముఁ గొన్ననాఁటి పగ యాత్మఁ దలంచియొ నీ కటాక్ష దృ**
**క్కోణము ప్రాపున న్మరుఁడు గోల్కొని పంతమెలర్పఁగా గొనెన్**
**బాణ దశార్థ పాతమునఁ బావకు భూరి మనోభిరామమున్**

మరుదు = మన్మథుడు, స్థాణుని = శివుని, లోచనాంచలము = క్రీగంటి చూపు, దాపుగ = సాయముగ, తీవ్రతరార్చులన్ = భయంకరమైన మంటలచే, నిజ ప్రాణమున్ = తన ప్రాణమును, కొన్న నాటి పగ, ఆత్మ తలంచియొ, నీ కటాక్ష దృక్కోణము ప్రాపునన్ = నీ కరుణాకటాక్షము తోడుగా, కోల్కొని = విజృంభించి, పంతము ఎలర్పగా = పట్టుదల కలుగునట్లుగా, బాణ దశార్ధ పాతమునన్ = అయిదు బాణములచే, పావకు = అగ్నిదేవునియొక్క, భూరి మనోభిరామమున్ = గొప్ప మనసులోని అభిమానమును, కొనెన్ = తీసుకొనెను.

తా. మన్మథుడు శివుని క్రీగంటి చూపు సాయముగా తీవ్రమైన మంటలచే తన ప్రాణములను తీసుకొన్ననాటి పగను మనసున తలంచియేమో నీ కరుణా కటాక్షము తోడుగా విజృంభించి పట్టుదలతో అయిదు బాణములచే అగ్నిదేవుని గొప్పదైన మనసులోని అభిమానమును హరించెను.

**32 తే. ఉవిద! సోమరసంబన్న నోకిలించు**
**నడిచిపడు నాజ్యహోమ మంత్రాహుతులకు**
**నిచ్చసేయదు మనములో నిధ్మములకుఁ**
**బావకుందును బాల నీపై విరాళి**

ఉవిద = ఓ పడతీ!, పావకుందును = అగ్నియును, నీపై విరాళిన్ = నీపై విరహముతో, సోమరసంబన్నన్, ఓకిలించున్ = అసహ్యపడును, ఆజ్యహోమమంత్ర ఆహుతులకు = నేతితోచేయు హోమమంత్ర ద్రవ్యములకును, అడిచిపడున్ = మండిపడును, మనములోన్, ఇధ్మములకున్ = సమిధలకు, ఇచ్చచేయదు = కోరదు.

తా. ఓ పడతీ! అగ్ని నీపై విరహముతో సోమరసమంటే అసహ్యపడుతున్నాడు. హోమద్రవ్యములంటే మండిపడు తున్నాడు. సమిధలను ఇష్టపడటంలేదు.

**33 తే. తరుణి యాత్మప్రతాప సంతప్తుఁ జేసి**
**పుష్పనారాచుఁ దగ్నికి బుద్ధి సెప్పె**
**నాత్మవత్సర్వభూతాని యనెడి నీతి**
**నన్య తాపంబు శిఖి మానునట్లుగాగ**

తరుణి = ఓ బాలా!, శిఖి = అగ్ని, సర్వ భూతాని = సమస్త ప్రాణులును, ఆత్మవత్ నీతి = తనవలెనే అనెడు నీతిని గ్రహించి, అన్యతాపంబు = ఇతరులను వేధించుట, మానునట్లుగాగ, పుష్పనారాచుండు = ఆ మన్మథుడు, ఆత్మ = తనయొక్క, ప్రతాప = ప్రతాపముచే, సంతప్తున్ చేసి = సంతాపముకలవానినిగా చేసి, అగ్నికిన్, బుద్ది చెప్పె.

తా. ఓ బాలా! అగ్ని సమస్త ప్రాణులును తనవలెనే అనెడు నీతిని గ్రహించి ఇతరులను వేధించుట మానునట్లుగా ఆ మన్మథుడు తనయొక్క ప్రతాపముచే అగ్నిని సంతాపముకలవానినిగా చేసి బుద్ధిచెప్పెను.

**34 క. కుసుమాయుధు బాణంబులఁ**
**గసుగంది భవద్వియోగ కలుషత నర్చా**
**వసరంబుల నర్చకు లిడు**
**కుసుమములకు వెఱచు వహ్ని కువలయనేత్రా!**

కువలయనేత్రా = కలువలవంటి నేత్రములుకలదానా! వహ్ని = అగ్ని, కుసుమాయుధు బాణంబులన్ = మన్మథుని బాణములకు, కసుగంది = వాడిపోయి, భవత్ = నీయొక్క, వియోగ కలుషతన్ = విరహ వికారముచేత, అర్చావసరంబులన్ = పూజా సమయములందు, అర్చకులు, ఇడు = ఇచ్చెడు, కుసుమంబులకున్ = పూవులకును, వెఱచు = భయపడును.

తా. ఓ కాంతా! అగ్ని మన్మథుని బాణములకు వాడిపోయి నీ విరహ వికారముచేత పూజాసమయములందు అర్చకులు ఉంచెడు పుష్పములకును భయపడిపోతున్నాడు.

**35 ఉ. బాలిక నీవు హేతువుగ భానుకులాభరణంబు దక్షిణం**
**బేలెడు రాజు ధర్మముల కెల్లను గందువ ధర్మరాజు లోఁ**
**దౌలు మనోభవాగ్నిఁ దన తాలిమి యాహుతిగాఁ గ్రమంబునన్**
**వేలుచుచున్నవాఁ డభినివిష్ట సుఖైక ఫలాభికాంక్షియై**

బాలిక, నీవు, హేతువుగ = కారణముగా, భానుకులాభరణంబు = సూర్యవంశ ఆభరణము, దక్షిణంబేలెడు రాజు = దక్షిణదిక్కు పాలకుడు, ధర్మముల కెల్లను = ధర్మములన్నిటికిని, కందువ = చోటయినవాడు, ధర్మరాజు = యముడు, అభినివిష్ట = తగుల్కొన్న, సుఖ = సౌఖ్యమనెడి, ఏక = ఒక్కటే, ఫల = ప్రయోజనమును, ఆకాంక్షియై = కోరుచున్నవాడై లోన్ తౌలు =

మనసున పుట్టిన, మనోభవాగ్నిన్ = మన్మథాగ్నిచే, తన తాలిమి = తన ఓర్పు, క్రమంబునన్, ఆహుతిగాన్, వేలుచు చున్నవాడు = హోమముచేయుచున్నాడు.

తా. బాలికా! నీవు కారణముగ సూర్యుని పుత్రుడు, దక్షిణదిక్కు పాలకుడు, ధర్మములన్నిటికి స్థానమయినవాడునైన యముడు విరహమున తగుల్కొని సంగమసుఖమొక్కటే ప్రయోజనముగా కోరుచున్నవాడై మనసున పుట్టిన మన్మథాగ్నిచే తన ఓర్పును క్రమంగా ఆహుతిగా హోమము చేయుచున్నాడు.

**36 క. చండజ్వర జర్జరమును**
**బాండురమునునైన మేను బాలిక! దాల్చెన్**
**దండధరు డిపుడు సుమనః**
**కాండౌజః కీర్తిభారకలితుఁడ పోలెన్**

బాలిక, దండధరుడు = యముడు, ఇపుడు, సుమన:కాండ = పూవులే బాణములుగాకల మన్మథుని, ఓజ: = ప్రతాపముయొక్కయు, కీర్తి = యశముయొక్కయు, భార = అతిశయముచే, కలితుడపోలెన్ = ఒప్పుచున్నవాడునువలె, చండజ్వర = తీవ్రమైన తాపముచే, జర్జరమును = సోలినదియు, పాండురమునునైన = తెల్లబడినదియునైన, మేనున్ = శరీరమును, తాల్చెన్ = ధరించెను. (అలంకారము – ఉత్ప్రేక్ష)

తా. ఓ బాలా! యముడు ఇప్పుడు మన్మథుని ప్రతాపముయొక్కయు, కీర్తియొక్కయు అతిశయముచే ఒప్పుచున్నవాడును వలె తీవ్రమైన తాపముచే సోలినదియు, తెల్లబడినదియునైన దేహమును ధరించియున్నాడు.

**37 క. బిసరుహలోచన సంధ్యా**
**ఘుసృణ సమాలంభ కర్మకుతుకారంభ**
**వ్యసన సముజ్జృంభితయగు**
**దెస నేలెడు రాజు నిన్ను ధృతిఁ గామించెన్**

బిసరుహలోచన = పద్మములవంటినేత్రములుకలదానా!, సంధ్యా = సాయంకాలమందు, ఘుసృణ = కుంకుమను, సమాలంభ = పూనుకొనుటయనెడి, కర్మ = పనియందలి, కుతుక ఆరంభ = అతిశయమైన వేడుకచే, వ్యసన = ఆసక్తిచేత, సముజ్జృంభితయగు = అతిశయించుచున్నదైన, దెసన్ = దిక్కును, ఏలెడు = పాలించు, రాజు, నిన్ను, ధృతిన్ = సంతోషముతో, కామించెన్ = కోరుకొనెను.

తా. బిసరుహలోచనా! సాయంకాలసమయమందు కుంకుమను పూసుకొనుటయనెడి పనియందు వేడుకచే అతిశయించు దిక్కును (పశ్చిమం)పాలించు రాజు(వరుణుడు) నిన్ను సంతోషముతో కోరుకొనుచున్నాడు.

**38 క. మదిరాక్షి జలధి నశ్వా**
**వదనోత్థితమైన హవ్యవాహము పోలెన్**
**హృదయస్థాన స్థితమగు**
**మదనానల మబ్ధిరాజు మద మణగించెన్**

మదిరాక్షి = మత్తెక్కించే కన్నులుకలదానా!, జలధిన్ = సముద్రమందు, అశ్వా వదనోత్థితమైన = ఆడుగుఱ్ఱము నోటినుండి పుట్టినదైన, హవ్యవాహమపోలెన్ = అగ్నిహోత్రుని విధమున, హృదయస్థానస్థితమగు = హృదయమందున్నదైన, మదనానలము = మన్మథ అగ్నిహోత్రము, అబ్ధిరాజు మదము = వరుణుని గర్వమును, అణగించెన్ = అణచెను. (అలం – అతిశయోక్తి)

తా. మదిరాక్షీ! సముద్రమందు ఆడుగుఱ్ఱమునోటినుండి పుట్టినదైన అగ్నిహోత్రము విధాన హృదయమందలి మన్మథాగ్ని వరుణుని గర్వమును అణచివేసినది. (సముద్రమధ్యమునందు 'బడబ'అను ఆడుగుఱ్ఱము కలదనియు, దాని నోటినుండి అగ్ని పుట్టి సముద్రపు నీరు ఎచ్చకుండునట్లు హరించుననియు చెప్పుదురు)

**39 తే. తరుణి తద్భుజమధ్య మధ్యంబునందు**
**నవమృణాళిక దండ ఖండంబు మెఱయుఁ**
**దన్మనోమగ్న మదనాస్త్ర తతులచేత**
**నాక్షణంబ శతచ్ఛిద్రమైన భంగి**

తరుణి = యౌవనవతీ!, తద్భుజమధ్య = ఆ వరుణుని వక్షఃస్థలముయొక్క, మధ్యంబునందు = మధ్యభాగమున, నవ మృణాళికదండ = తామరతూండ్లయొక్క, ఖండంబు = ముక్క, తత్ = ఆ వరుణునియొక్క, మనోమగ్న = మనసునకు తగిలిన, మదనాస్త్ర తతులచేత = మన్మథబాణముల సమూహముచేత, ఆ క్షణంబ, శతచ్ఛిద్రమైన భంగిన్ = నూఱు ముక్కలయినట్లుగా, మెఱయున్ = ప్రకాశించును.

తా. తరుణీ! ఆ వరుణుని వక్షఃస్థల మధ్యభాగమునకల తామరుతూండ్ల ముక్కలు ఆ వరుణునియొక్క మనసునకు తగిలిన మన్మథాస్త్ర సమూహములచే ఆ క్షణంలోనే మనసు నూఱుముక్కలయినట్లుగా ప్రకాశించుచున్నది.

**40 వ. ఈ చందంబునం ద్రిలోక తిలకులగు నా దిశావల్లభులు భవదాయల్లకభరంబును వెల్లి మునుంగం**

**బాఋచు నెల్లి నీ స్వయంవరమహోత్సవంబని విని తపన సంకాశంబులైన విమానంబులెక్కి యేతదర్థంబున నిజశుద్ధాంత కాంతాజనంబు విరహసంతాపభాజనంబుగా నిశిత నిస్త్రింశనీకాశంబగు నాకాశంబు డిగ్గి పాదార్పణానుగ్రహంబున మహీ మండలంబు గృతార్థంబుగా నిప్పు డిప్పురంబున కనతిదూరంబున నున్నవారు. యదృచ్ఛాగతుండైన నన్నుం గనుంగొని నా మనంబున సందేశాక్షరంబులు వ్రాసి జంగమలేఖంబు గావించి నీ సకాశంబునకుం బుత్తెంచిరి. కుసుమశరభిల్లశర శల్య విశల్యౌషధీవల్లివగు నిన్ను బరిష్వంగంబు సేయను, ననంగ లీల లహరీతుషారంబగు నీ శరీరంబుసోఁకున నంతరంగ పరితాపం బపనయింపను, నిపీత పీతదర్పంబులగు నీ యంగంబు లపాంగంబులకు లేపం బొనర్పను, ప్రసవ నారాచ శరాసనాభవిభ్రమ భ్రూవిలాసంబగు నీ ముఖశ్రీ సముల్లాసంబునకు నుల్లసిల్లను, సుమనఃకోదండ చండాలసంస్పృష్టి దోష దూషితులగు తమ్ము నీ కటాక్ష విక్షేప సాంద్ర చంద్రాతపాలోకంబుల నభిషేకింపను, భవచ్చరణకమలసేవాహిత మహత్త్వంబున మదనాప మృత్యుదేవతవలన నిజప్రాణంబులకుఁ బరిత్రాణంబు గావింపనుం దలంచుచున్నవారు. కుశలప్రశ్నపూర్వకంబుగా నా గీర్వాణులు నీకుం జెప్పుమనిన పలుకులు గొన్ని గలవు. వాని నాకర్ణింపుము.**

తా. ఈ విధముగా ముల్లోకములకు అలంకారులైన ఆ దిక్పతులు నీ వియోగభారమను ప్రవాహమునందు మునుగుచు రేపటి దినమున నీ స్వయంవరమహోత్సవమని విని సూర్యునితో సమానములైన విమానములనెక్కి ఇందు నిమిత్తము తమ అంతఃపుర స్త్రీలు వియోగతాపమునకు పాత్రములగుచుండగా పదునైన పెద్ద ఖడ్గముతో సమానమైన ఆకాశమును దిగి పాదములనాన్చు ననుగ్రహముతో భూమండలము చరితార్థముగా ఇప్పుడు ఈ పురమునకు సమీపముననే ఉన్నారు. స్వేచ్ఛగా వచ్చుచున్న నన్ను చూచి, నా మనసున వార్తాసంబంధ అక్షరములను వ్రాసి , నడచుచున్న లేఖను చేసి నీ చెంతకు పంపించిరి. మన్మథుడనెడి వేటగాని ఏదుపంది ముల్లువంటి బాణముల గాయములకు విశల్యవంటి యోషధీలతవైన నిన్ను కౌగలించుకొనుటకును, మన్మథవిలాస ప్రవాహ తుషారములైన నీ శరీరతాకిడిచే మనసునందలి సంతాపమును తొలగించుకొనుటకును, పూర్తిగా ఆక్రమించిన పచ్చని సౌందర్యగర్వముగల నీ అవయవములను క్రీగన్నులకు లేపంబు పూయుటకును, మన్మథుని వింటితో సమానమైన విలాసములుగల కనుబొమల ప్రకాశము గలిగినట్టి నీ ముఖ లక్ష్మి కాంతి విశేషమునకు సంతోషించుటకును, మన్మథుడనెడి చండాలునియొక్క సంపర్కముచే గలిగిన దోష దూషితులైన తమను నీ క్రీగంటి కదలికలనెడి దట్టమైన వెన్నెల కాంతులందు స్నానమాడుటకును, నీ పాదపద్మములను సేవించుటవలన పొందిన మహిమచే మన్మథుడనెడి అపమృత్యువువలన తమ ప్రాణములకు రక్షణచేయుటకును కుశలప్రశ్నపూర్వకముగా ఆ దేవతలు నీకు చెప్పుమన్న మాటలను వినుము.

**41 క. ఆదిత్యులమగు మాకును**
**నీ దోర్లతికాయుగంబు నిర్భర సుఖ వ**
**ర్షోదయ కారణంబై సం**
**పాదించుంగాక తరుణి పరివేషంబుల్**

తరుణి = ఓ యువతీ!, ఆదిత్యులమగు = అదితిసంతతివారమైన, మాకును, నీ దోర్లతికాయుగంబు = లతలవంటి నీ బాహుయుగము, నిర్భర = అధికమైన, సుఖ = సౌఖ్యమనెడి, వర్షోదయ = వర్షముకలుగుటకు, కారణంబై, పరివేషంబున్ = కౌగిలిని, సంపాదించుంగాక.(సూర్య పక్షమున – వర్ష ఉదయ = వర్షముకలుగుటకు, కారణంబై, తరుణి = సూర్యునియొక్క పరివేషంబులు = గాలిగుడులు, సంపాదించుంగాక)

తా. ఓ యువతీ! ఆదిత్యులమగు మాకు నీ లతలవంటి బాహుయుగము అధికమైన సౌఖ్యమనెడి వర్షముకలుగుటకు కారణమై నీ కౌగిలిని సంపాదించుగాక

**42 శా. ఔదాసీన్యము నుజ్జగించి విను వాక్యం బస్మదీయంబు మి**
**థ్యా దోషం బొకయింతలేమి కఖిలాంతర్యామి త్రైలోక్య మ**
**ర్యాదా స్థాపకు డంగజుండు గతి యీ యర్థంబు నిక్కంబు నీ**
**పాదాంభోజ రజఃప్రసాదములు మా ప్రాణంబు లబ్జాననా!**

అబ్జాననా = పద్మమువంటి ముఖముకలదానా!, ఔదాసీన్యమున్ = ఉపేక్షించుటను, ఉజ్జగించి = మాని, అస్మదీయ వాక్యంబు = మా మాటను, విను, మా ప్రాణంబుల్, నీ పాదాంభోజ రజఃప్రసాదములు = నీ పాదపద్మపరాగ ప్రసాదములు, ఈ అర్థంబు = ఈ మా కోరిక, నిక్కంబు = నిజము, మిథ్యాదోషంబు = అసత్యదోషము, ఒకయింతలేమికి = కొంచెముకూడా లేకుండుటకు, అఖిలాంతర్యామి = అందరి మనసుల నాక్రమించియున్న, త్రైలోక్యమర్యాదాస్థాపకుడు = మూడులోకముల మర్యాదలను నియమించువాడైన, అంగజుడు = మన్మథుడు, గతి = సాక్షి (అలంకారము – అతిశయోక్తి)

తా. అబ్జాననా! ఉపేక్షించుట మాని మా మాట విను. మా ప్రాణములు నీ పాదపద్మపరాగ ప్రసాదములు. ఈ మా కోరిక యథార్థము. అసత్యదోషము కొంచెముకూడా లేదనుటకు అందరి మనసులను ఆక్రమించువాడును, మూడు లోకముల మర్యాదలను నియమించువాడునైన మన్మథుడే సాక్షి.

43 శా. మా దివ్యత్వము నీకు నిత్తుమని సంభావింప సిగ్గయ్యెడిన్
వైదర్భీ! భవదీయ రూప విభవైశ్వర్యంబు మా భూమియం
దేదీ! దీనికిఁ బ్రత్యయం బిదియపో యే మెల్లనుంగూడి నీ
పాదాంభోజము లాశ్రయించెదము తాత్పర్యంబు సంధిల్లఁగన్

వైదర్భీ = విదర్భ రాకుమారీ!, మా దివ్యత్వము = మా దేవత్వమును, నీకున్, ఇత్తుమని, సంభావింపన్ = చెప్పుటకు, సిగ్గయ్యెడిన్ = సిగ్గుగా ఉన్నది. మా భూమియందు = మా దేవలోకమునందు, భవదీయ = నీవంటి, రూప విభవ ఐశ్వర్యంబు = రూపసంపదయొక్క అతిశయము, ఏదీ = ఎక్కడ ఉన్నది?, దీనికిన్ = ఇట్లనుటకు, ప్రత్యయంబు = సాక్ష్యము, ఇదియపో = ఇదేసుమా!, ఏమెల్లనుం కూడి = మేమందరంకలిసి, తాత్పర్యంబు సంధిల్లగన్ = నమ్మకము కలుగునట్లుగా, నీ పాదాంభోజములు = నీ పాదపద్మములను, ఆశ్రయించెదము,

తా. వైదర్భీ! మా దేవత్వము నీకిస్తామని చెప్పడానికి సిగ్గుగా ఉన్నది. మా దేవలోకంలో నీవంటి రూపసంపద ఎక్కడ ఉంది? ఇలా అనడానికి సాక్ష్యము ఇదేసుమా! మేమందరం కలిసి నీకు నమ్మకం కలిగేలా నీ పాదపద్మములను అశ్రయిస్తాం.

44 మహాస్రగ్ధర. త్వదరాళ భ్రూలతా ద్వంద్వమున మదనుడో తన్వి ధన్యత్వమొందెం
ద్వదుదంచిన్మందహాసోదయము వనిత కందర్పు జైత్రాస్త్రుఁ జేసెం
ద్వదపాంగాలోకనశ్రీ తరుణి మరుని మత్స్యధ్వజుంగా నొనర్చెం
ద్వధీనం బెల్ల సామర్థ్యము రతిపతికిం దామ్రబింబాధరోష్ఠీ!

ఓ తన్వీ, త్వత్ అరాళ భ్రూలతా = నీ కుటిలమైన లతలవంటి కనుబొమలయొక్క, ద్వంద్వమున = జంటచే, మదనుడు, ధన్యత్వము ఒందెన్, వనిత, త్వత్ = నీయొక్క, ఉదంచిత్ = ప్రకాశించుచున్న, మందహాసోదయము = చిఱునవ్వు పుట్టుక, కందర్పున్ = మన్మథుని, జైత్రాస్త్రున్ చేసెన్ = జయింపగల అస్త్రములుకలవానినిగా, చేసెన్, తరుణి, త్వత్, ఆపాంగలోకనశ్రీ = క్రీగంటిచూపులసంపద, మరుని = మన్మథుని, మత్స్యధ్వజుంగాన్, ఒనర్చెం = చేసెను. తామ్రబింబాధరోష్ఠీ = పండిన దొండపండువంటి పెదవి కలదానా!, రతిపతికిన్ = మన్మథునికి, ఎల్ల సామర్థ్యము = శక్తియంతయు, త్వత్ అధీనంబ = నీ అధీనమైనదే! (అలంకారము – సహోక్తి, అతిశయోక్తి)

తా. ఓ తన్వీ! నీ కుటిలమైన లతలవంటి కనుబొమలయొక్క జంటచే మన్మథుడు ధన్యత్వము నొందెను. వనితా! నీ ప్రకాశవంతమైన చిఱునవ్వుపుట్టుకచేతనే కందర్పుడు జయింపగల అస్త్రములుకలవాడయ్యేడు. తరుణీ! నీ క్రీగంటిచూపుల సంపదయే మరుని మత్స్యధ్వజునిగా నొనర్చెను. పండిన దొండపండువంటి పెదవికలదానా! రతిపతికి శక్తి అంతాకూడా నీ అధీనమైనదేకదా!

45 శా. నీ లావణ్య పయోధియందు నలరు న్నేత్రాబ్జముల్ నీ మనో
జ్ఞాలాపంబులయందుఁ గర్ణములు నీ యాలింగన ప్రక్రియా
కేలిన్మేనులు నీ ముఖాస్వదన సక్తి న్నాలుకల్ మాకు నో
బాలా స్వప్న సమాగమంబుల నిశాపర్యంత యామంబులన్

ఓ బాలా, నిశాపర్యంత యామంబులన్ = రాత్రుల కడజాములందు, స్వప్న సమాగమంబులన్ = కలలో కూడుటను, మాకున్, నేత్రాబ్జముల్ = పద్మములవంటి నేత్రములు, నీ లావణ్య పయోధియందున్ = నీ లావణ్య సముద్రమునందు, అలరున్ = ఒప్పుచున్నవి. కర్ణములు = చెవులు, నీ మనోజ్ఞాలాపంబులయందున్ = నీ మనోహరమైన మాటలయందును, నీ ఆలింగన ప్రక్రియా కేలిన్ = నిన్ను కౌగలించుకొను క్రీడయందు, మేనులు = దేహములును, నీ ముఖాస్వదన సక్తిన్ = నీ ముఖమునాస్వాదించు ఆసక్తియందు, నాలుకల్ = నాలుకలును, అలరున్ = ఒప్పుచున్నవి. (అలం – రూపక, దీపకములు)

తా. ఓ బాలా! రాత్రుల కడజాములందు కలలో కలియుటతో నీ సౌందర్య సముద్రమునందు మా నేత్రాబ్జములు, నీ మనోహరమైన మాటలయందు చెవులు, నిన్ను కౌగలించుకొను క్రీడయందు దేహములు, నీ ముఖము నాస్వాదించ నాసక్తియందు నాలుకలును ఒప్పుచున్నవి.

46 వ. అని బృందారక చతుష్టయంబు నీతోఁ జెప్పుమనెం గావున

తా. అని దేవతలు నలుగురును నీతో చెప్పమన్నారు కాబట్టి

47 క. సుర సార్థవాచిక స్ర
క్పరిపాటీ విశదరసనపత్త్రుడనగు న
న్నరవిందపత్త్రలోచన
చరితార్థునిఁ జేయు కార్యసాఫల్యమునన్

అరవిందపత్త్రలోచన = పద్మపత్రములవంటినేత్రములుకలదానా!, సుర సార్థ = దేవతాగణముయొక్క, వాచికస్రక్ పరిపాటీ = సందేశవచనముల పంక్తియొక్క అనుక్రమముచే, విశద = స్వచ్ఛమైన, రసన పత్త్రుడను అగు = నాలుకే పత్త్రముగా కలవాడనైన, నన్ను, కార్యసాఫల్యమునన్ = పనిపూర్తియగుట కారణముగ, చరితార్థుని చేయు = కృతార్థుని చేయుము.

తా.	అరవిందపత్త్రలోచన! దేవతాగణముయొక్క సందేశవచనములపంక్తియొక్క అనుక్రమముచే స్వచ్ఛమైన నాలుకే పత్త్రముగాకలవాడనైన నన్ను పనిపూర్తియగుట కారణముగ కృతార్థుని చేయుము.

**48	చ. అమరపతి న్వరించెదవొ, హవ్యవహు న్వరణం బొనర్చెదో, శ**
**మనుని చెట్టవట్టెదవొ, సాగరవల్లభుఁ బెండ్లియాడెదో ప్రమ**
**దము గౌతుకంబు, ననురాగము పెంపును సొంపుమీఱఁగాఁ**
**గమలదళాక్షి యొక్కరునిఁ గైకొనుమా యనుమాన మేటికిన్**

కమలదళాక్షి, అమరపతిన్, వరించెదవొ, హవ్యవహున్ = అగ్నిదేవుని, వరణం బొనర్చెదో = వరింతువో, శమనుని = యముని, చెట్టపట్టెదవొ, సాగరవల్లభున్ = వరుణుని, పెండ్లియాడెదో, ప్రమదము = సంతోషము, కౌతుకంబు = కుతూహలమును, అనురాగము = ప్రీతియును, పెంపును = అతిశయమును, సొంపు మీఱగాన్ = చక్కదనము మీఱునట్లుగా, ఒక్కరునిన్, కైకొనుమా = వరింపుమా, యనుమానము ఏటికిన్

తా.	కమలదళాక్షి! ఇంద్రుని వరిస్తావో, అగ్నిదేవుని వరిస్తావో, యముని చెట్టపడతావో, వరుణుని పెండ్లియాడతావో సంతోషము, కుతూహలము, ప్రీతి అతిశయింపగా చక్కదనము మీరునట్లుగా ఒక్కరిని వరింపుము. అనుమాన మెందులకు?

**49	వ. అనిన విని యయ్యంబుజాక్షి యక్షి భ్రూ విక్షేప విభ్రమంబున ననాదరంబు దెల్పుచు నలవోకగా దిగీశ సందేశం బాకర్ణించి యా రాజకుమారున కిట్లనియె**

తా.	అని నలుడు పలుకగా విని ఆ దమయంతి కంటి కనుబొమలయొక్క కదలికవలన అయిష్టమును తెలియపరచుచు, హేలగా దిక్పాలకుల సందేశమును విని ఆ రాజకుమారునితో ఇట్లు పలికెను.

**50	తే. ప్రశ్న మొక్కటి యొక్కటి ప్రతివచనము**
**యుక్తి యనుకూలమై యుండ దుభయమునకు**
**నేను నీ వంశ నామంబు లెవ్వి యనిన**
**నెవ్వరినొ ప్రస్తుతించితి వింత తడవు**

ప్రశ్నము = అడిగిన ప్రశ్న, ఒక్కటి, ప్రతివచనము = దానికి సమాధానము, ఒక్కటి = వేరొకటి, ఉభయమునకున్ = రెంటికిని, యుక్తి అనుకూలమై ఉండదు = అలోచన తగినదిగా లేదు,

తా.	నేను అడిగిన ప్రశ్న ఒకటి దానికి నీవు ఇచ్చిన సమాధానము వేరొకటి. ఈ రెంటికి యుక్తి కుదురుట లేదు. నేను నీ వంశ, నామము లేమిటని అడుగగా, ఇంతసేపూ ఎవరినో పొగడుతున్నావు.

**51	క. ఒకచోటఁ బ్రకాశించియు**
**నొకచోట నిగూఢయగుచు నొదవించెం గౌ**
**తుక లక్ష్మి నీ సరస్వతి**
**ప్రకటయు గూఢయును నగు సరస్వతి వోలెన్**

ప్రకటయు = స్పష్టమైనదియు, నిగూఢయును నగు = రహస్యమైనదియును ఐన, సరస్వతి వోలెన్ = సరస్వతీ నదివలెనే, నీ సరస్వతి = నీ వాక్కు, ఒకచోటన్, ప్రకాశించియున్ = స్పష్టముగను, ఒకచోట, నిగూఢయగుచు = తెలియబడనిదగుచు, కౌతుక లక్ష్మిన్ = మిక్కిలి కుతూహలమును, ఒదవించెన్ = కలిగించెను. (అలంకారము – ఉత్ప్రేక్ష, ఉపమ)

తా.	నీ వాక్కు స్పష్టమైనదియు, రహస్యమైనదియునునై సరస్వతీనదివలెనే ఒకచోట స్పష్టముగను, వేరొకచోట తెలియబడనిదిగను ఉన్నట్లుగా నాకు మిక్కిలి కుతూహలమును కలిగించుచున్నది.

**52	తే. అధికతరులైనఁగాని దిశాధిపతులు**
**కౌతుకము నాకు నీ వంశకథలయందు**
**దప్పిగొన్నట్టివారి కా దప్పి దీఱ**
**సలిల పూరంబు హితవొ యాజ్యంబు హితవొ!**

దిశాధిపతులు, అధికతరులైనవారు కాని = మిక్కిలి గొప్పవారైనను, నాకు, నీ వంశకథలయందు, కౌతుకము = కోరిక, దప్పిగొన్నట్టివారికి = దాహముతోనున్నవారికి, ఆ దప్పి తీరన్ = ఆ దాహము తీరుటకు, సలిలపూరంబు = జలప్రవాహము, హితవొ = ఇష్టమో, ఆజ్యంబు = నేయి, హితవొ = ఇష్టమో?(అలంకారము – రూపకము, అర్థాంతరము)

తా.	దిక్కాలకులు చాలా గొప్పవారైనా నాకు నీ వంశకథలయందే కుతూహలము. దాహముతోనున్నవారికి ఆ దాహము తీరుటకు మంచినీరు ఇష్టపడతారా? నేయి ఇష్టపడతారా?

**53	వ. ఏను జేసిన ప్రశ్నంబునకు నుత్తరంబు నీ మీఁద నప్పై యున్నయది. ఇప్పుడైన నా ఋణంబుఁ దీర్చుకొనుము. భవాదృశంబైన నాయకరత్నంబు నేవంశంబు భరించె? ఏ వర్ణంబులు నీ పుణ్య నామంబునకుం బ్రకాశకంబు లైనయవి యని పరిమితంబుగాఁ బలికి కుండిననరేంద్రనందన యూరకుండుటయు నన్నిషధమండలాధీశ్వరుండు.**

తా.	నేను వేసిన ప్రశ్నకు సమాధానము నీమీద అప్పుగా నున్నది. కావున ఇప్పుడైనా నా ఋణమును తీర్చుకొనుము. నీవంటి నాయకరత్నమును ఏ వంశము భరించినది? నీ పుణ్య నామమునకు ఏ అక్షరములు ప్రకాశవంతములైనవి అని క్లుప్తముగా మాటలాడి దమయంతి ఊరకున్న ఆ నలమహారాజు –

**54	ఉ. తామరసాక్షి! వంశకథ దవ్వుల నుండఁగ నిమ్ము చెప్పఁగా**
**దేమిటికన్న నైజమగు హీనత గల్గినఁ జెప్పుటొచ్చె యు**
**ద్దామత గల్గనేని నుచితంబయి యుండదు సెప్పికొంట నేఁ**
**డీమెయిఁ ప్రేష్యభావము వహించి నికృష్టత నేగుదెంచుటన్**

తామరసాక్షి = పద్మనేత్రీ! వంశకథ, దవ్వులన్ ఉండగనిమ్ము = దూరంగా ఉండనీ, చెప్పగాదు = చెప్పకూడదు, ఏమిటికి అన్న = ఎందుకంటే, నైజమగు హీనత కల్గినన్ = సహజమగు హీనత్వముంటే, చెప్పుట, ఒచ్చెము = అవమానకరము, ఉద్దామత కల్గెనేని = గొప్పతనం కల్గి ఉంటే, ఈ మెయిన్ = ఈ విధముగా, ప్రేష్యభావము = దూతత్వమును, వహించి, నికృష్టతన్ = హీనత్వముతో, ఏగుదెంచుటన్ = వచ్చుటచే, చెప్పికొంట = చెప్పుకొనుట, ఉచితంబయి ఉండదు = తగినది కాదు.

తా.	పద్మనేత్రీ! వంశకథను దూరంగా ఉండనీ. చెప్పకూడదు ఎందుకంటే, సహజంగా హీనత్వముంటే చెప్పడం అవమానకరం. గొప్పతనం కల్గి ఉంటే ఈ విధంగా దూతత్వమును వహించి హీనత్వముతో రావడంచేత చెప్పుకోవడం ఉచితంగా ఉండదు.

**55	తే. ఇంత మాత్రంబు సెప్పెద నెఱిఁగికొనుము**
**నృపతికన్యవు గడు మాననీయ వగుట**
**మైత్రి కఱసేయఁ దగ దేను మనుజవిభుఁడ**
**రాజవంశకరీరుండ రాజవదన**

రాజవదన = చంద్రునివంటి ముఖముకలదానా!, నృపతికన్యవు = రాచబిడ్డవు, కదు మాననీయవగుటన్ = మిక్కిలి పూజనీయురాలవగుటచేత, ఇంతమాత్రంబు చెప్పెదన్, ఎఱిగికొనుము = తెలిసికొనుము.మైత్రికిన్ = స్నేహమునకు, అఱసేయన్ తగదు = భేదమువచ్చుట తగదు, ఏను = నేను, మనుజవిభుడ, రాజవంశ కరీరుండ = చంద్రవంశమనెడి వెదురుపొదకు వెదురుబోదువంటివాడను. (అలంకారము – రూపకము)

తా.	రాజవదన! నీవు రాజబిడ్డవు. నీవు రాచబిడ్డవు. మిక్కిలి పూజనీయురాలవు. కావున ఇంతమాత్రమే చెప్పెదను. తెలిసికొనుము. స్నేహమునకు భేదమువచ్చుట తగదు. నేను మనుజవిభుడను, చంద్రవంశమనెడి వెదురుపొదకు వెదురుబోదువంటివాడను.

**56	ఉ. పేరడుగం దలంచెదవొ భీమతనూభవ యా విచారముం**
**దూరము సేయు మెవ్వరికి దోసము తాఁ దనపేరు సెప్పుటా**
**చార పరంపరాస్థితికి శాస్త్రము మూలము శాస్త్ర చోదితా**
**చార వివేకహీనుఁడగు జాల్మని మెత్తురె? పండితోత్తముల్**

భీమతనూభవ = భీమపుత్రీ!, పేరు అడుగన్. తలంచెదవొ, ఆ విచారమున్ = ఆ ఆలోచనను, దూరము చేయుము. తాన్, తనపేరు, చెప్పుట, ఎవ్వరికిన్ = ఎవరికైనను, దోసము. ఆచారపరంపరాస్థితికిన్ = ఆచారముల క్రమపద్ధతికి, శాస్త్రము, మూలము. శాస్త్రచోదిత = శాస్త్రముచే ప్రేరితమైన, ఆచార = ప్రవర్తనయందు, వివేక విహీనుడగు = జ్ఞానశూన్యుడైన, జాల్మని = మూర్ఖుని, పండితోత్తముల్ , మెత్తురె = మెచ్చుకొందురా?

తా.	భీమపుత్రీ! పేరును అడగాలనుకుంటున్నావేమో! ఆ ఆలోచనను దూరం చెయ్యి. తాను తనపేరు చెప్పుకొనుట ఎవరికైనాసరే దోషము. ఆచారముల క్రమపద్ధతికి శాస్త్రమే మూలము. శాస్త్ర ప్రేరితమైన ఆచారమును అనుసరించుటయందు జ్ఞానశూన్యుడైన నీచుని పండితోత్తములు మెచ్చుకొంటారా!

**57	వ. అదియునుఁగాక**

**58	క. కువలయనేత్ర! సమక్ష**
**వ్యవహారంబునకు యుష్మదస్మత్పదముల్**
**శ్రవణ శ్రావణ యోగ్యము**
**లవుచుండఁగ పేరు సెప్ప నడుగఁగ నేలా?**

కువలయనేత్ర = కలువలవంటి కన్నులుకలదానా, సమక్ష వ్యవహారంబునకున్ = ఎట్టయెదుటి వ్యవహారానికి, యుష్మ దస్మత్పదముల్ = నీవు నేను అను మాటలు, శ్రవణ = వినుటకును, శ్రావణ = వినిపించుటకును, యోగ్యములవుచుండగన్ = తగినవగుచుండగా, పేరు. చెప్పన్, అదుగగన్, ఏలా = ఎందులకు?

తా.	కువలయనేత్ర! ఎట్టయెదుటి వ్యవహారానికి నీవు నేను అనే మాటలు వినడానికి, వినిపించడానికి తగినవగు

చుండగా పేరు చెప్పమని అడగడమెందుకు?

**59** **సీ. అని శారదంబైన వనమయూరమువోలె**
**నహితాపకారకుం డతఁడు వలుక**
**రాజహంసియుఁ బోలె రమణీ లలామంబు**
**పదములందనురాగ ముదయమొంద**
**సమయోచితంబుగా సారస్యమొప్పారఁ**
**బలికె నిట్లని మహీపాలుతోడ**
**నన్వయం బెఱిఁగించి యభిధాన మెఱిఁగింప**
**కునికి మమ్మాదరించిన తెఱంగె**
**తే. యనఘ! మము నీవు వంచింప నభిలషించె**
**దేము నేరమె వంచింప నిపుడు నిన్నుఁ**
**బేరు సెప్పిన నీ కనాచారమేని**
**మాకు నాయంబె నీతోడ మాటలాడ**

అని, అహిత అపకారకుండు = శత్రువులను జయించువాడైన, (నెమలి పక్షం – అహి తాప కారకుండు = పాములను చంపునది), అతడు = ఆ నలమహారాజు, శారదంబైన = శరత్కాలమందైన, వనమయూరము వోలెన్ = అడవి నెమలివలె, పలుక, (నెమలి వర్షాకాలమునందు కూసి, శరత్కాలమునందు మౌనముగానుండుట సహజము)(మౌనంగా ఉండిపోయేడు) రమణీ లలామంబు = స్త్రీ శ్రేష్ఠురాలైన దమయంతి, రాజహంసియున్ పోలెన్ = రాజహంసివలె, పదములందున్ = నలుని ప్రతిపలుకునందును, అనురాగము = ప్రీతి, ఉదయము ఒంద = జనింపగా, (పదములందు = కాళ్ళయందు, అనురాగము = ఎఱ్ఱదనము, ఉదయమొందన్ = జనింపగా), సమయోచితంబుగాన్ = సమయమునకు తగినట్లుగా, సారస్యము = సరసత్వము, ఒప్పారన్ = ఒప్పునట్లుగా, మహీపాలుతోడన్ = రాజుతో, ఇట్లని, పలికెన్, అన్వయంబు ఎఱిగించి = వంశమును తెలిపి, అభిధానము ఎఱిగింపక = పేరు చెప్పక, ఉనికి = ఉండుట, మమ్ము, ఆదరించిన, తెఱంగె = పద్ధతియా! అనఘ = దోషరహితుడా!, మమున్, నీవు, వంచింపన్ = మోసగించుటకు, అభిలషించెదు = ఇష్టపడుచున్నావు, ఇపుడు, ఏము = మేము, నిన్నున్, వంచింప = మాయచేయుట, నేరమె!, పేరు చెప్పిన, నీకు, అనాచారమేని, నీతోడన్, మాటలాడన్, మాకు, నాయంబె = న్యాయమా?(అలంకారము – శ్లేష, ఉపమ)

తా. అని నలమహారాజు శరత్కాలమందలి అడవి నెమలివలె మౌనము వహింపగా దమయంతి రాజహంసివలె నలుని ప్రతిపలుకునందును ప్రీతి జనింపగా సమయోచితముగా, సరసముగా ఆ నలునితో నీవు వంశమును తెలిపి పేరు చెప్పకపోవడం మమ్మల్ని ఆదరించినట్లగునా? ఓ అనఘ! మమ్మల్ని నీవు మోసగించాలనుకుంటున్నావు. అటువంటప్పుడు మేము నిన్ను మాయచేయాలనుకోవడం నేరమౌతుందా? పేరు చెప్పడం నీకు అనాచారమైతే నీతో మాటలాడటం మాకు న్యాయమా?

**60** **తే. అన్యపురుషులతోడ నెయ్యంపు గోష్ఠి**
**యధిప! మముబోటి రాజకన్యకల కగునె**
**యది కులాబలాచార సహాసనాస**
**హాతిసాహస కౌతూహలావసథము**

అధిప = ఓ రాజా!, అన్యపురుషుల తోడన్, నెయ్యంపుగోష్ఠి = స్నేహపూర్వక భాషణము, మముబోటి = మావంటి, రాజ కన్యకలకున్, అగునె = తగునా?, అది, కుల అబలా = కులకాంతలకు, ఆచార = నడతకు, సహాసన = కలిసి కూర్చొనుటకు, అసహ = సహింపనిది, అతిసాహస = మిక్కిలి సాహసముకలది, కౌతూహల = వేడుకకు, అవసథము = నిలయము.

తా. ఓ రాజా! పరపురుషులతో స్నేహపూర్వక సంభాసణము మావంటి రాచకన్యకలకు తగునా? అది కులకాంతల నడతకు, కలిసి కూర్చొనుటకు సహింపరానిది, మిక్కిలి సాహసముతో కూడినది, వేడుకకు నిలయమైనది.

**61** **క. తగవే కులకన్యలకును**
**మగవారలతోడ రూపమహనీయులతో**
**మిగులంగఁ దడవు లోపలి**
**నగళులలో మాటలాడ నయతత్త్వనిధీ!**

నయతత్త్వనిధీ = నీతి తత్త్వమునకు నిధియైనవాడా!, కులకన్యలకును, మగవారలతోడ, రూప మహనీయులతోన్, మిగులంగ తడవు = చాలసేపు, లోపలినగళులలోన్ = లోపలి రాజగృహములలో, మాటలాడన్, తగవే = న్యాయమా?

తా. నయతత్త్వనిధీ! కులకన్యలకు మగవారలతో, రూపమహనీయులతో చాలసేపు లోపలి రాజగృహములలో మాటలాడుట న్యామయా? ( అలంకారము – కావ్యలింగము)

**62** **వ. అనిన విని ప్రతిబంధరచనా చాతుర్యంబును మనంబునం దభినందించుచుఁ బ్రత్యుత్తరంబు వేఱొందు**

**వెదకి పొడగానలేక యా లోకోత్తరచరిత్రుండు విదర్భరాజపుత్రిం గనుంగొని నేత్రాంచలంబుల నలంతినవ్వు దొలంకాడ నిట్లనియె**

తా. అనగా విని నిషేధించుటయందలి నేర్పరితనమును మనస్సున అభినందించుచు ప్రత్యుత్తరము వేఱొకటి కనబడక ఆ లోకోత్తరచరితుడు విదర్భరాజపుత్రియైన దమయంతిని క్రీగంట చూచి, చిఱునవ్వు తొణికిసలాడ ఇట్లు పలికెను

**63 సీ. వామాక్షి మాక్షికస్వాదు పేశలమైన**
**పలుకేల యొరులపైఁ బాఱవైవఁ**
**జంచద్రసామృత స్నాన పేశలమైన**
**దృగ్విలాసముఁ జేర్పు దివిజులందు**
**సఫలంబుసేయు మత్సమధికాయాసంబు**
**నేను జెప్పిన కార్య మిచ్ఛగించి**
**దేవతాపతి భక్తిఁ దిరముగా మతి నిల్పి**
**ప్రకట కల్యాణ వైభవము నొందు**
**తే. వెలఁది నా మీఁదఁ గడుఁ గృపా విలసనంబు**
**నాటి చూచిన చూపు మన్ననయ చాలు**
**నాకుఁగా నుద్ధరింపుము నాకవిభుల**
**హస్తములు మోడ్చి వేఁడెద నాదరమున**

వామాక్షి = సుందరమైన కన్నులుకలదానా!, మాక్షికస్వాదు పేశలమైన = తేనెవలె మధురమైన, పలుకు = మాట, ఒరులపై = ఇతరులపై, పాఱవైవన్ ఏల = పారవేయుట ఎందులకు?. చంచత్ = ప్రకాశించుచున్న, రసామృత = అనురాగమనెడి అమృతమందు, స్నాన పేశలమైన = స్నానముచే మృదువైన, దృక్ విలాసము = నేత్రవిలాసమును, దివిజులందు = దేవతలందు, చేర్పు, నేను చెప్పిన కార్యము, ఇచ్ఛగించి = ఇష్టపడి, మత్ = నాయొక్క, సమధిక ఆయాసంబున్ = అధికమైన ప్రయాసను, సఫలంబు చేయు = ఫలింపచేయుము. మతిన్ = బుద్ధియందు, దేవతాపతి భక్తి = దిక్పాలకులయందు భక్తిని,
తిరముగాన్ = నిశ్చలముగా, నిల్పి, ప్రకట = స్పష్టమైన, కల్యాణ వైభవంబు = కల్యాణ సుఖసంపదను, ఒందు = పొందుము, వెలది = ఓ కాంతా! నా మీదన్, కడు = ఎక్కువగా, కృపా విలసనంబున్ = కరుణాతిశయమును, నాటి = పాతి, చూచిన చూపు, మన్ననయ = గౌరవమును, చాలు. హస్తములు = చేతులు, మోడ్చి = జోడించి, ఆదరమున = ప్రేమతో, వేడెద = వేడుకొనెదను, నాకవిభుల = దిక్పాలకులను, నాకుగా = నా కొఱకై, ఉద్ధరింపుము.

తా. వామాక్షీ! తేనెవలె మధురమైన నీ మాటలను పరాయివారిపై పారవేయుట ఎందులకు? కాంతివంతమైన రసామృత స్నానముచే మృదువైన నీ నేత్ర విలాసమును దేవతలకు చేర్పుము. నేను చెప్పిన కార్యము నిష్టపడి నాయొక్క ప్రయాసను ఫలింపచేయుము. దిక్పాలకులయందు భక్తిని బుద్ధియందు స్థిరముగా నిలిపి, స్పష్టమైన కల్యాణ సుఖముల నందుము. ఓ కాంతా! నా మీద మిక్కిలి కరుణాతిశయమును మెలకెత్తించి చూచిన చూపు, గౌరవమును చాలును. చేతులు జోడించి ప్రీతితో వేడుకొనుచున్నాను. దిక్పాలకులను నా కొఱకుగా సఫలీకృతులను చేయుము.

**64 తే. ఇందుబింబాస్య నా రాక కెదురుచూచు**
**నయనములు వేయు విరియించి నాక భర్త**
**యుదిలకొనుచున్నవా రార్తినున్న ముగురుఁ**
**గాలయాపన సేయఁగాఁ గాదు నీకు**

ఇందుబింబాస్య = చంద్రబింబమువంటి ముఖముకలదానా!, నయనములు వేయు విరియించి = వేయి నేత్రములను తెఱచుకొని, నాకభర్త = దేవేంద్రుడు, నా రాకకు, ఎదురుచూచున్, ఉన్న ముగురున్ = మిగిలిన ముగ్గురును, ఆర్తిన్ = విరహముచే, ఉదిలకొనుచున్నవారు = చింతనొందుచున్నవారు, నీకున్, కాలయాపన, చేయగాన్, కాదు.

తా. ఇందుబింబాస్య! వేయి నేత్రములను తెఱచుకొని దేవేంద్రుడు నా రాకకై ఎదురుచూచుచుండును. ఉన్న ముగ్గురును విరహముతో చింతనొందుతూ ఉంటారు. అందువలన నీకు కాలయాపనచేయడం తగదు.

**65 చ. హరిహయుఁడేమి యయ్యెనొకొ యా మదనానల తాపవేదనన్**
**వరుణుఁడు విప్రయోగమున వాడఁడె యింతకు దండపాణి దా**
**విరహభరంబునన్ మిగుల వేఁగఁడె నొవ్వఁడె వీతిహోత్రుఁడుం**
**బరిసర కేళికావన సమాగత మంద సమీరణంబులన్**

ఆ మదనానలతాపవేదనన్ = ఆ మన్మథాగ్నివల్లనైన తాపముయొక్క బాధచే, హరిహయుడు = దేవేంద్రుడు, ఏమి యయ్యెనొకొ = ఏమయ్యాడోకదా!, విప్రయోగమునన్ = వియోగముచేత, వరుణుడు, వాడడె = కాంతిహీనుడుకాడా!, ఇంతకున్ = ఈ పాటికి, దండపాణి = యముడు, తాన్, విరహభరంబునన్ = వియోగాతిశయముచే, మిగులన్ = మిక్కిలి, వేగడె =

తాపమునొందదా?, వీతిహోత్రుడున్ = అగ్నిహోత్రుడును, పరిసర = సమీపమందలి, కేళికావన = ఉద్యానవనమునుండి, సమాగత = వచ్చుచున్న, మందసమీరణంబులన్ = మందమారుతములచే, నొవ్వడె = బాధనొందదా?
తా. ఆ మన్మథాగ్నివల్లనైన తాపాగ్నిచే దేవేంద్రుడు ఏమయ్యాడోకదా? వియోగంచేత వరుణుడు కాంతిహీనుడుకాడా? ఈ పాటికి యముడు తాను విరహాతిశయముతో మిక్కిలి తాపమునొందదా? అగ్నిహోత్రుడును సమీపమందలి ఉద్యాన వనమునుండి వచ్చుచున్న మందమారుతములచే బాధనొందదా?

**66 వ. అనిన విదర్భ రాజకన్యక యిట్లనియె**

**67 తే. కలికినవ్వు ప్రగల్భతా కారణంబు**
**కాదు కాదంట వాచా విగర్హణంబు**
**పలుకకుంట తిరస్కార కలనముద్ర**
**గాన ప్రత్యుత్తరం బిచ్చుదాన నీకు**

కలికినవ్వు = అందమైన నవ్వు, ప్రగల్భతా = ధృష్టత్వమునకు, కారణంబు, కాదు కాదంట, వాచా విగర్హణంబు = వాక్కుల నిందయగును, పలుకక ఉంట, తిరస్కారకలనముద్ర = అవమానసూచకమైనది, కాన = కావున, నీకు, ప్రత్యుత్తరంబు = సమాధానమును, ఇచ్చుదాన
తా. పరిహాసము కొంటెతనమునకు కారణమౌతుంది, కాదు కాదని మాటాడుట నిందయవుతుంది, పలుకకుండ ఊరుకోవడం అవమానసూచకమవుతుంది. కాబట్టి నీకు సమాధానము నిచ్చుచున్నాను.

**68 సీ. అమరాంగనా సంగమాభిశోభితుఁడైన**
**హరికేల మానుషీ పరిచయంబు**
**కామింతునే యేను వైమానికాధీశు**
**హస్తిఁ గామించునే హరిణరమణి**
**యారకూటకలాప మర్హమే కలవాని**
**కే నర్హనే నిర్జరేశ్వరునకు**
**నఖిల లోకాధీశుఁ డమరేంద్రుఁ డెక్కడ**
**నే నెక్కడ వరాటి నెన్నిచూడ**
**తే. నల పతివ్రత యైన యేఁ దలఁప నొరునిఁ**
**దివిరి నిందించియేఁ బ్రస్తుతించి యేని**
**నలినబిససూత్రమును బురంధ్రుల తలంపు**
**సమము త్రెయ్యును లవచాపలముననైన**

అమరాంగనా = దేవతాస్త్రీలయొక్క, సంగమ = కూడికచే, అభిశోభితుడైన = ప్రకాశించువాడైన, హరికి = ఇంద్రునకు, మానుషీ పరిచయంబు = మనుష్య సంబంధము, ఏల, ఏను = నేను, వైమానికాధీశున్ = దేవేంద్రుని, కామింతునే = కోరుకొందునా?, హరిణ రమణి = ఆడులేడి, హస్తిన్ = ఏనుగును, గామించునే = కోరుకొనునా?, కలవానికిన్ = సంపన్నునకు, ఆరకూటకలాపము = గిల్టునగలు, అర్హమే = తగినవా?, నిర్జరేశ్వరునకు = దేవతాధిపతికి, ఏను, అర్హనే = తగినదాననా?, అఖిల లోకాధీశుడు = సమస్తలోకములకు ప్రభువు, అమరేంద్రుడు, ఎక్కడ? ఎన్నిచూడన్ = ఎంచిచూడగా, వరాటిన్ = వరాట కన్యను,(గవ్వను), నే నెక్కడ?, నల పతివ్రతయైన ఏన్ = నలునే భర్తగా వరించిన నేను, తివిరి = ప్రయత్నించి, నిందించియేన్, ప్రస్తుతించియేని, ఒరునిన్ = ఇతరుని, తలపన్, నలినబిససూత్రమును = తామరతూడులోని దారమును, పురంధ్రుల తలంపు = స్త్రీల ఆలోచనయును, సమము = సమానమైనది, లవచాపలముననైన = కొద్దిగా చంచలమైనచాలును, త్రెయ్యును = తెగిపోవును.
తా. దేవతాస్త్రీలను కూడుటచే ప్రకాశించువాడైన దేవేంద్రుడు మనుష్య సంబంధమును కోరుటేమిటి? నేను దేవేంద్రుని కోరుకొందునా? ఆడులేడి ఏనుగును కోరుకుంటుందా? సంపన్నునకు గిల్టునగలు తగినవా? దేవతలప్రభువునకు నేను అర్హమైనదాననా? సమస్త లోకములకు ప్రభువైన అమరేంద్రు డెక్కడ? ఎంచిచూడగా వరాటకన్యనైన నేనెక్కడ? నలునే భర్తగా వరించిన నేను కావాలని నిందించినా, పొగిడినా వేరొకరిని తలపను. తామరతూడులోని దారము, స్త్రీల మనసు సమానమైనదే. ఏ కొంచెము చంచలమైనను తెగిపోవును.

**69 చ. అటుదగు నే సురేశ్వరుని యంతటివాఁ డఖిలాప్సరోంగనా**
**విటుఁడొక మర్త్య భామినికి వేడుక సేయుచు నున్నవాఁడు వి**
**స్ఫుట బహురత్న భూషణ విభూషితులయ్యెడు రాచవారికిన్**
**గటకట యారకూట కటకంబు రుచించునొ కాక యొక్కెడన్**

సురేశ్వరుని యంతటివాడు, అఖిల అప్సరోంగనా విటుడు, ఒక, మర్త్యభామినికి = మానవకాంతకు, వేడుక చేయుచునున్నవాడు = తపనపడుచున్నాడు, అటు తగునే = అలా కుదురుతుందా?, విస్ఫుట = మిక్కిలి గొప్పవగు, బహు రత్నభూషణ, విభూషితులయ్యేడు = అలంకరించుకొనువారైన, రాచవారికిన్, కటకట = అయ్యయ్యో!, ఆరకూటకటకంబు = గిల్టు నగలు, ఒక్కెడన్ = ఒకప్పుడైనా, రుచించునొ కాక = ఇష్టమవుతాయా చెప్పు

తా. సమస్త అప్సరసలకు విటుడైన సురేశ్వరుని యంతటివాడు ఒక మానవభామకై తపనపడుచున్నాడు. అలా కుదురుతుందా? మిక్కిలి గొప్పవైన రత్నభూషణాల నలంకరించుకొనువారైన రాచవారికి అయ్యయ్యో! గిల్టు నగలు ఒకప్పుడైనా ఇష్టమవుతాయా చెప్పు

**70 మ. వినుమీ నాదు ప్రతిజ్ఞ తత్పరత నుర్వీనాథ! యే నైషధేం**
**ద్రు నవశ్యంబు వరింతునా ధరణినాథుం డాత్మ నన్నొల్లఁడే**
**ననుమానింపక యిత్తు నవ్విభునకుం బ్రాణంబు సద్భక్తిమై**
**ననలోద్బంధన వారిమజ్జన విధివ్యాపార పారీణతన్**

ఉర్వీనాథా = ఓ రాజా!, తత్పరతన్ = శ్రద్ధగా, నాదు ప్రతిజ్ఞన్, వినుమీ!, ఏను = నేను, నైషధేంద్రున్ = నిషధరాజును, అవశ్యంబు = తప్పక, వరింతును, ఆ ధరణినాథుండు = ఆ రాజు, ఆత్మన్ = మనసులో, నన్ను, ఒల్లడేన్ = ఇష్టపడకున్నచో, అనుమానింపక, ఆ విభునకున్ = ఆ రాజుకొరకు, అనల = అగ్నివలన, ఉద్బంధన = ఉరివలన, వారిమజ్జన =నీటిలో మునుగుటవలన, విధి వ్యాపార = పనుల వ్యాపారమందు, పారీణతన్ = నేర్పుతో, సద్భక్తిమై, ప్రాణంబు, ఇత్తున్

తా. ఓ రాజా! శ్రద్ధగా నా ప్రతిజ్ఞను వినుము. నేను నిషధరాజును తప్పక వరింతును. ఆ రాజు మనసులో నన్ను ఇష్టపడకున్నచో సందేహములేక ఆ రాజుకోసం అగ్నిచేకాని, ఉరివేసుకొనికాని, నీటిలోమునిగికాని ఈ పనులందు నేర్పుతో సభక్తికముగా నా ప్రాణములను ఇచ్చివేసెదను.

**71 తే. అనుచుఁ దీక్ష్ణంబుగా భీమతనయ పలుక**
**నెలుఁగు విను వేడ్కఁ గోయిల యేచినట్లు**
**విబుధరాజు ప్రసంగంబు విస్తరించి**
**మఱియుఁ బలికింపఁ దలఁచి యమ్మనుజవిభుఁడు**

అనుచున్, భీమతనయ = దమయంతి, తీక్ష్ణంబుగాన్ = కఠినముగా, పలుకన్, కోయిల, ఏచినట్లు = విజృంభించిన విధమును, ఎలుగు = కంఠధ్వనిని, వినువేడ్కన్ = వినాలను కోరికతో, విబుధరాజు ప్రసంగంబు = దేవేంద్రుని ప్రసంగమును, విస్తరించి, మఱియున్ = ఇంకను, పలికింపన్, తలచి, ఆ మనుజవిభుడు = ఆ రాజు

తా. అనుచు దమయంతి కఠినముగా పలుకగా, కోయిల విజృంభించిన విధమును, కంఠధ్వనిని వినాలనే కోరికతో దేవేంద్రుని ప్రసంగమును విస్తారముగా చెప్పి దమయంతిని ఇంకను ఎక్కువగా పలికింప దలంచి ఆ రాజు

**72 వ. వెండియు దమయంతి నుద్దేశించి**

**73 క. నిఱుపేద యింటి కేటికిఁ**
**బఱతెంచు నిధానమట్లు పఱతెంచిన నా**
**నిఱుపేద యభాగ్యతఁ దలు**
**పిఱియఁగ నిడుఁగాక చొరఁగ నిచ్చునె దానిన్**

నిఱుపేద ఇంటికిన్, నిధానము = పెన్నిధి, ఏటికిన్ పఱతెంచున్ = ఎందుకు వచ్చును?, అట్లు పఱతెంచినన్ = అలా వచ్చినచో; ఆ నిఱుపేద, అభాగ్యతన్ = దురదృష్టముచే, తలుపు ఇఱియగన్ = తలుపును మూసివేసి, ఇడున్ కాక = ఉంచునే కాని, దానిన్ = ఆ నిధిని, చొరగన్ ఇచ్చునె = లోనికి రానిచ్చునా?

తా. నిఱుపేద ఇంటికి నిధి ఎందుకు వస్తుంది? ఒకవేళ వచ్చినా ఆ నిఱుపేద దురదృష్టముచేత తలుపును మూసి వేసుకొని ఉంచుతాడే కాని ఆ నిధిని లోపలికి రానిస్తాడా?

**74 సీ. ముగ్ధత్వమునఁ జంద్రముఖి పరాఙ్ముఖి వయ్యె**
**దేల భాగ్యంబు నిన్నెదురుకొనఁగ**
**నమృతాంధసుల నొల్లనను మానవియుఁ గల్గె**
**నీలాగు గంటిమే కాలగతుల**
**యాగాది దుర్లభమైన దేవత్వంబు**
**నీ కొల్లఁబాటయ్యె నేఁడు చూడ**
**రసయోగమున సువర్ణత్వ మొందుట మేలొ**
**యినుము దాఁ దానయై యునికి మేలొ**

**తే. యకటకట! సర్వగీర్వాణ మకుట ఘటిత**
**మణివిభా భాసమాన కోమల పదాబ్జు**
**సురాగణాధీశు నొల్లవే నరుని నొకని**
**నభిలషించెదు నిన్నేమి యనఁగఁ గలదు**

చంద్రముఖి, భాగ్యంబు = అదృష్టము, నిన్నున్, ఎదరుకొనగన్ = ఎదురుపడగా, ముగ్ధత్వమునన్ = అవివేకముగా, పరాఙ్ముఖివి అయ్యెదు ఏల = తిరస్కరిస్తావెందుకు?, అమృతాంధసులన్ = దేవతలను, ఒల్లన్ = ఇష్టపడను, అను మానవియు, కల్గె, ఈలాగు, కాలగతుల = ఏకాలమందైనను, కంటిమే = చూచితిమా?, యాగాది దుర్లభమైన, దేవత్వంబు, నేడు = ఈనాడు, చూడన్, నీకు, ఒల్లబాటయ్యె = ఇష్టములేనిదయ్యెను. ఇనుము, రసయోగమున, సువర్ణత్వము, ఒందుట మేలొ, తాన్ తానయై, ఉనికి మేలొ = ఉండుట మంచిదా?, అకటకట = అయ్యయ్యో, సర్వ గీర్వాణ = దేవతలందరియొక్క, మకుట ఘటిత = కిరీటములందలి, మణి విభా = రత్నకాంతులచేత, భాసమాన = ప్రకాశించుచున్న, కోమల = మృదువైన, పదాబ్జున్ = పాదపద్మములు కలవానిని, సురగణ అధీశున్ = దేవతల ప్రభువుని, ఒల్లవే = ఇష్టపడవా? నరునిన్ ఒకనిన్ = ఒక మానవుని, అభిలషించెదు = కోరుకొనుచున్నావు, నిన్ను, ఏమి, అనగ కలదు.

తా. చంద్రముఖీ! అదృష్టము నీకు ఎదురుపడగా మూర్ఖత్వంతో తిరస్కరిస్తావెందుకు? దేవతలను ఇష్టపడననే మనుష్య స్త్రీకూడా ఉంటుందా? ఇలా ఏ కాలమందైనను చూచితిమా? యజ్ఞములచేకాని అశక్యమైన దేవత్వము నీకు ఈవేళ ఇష్టములేనిదయింది. ఇనుము రసయోగముతో బంగారంగా మారడం మేలా? తాను ఇనుముగానే ఉండిపోవడం మేలా? అయ్యయ్యో! దేవతల మణి కిరీట రత్నకాంతులచే ప్రకాశించు కోమల పాదపద్మములుకల దేవతల ప్రభువుని ఇష్టపడవా? ఒక మానవుని కోరుకుంటావా? నిన్ను ఏమనాలి?

75 **సీ. రజ్జువల్లరి మీఁదఁ బ్రణయంబు గలదేని**
**నంతరిక్షంబేలు హరి వరించు**
**నగ్ని కాహుతి గాఁగ నాత్మఁ గోరెదవేని**
**జాతవేదుని యదృష్టము ఫలించు**
**సలిల ప్రవేశంబు సమ్మతించెదవేని**
**నంబుధీశ్వరుఁడు పుణ్యంబు సేయు**
**నెబ్భంగిఁ బ్రాణముపేక్షించితేనియు**
**వైవస్వతుని కబ్బు వాంఛితంబు**
**తే. ఘట్టకుటికా ప్రభాతంబు క్రమముచేత**
**దమసహోదరి! నీకు నయ్యమరవరుల**
**నొల్లననియును దుదిఁ బొందకుండరాదు**
**సమ్మతింపుము నామాట చలము మాని**

రజ్జువల్లరిమీదన్ = తీగెవంటి త్రాడుమీద, ప్రణయంబు కలదేనిన్ = ప్రేమయున్నచో, అంతరిక్షంబు ఏలు = స్వర్గమును పాలించు, హరి = ఇంద్రుడు, వరించు, అగ్నికి ఆహుతి కాగన్, ఆత్మన్, కోరెదవేని = కోరుకున్నచో, జాతవేదుని = అగ్ని, అదృష్టము ఫలించు, సలిల ప్రవేశంబు = నీటిలో మునుగుట, సమ్మతించెదవేని = ఇష్టపడినచో, అంబుధీశ్వరుదు = వరుణుడు, పుణ్యబు చేయు = పుణ్యం చేసినవాడవుతాడు, ఎబ్బంగిన్ = ఏరీతిగానైనను, ప్రాణము, ఉపేక్షించితి ఏనియు = విడిచిపెట్టాలనుకున్నా, వైవస్వతునికి = యమునికి, వాంఛితంబు = కోరిక, అబ్బు = తీరును. దమసహోదరి = దమయంతీ!, ఆ అమరవరులన్ = ఆ దేవతాశ్రేష్ఠులను, ఒల్లననియున్ = ఇష్టపడననినా, తుదిన్ = చివరకు, నీకు, ఘట్టకుటికా ప్రభాతంబు క్రమముచేత = – (ఒక బండివాడు పన్ను చెల్లించకూడదని పక్కదారి పట్టి తెల్లవార్లూ ప్రయాణం చేశాడు. కాని విచిత్రంగా తెల్లారేసరికి ఆ పన్నుకట్టేచోటికే చేరుకున్నాడు. పన్నుకట్టక తప్పలేదు), పొందకుండరాదు = పొందకుండా కుదరదు, చలము మాని = పంతముమాని, నామాట, సమ్మతింపుము = అంగీకరింపుము.

తా. ఉరి వేసుకుంటే స్వర్గమును పాలించే ఇంద్రుడు నిన్ను వరిస్తాడు. అగ్నికి ఆహుతి అయితే అగ్ని అదృష్టం ఫలించి నట్టే, నీటిలో మునిగితే వరుణుడ పుణ్యం చేసినట్టే, ఏరీతిగా ప్రాణం తీసుకోవలనుకున్నా యముడి కోరిక తీరినట్టే. కాబట్టి ఓ దమయంతీ! ఆ దేవతాశ్రేష్ఠులను ఇష్టపడను అనినా చివరకు నీకు అతితెలివైన బండివాడు పన్నుకట్టక తప్పనట్టు నీకు దేవతలను పొందకతప్పదు. కనుక పంతముమాని నామాట అంగీకరించుము.

76 **తే. ఒల్లననుమాట కర్థమో యుత్పలాక్షి**
**వలతుననుమాట గాదుగా వక్రరీతి**
**విధి నిషేధరూపంబు భావించియున్న**

**విధియ యగు వ్యంగ్యవాసనా విలసనమున**

ఓ ఉత్పలాక్షి = ఓ కలువరేకులవంటి కన్నులుకలదానా!, ఒల్లను అనుమాటకు అర్థము, వక్రరీతిన్ = విరుద్ధమగు రీతిచే, వలతును అనుమాట, కాదుగా = కాదుకదా! విధి = చెప్పదలచుకున్నది, నిషేధరూపంబు = నిషేధ స్వరూపముగా, భావించియున్న = తలపోసినచో, వ్యంగ్యవాసనా విలసనమున = వ్యంగ్యార్థము అభాసించుటచే, విధియ అగు

తా. ఓ ఉత్పలాక్షి! ఇష్టపడననుమాటకు అర్థము వక్రరీతిని పెండ్లాడతానని కాదుకదా! చెప్పదలచుకున్నది నిషేధ స్వరూపముగా తలపోసినచో వ్యంగ్యార్థము ఆభాసించుటచే అది సమ్మతించుటయే అగును.

**77 వ. ఇవ్విధంబగునేని**

**78 సీ. వెలఁది! యైరావత ద్విపకుంభ కుచకుంభ**
**సంభార హరిదధీశ్వరుని వలతొ**
**జలజాక్షి! నిఖిల తేజస్వి లోకములకు**
**నగ్రగణ్యుండైన యనలు వలతొ**
**తరుణి! లోకానేక ధర్మసంస్థాపన**
**ప్రాగల్భ్య నిధి ధర్మరాజు వలతొ**
**పల్లవాధరి! విధి ప్రథమ సర్గాధ్యక్షు**
**సప్త పాథోనిధిస్వామి వలతొ**
**తే. వైభవం బిచ్చగించి పావనతఁ గోరి**
**ధర్మశీలత యర్థించి నిర్మలత్వ**
**మాసపడి వీరి నలువురయందు నొకని**
**వేఁడుమా చూచెదము నీ వివేకశక్తి**

వెలది = ఓ దమయంతీ!, ఐరావత ద్విప = ఐరావతమనెడి ఏనుగుయొక్క, కుంభ కుచకుంభ = కుంభములనెడి కుచ కుంభములయొక్క, సంభార = పెంపుగల, హరిత్ = దిక్కునకు, అధీశ్వరునిన్ = అధిపతియగు ఇంద్రుని, వలతొ, జలజాక్షి = పద్మనేత్రీ!, నిఖిల = సమస్తమైన, తేజస్వి లోకములకు = తేజస్సుకల పదార్థములకును, అగ్రగణ్యుండైన = ప్రధానుడైన, అనలున్ = అగ్నిని, వలతొ, తరుణి = యౌవనవతీ!, లోక = లోకమందు, అనేక = సమస్తమైన, ధర్మసంస్థాపన = ధర్మములను స్థాపించుటయందుగల, ప్రాగల్భ్య నిధి = సమర్థుడైన, ధర్మరాజు, వలతొ, పల్లవాధరి = చిగురువంటి పెదవి కలదానా!, విధి = బ్రహ్మయొక్క ప్రథమ సర్గ = తొలి సృష్టియగు జలమునకు, అధ్యక్షున్, సప్త పాథోనిధిస్వామిన్ = ఏడు సముద్రములకు ప్రభువైన వరుణుని, వలతొ, వైభవంబు = సంపదను, ఇచ్చగించి = ఇష్టపడి, పావనతన్ = పవిత్రతను, కోరి = కోరుకొని, ధర్మశీలతన్ = ధర్మస్వభావమును, అర్థించి = కోరుకొని, నిర్మలత్వము = స్వచ్ఛతను, ఆసపడి = ఇష్టపడి, వీరి నలువురయందున్, ఒకనిన్, వేడుమా = కోరుకొనుమా!, నీ వివేకశక్తి = నీ బుద్ధి శక్తిని, చూచెదము

తా. ఓ దమయంతీ! ఐరావతముయొక్క కుంభముల పంపుగల తూర్పు దిక్కునకు అధిపతియైన ఇంద్రుని పెండ్లాడతావా? సమస్తమైన తేజో పదార్థములకు ప్రధానుడైన అగ్నిదేవుని పెండ్లాడతావా? లోకంలోని అనేక ధర్మములను స్థాపించుటయందు సమర్థుడైన యముని పెండ్లాడతావా? బ్రహ్మయొక్క ప్రథమ సృష్టియైన నీటికి అధిపతియైన వరుణుని పెండ్లాడతావా? సంపదను ఇష్టపడతావా? పవిత్రతను ఇష్టపడతావా? ధర్మస్వభావాన్ని ఇష్టపడతావా? నిర్మలత్వాన్ని ఇష్టపడతావా? ఈ నలుగురిలో ఒకరిని కోరుకో. నీ బుద్ధిశక్తి ఎంతటిదో చూద్దాం.

**79 తే. అని నృపాలుండు వలుక హస్తాంక సుప్త**
**కోమలైక కపోలయై యా మృగాక్షి**
**వినియె నొకరీతి నొకభంగి విననిదయ్యె**
**వలసియును నొల్లకయును దద్వాక్య సరణి**

అని నృపాలుడు, పలుక, హస్తాంక మస్త = చేతియందుంచుకొనబడిన, కోమల = మృదువైన, ఏక = ఒక, కపోలయై = చెక్కిలికలదై, ఆ మృగాక్షి, తద్వాక్యసరణి = ఆ నలుని మాటల రీతిని, వలసియున్ = కోరియును, ఒల్లకయును = కోరిక లేకుండను, ఒకరీతి వినియె, ఒకభంగి, విననిది అయ్యెన్

తా. అని ఆ నలమహారాజు పలుకగా చేతియందుంచుకొనబడి మృదువైన చెక్కిలికలదై ఆ దమయంతి ఆ నలుని మాటలరీతిని వినాలనియును, వినకూడదనియును అయినది.

**80 వ. చింతాక్రాంతయై యొక్కింతతడవు తలవంచుకొని విచారించి పదంపడి నిట్టూర్పు నిగిడించి యా యిందువదన యా రాజకందర్పునిం గనుంగొని సవిషాదంబుగా నిట్లనియె**

తా. ఆ చంద్రునివంటి ముఖముకల దమయంతి విచారములో మునిగినదై కొంచెముసేపు తలవంచుకొని ఆలోచించి

తరువాత నిట్టూర్పు విడిచి యా రాజమన్మథుడైన నలుని చూచి దీనముగా ఇట్లు పలికెను.

**81 ఉ. నీచరితంబు చూడ నతినిష్ఠురమయ్యెడు లోకపాల దు**
**ర్వాచిక సూచికాంకుర పరంపరఁ దూర్చెదు మాటిమాటికిన్**
**నా చెవులందు నీకుఁ దగునా యిటు సేయఁగఁ దప్పుమంటి బా**
**ధాచరణంబు నైజముగదా తలపోయఁ గృతాంతదూతకున్**

నీ చరితంబు = నీ ప్రవర్తనము, చూడన్ = చూడగా, అతి నిష్ఠురము = మిక్కిలి క్రూరమైనది, అయ్యెడున్ = అగుచున్నది, మాటిమాటికిన్, నా చెవులందు, లోకపాల, సూచిక అంకుర = సూది మొనల, పరంపరన్ = సమూహమును, దూర్చెదు = దూర్చుచున్నావు, ఇటు చేయగన్, నీకు, తగునా?, తప్పుము = ఆ దిక్పాలుర విషయమును మానుమని, అంటిన్ = అన్నాను, తలపోయన్ = ఆలోచింపగా, కృతాంతదూతకున్ = యముని దూతకు, బాధాచరణంబు = బాధకలిగించుట, నైజముకదా = స్వభావమేకదా!

తా. నీ ప్రవర్తన చూడగా చాల క్రూరమైనది అవుతోంది. మాటిమాటికీ నాచెవుల్లో లోకపాలురనే సూదిమొనలను గ్రుచ్చుతున్నావు. ఇలా చేయడం నీకు బాగుందా? ఆ దిక్పాలుర విషయం మానేయమన్నాను. ఆలోచిస్తే, యముని దూతకు హింసించడం స్వభావమేకదా!

**82 సీ. ఇదె యెల్లి కల్యాణ మేతెంచుచున్నది**
**యీ యవాచిక వార్త లిపుడు మాను**
**వర్ణింపు నిషధభూవరుని నోపితివేని**
**నీ దోష మఖిలంబు నెడలుఁ గాన**
**యుండు నీ విచ్చోట నూరట నేఁ డెల్లి**
**సురల కిప్డేమి వేగిరము వచ్చె**
**నలుని రూపచ్ఛాయ దిలకించె నీయందు**
**హంస సూపిన చిత్ర మాత్మఁ దలఁప**
**తే. హస్తములు మోడ్చి వేఁడెద ననఘ! నిన్ను**
**మాను మిటు వింటివే నీకు మాన్యమేనిఁ**
**బాకశాసన ముఖ్య దిక్పాలవర్య**
**పాణి పీడన కార్య సంప్రార్థనంబు**

ఇదె, ఎల్లి = రేపు, కల్యాణము, ఏతెంచుచున్నది = వచ్చుచున్నది, ఈ అవాచిక వార్తలు = ఈ చెప్పరాని మాటలు, ఇపుడు మాను, ఓపితివేని = శక్తుడవైనచో, నీ దోషము, అఖిలంబున్, ఎడలుగాన = పోవును కనుక, నిషధభూవరుని, వర్ణింపు, నీవు, ఇచ్చోట = ఇక్కడనే, ఊరటన్ = విశ్రాంతిగా, నేడు, ఎల్లి =రేపు, ఉండు, సురలకున్, ఇప్డు, వేగిరము = తొందర, ఏమి వచ్చె?, నీ యందు, నలుని రూపచ్ఛాయ, హంస చూపిన చిత్రము, ఆత్మన్ = మనసులో, తలప = అలోచింపగా, తిలకించె = కనబడుచున్నది. అనఘ = దోషరహితుడా!, నిన్ను, హస్తములు మోడ్చి = చేతులు జోడించి, వేడెదను = ప్రార్థించెదను, ఇటు వింటివే = ఈ మాట వింటున్నావా?, నీకు మాన్యమేని = నామాట నీకు గౌరరవింపదగినది అయితే, పాకశాసన ముఖ్య = ఇంద్రుడు మొదలైన, దిక్పాలవర్య = లోకపాల శ్రేష్ఠుల, పాణిపీడన కార్య = వివాహ ప్రయత్నమనెడి, సంప్రార్థనంబు = అడుగుటను, మానుము

తా. ఇదిగో రేపు స్వయంవరం వస్తోంది. ఈ చెప్పకూడని మాటలనింక ఇపుడు మానెయ్యి. ఓపికుంటే నీ దోషమంతా పోతుందికనుక ఆ నలమహారాజుని వర్ణించు. నువ్వు ఈవేళ, రేపు ఇక్కడే విశ్రాంతిగా ఉండు. దేవతల పనికి తొందరేం వచ్చింది? హంస చూపిన చిత్రాన్ని మనసులో తలచుకుంటే నీలో నలునిరూపు కనబడుతోంది. కాబట్టి అనఘా! నిన్ను చేతులు జోడించి ప్రార్థిస్తున్నాను. ఈమాట వింటున్నావా? నా మాట గౌరవింపదగినది అయితే ఇంద్రుడు మొదలైన దిక్పాలకుల వివాహప్రయత్నమును అడగడం మానెయ్యి.

**83 క. ఈ రీతి నా తలోదరి**
**సారతర సుధా రసౌరస ప్రసవరసా**
**సార సరసోక్తి సరణి మ**
**హారాజకుమారునకు నుపాయన మొసగెన్**

ఆ తలోదరి = ఆ దమయంతి, ఈ రీతిన్ = ఈ విధముగా, సారతర = మిక్కిలి శ్రేష్ఠమైన, సుధా రస = అమృతరసమునకు, ఔరస = పుట్టినవగు, ప్రసవ రస = మకరందముయొక్క, ఆసార = జడివానవలె, సరస ఉక్తి = సరసమైన మాటలయొక్క సరణిన్ = రీతిచే, మహారాజకుమారునకున్ = నలునకు, ఉపాయనము = కానుకను, ఒసగెన్ = ఇచ్చెను.

తా.	ఆ దమయంతి ఈ విధముగా మిక్కిలి శ్రేష్ఠమైన అమృతరసమునకు పుట్టిన మకరందముయొక్క జడివానవలె సరసమైన మాటలరీతిచే నలునకు కానుక నిచ్చెను.

**84	ఉ. మైత్రియుఁ బ్రేమయు న్మనసు మచ్చికయు న్మెఱయ న్విరాట రా**
**ట్పుత్రిక వల్కిన న్నిషధభూపతి దైవత కార్య కల్పనా**
**సూత్రము దప్ప నీ కెలమి సొంపు మదిం దలకొల్పి చిత్రవా**
**క్చిత్రశిఖండినందనుఁడు చేడియ నల్లనఁ జూచి యిట్లనున్**

విరాటరాట్ పుత్రిక = దమయంతి, మైత్రియున్, ప్రేమయును, మనసు, మచ్చికయున్ = చనువును, మెఱయన్ = ప్రకాశింపగా, పల్కిన = పలుకగా, దైవత కార్యకల్పనా సూత్రము = ఇంద్రాదుల పనిని చేయు వ్యవస్థను, తప్పన్ ఈక = తప్పిపోనీకుండగ, ఎలమి సొంపు = సంతోషాతిశయమును, మదిం తలకొల్పి = మనసున నిల్పుకొని, చిత్ర వాక్ = చిత్రమైన మాటలయందు, చిత్రశిఖండినందనుడు = బృహస్పతివంటివాడైన, నిషధభూపతి = నలమహారాజు, చేడియన్ = దమయంతిని, చూచి, అల్లనన్ = మెల్లగా, ఇట్లనున్ = ఇట్లు పలికెను

తా.	దమయంతి స్నేహము, ప్రేమ, చనువు ప్రకాశింపగా పలుకగా ఇంద్రాదుల కార్య వ్యవస్థను మరచిపోక సంతోషాన్ని మనసులోనే దాచుకొని చిత్రమైన మాటలయందు బృహస్పతివంటివాడైన ఆ నలమహారాజు దమయంతిని చూసి మెల్లగా ఇట్లు పలికెను.

**85	సీ. హరి కల్పవృక్షంబుఁ బ్రార్థించి నినుఁగోరి**
**దివికి రావించిన దిక్కు గలదె**
**సర్వకామదమైన  సప్త తంతువున ని**
**న్నగ్ని గైకొనఁగ నేమనఁగఁ గలదు**
**తనయొద్దనున్న వాతాపి తాపసునిచే**
**నిను నార్కి వరముగాఁ గొనిన నెట్లు**
**కాంక్షించి యడిగినఁ గామధేనువు నిన్నుఁ**
**ద్యాగంబుగా నీదె యంబుపతికిఁ**
**తే. గాన వినుమేను జెప్పిన క్రమము లెస్స**
**యతివ వరియింపు వేల్పుల యందు నొకని**
**భక్తి దివిజుల చిత్తంబు పట్టకున్న**
**నంతరాయంబు పుట్టుఁ గార్యములకెల్ల**

హరి = ఇంద్రుడు, కల్పవృక్షంబున్ ప్రార్థించి, నిన్ కోరి, దివికిన్ రావించినన్, దిక్కు కలదె?, సర్వ కామదంబు = కోర్కెలనన్నిటిని ఇచ్చెడి, సప్త తంతువునన్ = యాగమునందు, అగ్ని, నిన్ను, కైకొనగన్ = స్వీకరించగా, ఏమనగన్ కలదు = ఏమండానికి ఉ ంటుంది. తనయొద్దన్ ఉన్న , వాతాపి తాపసునిచే = అగస్త్యమహర్షిచే, నినున్, ఆర్కి = యముడు, వరముగాన్, కొనిన = కోరుకొన్న, ఎట్లు = ఏంచేస్తావు?, కాంక్షించి అడిగిన = కోరి అడిగితే, కామధేనువు, నిన్నున్ అంబుపతికి = వరుణునికి, త్యాగంబుగాన్ ఈదె = దానముగా ఇవ్వదా?, కాన = కాబట్టి, వినుము, ఏను = నేను, చెప్పిన క్రమము = చెప్పిన మార్గము, లెస్స = మంచిది, అతివ = దమయంతీ, వేల్పులయందు, ఒకని, వరింపుము, భక్తిన్, దివిజుల = దేవతల, చిత్తంబు పట్టకున్న = మనసు తెలియకపోయినచో, కార్యములకు ఎల్లన్ = పనులన్నిటికిని, అంత రాయంబు పుట్టున్ = విఘ్నములు కలుగును.

తా.	ఇంద్రుడు కల్పవృక్షమును ప్రార్థించి నిన్ను కోరుకొని స్వర్గానికి రప్పించుకుంటే నీకు దిక్కెవరు? కోరికలన్నింటిని తీర్చే యాగంలో అగ్ని నిన్ను స్వీకరిస్తే ఏమండానికి ఉంది? తనదగ్గరున్న అగస్త్యమహర్షిని యముడు నిన్ను వరంగా కోరుకుంటే, ఏం చేస్తావు? కోరి అడిగితే కామధేనువు నిన్ను వరుణునికి దానంగా ఇయ్యదా? కాబట్టి నా మాట విను. నేను చెప్పిన మార్గమే మంచిది. వేల్పులలో ఎవరో ఒకరిని వరించు. భక్తితో దేవతల మనసు తెలుసుకోలేకపోతే పనులన్నిటికి విఘ్నములు వస్తాయి.

**86	వ. అని పల్కిన నప్రతివిధానంబైన ప్రియావాప్తి విఘాతంబున హృదయంబు గలంగిన**

తా.	అని పలుకగా ప్రతిక్రియలేకుండుటచేతను, ఇష్టమునకు విఘ్నము కలుగుటచేతను మనసు కలతచెందగా

**87	సీ. ప్రవిమలాక్షి నభోనభస్యాంబుదములకు**
**నవవృష్టి ధారలై యవతరిల్లి**
**యాకర్ణ దీర్ఘ నేత్రాంభోరుహములకుఁ**
**గమనీయ నాళభావము భజించి**

**కలిత కజ్జలత ముక్తాహార లతలలో**
**హరినీలరత్న నాయకతc దాల్చి**
**లలిత వక్షోజ కుట్మల చుంబనంబున**
**మధుప దంపతుల సామ్యంబు వడసి**
**తే. వేcడి యశ్రులు నిగుడంగ వెక్కి వెక్కి**
**యేడ్వc దొడcగె లతాంగి పృథ్వీశు మ్రోల**
**మృదుల పరివేదనాక్షరోన్మిశ్రమధుర**
**కంఠకాకు వికార కాకలిక యలర**

వేడి యశ్రులు = వెచ్చని కన్నీళ్ళు, ప్రవిమల = మిక్కిలి స్వచ్ఛమైన, అక్షి = నేత్రములనెడి, నభోనభస్య = వర్షాకాలమందలి (శ్రావణ, భాద్రపదమాసములు), అంబుదములకు = మేఘములకు, నవ = క్రొత్త (వర్షపునీరు తెల్లగా ఉంటుంది. కాని ఈ కన్నీటి ధార నల్లని ధారకావడం విశేషం) వృష్టిధారలై = వర్షపు ధారలై, అవతరిల్లి = జాఱుచున్నవై, ఆకర్ణ = చెవుల వరకు వ్యాపించిన, దీర్ఘ = పొడవైన, నేత్రాంభోరుహములకు = నేత్ర పద్మములకు, కమనీయ = మనోహరమైన, నాళభావము భజించి = కాడ రూపమును పొంది, కలిత కజ్జలతన్ = కాటుకతోకూడినవగుటచే, ముక్తాహార లతలలోన్ = లతలవంటి ముత్యాలహారములలో, హరినీలరత్న నాయకతన్ = ఇంద్రనీలమణి నాయకత్వమును, తాల్చి = ధరించి, లలిత = సుందరములైన, వక్షోజ = స్తనములనెడి, కుట్మల = మొగ్గలను, చుంబనమునన్ = తాకుటయందు, మధుదంపతుల సామ్యంబున్ = తుమ్మెద దంపతుల సమానత్వమును, పడసి = పొంది, నిగుడంగన్ = ప్రవహింపగా, లతాంగి = దమయంతి, పృథ్వీశుమ్రోలన్ = రాజుయెదుట, మృదుల = కోమలమైన, పరివేదన = దు:ఖమును సూచించు, అక్షర, ఉన్మిశ్ర = కూడిన, మధుర = శ్రావ్యమైన, కంఠ = కంఠమునుండి వెలువడిన, కాకు వికార = గద్గద స్వభావమును మీఱిన, కాకలిక = అవ్యక్తమైన ధ్వని, అలరన్ = ఒప్పునట్లుగా, వెక్కి వెక్కి, ఏడ్వన్, తొడగెన్ = ప్రారంభించెను

తా, వెచ్చని కన్నీళ్ళు స్వచ్ఛమైన నేత్రములనెడి వర్షాకాల మేఘములకు క్రొత్త వర్షపు ధారలై జారుచుండగా, చెవుల వరకు వ్యాపించిన నేత్రపద్మములకు మనోహరమైన నాళభావము పొంది, కాటుకతో కూడినవగుటచే ముత్యాలహారములలో ఇంద్రనీలమణివలె నాయకత్వమును ధరించి, సుందరములైన స్తనములనెడి మొగ్గలను తాకుటయందు తుమ్మెద దంపతులు సమానత్వమును పొంది ప్రవహింపగా దమయంతి ఆ నలమహారాజు యెదుట కోమలమైన దు:ఖమును సూచించెడి అక్షరములతో కూడిన శ్రావ్యమైన కంఠమునుండి వెలువడిన గద్గదస్వభావమును మీఱిన అవ్యక్తమైన ధ్వని ఒప్పునట్లుగా వెక్కి వెక్కి ఏడ్చుటకు ప్రారంభించెను.

**88 వ. ఇట్లు గద్గదికానిరుద్ధ కంఠనాళయై యబ్బాల యశ్రుకణంబులు కొనగోళ్ళ మీటుచుం దలవాల్చి యేడ్చుచున్నc గనుcగొని దివిజోపకార కార్యప్రయోజన సంస్తంభితంబైన విప్రలంభ వేదనాభరం బప్పు దుద్దీపితంబై భరింపం గొలcదిగామి విశ్వంభరావల్లభుండు మనంబున సంక్షోభించి విభ్రాంతుండై తన్నునుం దనవచ్చిన కార్యంబునుం దన్నుc బుత్తెంచిన వేల్పులను మఱచి యవస్థావశంబున నుచితానుచితవివేకంబులు దప్పుటయు భావనానిరూఢంబులైన ప్రియా విలాపంబులు వికల్పించుచు నిట్లనియె**

తా. ఈ రీతిగా గద్గదస్వరముతోకూడిన కంఠముకలదై ఆ దమయంతి కన్నీరు గోటికొనలచే తూలించుచు తలవాల్చి ఏడ్చుచున్న చూచి, దేవతల కుపకారకమైన పనియొక్క ప్రయోజనం నిరోధింపబడ్డ వియోగంవలన కలిగిన భాధాతిశయము దమయంతి ఏడ్చుచున్నప్పుడు అధికతరమై సహించడానికి అలవికాకపోవడంతో నలుని మనస్సు చలించి భ్రాంతి చెందినవాడై తనను, తను వచ్చిన పనిని, పంపిన దేవతలను మఱచిపోయి అవస్థావిశేషంచేత యుక్తాయుక్త జ్ఞానం చెడిపోవడంతో ధ్యానమందున్న దమయంతి పరివేదనలను వికల్పించుచు ఇట్లు పలికెను

**89 క. ఏమిటి కేడ్చెద వానన**
**తామరసం బెత్తి చూడు తరుణీ! నన్నుం**
**గోమల కటాక్ష వీక్షా**
**దామకమున వీరసేనుతనయుని నలునిన్**

తరుణీ = ఓ దమయంతీ!, ఏమిటికిన్, ఏడ్చెదవు, ఆనన తామరసంబు = ముఖపద్మమును, ఎత్తి, కోమల = మృదువైన, కటాక్ష వీక్షా = క్రీగంటి చూపులనెడి, దామకంబునన్ = పూలదండచే, వీరసేనతనయునిన్ = వీరసేనుని కుమారుడనైన, నలునిన్, నన్నున్, చూడుము

తా. ఓ దమయంతీ! ఏమిటి కేడ్చెదవు? ముఖపద్మమునెత్తి నీ క్రీగంటి చూపులనెడి పూలదండచే వీరసేనుని కుమారుడనైన నలుని నన్ను చూడుము

**90 తే. కాంత! యశ్రుబిందుచ్యుతి కైతవమునc**

**దివిరి బిందుచ్యుతక కేళిఁ దవిలె దీవు**
**సారె సారెకు నాదు సంసారమును స**
**సారముగఁ జేయుచు మసార సారనయన**

కాంత = దమయంతీ!, మసార = శ్రేష్ఠమైన ఇంద్రనీలమువలె నల్లని, నయన = కన్నులు కలది, అశ్రుబిందు చ్యుతి = కన్నీటిబిందువులను రాల్చుటయనెడి, కైతవమున = మిషచేత, సారెసారెకున్ = మాటిమాటికి, నాదు సంసారమును, ససారముగన్ = సారమగు వస్తువులతో కూడినట్టుగ, చేయుచున్, ఈవు = నీవు, తవిరి = యత్నించి, బిందుచ్యుతకకేలి = సంసార శబ్దములోని అనుస్వారమును తీసివేయుటయనెడి ఆటయందు, తవిలెదు = కుతూహలపడుచున్నావు తా. దమయంతీ! శ్రేష్ఠమైన ఇంద్రనీలమువలె నల్లని కన్నులు కలదై కన్నీటి బిందువులను రాల్చుటయనెడి మిషచేత మాటిమాటికి నాదు సంసారమును సారమగు వస్తువులతో కూడినట్టుగ చేయుచు నీవు యత్నించి సంసార శబ్దములోని అనుస్వారమును తీసివేయుటయనెడి ఆటయందు కుతూహలపడుచున్నావు

**91 వ. చెలువ చెక్కుటద్దంబునం జేయిడి యేల చింతించెదవు? ఏటికిం బల్లవపాటలంబైన యధరంబు బీట లెగయ వేఁడి నిట్టూర్పు గాడ్పులు నిగిడించెదవు? ఏకతంబున గద్గదిక నొందెదవు? ఏ కారణంబున యశ్రుకణంబులురుల నేడ్చెదవు? సంతాపంబునకు నేది హేతువు? తప్పనాడంగదా? ఆత్మనిహ్నవం బపరాధం బొక్కో? శుద్ధాంత ప్రవేశంబు దోసంబో? దేవ దూత్యంబు ప్రత్యవాయంబో? చెప్పుము. సేవకులకుం దప్పు గలదే? కలదేనియుం గిరీటమాణిక్య మయూఖ పుంజంబులఁ చరణకంజంబుల నివాళించెద ననుగ్రహింపుము. కృపాదృష్టి దానంబునకు బద్ధముష్టివి గాకుము. వదనంబు వికసించుంగాక. హృదయంబు ప్రసన్నంబు గావలయు. సృక్వభాగంబుల మందహాస లవంబులు గందలించుం గావుత. భ్రూలతాంచలంబులు లీలా చంచలంబు లయ్యెడు. అపాంగ ప్రాంగణంబులం దరంగితంబులగు కలికి చూపులు నాపయిం బొలయింపుము. బాష్పధారావృష్టివ్యపాయంబున దరహసిత చంద్రికాలోకంబు ప్రకాశింపందగు. మధుర వచోమృతంబు చెవులకుం జవి చూపుము. ఆలింగనం బపేక్షించెద. చుంబనంబు దయసేయుము. కుచంబులకుం బరిచర్య సేయనిమ్ము నఖాంకుర నవశశాంకరేఖాభ్యుదయంబు పయోధరోత్సేధశిఖరికూటంబున ఘటియింపంజేయ ననుమతింపుమని మన్మథోన్మాదంబునం బలికి యా రాజమన్మథుండు**

తా. దమయంతీ! చెక్కుటద్దములయందు చేయినిడి ఏల విచారించెదవు? చిగురువలె ఎఱ్ఱనైన పెదవి బీటలు పడునట్లుగా వేడి నిట్టూర్పు గాలులను ఎందుకు నిగడించెదవు? ఏ కారణంచేత గద్గదస్వరము నొందెదవు? ఏ కారణంచేత కన్నీరు కారునట్లుగా ఏడ్చెదవు? నువ్వు ఇలా శ్రమచెందుటకు ఏది హేతువు? నేను మర్యాదకు విరుద్ధముగా మాటలాడల లేదుకదా! ఇతరులెఱుగకుండా మారువేషంలో రావడం నేరమా? అత:పుర ప్రవేశం పాపహేతువా? దేవదూతనవడం పాపానికి మూలకారణమా? చెప్పు. పరిచారకులకు ఇది తప్పని అని ఉంటుందా? ఒకవేళ ఏదేనా దోషముంటే కిరీటమందలి రత్నకాంతుల సమూహముచే నీ పాదపద్మములకు నమస్కరిస్తాను. నాపై దయ చూపించు. కరుణా దృష్టులు నాపై చూపుటకు నిరాకరించుదానవు కాకుము. నీ ముఖము వికసించుగాక. మనసు ప్రసన్న మగుగాక. పెదవుల చిఱునవ్వు మొలకెత్తుగాక. నీ కనులు క్రీగంటి విలాసములచే చలించుగాక. క్రీగంటిచూపులనెడి వాకిళ్ళయందు తొలకాడుచున్న నీ సుందరమైన చూపులు నాపై ప్రసరింప చేయుము. కన్నీటి ధారా వర్షమునకు తిరోధానము చెప్పి చిరునవ్వుల కాంతులు వెలుగులు ప్రకాశించుగాక. నీ మధురమగు మాటలను నా చెవులకు వినిపింపుము. నీ కౌగలింతను కోరుచున్నాను. నీ ముద్దును నాకు సమర్పింపుము. నీ స్తనములకు సేవను చేయనిమ్ము. నఖక్షతములనెడి బాలచంద్ర రేఖలయొక్క అభివృద్ధిని నీ స్తనములనెడి పర్వత శిఖరములయందు చేయననుమతింపుము. ఈరీతిగా మన్మథతాపమువలన కలిగిన ఉన్మాదముచే పలికి, ఆ నలుడు

**92 తే. కొంతతడ విప్విధంబున భ్రాంతిఁ బొంది**
**యంత సంప్రాప్త సంస్కారుడగుచు నాతఁ**
**డమరకార్యంబు విచ్ఛిన్నమగుటఁ దలఁచి**
**యంతరంగంబులోన నిట్లనుచు నుండె**

కొంత తడవు = కొంతసేపు, ఇవ్విధంబునన్ = ఈ రీతిగా, భ్రాంతిన్ పొంది = భ్రమనుపొంది, అంతన్ = అంతలో, సంప్రాప్త సంస్కారుడు అగుచు = తన అవస్థను తెలుసుకున్నవాడగుచు, ఆతడు = ఆ నలుడు, అమరకార్యంబు = దేవతల పని, విచ్ఛిన్నము అగుటన్ = చెడిపోవుటను, తలచి, అంతరంగంబులోన = మనసులో, ఇట్లు, అనుచునుండె =అనుకొనెను. తా. ఆ నలుడు కొంతసేపు ఈ రీతిగా భ్రమనుపొంది అంతలోనే తన అవస్థను తెలుసుకొన్నవాడై, దేవతల కార్యము చెడిపోవుటను తలచి మనసులో ఇట్లనుకొనెను.

**93 క. ఏమియని తలఁతురొకొ సు**
**త్రామ ప్రముఖులగు సుర లెదన్ నిఖిలాంత**

**ర్యాములు దమ కార్యం బే**
**నీమెయి విభ్రాంతి బొంది యిటు సెఱుచుటకున్**

నిఖిలాంతర్యాములు = సమస్త జీవుల లోపలనుండు, సుత్రామ ప్రముఖులు అగు = ఇంద్రుడు మొదలగు, సురలు = దేవతలు, ఎదలోన్ = మనసులో, తమ కార్యంబు = తమ పనిని, ఏన్ = నేను, ఈ మెయిన్ = ఈ రీతిగా, విభ్రాంతి పొంది = భ్రమను పొంది, చెఱుచుటకున్ = పాడుచేయుటకు, ఏమియని = ఏమని, తలతురు ఒకొ = తలచెదరోకదా! తా. సమస్త జీవుల హృదయముల నెఱిగిన ఇంద్రాదులు మనసులో తమ పనిని నేను ఈ విధముగా భ్రాంతిని పొంది పాడుచేయుటకు ఏమని తలంతురోకదా!

**94** **క. పేరు ప్రమాదవశంబునఁ**
**బేరుగొనుట కల్లయయ్యె బృందారక కా**
**ర్యారంభోదయమున కది**
**యారూఢంబైన విఘ్నమై ఫలియించెన్**

ప్రమాదవశంబునన్ = పొరపాటున, పేరున్ పేరుకొనుట = పేరు చెప్పుట, కల్ల అయ్యెన్ = మోసమాయెను, అది = ఆ పేరు చెప్పుట, బృందారక కార్య ఆరంభ ఉదయమునకున్ = దేవతల పని జరుగుటకు, ఆరూఢంబైన = నిశ్చయమైన, విఘ్నమై = అంతరాయమై, ఫలియించెన్ = నిలిచినది

తా. పొరపాటున నా పేరు చెప్పుట అపరాధమైనది. ఆ పేరు చెప్పుట దేవతల పని జరుగుటకు నిశ్చయముగా అంతరాయమై నిలిచినది.

**95** **ఉ. ఆదిఁ బరోపకారపరులై చరియించినయట్టి యాంజనే**
**యాదులఁ బోలనైతి నిపు డక్కట దైవత కార్యసిద్ధి వి**
**చ్ఛేదము నొందె నేమియని చెప్పుదు నింక నమర్త్యపంక్తి కు**
**న్మాదులు సంఘటింపఁగ సమర్థులె యెందును రాయబారముల్**

ఆదిన్ = పూర్వము, పరోపకారపరులై, చరియించినయట్టి = ప్రవర్తించినట్టి, ఆంజనేయాదులన్, పోలన్ ఐతి = సరి కాలేక పోయితిని, ఇపుడు, అక్కట, దైవత కార్య సిద్ధి, విచ్ఛేదము నొందెను = పాడయ్యెను, ఇంకన్ = ఇకపైన, అమర్త్య పంక్తికిన్ = దేవతల సమూహమునకు, ఏమియని చెప్పుదున్, ఎందును = ఎక్కడైనా, ఉన్మాదులు = మోహపరులు, రాయబారముల్, సంఘటింపగన్ = నెఱవేర్చుటకు, సమర్థులె = సమర్థులవుతారా? (అలంకారము – అర్థాంతరము)

తా. పూర్వము పరోపకారపరులై ప్రవర్తించిన ఆంజనేయుడు మొదలగువారికి సరికాలేకపోయితిని. ఇపుడు అయ్యో దేవతల పని పాడయ్యెను. ఇకపైన దేవతలకు ఏమని చెప్పను? ఎక్కడైనా మోహపరులు రాయబారములు నడపుటకు సమర్థులవుతారా?

**96** **తే. వగవ నేటికి నేమన వచ్చు నిపుడు**
**చేతనాహానిఁ గార్యంబు చిన్నఁబోయెఁ**
**జేతనాహాని దైవంబుచేత వచ్చె**
**దైవగతి దాఁటవచ్చునే దేవతలకు**

ఇపుడు, వగవన్ ఏటికి = దు:ఖించుట ఎందులకు, ఏమి అనన్ వచ్చును = ఏమనుకోవాలి, చేతనాహానిన్ = దేవతల దూతనని జ్ఞానములేకపోవుటచే, కార్యంబు, చిన్న పోయెన్ = పాడైనది, చేతనాహాని = ఆ జ్ఞానము లేకపోవుట, దైవంబు చేతన్ = దైవఘటనవలననే, వచ్చెన్ = జరిగినది, దేవతలకు = దేవతలకైనను, దైవగతి = దైవరీతి, దాటవచ్చునే = దాటిపోదానికి శక్యమా? (అలంకారము – అర్థాంతరము)

తా. ఇపుడు విచారించి ప్రయోజనమేమిటి? దేవతల దూతనని జ్ఞానము లేకపోవుటచేతనే వారి పని పాడైనది.ఆ జ్ఞానము లేకపోవుట దైవసంకల్పమువలననే జరిగినది. దేవతలకైనా దైవరీతి తప్పించుకోడానికి శక్యముకాదుకదా!

**97** **తే. అని విచారించుచుండె నయ్యవనినాథుఁ**
**డంతకయ మున్న నలునిఁగా నతని నెఱిఁగి**
**యెదురు గద్దియ డిగ్గి పృథ్వీశతనయ**
**యవనికాంతరమున నోల మాసగొనియె**

ఆ అవనినాథుడు, అని = ఈ రీతిగా, విచారించుచుండెన్, అంతకయ మున్న = అంతకు ముందే, అతనిన్, నలునిగాన్, ఎఱిగి = తెలుసుకొని, ఎదురు గద్దియ డిగ్గి = ఎదురుగా నున్న పీఠమును దిగి, పృథ్వీశతనయ = రాచకన్య దమయంతి, యవనిక

అంతరమునన్ = తెరచాటునకు, ఓలము ఆస కొనియెన్ = వెళ్ళుటకు నిశ్చయించుకొనెను.

తా. ఆ నలమహారాజు ఈ రీతిగా విచారించుచుండగా, అంతకు పూర్వమే అతనిని నలునిగా గుర్తించిన దమయంతి అతనికి ఎదురుగానున్న పీఠమును దిగి తెరచాటునకు పోవ నిశ్చయించుకొనెను.

**98 క. ఆనంద బాష్పధారల**
**వానకుఁ బులకముల యుద్భవములకుఁ దగ న**
**మ్మానిని గదంబలతికకుఁ**
**దా నెచ్చెలివోలె నుండెఁ దదవసరమునన్**

తత్ అవసరమునన్ = ఆ సమయమునందు, ఆ మానిని = ఆ దమయంతి, తాన్ = తాను, ఆనందబాష్పధారల వానకున్ = సంతోష కన్నీటి ధారల వర్షమునకు, పులకముల ఉద్భవములకున్ = పులకలు కలుగుటకు, తగన్ = ఒప్పునట్లుగా, కదంబ లతికకు = కడిమి తీగకు, నెచ్చెలి పోలెన్ = చెలికత్తెవలె, ఉండెన్

తా. ఆ సమయంలో ఆ దమయంతి తాను ఆనందముతో కన్నీటి వర్షధారలకు పులకలు కలుగుటకు ఒప్పునట్లుగా కడిమి తీగెకు చెలికత్తెవలె నుండెను.

**99 వ. ఇత్తెఱంగున నమ్మెఱుంగుబోఁడి తెరమఱుంగుననుండియు లజ్జావశంబునఁ బలుకనేరక సమయోచితంబులగు భాషణములు చెలికత్తియకుం గఱపి పుత్తేర నబ్బోటి నిషధరాజుం జేరి యిట్లనియె**

తా. ఈరీతిగా మెఱుపువంటి శరీరముగల ఆ దమయంతి తెరచాటుననుండియు సిగ్గుతో మాటాడలేక ఆ సమయమునకు తగిన మాటలను చెలికత్తెకు చెప్పి పంపంగా ఆ కాంత నలుని సమీపించి ఇట్లు పలికెను

**100 తే. అర్థి సాధారణమునకు నభయమిత్తు**
**వజ్రపాతంబు ఘోరమై వచ్చినపుడ**
**యతను పూఁదూపులకు భయంబందియున్న**
**నాకు నభయంబుఁ గృపసేయ నీకు బరువె**

వజ్రపాతంబు = వజ్రాయుధపు దెబ్బ, ఘోరమై = భయంకరమై, వచ్చినపుడ, అర్థి సాధారణమునకున్ = సామాన్య యాచకునకు, అభయము = శరణును, ఇత్తు = ఇచ్చెదవు, అతను పూదూపులకున్ = మన్మథుని పూలబాణములకు, భయమందియున్న, నాకు, అభయంబున్ = శరణును, కృపసేయన్ = దయతో ఇచ్చుటకు, నీకు, బరువె = భారమా?

తా. ఘోరమైన వజ్రాయుధపు దెబ్బకు భయపడి నిన్ను శరణుకోరగా సామాన్య యాచకులకే అభయము నిత్తువు. మన్మథుని పూలబాణములకు భయపడియున్న నాకు అభయమును దయతో ఇచ్చుట నీకు భారమగునా?

**101 ఆ. ఆత్మకాండకారుఁడగు వసంతునకు నె**
**య్యంపు జుట్టమైన యంగభవుని**
**నిండుమదిఁ దలంపు చండాల జాతిగా**
**వానికై యభీతి దానమొసగు**

ఆత్మకాండకారుడు = తనకొరకు బాణములను చేయువాడైన, వసంతునకు, నెయ్యంపు చుట్టమైన = అప్తబంధువైన, అంగభవుని = మన్మథుని, చండాలజాతిగాన్, నిండుమదిన్ = మనస్ఫూర్తిగా, తలంపు, వానికై = వానినుండి, అభీతి = అభయమును, దానము ఒసగు = ఇమ్ము

తా. తనకు బాణముల నిచ్చు వసంతునకు ఆప్తబంధువైన మన్మథుని చండాలజాతివానిగా మనస్ఫూర్తిగా భావించి వానినుండి నాకు అభయప్రదానము చేయుము.

**102 మ. అనుచున్ సారఘసారసారిణికి నెయ్యంపుం జెలింబోని తి**
**య్యని వాక్యంబుల బోఁటి భీమసుత మాఱై యేర్పడం బల్కినన్**
**మన మాహ్లాదముఁ బొందుచుండఁగను భూనాథుండు గంభీరతన్**
**వినఁడయ్యెన్ సురరాజ కార్య ఘటనా విఘ్నంబు వాటిల్లుటన్**

అనుచున్, సారఘసార = మధురససారముయొక్క, సారిణికిన్ = నదికి, నెయ్యంపున్ చెలిబోని = ప్రియమైన చెలికత్తెను పోలిన, తియ్యని వాక్యంబులన్, బోటి = చెలికత్తె, భీమసుత మాఱై = దమయంతికి మాఱుగా, పల్కినన్, మనము = మనస్సు, ఆహ్లాదమున్ = సంతోషమును, పొందుచుండగను, భూనాథుండు = నలుడు, సురరాజ కార్య ఘటనా = దేవతలకార్యమును సాధించుటకు, విఘ్నంబు, పాటిల్లుటన్ = కలుగుచుండుటచే, గంభీరతన్, వినడయ్యెన్ = వినలేదు

తా. అని మధురస సార నదికి ప్రియమైన చెలికత్తెను పోలిన తియ్యని వాక్యములను చెలికత్తె దమయంతికి మాఱుగా పలుకగా నలుడు మనసులో సంతోషమును పొందినవాడైనను దేవతలకార్యమునకు విఘ్నము కలుగుచుండుటచే గంభీరముగా విననివాడయ్యెను.

**103 వ. చెలికత్తెయుం గ్రమ్మఱి దమయంతీ సమీపంబునకు వచ్చె నప్పుడు**

**104 ఉ. నిక్కపు దూత సామి ధరణీపతి ముందట నేమి యంటినో**
**పెక్కులు మాటలే ననుచు భీమతనూభవ నెమ్మనంబునన్**
**స్రుక్కుచునుండె నైషధుఁడునుం గడుఁ జింత వహించె విన్ననై**
**యక్కట! దేవకార్య మిటు లాఱడిఁ బోయెనె యంచు నాత్మలోన్**

నిక్కపు దూత = నిజముగా దూతయైనవాడును, సామి = ప్రభువునగు, ధరణీపతిముందటన్ = ఆ నలమహారాజు ముందు, ఏను = నేను, పెక్కులు మాటలు, ఏమి అంటినో, అనుచు, భీమతనూభవ = దమయంతి, నెమ్మనంబునన్ = మనసులో, స్రుక్కుచునుండెన్ = విచారించుచుండెను, నైషధుండునున్ = నలమహారాజును, అక్కట = అయ్యో, దేవకార్యము, ఇటు = ఈ రీతిగా, ఆఱడి పోయెనే యంచు = వ్యర్థమయిపోయెనేయని, ఆత్మలోన్ = మనసులో, విన్ననై = చిన్నబోయినవాడై, కడున్ = మిక్కిలి, చింతన్ = విచారమును, వహించెన్ = పొందెను

తా. నిజంగా దూతయైనవాడును, మహారాజునైన ఆ నలమహారాజుముందర నేను అధికమైన మాటలు ఏం అన్నానో అని దమయంతి మనసులో విచారించుచుండెను. నలుడును అయ్యో! దేవకార్యము ఈవిధంగా చెడిపోయిందేయని మనసులో విచారించుచుండెను.

**105 ఉ. ఆ సమయంబునం గనకహంసము హంసపదంబు డిగ్గి యు**
**ద్భాసిత కాంతి నల్దిశలఁ బర్వఁగ నచ్చటి కేఁగుదెంచెఁ జిం**
**తా సముపేతులై విగత ధైర్యత నివ్వెఱఁగందియున్న యా**
**రాసుతు రాజకన్య ననురాగమెలర్పఁగ నూఱడింపఁగన్**

ఆ సమయంబునన్ = అదే సమయంలో, కనక హంసము = బంగారు హంస, హంసపదంబు డిగ్గి = సూర్యుని మార్గమునుండి (ఆకాశమునుండి)దిగి, ఉద్భాసిత కాంతి = ప్రకాశవంతమైన కాంతి, నల్దిశలన్ = నాలుగుదిక్కులయందును, పర్వగన్ = వ్యాపించగా, చింతాసముపేతులై = విచారముతో కూడినవారై, విగతధైర్యతన్ = సాహసముపోవుటచే, నివ్వెఱ గందియున్న = మ్రాన్పడియున్న, ఆ రాసుతున్ = ఆ నలుని, రాజకన్యన్ , అనురాగము ఎలర్పగన్ = ప్రేమాతిశయుతో, ఊఱడింపగన్ = ఓదార్చుటకు, అచ్చటికిన్, ఏగుదెంచెన్ = వచ్చెను.

తా. అదే సమయలో రాజహంస ఆకాశమునుండి దిగి తనకాంతి నలుదిక్కుల వ్యాపించగా విచారముతోనున్నవారును, సాహసముపోవుటచే మ్రాన్పడియున్నవారునునైన ఆ నలుని, దమయంతిని ప్రేమాతిశయముతో ఓదార్చుటకు అక్కడికి వచ్చెను.

**106 వ. ఏఁగుదెంచి, పూర్వ పరిచయంబున నుర్వీకాంతునిచేతను, దమయంతిచేతను సంతోష సంభ్రమ సహితంబుగా నుపలాలనంబు వడసి యమ్మరాళంబు నలున కిట్లనియె**

తా. వచ్చి పూర్వ పరిచయమువలన నలమహారాజుచేతను, దమయంతిచేతను సంతోషము, ఆశ్చర్యము కూడినట్లుగా మన్ననను పొంది ఆ రాజహంస నలునితో ఇట్లు పలికెను

**107 శా. నీ యంతఃకరణంబు నిర్మలము వర్ణింపంగ శక్యంబె నీ**
**భూయస్త్వంబు జగత్ప్రసిద్ధములు నీ పుణ్య ప్రభావంబు లే**
**లా యీలాగునఁ జింతనొందెదవు కార్యావాప్తియౌఁ గాదటే**
**యా యింద్రాదులు నీ నిజం బెఱుఁగరే యబ్జారివంశాగ్రణీ**

అబ్జారివంశాగ్రణీ = చంద్రవంశములో శ్రేష్ఠుడా!, నీ యంత:కరణంబు = నీ మనస్సు, నిర్మలము = స్వచ్ఛమైనది, నీ భూయస్త్వంబున్ = నీ గొప్పతనమును, వర్ణింపగన్, శక్యంబె, నీ పుణ్య ప్రభావములు = నీ పుణ్యకార్యముల మహత్తులు, జగత్ప్రసిద్ధములు, ఏలా = ఎందులకు, ఈ లాగునన్, చింతను ఒందెదవు = విచారించెదవు, కార్యావాప్తి = కార్యసిద్ధి, ఔన్ = అగును, కాదటే = కాకుండునుకదా!, ఆ ఇంద్రాదులున్, ఈ నిజంబు, ఎఱుగరే = తెలుసుకొనలేరా?

తా. చంద్రవంశశ్రేష్ఠుడవైన ఓ నలమహారాజా! నీ మనస్సు స్వచ్ఛమైనది. నీ గొప్పతనము వర్ణింప శక్యమా? నీ పుణ్యకార్యముల మహత్తులు లోక ప్రసిద్ధములు. ఎందుకు ఈ రీతిగా విచారిస్తావు? కార్యసిద్ధి అవుతుంది, కాకపోతుంది. ఈ నిజం ఆ ఇంద్రాదులు తెలుసుకొనలేరా?

**108 వ. అని వైదర్భిం గనుంగొని**

**109 తే. అమ్మ దమయంతి యంతరంగమ్ములోన**
**మాను సందియ మీతండు మగఁడు నీకు**
**నాఁడె దా నానతిచ్చినవాఁడు బ్రహ్మ**
**తద్వచనమున కన్యథాత్వంబు గలదె**

అమ్మ, దమయంతి, అంతరంగమ్ములోన = మనసులో, సందియము = సందేహము, మానుము, నీకు, ఈతండు = ఇతడే, మగడు = భర్త, నాడె = ఆ రోజే, బ్రహ్మ, తాన్ = తాను, ఆనతిచ్చినవాడు = సమ్మతించినాడు, తత్ వచనమునకు = ఆ బ్రహ్మ

మాటకు, అన్యథాత్వంబు = వేరొక రీతిగా జరుగుట, కలదె = ఉండునా?

తా. అమ్మా! దమయంతీ! నీ మనసులో సందేహము మానెయ్యి. నీకు ఇతనే భర్త. ఏనాడో బ్రహ్మ తాను సమ్మతించాడు. ఆ బ్రహ్మ మాటకు వేరొకరీతిగా జరగడం కుదురుతుందా?

**110 వ. అని యయ్యిద్దఱ నుద్దేశించి దంపతులకు మేలు గావలయు. ఉత్తర కర్మం బవిఘ్నంబగుంగాక. నాకును సరసిజాసను ప్రసాదంబున సకల భూతాంతర్వర్తనంబులు దెలివిపడి యుండు. ఇప్పుడు చింతాభరంబులం గలంగిన మీ ం యంతరంగంబుల విషాదం బపనయింప వచ్చితి. పోయి వచ్చెదనని సముచిత ప్రకారంబున నయ్యిరువురచేత ననుజ్ఞాతుండై పతంగపుంగవుం దరిగె ననంతరంబ**

తా. అని ఆ ఇద్దరిని ఉద్దేశించి దంపతులకు మేలు కలిగెడుగాక. ఈపైన పనులన్నియును నిర్విఘ్నములగుగాక, నాకు బ్రహ్మ దయవలన సమస్త జీవుల మనసులును తెలియుచుండును. ఇపుడు బాధతో కలతచెందిన మీ మనసులకు ఆ బాధను పోగొట్టడానికి వచ్చాను. వెళ్ళి వస్తానని తగిన రీతిలో వారి ఇద్దరిచేతను అనుమతింపబడినవాడై పక్షిశ్రేష్ఠుడు వెళ్ళిన తరువాత

**111 క. కనక మరాళం బీక్రియ**
**ననుకంపను బుద్ధి సెప్పి యరిగిన వెనుకన్**
**మనమునఁ జింతాభరములు**
**జనపతికి విలాసవతికిఁ జయ్యనఁ బాసెన్**

కనక మరాళంబు = బంగారు హంస, ఈ క్రియన్ = ఈ రీతిగా, అనుకంపను = దయతో, బుద్ధి చెప్పి, అరిగిన వెనుకన్ = వెళ్ళిన తరువాత, జనపతికి = రాజునకు, విలాసవతికి = దమయంతికి, మనమునన్ = మనసులోని, చింతాభరములు = విచారములు, చయ్యనన్ = వెంటనే, పాసెన్ = పోయెను

తా. బంగారు హంస ఈ రీతిగా ప్రీతితో బుద్ధిచెప్పి వెళ్ళిన తరువాత నలునకు, దమయంతికి మనసులోని విచారములు వెంటనే పోయినవి.

**112 వ. అప్పుడు నృపాలుండు హేమమరాళ సాంత్వనాలాప బలంబున నెట్టకేలకు మనంబునం జేవదెచ్చుకొని దిక్పాలురం దలంచి నమస్కరించి యిట్లనియె**

తా. అప్పుడు నలుడు బంగారుహంస ఊరడింపు మాటల బలంతో చిట్టచివరకు మనసులన ధైర్యం తెచ్చుకొని దిక్పాలురను తలంచుకొని వారికి నమస్కరించి ఇట్లనెను.

**113 ఉ. భావములో నదంభయగు భక్తికి సంతసమందుఁ దొండె నొం**
**దే విధియింపుఁ డిప్పుడ కడిందిగ దండము దప్పు గల్గెనే**
**నీ విరహానలంబునకు నింకిట నేమియు నోర్వలేఁ జుఁడీ**
**దేవతలార! మన్మథుని తీవ్రశరంబులు గాఁడి పాఱఁగన్**

దేవతలార, భావములో = మనసులో, అదంభయగు భక్తికి = నిష్కపటమగు భక్తికి, సంతసము, అందుదు ఒండెన్ = పొందినను సరియే, ఒండేన్ = లేకున్న, ఇప్పుడ = ఇప్పుడే, తప్పు కల్గెనేన్, దండము = శిక్షను, కడిందిగ = కఠినముగా, విధియింపుడు, ఈ విరహానలంబునకున్ = ఈ విరహాగ్నికి, ఇంక ఇటన్ = ఇంక ఈపైన, మన్మథుని తీవ్ర శరంబులు, గాడి పాఱగన్ = నాటుకొనిపోవుచుండగా, ఏమియున్ = ఎంతమాత్రమును, ఓర్వలేన్ చుడీ = సహింపలేనుసుమా!

తా. దేవతలార! మనసులో నిష్కపటమగు నా భక్తికి సంతోషించారా సరే, లేకపోతే ఇప్పుడే నావల్ల తప్పు జరిగితే కఠినంగా శిక్ష విధించండి. ఈ విరహాగ్నికి, ఇంక ఈపైన మన్మథుని తీవ్రమైన బాణములు గుచ్చుకొని లోనికిపోవుచుండగా నేను ఎంతమాత్రమును సహింపలేకున్నాను.

**114 వ. అనంతరంబ తిరస్కరిణీ తిరోహితయైయుండి యక్కుండిన నరేంద్రనందన రాజనందనున కిట్లనియె**

తా. అటు తరువాత తెరచాటుననే మఱుగుపడియుండినదై దమయంతి ఆ రాజనందనునితో ఇట్లనెను

**115 ఉ. ఓ రజనీకరాన్వయపయోధి నిశాకర యేఁ బతివ్రతన్**
**గూరిమి మీఱ నొక్కరునిఁ గోరి వరింపఁగ నున్నవారి కె**
**వ్వారికి నెగ్గుగాఁ దలఁప వచ్చునె నిన్ను వరింతు నెల్లి బృం**
**దారకులున్ నృపాలురును దక్కినవారును జూచుచుండగన్**

ఓ రజనీకర అన్వయ పయోధి నిశాకర = చంద్రవంశమనెడి సముద్రమునకు చంద్రునివంటివాడా!, ఏన్, పతివ్రతన్, కూరిమి మీఱన్ = ప్రేమాతిశయముతో, ఒక్కరునిన్ = ఒక్కనిని, కోరి, వరింపగన్, ఉన్నవారికి, ఎవ్వారికి = ఎవరికైనను, ఎగ్గుగాన్ = తప్పుగా, తలపవచ్చునె, ఎల్లి = రేపు, బృందారకులున్ = దేవతలును, నృపాలురును, తక్కినవారును, చూచుచుండగన్, నిన్ను, వరింతున్

తా. ఓ చంద్రవంశమనెడి సముద్రమునకు చంద్రునివంటివాడా! నేను పతివ్రతను. ప్రేమతో నేను ఒకనిని కోరి

వరించుచుండగా ఉన్నవారికెవరికైనను అది దోషముగా తలంచవచ్చునా? రేపు ఈ దేవతలును, రాజులును, తక్కినవారును చూచుచుండగా నిన్నే వరింతును

**116 తే. ఎల్ల లోకధర్మంబులు నెఱిఁగియుండి**
**యేల సేయుదు రమరేంద్రు లీరసంబు**
**నాది వారికి వందనం బాచరించి**
**తదనుమతి నిన్ను వరియింతుఁ దథ్య మిదియ**

అమరేంద్రులు = దేవతలు, ఎల్లలోక ధర్మంబులు = లోకములోని ధర్మముల నన్నిటిని, ఎఱిగియుండి = తెలిసియుండి, ఈరసంబు = అసూయను, ఏలచేయుదురు?, ఆదిన్ = ముందుగా, వారికి, వందనంబు, ఆచరించి = చేసి, తత్ అనుమతిన్ = వారి అంగీకారముతోనే, నిన్ను, వరియింతు, ఇదియ = ఇదే, తథ్యము = నిజము

తా. లోకములోని ధర్మములన్నియును తెలిసియుండి కూడా దేవతలు ఎందుకు అసూయపడతారు? స్వయంవరమున ముందుగా వారికి నమస్కారము చేసి, వారి అంగీకారముతోనే నిన్ను వరించెదను. ఇదియే నిశ్చయము

**117 మ. అను చన్యోన్యము పెద్దయేని తడ వేకాంతంబున న్వారు వో**
**యిన పోక ల్వినుచు చంతరిక్షగతులై యింతంతటం గానరా**
**క నిగూఢాకృతి నున్న దేవతలు దత్కాలంబునన్ రాజనం**
**దను నంతర్హితుఁ జేసి చేరి రతఁడుం దారు న్నిజస్థానమున్**

అనుచున్, అన్యోన్యము = పరస్పరము, పెద్దయేని తడవు = చాలసేపు, ఏకాంతంబునన్ = ఒంటరిగా, వారు, పోయిన పోకలన్ = పోయిన ప్రవర్తనలను, వినుచు, అంతరిక్షగతులై = శూన్యమందున్నవారై, ఇంతంతటన్ = అక్కడనే, కానరాక = కనబడకుండగ, నిగూఢాకృతిన్ = రహస్యముగా, ఉన్న, దేవతలు, తత్కాలంబునన్ = ఆ సమయములో, రాజనందనున్ = నలుని, అంతర్హితున్ చేసి = మాయముచేసి, అతడున్ = ఆ నలుడును, దారు = వారును, నిజస్థానమున్ = తమతమ స్థానములను, చేరిరి.

తా. అని పలుకుచు పరస్పరము చాలసేపు ఒంటరిగా వారు పోయిన ప్రవర్తనలను వినుచు ఆకాశమందున్నవారై అక్కడచే కనబడకుండగ రహస్యంగాయున్న దేవతలు ఆ సమయంలోనే నలుని మాయముచేసి అతడును, వారును తమతమ స్థానమును చేరుకొనిరి.

**118 తే. నలుని దూతత్వ మిబ్భంగిఁ దెలియఁ జూచి**
**తన్మనశ్శుద్ధి కొంది రాత్మల ముదంబుఁ**
**దమ్ము నక్కాంత వరియింపఁ దలఁపు లేమి**
**ఖేద మందుచు నుండి రింద్రాది సురలు**

ఇంద్రాది సురలు = ఇంద్రుడు మొదలైన దేవతలు, నలుని దూతత్వము, ఈ భంగిన్ = ఈ రీతిగా, తెలియన్ చూచి = స్పష్టముగా చూచి, తత్ = ఆ నలునియొక్క, మనశ్శుద్ధికి = మోసములేని మనస్సునకు, ఆత్మలన్ = మనసులలో, ముదంబు = సంతోషమును, ఒందిరి = పొందిరి, తమ్ము = తమను, ఆ కాంత, వరియింపన్, తలపు లేమి = ఆలోచన లేకపోవుటకు, ఖేదము అందుచున్ = దు:ఖపడుచు, ఉండిరి.

తా. ఇంద్రుడు మొదలైన దేవతలు నలుని దూతకార్యము ఈ రీతిగా స్పష్టముగా చూచి ఆ నలునియొక్క కల్మషము లేని మనస్సునకు తమ మనసులలో సంతసమందిరి. తమను ఆ దమయంతి వరియించు ఆలోచన లేకపోవుటకు విచారించుచుండిరి.

**119 వ. అనంతరంబ కామరూపంబగు నా సుత్రామాది చతుష్టయం బుపాయాంతరంబున దమయంతి వరియింపం దలంచి వంచనా నైపుణంబున నలరూపంబులు ధరించి స్వయంవరకాలంబు ప్రతీక్షించుచుండిరి. నిషధరాజును భోజరాజాధికార పురుష నిర్దిష్టంబైన రమ్యస్థలంబున సపరివారుండై బృందారకానుమతి వడసి వసియించె నయ్యవసరమున**

తా. అటు తరువాత కామరూపులగు ఆ ఇంద్రుడు మొదలైన నలుగురును వేరే ఉపాయముతో దమయంతిని వివాహ మాడదలచి మోసపు నేర్పుతో నలరూపములను ధరించి స్వయంవర సమయముకొరకు ఎదురుచూచుచుండిరి. నలుడును భోజరాజుయొక్క నియమిత పురుషులచే చూపబడిన సుందర ప్రదేశమున పరివారముతో కూడినవాడై దేవతల అనుమతిని పొంది ఉండెను. ఆ సమయమున

**120 మ. చతురంగ ధ్వజినీ సమేతులగుచున్ శస్త్రాస్త్ర విద్యానిధుల్**
**రతిరాజ ప్రతిమాన మూర్తులు శరద్రాకేందు బింబాననుల్**
**చతురంభోధి పరీత విశ్వ వసుధా చక్రంబునం గల్గు రా**
**సుతు లెల్లం జనుదెంచి రవ్విభవముం జూడంగ నొక్కుమ్మడిన్**

శస్త్ర అస్త్ర విద్యానిధుల్, రతిరాజ ప్రతిమాన మూర్తులు, శరత్ రాక ఇందుబింబ ఆననుల్ = శరత్కాలమందలి చంద్రబింబము వంటి ముఖముకలవారును, చతురంబోధి పరీత = నాలుగు సముద్రములచే చుట్టబడిన, విశ్వ వసుధా చక్రంబునన్ =

భూమండలంబంతటను, కల్గు = ఉన్నటువంటి, రాసుతులు ఎల్లన్ = రాకుమారులందరును, ఒక్కుమ్మడిన్ = ఒక్కసారిగా, ఆ విభవమున్, చూడంగన్, చనుదెంచిరి = వచ్చిరి.

తా. శస్త్రాస్త్ర విద్యలలో నిధులు, మన్మథునితో సమానమైన రూపముకలవారు, శరత్కాలమందలి చంద్రబింబమువంటి ముఖముకలవారు, నాలుగు సముద్రములచే చుట్టబడిన భూమండలములోని రాజకుమారులందరును ఒక్కసారిగా ఆ వివాహ వైభవమును చూచుటకు వచ్చిరి.

**121 తే. రాజవంశజుఁడై యుండి రానివాఁడు**
**కామ బాణంబులకు గుఱి గానివాఁడు**
**సప్త సాగర మధ్య భూ చక్రముననుు**
**నృపకుమారుండు లేడు పన్నిదమునకును**

తా. రాజవంశంలో పుట్టి స్వయంవరమునకు రానివాడును, మన్మథుని బాణములకు గురి కానివాడును, సప్త సముద్రాల మధ్య భూమండలంలో పందేనికైనా ఒక్క రాజకుమారుడును లేడు

**122 కం. కొందఱు తరుణి వరింపం**
**గొందఱు బలిమిని హరింపఁ గొందఱు సూడన్**
**గొందఱు భూషింపను నృప**
**నందను లేతెంచి రుబ్బున న్మహమునకున్**

తా. కొంతమంది దమయంతిని వరించడానికి, కొంతమంది బలవంతంగా ఎత్తుకుపోవడానికి, కొంతమంది చూడ్డానికి, కొంతమంది అభినందించడానికి రాజకుమారులు సంతోషముతో ఆ స్వయంవరమునకు వచ్చిరి.

**123 తే. తిలలు పై నెత్తి చల్లిన దిగువఁ బడని**
**యంత సందడి పెంద్రోవలందుఁ గలిగె**
**నఖిల దేశంబులందుండి యవనిపతులు**
**వైభవాలోకనమునకు వచ్చుచుండ**

అఖిల దేశంబులందుండి, అవనిపతులు = రాజులు, వైభవ ఆలోకనమునకు = స్వయంవరవైభవమను చూచుటకు, వచ్చుచుండ, పెనుత్రోవలందున్ = రాజమార్గములందు, తిలలు = నువ్వులు, పైన్ ఎత్తి = పైకి ఎత్తి, చల్లిన, దిగువన్ పడని = క్రిందపడని, అంత, సందడి = సమ్మర్దము, కలిగెను

తా. అన్ని దేశములనుండి రాజులు స్వయంవర వైభవమును చూచుటకు వచ్చుచుండగా రాజమార్గములందు నువ్వులు పైకెత్తి చల్లినా క్రిందకుపడనియంత సమ్మర్దము కలిగెను

**124 క. తఱచగు పెనుసందడిలో**
**నిఱకటమునఁ బడిన నృపతి యీ నిగ్రహమున్**
**దొఱఁగుట యభీప్సితార్థం**
**బఱిచేతికి వచ్చినట్ల యని వెత కుడుచున్**

తఱచగు = దట్టమైన, పెనుసందడిలోన్ = గొప్ప సమ్మర్దములో, ఇఱకటమునన్ = ఇరకాటములో, పడిన = పడ్డ, నృపతి = రాజు, ఈ నిగ్రహమున్ = ఈ ప్రతిబంధమును, తొఱగుట = తొలగించుకొనుట, అభీప్సితార్థంబు = కోరినవస్తువు (దమయంతి), అఱచేతికి = చేతిలోనికి, వచ్చినయట్ల యని = వచ్చినట్లేనని , వెత కుడుచున్ = విచారించుచుండును.

తా. ఈ దట్టమైన పెను సందడిలో ఇరకాటంలో పడ్డ నలుడు ఈ ప్రతిభంధాన్ని తొలగించుకోవడం, దమయంతిని సొంతము చేసుకోవడంగానేయని విచారించుచుండెను

**125 తే. వెనుక ముందటి సమ్మర్దమునఁ గరంబు**
**దందసిలి మధ్యముననున్న ధరణివిభుఁడు**
**యంత్ర సిద్ధార్థ భావంబు నలమికొనియు**
**దను నసిద్ధార్థుఁగా మదిఁ దలఁచుచుండు**

వెనుక ముందటి సమ్మర్దమునన్, కరంబు = మిక్కిలి, దందసిలి = రాపిడినొంది, మధ్యముననున్న = మధ్యలోనుండిపోయిన, ధరణివిభుడు = నలమహారాజు, యంత్రసిద్ధార్థభావంబు = గానుగలోని ఆవగింజ స్థితిని, అలమికొనియు = పొందియును, తనున్ = తనను, అసిద్ధార్థుగాన్ = కృతార్థుడుకానివానినిగా, మదిన్ = మనసునందు, తలచుచుండున్

తా. ముందువెనుకల సమ్మర్దముచేత మిక్కిలి రాపిడినొంది మధ్యలోఉండిపోయిన నలమహారాజు గానుగలోని ఆవగింజ స్థితిని పొందియును తనను కృతార్థుడు కానివానినిగానే మనసున తలపోయుచుండును.

**126 ఉ. కోటిభుజంగ పుంగవులు గొల్వఁగ వందిజనంబు ముందటన్**

**జాటువు లుగ్గడింప ఫణసంభృత రత్న దిశా విభాసియై**
**వీటి జనంబు లెల్లఁ దను విస్మయమొంది కనుంగొనంగఁ గ**
**ర్కోటకుఁ డేఁగుదెంచె మదఘూర్ణిత పాటల నేత్ర పద్ముడై**

కోటిభుజంగపుంగవులు = కోటి సర్పరాజులు, కొల్వంగ = సేవించుచుండగా, ముందటన్ = ముందర, వందిజనంబు = స్తుతిపాఠకులు, చాటువులు = స్తుతులు, ఉగ్గడింపన్ = చదువుచుండగా, ఫణసంభృత = పడగలందు ధరింపబడిన, రత్న = రత్నములచే, దిశా విభాసియై = దిక్కులందు ప్రకాశించుచున్నవాడై, వీటి జనంబులెల్లన్ = పురజనులందరును, విస్మయమొంది = ఆశ్చర్యపడి, కనుంగొనంగన్ = చూచుచుండగ, మదఘూర్ణిత = మద్యపానముచే మదించిన, పాటల = ఎఱ్ఱని, నేత్ర పద్ముడై = పద్మములవంటి నేత్రములుకలవాడై, కర్కోటకుడు = కర్కోటకుడను సర్పరాజు, ఏగుదెంచె = వచ్చెను.

తా. కోటి సర్పరాజులు సేవించుచుండగా, ముందర స్తుతిపాఠకులు స్తుతులు చదువుచుండగా పడగలందు ధరించిన రత్నకాంతులతో దిక్కులందు ప్రకాశించుచున్నవాడై పురజనులందరును ఆశ్చర్యపడి చూచుచుండగా మద్యపానముచే మదించిన ఎఱ్ఱని నేత్రపద్మములు కలవాడై కర్కోటకుడను సర్పరాజు స్వయంవరమునకు వచ్చెను.

**127 మ. ప్రమథాధీశ భుజాంతరస్థల ఘన ప్రాలంబహారం బద**
**భ్రమనోజ్ఞాకృతి వచ్చె వాసుకి ఫణా పర్యంత మాణిక్య మం**
**జు మయూఖాంకుర పుంజమంజుల నభస్కుండై భుజంగాంగనా**
**సముదాయం బిరువంకఁ బాడఁగ యశస్సంగీత గాథావళుల్**

ప్రమథాధీశ = ఈశ్వరునియొక్క, భుజాంతరస్థల = వక్షస్థలమందు, ఘన = గొప్పదైన, ప్రాలంబ = పేరుగా వేసుకొనిన, హారంబు = హారమైనవాడగు, వాసుకి, ఫణా పర్యంత = పడగల ప్రాంతమందు, మాణిక్య = రత్నములయొక్క, మంజు = మనోహరమైన, మయూఖ = కిరణముల, అంకుర = మొలకలయొక్క, పుంజ = సముదాయముచే, మంజుల నభస్కుండై = సుందరమైన ఆకాశము కలవాడై, భుజంగ అంగన సముదాయంబు, ఇరువంక = రెండు ప్రక్కల, యశస్సంబంధ గీతావళుల్ = కీర్తికి సంబంధించిన పాటలను, పాడగ = పాడుచుండగ, అదభ్ర = అధికమగు, మనోజ్ఞ = మనోహరమైన, ఆకృతిన్ = ఆకారముతో, వచ్చెన్

తా. ఈశ్వరునియొక్క వక్షస్థలమందు గొప్పదైన పేరుగా వేసుకొన్న హారమైనవాడగు వాసుకి పడగల ప్రాంతమందు రత్నములయొక్క మనోహరమైన కిరణముల మొలకలయొక్క సముదాయముచే ఆకాశము సుందరమైనదగుచుండగా భుజంగాంగనలు రెండుప్రక్కల కీర్తికి సంబంధించిన పాటలను పాడుచుండగా అధికమగు మనోహర ఆకారముగల వాసుకి వచ్చెను.

**128 వ. ఇంద్రాగ్నియమవరుణు లేతెంచిరి. తక్కిన దిక్పాలురు రారైరి. అది యెట్టిదనిన**

**129 సీ. రాజు నొజ్జల మంత్ర రక్షాబలంబున**
**రాఁబొందు గాదయ్యె రాక్షసునకు**
**దమయంతితోడి నేత్రస్పర్ధ కతమున**
**నిజవాహనము రామి నిలిచె గాలి**
**తనరూపు కైలాస దర్పణంబునఁ జూచి**
**వ్రీడఁ గుబేరుఁ డిల్వెడలఁడయ్యె**
**నర్ధనారీశ్వరుండగుట నీశానుండు**
**సామేని యంకిలిఁ జాఁగకుండెఁ**
**తే. దాను వహియించు ధాత్రి నెద్దానఁ బెట్టి**
**వచ్చు? నటుగాన శేషుండు వచ్చు టుడిగె**
**ముదిసి ముప్పునఁ బెండ్లికై మొగము వెల్వఁ**
**దగవు గాదని రాఁడయ్యె తాతవేల్పు**

రాజు = విదర్భరాజుయొక్క, ఒజ్జల = గురువులయొక్క, మంత్ర = మంత్రముల, రక్షా బలంబునన్ = రక్షణ బలముచే, రాక్షసునకున్ = నైఋతికి, రాన్ పొందుకాదు = రాక వీలుపడలేదు, దమయంతి తోడి నేత్రస్పర్థ, కతమునన్ = కారణమున, నిజవాహనము = తనవాహనమైన లేడి, రామిన్ = రాకపోవుటచే, గాలి = వాయుదేవుడు, నిలిచె = నిలిచిపోయెను, తన రూపు, కైలాస దర్పణంబునన్ = కైలాసపర్వతమనెడి అద్దమునందు, చూచి, వ్రీడన్ = సిగ్గుతో, కుబేరుడు, ఇలు = ఇంటిని, వెడలడయ్యె = బయలుదేరడయ్యెను, అర్థనారీశ్వరుండగుటన్, సామేని = సగయు శరీరమేయను, అంకిలిన్ = క్షోభచే, ఈశానుండు, చాగకుండెన్ = సాగకుండెను, తాను వహియించు ధాత్రిన్, ఎద్దాన = దేనియందు, పెట్టి వచ్చు, అటుగాన = ఆ కారణముచే, శేషుండు, వచ్చుట, ఉడిగె = మానివేసెను, ముదిసి ముప్పునన్ = ముసలియై పోవుటకైయున్న తాను, పెండ్లికై,

మొగము వెల్వన్ = తలదూర్చుట, తగవు కాదని = న్యాయముకాదని, తాతవేల్పు = బ్రహ్మ, రాడయ్యెన్

తా. విదర్భరాజు గురువుల మంత్ర రక్షాబలముచే నైఋతికి రావడం వీలుపడలేదు. దమయంతితో నేత్రస్పర్థ కారణముగా తన వాహనము రాకపోవుటచే వాయువు నిలిచిపోయెను. తన రూపాన్ని కైలాసపర్వత దర్పణంలో చూసుకొని సిగ్గుతో కుబేరుడు ఇల్లు వదలడయ్యెను. అర్ధనారీశ్వరుడగుటచే సగం శరీరమేనని క్షోభతో ఈశానుడు ముందుకు సాగడయ్యెను. తాను భరిస్తున్న భూమిని ఎవరియందు పెట్టి వచ్చుటాయను కారణముచే శేషుడు వచ్చుట మానివేసెను. ముసలివాడై పోవుటకుసిద్ధముగానున్న తాను పెండ్లికి ఏ మొగం పెట్టుకు వెళ్లడమాయని బ్రహ్మ రాడాయెను.

**130 తే. ఇట్లు త్రైలోక్యవాసులు నేఁగుఁదెంచి**
**రమ్మహోత్సవమునకు నయ్యవసరమునఁ**
**బ్రసవ సాయక నారాచ పక్షజాల**
**మహిత వాతూల తూలాయమాను లగుచు**

ఇట్లు = ఈ రీతిగా, ఆ అవసరమునన్ = ఆ సమయమందు, త్రైలోక్యవాసులున్ = మూడులోకములందలివారును, ప్రసవ సాయక = మన్మథుని, నారాచ = బాణముల, పక్ష = ఱెక్కలయొక్క, జాల = సమూహము, మహిత = గొప్పదైన, వాతూల = పెనుగాలికి, తూలాయమానులు అగుచున్ = దూదివంటివారగుచు, ఏగుదెంచిరి = వచ్చిరి

తా. ఈ రీతిగా ఆ సమయమందు మూడు లోకములందలి వారును స్వయంవరమునకు మన్మథుని బాణముల ఱెక్కల గాలికి దూదిపింజలై వచ్చిరి.

**131 వ. అప్పుడు కనకమయరమ్యహర్మ్య నివేశంబులం గ్రథకైశికాధీశ్వరుండు విడియింప నభినవాభ్యాగతులగు మూఁడు లోకంబులరాజులును విడిసిరి. ఆ రాజసమాజంబు గుండిననగరంబునందుఁ బుండరీకాక్షు జఠరంబునందు భువనత్రయంబును గుంభసంభవు హస్తాంభోరుహంబునందు నంభోధి చతుష్టయంబును బంచాక్షరియందుఁ బరమేశ్వరుండునుం బోలె నసంబాధంబై యుండె. నానా విచిత్ర చిత్రంబులగు పురభవన భిత్తిభాగంబులతోఁడి ప్రతిస్పర్థంబోలె నాకాశభాగంబు మూర్ధాభిషిక్త మకుటరత్న ప్రభాభారంబులచేతఁ గిమ్మీరితంబయ్యె. అమ్మహోత్సవాడంబరంబవలోకింప సంబరంబునఁ బీతాంబరత్ర్యంబకులు దేవతాకదంబంబులు గొలువఁ గొల్వుండిరి. కందళిత హృదయారవిందంబైన సనకసనందనాది యోగీంద్రబృందంబును మందపాల, బక, దాల్భ్య, రైభ్యక, భరద్వాజ, గౌతమ ప్రభృతి మహర్షి సందోహంబును దగిన నెలవుల నుండి విలోకించుచుండె. సముత్తుంగ మంగళ మృదు మృదంగ నినాద భంగీ తరంగిత సంగీత ప్రసంగంబు విబుధ వారాంగనాజనంబు నభోరంగంబునఁ బ్రవర్తించె వెండియు**

తా. ఆ సమయమున బంగారుమయమయిన, మనోహరములైన మేడలయందు భీమరాజు విడిదిచేయించగా క్రొత్తగా వచ్చిన మూడు లోకముల రాజులును విడిది చేసిరి. ఆ రాజ సమూహము కుండిన నగరమునందు విష్ణుమూర్తి హృదయంబున ముల్లోకములును, అగస్త్యుని పద్మమువంటి చేతియందు నాలుగు సముద్రములును, పంచాక్షరియందు పరమశివుడునువలె సుఖముగానుండిరి. పలు విచిత్ర చిత్రములైన నగరమందలి గోడలతో మాత్సర్యముచేతను కాబోలు ఆకాశప్రదేశము రాజుల కిరీటములందలి రత్నకాంతుల సమూహముచే పలు రంగులుకలదియైనది. ఆ గొప్ప మహోత్సవమును చూచుటకు ఉత్సాహముతో విష్ణు, మహేశ్వరులు దేవతా సమూహములు సేవించుచుండగా సభలోనుండిరి. సంతోషముచే మొలకలెత్తిన హృదయారవిందంబులైన సనక సనందనాది యోగీంద్రుల సమూహములును, మందపాల, బక, దాల్భ్య, రైభ్యక, భరద్వాజ, గౌతమ మొదలైన మహర్షి బృందంబులును తగిన స్థానములందుండి చూచుచుండిరి. అధికమైన, శుభప్రదమైన, శ్రావ్యమైన మృదంగధ్వనుల రచనలచే నిండియున్న సంగీతగోష్ఠిని అప్సరసలు ఆకాశరంగస్థలమున యుండిరి.

**132 చ. మగువలు భూమిపాలురకు మాటికి మాటికి వైచు కుంచెల**
**న్నెగసిన మారుతౌఘములు నిర్భర సౌరభ సంప్రదాయ మిం**
**పుగ నిడి వాస ధూపములఁ బ్రోదియొనర్చుచు నిచ్చెనర్చనల్**
**గగనమున న్మహోత్సవముఁ గన్గొన వచ్చిన దేవపంక్తికిన్**

మగువలు = స్త్రీలు, భూమిపాలురకు, మాటికిమాటికి, వైచు = వీచు, కుంచెలన్ = చామరములచే, ఎగసిన = లేచిన, మారుత ఓఘములు = వాయుసమూహములు, నిర్భర = నిండయిన, సౌరభ = పరిమళముయొక్క, సంప్రదాయము = పరంపరను, ఇంపుగన్ ఇడి, వాసధూపములన్ = పరిమళ ధూమములచే, ప్రోది యొనర్చుచున్ = వృద్ధి చేయుచు, గగనమునన్, మహోత్సవమున్, కన్గొన = చూచుటకు, వచ్చిన, దేవపంక్తికిన్, అర్చనల్ = పూజలను, ఇచ్చెన్

తా. స్త్రీలు రాజులకు వీచు వింజామరలచే లేచిన గాలులు చక్కని పరిమళ పరంపరను ఇంపైన పరిమళ ధూపములచే వృద్ధిచేయుచు ఆకాశమున స్వయంవరమహోత్సవమును చూచుటకు వచ్చిన దేవతాసమూహమునకు పూజలనొనర్చెను.

**133 తే. అల్లనల్లన వీచె మంచాంతరములఁ**
**జంచదవనీంద్రచయ చంద్ర చందనాను**
**లేప నైపథ్య కుసుమ మాలాపరాగ**

**గంధవహమైన చల్లని గంధవహము**

మంచ అంతరములన్ = తల్పముల మధ్యమునందు, చంచత్ = ప్రకాశించుచున్న, అవనీంద్రచయ = రాజసమూహములయొక్క చంద్ర = పచ్చకర్పూరము, చందన అనులేప = మంచిగంధపు పూతలచే, నైపథ్య = అలంకారార్థము దాల్చిన, కుసుమ మాలాపరాగ = పూలదండల ధూళియొక్క, గంధవహమైన = పరిమళించుచున్న, చల్లని, గంధవహము = వాయువు, అల్లనల్లనన్ = మెల్లమెల్లగా, వీచెన్

తా. తల్పముల మధ్యలో ప్రకాశించుచున్న రాజసమూహముల పచ్చకర్పూర, మంచింగంధపు పూతలచేతను, అలంకారమునకై ధరించిన పూలదండలపరాగముచేతను పరిమళించుచున్న చల్లని వాయువులు మెల్లమెల్లగా వీచెను.

**134 సీ. పై పై మహాశ్చర్య పర్యుత్సుకంబులై**
**తనమీఁద నృపుల నేత్రములు వ్రాల**
**నలినాప్తు సన్నిధి నక్షత్రములు వోలె**
**రాజులు దనమ్రోలఁ బ్రభలఁ దొఱఁగ**
**నఖిలలోక మనోజ్ఞుఁడై యొప్పు తనమూర్తి**
**చిత్తసంభవునైన సిగ్గు వఱుపఁ**
**దన ప్రాభవము దేవతాకోటినైనను**
**బాణిపద్మములు మోడ్పంగఁ జేయ**
**తే. వలపు మిగులఁ బతింవరావరణయోగ్య**
**రమ్య శృంగార కలితుఁడై రాజవీథి**
**నల్ల నేతెంచి యొక్క సింహాసనంబు**
**నధివసించెను నలుఁడు మంచాగ్రభూమి**

మహాశ్చర్య పర్యుత్సకంబులై = గొప్ప ఆశ్చర్యముచే వేడుకపడుచున్నవై, నృపుల నేత్రములు, పైపైన్ = మీదుమీదుగా, తనమీద, వ్రాలన్ = పడుచుండగా, నలినాప్తు = సూర్యుని, సన్నిధి = సాన్నిధ్యమున, నక్షత్రముల వోలె, రాజులు, తనమ్రోల = తన సమీపమున, ప్రభలన్ = కాంతులను, తొఱగన్ = పోగొట్టుకొనగా, అఖిలలోక, మనోజ్ఞుడై = సౌందర్యవంతమై, ఒప్పు = ప్రకాశించునట్టి, తన మూర్తి = తన రూపము, చిత్తసంభవునైన = మన్మథునైనను, సిగ్గు, పఱుప = పడునట్లు చేయగా, తన ప్రాభవము = తన సామర్థ్యము, దేవతాకోటినైనను, పాణిపద్మములు = పద్మములవంటిచేతులను, మోడ్పంగన్ చేయున్ = జోడించునట్లు చేయుచుండగా, వలపు మిగులగన్ = కోర్కె అతిశయించునట్లుగా, పతింవరా = కన్యకను, వరణ = వరించుటకు, యోగ్య = తగిన, రమ్య = మనోహరమైన, శృంగార = సౌందర్యముతో, కలితుడై = కూడినవాడై, నలుడు, రాజవీధిన్, అల్లన = మెల్లగా, ఏతెంచి = వచ్చి, మంచాగ్రభూమిన్ = తల్పములున్న ప్రధానభూమియందు, ఒక్క, సింహాసనంబున్, అధివసించెను = కూర్చొనెను.

తా. గొప్ప ఆశ్చర్యముచే వేడుకపడుచున్నవై రాజుల నేత్రములు మీదుమీదుగా తనమీద వ్రాలుచుండగా సూర్యుని సాన్నిధ్యమున నక్షత్రములవలె రాజులు తన సమీపమున కాంతులను పోగొట్టుకొనగా సమస్త లోకములకు మనోహరుడై ప్రకాశించునట్టి తన రూపము మన్మథునైనను సిగ్గుపడునట్లు చేయగా, తన సామర్థ్యము దేవతాకోటినైనను పద్మములవంటి చేతులను జోడించునట్లు చేయుచుండగా కోర్కె అతిశయించునట్లుగా దమయంతిని వరించుటకు తగిన రమ్యమైన సౌందర్యముతో కూడినవాడై నలుడు రాజవీథిని మెల్లగా వచ్చి తల్పములున్న ప్రధానభూమియందు ఒక సింహాసనమున కూర్చుండెను.

**135 తే. కదిసి పరిపాటి మణిమంచకములమీఁద**
**రాకుమారకులై యున్న నాకవిభులు**
నలునిపైఁ **దమకంబును దెలియఁ జూచి**
**తారు నవ్వేళ నలరూపధారు లైరి**

కదిసి = వచ్చి, పరిపాటిన్ = క్రమముగా, మణిమంచకములమీద = రత్నమయ తల్పములమీద, రాకుమారకులై యున్న = రాజకుమారులుగా యున్న, నాకవిభులు = దిక్పాలకులు, నలునిపైన్, తమకంబును = దమయంతి మోహమును, తెలియన్ చూచి = స్పష్టమగుట చూచి, తారును = వారును, ఆ వేళ = ఆ సమయమున, నలరూపధరులు, ఐరి = అయ్యిరి. తా. స్వయంవరకునకు వచ్చి వరుసగా రత్నమయతల్పములమీద రాజకుమారులుగా కూర్చున్న దిక్పాలకులు నలునిపై దమయంతి మోహము స్పష్టమగుటచే వారును ఆ సమయమున నలరూపధారులైరి.

**136 ఉ. ఈ సకలంబునంగల మహీపతి వర్గమునున్న నుండనీ**
**యా సభ యొప్పె నప్డు నిషధాధిపుచేతఁ జతుర్దిగీశిచే**
**వాసవలోక దివ్య వనవాటిక సర్వ నగాఢ్య యయ్యు న**
**ద్భాసిత లక్ష్మి నొందునకదా యలకల్పక పంచకంబుచేన్**

ఈ సకలంబునంగల = ఈ సమస్తమైనటువంటి, మహీపతి వర్గము = రాజ సమూహము, ఉన్నన్ ఉండనీ, ఆ సభ, అప్డు, నిషధాధిపుచేతన్ = నలునిచేత, చతుర్దిగీశచే = నల్వురు దిక్పాలురచేతను, ఒప్పెన్ = ప్రకాశించెను. వాసవలోక దివ్య వన వాటిక = స్వర్గలోకమందలి నందనోద్యానవనము, సర్వ నగాఢ్యమయ్యున్ = సమస్త వృక్షములతో కూడినదయ్యును, ఉద్భాసిత లక్ష్మిన్ = అధికమైన కాంతిని, అల కల్పక పంచకంబుచేన్ = ఆ అయిదింటి కల్పవృక్షములచేతనే, ఒందున్ కదా = పొందునుకదా (మందారము, పారిజాతము, సంతానము, కల్పవృక్షము, హరిచందనము – కల్పవృక్షములు)

తా. ఈ సమస్తమైనటువంటి రాజసమూహము ఉంటే ఉండనీ ఆ సభ అపుడు నలునిచేతను, నలుగురు దిక్పాలకులచేతను ప్రకాశించుచుండెను. స్వర్గలోకమందలి నందనోద్యానవనము అన్ని వృక్షములతో కూడినదయ్యును దాని ప్రసిద్ధికి కల్ప వృక్షములు అయిదే కారణముకదా!

**137 వ. ఇవ్విధంబున సుమేరు భూధరకూట సన్నిభంబులగు హాటక మంచకంబులమీఁదఁ గర్కోటక వాసుకి ప్రభృతులగు పాతాళ భువనవాసులును మేధాతిథి ప్రధానులగు వసుధాలోక వాస్తవ్యులును బాకశాసన పరేత రాజ ముఖ్యులగు త్రివిష్టప నిలయులును సుఖోపవిష్టులై యుండుటనుఁ గనుంగొని సంతుష్టాంతరంగుఁడై భీమభూపతి తన డెందంబులోన నీయున్న యందఱు బృందారక సంకీర్తనీయ చరిత్రులు వీరి కులశీలవృత్త విభవంబు లెఱింగి వర్ణించి దమయంతికిఁ జూపి చెప్పం ద్రైలోక్యజనని నిత్యప్రగల్భ వాచాల భగవతిదేవి దక్కం దక్కినవారు నేరరని విచారించి యమ్మహాదేవి నిట్లని ప్రస్తుతించె**

తా. ఈ విధంగా మేరుపర్వత శిఖరములతో సమానమైన రత్న తల్పములపై కర్కోటకుడు, వాసుకి మొదలైన పాతాల లోక వాసులును, మేధాతిథి మొదలగు భూమండల నివాసులును, ఇంద్రుడు, యముడు మొదలైన రాజముఖ్యులైన స్వర్గలోక వాసులును సుఖాసీనులైయుండుటను చూచి భీమరాజు సంతోషించినవాడై తన మనసులో ఈ విచ్చేసిన దేవతల శుభ చరిత్రలను, వీరి కుల శీల చరిత్ర వైభవములను తెలిసి వర్ణించి దమయంతికి వారిని చూపి చెప్పగల ముల్లోకజనని, నిత్యము సమర్థమైన వాక్కులుకలదగు సరస్వతీదేవి తక్క మిగిలినవారు సమర్థులుకారని ఆలోచించి ఆ మహాదేవిని ఇట్లు స్తుతించెను

**138 దండకము. జయజయ జనయిత్రి! కల్యాణ సంధాత్రి! గాంధర్వ విద్యా కళా కణ్ఠనాళాం త్రివేదీవళీం సార సాహిత్య సౌహిత్య నిర్వర్తిత ప్రోల్లసదృక్తరఙ్గా మనేకాభిచారక్రియా హోమధూమావళీ మేచకాథర్వణామ్నాయరోమావళీం కల్పశిక్షాక్షరాకల్పసాక్షాచ్చరిత్రాం నిరుక్తప్రియోక్తిం భుజద్వంద్వతామశ్నువానేన సంశోభితాం ఛందసా జాతి వృత్త ప్రభేద ప్రభిన్నేన విద్యామయీం త్వాం భజే. భగవతి గుణదీర్ఘ భావోద్భవాం సంతతిం సందధానం మహాశబ్ద నిష్పాదక వ్యాక్రియా శాస్త్ర కాంఞ్చీకలాపం కటీమండలే బిభ్రతీం జ్యోతిషాహార దణ్డేన తారోదయస్ఫూర్తి విద్యోతమానేన విభ్రాజితా మాత్మ పక్షానురాగాన్వితాభ్యా ముభాభ్యాంచ పూర్వోత్తరాభ్యాం మహాదర్శనాభ్యాం ప్రతిష్ఠాపితోష్ఠప్రవాళాం పరబ్రహ్మకర్మార్థవేద ప్రబేధాద్ద్విధాయ ద్విధా స్వం శరీరం ప్రతిష్ఠాం పరాంప్రాప్తయా చారుమీమాంసయా మాంసలేనోరుయుగ్మేన సమ్యక్పరాచ్ఛాదనం లాలయంతీం ముహుః పత్త్రదానే గుణాన్వీత పూగా సకృత్ఖణ్డన ప్రౌఢిమాఢౌకమానేన దన్తాత్మనా తర్కశాస్త్రేణ కామప్యభిఖ్యాం ముఖే ఖ్యాపయన్తీం ధ్రువం దేవి వన్దేతమాం త్వామహం. ద్రుహిణగృహిణి మత్స్యపద్మాది సంలక్షితం పాణిపద్మం త్వదీయం పురాణమ్, శిరస్తావకం నిర్మలం ధర్మశాస్త్రమ్, దలాభ్యాం భ్రువావోం క్రియామన్త్రరాజస్య, త్వద్భిన్దునా చిత్రకం ఫాలభాగే తదర్ధేందునా తే విరించి ర్విపంచీకలక్వాణచాపం ప్రణిన్యే స్వయమే. భవతు మమ శుభం భారతి! త్వత్ప్రసాదాదసాధారణా త్వత్కృపాధారభూతం ప్రభూతమ్. నమ స్సోమసిద్ధాన్త కాన్తాననాయై నమశ్శూన్య వాదాత్మ మధ్యాన్వితాయై సువిజ్ఞాన సామస్త్య హృత్పఙ్కజాయై నమస్తేస్తు సాకారతా సిద్ధి భూమ్నే నమస్తేస్తు కైవల్యకల్యాణ సీమ్నే నమ స్సర్వ గీర్వాణ చూడామణిశ్రేణి శోణప్రభాజాల బాలాతప స్మేర పాదామ్బుజాయై, నమస్తే శరణ్యై నమస్తే వరేణ్యై, నమ శ్శర్మదాయై నమ శ్శాశ్వతాయై నమో విశ్రుతాయై నమ శ్శారదాయై నమస్తే నమస్తే నమః**

తా. మంగళములను కలిగించునట్టి ఓ తల్లీ! నీకు జయమగుగాక! సంగీత మనెడి కంఠము కలిగినట్టియు, మూడు వేదములు మూడు వళులుగ కలిగినట్టియు, శ్రేష్ఠమైన శబ్దార్థముల కూడికయొక్క తృప్తిచే సమకూర్పబడి మిక్కిలి ప్రకాశించు తరంగములవంటి చూపులు కలట్టియు, పలు విధములైన హింసారూపకములగు క్రియల నిమిత్తమై ఆహుతి చేయుట వలన కలిగిన పొగలపంక్తిచేత నల్లనైన అధర్వవేదమనెడి నూగారు కలిగినట్టియు, కల్పసూత్రములును, శిక్షాగ్రంథమును శాశ్వతమైన అలంకారములుగను, స్వీయచరిత్రముగను గలట్టియు, వేదార్థమును నిర్వచనము చేసెడి నిరుక్తి గ్రంథమనెడి సరసాలాపములు గలట్టియు, బాహుద్వయభావమును పొందినట్టియు, జాతులు, వృత్తములు అనబడు ప్రభేద భేదముచే భేదము పొందియున్న ఛందశ్శాస్త్రముచే ప్రకాశించుచున్నట్టియు విద్యాస్వరూపురాలవగు నిన్ను సేవించుచున్నాను. ఓ భగవంతురాలా! గుణములు, దీర్ఘములు, భావ ప్రత్యయములు మొదలగువానివలన కలిగిన సమూహమును ధరించుచున్నట్టియు, గొప్పదైన శబ్దజాలమును పుట్టించుచున్న వ్యాకరణశాస్త్రమనెడి మొలత్రాటిని నడుముకు ధరించు చున్నట్టియు, మధ్యమణియొక్క కాంత్యతిశయముచే ప్రకాశించుచున్నదియు, జ్యోతిశ్శాస్త్రమనెడి ముత్యాలహారముచే వెలుగొందుచున్నట్టియు, తన పక్షమందు అభినివేశముతో కూడికొన్నట్టియు, తమయొక్క పార్శ్వములందు ఎఱ్ఱదనముచే కూడికొన్న రెండైన పూర్వపక్ష ఉత్తరపక్ష మనెడి మహాశాస్త్రములచేత స్థాపనచేయబడుచున్న చిగురువంటి పెదవులు గలిగినట్టియు, పరబ్రహ్మమును మాత్రమే చెప్పుచున్నట్టియు, కర్మకలాపమే ప్రయోజనముగా కలట్టియు, వేదములయొక్క భేదమువలన స్వకీయమైన దేహమును రెండువిధములుగా చేసి (జ్ఞానకాండ – కర్మకాండ, పూర్వమీమాంస – ఉత్తరమీమాంస) గొప్పదగు స్థితిని పొంది ఒప్పుచున్న

మీమాంసయనెడి పుష్టికల రెండు తొడలచేతను, బాగుగా పరులను తిరస్కరించుటను అంగీకరించు చున్నట్టియు, మాటిమాటికి ప్రతిజ్ఞాన పత్రము యొక్క ఖండించుటయందును, పండితులు సమూహమును అనేక పర్యాయములు ఖండించుటయందలి నైపుణ్యముచే ప్రవర్తించుచున్న దంతరూపమయిన తర్కశాస్త్రముచే అనిర్వాచ్యమైన కాంతిని ముఖమందు ప్రకటనచేయుచున్నట్టియు నిన్ను ఏకాగ్రతతో సమస్కరించుచున్నాను.

బ్రహ్మకు భార్యవగు ఓ సరస్వతీ! మత్స్య, పద్మ పురాణములు మొదలగువానిచే కూడికొనియున్న హస్తపద్మములు కలట్టియు, దోషరహితమైన నీ శిరస్సు ఓంకారమంత్రరాజముయొక్క దళములచేత కనుబొమలును, ఆ ఓంకారములోనున్న బిందువుచేత ఫాలభాగమందలి తిలకమును, ఆ ఓంకారములోని అర్ధచంద్రరేఖచేత వీణియవలె అవ్యక్త మధుర ధ్వనులను చేయు చాపముగను బ్రహ్మ నీకు స్వయముగా నిర్మించెను. గొప్పదైన నీ యనుగ్రహమువలన, మంచి దయకు కారణ భూతమైన గొప్ప మంగళము అగుగాక. చంద్రసిద్ధాంతమనెడి మనోహరమైన ముఖముగల నీకు నమస్కారము, నాస్తిక వాదమే రూపముగాగల నడుముతో కూడిన నీకు నమస్కారము. నిరాకార జ్ఞానముయొక్క సంపూర్ణతయే హృదయపద్మముగా గల నీకు నమస్కారము. సౌత్రాంతికమతముయొక్క ఫలమునకు స్థానభూతమైన నీకు నమస్కారము. మోక్షమనెడి కల్యాణమునకు నిలయమైన నీకు నమస్కారము. సమస్తమైన దేవతలయొక్క శిరోరత్నముల పంక్తులచే ఎఱ్ఱనైన కాంతిసమూహమనెడి సూర్యకాంతిచే వికసించిన పాదపద్మములుగల నీకు నమస్కారము. రక్షకురాలవగు నీకు నమస్కారము. శ్రేష్ఠురాలవగు నీకు నమస్కారము. సుఖమునిచ్చు నీకు నమస్కారము. స్థిరముగానుండు నీకు నమస్కారము. ప్రసిద్ధురాలవగు నీకు నమస్కారము. శారదవైన నీకు నమస్కారము.

**139 వ. అని ప్రస్తుతించిన**

**140 మ. జగతీనాథుని ముందటన్నిలిచె సాక్షాత్కారముం బొంది యా**
**జగదేక స్తవనీయ శారద శరచ్చంద్రాతపాలోకము**
**న్నగవుం దేటయు దివ్యదేహరుచియున్ సమ్మేళనంబొంది చె**
**ల్వగుచుండన్ గరుణా పరాయణత నయ్యాస్థాన మధ్యంబునన్**

ఆ జగదేక స్తవనీయ శారద = ఆ లోకములన్నిటిచేతను నుతింపబడు సరస్వతి, శరత్ చంద్రాతప = శరత్కాలమందలి వెన్నెలవంటి, ఆలోకమున్ = కాంతిగల, నగవుం తేటయున్ = తేటయైన నవ్వును, దివ్య దేహ రుచియున్ = దివ్యమైన దేహ కాంతియును, సమ్మేళనంబొంది = మిశ్రమయి, చెల్వగుచుండన్ = అందములొలుకుచుండగా, కరుణాపరాయణతన్ = దయాస్వభావముకలదగుటచే, ఆ యాస్థాన మధ్యంబునన్, జగతీనాథుని = భీమరాజుయొక్క, ముందటన్, సాక్షాత్కారమున్ పొంది, నిలిచెన్

తా. ఆ లోకములన్నిటిచేతను నుతింపబడు శారద శరత్కాలమందలి వెన్నెలవంటి కాంతిగల తేటయైన నవ్వును, దివ్యమైన దేహకాంతియును మిశ్రమయి అందములొలుకుచుండగా దయాస్వభావముకలదగుటచే ఆ యాస్థాన మధ్యమున భీమరాజునకు యెదుట సాక్షాత్కారమునుపొంది నిలిచెను.

**141 శా. లాటీచిత్త సరోమరాళ కుకురీ లావణ్య లోలాత్మ క**
**ర్ణాటీ నృత్త కళావిలోకన సమారంభ ప్రియంభావుకా**
**భోటీ నేత్ర చకోర చంద్ర మగధీ పుష్పాస్త్ర చోళీ కుచా**
**ఘాట స్థాపిత మన్మథాంక కుహళీ గాఢాంకపాళీప్రియా**

లాటీ = లాటదేశ స్త్రీల, చిత్త = మనస్సనెడి, సరోమరాళ = సరస్సునకు హంసవంటివాడా!, కుకురీ = కుకురదేశ స్త్రీల, లావణ్య = సౌందర్యమందు, లోలాత్మ = ఆసక్తమగు మనస్సు కలవాడా!, కర్ణాటీ = కర్ణాట స్త్రీల, నృత్త కళా = నాట్య నైపుణ్యమును, విలోకన = చూచుటయందు, సమారంభ = తొందరపాటును, ప్రియంభావుకా = ఇష్టపడువాడా!, భోటీ = భోటదేశ స్త్రీల, నేత్ర = కన్నులనెడి, చకోర = చక్రవాకపక్షులకు, చంద్ర = చంద్రునివంటివాడా! మగధీ = మగధదేశ స్త్రీలకు, పుష్పాస్త్ర = మన్మథునివంటివాడా!, చోళీ = చోళదేశ స్త్రీల, కుచ = స్తనములయొక్క, ఆఘాట = ప్రదేశమునందు, స్థాపిత = ఉంచబడిన, మన్మథాంక = మదనచిహ్నములుకలవాడా!, కుహళీ = కుహళీదేశ స్త్రీల, గాఢ = బిగువయిన, అంకపాళి = కౌగిలింతయందు, ప్రియా = ఇష్టముకలవాడా!

తా. లాటదేశ స్త్రీల మనస్సనెడి సరస్సునకు హంసవంటివాడా!, కుకురదేశ స్త్రీల సౌందర్యమందు ఆసక్తమగు మనస్సు కలవాడా!, కర్ణాట స్త్రీల నాట్యనైపుణ్యమును చూచుటయందు తొందరపాటును, ఇష్టమును కలవాడా!, భోటదేశ స్త్రీల కన్నులనెడి చక్రవాకపక్షులకు చంద్రునివంటివాడా!, మగధదేశ స్త్రీలకు మన్మథునివంటివాడా!, చోళదేశ స్త్రీల బిగువయిన కౌగలింతకు ఇష్టపడువాడా!

**142 క. మందార మంజరీ మక**
**రంద సుధా మాధురీ ధురాధుర్య వచ**

**స్సందర్భ రూప రేఖా**
**కందర్పా! పాండ్యరాజ గజ పంచాస్యా!**

మందార = మందారపుష్పముల, మంజరీ = గుత్తులయొక్క, మకరంద సుధా = అమృతమువంటి మకరందపు, మాధురీ = తియ్యదనముయొక్క, ధురాధుర్య = బరువును మోయుచున్న, వచస్సందర్భ = వాక్సందర్భముకలవాడా!, రూపరేఖా కందర్పా = రూపురేఖలచే మన్మథునివంటివాడా!, పాండ్యరాజ = పాండ్యరాజనెడి, గజ = ఏనుగునకు, పంచాస్య = సింహమువంటివాడా!

తా. మందారపుష్పముల గుత్తులయొక్క అమృతమువంటి మకరందపు మాధుర్యముకల వాక్సందర్భముకలవాడా!, రూపు రేఖలచే మన్మథునివంటివాడా!, పాండ్యరాజనెడి ఏనుగునకు సింహమువంటివాడా!

**143** **మాలిని. హరి చరణ సరోజ ధ్యాననిష్ఠాగరిష్ఠా!**
**ధరణి భర ధిధీర్షాధః కృతాహార్య వీర్యా!**
**తరుణ కమలనేత్రా! తల్లమాంబా సుపుత్రా!**
**విరహిత మదశంకా! వీరనారాయణాంకా!**

హరి = విష్ణుమూర్తియొక్క, చరణ సరోజ = పాదపద్మములను, ధ్యాన = స్మరించుటయును, నిష్ఠా = నియమముచే, గరిష్ఠా = శ్రేష్ఠుడైనవాడా!, ధరణి = భూమియొక్క, భర = బరువును, ధిధీర్షా = భరింపతలంపుచే, అధఃకృత = క్రిందుగా చేయబడిన, అహార్యవీర్యా = మేరుపర్వతముకలవాడా!, తరుణ కమల నేత్రా = లేత తామరవంటి కన్నులుకలవాడా! తల్లమాంబా సుపుత్రా = తల్లమాంబాదేవి కుమారా!, విరహితమదశంకా = గర్వపు శంక లేనివాడా!, వీరనారాయణాంకా = వీరనారాయణ బిరుదముకలవాడా!

తా. విష్ణుమూర్తియొక్క పాదపద్మముల ధ్యాన నియమమునందు శ్రేష్ఠుడైనవాడా!, భూమి భారమును భరింప తలంపుచే క్రిందుచేయబడిన మేరుపర్వతముకలవాడా!, లేత తామరవంటి కన్నులుకలవాడా! తల్లమాంబాదేవి కుమారా! గర్వపు శంక లేనివాడా! వీరనారాయణ బిరుదముకలవాడా!

**గద్య**

**ఇది శ్రీమత్కమలనాభ పౌత్త్ర మారయామాత్య పుత్త్ర**
**సకల విద్యా సనాథ శ్రీనాథభట్ట ప్రణీతమయిన**
**శృంగార నైషధ కావ్యమునందు**
**చతుర్థాశ్వాసము**

**వ్యాఖ్యాతృ గద్యము**

**ఇది బుధజన విధేయుండును, బులుసు వంశ సంభూతుండును,**
**కీ.శే. శేషమ్మ, వెంకటరమణయ్య పుణ్యదంపతీ తనూజుండును,**
**గౌతమ గోత్రజుండునగు వేంకటసత్యనారాయణమూర్తి**
**ప్రణీతంబైన శృంగార నైషధ మహాకావ్యంబునందు**
**చతుర్థాశ్వాసమునకు టీక–తాత్పర్యములు**
**సంపూర్ణము**

శ్రీరస్తు

# శృంగార నైషధము

## పంచమాశ్వాసము

**శ్రీపాదాంభోరుహ సం**
**స్థాపిత మణిమకుట కటక ఝుళఝుళ నినదా**
**టోప వికంపిత విమత**
**క్ష్మాపాల కులాంతరంగ మామిడిసింగా!**

శ్రీ = శోభాయుక్తములైన, పాదాంభోరుహ = పాదపద్మములయందు, సంస్థాపిత = ఉంచబడిన, మణి మకుట = రత్న కిరీటములయొక్కయు, కటక = కంకణములయొక్కయు, ఝుళఝుళ, నినద = ధ్వనులయొక్క ఆటోప = అతిశయముచే, వికంపిత = వణకుచున్న, విమత క్ష్మాపాల = శత్రురాజుల, కుల = సమూహముయొక్క అంతరంగ = మనసులు కలవాడా! మామిడి సింగా!

తా. శోభాయుక్తములైన పాదపద్మములయందు ఉంచబడిన రత్న కిరీటములయొక్కయు, కంకణములయొక్కయు ఝుళఝుళ ధ్వనుల అతిశయముచే వణకుచున్న శత్రురాజుల మనసులు కలవాడా! మామిడి సింగా!

**2 వ. అవధరింపుము**

**3 తే. అట్లు సాక్షాత్కరించిన యఖిల జనని**
**భారతీదేవిఁ జూచి భూపాలకుండు**
**నమ్మహాస్థానమున నున్న యఖిల జనులుఁ**
**జేతు లెత్తి ప్రణామముల్ చేసి రర్థి**

అట్లు = ఆ రీతిగా, సాక్షాత్కరించిన, అఖిల జనని = సమస్తమునకు తల్లియైన, భారతీదేవిన్, చూచి, భూపాలకుండు = రాజు, ఆ మహాస్థానమునన్ = ఆ గొప్ప సభలో, ఉన్న, అఖిల జనులు = జనులందఱును, చేతులు ఎత్తి, అర్థిన్ = ప్రీతితో, ప్రణామముల్ = నమస్కారములు, చేసిరి

తా. ఆ రీతిగా సాక్షాత్కరించిన సమస్త లోకములకు తల్లియైన ఆ భారతీదేవిని చూచి రాజును, ఆ సభలోనున్న సమస్త జనులును నమస్కారములు చేసిరి.

**4 వ. అప్పుడు భోజరాజు తత్కాలవేద్యంబులగు శకున స్వరాదుల యానుకూల్యం బెఱింగి నిజతనూజ నమ్మాహాదేవికి నప్పగించువాఁడై యంతఃపుర పరిచారికా జనంబుల నియోగించిన**

తా. అప్పుడు భోజరాజు ఆ సమయమునకు తెలియదగిన శకునములు, ధ్వనుల యొక్క అనుకూలతను తెలుసుకొని, తన కుమార్తెను ఆ సరస్వతీదేవికి అప్పగించువాడై అంతఃపుర పరిచారికా జనంబులకు ఆజ్ఞాపించిన

**5 సీ. అఖిల దిగ్దేశ రాజాకర్షణ క్రియా**
**మహనీయతర సిద్ధ మంత్రవిద్య**
**యాకార రేఖా సముత్పత్తితానన్య**
**సాధారణాశ్చర్య జలధివేల**
**నేపథ్య హీరప్రభాపూర నిర్మల**
**వారి బింబిత నిజ స్వచ్ఛ కాంతి**

సంకల్ప భవదూత సదృశ కర్ణాకల్ప
కల్హార సౌరభాగత మదాళి
తే. బహువిరోధి మణిప్రభా పల్లవాగ్ర
మల్ల సంగ్రామ ఖురళికా మండలాయ
మాన నానా పరిష్కార మహితగాత్రి
మనుజపతి పుత్త్రి యాస్థానమునకు వచ్చె

అఖిల = సమస్తమైన, దిక్ = దిక్కులందున్న, దేశ = దేశములందున్న, రాజ = రాజులను, ఆకర్షణ = రప్పించుటయను, క్రియా = పనికి, మహనీయతర = మిక్కిలి శ్లాఘనీయమైన, సిద్ధ = కార్యసిద్ధిని పొందినట్టి, మంత్ర విద్య = మంత్రవిద్య యైనట్టియు, ఆకారరేఖా = నిజస్వరూపమువలన, సమభ్యుత్థిత = కలిగిన, అనన్య సాధారణ = ఇతరులకు సాధ్యముకాని, ఆశ్చర్య జలధి = అద్భుత సముద్రమునకు, వేల = తీరమైనట్టియు, నేపథ్య = అలంకారములుగా నుంచబడిన, హీర = వజ్రములయొక్క, ప్రభాపూర = కాంతి సమృద్ధియనెడి, నిర్మలవారి = స్వచ్ఛమైన జలమందు, బింబిత = ప్రతిఫలించుచున్న, నిజస్వచ్ఛకాంతి = తన స్వచ్ఛమైన దేహకాంతి కలిగినట్టియు, సంకల్ప భవ = మన్మథునియొక్క, దూత సదృశ = దూతతో సమానమైనట్టియు, కర్ణాకల్ప = కర్ణాలంకారముగా నుంచుకొనబడిన, కల్హార = పరిమళ కలువయొక్క, సౌరభ = సువాసనచే, ఆగత = వచ్చుచున్న, మదాళి = మదించిన తుమ్మెదలుగలట్టియు, బహు విరోధి = పలు విరుద్ధ వర్ణములుకల, మణిప్రభా = మణుల కాంతులయొక్క, పల్లవాగ్ర = అంకురములచే, మల్ల సంగ్రామ = మల్ల యుద్ధమునకు, ఖురళికా మండలాయమాన = గరిడీశాలలై యొప్పుచున్నట్టియు, నానా పరిష్కార = అనేక విధములైన అలంకారములచే, మహిత = ఒప్పుచున్న, గాత్రి = శరీరముకలట్టియు, మనుజపతి పుత్త్రి = దమయంతి, ఆస్థానమునకున్ = సభకు, వచ్చెను

తా. సమస్తమైన రాజసమూహమును రప్పించుటయను పనికి గొప్ప కార్యసిద్ధిని పొందిన మంత్రవిద్యయైనట్టియు, తన రూపమువలన కలిగిన, ఇతరులకు సాధ్యముకాని అద్భుత సముద్రమునకు తీరమైనట్టియు, అలంకారములైన వజ్రములయొక్క కాంతి అనే స్వచ్ఛజలమందు ప్రతిఫలించుచున్న దేహకాంతికలిగినట్టియు, మన్మథునియొక్క దూతతో సమానమైనట్టియు, కర్ణాలంకారములైన కలువల పరిమళముచే వచ్చుచున్న మదించిన తుమ్మెదలు కలట్టియు, పలు విరుద్ధ వర్ణములుకల మణుల కాంతుల అంకురములచే మల్లయుద్ధమునకు గరిడీశాలలై ఒప్పుచున్నట్టియు, పలు అలంకారములచే ఒప్పుచున్న శరీరముకలట్టియు దమయంతి సభకు వచ్చెను.

6 తే. అతివ పీతావదాతారుణాసితమణి
దీప్తి కల్పిత దేహోపదేహ యగుచు
సార గోరోచనా గంధసార ఘుసృణ
మృగమదాలేప పునరుక్తి మేలుకొలిపె

అతివ = దమయంతి, పీత = పచ్చని, అవదాత = తెల్లని, అరుణ = ఎఱ్ఱని, అసిత = నల్లనివియునగు, మణి = మణుల యొక్క, దీప్తి = కాంతులచే, కల్పిత = కల్పింపబడుచున్న, దేహోపదేహ = శరీరమునకు లేపనముకలదై, సార = ప్రశస్తమైన, గోరోచనా = గోరోచనముయొక్కయు, గంధసార = పచ్చకర్పూరముయొక్కయు, ఘుసృణ = కుంకుముయొక్కయు, మృగమద = కస్తూరియొక్కయు, ఆలేప = పూతయొక్క, పునరుక్తిని = తిరిగిపొందుటను, మేలుకొలిపె = తెలుపుచుండెను.

తా. దమయంతి దాల్చిన పలువిధములగు మణులయొక్క కాంతులచే కల్పింపబడుచున్న దేహమునకు లేపనముకలదై ప్రశస్తమైన గోరోచనము, పచ్చకర్పూరము, కుంకుమము, కస్తూరి మొదలగువాటి పూత పునరుక్తిని తెలుపుచుండెను.

7 సీ. కర్పూర కస్తూరికా ప్రవాహంబులు
ప్రవహింప లోచన ప్రాంగణములఁ
గించి ద్దిగంబరీ కృత రదద్యుతి పెంపు
పలుకుబోటికినైన భ్రాఁతి గాఁగ
భూషామణి వ్యాజమున నంగకంబుల
జనుల చూపులు వినిశ్చలత నిలువ
మహనీయ లావణ్య మధువు నెమ్మనముల
నాకంఠముగఁ గ్రోల నవనిభుజులు
తే. నలుఁ బ్రసూనచాపంబున గెలువలేని
యంగభవునకు శక్రబాణాసనంబు
బహు విభూషణ రత్న శోభా మిషమునఁ
దాను గల్పించు చంద మందంబు నొందె

లోచన = నేత్రములయొక్క, ప్రాంగణములన్ = ప్రదేశములందు, కర్పూర = తెల్లనికాంతులయొక్కయు, కస్తూరికా = నల్లని కాంతులయొక్కయు, ప్రవాహంబులు = ధారలు, ప్రవహింపన్ = ప్రవహించుచుండగా, కించిత్ = కొంచెము, దిగంబరీ కృత = స్పష్టమగుచున్న, రద ద్యుతి = దంతముల కాంతులయొక్క, పెంపు = అతిశయము, పలుకుబోటికినైనన్ = సరస్వతీ దేవికైనను, బ్రాతిగాగన్ = దుర్లభమగుచుండగా, అంగకంబులన్ = అవయవములయందు, జనుల చూపులు, భూషామణి వ్యాజమునన్ = ఆభరణములందలి రత్నముల నెపముచేత, వినిశ్చలతన్ = మిక్కిలి చలింపకుండగ, నిలువన్, అవనిభుజులు = రాజులు, నెమ్మనములన్ = నిండుమనస్సులతో, మహనీయ = కొనియాడదగిన, లావణ్య మధువున్ = సౌందర్యమనెడి అమృతమును, ఆకంఠముగ గ్రోలన్ = గొంతువరకు త్రాగుచుండగా, నలున్ , ప్రసూన చాపంబునన్ = పూవింటితో, గెలువలేని, అంగభవునకున్ = మన్మథునకు, తాను = దమయంతి, బహు = పలువిధములైన, విభూషణ = అలంకారము లందలి, రత్న = మణులయొక్క, శోభా మిషమునన్ = కాంతుల నెపముచే, శక్రబాణాసనంబున్ = ఇంద్రచాపమును, కల్పించు చందము = కల్పించుచున్న విధము, అందంబున్ ఒందెన్ = సౌందర్యమును పొందెను.

తా. నేత్రముల తెల్లని, నల్లని కాంతులు ప్రవహించుచుండగా, కొద్దిగా స్పష్టమగుచున్న దంతకాంతులు అతిశయము సరస్వతీదేవికినీ దుర్లభమగుచుండగా, దేహావయవములయందు జనుల చూపులు ఆభరణములందలి రత్నముల నెపముచే కదలకుండగ నిలిచిపోవగా, రాజులు నిండుమనసులతో స్తుతింపదగిన సౌందర్యామృతమును పీకలవరకు త్రాగుచుండగా నలుని పూవింటితో గెలువలేని మన్మథునకు దమయంతియొక్క పలువిధములైన ఆభరణములందలి మణులయొక్క కాంతుల నెపముతో ఇంద్రచాపమును కల్పించు విధము శోభలొసగెను.

**8 మహాస్రగ్ధర. చతురత్వం బొప్పఁగా నప్సరస లుభయ పార్శ్వంబులం బాడుచున్ రాఁ**
**జతురంత స్వైర యానస్థయయి తరుణి యాస్థానమున్ జొచ్చి వచ్చెన్**
**శతపత్రాక్షీ కరాబ్జో చ్చలిత ధవళ రుక్చామరాళీ మరాళీ**
**కృత లీలా లాస్య కేళీ కిసలయిత కలా ఖేలనంబొప్పు మీఱన్**

చతురత్వంబు = నేర్పరితనము, ఒప్పగాన్ = ప్రకాశించుచుండగా, అప్సరసలు, ఉభయ పార్శ్వంబులన్ = ఇరుప్రక్కలను, పాడుచున్, రాన్ = రాగా, చతురంత స్వైర యానస్థయయి = పల్లకీయందు విలాసముగా కూర్చున్నదై, శతపత్రాక్షీ = పద్మములవంటి కన్నులుగల స్త్రీలు, కరాబ్జ = హస్తపద్మములచే, ఉచ్చలిత = వీచబడుచున్న, ధవళ = తెల్లని, రుక్ = కాంతులుగల, చామరాళీ = వింజామరల పంక్తియనెడి, మరాళీ = ఆడుహంసలచే, కృత = చేయబడుచున్న, లీలా = విలాసార్థమైన, లాస్య కేళీ = నాట్యమునకు, కిసలయిత = అతిశయించుచున్న, కలా ఖేలనంబు = నాట్య విలాసములు, ఒప్పుమీఱన్ = ప్రకాశించుచుండగా, తరుణి = దమయంతి, ఆస్థానంబున్ = సభను, చొచ్చి వచ్చెన్ = ప్రవేశించెను

తా. నేర్పు ప్రకాశించుచుండగా అచ్చరలు ఇరుప్రక్కలను పాడుచుండగా, పల్లకీయందు విలాసముగా కూర్చున్నదై పద్మాక్షులు వింజామరలు వీచుచుండగా ఆడుహంసల విలాసార్థ నాట్యమును అతిశయించుచున్న నాట్యవిలాసములు ప్రకాశించుచుండగా దమయంతి సభను ప్రవేశించెను.

**9 సీ. దవ్వుదవ్వులఁ గన్ను తనివి వోవఁగఁ జూచి**
**పరమాద్భుతం బాత్మఁ బాదుకొల్పి**
**సకలాంగకంబులు జాదుకోఁ బులకించి**
**చే యొకించుక యెత్తి చిత్త మిడిసి**
**కదియ నాసాశిఖాగ్రమునఁ దర్జని మోపి**
**మూర్ధంబు కంపితంబుగ నొనర్చి**
**కడతెప్ప లొరయంగఁ గనుఁదమ్ము లర మోడ్చి**
**బొమదోయి యొక్కింత పొడవుసేసి**
**తే. లలన సౌందర్యరేఖా విలాసమునకు**
**నిచ్చ మెచ్చుని రా జొక్కఁడేని నరిది**
**యమ్మహాస్థానమున నున్న యఖిల వార్ధి**
**వలయితాశేష మేదినీశ్వరులయందు**

ఆ మహాస్థానమునన్ = ఆ గొప్ప సభలో, ఉన్న = ఉన్నట్టి, అఖిల = సమస్తమైన, వార్ధి = సముద్రములచే, వలయిత = చుట్టబడిన, అశేష = సమస్తమైన, మేదినీశ్వరులయందు = రాజులయందు, దవ్వుదవ్వులన్ = దూర దూరముగా, కన్ను, తనివి పోవగ చూచి = తృప్తిపడునట్లుగా చూచి, పరమాద్భుతంబు = ఎక్కువ ఆశ్చర్యమును, ఆత్మన్ = మనస్సునందు, పాదుకొల్పి = నిలుపుకొని, సకలాంగకంబులు = అన్ని అవయవములును, జాదుకోన్ = అధికముగా, పులకించి = గగుర్పొడువగా, చేయి ఒకించుక ఎత్తి, చిత్తము = మనస్సు, ఇడిసి = వికారముగా చేసుకొని, నాసాశిఖరాగ్రమునన్ = ముక్కు కొనయందు, తర్జని = చూపుడువ్రేలిని, కదియన్ = చేరువగా, మోపి = ఉంచి, మూర్ధంబున్ = శిరస్సును, కంపితంబుగ = కదలుచున్నదిగ, ఒనర్చి

= చేసి, కడ ఱెప్పలు = కంటి చివరి రెప్పలు, ఒరయంగన్ = రాపాడునట్లుగా, కన్నులు అరమోడ్చి = కన్నులు సగము మూసి, బొమదోయి = రెండు కనుబొమలును, ఒక్కింత = కొంచెము, పొడవు చేసి = నిగిడించి, లలన = దమయంతియొక్క, సౌందర్యరేఖా విలాసమునకు = సౌందర్యాతిశయమునకు, ఇచ్చన్ = కోర్కిచే, మెచ్చని రాజు, ఒక్కడేని, అరిది = లేదు.

తా. ఆ స్వయంవర సభలో ఉన్న చతుస్సముద్ర పర్యంత రాజులయందు కొంచెము దూరముగా కనులు తృప్తి పడునట్లుగా చూచి అధిక ఆశ్చర్యమును మనసున నిలుపుకొని సమస్త అవయవములు పులకించగా చేయి ఎత్తి మనసు వికారముగా చేసుకొని నాసాగ్రమున వ్రేలు నుంచుకొని, శిరస్సును కంపించుచు, కంటికడరెప్పలు రాపాడునట్లుగా కనులు సగము మూసి, రెండు కనుబొమలను కొంచెము నిగిడించి దమయంతియొక్క సౌందర్యాతిశయమునకు కోరి మెచ్చని రాజు యొక్కడైనను లేదు.

**10 వ. ఇట్లు రాజులు పరమాశ్చర్యంబు నొందుచు నంతర్గతంబున**

తా. ఈ విధముగా రాజులు గొప్ప ఆశ్చర్యమును పొందుచు తమలో

**11 తే. తరుణి వదనంబె సాక్షా త్సుథాకరుండు**
**లలి నభంబు శశాంకుండు లాక్షణికుఁడు**
**ముఖ్యమగు కామచాపంబు ముదిత బొమలు**
**పువ్వు గుణమాత్రవృత్తి సద్బుద్ధిఁ దలఁప**

తరుణి వదనంబె = దమయంతి ముఖమే, సాక్షాత్తు = ప్రత్యక్షమైన, సుథాకరుండు = చంద్రబింబము, నభంబు = ఆకాశమందున్న, శశాంకుడు = చంద్రుడు, లలిన్ = మిక్కిలి, లాక్షణికుడు = కళంకముతో కూడుకొన్నవాడు, ముదిత బొమలు = దమయంతి కనుబొమలు, ముఖ్యమగు = ప్రధానమైన, కామచాపంబు = మన్మథుని విల్లు, పువ్వు = మన్మథుని చాపమైన పుష్పము, సద్బుద్ధిన్ = మంచిబుద్ధితో, తలపన్ = ఆలోచింపగా, గుణమాత్ర = కనబొమలకు వక్రత్వ, మోహకత్వములు రెండును కలవు, పూవునకు మోహకత్వ మొక్కటే కలిగి, వృత్తి = వర్తించుచున్నది.(అలంకారము –అతిశయోక్తి)

తా. దమయంతి ముఖమే సాక్షాత్తు చంద్రబింబము. ఆకాశమందున్న చంద్రుడు కళంకముతో కూడుకొనియున్నవాడు. దమయంతి కనుబొమలు మన్మథునకు ప్రధానమైన విల్లు, మన్మథుని చాపమైన పువ్వును చక్కగా ఆలోచించిన కనుబొమలకు వక్రత్వ, మోహకత్వములు రెండును కలవు, పూవునకు మోహకత్వ మొక్కటే కలిగి వర్తించుచున్నది.

**12 చ. మదువక ముష్టియోగ్యమగు మధ్యములో నెలవంకయైన య**
**ప్పడఁతుక భ్రూలతా ధనువు పట్టి మనోభవుఁ డింతనుండియున్**
**విడుచున కాని మానఁడిది నిక్కము షట్పద కీటజుష్ట మై**
**యుడుగక కమ్మధూళి నుసి యొల్కుచునున్న పురాణచాపమున్**

మనోభవుడు = మన్మథుడు, ఇంతనుండియున్ = ఇకమీద, మదువక = ఎక్కుదింపక, ముష్టియోగ్యమగు = పిడికిలిచే పట్టుటకు దగినదగు, మధ్యములోన్ = మధ్యభాగమునందు, నెలవంకయైన = వంకరగీత కలిగినట్టి, ఆ పడతుక = ఆ దమయంతియొక్క, భ్రూలతా ధనువు = కనుబొమలనెడి వింటిని, పట్టి = పట్టుకొని, షట్పదజుష్టమై = తుమ్మెదలచే ఎంగిలిచేయబడిన, కమ్మధూళి నుసి = పుష్పపరాగమనెడి బూడిదను, ఒల్కుచున్ = ఒలకపోయుచు, ఉన్న = ఉన్నట్టి, పురాణ చాపమున్ = ప్రాత వింటిని, విడుచున కాని = విడిచిపెట్టునేకాని, మానడు, ఇదినిక్కము = ఇది సత్యము. (అలంకారము – అతిశయోక్తి)

తా. మన్మథుడు ఇకమీద చక్కగా పిడికిలిచే పట్టుకోడానికి తగిన మధ్యభాగమునందు వంకరగీతకలిగినట్టి ఆ దమయంతియొక్క కనుబొమలనెడి వింటిని పట్టుకొని తుమ్మెదలచే ఎంగిలిచేయబడిన పుష్పపరాగమనెడి బూడిదను ఒలకపోయుచున్నట్టి ప్రాతవింటిని విడిచిపెట్టునే కాని మానడు. ఇది నిజము

**13 తే. మగువ తాటంక యుగ్మంబు మన్మథునకు**
**లక్ష్య యుగ్మంబు గాఁబోలు లలిఁ దలంపఁ**
**గడఁగి సవ్యాపసవ్య మార్గణము లేయ**
**నైన రంధ్రంబుగాదె తదంతరంబు**

మగువ తాటంకయుగ్మంబు = దమయంతి కర్ణభూషణములు, మన్మథునకు, లక్ష్యయుగ్మంబు కాబోలు = లక్ష్యముగా చేయబడిన గుండ్రటి రేఖయై యుండవచ్చును, లలిన్ = మిక్కిలి, తలంపన్ = ఆలోచింపగా, తదంతరంబు = ఆ కర్ణభూషణపు రంధ్రము కడగి = ప్రయత్నించి, సవ్యాపసవ్య మార్గణములు = కుడి, ఎడమ చేతుల బాణములు, ఏయన్ = వేయగా, ఐన రంధ్రంబు = అయిన రంధ్రమేకదా! (అలంకారము – రూపక ఉత్ప్రేక్ష)

తా. దమయంతి కర్ణభూషణములు మన్మథునకు లక్ష్యముగా చేయబడిన గుండ్రటిరేఖయై యుండవచ్చును. బాగా అలోచింపగా ఆ కర్ణభూషణపు రంధ్రము ప్రయత్నించి కుడి, ఎడమ చేతుల బాణములు వేయగా ఏర్పడిన రంధ్రమేకదా!

**14 క. రతి పంచబాణ జాయా**
**పతి కేళీసౌధశిఖర పర్యంత సమం**

**చిత కాంచన కలశము లీ**
**శతపత్ర దళాయతాక్షి చారుస్తనముల్**

ఈ శతపత్రదళాయతాక్షి = ఈ పద్మపత్రములవంటి కన్నులుగల దమయంతి, చారు స్తనముల్ = సుందరములగు స్తనములు, రతి పంచబాణ = రతి మన్మథులనెడి, జాయాపతి = దంపతులయొక్క, కేళీ = క్రీడార్థమైన, సౌధ = మేడయొక్క, శిఖర పర్యంత = శిఖర ప్రాంతములందు, సమంచిత = ఒప్పుచున్న, కాంచన కలశములు = బంగారు కుండలు

తా. ఈ దమయంతియొక్క సుందరములగు స్తనములు రతీమన్మథులనెడి దంపతులయొక్క కేళీగృహ శిఖరమునందలి బంగారు కలశములవలె ప్రకాశించుచున్నవి. (అలంకారము - రూపకము)

15 **క. ఈ సుదతి శిరీష కుసుమ**
**కేసర సుకుమార దీనిఁ గృతమతి నెమ్మెఁ**
**జేసెనొకో నలువ కుశా**
**ధ్యాస కఠోరంబులైన హస్తాబ్జములన్**

ఈ సుదతి = ఈ దమయంతి, శిరీష కుసుమ = దిరిసెన పూవుయొక్క, కేసర = కింజల్కములవలె, సుకుమార = మృదువైనది. దీనిన్ = దీనిని, నలువ = బ్రహ్మ, కుశాధ్యాస కఠోరంబులైన = దర్భలసంబంధముచే కఠోరములైన, హస్త పద్మములన్ = పద్మములవంటి చేతులచేత, కృతమతిన్ = నిపుణత్వముతో, ఎమ్మెన్ = ఏ విధముగా, చేసెనొకో = చేశాడోకదా!

తా. ఈ దమయంతి దిరిసెన పూవు కింజల్కములవలె కోమలమైనది. ఈ దమయంతిని బ్రహ్మ దర్భలసంబంధముచే కఠినమైన చేతులతో నేర్పుకల బుద్ధితో ఏవిధముగా చేశాడోకదా!

16 **క. చనుఁగవ ఘనమో జఘనము**
**ఘనమోయని నడిమి చక్కి గమిచి విధి గరం**
**బునఁ దూఁచె దీనిఁ గాకి**
**ట్లనువుపడునె వళులపేర నంగుళి రేఖల్**

విధి = బ్రహ్మ, చనుగవ = స్తనద్వయము, ఘనమో = పెద్దవియో, జఘనము = పిఱుదులు, ఘనమో = పెద్దవియో, అని, నడిమిచక్కిన్ = మధ్యభాగమునందు, దీనిన్ = ఈ దమయంతిని, కరంబునన్ = చేతితో, కమిచి = గట్టిగా పట్టుకొని, తూచెన్ = తూచియుండవచ్చును, కాక = అట్టుకానిచో, వళులపేర, అంగుళిరేఖల్ = వేలిముద్రలు, అనువుపడునె = ఏర్పడునా? (అలంకారము - అతిశయోక్తి)

తా. బ్రహ్మ స్తనములు ఘనమో జఘనము ఘనయో తెలుసుకోవాలని నడుముభాగమున ఈ దమయంతిని చేతితో గట్టిగాపట్టుకొని తూచియుండవచ్చును. అలాకానిచో వళులు అని వేలిముద్రలు ఎలా వస్తాయి?

17 **వ. అని ప్రస్తుతించుచుండ ఘంటాపథంబున నేఁగుదెంచి యమ్మచ్చెకంటి తండ్రిపంపునఁ జతురంత యానంబు డిగ్గి భారతీదేవికి ప్రణామంబు చేసిన**

తా. అని రాజులు నుతించుచుండగా రాజమార్గమున వచ్చి ఆ దమయంతి తండ్రి ఆజ్ఞతో పల్లకీ దిగి సరస్వతికి సమస్కారము చేసిన

18 **క. ఆశాస్యములైన యనే**
**కాశీర్వాదంబు లొసఁగి యఖిలేశ్వరి లో**
**కేశ కుటుంబిని శారద**
**యా శశిబింబాస్య మౌళి నక్షత లిడియెన్**

అఖిలేశ్వరి = సమస్తమునకు అధిపతియును, లోకేశ కుటుంబిని = బ్రహ్మ భార్యయునైన, శారద = సరస్వతీదేవి, ఆశాస్యములైన = కోరదగినవియైన, అనేక, ఆశీర్వాదంబులు, ఒసగి = ఇచ్చి, ఆ శశిబింబాస్య = ఆ దమయంతియొక్క, మౌళిన్ = శిరస్సునందు, అక్షతలు, ఇడియెన్ = ఉంచెను.

తా. సమస్తమునకు అధిపతియును, బ్రహ్మదేవుని భార్యమునైన సరస్వతీదేవి కోరదగినవియైన అనేక ఆశీర్వాదములను ఇచ్చి ఆ దమయంతియొక్క శిరస్సునందు అక్షతలనుంచెను.

19 **వ. ఇట్లు దీవించి చతురంతయానం బెక్క ననుజ్ఞ ప్రసాదించి**

20 **తే. అవనిపతికన్య చతురంతయానమునకు**
**దక్షిణపు దిక్కునందుండి దయ దలిర్పఁ**
**బలికె సనకాది యోగీంద్ర భావ్యమాన**
**చరణపంకజయైన యా సరసిజాక్షి**

సనకాది = సనకుడు మొదలుగాగల, యోగీంద్ర = యోగీశ్వరులచే, భావ్యమాన = నుతింపబడుచున్న, చరణపంకజయైన =

పాదపద్మములుకలదైన, ఆ సరసిజాక్షి = ఆ సరస్వతి, అవనిపతి కన్య = రాజకుమార్తె దమయంతి, చతురంతయానమునకు = పల్లకీకి, దక్షిణపు దిక్కునందుండి = కుడిప్రక్కనయుండి, దయ దలిర్పన్ = కరుణ ఒప్పునట్లుగా, పలికెన్

తా. సనకుడు మొదలుగాగల యోగీశ్వరులచే నుతింపబడు పాదపద్మములుకలదైన సరస్వతీదేవి ఆ రాజకుమార్తె దమయంతి పల్లకీకి కుడిప్రక్కనయుండి దయతో పలికెను.

**21 ఉ. తొయ్యలి వీరె వేలుపులు తూర్పున ముప్పది మూఁడుకోటు లీ**
**యయ్యల వేఱువేఱఁ గొనియాడఁగఁ బట్టు సహస్రవర్షముల్**
**నెయ్య మెలర్ప నిందొకరినిన్ వరియింపఁ దలంచితేని నా**
**దయ్యము నెత్తికోలు తుది దాఁకుట గాదె సరోజలోచనా!**

తొయ్యలి = దమయంతీ! వీరె, వేలుపులు = దేవతలు, తూర్పున = తూర్పుదిక్కున ఉండెడి, ముప్పది మూడు కోటులు, ఈ అయ్యలన్ = ఈ దేవతలను, వేఱువేఱన్, కొనియాడగన్, సహస్రవర్షముల్ = వేయి సంవత్సరములు, పట్టున్, సరోజలోచనా = పద్మములవంటి కన్నులుకలదానా!, నెయ్యము ఎలర్పన్ = స్నేహము ఒప్పునట్లుగా, ఇందు ఒకరిన్, వరియింప తలంచితేని, నా దయ్యము నెత్తికోలు = ఆ దైవము ప్రయత్నము, తుది తాకుటగాదె = సమాప్తియగుటయేకదా!

తా. దమయంతీ! వీరె దేవతలు, తూర్పు దిక్కున యుండెడి ముప్పది మూడుకోటులు. ఈ దేవతలను వేరువేరుగా స్తుతించుటకు వేయిసంవత్సరముల కాలము పట్టును. కావున సరోజలోచనా! స్నేహభావముతో వీరిలో ఒకరిని వరింప తలంచినట్లయితే ఆ దైవము ప్రయత్నము పూర్తియగుటయేకదా!

**22 క. సంతాన వాటికలునుం**
**జింతామణి వేదికలును సిద్ధరసధునీ**
**సంతానంబులు వీరికిఁ**
**గాంతా విశ్రాంతి కౌతుక స్థానంబుల్**

సంతాన వాటికలునున్ = కల్పవృక్ష వనములును, చింతామణి వేదికలును, సిద్ధరసధునీ = మనోరధము లీడేర్చు రసప్రవాహముల, సంతానంబులు = సమూహములు, కాంతా = ఓ దమయంతీ!, వీరికిన్, విశ్రాంతి కౌతుక స్థానంబుల్ = విశ్రాంతికి క్రీడాస్థలములైయున్నవి.

తా. ఓ దమయంతీ! కల్పవృక్ష వనములును, చింతామణి వేదికలును, మనోరథములీడేర్చు రసప్రవాహముల సమూహములును వీరికి విశ్రాంతి కౌతుక స్థానములు.

**23 క. అనిమిషత నిన్నుఁ జూడఁగ**
**నినుమడి యగునట్టు లొకని కీ వేల్పులలో**
**విను మమృతాస్వాదనమును**
**నినుమడి యగుఁగాక యధర మీ వొసఁగంగన్**

ఈ వేల్పులలోన్ = ఈ దేవతలలో, ఒకనికి, నిన్నున్, చూడగన్, అనిమిషత = రెప్పవేయకుండుట, ఇనుమడి యగున్ = రెట్టింపగును, అట్టులు = ఆ రీతిగానే, అధరము = అధరామృతమును, ఈ వొసగంగన్ = నీవు ఇయ్యగా, వినుము, అమృతాస్వాదనమును = అమృతపానమును, ఇనుమడి యగుగాక = రెట్టింపవుగాక.(అలంకారము – అతిశయోక్తి)

తా. ఈ దేవతలలో ప్రతియొక్కనికి నిన్ను చూడగానే అనిమిషత్వము రెట్టింపయినది. అలాగే నువ్వు వీరిలో ఒకనికి నీ అధరామృతమును ఇయ్యగా అమృతపానమును రెట్టింపగును.

**24 వ. అనిన విని యబ్బాల కేలుదోయి మొగిడ్చి ఫాలంబునం గీలుకొలిపి వేలుపులకు వందనం బాచరించె నప్పుడు శిబికాధరస్థులగు పురుషులు సమాసన్న నాయక ముఖ విషాదానుమేయంబగు దమయంతి మనోవిరాగం బెఱింగి ప్రావృషేణ్య పయోవాహంబులు రాజహంసావలిం బల్వలాంతరంబుల వలనం బాపి మానససరోవరంబునుంబోలె మాంజిష్ఠ మంజిమవిగాహిపదోష్ఠలక్ష్మియగు నయ్యంగన భుజంగపుంగవుఁ గదియం గొనివచ్చిరి. కంజభవుభామయు నప్పద్మదళాక్షికిం బన్నగాధ్యక్షునిం జూపి యిట్లనియె**

తా. అని సరస్వతీదేవి చెప్పగా విని ఆ దమయంతి రెండుచేతులు జోడించి నుదుట చేర్చుకొని దేవతలకు నమస్కరించెను. అప్పుడు పల్లకీని మోయుచున్న పురుషులు సమీపమందున్న నాయకుల ముఖములందున్న విచారముచే ఊహింపదగిన దమయంతికి ఇష్టములేకపోవుటను తెలుసుకొని వర్షాకాల మేఘములు రాజహంసలపంక్తిని గుంటలనుండి తప్పించి మానససరోవరమునువలె మిక్కిలి ఎఱుపుగల పచ్చని వస్త్రముయొక్క సౌందర్యమును పొందుచున్న కాళ్ళును, పెదవులయొక్కయు సంపదకల ఆ దమయంతిని సర్పశ్రేష్ఠునివద్దకు తీసుకొనివచ్చిరి. సరస్వతియును ఆ పద్మదళాక్షికి సర్పరాజును చూపి ఇట్లు పలికెను.

**25 క. పరిరంభ లగ్న గిరిజా**
**సురుచిర కుచ ఘుసృణ పట్ట సూత్రాంకముతోఁ**

**దరళాక్షి వీఁడు చంద్రా**
**భరణు నఱుత బ్రహ్మసూత్ర పదవి భజించెన్**

తరళాక్షి = చలించు నేత్రములుకల దమయంతీ! పరిరంభ = కౌగలించుకొనుటయందు, లగ్న = సక్తమైన, గిరిజా = పార్వతియొక్క, సురుచిర = సుందరమైన, కుచ = స్తనములందున్న, ఘుసృణ = కుంకుమకల, పట్టసూత్ర = పట్టు నూలియొక్క, అంకముతోన్ = చిహ్నముతో, వీడు = ఈ సర్పరాజు, చంద్రాభరణు నఱుతన్ = శివుని కంఠమునందు, బ్రహ్మసూత్రపదవిన్ = యజ్ఞోపవీత స్థానమును, భజించెన్ = పొందెను. (అలంకారము – రూపకము)

తా. ఓ దమయంతీ! కౌగలించుకొనుటచే తగిలిన పార్వతియొక్క సుందర కుచములయందున్న కుంకుమకల పట్టు నూలియొక్క చిహ్నముతో ఈ సర్పరాజు శివుని కంఠమునందు యజ్ఞోపవీతమై యున్నాడు.

**26** **తే. పాణికంకణమై యోగపట్టమయ్యు**
**గంధగజయాన కోటీరబంధమయ్యు**
**వింటికిని నారియై పెక్కు విధములందు**
**భూతభర్త భజించు నీ భుజగవిభుఁడు**

గంధగజయాన = గంధజాతి ఏనుగు గమనమువంటి గమనముకల దమయంతీ!, పాణికంకణమై = చేతి కడియమై, యోగపట్టమయ్యున్ = యోగుల జందెమువలెను, కోటీరబంధమయ్యున్ = జటలను కట్టు త్రాడయ్యును, వింటికిని నారియై, పెక్కు విధములందు, భూతభర్తన్ = శివుని, ఈ భుజగవిభుడు = ఈ సర్పరాజు, భజించు = సేవించుచుండును. తా. ఓ దమయంతీ! ఈ సర్పరాజు శివునకు చేతి కంకణమై, యోగుల జందెమై, జటలను కట్టు త్రాడై, వింటికి నారియై అనేక విధముల సేవించుచుండును.

**27** **తే. హర జటాజూట చంద్రరేఖామృతంబు**
**నబల! నీదగు దంతచ్ఛదామృతంబు**
**సమముగా రెండు జిహ్వలఁ జవులు సూచి**
**నేర్చుఁ బో వీఁడు చవి వాసి నిశ్చయింప**

అబల = ఓ దమయంతీ!, హర = ఈశ్వరునియొక్క, జటాజూట = జడలయందున్న, చంద్రరేఖామృతంబు = చంద్రరేఖలోని అమృతమును, నీదగు = నీదయిన, దంతచ్ఛద = అధరోష్ఠమందలి, అమృతంబు = అమృతమును, సమముగా, రెండు జిహ్వలన్ = రెండు నాలుకలతోను, చవులు సూచి = రుచి చూసి, చవి వాసి = ఏ రుచి శ్రేష్ఠమో, వీడు = ఈ సర్పరాజు, నిశ్చయింపన్ = నిర్ణయించుటకు, నేర్చుబో = సమర్థుడగును.

తా. ఓ దమయంతీ! శివుని జటాజూటమందలి చంద్రరేఖలోని అమృతమును, నీ అధరోష్ఠమందలి అమృతమును సమముగా రెండు నాల్కలతోను రుచిచూసి ఈ సర్పరాజు ఏ రుచి శ్రేష్ఠమో నిర్ణయించ సమర్థుడగును.

**28** **ఉ. భావజకేళి వైభవము పట్టున నీ చిగురాకుమోవి యా**
**శీవిషనాయకుం డితఁడు సేవ యొనర్చు టనర్థకారి కా**
**దో వనజాక్షి! యయ్యమృతమున్నది నీ యధరంబులోన నే**
**లా వెఱవన్ సుధారసమునందు, విషంబు పరిస్ఫురించునే**

ఓ వనజాక్షి = ఓ పద్మనేత్రీ! ఇతడు = ఈ, ఆశీవిషనాయకుండు = కోఱయందు విషముగల సర్పములకు అధిపతి, భావజకేళి వైభవముపట్టునన్ = మన్మథకేళి సమయమునందు, నీ చిగురాకు మోవిన్, సేవయొనర్చుట = పానము చేయుట, అనర్థకారి కాదు = అపాయము కలిగించునది కాదు, నీ అధరంబులోనన్, ఆ అమృతము ఉన్నది, వెఱవన్ = భయపడుట, ఏలా = ఎందులకు? సుధారసంబునందు = అమృతమునందు, విషంబు, పరిస్ఫురించునే = శక్తి కలిగియుండునా?

తా. ఓ పద్మనేత్రీ! ఈ సర్పరాజు మన్మథకేళి సమయమునందు నీ చిగురాకు మోవిని పానముచేయుట అపాయమును కలిగించదు. నీ అధరములో అమృతముందికదా! భయపడతావెందుకు? అమృతమునందు విషము శక్తికలిగి ఉంటుందా?

**29** **చ. ఫణఫలకంబు విచ్చి కడుఁ బ్రన్నని మే నెగయంగఁ జేయుచు**
**న్మణిమయ పీఠ మధ్యమున నాల్కలు గ్రోయుచునున్న వాసుకిన్**
**ఫణికులసార్వభౌముఁ గని భామిని మైఁ బులకించు భావుకుల్**
**ప్రణయ వికారమో భయము భంగియొ యంచు మదిం దలంపఁగన్**

భామిని = దమయంతీ, ఫణ ఫలకంబు = పడగల పలకను, విచ్చి = విప్పి, కడున్ = మిక్కిలి, ప్రన్నని మేను = మృదువైన శరీరమును, ఎగయంగన్ = ఎగురునట్లుగా, చేయుచున్, నాల్కలు, క్రోయుచున్ = ఆడించుచు, మణిమయపీఠ మధ్య భాగమునన్, ఉన్న, వాసుకిన్, ఫణికులసార్వభౌమున్ = సర్పరాజును, కని = చూచి, భావుకుల్ = అభిప్రాయమును తెలిసికొనువారు, ప్రణయవికారమో = మోహ వికారమో, భయము భంగియో = భయము రీతియో, అంచున్, మదిన్, తలంపగన్, మైన్ =

శరీరము, పులకించున్

తా. దమయంతీ! పడగలు విప్పి మక్కిలి మృదువైన దేహమును ఎగురునట్లు చేసి, నాలుకుల ఆడించుచు మణిమయ పీఠమున కూర్చున్న వాసుకిని నాగరాజును చూసి భావుకులు మోహ వికారముచేత పులకించెనా?, భయము రీతిచే పులకించెనా? అని మనసులో తలంచుచుండిరి.

**30 తే. తమ్ము వరియింప కునికి దీర్ఘమ్ము రోఁజు**
**నహులఁ గ్రేడించి నడచిరి యానధరులు**
**దీర్ఘ నిశ్వాసధారా ప్రతీప పవన**
**వికట హాహా నినాదావశకున శంక**

తమ్మున్ = తమను, వరియింపక ఉనికి = వరింపకపోవుటచేత, దీర్ఘమ్ము రోజు నహులన్ = నిట్టూర్పు పుచ్చుచున్న సర్పములను, క్రేడించి = తప్పించి, యానధరులు = పల్లకి మోయువారు, దీర్ఘ నిశ్వాస ధారా = నిట్టూర్పుల ప్రవాహమనెడి, ప్రతీప పవన = ప్రతికూల వాయువును, వికట = వికారములైన, హాహా నినాద = హాహాకారములనెడి, అవశకున శంకన్ = అపశకున భయముచే, నడచిరి = ముందుకు నడచిరి. (అలంకారము – రూపకము, ఉత్ప్రేక్ష)

తా. తమను వరింపకపోవుటచే నిట్టూర్పులు పుచ్చుచున్న సర్పములను తప్పించుకొని పల్లకిమోయువారు నిట్టూర్పుల ప్రవాహమనెడి ప్రతికూల వాయువును వికారములైన హాహాకారములనెడి అపశకునములుగా తలంచి తప్పించుకొనుటకు ముందుకు నడచిరి.

**31 తే. ప్రకట మందాక్ష సంకుచత్ఫణములైన**
**యురగముల యొద్దఁ బాపి యయ్యుత్పలాక్షి**
**యానధుర్యులు గదియించి రవనిభుజులఁ**
**గాల మళిఁ దమ్మిఁ బాపి చెంగలువఁ బోలె**

యానధుర్యులు = పల్లకిని మోయువారు, ఆ యుత్పలాక్షిన్ = ఆ దమయంతిని, ప్రకట = స్పష్టమైన, మందాక్ష = సిగ్గుచే, సంకుచత్ = ముడుచుకొనియున్న, ఫణములు ఐన = పడగలు కలవైన, ఉరగములయొద్ద = సర్పరాజుల తీరమును, పాపి = తప్పించి, కాలము, అళిన్ = తుమ్మెదను, తమ్మిన్ = (ముడుచుకొనిపోవు) తామరను, పాపి = విడిచిపెట్టి, చెంగలువన్ పోలె = కలువను పొందించునట్లువలె, అవనిభుజులన్ = రాజులను, కదియించిరి = సమీపింపచేసిరి.

తా. పల్లకినిమోయువారు ఆ దమయంతిని స్పష్టముగా సిగ్గుచే ముడుచుకొనియున్న పడగలుకల సర్పరాజుల దగ్గర నుండి సాయంకాలము తుమ్మెదను తామరను విడిచిపెట్టి కలువను పొందించురీతిగా రాజులను సమీపింపచేసిరి.

**32 వ. అప్పుడు పలుకుబోటి వరాటరాజకన్యం గనుఁగొని**

**33 ఉ. ధీరతఁ బుష్కరాదులగు దీవుల నన్నిటినుండి వచ్చి యు**
**న్నారిదె శీతభాను దిననాయకవంశజులైన రాజబృం**
**దారకు లిమ్మహారథులఁ దప్పక యిందఱఁ జూడవమ్మ శృం**
**గార రసైక సర్గ రసిక ద్వ్యణుకోదరి యాదరంబునన్**

శృంగారరస ఏక = కేవలము శృంగారరసమునే, సర్గ = సృష్టించుటయందు, రసిక = ప్రీతిగలదియు, ద్వ్యణుక = ద్వ్యణుకమువలె కృశించిన, ఉదరి = మధ్యముగల ఓ దమయంతీ!, పుష్కరాదులగు = పుష్కరము మొదలైనవగు, దీవుల నన్నిటినుండి = అన్ని దీవులనుండియు, ధీరతన్ = ధైర్యముచే, శీత భాను దిననాయకవంశజులైన = చంద్ర సూర్య వంశములందుపుట్టినవారైన, రాజబృందారకులు = రూపవంతులైన రాజులు, ఇదె = ఇదిగో, వచ్చియున్నారు, ఆదరంబునన్ = ప్రీతితో, ఈ మహారథులన్, తప్పక = తప్పకుండా, ఇందఱన్ = వీరందరిని, చూడుము అమ్మ

తా. ఓ దమయంతీ! సమస్త దీవులనుండి విచ్చేసిన చంద్ర సూర్య వంశ రాజులు ధైర్యముతో ఇదిగో వచ్చియున్నారు. ప్రీతితో ఈ మహారథులను తప్పక చూడుము. (అలంకారము – రూపకము)

**34 తే. తరుణి నిస్తంద్ర పుష్కరదళనిభాక్షి**
**పుష్కరద్వీప మేలు నీ భూభుజుండు**
**నిర్మల స్వాదు సలిలాంబు నిధి విహార**
**మమరు నీతండు నీవును నాచరింప**

తరుణి, నిస్తంద్ర = వికసించిన, పుష్కరదళనిభాక్షి = పద్మపత్రములవంటి కన్నులుకల దమయంతీ!, ఈ భూభుజుండు = ఈ రాజు, పుష్కరద్వీపము, ఏలున్ = పరిపాలించును, ఈతండు, నీవును, ఆచరింపన్ = చేయగా, నిర్మల = స్వచ్ఛమైన, స్వాదు సలిల = మంచినీరుకల, అంబునిధిన్ = సముద్రమునందు, విహారము, అమరున్ = ఒప్పును

తా. వికసించిన పద్మపత్రములవంటి కన్నులుకల దమయంతీ! ఈ రాజు పుష్కరద్వీపమును పరిపాలించును. ఈతడును నీవును చేయగా స్వచ్ఛమైన మంచినీళ్ళ సముద్రమునందు విహారము చేయవచ్చును.

**35** **క. భౌమమగు నాకభవనము**
**భామిని సావర్తభావ భవదద్భుత నా**
**భీమండల యీ నృపసు**
**త్రాముఁడు పాలించు దీవి ప్రథితవిభూతిన్**

సావర్తభావ = సుడియొక్క ధర్మముచే, భవత్ = అగుచున్న, అద్భుత = ఆశ్చర్యకరమైన, నాభీమండల = నాభి ప్రదేశముకల, భామిని = ఓ దమయంతీ!, ఈ నృప సుత్రాముడు = ఈ రాజేంద్రుడు, పాలించు దీవి = పరిపాలించు ద్వీపము, భౌమమగు = భూలోకమందైన, ప్రథిత = గొప్పదగు, విభూతిన్ = ఐశ్వర్యముచే, నాకభవనము = స్వర్గలోకము

తా. ఓ దమయంతీ! ఈ రాజేంద్రుడు పరిపాలించు ద్వీపము గొప్పదగు ఐశ్వర్యముచే భూలోకమందున్న స్వర్గలోకము.

**36** **శా. అందుండున్ హిమవారిశీతల తల న్యగ్రోధవీథిన్ శతా**
**నందుం డంబుజదివ్యమందిరములోనం గర్ణికా పీఠికన్**
**సందర్శింపఁగ వచ్చియున్న నిను నా సర్వేశుఁడీక్షించి యా**
**నందంబు న్మది నొందుఁగాక నిజనానాశిల్ప వైచిత్రికిన్**

అందున్ = ఆ పుష్కరద్వీపమునందు, హిమవారి = మంచునీటిచే, శీతల = చల్లని, తల = ప్రదేశమందలి, న్యగ్రోధ = మఱ్ఱిచెట్టుయొక్క, వీథిన్ = ప్రాంతమందు, శతానందుండు = బ్రహ్మ, అంబుజ = పద్మమనెడి, దివ్యమందిరములోనన్ = సుందరమైన భవనములో, కర్ణికాపీఠిన్ = కర్ణికయనెడి పీఠమునందు, ఉందున్ = నివసించును, నినున్ = నిన్ను, సందర్శింపగన్ = చూచుటకు, వచ్చియున్న = వచ్చినటువంటి, ఆ సర్వేశుడు = ఆ బ్రహ్మ, ఈక్షించి = చూచి, నిజ = తనయొక్క, నానా = అనేక విధములైన, శిల్ప = సృష్టియొక్క, వైచిత్రికిన్ = విచిత్రత్వమునకు, ఆనందంబున్ = సంతోషమును, మదిన్ = మనసునందు, ఒందుగాక = పొందునుగాక.

తా. ఆ పుష్కరద్వీపమునందు మంచునీటిచే చల్లనైన ప్రదేశంలోని మఱ్ఱిచెట్టు ప్రాంతంలో బ్రహ్మ పద్మ మందిరంలో కర్ణికా పీఠమునందు నివసించును, ఆయనను చూడటానికి వచ్చియున్న నిన్ను చూచి తన సృష్టివైచిత్రికి మనసున ఆనందించుగాక

**37** **క. ఆ వటమహీరుహంబా**
**దీవికి ఫల పత్ర చిత్ర దీప్తి స్ఫురణన్**
**భూవల్లభ వర నందన**
**భావింపఁగఁ బించె గొడుగుభంగి భజించున్**

భూవల్లభ వరనందన = రాజకుమారియైన దమయంతీ!, భావింపగన్ = ఆలోచింపగా, ఆ వటమహీరుహంబు = ఆ మఱ్ఱిచెట్టు, ఫల పత్ర చిత్ర దీప్తిన్ = పండ్ల, ఆకుల విచిత్రకాంతుల, స్ఫురణన్ = అతిశయము, ఆ దీవికిన్ = ఆ పుష్కర ద్వీపమునకు. పించెగొడుగుభంగిన్ = నెమలిపింఛము గొడుగు విధమును, భజించున్ = పొందును

తా. ఓ దమయంతీ! ఆలోచిస్తే ఆ మఱ్ఱిచెట్టుయొక్క పండ్ల, ఆకుల విచిత్రకాంతుల అతిశయము ఆ పుష్కర ద్వీపమునకు నెమలి పింఛపు గొడుగువిధమును పొందును. (అలంకారము – ఉత్ప్రేక్ష)

**38** **వ. అని పలికి, భ్రూవల్లరీవేల్లన వికారంబు చూచి యప్పల్లవాధర యతని నొల్లమి యెఱింగి యద్ద్వ్యాంగనా తిలకంబు**

తా. ఈ రీతిగా చెప్పి కనుబొమల కదలికలోని అయిష్టతను చూచి చిగురువంటి పెదవికల ఆ దమయంతి అతనిని యిష్టపడకుండుటను తెలుసుకొని ఆ సరస్వతీదేవి

**39** **తే. లలన పొమ్మవ్వలికినని పలుకుటయును**
**పుష్కర ద్వీపపతి యాస్య పుష్కరమునఁ**
**దదనవాప్తిజ ఘన పరితాప వహ్ని**
**చిహ్నమగు కార్ష్ణ్యధూమ మీక్షింపఁబడియె**

లలన = దమయంతీ!, అవ్వలికిన్ = మరియొకరాజునొద్దకు, పొమ్ము, అని, పలుకుటయును, పుష్కర ద్వీపపతి = పుష్కర రాజుయొక్క, ఆస్య పుష్కరమున = ముఖపద్మమునందు, తత్ = ఆ దమయంతిని, అనవాప్తి = పొందలేకపోవుటవలన, జ = పుట్టిన, ఘన = గొప్పదగు, పరితాప వహ్ని = సంతాపమనెడి అగ్ని, చిహ్నమగు = లక్షణమైన, కార్ష్ణ్యధూమము = నల్లని పొగ, ఈక్షింపబడియె = చూడబడెను.

తా. దమయంతీ! మరియొక రాజునొద్దకు పొమ్ము అని పలుకగానే పుష్కరరాజుయొక్క ముఖపద్మమునందు ఆ దమయంతిని పొందలేకపోవుటచే పుట్టిన సంతాపాగ్ని లక్షణమైన నల్లనిపొగ చూడబడెను.

**40** **క. రాజాంతరాభిముఖ మా**
**రాజముఖి విమానవాహరయమునఁ జనియెన్**

**రాజీవగర్భు గేహిని**
**భోజకులాభరణమైన పొలంతుకతోడన్**

ఆ రాజముఖి = ఆ దమయంతి, విమానవామరయమునన్ = పల్లకీమోయువారి వేగముచేత, రాజాంతరాభిముఖము = మరియొక రాజు యెదుటకు, చనియెన్ = వెళ్ళెను, రాజీవగర్భుగేహిని = సరస్వతి, భోజకులాభరణమైన = భోజవంశమునకు అలంకారమైన, పొలతుకతోడన్ = దమయంతితో

తా. ఆ దమయంతి పల్లకీ మోయువారి వేగముచేత మరియొక రాజు ముందునకు వెళ్ళెను. అచట సరస్వతి భోజ వంశాలంకారమైన దమయంతితో

**41 వ. ఒక్క రాజుం జూపి యిట్లనియె**

**42 క. ఏకాతపవారణముగ**
**శాకద్వీపాంతరంబు సర్వముఁ బుణ్య**
**శ్లోకుఁడితఁడు పాలించు ని**
**శాకరముఖి! హవ్యుఁడండ్రు జనపతి యితనిన్**

నిశాకరముఖి = చంద్రునివంటి ముఖముకలదానా!, పుణ్యశ్లోకుడు = పవిత్రమైన కీర్తికల, ఇతడు, శాకద్వీపాంతరంబు = శాక ద్వీపమునకు మధ్యనున్న, సర్వమున్ = సమస్త భూమండలమును, ఏకాతపవారణముగన్ = ఏకచ్ఛత్రాధిపత్యముగా, పాలించున్, జనపతిన్ ఇతనిన్ = ఈ రాజును, హవ్యుడు, అండ్రు = అంటారు.

తా. దమయంతీ! పవిత్రమైన కీర్తికల ఈ రాజు శాకద్వీపమధ్యమందలి సమస్త భూమండలమును ఏకచ్ఛత్రాధిపత్యముగా పరిపాలించుచున్నాడు. ఈ రాజును హవ్యుడు అంటారు.

**43 క. రమణి! రమణీయ తనుతా**
**వమతాతను నతను కీర్తి వైభవు నితనిన్**
**గమల గమలాక్షుఁ బోలెన్**
**బ్రమదంబారఁగ వరింపు పరికించి తగన్**

రమణీ = ఓ దమయంతీ! రమణీయ = సుందరమైన, తనుతా = శరీరముకలవాడగుటచే, అవమత = అవమానింపబడిన, అతనున్ = మన్మథుడుకలవానిని, అతను = విస్తారమైన, కీర్తివైభవున్ = కీర్తివైభవముకలవానిని, ఇతనిన్, కమల = లక్ష్మి, కమలాక్షు పోలెన్ = విష్ణుమూర్తినివలె, ప్రమదంబు = సంతోషము, ఆరగన్ = నిండునట్లుగా, తగన్ = బాగుగా, పరికించి = ఆలోచించి, వరింపు

తా. ఓ దమయంతీ! సుందరమైన శరీరముకలవాడగుటచే మన్మథుని అవమానించినవానిని, విస్తారమైన కీర్తి వైభవము కలవానిని లక్ష్మి విష్ణుమూర్తినివలె బాగుగా ఆలోచించి సంతోషము నిండారునట్లుగా వరింపుము.

**44 తే. వీనిఁ గులశీలశాలి శాలీనతాన**
**తంబు నానన చంద్రబింబంబు నెత్తి**
**బాల వీక్షింపు మేచకోత్పల పలాశ**
**మాలికలఁ బోలు లలిత దృగ్జాలకముల**

బాల = ఓ దమయంతీ! శాలీనతా నతంబు = సిగ్గుచే వంచబడిన, ఆనన చంద్రబింబమున్ = చంద్రునివంటి ముఖమును, ఎత్తి, మేచక = నల్లని, ఉత్పల = కలువల, పలాశ = రేకులయొక్క, మాలికలన్ = దండలను, పోలు = పోలిన, లలిత = సుందరమైన, దృక్ జాలకముల = చూపుల పంక్తులచేత, కుల శీలన్ = వంశము, చారిత్రముచేతను, శాలిన్ = ఒప్పుచున్న, వీనిన్ = ఈ రాజును, వీక్షింపుము = చూడుము

తా. ఓ దమయంతీ! సిగ్గుచే వంచబడిన ముఖమునెత్తి నల్లని కలువరేకులయొక్క మాలికలను పోలిన సుందరమైన చూపుల పంక్తులచేతను, కులము, శీలముచేతను ఒప్పుచున్న ఈ రాజును చూడుము.

**45 సీ. అతి నిర్జరేశ్వరంబై యనశ్వరమైన**
**యైశ్వర్యమున రాజ్య మనుభవింపు**
**చంచచ్ఛుకచ్ఛద చ్ఛాయాశ్రయంబగు**
**శాకవృక్షము నీడఁ జలుపు క్రీడ**
**పాలమున్నీటిలో ఫణిరాజశయ్యపైఁ**
**బవ్వళించిన శార్ఙ్గపాణిఁ గొలువు**
**పొడుపు గుబ్బలిమీఁదఁ బూర్ణిమా రాత్రులం**
**దొనరింపు చంద్రాతపోత్సవంబు**

**తే. లలఘు సైనిక సంఖ్య సంఖ్యాగ్రవిజిత**
**దానవానీకుఁ డయిన యీ ధరణివిభుని**
**లలిత సౌభాగ్యరేఖా కళావిలాస**
**శక్తి భర్త్సిత మత్స్యలాంఛనునిఁ గూడ**

అలఘు = తక్కువకాని, సైనిక సంఖ్యన్, సంఖ్యాగ్ర = యుద్ధభూమియందు, విజిత = జయింపబడిన, దానవానీకుడయిన = రాక్షస సమూహముకలవాడైన, ఈ ధరణివిభుని = ఈ రాజుని, లలిత = మనోహరమైన, సౌభాగ్యరేఖా = సౌందర్యరేఖయొక్క, కళావిలాస శక్తిన్ = కాంతిలీల సామర్థ్యముచేత, భర్త్సిత = తిరస్కరింపబడిన, మత్స్యలాంఛనునిన్ = మన్మథుని, కూడి, అతినిర్జరేశ్వరంబై = ఇంద్రుని అతిక్రమించునదై, అనశ్వరంబైన = నాశములేనిదైన, ఐశ్వర్యమునన్ = సంపదచే, రాజ్యము, అనుభవింపు, చంచత్ = ప్రకాశించుచున్న, శుక = చిలుకలయొక్క, ఛద = రెక్కలయొక్క, ఛాయా = కాంతివంటికాంతికి, ఆశ్రయంబగు = ఆధారమైనదగు, శాకవృక్షము నీడన్ = టేకుచెట్టు నీడయందు, క్రీడ చలుపు = క్రీడించుము, పాల మున్నీటిలోన్ = పాలసముద్రములో, ఫణిరాజశయ్యపైన్ = నాగరాజ తల్పముపై, పవ్వళించిన, శార్ఙ్గపాణిన్ = విష్ణుమూర్తిని, కొలువు = సేవింపుము, పొడుపు గుబ్బలిమీదన్ = ఉదయపర్వతముపై, పూర్ణిమా రాత్రులందున్, చంద్రాతపోత్సవంబు = వెన్నెల ఉత్సవములను, ఒనరింపు = చేయుము

తా. దమయంతీ! అధికమైన సైనికసంఖ్యచే యుద్ధంలో జయింపబడిన రాక్షస సమూహముకలవాడైన ఈ రాజుని మనోహర సౌందర్యరేఖచే మన్మథుని తిరస్కరించినవానిని, అంతులేని సంపదచే దేవతాధిపతిని అతిక్రమించినవానిని కూడి రాజ్యము ననుభవింపుము. చిలుకల రెక్కలయొక్క కాంతివంటి కాంతి కాధారమగు శాకవృక్షమునీడయందు క్రీడించుము. పాలసముద్రములో నాగరాజతల్పముపై శయనించిన విష్ణుమూర్తిని సేవింపుము. ఉదయపర్వతముపై పూర్ణిమా రాత్రులందు వెన్నెల ఉత్సవములను ఒనరింపుము.

**46 ఉ. వావిరి దుగ్ధవారిధి యవశ్యము నీ విలసత్కటాక్ష వీ**
**క్షా వికటాయితంబు ననిశంబు నొనర్చుచు నుండుఁగాక వే**
**లా వనవాటికా తరుపలాశతతి ప్రతిబింబ చుంబి నా**
**నావిధ నిర్మలోర్మి నటన స్ఫుటచారిమ చాపలంబులన్**

వేలా = తీరమందలి, వనవాటికా = వనపంక్తులందున్న, తరు = చెట్లయొక్క, పలాశతతి = పత్రసమూహముయొక్క, ప్రతిబింబ, చుంబి = పొందుచున్న, నానావిధ, నిర్మల = స్వచ్ఛమైన, ఊర్మి = కెరటములయొక్క, నటన = నాట్యముచే, స్ఫుట = స్పష్టమైన, చారిమ = సౌందర్యముకలిగిన, చాపలంబులన్ = చాంచల్యములచేత, దుగ్ధవారిధి = పాలసముద్రము, వావిరి = అత్యంతము, నీ విలసత్ = నీ ప్రకాశించుచున్న, కటాక్ష వీక్షా = క్రీగంటిచూపులయొక్క, వికటాయితంబును = విలసితమును, అనిశంబును = ఎల్లప్పుడును, అవశ్యము = తప్పకుండా, ఒనర్చుచు నుండుగాక = అనుకరించుచుండునుగాక తా. దమయంతీ! తీరమందలి వనపంక్తులందున్న చెట్ల ఆకుల ప్రతిబింబమును పొంది నిర్మలమైన కెరటముల నాట్యముచే స్పష్టమైన సౌందర్యముకలిగి పాలసముద్రము మిక్కిలి ప్రకాశవంతములైన నీ క్రీగంటి చూపులయొక్క విలాసమును నిత్యము తప్పకుండగా అనుకరించుచుండునుగాక (అలంకారము – ప్రతీపము)

**47 తే. అమృత మధురంబులగు గాడ్పు లాని యాని**
**బొజ్జఁ బెంచిన పెనుఁబాఁప సెజ్జ మీఁదఁ**
**బద్మలోచన! యీ మహీపాలుఁ డేలు**
**పాలమున్నీటిలో శౌరి పవ్వళించు**

పద్మలోచన, ఈ మహీపాలుడు, ఏలు, పాల మున్నీటిలోన్, అమృత మధురంబులగు, గాడ్పులు = గాలులను, ఆనియాని = భక్షించి, బొజ్జ పెంచిన, పెనుపాప సెజ్జమీద = నాగ తల్పముపై, శౌరి = విష్ణుమూర్తి, పవ్వళించున్ = శయనించును తా. పద్మలోచన! ఈ రాజు పాలించు పాలసముద్రములోని గాలులను పీల్చిన నాగ తల్పముపై విష్ణుమూర్తి నిద్రించును

**48 తే. లలిత కాశ్మీరభవ సమాలంభకర్మ**
**పాటలంబైన నీ ముఖాబ్జంబుతోడ**
**నొరయుఁగాక భవత్కేళియోగ్యమైన**
**పొడుపుగుబ్బలిఁ బొడతెంచు పూర్ణవిధుఁడు**

లలిత = సుందరమైన, కాశ్మీరభవ = కుంకుమను, సమాలంభ కర్మ = పూసికొనుటచే, పాటలంబైన = ఎఱ్ఱనైన, నీ ముఖాబ్జంబుతోడన్ = నీ ముఖపద్మముతో, భవత్కేళియోగ్యమైన = నీ క్రీడలకు తగినదైన, పొడుపు గుబ్బలిన్ = ఉదయ పర్వతముమీద, పొడతెంచు = ఉదయించునట్టి, పూర్ణవిధుడు = పూర్ణ చంద్రుడు, ఒరయున్‌గాక = అసూయచెందుగాక తా. కుంకుమచే

ఎఱ్ఱనైన నీ ముఖపద్మముతో నీ క్రీడలకు తగిన ఉదయపర్వతముపై ఉదయించు పూర్ణచంద్రుడు అసూయచెందుగాక (అలంకారము – సందేహము)

**49 క. లీలా చంక్రమవేళలఁ**
**బాలా నీ చరణలాక్ష ప్రథమాద్రిశిలా**
**జాలములఁ గృతక గైరిక**
**బాలాతప శంక లనువు పఱచుంగాతన్**

బాలా, నీ చరణ లాక్ష = నీ పాదములందలి లత్తుక, లీలా చంక్రమవేళలన్ = విలాసముగా తిరుగు సమయములందు, ప్రథమాద్రి శిలాజాలములన్ = ఉదయపర్వత శిలాసమూహములందు, కృతక = కృత్రిమమైన, గైరిక = గైరికాది ధాతువుల యొక్కయు, బాలాతప = నీరెండలయొక్కయు, శంకలు = సందియములను, అనువుపఱచుంగాతన్ = కలిగించుగాక తా.
దమయంతీ! నీ పాదములందలి లత్తుక నీవు విలాసముగా తిరుగు సమయములందు ఉదయపర్వత శిలా సమూహములందు కృత్రిమమైన గైరికాది ధాతువులయొక్కయు, నీరెండలయొక్కయు సందేహమును కలిగించుగాక

**50 వ. అని పలికి యప్పుడు గంధవాహులుంబోని విమానవాహులు లబ్ధగుణ ప్రసిద్ధియగు నా లలనా లలామం బరిమళ లక్ష్మినిం బోలెఁ బ్రదేశాంతరంబునకుం దోడ్తేర నవ్వాఙ్మయదేవత హేమోపమేయ కాంతియుం గురువింద సకాంతి దంతియునగు నయ్యింతి కిట్లనియె**

తా. అని పలికి అప్పుడు వాయుగమనముకల పల్లకీని మోయువారు మంచి గుణములచే ప్రసిద్ధయగు ఆ దమయంతిని పరిమళ లక్ష్మినివలె మరియొక చోటునకు తీసుకొనిపోగా ఆ సరస్వతి బంగారముతో ఉపమింపదగిన కాంతియును, మాణిక్యములతో సమానమైన దంతములుకల ఆ దమయంతితో ఇట్లు పలికెను.

**51 క. మహిళా లలామ! బాహా**
**బహువార నివారితారి పార్థివు నితనిన్**
**జహదజహల్లజ్జాసం**
**గ్రహదృగ్జాలములఁ జూడు క్రౌంచాధిపతిన్**

మహిళాలలామ = స్త్రీరత్నమా!, బాహా = బాహువులచే, బహువార = అనేకపర్యాయములు, నివారిత = జయింపబడిన, అరి పార్థివున్ = శత్రురాజులుకలవాడగు, ఇతనిన్, క్రౌంచాధిపతిన్ = క్రౌంచద్వీప రాజును, జహత్ అజహత్ = ఉండియు లేనట్టి, లజ్జా = సిగ్గును, సంగ్రహ = స్వీకరించుచున్న, దృగ్జాలములన్ = చూపులసమూహముచే, చూడు తా.
ఓ దమయంతీ! బాహుబలముచే అనేక పర్యాయములు జయింపబడినట్టి శత్రురాజులుకల ఇతనిని ఈ క్రౌంచ ద్వీప రాజును ఉండియులేనట్టి సిగ్గును స్వీకరించుచున్న చూపులసమూహముతో చూడుము

**52 తే. మండలాకార వేష్టనాఖండ వితత**
**పాండు దధిమండ పాథోధి మండితంబు**
**పడఁతి యేతద్భుజాదండ పాలితంబు**
**క్రౌంచమను దీవి సుగుణసంఘములనీవి**

పడతీ, మండలాకార = వర్తులాకారమైన, వేష్టన = చుట్టుకొనుటచే, అఖండ = తెంపులేనిదియు, వితత = విస్తరించి యున్నదియు, పాండు = తెల్లనిదియనగు, దధిమండ పాథోధి = పెరుగు మీగడగల సముద్రముచే, మండితంబు = అలంకరింపబడినదియు, సుగుణసంఘములనీవి = సుగుణములు సమూహమునకు ముల్లెయయిన, క్రౌంచమనుదీవి, ఏతద్భుజాదండ పాలితంబు = ఈ రాజు బాహుదండములచే పాలింపబడుచున్నది (అలంకారము – రూపకము)

తా. దమయంతీ! వర్తులాకారముగా చుట్టబడియుండుటచే తెంపులేనిదియి, విస్తరించియున్నదియు, తెల్లనిదియునగు పెరుగు సముద్రముచే అలంకరింపబడినదై సుగుణ సమూహమునకు నిధియైన క్రౌంచద్వీపమును ఈతని బాహుదండమే పాలించుచున్నది

**53 క. దర్భదళ పూజనంబుల**
**గర్భజనిక్లేశ ముడుపు కరుణాభరణున్**
**నిర్భరమతి సేవింపు వి**
**దర్భాధిపతనయ యచటి తరుణేందుధరున్**

విదర్భాధిప తనయ = దమయంతీ!, దర్భ దళ పూజనంబులన్, నిర్భరమతిన్ = నిండుమనసుతో, గర్భజని క్లేశము = సంసారదు:ఖమును, ఉడుపు = పోగొట్టు, కరుణాభరణున్, అచటి = ఆ క్రౌంచద్వీపమందలి, తరుణ ఇందు ధరున్, సేవింపుము

తా. దమయంతీ! దర్భచిగుళ్లతో పూజించినను నిండుమనసుతో సంసారదు:ఖమును పోగొట్టు దయామయుడైన ఆ క్రౌంచద్వీపమందలి పరమశివుని సేవింపుము

**54** **తే. అబల! పాదార్పణానుగ్రహమును నిన్నుఁ**
**బ్రార్థనము చేయఁగలదు గ్రౌంచాచలంబు**
**పటుతర స్కందబాణ సంపాత వివర**
**కలిత నిర్గమ కలహంస కలకలముల**

అబల!, క్రౌంచాచలంబు, పటుతర = సమర్థమైన, స్కందబాణ = కుమారస్వామి బాణములయొక్క, సంపాత = దెబ్బలతో పడిన, వివర = రంధ్రమునుండి, కలిత = ఒప్పునట్లుగా, నిర్గమ = బయల్పడుచున్న, కలహంస కలకలములన్, పాద అర్పణ = పాదములను ఉంచుటయనెడి, అనుగ్రహమును = దయను, నిన్నున్, ప్రార్థనముచేయగలదు = యాచింపగలదు

తా. ఓ దమయంతీ! క్రౌంచపర్వతము సమర్థమైన కుమారస్వామి బాణములయొక్క దెబ్బలతో పడిన రంధ్రమునుండి బయల్పడుచున్న రాజహంసల కలకలముతో తనయందు నీ పాదములనుంచి అనుగ్రహించుమని నిన్ను ప్రార్థించగలదు.

**55** **క. ఘటియింపు మచట హాటక**
**ఘటకోటి వతంసకములుగా ధూర్జటికిన్**
**గుటిలాలక కలధౌత**
**స్ఫటికశిలామయములయిన ప్రాసాదంబుల్**

కుటిలాలక = ముంగురులుకల దమయంతీ!, హాటక = బంగారపువయిన, ఘటకోటి = కడవలసమూహము, వతంసకములుగాన్ = శిరోభూషణములుకాగా, కలధౌత = బంగారముచేతను, స్ఫటిక శిలామయములయిన = పటికపు రాలచేతను నిర్మితములైన ప్రాసాదంబుల్ = భవనములను, ధూర్జటికిన్ = శివునికి, ఘటియింపుము = నిర్మింపుము

తా. దమయంతీ! బంగారు కలశములు శిరోభూషణములుగా ఒప్పుచున్న బంగారముచేతను, స్ఫటిక శిలలచేతను నిర్మితములైన దేవాలయములను ఆ పరమశివునకు నిర్మింపుము

**56** **చ. పొలతి లలిన్మలిమ్లుచుట పోలిక నీ రతికేళి జన్మ ని**
**ర్మలతర ఘర్మబిందు మయ మౌక్తిక మండనముల్ హరించుఁ గా**
**కలసగతిన్ జలద్దధిరసాంబుధి తుంగ తరంగమాలికా**
**వలి పృషతచ్ఛటా చమరవాల కరంబిత మారుతౌఘముల్**

పొలతి = దమయంతి!, చలత్ = చలించుచున్న, దధిరసాంబుధి = పెరుగు సముద్రముయొక్క, తుంగ = ఎత్తైన, తరంగ మాలికావలి = కెరటముల వరుసలయొక్క, పృషత = బిందువులయొక్క, ఛటా = సమూహములనెడి, చమరవాల = వింజామరల, కరంబిత = కూడికగల, మారుతౌఘముల్ = మలయమారుత సమూహములు, అలసగతిన్ = మందగమనముచే, లలిన్ = ఒప్పునట్లుగా, మలిమ్లుచులపోలికన్ = దొంగలవలె, నీ రతికేళి = నీ సంభోగమునందు, జన్మ = పుట్టిన, నిర్మలతర = మిక్కిలి స్వచ్ఛములైన, ఘర్మ బిందుమయ = చెమటబిందువులనెడి, మౌక్తిక = ముత్యముల, మండనములు = అలంకారములు, హరించుగాక = తొలగించుగాక

తా. దమయంతీ! పెరుగు సముద్రముయొక్క ఎత్తైన కెరటముల బిందు సమూహము వింజామరల కూడికగల మలయమారుత సమూహముల మందగమనము ఒప్పునట్లుగా దొంగలవలె నీ రతికేళి సమయమునందు పుట్టిన చెమట బిందువులనెడి ముత్యములను తొలగించునుగాక

**57** **తే. జాలపాద వేషంబు వేశంతజాల**
**లంఘనాభ్యాస భవమైన లాఘవమున**
**సాగరంబులు దాఁటి దిక్సమితిఁ గడచుఁ**
**గమలలోచన యీరాజు విమలయశము**

కమలలోచన, ఈ రాజు, విమల = స్వచ్ఛమైన, యశము = కీర్తి, జాలపాదవేషంబు = హంసవేషముకలదై, వేశంతజాల = పడియల సమూహములను, లంఘన = దాటుటయందు, అభ్యాస = అలవాటుచే, భవమైన = కలిగిన, లాఘవమున = నేర్పున, సాగరంబులు దాటి, దిక్సమితిన్ = దిక్కుల సమూహమును, కడచున్ = అతిక్రమించును

తా. దమయంతీ! ఈ రాజుయొక్క స్వచ్ఛమైన కీర్తి హంసరూపున పడియలను దాటుటయందు అలవాటుచే నేర్పున సముద్రములు దాటి, దిక్కుల సమూహములను అతిక్రమించును

**58** **వ. అనిన విని ఆ గంధగజగామిని నిజ హృదయానుబంధం బవ్వసుంధరాధిపునియందు సంధింప దయ్యె నది దైవవశం బప్పు డంసావతంస శిబికాంసులగు పురుషు లప్పురుష ప్రకాండుని సమీపంబువలన రత్నాకరంబువలనం దుషారమయూఖలేఖ లేఖానుజీవి పురుషులుం బోలెఁ గొనిచని గిరీశప్రభావుండగు నొక మహానుభావుం గదియించిరి. తత్సమయంబున నఖిల జగదంచితపాదపద్మయగు నప్పద్మసంభవు గేహిని యవ్వరారోహ కిట్లనియె**

తా. అనిన విని ఆ దమయంతి తన మనసును ఆ రాజునందు కూర్చదాయెను. అది దైవాధీనము. అపుడు భుజములపై

పల్లకీని మోయుచున్న పురుషులు ఆ పురుషశ్రేష్ఠుని చెంతనుండి సముద్రమునుండి చంద్రలేఖను దేవతలసేవకులవలెనే తీసుకొనివెళ్లి శివునితో సమాన ప్రభావముకల ఒక మహాపురుషుని చెంత చేర్చిరి. ఆ సమయమున సమస్త లోకములచే పూజింపబడుచున్న పాదపద్మములుకల ఆ సరస్వతీదేవి దమయంతితో ఈరీతిగా పలికెను

**59 చ. నవవిదళత్కుశేశయ సనాభిశయద్వయ యివ్వసుంధరా**
**ధవుడు కుశాంకితంబగు ప్రధానపు దీవి కధీశుఁ డీతనిన్**
**దివుటఁ బరిగ్రహించి సముదీర్ణ వసంతసమాగమంబులం**
**దువిద! పరిగ్రహింపుము ఘృతోదధి తీర వనీవిహారముల్**

నవ = నూతనముగా, విదళత్ = వికసించిన, కుశేశయ = పద్మముతో, సనాభిశయద్వయ = సమానములైన చేతులుకల, ఉవిద = ఓ దమయంతీ!, ఈ వసుంధరాధవుడు = ఈ రాజు, కుశాంకితంబగు = కుశ అని పిలువబడు, ప్రధానపు దీవికిన్, అధీశుడు = అధిపతి, ఈతనిన్, తివుటన్ = కోరి, పరిగ్రహించి = వరించి, సముదీర్ణ = కోరదగిన, వసంత సమాగమంబులందున్ = వసంతపు రాకలను, ఘృతోదధి తీర = నేతి సముద్ర తీరమందలి, వనీ = వనములయందు, విహారముల్, పరిగ్రహింపుము = పొందుము. (అలంకారము – ఉపమ)

తా. పద్మమువంటి చేతులుకల దమయంతీ! ఈ రాజు కుశ ద్వీపాధిపతి. ఈతనిని వరించి వసంత సమయములను నేతి సముద్రతీరమందలి ఉద్యానవనములలో విహరించుటను పొందుము

**60 మ. పటు వాతూలతరంగ డోలన చలత్పత్రాసిధారా పరి**
**త్రుటి తాంభోధర గర్భ నిస్సృత పయ స్స్రోత శ్ఛటా సేచన**
**స్ఫుట సంవర్ధిత మభ్రచుంబి శిఖరాభోగం బతిస్వచ్ఛ మ**
**చ్ఛట నీకుం కనుపండువయ్యెడిఁ గుశస్తంబంబు బింబాధరా!**

బింబాధరా = దొండపండువంటి అధరము కలదానా!, అచ్ఛటన్ = ఆ కుశద్వీపమందు, పటు = సమర్థమయిన, వాతూల తరంగ = గాలి తరగలయొక్క, డోలన = సంచారములచేత, చలత్ = ఊగుచున్న, పత్ర అసిధారా = ఆకులనెడి కత్తి అంచులచే, పరిత్రుటిత = చీల్చబడిన, అంబోధర = మేఘములయొక్క, గర్భ = లోపలినుండి, నిస్సృత = స్రవించిన, పయస్ = నీటియొక్క, స్రోతశ్ఛటా = ధారలసమూహములయొక్క, సేచన = తడుపుటచేతను, స్ఫుట = మిక్కుటముగా, సంవర్ధితము = వర్ధింపబడుచున్నదియు, అభ్రచుంబి = ఆకాశమునంటుచున్న, శిఖరాభోగంబు = శిఖరాగ్రములుకలదియు, అతిస్వచ్ఛము, కుశస్తంబంబు = దర్భగుల్మము (గుల్మము – కాండములేని చెట్టు), నీకున్, కనుపండువయ్యెడిన్

తా. దమయంతీ! ఆ కుశద్వీపమందు గాలితరగల సంచారముచే ఊగుచున్న ఆకులనెడి కత్తి అంచులచే చీల్చబడిన మేఘముల లోపలినుండి స్రవించిన నీటి ధారలసమూహములచే తడుపబడి చక్కగా అభివృద్ధిచెంది ఆకాశమునంటుచున్న శిఖరాగ్రములుకల దర్భగుల్మములు నీకు కన్నులపండువుచేయును.

**61 శా. ఆనందంబును బొందు మిందునిభవక్త్రా! మందరక్షోణి భృ**
**న్నానా కందర మందిరాంగణములన్ యాదోధి మాథానుసం**
**ధాన ప్రోత్థిత సింధురాడ్దుహితృ పాదన్యాస సంభావనా**
**పౌనఃపున్య పవిత్రకాంచనశిలా పర్యంత భాగంబులన్**

ఇందునిభ వక్త్రా = చంద్రముఖీ!, మందరక్షోణిభృత్ = మందరపర్వతముయొక్క, నానా = అనేక, కందర = గుహలనెడు, మందిరాంగణములన్ = మందిరప్రదేశములందు, యాదోధి = సముద్రముయొక్క మాథ అనుసంధాన = మథించుటచే, ప్రోత్థిత = పుట్టిన, సింధురాడ్దుహితృ = లక్ష్మీదేవియొక్క, పాదన్యాస = పాదములనుంచుటయనెడి, సంభావనా = గౌరవముచే, పౌనఃపున్య = మాటిమాటికిని, పవిత్ర, కాంచనశిలా పర్యంత భాగంబులన్ = బంగారుశిలా భాగములందు, ఆనందంబును, పొందుము

తా. చంద్రముఖీ! మందరపర్వతముయొక్క గుహలనెడు మందిరప్రదేశములందు తరచుగా లక్ష్మీదేవి పాదముద్రలచే గౌరవింపబడిన బంగారుశిలా భాగములందు ఆనందమును పొందుము

**62 తే. కనక కేతకదళ గోత్ర గాత్రయష్టి**
**వ్యాళ తను ఘృష్టికృత వలీ వలయమగుట**
**మహిత సోపానమునుబోని మందరాద్రి**
**యింపు పుట్టించుఁగాక మీ యిద్దఱకును**

కనక కేతకదళ = బంగారు మొగలిరేకుయొక్క, గోత్ర = సంతతియైన, గాత్రయష్టి = సన్నని శరీరముకలదానా!, వ్యాళ = వాసుకియొక్క, తనుఘృష్టి కృత = శరీర రాపిడిచే చేయబడిన, వలీ వలయమగుట = గీతలు కలదగుట, మహిత సోపానమునుబోని = గొప్పదైన మెట్లపంక్తినిపోలి, మందరాద్రి = మందరపర్వతము, మీ ఇద్దఱకున్, ఇంపు పుట్టించుగాక = ఆనందమును

కలిగించునుగాక (అలంకారము – ఉత్ప్రేక్ష)

తా. బంగారు మొగలిరేకులయొక్క సంతతియైన శరీర సౌందర్యముకలదానా! వాసుకియొక్క శరీర రాపిడిచేత గీతలు కలగినదగుటచే గొప్పదైన మెట్ల పంక్తిని పోలి మందరపర్వతము మీ ఇద్దరికినిన ఆనందమును కలిగించుగాక

**63 తే. ప్రకట ఫణివేష్టఘృష్టి మార్గములు డిగ్గి**
**వలితమై పాఱు నిర్ఝరామల జలంబు**
**పాఁపపరిత్రాదు పెనఁగొన్న భావమొంద**
**మగువ నీ కింపుఁ బుట్టించు మందరాద్రి**

ప్రకట = స్పష్టమైన, ఫణి = వాసుకియొక్క, వేష్టఘృష్టి = చుట్టుకొనుటవలన కలిగిన సంఘర్షణమున, మార్గములు డిగ్గి = త్రోవలేర్పడి, వలితమై = వలయాకార రేఖలుకలదై, పాఱు = ప్రవహించుచున్న, నిర్ఝర జలంబు = సెలయేళ్ళ నీరు, పాపపరిత్రాదు = వాసుకి, పెనగొన్న భావము = చుట్టుకొనిన విధము, ఒందన్ = పొందుచుండగా, మగువ, మందరాద్రి, నీకు, ఇంపున్ = ఇష్టమును, పుట్టించున్ = కలిగించును (అలంకారము – భ్రాంతిమంతము)

తా. వాసుకి చుట్టుకొనుటవలన కలిగిన సంఘర్షణముచే త్రోవలేర్పడి గుండ్రటిరేఖలుకలదై ప్రవహించుచున్న సెలయేళ్ళ నీరు వాసుకి చుట్టుకొన్నవిధమును పొందుచుండగా ఓ దమయంతీ! మందరపర్వతము నీకు ప్రీతిని కలిగించును

**64 ఉ. నీ వదనంబుచేత రజనీపతి నీ చనుదోయిచేత నై**
**రావణ కుంభయుగ్మము సురద్రుమపంచక కోమల ప్రవా**
**ళావలి నీ కరాంఘ్రియుగళాధర పల్లవ రాగలక్ష్మిచే**
**భావనచేయుఁ బో మథనపర్వత మిట్టి భవత్ప్రసంగతిన్**

మథన పర్వతము = మందరపర్వతము, ఇట్టి = ఇటువంటి, భవత్ ప్రసంగతిన్ = నీ సహవాసముచేత – నీ వదనంబుచేత = నీ ముఖముచే, రజనీపతిన్ = చంద్రుని, నీ చనుదోయిచేతన్, ఐరావణ కుంభయుగ్మము = ఐరావతముయొక్క కుంభములను, నీ, కర = చేతులయొక్క, అంఘ్రియుగళ = పాదములజంటయొక్క, అధర పల్లవ = చిగురువంటిపెదవియొక్క, రాగలక్ష్మిచేన్ = ఎఱ్ఱని కాంతిసంపదచే, సురద్రుమపంచక = ఐదు కల్పవృక్షములయొక్క, కోమల = మృదువైన, ప్రవాళావళిన్ = చిగుళ్ళ సమూహమును, భావనచేయున్ పో = తలంచునుగాక (అలంకారము – స్మరణ)

తా. మందరపర్వతము నీ సహవాసముచేత నీ ముఖమున చంద్రుని, నీ స్తనముల ఐరావత కుంభములను, నీ చేతులు, పాదములు, పెదవియొక్క ఎఱ్ఱనికాంతిసంపదచే ఐదు కల్పవృక్షములయొక్క మృదువైన చిగుళ్ళ సమూహమును తలపోయునుగాక

**65 వ. అనిన విని యక్కలహంసగమన మీమాంస శిశిరకరావతంసునిఁబోలె నవ్విపులాంసు భజియింప నాసింపదయ్యె. అవ్వైదర్భి తలంపెఱింగి యా చతుర్భుజుని కోడలు గనుసన్న చేయ జన్యజనం బక్కన్య నన్య రాజన్య సమీపంబు నొందించె. అప్పుడు భారతీదేవి దమయంతి కిట్లనియె**

తా. అనగా విని ఆ రాజహంస గమనముకల దమయంతి పూర్వమీమాంస శంకరాచార్యులవలె గొప్ప మూపులుగల ఆ రాజును వరించుటకు ఇష్టములేనిదికాగా ఆ దమయంతి తలంపు తెలిసినదై ఆ విష్ణువు కోడలు సరస్వతి కనుసన్న చేయగా బోయీలు ఆ దమయంతిని వేరొక రాజుచెంతకు తీసుకొనిపోయిరి. అపుడు సరస్వతి దమయంతితో ఇట్లు పలికెను

**66 తే. చపలలోచన వైరి నిష్కృపకృపాణ**
**పాణి ప్రత్యగ్ర ఫాణిత ప్రతిమవాణి**
**వీఁ డధీశుండు శాల్మల ద్వీపమునకు**
**లలిత మధువార్ధి కాంచీకలాపమునకు**

చపలలోచన = చలించుచున్న నేత్రములుకల దమయంతీ!, వైరి = శత్రువులందు, నిష్కృప = దయలేని, కృపాణ పాణి = కత్తి చేతియందుకలవాడును, ప్రత్యగ్ర = నూతనమైన, ఫాణిత = కండచక్కెరతో, ప్రతిమ = సమానమైన, వాణి = వాక్కు కలవాడునునగు, వీడు = ఈ రాజు, లలిత = సుందరమైన, మధువార్ధి = సురాసముద్రమే, కాంచీ కలాపమునకు = మొలనూలుగాకల, శాల్మలద్వీపమునకు, అధీశుండు = అధిపతి

తా. దమయంతీ! శత్రువులందు దయలేని కత్తిని చేతియందు ధరించినవాడును, నూతనమైన కండచక్కెరతో సమానమైన వాక్కుకలవాడునునగు ఈ రాజు సుందరమయిన సురాసముద్రమే మొలనూలుగాగల శాల్మలద్వీపమునకు అధిపతి.

**67 క. ఆసవ జలనిధి నాయకు**
**వాసవ సన్నిభు విశుద్ధ వంశజు నితనిన్**
**వాసికి నవతిల సుమనో**
**నాసికి యెదిరింప వశమె నరనాథులకున్**

నవతిల సుమనో నాసికి = నూతనమైన నువ్వుపూవువంటి నాసికకల ఓ దమయంతీ!, ఆసవజలనిధి నాయకున్ = సురా

సముద్రమునకు నాయకుడైనవాడును, వాసవసన్నిభున్ = దేవేంద్రునితో సమానమయినవాడును, విశుద్ధవంశజున్ = నిర్మలమైన వంశమునందు పుట్టినవాడుననగు, ఇతనిన్ = ఈ రాజును, వాసికిన్ = కీర్తివిషయమై, ఎదిరింపన్, నరనాథులకున్ = ఇతర రాజులకు, వశమె = శక్యమా?

తా. నువ్వుపూవువంటి నాసికకల ఓ దమయంతీ! సురా సముద్రమునకు నాయకుడైనవాడును, దేవేంద్రునితో సమానమైన వాడును, స్వచ్ఛమైన వంశమునందు పుట్టినవాడుననగు ఈ రాజును కీర్తివిషయమై ఎదిరించుటకు ఏ రాజునకు వశముకాదు

**68 ఉ. ఈసుననేక హేలన మహీసురుఁడొక్కరుఁ డొక్కవార్ధి యా**
**పోశన మెత్తుచో దిగులు వుట్టి పయోనిధి పంచకంబు సం**
**త్రాసము నొందునప్డు మొగతప్పని యంబు నిధాన మెద్దియం**
**దాసవపానకేళిఁ గొనియాడు మతండును నీవు నెమ్మదిన్**

మహీసురుడొక్కరుడు = అగస్త్యమహర్షి, ఈసునన్ = కోపముతో, ఏక హేలన = ఒక లీలచేతనే, ఒక్క వార్ధిన్ = క్షార సముద్రమును, ఆపోశనము ఎత్తుచోన్ = త్రావునప్పుడు, పయోనిధి పంచకంబు = తక్కిన ఐదు సముద్రములును, దిగులు పుట్టి = భయపడి, సంత్రాసమునొందునప్డు = భయమును పొందుసమయమున, ఎద్ది = ఏది, మొగతప్పని యంబునిధానము = పౌరుషము విడువని సముద్రమేదో, అందున్ = ఆ సురా సముద్రమునందు, నెమ్మదిన్ = నిండుమనంబుతో, అతడును, నీవును, ఆసవకేలిన్ = సురాపాన క్రీడను, కొనియాడుము = సన్నుతింపుము (అలంకారము – వ్యతిరేకము)

తా. అగస్త్య మహర్షి కోపముతో ఒక లీలచే క్షార సముద్రమును ఆపోశనము పట్టునపుడు మిగిలిన ఐదు సముద్రములును భయపడిపోయి ఆ భయమును అనుభవించునపుడు ఏది పౌరుషము విడువని సముద్రమో అట్టి సురాసముద్రమునందు నిండుమనసుతో శాల్మల ద్వీపాధిపతియును, నీవును సురాపాన క్రీడను ఆనందింపుము.

**69 క. ఏలా లతా గృహంబుల**
**బాలా! విహరింపు మీ నృపాలునితోడన్**
**హాలా రసమయ సాగర**
**వేలా వనముల నిదాఘ వేలా దినముల్**

బాలా = ఓ దమయంతీ! ఈ నృపాలునితోడన్ = ఈ రాజుతో, ఏలాలతాగృహంబుల = ఏలకిలతల పొదరిండ్లలో, హాలా రసమయ సాగర = సురాసముద్ర సమీపమునందలి, వనములన్ = తోటలలో, నిదాఘవేలాదినముల్ = వేసవి దినములలో, విహరింపుము

తా. ఓ దమయంతీ! ఈ రాజుతో ఏలకి లతల పొదరిండ్లలో సురాసముద్రసమీపమందలి వనములలో వేసవి దినములలో విహరింపుము.

**70 వ. శాల్మలిగుల్మ లాంఛితంబైన యమ్మహాద్వీపంబునకు దీపంబునుంబోలె నోషధీలతా జ్వాలా కలాప దీపిత నభఃక్రోడంబును, జూడామిళజ్జలద కజ్జలంబును నగు ద్రోణాచలంబు నీకు విహారస్థానంబగుంగాక, సరస సారస కోశమృద్వి యాతని నుద్వాహమ్ము గమ్ము.**

తా. శాల్మలిపొదలచే ఒప్పుచున్న ఆ గొప్ప ద్వీపమునకు దీపమువలె ఓషధీ లతల కాంతులయొక్క సమూహముచేత ప్రకాశింపచేయబడుచున్న గగనమధ్యభాగముకలదియును, శిఖరములందు సంక్రమించియున్న మేఘములనెడి కాటుక కలదియునగు ద్రోణాచలము నీకు విహారస్థానమగుగాక. సుందరములైన పద్మములవలె మృదువైన శరీరముకలదానా! ఈతనినే వరింపుము.

**71 ఉ. నావుడు లోచనాంతముల నవ్వె విదర్భతనూజ దాన ను**
**ద్భావితమయ్యె నా నృపతిపై ననురాగము లేమి యప్డు వా**
**గ్దేవి విమానవాహకతతిన్ నడపించెను వేఱ యొక్క పృ**
**థ్వీవరుఁడున్న పట్టునకు వేడుక యుల్లమునం దలిర్పగన్**

నావుడున్ = అని సరస్వతి పలుకగానే, విదర్భతనూజ = దమయంతి, లోచనాంతములన్ = నేత్రాంతములచే, నవ్వెన్, తాన = దానివలన, ఆ నృపతిపైన్, అనురాగము లేమి = ప్రీతి లేకపోవుట, ఉద్భావితమయ్యె = ఊహింపబడినది, అపుడు, వాగ్దేవి, విమానవాహకతతిన్ = పల్లకి మోయువారిని, వేడుక, ఉల్లమునన్ = మనసునందు, తలిర్పగన్ = చివురొత్తగా,
వేఱయొక్క = మఱియొక, పృథ్వీవరుడున్న పట్టునకు = రాజు ఉన్న చోటునకు, నడపించెను.

తా. అని సరస్వతి పలుకగానే దమయంతి నేత్రాంతములచే నవ్వెను. దానివలన ఆ రాజుపైన ప్రీతి లేకపోవుట తెలుసుకొనబడినది. అపుడు సరస్వతి పల్లకి మోయువారిని మఱియొక రాజు దగ్గరకు మనసున సంతోషము ఒప్పుచుండగా నడపించెను.

**72 వ. ఇట్టు నడపించి కాశ్మీరపంకనిభలగ్న జనానురాగుండును, శ్రీఖండలేపనైపథ్యమయ దిగ్విజయ కీర్తిరాజి**

**రాజద్భుజుండును నగు నమ్మహీభుజునిం జూపి**

తా. ఇట్లు నడపించి కాశ్మీరకుంకుమపంక మిషచే సంగమించిన జనానురాగముకలవాడును, చందనానులేపన మనెడి అలంకారరూపమైన దిగ్విజయమువలన కలిగిన కీర్తి సమూహముచే ప్రకాశించుచున్న బాహువులుకలవాడునునగు నా మహారాజును చూపి

**73 క. వీక్షింపు సరోజేక్షణ**
**యిక్షు రసాంభోధి జలపరీతంబగు నా**
**ప్లక్ష ద్వీపంబున క**
**ధ్యక్షుం డీ రాజు చెలి సహస్రాక్షునకున్**

సరోజేక్షణ = పద్మనేత్రీ!, ఇక్షురసాంభోధి = ఇక్షుసముద్రముయొక్క, జల = నీటిచే, పరీతంబగు = చుట్టబడిన, నా ప్లక్ష ద్వీపమునకు, ఈ రాజు, అధ్యక్షుండు = పాలకుడు, సహస్రాక్షునకున్ = ఇంద్రునకు, చెలి = స్నేహితుడు, వీక్షింపు = చూడుము.

తా. పద్మనేత్రీ! ఇక్షుసముద్రముయొక్క నీటిచే ఆవరింపబడిన ఆ ప్లక్ష ద్వీపమునకు ఈ రాజు పరిపాలకుడు. ఇంద్రునకు స్నేహితుడు. ఈతనిని చూడుము.

**74 ఉ. పొంపిరివోవు భక్తి నిరుపూఁటలు రాత్రులు శీతభాను ద**
**ర్శింపక యారగింపఁడు విశిష్టత వీఁడు భుజించుఁగాక వం**
**చింపక యింతనుండియును జేడియ నీ వదనేందుబింబమున్**
**సొంపెసలారఁగాఁ దనకుఁ జూడఁగ నబ్బుట దర్శరాత్రులన్**

వీడు = ఈ రాజు, విశిష్టతన్ = గొప్ప వ్రతముచే, పొంపిరివోవు భక్తిన్ = ఎడతెగని భక్తిచేత, ఇరుపూటలన్ = రెండు పూటలయందును (ఉదయము, మధ్యాహ్నము), రాత్రులు = రాత్రులయందును, శీతభాను దర్శింపక = చంద్రుని చూడకుండ, ఆరగింపడు = భుజింపడు, చేడియ = ఓ దమయంతీ!, సొంపు ఎసలారగన్ = సొగసు చెలంగునట్లుగా, తనకున్ = ఆ రాజునకు, నీ వదనేందుబింబమున్ = నీ చంద్రబింబమువంటి ముఖమును, చూడగన్ = చూసేటటువంటి, అబ్బుటన్ = భాగ్యములభించుటచే, ఇంతనుండియున్ = ఇకమీదట, దర్శరాత్రులన్ = అమావాస్య రాత్రులందుకూడ, వంచింపక = వ్రతభంగములేకుండగ, భుజించుగాక = తినునుగాక.

తా. ఆ రాజు గొప్పవ్రతముచే అంతులేని భక్తితో రెండుపూటలయందును, రాత్రులయందును చంద్రుని చూడక భుజిపండు. ఓ దమయంతీ! సొగసుగా ఆ రాజునకు నీ చంద్రబింబమువంటి ముఖము చూసే భాగ్యము లభించడంచేత ఇకమీదట అమావాస్యరాత్రులందుకూడా వ్రతభంగములేకుండగా భుజించునుగాక.

**75 వ. ఇక్షురసోదధి వేలావిహారంబును, ప్లక్షశాఖాప్రేంఖోళన క్రీడావినోదంబును, విపాశా పులినవేదికా ప్రదేశ పర్యటనంబును మనంబున కింపు పుట్టింపఁగలయవి.** ఇతనిఁ **బరిగ్రహింపుమనిన నా సరోజాక్షి వైరాగ్యరూక్షంబులగు వీక్షణంబుల నతని వీక్షించె. వాణీ కుచోదయ తృణీకృత పాణి వీణా నిక్వాణయగు వాణి యన్నీలవేణి తలంపెఱింగి యంసస్థలస్థిత సమాన విమానదండులగు పురుష ప్రకాండులం పదండు పదండని నడిపించి జంబూద్వీప భూపాలలోకంబుఁ గదియించి**

తా. చెఱకురససముద్రముయొక్క తీరములందు విహరించుటయును, జువ్వికొమ్మలకు బంధింపబడిన ఉయ్యెలను ఊగుటయందును, విపాశానదీ ఇసుక తిన్నెలయందు విహారంబును మనంబునకు సంతోషమును కలిగింపగలవు. ఇతనిని వరింపుము అని పలుకగా ఆ దమయంతి ఆసక్తిలేని పరుషములైన చూపులతో ఆ రాజును చూసెను. వాక్కుయొక్క మాధుర్యాది గుణోత్పత్తిచేత తిరస్కరింపబడుచున్న వీణా ధ్వని కలిగిన సరస్వతి ఆ దమయంతి అభిప్రాయమునెఱింగి పల్లకి మోయునట్టి వాహకులను పదండి పదండి అని నడిపించి జంబూద్వీప రాజ సమూహమును సమీపించి

**76 ఉ. నేరెటిదీవి నేలు ధరణీవరముఖ్యులు వీరె కంటె యు**
**న్నారు మనోరథంబులు మనంబునఁ బాయక సంచరింపఁగా**
**నీరజపత్త్రనేత్ర యొకనిన్ వరియింపుము వీరిలోన దై**
**త్యారి వరించు నిందిరక్రియం బరినందిత చిత్తవృత్తివై**

నీరజపత్త్రనేత్ర = పద్మపత్రనేత్రీ!, వీరె = ఈ కూర్చున్నవారే, నేరెటిదీవిన్ = జంబూద్వీపమును, ఏలు, ధరణీవరముఖ్యులు, వీరె = వీరిని, కంటె = చూచితివా?, మనోరథంబులు = కోరికలు, మనంబునన్ = మనసునందు, పాయక = విడువక, సంచరింపగాన్ = విహరించుచుండగా, ఉన్నారు, వీరిలోనన్, ఒకనిన్, పరినందిత చిత్తవృత్తివై = సంతసించు చిత్త వ్యాపారముకలదానివై, దైత్యారిన్ = విష్ణువును, ఇందిరక్రియన్ = లక్ష్మీదేవివలె, వరించు.

తా. పద్మపత్రములవంటి నేత్రములుకలదానా! ఈ కూర్చున్నవారే జంబూద్వీపమునేలు రాజముఖ్యులు. వీరిని చూచితివికదా! మనసునందు కోరికలు విడువక విహరించుచుండగా ఉన్నారు. వీరిలో ఒకరిని సంతసించు మనో వ్యాపారముకలదానవై విష్ణువును లక్ష్మీదేవివలె వరించుము.

77 **క. సుందరి! జంబూద్వీపము**
**నందలి భూపాలసముదయంబును గంటే**
**పొందొప్ప ధరణి వ్రాలిన**
**కందర్ప జగంబువోలెఁ గడు నొప్పారెన్**

సుందరి, జంబూద్వీపమునందలి, భూపాల సముదయంబును = రాజ సమూహమును, కంటే = చూచితివా?, పొందు = స్నేహము, ఒప్పన్ = ఒప్పునట్లుగా, ధరణి వ్రాలిన, కందర్ప జగంబువోలెన్ = మన్మథలోకమువలె, కడున్ = మిక్కిలి, ఒప్పారెన్ = ప్రకాశించెను.

తా. సుందరీ! జంబూద్వీపమునందలి రాజసమూహమును చూచితివా? ప్రీతితో భూమిపై వ్రాలిన మన్మథలోకమువలె మిక్కిలి ప్రకాశించుచున్నారు.

78 **తే. దీవులాఱును దనుఁ జుట్టుఁ దిరిగి కొలువ**
**దీవులకు రాజు నేరెటిదీవి యొప్పు**
**మేరు కైలాసగిరులు బంగారుగొడుగు**
**ధవళవర చామరంబునై తనకుఁ దనర**

దీవులకు రాజు, నేరెటిదీవి = జంబూద్వీపము, దీవులు ఆఱును, తనున్ = తనను, చుట్టున్, తిరిగి, కొలువన్ = సేవింపగా, మేరు కైలాస గిరులు, బంగారు గొడుగు, ధవళ = తెల్లని, చామరమునై = వింజామరయునై, తనకున్, తనరన్ = ఒప్పుచుండగా. ఒప్పున్ = వెలయుచుండును.

తా. దీవులకురాజైన జంబూద్వీపము ఆరు దీవులును తనను చుట్టి తిరుగుతూ సేవింపగా, మేరు, కైలాస పర్వతములు బంగారు గొడుగు, తెల్లని వింజామరయునై తనకు ఒప్పుచుండగా ప్రకాశించుచుండును.

79 **ఉ. ఓ వనితాలలామ! లవణోదధి చక్రపరీతమైన యా**
**దీవికి రాజజంబువు ప్రదీపిత లాంఛన మన్నగంబు శా**
**ఖావలి వ్రేలియాడెడి మహాఫలముల్ గని వారణంబు లౌ**
**గావని పందెముల్ సఱువఁగా గమకింతురు సిద్ధదంపతుల్**

ఓ వనితాలలామ = ఓ స్త్రీరత్నమా!, లవణోదధి చక్రపరీతమైన = ఉప్పుసముద్రముచే చుట్టబడిన, ఆ దీవికిన్, రాజ జంబువు = జంబూవృక్షము, ప్రదీపిత లాంఛనము = ప్రకాశించు చిహ్నము, అన్నగంబు శాఖావలిన్ = ఆ చెట్టు కొమ్మల సమూహమును, వ్రేలియాడెడి = వేలాడుచున్న, మహాఫలముల్, కని = చూచి, సిద్ధ దంపతులు, వారణంబులు = ఏనుగులు, ఔ కావని = ఔనని కాదని, పందెముల్ చఱువగాన్ = పందెములు వేసుకొనుటకు, కమకింతురు = ప్రయత్నించుచుందురు. (అలం– భ్రాంతిమత్)

తా. ఓ స్త్రీరత్నమా! ఉప్పు సముద్రముచే చుట్టబడిన ఆ దీవికి జంబూవృక్షము ప్రకాశించు చిహ్నము. ఆ చెట్టు కొమ్మలను వ్రేలాడుచున్న గొప్ప ఫలములను చూచి సిద్ధదంపతులు అవి ఏనుగులని కాదని పందెములు వేసుకొనుటకు ప్రయత్నించుచుందురు.

80 **వ. కంబుకంఠి! జగదలంకారంబగు జాంబూనదంబు తనకు జంబాల జాలంబుగా జాంబవద్రవంబు సుధామధురాంబుపూరంబుగా జంబూసరిత్ప్రవాహంబు జంబూద్వీపంబునందుఁ బ్రవహించు. ఈ ద్వీపంబున నంతరాంతరంబుల నెంతయుం బ్రసిద్ధులగు వసుధాకాంతులు నిన్నంతరంబులం గోరి వీరె సభాభ్యంతరంబున నున్నవారు. విమత యౌవత మౌళి వతంస తమాలమాలికోర్మీలన్నీలతమతమః ప్రకర తస్కర భాస్కరులగు వీరియం దొక్కరునియందు నీ డెందంబు కందళితానందంబయ్యేనేని, వానిఁ జూపుము. ఆ భూపాలకుని కులబలాచార శూరతా వివేక వైభవంబు లభివర్ణించెద ననిన నబ్బాల శాలీనతా వశంవదయై వదనారవిందంబు వంచి యూరకుండె. అట్లున్నం గాంచి విరించి పట్టపుదేవి బుజ్జగించి యా లజ్జావతికి నుజ్జయినీ వల్లభుం జూపి యిట్లనియె.**

తా. శంఖమువంటి కంఠముకలదానా! లోకాలకు అలంకారమైన బంగారము తనకు బురద సమూహముకాగా, నేరేడు రసము అమృతమువలె తియ్యని నీరుకాగా, జంబూ నదీప్రవాహము ఈ జంబూద్వీపమునందు ప్రవహించుండగా, ఈ ద్వీపమునందు అన్నిచోట్లను మిక్కిలి ప్రసిద్ధులగు రాజులు నిన్ను మనసులలో కోరి ఇరుగో ఈ సభామధ్యమున ఉన్నారు. శత్రువుల స్త్రీల శిరస్సులయందు అలంకారములుగా నుంచుకొనబడిన తమాలపుష్పమాలలనెడి మిక్కిలి నల్లని చీకట్ల సమూహమును నశింపజేసెడి సూర్యులగు వీరియందు ఒక్కనియందు నీ మనస్సు ఆనందము మొలకెత్తినదైనచో, వానిని చూపుము. ఆ రాజుయొక్క వంశమును, బలమును, శీలమును, పరాక్రమమును, బుద్ధియొక్కయు సంపదలను, అభివర్ణించెదను. అనిన, ఆ బాల లజ్జావశురాలయి ముఖపద్మమును వంచి ఊరకుండెను. అట్లున్న చూచి బ్రహ్మదేవునిభార్యయైన సరస్వతీదేవి లాలించి యా సిగ్గుపడుచున్న దమయంతికి ఉజ్జయినీ రాజును చూపి ఇట్లు పలికెను.

81 **తే. సవిధ లీలావనీస్థాయి శంభుమౌళి**
**చంద్రికాధౌత కలధౌత సౌధజాల**

**యుజ్జయిని రాజధాని యో యుత్పలాక్షి!**
**భావ సంభవ నిభున కీ భూవిభునకు**

ఓ ఉత్పలాక్షి = ఓ కలువనేత్రీ!, భావసంభవ నిభునకు = మన్మథునకు సమానమైన, ఈ భూవిభునకున్ = ఈ రాజునకు, సవిధ = సమీపమందున్న, లీలావనీ = ఉద్యానవనమునందు, స్థాయి = నివసించియున్న, శంభు = శంకరునియొక్క, మౌళి = కిరీటమందున్న చంద్రునియొక్క, చంద్రికా ధౌత = వెన్నెలచే శుభ్రపఱచబడిన, కలధౌత = బంగారుమయమైన, సౌధ జాల = మేడలసమూహముగల, ఉజ్జయినీ = ఉజ్జయినీ నగరము, రాజధాని

తా. ఓ కలువనేత్రీ! మన్మథునితో సమానుడైన ఈ రాజునకు సమీపమునందున్న ఉద్యానవనమునందు నివసించుచున్న శంకరునియొక్క కిరీటమందలి చంద్రునియొక్క వెన్నెలచే శుభ్రపరచబడిన బంగారుమయమైన మేడలసమూహముగల ఉజ్జయినీ నగరము రాజధాని.

**82 ఉ. తామరసాక్షి! శంకరుడు తత్పురి నాత్మ కిరీట చంద్రరే**
**ఖామృతవృష్టి మన్మథ నవాంకురముల్ సృజియించుఁ గామినీ**
**కాముక భావ సీమముల కందువపట్లను నిట్టి వాఁడటే**
**యేమిటికిన్ దహించె నిటలేక్షణ వహ్నిఁ దదీయ దేహమున్**

తామరసాక్షి = పద్మనేత్రీ!, శంకరుడు, తత్పురిన్ = ఆ పట్టణమున, ఆత్మ = తనయొక్క, కిరీట = కిరీటమందలి, చంద్రరేఖా = చంద్రరేఖయొక్క, అమృతవృష్టి = అమృతవర్షముచే, కామినీ కాముక = యవతీ యువక జనముయొక్క, భావ సీమముల = అంతరంగప్రదేశములనెడి, కందువపట్లను = సంకేత స్థలములందు, మన్మథ నవాంకురముల్ = మన్మథుని క్రొత్త మొలకలను, సృజియించున్ = పుట్టించుచుందును. ఇట్టివాడటే = ఇటువంటివాడా !, నిటలేక్షణ వహ్నిన్ = తన ఫాలనేత్ర అగ్నిచే, తదీయ దేహమున్ = ఆ మన్మథుని శరీరమును, ఏమిటికిన్ దహించె = ఎందులకు దహనము చేసెను?

తా. పద్మనేత్రీ! శంకరుడు ఆ పట్టణమున తన కిరీటమందలి చంద్రరేఖయొక్క అమృతవర్షముచే యువతీ యువకుల మనసులనెడి సంకేతస్థలములందు మన్మథుని క్రొత్త మొలకలను పుట్టించుచుందును. ఇటువంటివాడు తన ఫాలనేత్రాగ్నిచే ఆ మన్మథుని శరీరమును ఎందులకు దహనము చేసెను?

**83 తే. వెలఁది వీఁడేలు నుజ్జని వీటియందు**
**వెఱతు రలుగంగ సతు లాత్మవిభులతోడ**
**బాహ్యవనవీథికాస్థాయి భర్గమౌళి**
**బాల హరిణాంక కోమల ప్రభల యాజ్ఞ**

వెలది, వీడు = ఈ రాజు, ఏలున్ = పరిపాలించు, ఉజ్జని వీటియందు = ఉజ్జయినీ నగరమందు, బాహ్య = బయటనున్న, వనవీథికా = ఉద్యానవనమందు, స్థాయి = ఉన్నట్టి, భర్గ = శంకరునియొక్క, మౌళి = శిరసునందున్న, బాల హరిణాంక = లేత చంద్రునియొక్క, కోమల = నూతనములైన, ప్రభల ఆజ్ఞ = కాంతుల ఆనతిచే, సతులు = స్త్రీలు, ఆత్మ విభులతోడన్ = తమ భర్తలతో, అలుగంగన్ = కోపమువహించుటకు, వెఱతురు = భయపడుదురు.

తా. ఓ కాంతా! ఈ రాజు పాలించు ఉజ్జయినీ నగరమందు బయటనున్న ఉద్యానవనమందున్న శంకరునియొక్క శిరసునందలి చంద్రునియొక్క నూతనములైన కాంతుల ప్రభావముచే స్త్రీలు తమ భర్తలతో కోపము వహించుటకు భయపడుదురు.

**84 ఉ. యాచకకోటి యీతని యుదారత పేర్మి సమృద్ధినొంది యా**
**చ్ఞాచరణంబు వీడ్కొనిన యాత్మల ముచ్చటఁ బొంద దేవతా**
**నైచికియున్ సురద్రుమము నైజగుణ వ్యసనంబులం బయ**
**స్సేచన లీలఁ బల్లవ భుజిక్రియఁ దీర్చు మిథః ప్రసంగతిన్**

ఈతని ఉదారత పేర్మిన్ = ఈతని దాతృత్వముయొక్క గొప్పతనముచేత, యాచకకోటి = యాచక సమూహము, సమృద్ధి నొంది = సంపదను పొంది, యాచ్ఞాచరణంబున్ = యాచకవృత్తిని, వీడ్కొనిన = విడచిపెట్టిన, ఆత్మలన్ = మనస్సులతో, ముచ్చటన్ పొందన్ = సంతుష్టిని పొందగా, దేవతా నైచికియున్ = కామధేనువును, సురద్రుమము = కల్పవృక్షమును, మిథఃప్రసంగతిన్ = సరస్పర సాంగత్యముచే, పయస్సేచనలీలన్ = తన పాలచే తడుపుటను, పల్లవభుజి క్రియన్ = చిగుళ్ళను భుజించుట కిచ్చుటను, నైజ = స్వాభావికమైన, గుణ = దానగుణమందలి, వ్యసనములన్ = కుతూహలములను, తీర్చున్ = తొలగించుకొనును,

తా. ఈతని దాతృత్వముయొక్క గొప్పతనమువలన యాచక సమూహము సంపదను పొంది యాచకవృత్తిని వదలి మనసులలో సంతుష్టిని పొందగా కామధేనువును, కల్పవృక్షమును పరస్పర సాంగత్యముచే తన పాలచే తడుపుటయును, తన చిగుళ్ళను భుజించుట కిచ్చుటను స్వాభావికమైన దానగుణమందలి కుతూహలములను తొలగించుకొనుచుండును. (కామధేనువు తన పాలచే కల్పవృక్షమును తడుపుచున్నది, కల్పవృక్షమును చిగుళ్ళను కామధేనువు తినుట కిచ్చుచున్నది)

**85 శా. క్షోణీనాథుఁ డితండు దానగుణ విస్ఫూర్తిం బ్రవర్తిల్లఁగా**
**మాణిక్యాచల మెట్లు గైకొనదొకో మా కద్భుతంబయ్యెఁ గ**
**ల్యాణీ! నిర్వ్యయ రత్న సంపదుదయోదగ్రత్వమున్ యాచక**
**శ్రేణీ వర్జన దుర్యశో నిబిడిత వ్రీడావనమ్రత్వమున్**

కల్యాణీ, ఇతండు = ఈ, క్షోణీనాథుండు = రాజు, దానగుణ విస్ఫూర్తిన్ = దాతృత్వ అతిశయముచే, ప్రవర్తిల్లగాన్ = ఒప్పుచుండగా, నిర్వ్యయ = వ్యయము లేకపోవుటచే, రత్నసంపత్ = రత్న సమృద్ధియొక్క, ఉదయ = పరివృద్ధిచేత, ఉదగ్రత్వమున్ = ఉన్నతమైన శిఖరములు కలిగియుండుటను, యాచక శ్రేణీ = యాచకుల పంక్తియొక్క, వర్జన = లేక పోవుటవలన కలిగిన, దుర్యశః = అపకీర్తిచేత, నిబిడిత = దట్టముగా కావింపబడిన, వ్రీడావనమ్రత్వమున్ = సిగ్గుచే వంగియుండుటను, మాణిక్యాచలము = రోహణ పర్వతము, ఏల కైకొనదొకో = ఏల పొందకున్నదో, మాకున్, అద్భుతంబయ్యెన్ = ఆశ్చర్యమును కలిగించెను. (అలంకారము – అతిశయోక్తి)

తా. ఓ దమయంతీ! ఈ రాజు దానగుణ అతిశయముచే ప్రవర్తించుచుండగా రోహణ పర్వతము వ్యయము లేకపోవుటచే రత్న సమృద్ధిచేత ఉన్నతమైన శిఖరములు కలిగియుండుచున్నది. యాచకులు లేకపోవుటచే కలిగిన అపకీర్తిచేత సిగ్గుతో వంగియుండుటను ఏల పొందకున్నదో మాకు ఆశ్చర్యమును కలిగించుచున్నది.

**86 వ. దమయంతి! దాంతి శాంత్యాదిగుణ సంతానములకు విశ్రాంతి ధామంబైన యీ యవంతిపతి యందు నీ యంతరంగం బనురాగవంత మయ్యేనేని శిప్రానదీ సలిల కేళియు మహాకాళస్థిత వృషభధ్వజ భజనంబును, విశాల నగరీ సౌధ సిహాసనాధిరోహణంబును నీకు సంభవింపఁగలయది యని పలికి పలుకుందొయ్యలి యూరకుండె. కుండినావని పురందర ప్రియనందనయును దూష్ణీంభావంబున నవ్విశ్వంభరాభర్తమీఁదఁ గటాక్ష వీక్షణం బావర్తింపదయ్యె నప్పుడు**

తా. దమయంతీ!, ఇంద్రియ నిగ్రహము, ఓర్పు, మొదలైన గుణసమూహములకు క్రీడాభవనమైన ఈ అవంతీశ్వరుని యందు నీ మనస్సు ప్రేమకలదియైనచో శిప్రానదీజలవిహారము సలుపుటయును, మహాకాళ పుణ్యక్షేత్ర శంకరుని సేవయును, విశాలపుర మేడయందలి రాజపీఠిక నదిష్ఠించుటయును నీకు లభింపగలదు అని పలికి సరస్వతి ఊరకుండెను. దమయంతియును మౌనముగా ఆ రాజుపైన కరుణచూపకున్న అప్పుడు

**87 తే. మాళవాధీశ మకుటాగ్ర మణులయందు**
**భీమనందనరూపంబు బెరసి యునికిఁ**
**దద్విరక్తి పరీక్షించి తారు దార**
**యరిగి రవలకుఁ జతురంతయానధరులు**

మాళవాధీశ = మాళవరాజుయొక్క, మకుటాగ్ర = కిరీటమందలి, మణులయందున్ = రత్నములయందు, భీమనందన రూపంబు = దమయంతి రూపము, బెరసి = పొంది, ఉనికిన్ = ఉండుటచే, తద్విరక్తిన్ = ఆమె విరాగమును, పరీక్షించి = తెలుసుకొని, తారు తార = తమకు తామే, చతురంతయాన ధరులు = పల్లకినిమోయువారు, అవలకున్ = మరొక చోటుకు, అరిగిరి = వెళ్ళిరి.

తా. మాళవరాజుయొక్క కిరీటమందలి రత్నములయందు దమయంతి రూపమును పొందియుండుటచే ఆమె విరక్తిని తెలుసుకొని పల్లకినిమోయువారు తమకు తామే మరొకచోటునకు వెళ్ళిరి.

**88 తే. గోతి గాంగేయపీత వక్షోజకుంభ**
**యభ్రవాహినియనుబోలె నరుగుదెంచె**
**యానధరవర్గ సగరపౌత్రానువృత్తి**
**భూవరాంతరమను మర్త్య భువనమునకు**

గాంగేయ = బంగారమువలె, పీత = పచ్చని, వక్షోజకుంభ = స్తనకలశములుకల, గోతి = దమయంతి, గాంగేయ = కుమారస్వామిచేతను, భీష్మునిచేతను, పీత = పానముచేయబడిన, వక్షోజకుంభ = స్తనకుంభములుకల, అభ్రవాహినియు పోలె = గంగానదివలెనే, యానధర = వాహకులయొక్క, వర్గ = సమూహమనెడి, సగరపౌత్ర = భగీరథుని, అనువృత్తిన్ = అనుసరించి, భూవరాంతరమను = వేరొక రాజును, మర్త్య భువనమునకు = భూలోకమునకు, అరుగుదెంచె = వచ్చెను.

తా. బంగారమువలె పచ్చని స్తనకలశములుకల దమయంతి కుమారస్వామిచేతను, భీష్మునిచేతను పానముచేయబడిన స్తనకుంభములుకల గంగాదేవివలెనే వాహకులయొక్క సమూహమనెడి భగీరథుని అనుసరించి వేరొక రాజును భూలోకమునకు వచ్చెను.

**89 వ. అప్పుడు మత్స్య లాంఛన చాప రేఖా నీరాజిత భ్రూవిలాసయగు నా రాజకన్యకతోడ వాగ్దేవి యిట్లనియె.**

తా. అప్పుడు మన్మథునియొక్క వింటిచేత నీరాజనమీయబడుచున్న కనుబొమల కాంతిగల ఆ రాజకన్యతో సరస్వతి ఇట్లు పలికెను.

**90** **క. వ్రీడావతి! ఈ భూపతి**
**గౌడ బిడౌజుండు వీఁడు కమనీయరతి**
**క్రీడా రహస్య కోవిద**
**చూడామణి తెప్పలెత్తి చూడుము వీనిన్**

వ్రీడావతి = సిగ్గుగలదానా!, ఈ భూపతి, గౌడబిడౌజుండు = గౌడదేశానికి రాజు, వీడు, కమనీయ = మనోహరమైన, రతిక్రీడా = మన్మథక్రీడయందలి, రహస్య కోవిద = గుట్టులు తెలిసినవారిలో, చూడామణి = తలమానికమువంటివాడు, వీనిన్, తెప్పలు ఎత్తి, చూడుము.

తా. లజ్జావతీ! ఈ రాజు గౌడదేశాధిపతి. ఇతడు మనోహరమైన మన్మథక్రీడయందలి రహస్యముల నెఱిగినవారిలో శ్రేష్ఠుడు. వీనిని తెప్పలెత్తి చూడుము.

**91** **ఉ. పంకజనేత్ర! వీని పరిపాండుర కీర్తి భరంబుచేఁ గురం**
**గాంక రుచుల్ తృణీకృతములైనవి నిక్కువ మట్లుగాని నాఁ**
**డంకము డాసియున్నె యమృతాస్పదమైన తదంతరంబునన్**
**రంకు వసంకుచత్ప్రణయరక్తిఁ దదంకుర చర్వణార్థమై**

పంకజనేత్ర = పద్మనేత్రా!, వీని, పరిపాండుర కీర్తిభరంబుచేన్ = తెల్లని కీర్తిసముదాయముచే, కురంగాంకరుచుల్ = చంద్రుని కాంతులు, తృణీకృతములైనవి = తిరస్కరింపబడినవి, నిక్కువము = ఇది నిజము, అట్లుకాని నాడు = అలా కాని రోజున, రంకువు = లేడి, అమృతాస్పదమైన = అమృతమునకు చోటైన, తదంతరమున్ = ఆ చంద్రుని మధ్యయందు, అసంకుచత్ = సంశయములేని, ప్రణయరక్తిన్ = ప్రేమాసక్తిచే, తత్ = ఆ తృణములయొక్క, అంకుర = చిగుళ్ళను, చర్వణార్థమై = తినుటకొఱకు, అంకము = ఒడిని, డాసి = విడిచిపెట్టి, ఉన్నె = ఉండునా?

తా. పద్మనేత్రా! ఈ రాజు తెల్లని కీర్తిసముదాయముచే చంద్రుని కాంతులు గడ్డిపరకలుగా చేయబడినవి. ఇది నిజము. అలా కానినాడు లేడి అమృతమునకు చోటైన ఆ చంద్రుని మధ్యలో సంశయములేని ప్రేమాసక్తిచే ఆ తృణములయొక్క చిగుళ్ళను తినుటకు ఏల ఒడిని విడిచిపెట్టి యుండును?

**92** **తే. కువలయశ్యాముఁడైన యీ యవనివిభుని**
**యిఱియు కౌఁగిటిలో నుండు హేమగౌరి**
**కుసుమబాణాసనుని సేస కొప్పులోనఁ**
**దవిలి యొప్పారు సంపెంగదండవోలె**

హేమగౌరి = బంగారువర్ణముగల దమయంతి! కువలయ శ్యాముడైన = నల్లనిదేహముకలవాడైన, ఈ అవనివిభుని = ఈ రాజుయొక్క, ఇఱియు కౌగిటిలోన్ = బిగి కౌగిలిలో, కుసుమబాణాసనుని = మన్మథుని, సేస కొప్పులోనన్ = కేశపాశములో, తవిలి = తగుల్కొని, ఒప్పారు = ఒప్పునట్టి, సంపెంగ దండవోలె, ఉండు = ఉండుము.

తా. దమయంతీ! నల్లనిదేహముకలవాడైన ఈ రాజుయొక్క బిగి కౌగిలిలో మన్మథుని కేశపాశములో తగుల్కొని ఒప్పారు సంపెంగదండవలె నుండుము. (అలంకారము – ఉపమ)

**93** **చ. లలన! యితండు సమ్ముఖ మిళద్రిపు కుంజర కుంభ మౌక్తిక**
**చ్ఛలమున వైరిలక్ష్మి వలిచన్నులమీఁద నిజప్రతాప సం**
**కలన సముత్థితంబులగు ఘర్మకణంబులఁ బాయమీటు ని**
**ర్మల నిజశాత హేతి నఖరంబున నాజి విహారభూములన్**

లలన = ఓ దమయంతీ, ఇతండు, ఆజివిహారభూములన్ = యుద్ధమనెడి విహారభూములయందు, నిర్మల = స్వచ్ఛమైన, నిజ = తనయొక్క, శాత = వాడియైన, హేతి = కత్తియనెడి, నఖరంబునకున్ = గోటిచేతను, వైరిలక్ష్మి = శత్రువుల లక్ష్మియొక్క, వలి = చల్లని, చన్నులమీదన్, నిజ = తనయొక్క, ప్రతాప సంకలన = ప్రతాపముయొక్క సంసర్కముచే, సముత్థితంబులగు = పుట్టినవైన, ఘర్మకణంబులన్ = చెమట బిందువులను, సమ్ముఖ మిళత్ = ఎదురుగా కలిసిన, రిపు కుంజర = శత్రుగజములయొక్క, కుంభ = కుంభస్థలములందున్న, మౌక్తిక = ముత్యములనెడి, ఛలమున = మిషచేత, పాయన్ మీటున్ = తొలగించును. (అలంకారము – అపహ్నుతి, రూపకము, ఉత్ప్రేక్ష)

తా. ఓ దమయంతీ! ఈ రాజు యుద్ధవిహారభూములయందు తన వాడి కత్తి అనే గోటితో శత్రులక్ష్మి చన్నులమీద తన ప్రతాప సంపర్కముచే పుట్టిన చెమటబిందువులను శత్రురాజుల ఏనుగుల కుంభస్థలములందున్న ముత్యములనెడి మిషచేత తొలగించును.

**94** **తే. అతివ! యాజాను దీర్ఘ బాహా ప్రతాప**
**సమధిగత దిగ్విభాగు డీ జనవిభుండు**

**సప్తతంతు యశఃపట వ్యాప్త నిఖిల**
**భువనుఁ డీతని చరిత మద్భుతకరంబు**

అతివ, ఈ జనవిభుండు, ఆజాను = జానువులవరకు, దీర్ఘ = పొడుగైన, బాహా = బాహువులవలనపుట్టిన, ప్రతాప = పరాక్రమముచే, సమధిగత = పొందబడిన, దిగ్విభాగుడు = దిక్కుల భాగములుకలవాడు, మఱియు, సప్తతంతు = యజ్ఞములు చేయుటవలన కలిగిన, యశః = కీర్తియనెడి, పట = వస్త్రముచే, వ్యాప్త = కప్పబడిన, నిఖిల = సమస్తములైన, భువనుడు = లోకములుకలవాడు. ఈతని చరితము = ఈతని చరిత్ర, అద్భుతకరంబు = ఆశ్చర్యముకలిగించునది.

తా. ఓ అతివా! ఈ రాజు ఆజానుబాహు పరాక్రమముచే పొందబడిన దిగ్భాగములుకలవాడు. మఱియు యజ్ఞములు చేయుటవలన కలిగిన కీర్తియనే వస్త్రముచే కప్పబడిన సమస్తములైన లోకములు కలవాడు. ఈతని చరిత్రము ఆశ్చర్యము కలిగించునది.

**95 వ. అనిన విని యయ్యరవిందాస్య యౌదాస్య సంవిద వలంబిత శూన్య ముద్రా ముద్రితంబైన చూపునం జూచి యా భూపాలునిం బ్రతిషేధించె. ఆకన్నెతింగి ద్రుహిణ గృహిణి విమానవాహవ్యూహంబునకుఁ గనుసన్న జేసి వేఱొక్కరునిం జేరంబోవ నియమించి యా రాజన్యుం జూపి విదర్భరాజకన్యక కిట్లనియె**

తా. అనగా విని యా పద్మముఖి ఉపేక్షతో కూడిన బుద్ధిచేత తెలియబడుచున్న అయిష్టతతోకూడిన చూపుచేత ఆ రాజును తిరస్కరించెను. ఆ చూపుజాడ తెలుసుకొని సరస్వతి పల్లకి వాహకులను సైగచేసి వేరొక్క రాజు చెంతకు చేరుటకు ఆజ్ఞాపించి, ఆ రాజును చూపి దమయంతికి ఇట్లు పలికెను.

**96 సీ. తెఱవ! ప్రత్యర్థి పార్థివ సార్థ పాథోధి**
**సమ్మాథ మంథర క్ష్మాధరంబు**
**పృథుఁడను నృపతి యీ పృథ్వీశ్వరుండేలు**
**మథుర నాకము జంభమథను పగిది**
**నశ్మశ్రువైన యీయన ముఖాబ్జంబుతో**
**నంకకర్బురుఁడైన యమృతకరుఁడు**
**సరివోవఁ జాలఁడు చారుకాంతి స్ఫూర్తి**
**నటు సూడు మితని బాహారణులును**
**తే. వైరిధరణీశ మశక సంహారమునకు**
**శాత్రవ కళత్ర నేత్రాంబు జన్మమునకుఁ**
**గారణంబైన ధూమరేఖయును బోని**
**ఘన శరాసన గుణ కిణాంకము ధరించు**

తెఱవ = కాంతా!, ప్రత్యర్థి పార్థివ = శత్రురాజులయొక్క, సార్థ = సమూహమనెడి, పాథోధి = సముద్రమును, సమ్మాథ = మథించుటయందు, మంథరక్ష్మాధరంబు = మంథర పర్వతమువంటివాడు, ఈ పృథ్వీశ్వరుండు = ఈ రాజు, పృథుడను నృపతి = పృథుడనబడే రాజు, మథురన్ = మథురను, నాకమున్ = స్వర్గమును, జంభమథను పగిది = ఇంద్రునివలె. ఏలు = పాలించును. అంకకర్బురుడైన = మచ్చచే చిహ్నితుడైన, అమృతకరుడు = చంద్రుడు, చారుకాంతి స్ఫూర్తిన్ = మనోహరమైన కాంతి సంపదచే, అశ్మశ్రువు = గడ్డము, మీసములేని, ఈయన, ముఖాబ్జంబుతోన్ = ముఖపద్మముతో, సరివోవన్ చాలడు = సాటిరాడు. అటుచూడు = అటువైపు చూడుము, ఇతని బాహారణులును = ఇతని బాహువులనెడి నిప్పుకట్టెలు, వైరిధరణీశ = శత్రురాజులనెడి, మశక = దోమలయొక్క, సంహారమునకు = నాశనమునకు, శాత్రవ కళత్ర = శత్రురాజుల భార్యల మొక్క, నేత్రాంబు = కన్నీటియొక్క, జన్మమునకున్ = ఉత్పత్తికిని, కారణంబైన, ధూమరేఖయుబోని = పొగపంక్తిని పోలిన, ఘన = గొప్పదైన, శరాసన = ధనుస్సుయొక్క, గుణ = నారివలన కలిగిన, కిణాంకము = మచ్చను, ధరించున్
(అలంకారము – వ్యతిరేకము)

తా. కాంతా! శత్రురాజులనెడి సముద్రమును మథించుటయందు మంథరపర్వతమువంటివాడగు ఈ రాజు పృథుడను పేరు కలవాడు. ఇతడు మథురను స్వర్గమును ఇంద్రునివలె పరిపాలించును. మచ్చకల చంద్రుడు తన మనోహరమైన కాంతిసంపదచే ఈతని వెంట్రుకలులేని ముఖపద్మముతో సాటిరాడు. ఈతని భుజములనెడి నిప్పుకట్టలు శత్రురాజులనెడి దోమలను నాశనముచేయును. శత్రురాజుల భార్యలయొక్క కన్నీటికి కారణమైన పొగపంక్తినిపోలిన గొప్ప ధనుస్సుయొక్క నారివలన కలిగిన మచ్చను ధరించును.

**97 చ. అలికులవేణి! కాళియ మహాహ్రదమ న్కమనీయ నాభితో**
**జలనిధినేమి భామినికిఁ జక్కని మేచక రోమరాజి నా**
**నలిఁ బ్రవహించుచున్న యమునానది యందు నితండు నీవునుం**

**జలుపుదుగాక గ్రీష్మదివసంబులయందుఁ బయోవిహారముల్**

అలికులవేణి = తుమ్మెదలసమూహామువంటి జుట్టుకలదానా!, ఇతండు, నీవును, కాళియ మహాహ్రదమన్ = కాళియ మడుగను, కమనీయ నాభితోన్ = మనోహరమైన పొక్కిలితో, జలనిధి నేమి భామినికిన్ = భూమియనెడి స్త్రీకి, చక్కని = సుందరమైన, మేచక = నల్లని, రోమరాజి = నూగారు, నాన్ = అనునట్లుగా, నలిన్ = అందముగా, ప్రవహించుచున్న, యమునానదియందు, గ్రీష్మదివసంబులయందు, పయోవిహారముల్ = జలవిహారములను, చలుపుదురుగాక = చేయుదురుగాక.

తా. దమయంతీ! కాళియమడుగను మనోహరమైన పొక్కిలితో భూమియనెడి స్త్రీకి చక్కని నల్లని నూగారువలె అందముగా ప్రవహించుచున్న యమునానదియందు ఇతడును నీవును గ్రీష్మపు రోజులయందు జలవిహారములను చేయుదురుగాక.

**98** **క. గోవర్ధనాద్రి తటములఁ**
**బ్రావృట్కాలముల విపిన బర్హిణ నటన**
**ప్రావీణ్యము వీక్షింపుం**
**డీవును నీతండు వేడ్క లింపెసలారన్**

ఈవును = నీవును, ఈతండు, వేడ్కలు ఇంపెసలారన్ = కోరికలు అతిశయించునట్లుగా, గోవర్ధనాద్రి తటములన్, ప్రావృట్కాలములన్ = వర్షాకాలములందు, విపిన బర్హిణ = వన మయూరములయొక్క, నటన ప్రావీణ్యము, వీక్షింపుండు = చూడుడు.

తా. దమయంతీ! నీవును ఇతడును కోరికలు అతిశయించునట్లుగా గోవర్ధన పర్వత చరియలయందు వర్షాకాలమునందు వన మయూరములయొక్క నటనా ప్రావీణ్యమును తిలకింపుడు.

**99** **ఉ. పూవుల భూరిసౌరభము పూని భరంపడి యేఁగుదెంచు బృం**
**దావన సంచరిష్ణుఁడు సదాగతి పాంథుఁడు దప్పి పెంపునన్**
**ద్రావఁగలండు బాలుని విధంబునఁ జిత్రక గంధసార పం**
**కావిలమైననుం గువలయాక్షి భవద్రతి ఘర్మతోయమున్**

కువలయాక్షి = కలువకన్నులదానా!, పూవుల భూరి సౌరభము, పూని = వహించి, భరంపడి = ఆ భారమును వహించుటచే శ్రమపడి, ఏగుదెంచు = వచ్చుచున్నట్టి, బృందావన, సంచరిష్ణుడు = సంచరించువాడగు, సదాగతి పాంథుడు = వాయువనెడి బాటసారి, దప్పి పెంపునన్ = దాహముయొక్క ఆధిక్యముచే, చిత్రక = బొట్టుయొక్క, గంధసారపంక = చందనపు బురదచేత, ఆవిలమైనన్ = కలుషితమైనప్పటికిని, భవత్ = నీయొక్క, రతి = సంభోగమందలి, ఘర్మ తోయమున్ = చెమట నీటిని, బాలుని విధంబునన్, త్రావగలండు.(అలంకారము – కావ్యలింగము, రూపకము, ఉపమ)

తా. కలువకన్నులదానా! పూలపరిమళము వహించి, ఆ భారమును వహించుటచే శ్రమపడి వచ్చుచున్న బృందావనంలో సంచరించువాడైన వాయువనెడి బాటసారి దాహముతో బొట్టుయొక్క గంధపు బురదచేత కలుషితమైనప్పటికిని నీయొక్క సంభోగమందలి చెమటనీటిని బాలుని విధంగా త్రాగగలదు.

**100** **క. పాటించి యితని వేఁడిన**
**చాటు కవీశ్వరుల హస్త జలజంబులకున్**
**హాటక దీనారములు వ**
**రాటక సంఘాతములు వరాటేంద్రసుతా!**

వరాటేంద్రసుతా = వరాటరాజకుమారీ!, పాటించి = పూనుకొని, ఇతనిన్ = ఈ రాజును, వేడిన = యాచించిన, చాటు కవీశ్వరుల = చాటు కవిచంద్రులయొక్క, హస్త జలజంబులకున్ = హస్త పద్మములకు, హాటక దీనారములు = బంగారు నాణెములు, వరాటక సంఘాతములు = తామర దుద్దుల సమూహాములు (అలంకారము – రూపకము)

తా. వరాటరాజకుమారీ! పూనుకొని ఈ రాజును వేడుకొనిన చాటుకవీశ్వరుల హస్తపద్మములకు బంగారు నాణెములు తామరదుద్దుల సమూహములై చెలంగును.

**101** **తే. అనిన వినియును వ్రాల్చెఁ బక్ష్మాంచలములు**
**బాల తద్భావ మెఱిగి వాగ్భామ యపుడు**
**మఱియు నొక మానవేంద్రు సమక్షమునకు**
**నిందుబింబాస్యఁ దోడ్తెచ్చి యిట్టులనియె**

అనినన్ = అని పలుకగానే, వినియును = వినినదైనను, బాల = దమయంతి, పక్ష్మాంచలములు = కనురెప్పలకొనలు, వ్రాల్చెన్ = మూసెను, తత్ భావము = ఆమెమనసును, ఎఱిగి = తెలుసుకొని, వాగ్భామ = సరస్వతి, అపుడు, మఱియు నొక మానవేంద్రు సమక్షమునకు, ఇందుబింబాస్యన్ = చంద్రముఖిని, తోడ్తెచ్చి = తీసుకొనివచ్చి, ఇట్టులు అనియె

తా. సరస్వతి అట్లు పలుకగానే దమయంతి వినినదైనను కనురెప్పలను మూసివైచెను. ఆ భావమును తెలుసుకొని

సరస్వతి అపుడు ఆమెను మరియొక రాజు ముందుకు తీసుకొనివచ్చి ఇట్లు పలికెను.

102 **వ. మత్తకాశిని! యితండు కాశిరాజు. ఇతని రాజధాని ముక్తిక్షేత్రంబగు వారణాసి. ఇతని కులదైవతం బఖిలభువస్థుండగు ధూర్జటి. ఇతని విహారదీర్ఘిక త్రిలోకసంతాపనిర్వాపణియగు గీర్వాణతటిని. ఇతని సత్రశాల విశాలాక్షీ కేళీ భవనంబు. ఇతని భుజాస్తంభ దంభోళి రిపు నృపాల బాలా నయనాంబువృష్టి ధారా సమేతంబు.**

తా. ఓ దమయంతీ! ఇతడు కాశిరాజు. ఇతని రాజధాని ముక్తిక్షేత్రమైన వారణాసి. ఇతని కులదైవతము సమస్త లోకములందుండు పరమశివుడు. ఇతని క్రీడాసరస్సు ముల్లోకముల పాపములను పోగొట్టెడి గంగానది. ఇతని భోజన శాల విశాలాక్షి క్రీడాభవనము. ఇతని భుజాస్తంభమనెడి వజ్రాయుధము శత్రురాజుల స్త్రీలయొక్క కన్నీరనెడి వర్షధారాలతో కూడినది.

103 **చ. సకియ! యితండు నీ వలుఁద చన్నుల క్రేవల నొత్తుఁగాతఁ గిం**
**శుక ముకుళాభిరామతలు సుంకము పట్టు నఖాంకురాంకముల్**
**ప్రకుపిత శాంకరీ చరణ పంకజ కుంకుమ పంక సంకర**
**ప్రకట నిరంక శంకర కపర్ద శశాంక క ళాంకకారముల్**

సకియ = చెలీ!, ఇతండు = ఈ కాశీరాజు, ప్రకుపిత = మిక్కిలి కోపముచెందిన, శాంకరీ = పార్వతీదేవియొక్క, చరణ పంకజ = పాదపద్మములందలి, కుంకుమ పంక = కుంకుమ బురదచే, సంకర = కలిసియున్న, ప్రకట = ప్రసిద్ధమైన, నిరంక = మచ్చలేని, శంకర కపర్ద శశాంక కళా = ఈశ్వరుని శిఖయందలి చంద్రరేఖతో, అంకకారముల్ = ద్వంద్వ యుద్ధమును చేయుచున్నవి. కింశుక ముకుళ అభిరామతలు = మోదుగుమొగ్గలయొక్క మనోజ్ఞతలను, సుంకము పట్టు = పన్నుగా గొనెడు, నఖాంకుర = గోటికొనలయొక్క, అంకముల్ = చిహ్నములను, నీ వలుద చన్నుల క్రేవలన్ = గొప్పవైన నీ కుచములప్రక్క, ఒత్తున్ కాక = గ్రుచ్చునుగాక. (అలంకారము – ఉపమ)

తా. చెలీ! ఈ కాశీరాజు కోపించిన పార్వతీదేవియొక్క పాదపద్మములందలి కుంకుమతో కలిసియున్న ప్రసిద్ధమైన మచ్చలేని శివుని జటాజూటమందలి చంద్రరేఖకు సాటివచ్చుచు మోదుగు మొగ్గవలె మనోహరమైన గోటికొనలతో నఖక్షతములను నీ కుచముల ప్రక్క గ్రుచ్చునుగాక.

104 **తే. అతివ! సంగ్రామ రంగ సంగత విరోధి**
**నృప శిరోధిశిరాకాండ నివహఖండి**
**చండ భుజదండ మండిత మండలాగ్ర**
**జాగ్రదుగ్ర ప్రతాపుఁ డీ జనవిభుండు**

అతివ = ఓ బాలా, ఈ జనవిభుండు = ఈ రాజు, సంగ్రామరంగ = యుద్ధరంగమందు, సంగత = ఎదుటపడిన, విరోధి నృప = శత్రురాజులయొక్క, శిరోధి శిరాకాండ = గొంతుక్రోవికాడలయొక్క, నివహ = సమూహమును, ఖండి = ఖండించుట యందు, చండ = భయంకరమైన, భుజదండ = బాహుదండమునందు, మండిత = ఒప్పుచున్న, మండలాగ్ర = కత్తియందు, జాగ్రత్ = ప్రకాశించుచున్న, ఉగ్ర = భీకరమైన, ప్రతాపుడు = ప్రతాపముకలవాడు.

తా. ఓ బాలా! ఈ రాజు యుద్ధరంగమందు ఎదుటపడిన శత్రురాజులయొక్క కంఠనాళములను ఖండించుటయందు భయంకరమైన బాహుదండమునందు ఒప్పుచున్న కత్తిచే ప్రకాశించుచున్న భీకరమైన ప్రతాపముకలవాడు.

105 **క. దశశత దృగర్వగర్వ**
**ప్రశమన హేలా ధురీణ పటువేగ నిరం**
**కుశ సైన్య తురగ రింఖా**
**విశకలిత దిగంత ధరణి వీఁడు లతాంగీ!**

లతాంగీ, వీడు = ఈ కాశీరాజు, దశశతదృక్ = వేయికన్నులుకల ఇంద్రునియొక్క, అర్వ = గుఱ్ఱముయొక్క(ఉచ్చైశ్రవము), గర్వ = గర్వమును, ప్రశమన = తగ్గించుటయనెడి, హేలా = విలాసముయొక్క, ధురీణ = భారమువహించిన, పటు = సమర్థమైన, వేగ = వేగముకలవి. నిరంకుశ = అడ్డులేని, సైన్య తురగ = సేనలోని గుఱ్ఱములయొక్క, రింఖా = డెక్కలచేత, విశకలిత = చూర్ణముగా చేయబడిన, దిగంత ధరణి = దిగంత భూమండలముకలవాడు.

తా. లతాంగీ! ఈ కాశీరాజు ఇంద్రుని గుఱ్ఱము గర్వమును తగ్గించుటయనెడి విలాస భారమును వహించిన సమర్థమైన వేగముకల అడ్డులేని సైన్యమందలి గుఱ్ఱములయొక్క డెక్కలచే చూర్ణముచేయబడిన దిగంతభూమండలము కలవాడు.

106 **వ. అని వర్ణించుచుండ దమయంతికి నిజమహోత్సవాగతానేక లోకశోభావలోకన కుతూహలంబునం పరాకు వహించియుండె. అవ్విధం బక్కాశిరాజునకుం గ్లేశావహంబయ్యె. సరస్వతీదేవియు వేఱొక్క నరదేవోత్తముం జూపి యిట్లనియె.**

తా. అని వర్ణించుచుండగా దమయంతి తన స్వయంవర ఉత్సవమునకు వచ్చిన అనేక జనులయొక్క సొగసును చూచుటయందలి కుతూహలముతో పరాకుగా ఉండెను. ఆ పద్ధతి కాశీరాజునకు కష్టమును కలిగించెను. సరస్వతీదేవియును మరొక రాజును చూపి ఇట్లు పలికెను.

107 **తే. ఈ నృపాలుఁ డయోధ్యా పురీశ్వరుండు**
**పేరు ఋతుపర్ణుఁ డాకర్ణచారునయన!**
**వీని వరియింపు సముదీర్ణ విధసువర్ణ**
**కేతకీగర్భ పర్ణాతి పీతవర్ణు**

ఆకర్ణచారునయన = చెవులవరకు వ్యాపించిన నేత్రములుకలదానా!, ఈ నృపాలుడు, అయోధ్యాపురీశ్వరుండు, పేరు, ఋతుపర్ణుడు, సముదీర్ణ విధ = ఎక్కువవన్నెకల, సువర్ణ కేతకీ = బంగారు మొగలిపూవుయొక్క, గర్భపర్ణ = గర్భ దళములకంటె, అతి పీతవర్ణు = మిక్కిలి పచ్చని దేహచ్ఛాయకలవానిని, వీనిన్, వరియింపు

తా. విశాలమైన నేత్రములు కలదానా! ఈ రాజు అయోధ్యకు పాలకుడు. పేరు ఋతుపర్ణుడు. ఎక్కువ వన్నెకల బంగరు మొగలిపూవుయొక్క లోపలి రేకులకంటె మిక్కిలి పచ్చని దేహచ్ఛాయకల వీనిని వరింపుము.

108 **ఉ. వారి విహారవేళఁ జెలువా! చెలువారెడి నీ చనుంగవన్**
**సారపుఁ దారహారముల చందముఁ గైకొనుఁ గావుతం జమ**
**త్కారము క్రొత్తయై మెఱయఁ దత్తటసీమ పరిత్రుటత్సదా**
**సారవ సారవోర్మిభవ సార వరాంబు పృషత్కదంబముల్**

చెలువా = ఓ అందమైనదానా! వారి విహారవేళన్ = జలవిహారసమయమందు, చెలువారెడి = ఒప్పుచున్న, నీ చనుంగవన్ = నీ స్తనముల, తత్ తటసీమన్ = వాని ప్రాంతప్రదేశములందును, పరిత్రుటత్ = విరుగుచున్న, సదా = ఎల్లప్పుడును, సారవ = ధ్వనితోకూడిన, సారవ ఊర్మి = సరయూనది కెరటములవలన, భవ = పుట్టిన, సార = గొప్పవైన, వర = శ్రేష్ఠమైన, అంబు = నీటియొక్క, పృషత్కదంబముల్ = బిందు సమూహములు, చమత్కారము = అద్భుతరసము, క్రొత్తయై = నూతనమై, మెఱయన్ = ప్రకాశించునట్లుగా, సారపు తారహారములచందము = శ్రేష్ఠమైన ముత్యాలహారములరీతిని, కైకొను కావుతన్ = స్వీకరించుగాక. (అలంకారము - భ్రాంతిమంతము)

తా. చెలువా! జలవిహారసమయమందు నీ స్తనముల ప్రాంత ప్రదేశములందు ఎగిరిపడుచున్న ఎల్లప్పుడు ధ్వనితోకూడిన సరయూనది కెరటములవలన పుట్టిన గొప్పవైన, శ్రేష్ఠమైన నీటి బిందువుల అద్భుతరసము నూతనమై ప్రకాశించునట్లుగా శ్రేష్ఠమైన ముత్యాలహారమురీతిని స్వీకరించెదవుగాక.

109 **తే. ఇతని తాత భగీరథుం డతులమహిమ**
**నవనిఁ బ్రవహింపఁగాఁ జేసె నభ్రగంగ**
**నితఁడు త్రైలోక్యమునఁ బ్రవహింపఁజేసెఁ**
**గీరభాషిణి! వర ధర్మ కీర్తి గంగ**

ఇతని తాత = ఈ ఋతుపర్ణుని తాత, భగీరథుండు, అతులమహిమన్ = సాటిలేని సామర్థ్యముచే, అవనిన్ = భూమియందు, అభ్రగంగన్ = ఆకాశగంగను, ప్రవహింపగాన్ చేసెన్, కీరభాషిణి = చిలుకవంటి పలుకులుకలదానా!, ఇతడు = ఈ రాజు, వర = శ్రేష్ఠమైన, ధర్మ = ధర్మమువలన కలిగిన, కీర్తిగంగన్ = కీర్తియనెడి గంగానదిని, త్రైలోక్యమున = మూడు లోకములందును, ప్రవహింపన్ చేసెన్

తా. ఈ ఋతుపర్ణుని తాత భగీరథుడు సాటిలేని సామర్థ్యముచే ఆకాశగంగను భూమియందు ప్రవహింపచేసెను. కీరవాణీ! ఇతడు శ్రేష్ఠమైన, ధర్మమువలన కలిగిన కీర్తియనెడి గంగను ముల్లోకములయందును ప్రవహింపచేసెను.

110 **చ. కవి వచనంబు లీతని యగాధ యశః కలశాంబురాశిలో**
**లవములు వోలె డిందు విమలంబగు వీని గుణ ప్రతానముం**
**దివిరి దిగంత సంపుటతతిన్ బుధమండలి లెక్క వ్రాయఁ దా**
**నవము భజించువైరి నరనాథ యశఃఖటికా కలాపముల్**

ఈతని = ఈ రాజుయొక్క, అగాధ = లోతైన, యశః = కీర్తియనెడి, కలశాంబురాశిలోన్ = క్షీర సముద్రములో, కవి వచనంబులు = కవీశ్వరుల వాక్కులు, లవములు వోలెన్ = లేశములవలె, డిందున్ = నాశనమగును, విమలంబగు = నిర్మలమైన, వీని గుణప్రతానమున్ = వీని గుణసమూహమును, బుధమండలి = పండితసమూహము, తివిరి = పూనుకొని, దిగంత సంపుటతతిన్ = దిగంతములనెడి సంపుటములయందు, లెక్క వ్రాయన్ = లెక్కలు వ్రాయగా, వైరి నరనాథ = శత్రు రాజులయొక్క, యశఃఖటికా = కీర్తియనెడి గంటములయొక్క, కలాపముల్ = సమూహములు, తానవమున్ = కృశత్వమును, భజించున్ = పొందును.(అలంకారము - రూపకము)

తా. ఈ రాజుయొక్క అగాధమైన కీర్తియనెడి క్షీర సముద్రములో కవీశ్వరుల వాక్కులు లేశములవలె నాశనమగును. నిర్మలమైన వీని గుణసమూహమును పండిత సమూహము పూనుకొని దిగంతములనెడి సంపుటములయందు లెక్కలు వ్రాయగా శత్రురాజులయొక్క కీర్తియనెడి గంటములయొక్క సమూహములు కృశత్వమును పొందును.

**111** **శా. అంభోజానన! వీని నెట్లు నుతి సేయన్వచ్చు నేతత్తనూ**
**సంభూతంబగు రోమసంఘము మహా సత్వాంకురశ్రేణి య**
**స్తంభాటోప విజృంభమాణ రిపు దోస్స్తంభోరు కుంభీనసా**
**రంభ స్తంభన మంత్ర మీతని కఠోర క్ష్వేళ యాలంబునన్**

అంభోజానన = పద్మముఖీ!, వీనిన్ = ఈ రాజును, ఎట్లు, నుతి చేయన్ వచ్చు, ఏతత్ తనూ సంభూతంబగు = ఈ రాజు శరీరమునందు పుట్టినవగు, రోమసంఘము = రోమ సమూహము, మహత్ = గొప్పదైన, సత్వ = వీరరసముయొక్క, అంకుర శ్రేణి = మొలకల వరుస, ఆలంబునన్ = యుద్ధములో, ఈతని కఠోరక్ష్వేళ = ఈతని దుస్సహమైన సింహనాదము, అస్తంభ = ఉగ్రమైన, ఆటోప = అతిశయముచే, విజృంభమాణ = చెలరేగుచున్న, రిపు = శత్రువులయొక్క, దోస్స్తంభ = బాహు స్తంభములనెడి, ఉరు = గొప్పవైన, కుంభీనస = సర్పములయొక్క, ఆరంభ = సంచారమును, స్తంభన = నిర్బంధించుటయందు, మంత్రము = మంత్రమైనది.( అలంకారము = ఉత్ప్రేక్ష, కావ్యలింగము, రూపకము)

తా. పద్మముఖీ! ఈ రాజును నుతించుటకు శక్యముకాదు. ఈతని శరీరమునందు పుట్టిన రోమములు గొప్పదైన వీరరసముయొక్క మొలకలు. యుద్ధరంగమున ఈతని దుస్సహమైన సింహనాదము ఉగ్రమై చెలరేగుచున్న శత్రువుల బాహు స్తంభములనెడి గొప్ప సర్పములయొక్క సంచారమును స్తంభింపచేయు మంత్రము.

**112** **శా. గంభీర ప్రతిపక్షరా డపయశః కాళిందియున్ వీని దో**
**స్స్తంభోద్భూత యశోభ్రగంగయుననిన్ సంశ్లేషముం బొంద నా,**
**సంభేదంబున గ్రుంకి కాంచును మహాక్షత్త్రంబు రంభా పరీ**
**రంభానంద నికేత నందన విహార ప్రౌఢి విస్రంభముల్**

గంభీర = లోతైన, ప్రతిపక్షరాట్ = శత్రురాజులయొక్క, అపయశః = అపకీర్తియనెడి, కాళిందియున్ = యమునానదియును, వీని, దోస్స్తంభ = భుజస్తంభములవలన, ఉద్భూత = పుట్టిన, యశోభ్రగంగయున్ = కీర్తియనెడి గంగయును, సంశ్లేషమున్ పొందన్ = కలియగా. ఆ సంభేదంబునన్ = ఆ సంగమస్థలమందు, (గంగ, యమున సంగమస్థలం ప్రయాగ) మహా క్షేత్రంబు = గొప్ప క్షత్రియసమూహము, క్రుంకి = మునిగి (చచ్చి), రంభా పరీరంభ = రంభయొక్క కౌగిలివలన కలిగిన, ఆనంద = ఆనందమునకు, నికేత = స్థానమైన, నందన = నందనోద్యానమందు, విహార = విహరించుటయందలి, ప్రౌఢిన్ = దిట్టమైన, విస్రంభముల్ = నమ్మకములను, కాంచును = పొందును.

తా. లోతైన శత్రురాజులయొక్క అపకీర్తియనెడి యమునానదియును, ఈ రాజు భుజస్తంభములవలన పుట్టిన కీర్తి యనెడి గంగయును కలియగా ఆ సంగమస్థలమందు రాజ సమూహము మునిగి (చచ్చి) రంభ కౌగిలివలన కలిగిన ఆనందమునకు స్థానమైన నందనోద్యానవనమునదు విహరించుటయందలి విశ్వాసములను పొందుదురు.

**113** **శా. తాదృగ్దీర్ఘ విరించి వాసర కరత్వంబుం బ్రతిష్ఠించుచున్**
**యాదోధిం తన నీడ బాడబముగా నాకాశ సంవ్యాప్యరి**
**క్ష్మా దారి స్థిరకీర్తి తారకములన్మాయించు చేతత్ప్రతా**
**పాదిత్యుండు వెలుంగుఁ బద్మముఖి వాచాగోచర ప్రక్రియన్**

పద్మముఖి, ఏతత్ ప్రతాపాదిత్యుండు = ఇతని ప్రతాపమనెడి సూర్యుడు, తాదృక్ = అటువంటి, దీర్ఘ = పొడవైన, విరించి వాసర = బ్రహ్మయొక్క పగటిని, కరత్వంబున్ = చేయుటను, ప్రతిష్ఠించుచున్ = స్థాపించుచు, తన నీడ, యాదోధిన్ = సముద్రమందు, బాడబముగాన్ = బడబాగ్ని యగుచుండగా, ఆకాశ = ఆకాశమందు, సంవ్యాపి = వ్యాపించియున్న, అరిక్ష్మాదారి = శత్రురాజులయొక్క, స్థిర = శాశ్వతములైన, కీర్తితారకములన్ = కీర్తియనెడి నక్షత్రములను, మాయించుచున్ = నశింపచేయుచు, వాచామగోచర ప్రక్రియన్ = వాక్కుల నతిక్రమించిన రీతిచే, వెలుగున్ = ప్రకాశించుచుండును.

తా. పద్మముఖి! ఇతని ప్రతాపమనెడి సూర్యుడు దీర్ఘమైన బ్రహ్మయొక్క పగటిని చేయడాన్ని స్థాపించుచు తన నీడ సముద్రమందు బడబాగ్నియగుచుండగా ఆకాశమందు వ్యాపించియున్న శత్రురాజులయొక్క శాశ్వతమైన కీర్తి నక్షత్రములను నశింపచేయుచు వాక్కుల నతిక్రమించిన రీతిగా ప్రకాశించుచుండును.(అలంకారము – ఉత్ప్రేక్ష, రూపకము)

**114** **క. అన వినియు విననియ ట్ల**
**జ్జననాథ తనూజ యున్న చందము గని య**
**మ్మనువంశాగ్రణి యవలకుఁ**
**జన ననుమతిఁ జేసె నలువసతి వాహతతిన్**

అనన్ = అనగా, వినియు, విననియట్లు, ఆ జననాథ తనూజ = ఆ దమయంతి, ఉన్న చందము = ఉన్న విధమును, కని = చూచి, ఆ మనువంశాగ్రణి అవలకున్ = ఆ రాజేంద్రుని యవతలకు, వాహతతిన్ = వాహకులను, చనన్ = వెళ్ళుటకు, నలువసతి = సరస్వతి, అనుమతి చేసెన్ = ఆజ్ఞాపించెను.

తా. అని సరస్వతి తెలుపగా వినియును విననియట్లు ఆ దమయంతియున్న విధమును చూచి సరస్వతి వాహకులను ఆ రాజేంద్రుని యవతలకు వెళ్లమని ఆజ్ఞాపించెను.

**115 వ. ఇట్లనుమతించి**

**116 ఉ. అక్కడ నొక్క భూపతి ననంగుని కంటెను రూపసంపదన్**
**జక్కనివానిఁ జూపి సరసత్వముమై మధుర స్వరామృత**
**న్యక్కృత మత్తకోకిల సనాతని తామరచూలిదేవి యా**
**క్రక్కస జవ్వనింగరము గారవమొప్పఁగఁ జూచి యిట్లనున్**

అక్కడన్, అనంగుని కంటెను = మన్మథునికన్న, రూపసంసదన్, చక్కనివానిన్, ఒక్క భూపతిన్, చూపి, మధురస్వరామృత = ఇంపైన ధ్వనియనెడి అమృతముచేత, న్యక్కృత = తిరస్కరింపబడుచున్న, మత్త = మదించిన, కోకిల = కోకిలగలదియును, సనాతని = నాశనరహితురాలైనదియును, తామరచూలిదేవి = సరస్వతీదేవి, సరసత్వముమైన్ =సరసత్వముచే, ఆ క్రక్కస జవ్వనిన్ = ఆ కఠినురాలగు యౌవనవంతురాలిని, కరము = మిక్కిలి, గారవము ఒప్పగన్ = అనురాగమొప్పునట్లుగా, చూచి, ఇట్లనున్

తా. అక్కడ మన్మథునికంటెను సౌందర్యములో చక్కనివానిని ఒకానొక రాజును చూపి ఇంపైన ధ్వనిచే తిరస్కరింపబడు చున్న మదించిన కోకిలకలదియును, నాశరహితమైనదియును సరస్వతీదేవి సరసత్వముచే ఆ కఠినురాలగు దమయంతిని ప్రేమపూర్వకముగా చూచి ఇట్లు పలికెను.

**117 తే. పాండ్యభూపాలుఁ డీతండు పద్మనయన**
**యితని వీక్షింపు నిజ కటాక్షేక్షణముల**
**మానశాలిని శాలీనతానతమగు**
**నాననాంభోజ మెత్తుమీ యత్తరమున**

పద్మనయన, ఈతండు, పాండ్యభూపాలుడు, నిజ కటాక్షేక్షణములన్ = నీ క్రీగంటి చూపులచేత, యితని, వీక్షింపుము = చూడుము, మానశాలిని = మానవంతురాలా!, శాలీనతా నతమగు = సిగ్గుచే వంచబడినదగు, ఆనన అంభోజము = ముఖపద్మమును, అత్తరమునన్ = ఆత్రముతో, ఎత్తుమీ

తా. పద్మనయన! ఇతడు పాండ్యరాజు. నీ క్రీగంటిచూపులచేత ఇతనిని చూడుము. మానవంతురాలా! సిగ్గుచే వంచబడినదగు నీ ముఖపద్మమును ఆత్రముగా ఎత్తుము.

**118 ఉ. ఈ సకలావనీతలము నెక్కటిఁ దాన పరిభ్రమించి య**
**భ్యాస పరంపరాపరత నభ్రమున న్విహరింపఁ గోరియో**
**లాసిక కీర్తి విభ్రమకలాగరిమన్నటియించుచుండు నీ**
**రాసుతు వంశరత్నముఁ దిరంబుగఁ జెంది యమందలీలలన్**

లాసిక కీర్తి = కీర్తియనెడి దొమ్మరిది, ఎక్కటిన్ = అసహాయముగా, ఈ సకల అవనీతలము, తాన = తానేయై, పరిభ్రమించి = తిరిగి, అభ్యాస పరంపరాపరతన్ = ఎడతెగని అలవాటువలన, అభ్రమునన్ = ఆకాశమునందు, విహరింపన్, కోరియో = కోరియేమో, వంశరత్నమున్ = మేటి వెదురయిన (వంశమందు శ్రేష్ఠుడైన), ఈ రాసుతున్ = ఈ రాకుమారుని, తిరంబుగాన్ = గట్టిగా, చెంది = పట్టుకొని, విభ్రమకలాగరిమన్ = విహరించుకళయందలి అతిశయముచేత, అమందలీలలన్ = అతిశయించు ఆటలను, నటించున్ = నటించుచున్నది. (అలంకారము – రూపకము)

తా. కీర్తియనెడి దొమ్మరిది అసహాయముగా ఈ సమస్త భూమండలాన్ని తానేయై తిరిగి అభ్యాసమువలన ఆకాశమునందు విహరించాలనేమో ఈ రాకుమారుడనెడి మేటి వెదురును గట్టిగా పట్టుకొని విహరించే కళలో నేర్పుకలదగుటచే చక్కని ఆటలను నటించుచున్నది.

**119 తే. ఇతని రిపురాజరాజి యేఁటేఁటి వరుస**
**నడవులడవులు దప్పక యరిగి యరిగి**
**యరుగు బహుకాల శూన్యత నడవులైన**
**యాత్మ నగరంబులకు యదృచ్ఛానువర్తి**

ఇతని, రిపురాజరాజి = శత్రురాజులయొక్క సమూహము, ఏటేటి వరుసన్ = ప్రతి సంవత్సరమును, అడవులడవులు = ప్రతి అడవికి, అరిగి అరిగి = వెళ్ళివెళ్ళి, బహుకాల శూన్యతన్ = చిరకాలము ఎవ్వరును లేకపోవుటచే, అడవులైన = అడవులుగామారిన, ఆత్మనగరంబులకు = తమ పట్టణములకే, యదృచ్ఛానువర్తిన్ = స్వేచ్ఛాప్రవృత్తిచేత, అరుగున్ = పోవుచుండును. (అలంకారము – పర్యాయము)

తా. ఈ రాజుయొక్క శత్రుసమూహము ప్రతి సంవత్సరము ఒక్కొక్క అడవికి వెళ్ళివెళ్ళి చివరకు చిరకాలము ఎవ్వరును లేకపోవుటచే జనశూన్యమై అడవులుగా మారిన తమ పట్టణములకే స్వేచ్ఛాప్రవృత్తిచేత పోవుచుందురు.

**120 స్రగ్ధర. ఆలోకాలోక మేదిన్యమల మలయజోదార విస్ఫారకీర్తిన్**
**ఖేలాకూపారపా రఖిలజన వినుతాక్షీణ చాపప్రతాపున్**
**బాలా వీక్షింపు వీనిం బదయుగ యుగప త్పాతి భూపాతిభూయ**
**శ్చూదార త్నోడుపత్నీ సులభ పరిచ యాస్తోక నందన్నఖేందున్**

బాలా, ఆలోకాలోక = చక్రవాళపర్వత పర్యంతముకల, మేదినీ = భూకాంతకు, అమల = స్వచ్ఛమైన, మలయజ = మంచి గంధపు పూతయైనదియు, ఉదార = గొప్పదగునదియు, విస్ఫార = ప్రకాశించుచున్న, కీర్తిన్ = కీర్తికలవానిని, ఖేల = రమ్యమైనదియు, అకూపారపార = సముద్రపు ఆవలితీరమందున్న, అఖిలజన, వినుత = కొనియాడబడుచున్న, అక్షీణ = గొప్పదైన, చాప ప్రతాపున్ = వింటి శౌర్యముకలవానిని, పదయుగ = పాదద్వంద్వమందు, యుగపత్ = ఒక్కమారుగా, పాతి = పడుచున్న, భూప = రాజులయొక్క, అతిభూయః = మిక్కిలి తఱుచుగానున్న, చూడారత్న = శిరోమణులనెడి, ఉడుపత్నీ = తారకల భార్యలతోడ, సులభ పరిచయ, అస్తోక = మిక్కుటముగా, నందత్ = సంతసించుచున్న , నఖేందున్ = గోళ్ళనెడి చంద్రులుకలవానిని, వీనిన్, వీక్షింపుము = చూడుము.

తా. ఓ దమయంతీ! చక్రవాళ పర్వత పర్యంతముకల భూకాంతకు స్వచ్ఛమైన మంచిగంధపుపూతయైనదియు, గొప్పదైనదియు ప్రకాశించు కీర్తికలవానిని, రమ్యమైనదియు, సముద్రపు ఆవలితీరమందున్న సమస్త జనులచే కొనియాడ బడుచున్న గొప్పదైన వింటి శౌర్యముకలవానిని, పాదద్వంద్వమందు ఒక్కమారుగా పడుచున్న రాజులయొక్క దట్టమైన శిరోమణులనెడి తారకలభార్యలతో సులభమైన పరిచయమువల మిక్కుటముగా సంవర్ధితమైన గోళ్ళనెడి చంద్రులు కలవానిని ఈ రాజును చూడుము.

**121 శా. భంగా కీర్తిమషీ మలీమసతమ ప్రత్యర్థి పృథ్వీపతి**
**త్వంగ త్తిందుక కాననాంతరములన్ వర్తిల్లు నత్యుల్లస**
**ద్భంగి న్వీని ప్రతాపవహ్ని జగదుత్సంగంబునన్ దత్ స్ఫులిం**
**గాంగారంబులు భానుఁడున్ శిఖియు జంభారాతి దంభోళియున్**

వీని, ప్రతాపవహ్ని = శౌర్యాగ్ని, భంగ = ఓడిపోవుటచే, అకీర్తి = దుష్కీర్తియనెడి, మషీ = మసిచేత, మలీమసతమ = మిక్కిలి మలినీ భూతులైన, ప్రత్యర్థిపృథ్వీపతి = శత్రురాజులనెడి, త్వంగత్ = వణకుచున్న, తిందుక కాననాంతరములన్ = నల్ల తుమ్మచెట్ల మధ్యమందు, అత్యుల్లసత్ భంగిన్ = మిక్కిలి ప్రకాశించురీతిచే, వర్తిల్లున్ = ప్రవర్తించుచుండును, తత్ స్ఫులింగ అంగారంబులు = ఆ ప్రతాపముయొక్క అగ్నికణములు, జగత్ ఉత్సంగంబునన్ = జగత్తుయొక్క ఒడియందు, భానుడున్, శిఖియున్, జంభారాతి దంభోళియున్ = ఇంద్రుని వజ్రాయుధమునై ఉన్నవి. (అలంకారము – ఉత్ప్రేక్ష) తా. వీని శౌర్యాగ్ని ఓడిపోవుటచే దుష్కీర్తియనెడి మసిచేత మలినములైన శత్రురాజులనెడి వణకుచున్న నల్లతుమ్మ చెట్లమధ్య మిక్కిలి ప్రకాశించురీతిచే ప్రవర్తించుచుండును. ఆ ప్రతాపముయొక్క అగ్నికణములు జగత్తుయొక్క మధ్యయందు సూర్యుదును, అగ్నియును, ఇంద్రుని వజ్రాయుధమునై ఉన్నవి.

**122 శా. ఏణీలోచన! యేతదుగ్రసమర ప్రేక్షోపనమ్రామర**
**శ్రేణీ మధ్యచరుండు వైన్యుఁడు గిరిక్షేపార్థమై కైకొనుం**
**బాణిం జాపము వీని దంతిబలముల్ పైపై ననిన్ జంగమ**
**క్షోణీధ్రంబులువోలె ధాత్రియెడఁ గైకొంచుం విజృంభింపఁగన్**

ఏణీలోచన = ఆడులేడి నేత్రములవంటి నేత్రములుకలదానా!, వీని దంతిబలముల్ = ఈ రాజు గజసైన్యము, అనిన్ = యుద్ధమున, పైపైన్ = మీదుమీదుగా, జంగమ క్షోణీధ్రంబులవోలెన్ = నద కొండలవలె, ధాత్రియెడ = భూమియొక్క అవకాశమును, కైకొంచున్ = స్వీకరించుచు, విజృంభింపన్ = అతిశయింపగా, ఏతత్ = ఈ రాజుయొక్క, ఉగ్ర = భయంకరమైన, సమర = యుద్ధమును, ప్రేక్షా = చూచుటకు, ఉపనమ్ర = వచ్చిన, అమర శ్రేణీ = దేవతాపంక్తులయొక్క మధ్య, చరుండు = వర్తించుచున్నవాడగు, వైన్యుడు = పృథురాజు, గిరిక్షేపణార్థమై = పర్వతములను చిమ్ముటకు, పాణిన్ = చేతితో, చాపమున్ = వింటిని, కైకొనున్ = తీసికొనును. (అలంకారము – భ్రాంతిమంతము)

తా. ఏణీలోచన! ఈ రాజు గజసైన్యము యుద్ధమున మీదకువచ్చు నడకొండలవలె భూమ్యాకాశములను ఆవరించుచు విజృంభింపగా ఈతని భయంకరమైన యుద్ధమును చూచుటకు వచ్చిన దేవతాసమూహము మధ్యనున్న పృథురాజు ఆ ఏనుగులను పర్వతములనుకొని వాని చిమ్ముటకు చేతితో వింటిని తీసుకొనును.

(పర్వతములు ఱెక్కల బలముతో భూమండలమును బాధింపగా వైన్యుడు తన బలముతో వానిని చెదరగొట్టెను)

**123 శా. ఆ దైత్యాంతకు వక్షమన్నృహము శూన్యత్వైక దోషస్ఫుటా**
**సీదన్మర్కట కీటజాత కృతక శ్వేతాతపత్రీభవ**
**త్తాదృఙ్నిర్మల కౌస్తుభాభరణ రత్నస్ఫూర్తిగాఁ బాసి యా**

**హ్లాదంబొప్ప వసించు శ్రీ యితని బాహామధ్య సౌధస్థలిన్**

ఆ దైత్యాంతకు = ఆ విష్ణుని, వక్షమను, గృహము, శూన్యత్వ = లక్ష్మీశూన్యమగుటనెడి, ఏక దోష = ప్రధానమైన దోషముచే, స్ఫుట = స్పష్టముగా, ఆసీదత్ = నివసించుచున్న, మర్కటకీట = సాలెపురుగులచే, జాత = పుట్టిన, కృతక = కృత్రిమమైన, శ్వేతాతపత్రీభవత్ = తెల్లగొడుగగుచున్న, తాదృక్ = అటువంటి, నిర్మల = స్వచ్ఛమైన, కౌస్తుభాభరణ = కౌస్తుభ హారమందలి, రత్నస్ఫూర్తిగాన్ = రత్నాలకాంతికలదిగా, పాసి = విడిచి, ఆహ్లాదంబు = సంతోషము, ఒప్పన్ = ఒప్పునట్లుగా, శ్రీ = లక్ష్మి, ఇతని బాహా మధ్య సౌధస్థలిన్ = ఇతని బాహువలు మధ్యభాగమనెడి సౌధమునందు, వసించున్ = ఉండును. (అలంకారము – పర్యాయము, రూపకము)

తా. ఆ విష్ణుని వక్షస్థలము లక్ష్మీశూన్యమగుటయనెడి ప్రధానదోషముచే స్పష్టమై, అచట నివసించుచున్న సాలెపురుగులచే కట్టబడిన కృత్రిమమైన తెల్లగొడుగగుచున్నటువంటి స్వచ్ఛమయిన కౌస్తుభాభరణ రత్నాలకాంతికలదానిని విడిచి సంతోషము ఒప్పునట్లుగా లక్ష్మి ఈ రాజు బాహువుల మధ్యభాగమనెడి సౌథమందు నివసించుచుండును.

**124 మ. ఘనసిందూర విముగ్ధ మూర్థము ధృతస్కంధావధిశ్యామికం**
**బును బాథోధరమార్గగాహియునునై పూబోణి యీ రాజనం**
**దన గంధద్విప మాజిలోఁ జరమ సంధ్యాకాలమున్బోలె న**
**ర్థి నిరోధించు విరోధి బాహుజభుజా తేజ స్సహస్రాంశులన్**

పూబోణి = ఓ దమయంతీ!, ఈ రాజనందన గంధద్విపము, ఆజిలో = యుద్ధములో, ఘన = గొప్పదైన, సిందూర = సిందూరముచేత, విముగ్ధ = సుందరమైన, మూర్థము = శిరస్సుకలది. ధృత = ధరింపబడిన, స్కంధావధి = కంఠముల వరకు వ్యాపించిన, శ్యామికంబును = నల్లదనము కలిగినట్టిది. పాథోధరమార్గ = ఆకాశమార్గమును, గాహియునునై = పొందినదియున్నునై, చరమసంధ్యాకాలమున్ పోలెన్ = సాయంకాల సంధ్యవలె, అర్థిన్ = ప్రీతిచే, విరోథి = శత్రువులైన, బాహుజభుజా = క్షత్రియులయొక్క, తేజస్ = ప్రతాపమనెడి, సహస్రాంశులన్ = సూర్యులను, నిరోధించున్ = అరికట్టును. తా. ఓ దమయంతీ! ఈ రాజుయొక్క గంథగజము యుద్ధములో గొప్పదైన సిందూరముచేత సుందరమైన శిరస్సు కలది. కంఠమువరకు వ్యాపించిన నల్లదనముకలది, ఎత్తుచే ఆకాశమార్గమును పొందినదియునై సాంయకాల సంధ్యవలె ప్రీతితో శత్రువులైన క్షత్రియులయొక్క ప్రతాపమనెడి సూర్యులను అరికట్టును.(అలంకారము – ఉత్ప్రేక్ష, రూపకము)

**125 క. కీర్తిధనుడైన యీతని**
**మార్తుర కని కరుగ నరుగ మగువ బెడంగై**
**మార్తాండ మండలంబున**
**గర్తమయంబైన త్రోవ గానఁగ వచ్చున్**

మగువ, కీర్తిధనుడైన, ఈతని, మార్తురకున్ = శత్రువులకు, అనికిన్ = యుద్ధమునకు, అరుగన్ అరుగన్ = వెళ్లగా వెళ్లగా మార్తాండమండలంబునన్ = సూర్యమండలమందు, బెడంగై = గొప్పదై, గర్తమయంబు = పల్లముతో కూడినది, ఐన త్రోవన్ = అయినట్టి మార్గము, కానగన్ వచ్చున్ = కనబడును.

తా. ఓ దమయంతీ! ఈ రాజు శత్రువులకు యుద్ధమునకు వెళ్లగా వెళ్లగా సూర్యమండలమందు గొప్పదైన పల్లముతో కూడినదైన మార్గము కనబడును.( మరణము చేరువైనవారికి సూర్యునియందు ఛిద్రము కనబడునందురు)

**126 చ. ఎదిరిచి సమ్ముఖంబయిన యింతటిలోనన యేమిచిత్రమో**
**కదనముఖంబునందు విముఖత్వము గైకొను నర్కదీప్తిచే**
**నదరులు వాఱుచున్ బెడిదమైన యదఃకరవాలధారచే**
**విదళితమై శిరోధి వడ వీర విరోధి మహీశుఁ డుద్ధతిన్**

వీరవిరోధి మహీశుడు = వీరుడైన శత్రురాజు, ఉద్ధతిన్ = గర్వముచే, ఎదిరిచి = ఎదిరించి, సమ్ముఖంబయిన = ఎదుటపడిన, ఇంతటిలోనన = స్వల్పకాలములోనే, ఏమిచిత్రమో = అదేమిచిత్రమోకాని, అర్కదీప్తిచేన్ = సూర్యకాంతిచే, అదరులు = కాంతి కిరణములు, పాఱుచున్ = ప్రవహింపచేయుచు, బెడిదమైన = కఠినమైన, అద: = ఈ రాజుయొక్క, కరవాల ధారచే = కత్తిఅంచుచే, విదళితమై = ఛేదింపబడినదై, శిరోధి = మెడ, పడ = పడిపోగా, కదనముఖంబునందున్ = యుద్ధభూమియందు, విముఖత్వము = పరాఙ్ముఖత్వమును, కైకొనున్ = స్వీకరించును.(అలకారము – విరోధాభాసము) తా.

పరాక్రమవంతుడైన శత్రురాజు గర్వముతో ఎదరించి ఎదుటపడగానే అదేమిచిత్రమోకాని సూర్యకాంతి కిరణములు ప్రవహింపచేయుచు కఠినమైన ఈ రాజు కత్తిఅంచుచే ఛేదింపంబడి శత్రురాజు మెడ పడిపోగా యుద్ధభూమియందు విముఖత్వమును స్వీకరించును.(చనిపోవుచున్నాడు)

**127 వ. అనియె నప్పుడు సమీపంబున దాసియున్న యంతఃపురదాసి యౌదాసీన్యగర్భంబైన వైదర్భి తలంపెఱింగి వేఱొక్కదెస చూపి "అక్క యిటు గనుంగొనుము సౌధాగ్రంబునందు నటియించు కేతన పటాంచలంబునం జలంబుగొని యొక్క**

**కాకి గాహనమునకై కాకారవంబుతోడం కాలూఁదఁదలంచి యనువుగాక చీకాకుపడుచున్నయది" యనుచు నప్రస్తుత భాషణంబులం పరిహాసంబు పుట్టించిన**

తా. అని పలుకగా అప్పుడు చేరువను సమీపించియున్న అంతిపురదాసి ఉపేక్ష కడుపులోదాచుకున్న దమయంతి అభిప్రాయమును తెలిసినదై మరియొక దిక్కు చూపి "ఓ దమయంతీ! ఇటు చూడుము. మేడపైన ఎగురుచున్న పతాకము చివరియందు ఆనుటకు పంతముతో ఒక కాకి కాకాయని కూయుచు కాలు ఆనుకోవాలని ప్రయత్నించుచు వీలుకాక చీకాకుపడుతోంది" అని అప్రస్తుతమైన మాటలచే నవ్వును పుట్టించిన

**128 తే. దాసిచేసిన యప్పరిహాసమునకు**
**హాస పరిపాండురంబైన యక్కొలువున**
**నా నృపాలు ముఖమ్లాని గానఁబడియె**
**నలుపు గానఁగఁబడుఁగదా దెలుపులోన**

దాసి చేసిన, ఆ పరిహాసమునకు, హాస పరిపాండురంబైన = నవ్వుచే తెల్లనైన, ఆ కొలువునన్ = ఆ సభలో, ఆ నృపాలు ముఖమ్లాని = ఆ రాజుయొక్కముఖము వాడిపోవుట, కానబడియె = చూడబడెను. నలుపు, తెలుపులోనన్, కానగబడుకదా = కనబడుచుండునుకదా! (అలంకారము – అర్థాంతరన్యాసము)

తా. దాసిచేసిన పరిహాసమునకు నవ్వులు కురియగా తెల్లనైన ఆ సభలో ఆ రాజు ముఖము వాడిపోవుట కనబడెను. తెలుపులో నలుపు స్పష్టముగా కనబడుచుండునుకదా!

**129 వ. అప్పుడు**

**130 క. ఆ రాజు పట్టువాసి మ**
**హారాజిక సిద్ధసుర సమర్చిత చరణాం**
**భోరుహ భారతి యొక్క మ**
**హారాజు సమీపమునకు నల్లనఁ జనియెన్**

మహారాజిక = సిద్ధులు, సాధ్యులు మున్నగు గణదేవతలచే, సిద్ధ = యోగసిద్ధులచేతను, సుర = దేవతలచేతను, సమర్చిత = పూజింపబడుచున్న, చరణ అంభోరుహ = పాదపద్మములుకలదైన, భారతి = సరస్వతీదేవి, ఒక్క = మరియొక, మహారాజు సమీపమునకు, అల్లనన్ = మెల్లగా, చనియెన్ = వెళ్ళెను.

తా. సిద్ధ, సాధ్య గణదేవతలచేతను, యోగ సిద్ధులచేతను, దేవతలచేతను పూజింపబడుచున్న పాదపద్మములు కలదైన సరస్వతీదేవి మరియొక రాజుచెంతకు మెల్లగా వెళ్ళెను.

**131 వ. చని మహేంద్రగిరి యేలు నన్నరేంద్రునిం జూపి దమయంతి కిట్లనియె**

**132 చ. నరనుతు నిమ్మహేంద్రగిరినాథు వరింపుము రూపసంపదన్**
**దొరయునితండు నీకు నొక దోసమునుంగల దప్పురంబునన్**
**గరిమఁ గళింగజంబులగు గంధగజంబుల కుంభరాజితోఁ**
**గరకరి పుట్టఁగాఁగలదు కామిని! నీ వలి చన్నుదోయికిన్**

కామిని, నరనుతున్ = జనులచే పొగడబడుచున్న, ఈ మహేంద్రగిరినాథున్, వరింపుము, ఇతండు, రూపసంపదన్ = రూప సమృద్ధిచేత, నీకు, దొరయున్ = సమానుడగును, ఆ పురంబునన్ = ఆ మహేంద్రగిరియందు, ఒక దోసమునుం కలదు, నీ వలిచన్నుదోయికిన్ = సుందరమైన నీ స్తనములజంటకు, గరిమన్ = అతిశయముచే, కళింగజంబులగు = కళింగదేశమున పుట్టినవగు, గంధగజంబుల = మదగజముల, కుంభరాజితో = కుంభస్థలములతో, కరకరి = ద్వేషము, పుట్టగా కలదు.

తా. ఓ దమయంతీ! నరనుతుడైన ఈ మహేంద్రగిరినాథుని వరింపుము. ఈతడు రూపసంపదచే నీకు సమానుడగును. ఆ మహేంద్రగిరియందు ఒక్క దోషము కలదు. నీ సుందరమైన స్తనద్వయమునకు అతిశయముచే కళింగ మదగజముల కుంభపంక్తికి ద్వేషము పుట్టకలదు.(అలంకారము – లేశము)

**133 చ. గజపతి వచ్చెనంచు నొక గంధగజంబు గుఱించి యొక్కఁ డ**
**క్కజపడి పల్కిన న్వెఱచి కాననభూమికి భీతిఁ బాఱి దా**
**రిజడత నిద్రలోఁ గలవరింప నిజోక్తియ నేర్చి కీరముల్**
**గజపతి వచ్చె నా విని కలంగుదు రీతని శత్రు లచ్చటన్**

ఒక్కడు = ఒకానొకడు, గజపతి, వచ్చెన్, అంచున్, ఒక గంధగజంబు గుఱించి, అక్కజపడి = ఆశ్చర్యపడి, పల్కినన్, వెఱచి = భయపడి, కాననభూమికిన్ = అడవులలోకి, భీతిన్ = భయముతో, పాఱి = పారిపోయి, దారి జడతన్ = మార్గాయాసము చేత, నిద్రలోన్, కలవరింపన్ = గజపతిని కలవరించగా, నిజోక్తియ = ఆ మాటలనే, నేర్చి = నేర్చుకొని, కీరముల్ = చిలుకలు, గజపతి, వచ్చెనాన్ = వచ్చేడనగా, విని, ఈతని, శత్రులు, అచ్చటన్, కలంగుదురు = భయపడిపోదురు.

తా. ఎవరైనా గజపతి వచ్చెను అని ఒక మదగజమును గురించి ఆశ్చర్యంతో పలికినా భయపడిపోయి అడవులలోకి భయంతో పారిపోయి మార్గాయాసముచేత నిద్రలో గజపతిని కలవరించగా, ఆ మాటలనే నేర్చుకొని చిలుకలు గజపతి వచ్చేదని పలుకగా విని ఈతని శత్రువులు అక్కడ భయంతో కలతపడిపోతారు.

**134 తే. వీని రిపుకాంత పతిఁ బాసి కానలోనఁ**
**జెంచు పూఁబోఁడులును దానుఁ జెలిమిజేసి**
**చెప్పుఁ దమదేశవార్తలు చెప్పుచోటఁ**
**జల్లనైయుండు మాభూమి చంద్రుఁడంచు**

వీని రిపుకాంత = ఈతని శత్రువుల భార్య, పతిన్ పాసి, కానలోనన్, చెంచు పూబోడులును, తాను, చెలిమిచేసి, తమ దేశ వార్తలు చెప్పుచోటన్, మా భూమి చంద్రుడు, చల్లనై ఉండున్ అంచున్, చెప్పున్

తా. ఈతని శత్రువులభార్యలు భర్తలను విడిచి అడవులలో కోయవనితలతో స్నేహముచేసి తమ దేశవార్తలను ముచ్చటించుకొనునప్పుడు 'మా దేశమందు చంద్రుడు చల్లగా ఉండున'ని విరహముచే చెప్పుచుందురు

**135 మహాస్రగ్ధర. రతిఁ గ్రీడాహంస మోహగ్రహిల శిశుభృశ ప్రార్థితోన్నిద్ర తారా**
**పతియై దుఃఖించు సద్యః ప్రసృమర నిజ దృగ్బాష్పధారా గతేందు**
**ప్రతిబింబ ప్రాప్త లాభ ప్రముదిత సుతయై రంజిలున్ రాత్రు లేత**
**త్ప్రతిపక్ష క్షోణిపాల ప్రమద గిరిదరీ ప్రాంత కాంతారభూమిన్**

ఏతత్ ప్రతిపక్ష క్షోణిపాల = ఈతని శత్రురాజుయొక్క, ప్రమద = స్త్రీ, గిరిదరీ = పర్వతగుహలయొక్క, ప్రాంత, కాంతార భూమిన్ = అడవిప్రదేశమందు, రాత్రులు, రతిన్ = కోరికచేత, క్రీడాహంస = హంసబొమ్మయనెడి, మోహ = భ్రాంతిచే, గ్రహిల = నాది నాకిమ్మని కోపించు, శిశు = పసిబాలునిచే, భృశ = మిక్కిలి, ప్రార్థిత = ప్రార్థింపబడుచున్న, ఉన్నిద్ర = ఉదయించిన, తారాపతియై = చంద్రుడుకలదై, దుఃఖించున్ = ఏడ్చును, సద్యః = తత్కాలమందు, ప్రసృమర = నిర్గమించిన, నిజ = తనయొక్క, దృక్ = నేత్రములయొక్క, బాష్పధారా, గత = పొందిన, ఇందు ప్రతిబింబ = చంద్ర ప్రతిబింబముచే, ప్రాప్త = పొందబడిన, లాభ = ఫలముకలుగుటచే, ప్రముదిత = సంతుష్టుడైన, సుతయై = కుమారుడుకలదై, రంజిలున్ = సంతోషించుచుండును. (అలంకారము – భ్రాంతిమంతము)

తా. ఈతని శత్రురాజు భార్య పర్వతగుహలయొక్క సమీపమందలి అడవిప్రదేశమందు రాత్రులు ఉదయించిన చంద్రుడుకలదై ఆటబొమ్మ అనే భ్రాంతిచేత కావాలని కోపించు పసిబాలునిచే మిక్కిలి ప్రార్థింపబడుచున్నదై ఏడ్చును. తత్కాలమందు స్రవించుచున్న ఆమె కంటి నీటిధారలలో ప్రతిబింబించిన చంద్రునిచే లాభము కలుగుటచే సంతుష్టుడైన కుమారుడు కలదై సంతోషించుచుండును.

**136 ఉ. యజ్జలదేవతా స్ఫటిక హర్మ్యము శేషుఁడు, ముజ్జగంబులన్**
**మజ్జన మాచరించుఁ బలుమాఱును నెందు, యదీయవాఃకణం**
**బజ్జలజారి, యట్టి విమలాద్భుతకీర్తి మహాబ్ధి పూర్తమున్**
**సజ్జన వర్ణనీయము నొనర్చె నితండు వసుంధరాస్థలిన్**

శేషుడు, యత్ = దేనియందు. జలదేవతా, స్ఫటిక హర్మ్యము = స్ఫటికమయమైన మేడయో, ఎందున్ = ఏ సముద్రమందు, ముజ్జగంబులున్, పలుమాఱును, మజ్జనము = స్నానము, ఆచరించున్, యదీయ వాఃకణము = ఏ సముద్రముయొక్క నీటిబిందువు, ఆ జలజ అరి = ఆ చంద్రుడో!, అట్టి, విమల = స్వచ్ఛమైన, అద్భుత = ఆశ్చర్యమునుకలిగించు, కీర్తి = యశస్సుయొక్క, మహాబ్ధి = గొప్ప సముద్రమనెడు, పూర్తమున్ = తటాకమును, ఈతండు = ఈ రాజు, వసుంధరాస్థలిన్ = భూమండలమందు, సజ్జన వర్ణనీయముగన్ = సజ్జనులచే కొనియాడబడునట్లుగా, ఒనర్చెన్ = చేసెను.

తా. దేనియందు శేషుడు జలదేవతకు స్ఫటికమయమైన మేడయో, దేనియందు మూడులోకములును పలుమారులు స్నానము ఆచరించునో, ఏ సముద్రముయొక్క నీటిబిందువు ఆ చంద్రుడో, అట్టి నిర్మలమైన కీర్తి సముద్రమును తటాకమువలె ఈ రాజు భూమండలమున నిర్మించెను. (అలంకారము – రూపకము)

**137 శా. ఆమోదాశ్రుభరంబు వెల్లిగొన నెట్లాలించుఁ గర్ణంబులన్**
**రోమాంచంబు వహించు నేకరణి నీరోమాంకురంబైన మైన్**
**భూమీచక్రము పూని యెట్లు దలలూఁపుం బన్నగస్వామి ది**
**క్క్రామత్ప్రౌఢిని వీని కీర్తి ఫణభృత్కాంతాజనుల్ పాడగన్**

ఫణభృత్కాంతాజనుల్ = నాగలోక స్త్రీలు, దిక్క్రామత్ ప్రౌఢిని = దిక్కుల నతిక్రమింపజాలిన రీతిచే, వీని కీర్తిన్ = ఈ రాజు కీర్తిని, పాడగన్ = నుతించుచుండగా, పన్నగస్వామి = అనంతుడు, ఆమోదాశ్రుభరంబు = ఆనందబాష్పములతోనిండి, వెల్లిగొనన్ = ప్రవహించునట్లుగా, కర్ణంబులన్ = చెవులచే, ఎట్లు, ఆలించున్ = వినును. నీరోమాంకురంబైన = వెంద్రుకలు లేనట్టి, మైన్ = దేహమునందు, ఏకరణిన్ = ఏ విధముగా, రోమాంచంబు = గగుర్పాటును, వహించు = పొందును, భూమీచక్రము = భూమండలమును, పూని = వహించి, తలలు, ఎట్లు, ఊపున్

తా. నాగలోకస్త్రీలు దిక్కులనతిక్రమింపజాలిన రీతిచే వీని కీర్తిని నుతించుచుండగా అనంతుడు ఆనందబాష్పములతో నిండి ప్రవహించునట్లుగా చెవులు లేనివాడు ఎట్లు వినును? వెంద్రుకలు లేని దేహముకదా! ఏ విధముగా రోమాంచము కలుగును? భూమిని మోయుచున్నాడుకదా! తలలెట్లు ఊపును? కావున శేషుడు తన యానందమును ప్రకటింపలేకపోవుచున్నాడు.

**138 ఆ. అనిన నల్ల నవ్వె నబ్జాయతాక్షియు**
**నది విరక్తియగుట నాత్మ నెఱిఁగి**
**యానవాహసమితి నవలోకసంజ్ఞ న**
**వ్వలికి జరుగఁ బనిచె వాగ్వధూటి**

అనినన్ = అని సరస్వతి పలుకగా, అబ్జాయతాక్షియున్ = ఆ దమయంతియును, అల్లన్ నవ్వెన్ = మెల్లగా నవ్వెను, అది విరక్తియగుట, ఆత్మన్ ఎఱింగి = మనసున తెలుసుకొని, వాగ్వధూటి = సరస్వతి, యానవాహకసమితి = పల్లకిమోయువారిని, అవలోకసంజ్ఞన్ = కనుసన్నలచేతనే, అవ్వలికి జరుగన్, పనిచె = ఆజ్ఞాపించెను.

తా. అని సరస్వతి పలుకగా ఆ దమయంతియును మెల్లగా నవ్వెను. అది విరక్తియగుట మనసున తెలుసుకొని సరస్వతి పల్లకి మోయువారిని కనుసన్నలచేతనే అవతలికి జరుగుమని ఆజ్ఞాపించెను.

**139 వ. అచ్చోట వేఱొక రాజుం జూపి యా రాజవదనకు రాజీవభవునిదేవి యిట్లనియె**

**140 తే. ఇతఁడు నేపాళభూపాలుఁ డిగురుఁబోఁడి**
**వీని వీక్షింపు కడకంటి వీక్షణమునఁ**
**బడఁతి యేతత్ప్రతాపాగ్నిఁ బడియెనేఁ బ**
**తంగుఁ డంగీకరించుఁ బతంగవృత్తి**

ఇగురు పోడి = చిగురువంటి దేహముకలదానా!, ఇతడు నేపాళ భూపాలుడు, కడకంటి వీక్షణమునన్ = కడకంటి చూపుచే, వీనిన్, వీక్షింపుము. పడతి, పతంగుడు = సూర్యుడు, ఏతత్ ప్రతాపాగ్నిన్ = వీని ప్రతాపాగ్నిలో, పడియెన్ ఏని = పడినచో, పతంగవృత్తిన్ = మిడుతరీతిని, అంగీకరించున్ (అలంకారము – విరోధాభాసము, అతిశయోక్తి)

తా. చిగురువంటి దేహముకలదానా! ఓ దమయంతీ! ఇతడు నేపాళరాజు. క్రీగంటిచూపుచే వీనిని చూడుము. ఓ కాంతా! సూర్యుడు ఈతని ప్రతాపాగ్నిలో పడితే మిడుతరీతిని పొందుతాడు.

**141 తే. ఉభయ పౌలస్త్యవాసైక యోగ్యములును**
**నుభయ సంధ్యాప్రభాలంక్రియోజ్జ్వలములు**
**నైన దిగ్భాగములయందు వీని కీర్తి**
**పద్మలోచన! నృత్యంబు పరిఢవించు**

పద్మలోచన!, ఉభయ = ఇరువురయిన, పౌలస్త్య = రావణ, కుబేరులయొక్క, వాస = నివానములకు, ఏక = ముఖ్యముగా, యోగ్యములును, ఉభయ = రెండయిన, సంధ్యా ప్రభా = రెండు సంధ్యల కాంతులనెడి, అలంక్రియా = అలంకారములచేత, ఉజ్జ్వలములునైన = ప్రకాశించుచున్నవియునైన, దిగ్భాగములయందున్ = నాలుగు దిక్కులయందును, వీని కీర్తి, నృత్యంబున్ = నాట్యమును, పరిఢవించు = చేయును.

తా. పద్మనేత్రీ! రావణ, కుచేరుల ఇరువురియొక్క నివాసములకు ప్రధానముగా యోగ్యములును, రెండు సంధ్యల కాంతులనెడి అలంకారములచేత ప్రకాశించుచున్నవియునైన నాలుగు దిక్కులయందును వీని కీర్తి నాట్యమును చేయును.

**142 మ. శరధి ప్రోద్ధృతి శింజినీ ఘటన మాశబ్ద గ్రహాకృష్టి యం**
**బరవీథీగతి లక్ష్యభేద మవనీపాతంబు లక్షింప రా**
**కరివక్షఃస్థల రంధ్రపంక్త్యనుమితంబౌ నాజి రంగంబులం**
**దరవిందానన! వీని బాణ నికరం బత్యద్భుత ప్రౌఢిచేన్**

అరవిందానన = పద్మమువంటి ముఖముకలదానా!, అత్యద్భుత ప్రౌఢిచేన్ = మిక్కిలి అద్భుతమైన నేర్పుచే, శరధి ప్రోద్ధృత = అమ్ములపొదినుండి తీయుటయు, శింజినీ ఘటనము = నారియందు కూర్చుటయును, ఆ శబ్దగ్రహా = చెవులవరకు, ఆకృష్టి = లాగుటయును, అంబరవీథీ గతి = ఆకాశ మార్గమున గమనమును, లక్ష్యభేదము = లక్ష్యమును భేదించుటయును, అవనీపాతంబు = భూమిపై పడుటయును,లక్షింపరాక = చూచుటకు వలనుపడక, అరి = శత్రువులయొక్క, వక్షఃస్థల = ఱొమ్ములందున్న, రంధ్ర పంక్తిన్ = కన్నముల వరుసచే, అనుమితంబౌన్ = ఊహింపదగినదియౌను.

తా. పద్మముఖీ! ఈతడు యుద్ధమునందు మిక్కిలి అద్భుతమైన నేర్పుచే బాణమును అమ్ములపొదినుండి తీయుటయును, నారియందు కూర్చుటయును,చెవులవరకు లాగుటయును, ఆకాశమార్గమున వదలుటయును, లక్ష్యమును భేదించుటయును, శత్రువు భూమిపై పడుటయునుచూచుటకు వలనుపడక శత్రువులయొక్క ఱొమ్ములందున్న కన్నముల వరుసచే ఊహింపదగినదే యౌను.

**143 మహాస్రగ్ధర. పతిత ప్రత్యర్థి పృథ్వీపతి ముఖ కమలోపాశ్రయ మ్లానిభృంగ**
**ప్రతిబింబాంకంబు లేతత్పద నఖ విధుబింబంబు లీరాజు దాల్చుం**
**బ్రతివీర ప్రాణవాత ప్రకర నవసుధాపాన పీనంబు నత్య**
**ద్భుత శౌర్యాడంబరంబున్ భుజ భుజగయుగంబు న్మహాసంగరోర్విన్**

ఏతత్ = ఈ రాజుయొక్క, పదనఖవిధుబింబంబులు = పాదముల గోళ్ళనెడి చంద్రబింబములు, పతిత = పాదములందు పడిన, ప్రత్యర్థి పృథ్వీపతి = శత్రు రాజులయొక్క, ముఖ కమల = ముఖ పద్మములను, ఉపాశ్రయ = ఆశ్రయించియున్న, మ్లాని = కాంతిహీనత్వమనెడి, భృంగ = తుమ్మెదలయొక్క, ప్రతిబింబాంకంబులు = ప్రతిబింబమనెడి మచ్చ కలిగినటువంటివి, ఈ రాజు, ప్రతివీర = శత్రురాజులయొక్క, ప్రాణవాత = ప్రాణవాయువులయొక్క, ప్రకర = సమూహమనెడి, నవసుధాపాన = ప్రశస్తమైన అమృతపానముచే, పీనంబు = బలిసినవియును, అత్యద్భుత శౌర్యాడంబరంబున్ = మిక్కిలి ఆశ్చర్యమును కలిగించు పరాక్రమముచే అతిశయించుచున్నవియునగు, భుజ భుజగయుగంబున్ = బాహువలనెడి సర్పద్వయమును, మహాసంగరోర్విన్ = ఉగ్ర రణభూమియందు, తాల్చున్ = ధరించును. (అలంకారము – రూపకము)

తా. ఈ రాజుయొక్క పాదముల గోళ్ళనెడి చంద్రబింబములు తన పాదములందు పడిన శత్రురాజులయొక్క ముఖ పద్మములను ఆశ్రయించియున్న పరాజయమువలన కాంతిహీనత్వమనెడి తుమ్మెదలయొక్క ప్రతిబింబమనెడి మచ్చ కలిగినటువంటివి. ఈ రాజు శత్రురాజులయొక్క ప్రాణవాయువుల సమూహమనెడి గొప్ప అమృతపానముచే బలిసినవియును, మిక్కిలి ఆశ్చర్యమును కలిగించు పరాక్రమముచే అతిశయించుచున్నవియునగు బాహువులనెడి సర్పద్వయమును ఉగ్ర రణభూమియందు ధరించును.

**144 మ. హరిదంత ద్విపదంత కుంతముల కన్వాదేశ మాశీవిషా**
**భరణోత్తంస సుధాంశురేఖకు ననుప్రాసంబు కైలాస భూ**
**ధర కూటస్ఫటికోపల ప్రతతి కధ్యాహార మిమ్మేదినీ**
**శ్వర దేవేంద్రుని సాంద్ర నిర్మల యశోజాలంబు లీలావతీ!**

లీలావతీ!, ఈ మేదినీ ఈశ్వర దేవేంద్రుని = ఈ భూపాల దేవేంద్రుని, సాంద్ర = దట్టమైన, నిర్మల = స్వచ్ఛమైన, యశోజాలంబు = కీర్తిసమూహము, హరిత్ = దిక్కులయొక్క, అంత = కొనలయందున్న, ద్విపదంత = ఏనుగు దంతములనెడి, కుంతములకు = ఈటెలకు, అన్వాదేశము = పునరుక్తి, ఆశీవిష = సర్పములు, ఆభరణ = అలంకారములుగాకల శివునికి, ఉత్తంస = శిరోభూషణమైన, సుధాంశురేఖకు = చంద్రరేఖకు, అనుప్రాసంబు = పునరుచ్చారణము, కైలాస భూధర = కైలాస పర్వతముయొక్క, కూట = శిఖరములందున్న, స్ఫటిక ఉపల = స్ఫటికపు రాళ్ళయొక్క, ప్రతతికిన్ = సముదాయమునకు, అధ్యాహారంబు = శేషమును పూరించునది. (అలంకారము – రూపకము, అతిశయోక్తి)

తా. లీలావతీ! ఈ భూపాల దేవేంద్రుని దట్టమైన, నిర్మలమైన కీర్తి దిగంతములందున్న ఏనుగుల దంతములనెడి ఈటెలకు పునరుక్తి. సర్పాభరణుడగు పరమశివునకు శిరోభూషణమైన చంద్రరేఖకు అనుప్రాసము, కైలాస శిఖరమందలి స్ఫటికపు రాళ్ళయొక్క సముదాయమునకు అధ్యాహారము.

**145 సీ. ఇతని హేతి శతఘ్ని నెబ్బంగి నెదిరించు**
**నరివీరశతము సంగరమునందు**
**లక్షభేదన కళాదక్షు నీతని నెట్టు**
**లహిత యోధుల లక్షలాక్రమించు**
**నీక్షణ జితపద్ము నితని నే క్రమమున**
**విమత పద్మము లంగవింపఁజాలు**
**సర్వపరచ్ఛిదాశక్తు లీతని నెవ్వి**
**ధంబున రిపుపరార్థము జయించుఁ**
**తే. గాన సంఖ్యాపగమన మొక్కటియ దిక్కు**
**వీని పగఱకు మాటలు వేయు నేల**
**కార్తికీ తిథి యామినీ కాలపూర్ణ**
**చంద్రమండల సంకాశ చారువదన**

కార్తికీ తిధి = కార్తీక పున్నమినాటి, యామినీకాల = రాత్రిసమయమందలి, పూర్ణచంద్రమండల, సంకాశ = సమానమైన, చారువదన = సుందరమైన ముఖముకలదానా!, ఇతని హేతి = ఇతని ఆయుధమైన, శతఘ్నిన్ = నూరుగురను చంపుదానిని, సంగరమునందు = యుద్ధమునందు, అరివీరశతము = శత్రురాజులసమూహము, ఎబ్బంగిన్ = ఏ రీతిగా, ఎదిరించు, లక్ష భేదన = లక్ష్యమును భేదించుటయనెడి, కళా = చాతుర్యమునందు, దక్షు = సమర్థుడైన, ఈతనిన్, అహిత యోధుల లక్షలు = శత్రువీరుల సమూహములు, ఎట్టులు ఆక్రమించున్, ఈక్షణ జితపద్మున్ = చూపులచే జయింపబడిన పద్మసంఖ్యకల

వానిని, ఇతనిని, విమత పద్మములు = పద్మసంఖ్యకల శత్రువులు, ఏ క్రమమున = ఏరీతిగా, అంగవింపజాలు = బాధింప గలుగుదురు, సర్వ = సమస్తమైన, పర = శత్రువులను, చ్ఛిదాశక్తులు = ఛేదించుటయందు సమర్థమైన, ఈతనిన్, రిపుపరార్థము = పరార్థసంఖ్యకల శత్రువులు, ఎవ్విధంబున, జయించున్, కాన, వీని పగఱకున్, మాటలు వేయున్ ఏల, సంఖ్యాపగమనము = లెక్కనుండి తొలగుట (యుద్ధమునుండి పారిపోవుట), ఒక్కటియ దిక్కు, (అలంకారము = పరిసంఖ్య)

తా. కార్తీకపున్నమినాటి రాత్రిసమయమందలి పూర్ణచంద్రమండల సమానమైన సుందరమైన ముఖముకలదానా! ఇతని ఆయుధమైన శతఘ్నిని యుద్ధభూమిలో శత్రురాజులు ఏరీతిగా ఎదిరిస్తారు? లక్ష్యాన్ని ఛేదించడంలో చాతుర్యంకల ఇతనిని శత్రువీరులు ఎలా అక్రమిస్తారు? చూపులతోనే జయింపబడిన పద్మసంఖ్యకలవానిని పద్మసంఖ్యకల శత్రువులు ఏ రీతిగా బాధించగలుగుతారు? సమస్తమైన శత్రువులను ఛేదించుటయందు సమర్థమైన ఈతనిని పరార్థసంఖ్యకల శత్రువులు ఏ విధంగా జయిస్తారు? కాబట్టి ఈతని శత్రువులకు వేయి మాటలెందుకు? యుద్ధమునుండి పారిపోవుట ఒక్కటే దిక్కు.

146 తే. **అనుచు నిబ్భంగి నొత్తి చెప్పినను వినియు**
**నుత్తరము లేక యూరక యున్న( జూచి**
**యన్య రాజన్యు గుఱిచేసి యరిగె వాణి**
**యానధుర్యవ్రజంబు తో నరుగు(దేర**

అనుచు, ఈ భంగిన్ = ఈ రీతిగా, ఒత్తి చెప్పినను = నొక్కి చెప్పినప్పటికినీ, వినియు = విన్నదైననూ, ఉత్తరము లేక = సమాధానము లేక, ఊరక యున్నన్ = ఊరకుండుటను, చూచి, వాణి, యానధుర్య వ్రజంబు = పల్లకి మోయువారు, తో నరుగుదేర = కూడా రాగా, అన్య రాజన్యున్ = వేరొక రాజును, గుఱిచేసి = లక్ష్యముగా చేసికొని, అరిగె = వెళ్ళెను.

తా. అని సరస్వతి ఈ రీతిగా నొక్కి చెప్పినను విన్నదైనపటికీని సమాధానము ఇవ్వకుండా యూరకుండుటను చూచి వాణి పల్లకిమోయువారు కూడా రాగా వేరొక రాజును లక్ష్యముగా చేసికొని వెళ్ళెను.

147 వ. **ఇవ్విధంబునం గామరూపాధికుండైన కామరూపాధిపుం జేరం జని వాగధిదేవత యవ్వనితా వతంసంబున కిట్లనియె.**

తా. ఈ రీతిగా మన్మథునికంటె సుందరుడైన కామరూప రాజును సమీపించి సరస్వతి ఆ స్త్రీరత్నముతో ఇట్లు పలికెను.

148 తే. **ఇతడు ప్రాగ్జ్యోతిషాధీశు డిందువదన !**
**వీర చూడావతంసంబు వీని( జూడు**
**మలసవలితంబు వ్రీడాభరాకులంబు(**
**జంచలమునైన నీదు నేత్రాంచలమున**

ఇందువదన !, ఇతడు, ప్రాగ్జ్యోతిష అధీశుడు = ప్రాగ్జ్యోతిష పట్టణమునకు రాజు, వీర చూడావతంసంబు = వీరులలో శ్రేష్ఠుడు, అలసవలితంబు = మందమైనదియును, వ్రీడాభర అకులంబు = సిగ్గుచే తొట్రుపడుచున్నదియు, చంచలమునైన = చాంచల్యముకలదియునైన, నీదు నేత్రాంచలమున = నీ క్రీగంటితో, వీనిన్ చూడుము.

తా. చంద్రముఖీ ! ఇతడు ప్రాగ్జ్యోతిష పట్టణాధీశుడు. వీరులలో శ్రేష్ఠుడు. మందమైన, సిగ్గుచే తొట్రుపడుచున్న, చంచలమైన నీ క్రీగంటితో వీనిని చూడుము.

149 శా. **క్రూరాసి త్రుటి తారివారణఘటా కుంభాస్థి కూటస్థలీ**
**రారాజన్నవమౌక్తికోత్కర కిరారంభ క్రమోజ్జృంభియై**
**యీ రాజన్యు కరంబు పోరుల( గరం బేపారు సత్కీర్తి బీ**
**జారోపం బొనరించు భంగి హయరింఖాగ్ర క్షత క్షోణులన్**

ఈ రాజన్యు కరంబు = ఈ రాజశ్రేష్ఠుని చేయి, పోరులన్ = యుద్ధములందు, క్రూర = వాడియైన, అసి = కత్తిచే, త్రుటిత = ఛేదింపబడిన, అరి వారణ ఘటా = శత్రువుల ఏనుగుల, కుంభ = గండస్థలములయొక్క, అస్థి కూటస్థలీ = ఎముకల సమూహమునందు, రారాజత్ = మిక్కిలి ప్రకాశించుచున్న, నవ మౌక్తిక = క్రొత్త ముత్యములయొక్క, ఉత్కర = సమూహమును, కిర = చల్లుటయొక్క, ఆరంభ క్రమ = ప్రారంభించుటయందు, ఉజ్జృంభియై = అతిశయించుచున్నదై, హయ రింఖా = గుఱ్ఱపు డెక్కలయొక్క, అగ్ర = కొనలచేత, క్షత = నలగకొట్టబడిన, క్షోణులన్ = భూములను, సత్కీర్తి = మంచి యశస్సుయొక్క, బీజారోపంబు = విత్తనములను చల్లుటను, ఒనరించుభంగిన్ = చేయుచున్నట్లు, కరంబు = మిక్కిలి, ఏపారున్ = ఒప్పుచున్నది.

తా. ఈ రాజశ్రేష్ఠుని చేయి యుద్ధములందు వాడియైన కత్తిచే ఛేదింపబడిన శత్రువుల ఏనుగులయొక్క గండస్థలముల ఎముకలయందు ప్రకాశించు ముత్యములయొక్క సముదాయమును చల్లుటకు ప్రారంభించుటయందు అతిశయించుచున్నదై గుఱ్ఱపు డెక్కల కొనలచేత నలగకొట్టబడిన ప్రదేశములను మంచి కీర్తియొక్క విత్తననములను చల్లుట కారంభించుచున్నట్లు మిక్కిలి ఒప్పుచున్నది. (అలంకారము – ఉత్ప్రేక్ష )

150 స్రగ్ధర. **రాజీవాక్షీ ! ప్రహార స్రవ దసృ గసుహృత్ప్రాంశు వంశాళి నేత**
**త్తేజో ధూమధ్వజంబుల్ తిరిగి తిరిగి రోధించు దుస్సాధ లీలన్**

**రాజావర్తోపలాంశు ప్రతిమ తదుదిత ప్రాజ్య ధూమంబుగా రా**
**రాజ న్నాసీర వాజివ్రజ ఖుర జ రజోరాజి ఘోరాజిభూమిన్**

రాజీవాక్షీ = పద్మనేత్రీ !, ఘోరాజి భూమిన్ = భీకరమైన యుద్ధభూమియందు, ప్రహార = ఖడ్గముల దెబ్బలచేత, స్రవత్ = కారుచున్న, అసృక్ = రక్తముకల, అసుహృత్ = శత్రువులనెడి, ప్రాంశు = ఉన్నతమైన, వంశాళి = వెదుళ్ళను, ఏతత్ = ఈ రాజుయొక్క, తేజో ధూమ ధ్వజంబుల్ = ప్రతాపమనెడి అగ్ని జ్వాలలు, రాజావర్త = రాజావర్తమను పేరుగల, ఉపల అంశు = నల్లమణుల కాంతులతో, ప్రతిమ = సమానమైనదియు, రారాజత్ = మిక్కిలి ప్రకాశించుచున్న, నాసీర = సేనాముఖమందున్న, వాజివ్రజ = గుఱ్ఱపు గుంపులయొక్క, ఖుర జ= డెక్కలవలన పుట్టిన, రజోరాజి = పరాగపంక్తి, తత్ ఉదిత = ఆ ప్రతాపాగ్నిచే పుట్టిన, ప్రాజ్య ధూమంబుగా = గొప్ప పొగగా, దుస్సాధ లీలన్ = సాధింపశక్యముకాని రీతిచే, తిరిగి తిరిగి = మిక్కిలి చుట్టుముట్టి, రోధించున్ = ఆవరించును.(అలంకారము – రూపకము)

తా. పద్మనేత్రీ ! భీకరమైన యుద్ధభూమియందు ఖడ్గము దెబ్బలచేత కారుచున్న రక్తముకల శత్రువులనెడి ఎత్తైన వెదుళ్ళను ఈ రాజుయొక్క ప్రతాపమనెడి అగ్నిజ్వాలలు దహించును. రాజావర్తమను పేరుగల నల్లమణుల కాంతులతో సమానమైనదియును, ప్రకాశించుచున్న సేనాముఖమందున్న గుఱ్ఱములయొక్క డెక్కలవలన పుట్టిన పరాగము ఆ ప్రతాపాగ్నిచే పుట్టిన ధూమముగా సాధింపశక్యముకాని రీతిచే మిక్కిలి చుట్టుముట్టి ఆవరించును.

151 వ. **అనియె నాసమయంబున సమీపవర్తినియగు తాంబూలకరండవాహిని దమ సహోదరి భావం బెఱింగి భారతీదేవి నుద్దేశించి 'యో దేవి యీ వసుధావల్లభుని మీఁద నిప్పల్లవాధరకు నుల్లంబు పల్లవింపదు. వచన పరిశ్రమంబు వలదు. వాడె యుత్కల దేశాధీశ్వరుం డమ్మహీశ్వరు గుణకలాపంబు లభివర్ణింపు' మనుటయు**

తా. అని సరస్వతి పలుకగా ఆ సమయమున దగ్గరనేయున్న తాంబూల పెట్టెను వహించిన దాసి తమ సహోదరి అభిప్రాయము తెలిసికొని సరస్వతిని ఉద్దేశించి 'ఓ దేవి ! ఈ రాజుమీద ఈ చిగురువంటి పెదవికల దమయంతికి మనసు చిగురింపదు. మాటాడు శ్రమ వద్దు. వాడే ఉత్కల దేశపు రాజు. ఆ రాజు గుణసముదాయమును వర్ణింపుము' అనగా

152 క. **భారతి రతీశకల్పుని**
**నా రాజకుమారుఁ గదియ నరిగి గభీరో**
**దార మృదు మధుర భాషల**
**నా రమణీమణికి నిట్టులనియెం బ్రీతిన్**

భారతి = సరస్వతి, రతి ఈశ కల్పుని = మన్మథ సదృశుని, ఆ రాజకుమారున్, కదియన్ అరిగి = సమీపించి, గభీర = గంభీరమైన, ఉదార = స్పష్టమైన, మృదు మధుర, భాషల = మాటలతో, ప్రీతిన్ = ప్రేమతో, ఆ రమణీమణికి = ఆ దమయంతికి, ఇట్టులు అనియెన్.

తా. సరస్వతీదేవి మన్మథునితో సమానమైన ఆ రాజకుమారుని చేరి గంభీరమైన, స్పష్టమైన, మృదు, మధురమైన మాటలతో ప్రీతిపూర్వకముగా ఇట్లు పలికెను.

153 క. **ఇతఁ డుత్కల దేశాధిపుఁ**
**డతివ ! విలోకింపు మితని నానమ్ర క్ష్మా**
**పతి తతి కిరీటకోటీ**
**శతమఖమణి మధుప చుంబి చరణాంబుజునిన్**

అతివ !, ఇతడు, ఉత్కల దేశ అధిపుడు, ఆనమ్ర = నమస్కరించుచున్న, క్ష్మాపతి తతి = రాజులయొక్క, కిరీట కోటీ = కిరీట కొనలయందున్న, శతమఖమణి = ఇంద్రనీలమణులనెడి, మధుప = తుమ్మెదలను, చుంబి = తాకుచున్న, చరణాంబుజునిన్ = పాదపద్మములు కలవానిని, విలోకింపుము = చూడుము. (అలంకారము – రూపకము)

తా. ఓ దమయంతీ ! ఇతడు ఉత్కల దేశపు రాజు. నమస్కరించుచున్న రాజుల కిరీటములందున్న ఇంద్రనీలమణులనెడి తుమ్మెదలను తాకుచున్న పాదపద్మములుకల వీనిని చూడుము.

154 మ. **చెమరించుం దుహినచ్ఛటా చ్ఛలమునన్ శీతాంశుబింబంబు రే**
**కుముదం బెన్నఁడు నిద్రవో దెపుడు నీ కొప్పుం ప్రవేశించు మ**
**ల్లిమతల్లీ నవమాలికా కుసుమముల్ లీలావతీ ! వీని దు**
**ర్దమ దోర్దండ యశః ప్రకాండ విభవారంభంబు జృంభించినన్**

లీలావతీ = విలాసినీ !, వీని = ఈ రాజుయొక్క, దుర్దమ = అణచుటకు సాధ్యముకాని, దోర్దండ = బాహు పరాక్రమము యొక్క, యశః ప్రకాండ = గొప్ప కీర్తియొక్క, విభవ ఆరంభంబు = మహిమాటోపము, జృంభించినన్ = అతిశయింపగా, శీతాంశుబింబంబు = చంద్రబింబము, రే = రాత్రియందు, తుహినచ్ఛటా ఛ్చలమునన్ = మంచు సమూహమనెడి నెపముచే, చెమరించున్ = చెమటలు కార్చును, కుముదంబు = తెల్ల కలువ, ఎన్నడున్, నిద్రవోదు, మల్లిమతల్లీ = మల్లెతీగయొక్కయు,

నవమాలికా = విరజాజియొక్కయు, కుసుమముల్ = పూవులు, నీ కొప్పునన్, ప్రవేశించు = ప్రవేశించి దాగియుండును.

తా. ఓ విలాసినీ ! ఈ రాజుయొక్క అణచుటకు సాధ్యముకాని బాహు పరాక్రమముయొక్క కీర్తి వైభవము అతిశయింపగా చంద్రమండలము రాత్రియందు మంచు వంకతో చెమటలు కార్చును, తెల్లకలువలు ఎన్నడును నిద్రపోవు, మల్లె, విరజాజి పూలు నీ కొప్పులో దూరి దాగియున్నవి. (అలంకారము – అతిశయోక్తి)

155 స్రగ్ధర. **పైపై( దు:ఖారధట్టా ప్రఖర ఖురపుటీ పాత విక్షుద్యమాన**
**క్ష్మాపృష్ఠోత్తిష్ఠ దంధంకరణ రణరజస్కాండ ధారాంధకారం**
**బాపూర్ణంబైన ఘోరాహవ ముఖముల నబ్జాక్షి ! యీ రాజు బాహా**
**టోపం బీక్షింప రాకుండుటకు మఱు(గుచుండున్ దివిన్ దేవపంక్తుల్**

అబ్జాక్షి !, ఘోర ఆహవ ముఖములన్ = భీకర యుద్ధరంగములందు, పైపైన్ = మీదుమీదుగా, తు:ఖార ధట్టా = గుఱ్ఱముల సమూహముయొక్క, ప్రఖర = మిక్కిలి తీక్షణమైన, ఖురపుటీ = డెక్కల చిప్పలు, పాత = పడుటచే, విక్షుద్యమాన = నలగ గొట్టబడిన, క్ష్మాపృష = భూతలమునుండి, ఉత్తిష్ఠత్ = ఎగిరి, అంధంకరణ = కనబడకుండ చేయుచున్న, రణరజస్కాండ ధారా = యుద్ధపరాగ సమూహ పరంపరయనెడి, అంధకారంబు = చీకటి, ఆపూర్ణంబైన = నిండినదికాగా, ఈ రాజు, బాహాటోపంబు = బాహు పరాక్రమాతిశయము, దివిన్ = ఆకాశమందు, దేవపంక్తుల్ = దేవతల సమూహములు, ఈక్షింపన్ రాకుండుటకు = చూడ నలవికాకుండుటకు, మఱుగుచుండున్ = పరితపించుచుండును.(అలంకారము – రూపకము, అతిశయోక్తి)

తా. దమయంతీ ! భీకరయుద్ధరంగములందు పైపైన గుఱ్ఱములయొక్క తీక్షణమైన డెక్కల చిప్పలు పడుటచే నలగగొట్ట బడిన భూతలమునుండి ఎగిరి కనబడకుండచేయుచున్న యుద్ధపరాగపరంపరయనెడి చీకటినిండగా ఈ రాజు బాహు పరాక్రమమును ఆకాశమందలి దేవతలు చూడ నలవికాకుండుటచే పరితపించుచుందురు.

156 మ. **అసమాన స్థిర దానవైభవ కళాహంకార సింహాసనా**
**గ్ర సమాసీను(డు వీ(డొకండు కలుగంగా నర్థి యాచ్ఞారస**
**వ్యసనాభావ బహూభవత్ఫలభర వ్యాజంబున న్నమ్రమై**
**యెస సంక్రందనశాఖి డెందమునయం దెక్కించు మందాక్షమున్**

అసమాన = సాటిలేని, స్థిర = నిశ్చలమైన, దానవైభవకళా = దానసమృద్ధి చాతుర్యముచే కలిగిన, అహంకార = అహంకారమనెడి, సిహాసనాగ్ర = సింహాసనమునందు, సమాసీనుడు = కూర్చున్నవాడైన, వీడు ఒకండు = ఈ రాజొక్కడు, కలుగన్ కాన్ = ఉండగా, సంక్రందన శాఖి = కల్పవృక్షము, అర్థి = యాచకులయొక్క, యాచ్ఞారస = అడుక్కొనుటయనెడి, వ్యసనము, అభావ = లేకపోవుటచే, బహూభవత్ = అధికమగుచున్న, ఫలభర = పండ్ల బరువనెడి, వ్యాజంబునన్ = మిషచే, నమ్రమై = వంగినదై, డెందంబునయందున్ = మనసునందు, మందాక్షమున్ = సిగ్గును, ఎసన్ = ఎక్కువగా, ఎక్కించును.

తా. సాటిలేని స్థిరమైన దానకళచే కలిగిన అహంకారమనెడి సింహాసనమునందు కూర్చున్నవాడైన ఈ రాజొక్కడు కలుగగా కల్పవృక్షము యాచకులయొక్క యాచించడమనే వ్యసనము లేకపోవుటచే అధికమైన పండ్ల బరువనెడి మిషతో వంగినదై మనసునందు సిగ్గుపడుచుండును. (అలంకారము – రూపకము, అపహ్నుతి, అతిశయోక్తి)

157 మ. **కలుచం గోశబిలంబు వెల్వడి యద: ఖడ్గాహి పై వచ్చుచో**
**జలనం బించుక లేక యీతని రిపు క్ష్మాపాల సంఘాత మో**
**చెల ! హస్తాంబురుహాంగుళీమయ మహా సిద్ధౌషధీ పల్లవాం**
**చలముల్మేసి భజించు జాంగులికతన్ సంగ్రామరంగంబులన్**

అద:ఖడ్గాహి = ఈ రాజుయొక్క కత్తియనెడి సర్పము, కలుచన్ = కోపముచే, కోశబిలంబు = ఒరయనెడి కన్నమునుండి, వెల్వడి = బయటకువచ్చి, పై వచ్చుచోన్ = మీదకు వచ్చునపుడు, ఈతని = ఈ రాజుయొక్క, రిపుక్ష్మాపాల సంఘాతము = శత్రురాజుల సమూహము, చలనంబు ఇంచుక లేక, సంగ్రామరంగంబులన్ = యుద్ధరంగములందు, ఓచెల = అయ్యయ్యో !, హస్తాంబురుహ = హస్త పద్మములయొక్క, అంగుళీమయ = అంగుళీరూపములైన, మహాసిద్ధౌషధీ = గొప్ప సిద్ధౌషధీ లతలయొక్క, పల్లవాంచలముల్ = చిగుళ్ళను, మేసి = తిని, జాంగులికతన్ = విషవైద్యత్వమును, భజించు = పొందును.

తా. ఈ రాజుయొక్క కత్తియనెడి సర్పము కోపంతో ఒరయనే కన్నమునుండి బయటకువచ్చి మీదకు వచ్చునపుడు శత్రురాజులు చైతన్యములేక యుద్ధరంగములందు అయ్యయ్యో ! చేతులయొక్క అంగుళీ రూపములైన సిద్ధౌషధీలతల చిగుళ్ళను తిని విషవైద్యత్వమును పొందుచున్నారు.

158 వ. **అని పలికి పలుకుబోటి వరాటకరాజకన్యకం గనుంగొని యప్పు డయ్యింతి యంతరంగంబు నిరంతర స్మరణ సరణి ధారావాహి జ్ఞానధారా సమారూఢ నిషధ పరివృఢంబగుట నెఱింగియు నెఱుంగని చందంబు భావించుచుం బ్రస్తావోచిత ప్రకారంబునం జతురంతయానధరులం బదండు పదండని యుత్కలాధీశ్వరుం గడచి యసమ సమర విస్మృమర చమూ మదాంధ గంధసింధుర ఘటావమధు శీకరాసారహారి నీహార సమయ కంపితారాతి హృదయకమలుండును, మదవదరి చూడా కురువింద కందళ కిరణ సందోహ సందీపిత చరణారవిందుండును, గరళ కరాళకర వాలధారా నికృత్త గళద్రక్త రిపు సుభట**

**నటారబ్ధ నాట్యాద్భుతా లోకహృష్ట త్రివిష్టప నివాసుందును నగు నొక రాసుతుం జూపి దేవి ! యితండు కీకటాధీశ్వరుం డిమ్మహీపతిపుంగవు నపాంగ రంగస్థల లాస్య లంపటంబులగు కటాక్ష వీక్షణంబుల నిరీక్షింపుము.**

తా. అని పలికి సరస్వతి దమయంతిని చూచి అప్పుడు ఆ దమయంతియొక్క మనసు ఎడతెగని జ్ఞాపక మార్గములను విడువక పయిపయిసాగుచున్న ప్రవాహరూపముగానున్న జ్ఞానమునందు అధిష్ఠించిన నిషధరాజు గలదగుట తెలిసియు తెలియనిదాని విధంబును కనబరచుచు, ఆ ప్రస్తావన కుచితమగు రీతినే పల్లకిమోయువారిని పదండు పదండని ఉత్కల రాజును దాటి సాటి లేని యుద్ధమందు విజృంభించిన సేనయందలి మదించిన గంధగజముల సమూహముల మదముయొక్క తుంపురుల జడివానయనెడి మనోహరమైన హేమంతముచే చలింపచేయబడుచున్న శత్రువులయొక్క మన:పద్మముకలవాడును, మదించిన శత్రువులయొక్క కేశపాశమందున్న కెంపుల అంకురములయొక్క కిరణసమూహముచేత ప్రకాశించుచున్న పాదపద్మములు కలవాడును, విషము వలె భయంకరమైన కత్తి అంచుచే నరకబడి కారుచున్న నెత్తురుకల శత్రుభటులనెడి నటులచేత చేయబడుచున్న నృత్యమను వింతను చూచుటచేత సంతసించిన మూడులోకముల జనులు కలవాడునుయైన ఒక రాజకుమారుని చూపి 'దేవి! ఇతండు కీకటదేశపు రాజు. ఈ రాజశ్రేష్ఠుని కడకన్నులనెడి రంగస్థలమందు నాట్యముచేయుటయందు ఆసక్తికలవైన చూపులచే చూడుము.

159 స్రగ్ధర **లీలం గట్టించె( బెక్కు ల్నెలవుల( జెఱువు ల్వీ(డు సాంద్ర ద్రుమాళీ**
**వ్యాలీఢోపాంత శాంత వ్యథ పథిక జనస్వాంతముల్ కీర్తిలక్ష్మీ**
**మూలంబుల్ నీలనీలాంబుజదళ దళనామోద మేదస్వి పాథ:**
**కేళీలోల ద్విజాళీకృత మధురకల క్రేంక్రియా సంకులంబుల్**

వీడు = ఈ రాజు, సాంద్ర = దట్టమైన, ద్రుమాళీ = వృక్షములచే, వ్యాలీఢ = వ్యాప్తమైన, ఉపాంత = తీరములుగలదగుటచే, శాంత = శమింపచేయబడిన, వ్యథ = గ్రీష్మతాపముగల, పథికజన స్వాంతముల్ = బాటసారుల మనసులుకలవియు, కీర్తిలక్ష్మీ = కీర్తి సంపదకు, మూలంబుల్ = మూలములైనవియును, నీల = నీలమణులవంటి, నీల అంబుజ = నల్లకలువలయొక్క దళ = రేకులు, దళన = విడుటచే కలిగిన, ఆమోద = పరిమళముచే, మేదస్వి = పోషింపబడిన, పాథ: = ఉదకములయొక్క కేళీలోల = విహరించుటయందు ఆసక్తికల, ద్విజాళీ కృత = పక్షులచే చేయబడుచున్న, మధుర = తియ్యని, కల = మధురమైన, క్రేంక్రియా = క్రేంకార ధ్వనులచే, సంకులంబుల్ = నిండినవియునైన, చెఱువులు = తటాకములు, పెక్కులు, నెలవులన్ = ప్రదేశములందు, లీలన్ = హేలగా, కట్టించెన్ = నిర్మించెను.

తా. ఈ రాజు వృక్షములచే దట్టమైన, వ్యాప్తమైన తీరములు గలదగుటచే శాంతింపబడిన గ్రీష్మతాపముగల బాటసారుల సమూహములుగలవియు, కీర్తిసంపదకు మూలములైనవియు, నీలమణులవంటి నల్లకలువల రేకులు విడుటచే కలిగిన పరిమళముచే పోషింపబడిన ఉదకములయందు విహరించుటయందు ఆసక్తికల పక్షులచే చేయబడుచున్న తియ్యని మధురమైన క్రేంకార ధ్వనులచే నిండినవైన తటాకములు అనేకములైన ప్రదేశములందు హేలగా నిర్మించెను.

160 మహాస్రగ్ధర **మహిళా సీమంత ముక్తామణి ! యితని యశోమండలీ పూర్ణ రాకా**
**తుహినాంశుల్ దాడిమై వత్తురు వడి( దనపై దొమ్మిగానంచు( జుమ్మీ**
**మహిగోళచ్ఛాయ మాయామయ గణిత కళామాత్ర లక్ష్యాంగకుండై**
**గ్రహవీథిన్ దుర్గవీథిం బ్రభచెడి యొదు(గున్ రాహు రాహుత్తు(డోటన్**

మహిళా = స్త్రీలయొక్క, సీమంత = పాపటలందున్న, ముక్తామణి = ముక్తామణివంటిదానా !, రాహు రాహుత్తుడు = రాహువనెడి రౌతు, ఇతని = ఈ రాజుయొక్క , యశోమండలీ = కీర్తి సముదాయమనెడి, పూర్ణరాకాతుహినాంశుల్ = పున్నమిచంద్రుని వెన్నెలలు, తనపైన్, వడిన్ = శీఘ్రముగా, దొమ్మిగా = గుత్తగా, దాడిమై వత్తురు = దండయాత్రగా వచ్చెదరు, అంచున్ చుమ్మీ = అనియేమోకదా ! మహిగోళ చ్ఛాయ = భూగోళముయొక్క నీడయనెడు, మాయామయ = కపటస్వరూపమైన, గణితకళామాత్ర = జ్యోతిషశాస్త్రముచేతనే, లక్ష్య = చూడబడుచున్న, అంగకుడై = శరీరముకలవాడై, గ్రహవీథిన్ = గ్రహమార్గములందు, ప్రభచెడి = కాంతి తరిగి, ఓటన్ = భయముచే, దుర్గవీథిన్ = కోటలోని గృహమందు, ఒదుగున్ = దాగియుండును.

తా. స్త్రీరత్నమా ! రాహువనెడి రౌతు ఈ రాజుయొక్క కీర్తియనెడి పున్నమి వెన్నెలలు తనపై గుత్తగా దండయాత్ర చేయుననియేమో భూగోళముయొక్క నీడయనెడు కపటస్వరూపమైన జ్యోతిషశాస్త్రముచేతనే చూడబడుచున్న శరీరముకలవాడై గ్రహమార్గములందు కాంతి తరిగి భయముచే కోటలోని గృహమందు దాగియుండును.

(రాహువు భూగోళపు నీడయని జ్యోతిషశాస్త్రము తెలుపుచున్నది)

161 మహాస్రగ్ధర **తరుణీ ! దామోదరీయోదర కుహరదరీ స్థాన మీ విశ్వధాత్రీ**
**శ్వరు కీర్తుల్ నించి పాఱన్ జటులగతి జగజ్జాలముల్ దేలియాడన్**
**మురజిన్నాభి ప్రణాళీ ముఖమున ధవళాంభోజ మన్వేర( గాదా**

**నెరవై తత్పూర మంతర్నిబిడమయి బహిర్నిర్గమంబు న్భజించెన్**

తరుణీ !, ఈ విశ్వధాత్రీశ్వరు కీర్తుల్ = సకల భూమీపతి యశంబులు, దామోదరీయ = విష్ణుసంబంధియగు, ఉదరకుహర = గర్భములోపలి, దరీ = గుహవంటి, స్థానమున్ = ప్రదేశమును, నించి = నిండించి, పాఱన్ = ప్రవహింపగా, చటులగతిన్ = సమర్ధతతో, జగజ్జాలముల్ = విష్ణుగర్భములోని సమస్త లోకములును, తేలియాడన్ = తేలిపోవునట్లుగా, తత్పూరము = ఆ కీర్తి ప్రవాహము, నెరవై = అచ్చట నిండినదై, అంతర్నిబిడమయి = లోపల మిక్కిలి సాంద్రమై, మురజిత్ = విష్ణునియొక్క, నాభి ప్రణాళీ ముఖమునన్ = నాభి యనెడు తూముముూలమున, ధవళాంభోజము = తెల్ల తామరపూవు, అన్పేరన్ కదా = అను పేరుతోకదా !, బహిర్నిర్గమంబున్ భజించెన్ = పైకి వచ్చెను.(అలంకారము – రూపకము, అతిశయోక్తి, ఉత్ప్రేక్ష)

తా. కాంతా ! ఈ రాజు కీర్తి విష్ణు గర్భములోపలి గుహవంటి ప్రదేశమును నిండించి ప్రవహింపగా సమర్థతతో ఆ విష్ణుగర్భములోని సమస్త లోకములును తేలిపోవునట్లుగా ఈ కీర్తిప్రవాహము అక్కడ నిండినదై లోపల చోటులేక విష్ణునియొక్క నాభి యనెడు తూముద్వారా తెల్లతామరపూవు అను పేరుతో పైకి వచ్చెను.

162 వ. **అనిన వినియు ననాదర ముద్రాముద్రితంబైన హృదయంబులో నవ్విద్రుమాధర కీకటాధీశ్వరుం గటాక్షింపకుండిన**

తా. సరస్వతి అట్లు పలుకగ వినినప్పటికినీ తిరస్కారముద్రా చిహ్నితమైన చిత్తముతో పగడమువంటి అధరోష్ఠముకల దమయంతి కీకట రాజును చూడకుండిన

163 ఉ. **వేసటలేక భీమపృథివీపతినందన యాననాంబుజో**
**ల్లాస విరక్తిముద్ర పదిలంబుగ( గన్గొని యాదినాంత సం**
**ధ్యాసమయాధి దేవత పితామహు పట్టపుదేవి గీకటుం**
**బాసి చనం దలంచె మతి పంచనలీమణి మంచవీథికిన్**

ఆదిన అంత సంధ్యాసమయ = సాయంకాల సంధ్యకు, అధిదేవత = అధిదేవతయును, పితామహు పట్టపుదేవి = బ్రహ్మదేవుని రాణి సరస్వతి, వేసటలేక = అలసటలేక, భీమపృథివీపతినందన = దమయంతియొక్క, ఆనన అంబుజ = ముఖపద్మమునందు, ఉల్లాస విరక్తి ముద్ర = సంతోషమందు విరక్తిని చూపు చిహ్నమును, పదిలంబుగ = జాగరూకతతో, కన్గొని = చూచి, కీకటున్ = కీకటదేశ రాజును, పాసి = విడిచి, మతి = అవతలనున్న, పంచనలీ = అయిదుగురు నలులున్న (నలరూపధారులైన ఇంద్రాదులు), మణిమంచవీథికిన్ = రత్నాసనములున్న ప్రదేశమునకు, చనన్ = వెళ్ళుటకు, తలంచెన్ = ఆలోచించెను.

తా. సాయంకాలసంధ్యకు అధిదేవతయును, బ్రహ్మదేవుని పట్టపురాణియునైన సరస్వతి అలసటలేక దమయంతియొక్క విరక్తిని జాగరూకతతో కనుగొని కీకటరాజును విడిచి అవతల అయిదుగురు నలులున్న చోటునకు వెళ్ళుటకు ఆలోచించెను.

164 వ. **అప్పుడు సరస్వతీ నిర్దేశంబున యానధుర్యులు రాజసమాజంబువలనం బాపి భోజరాజ కన్యకను నిషధరాజ పంచకంబునుం గదియించుట( బరిమళంబులు నందనోద్యాన తరుషండంబులవలన( బాపి మధుపపాలికం గల్పపాదప పంచకంబునుం గదియించిన చందంబు( దోచె ననంతరంబ నలాకృతిధరులైన యాలోకపాలురం జూపి క్రమంబున**

తా. ఆ సరస్వతీదేవి యాజ్ఞచొప్పున పల్లకిమోయువారు దమయంతిని ఆ రాజులనుండి తొలగించుకొనిపోయి అయిదుగురు నలులను సమీపింపచేయుట సువాసనలు నందనవనమందున్న యితర వృక్షసమూహములనుండి తుమ్మెదలను కల్పవృక్షముల నైదింటిని చేర్చిన విధము కన్పట్టెను. అపుడు నలరూపధరులైన ఆ లోకపాలురను చూపి వరుసగా

165 తే. **వాణి యిట్లను నక్కీరవాణి కెలమి**
**గూఢ శబ్దార్థ సంశ్లేష రూఢి మెఱయ**
**నిర్జరాధీశ్వరులకును నిషధపతికి**
**వర్ణనా వాక్యరచన నన్వయము గలుగ**

నిర్జరాధీశ్వరులకును = దిక్పాలకును, నిషధపతికిన్ = నలునకును, వర్ణనావాక్యరచనన్ = వాక్యరచనా వర్ణనచేత, అన్వయము కలుగన్ = సంబంధము కలుగునట్లుగా, గూఢ = గుప్తములైన, శబ్దార్ధ సంశ్లేష = శబ్దార్థములయొక్క కలయికయందు, రూఢి మెఱయన్ = నిర్ణయము ప్రకాశింపగా, ఎలమిన్ = సంతోషముతో, వాణి = సరస్వతి, ఆ కీరవాణికిన్ = ఆ దమయంతికి, ఇట్లను = ఇట్లు పలికెను.

తా. దిక్పాలకును నలునకును వాక్యరచనా వర్ణనచేత సంబంధము కలుగునట్లుగా గుప్తములైన శబ్దార్థములయొక్క కలయికయందు నిర్ణయము కలుగునట్లుగా సంతోషముతో వాణి ఆ దమయంతికి ఇట్లు పలికెను.

166 చ. **అతివ ! యపవ్యయాయుని ననల్ప విలోచన పంకజాతు( బ్రీ**
**ణిత నిజ వీరసేనుని వినిర్జిత సర్వ మహీభృదావళిన్**
**హతమదవ ద్విరోధి బలు నాత్మ చమూ చర వారణానన**
**స్రుత మదగంధి యుద్ధమహి( జూడుము వీని మహిన్మహేంద్రునిన్**

అతివ !, అ పవి అపాయునిన్ = వజ్రాయుధమును విడువనివానిని, అనల్ప విలోచన పంకజాతున్ = పెక్కైన పద్మములవంటి నేత్రములుకలవానిని, ప్రీణిత = సంతోషింపచేయబడిన, నిజ = స్వకీయమైన, వీర సేనుని = వీర సైన్యముకలవానిని, వినిర్జిత = జయింపబడిన, సర్వ = సమస్తమైన, మహీభృదావళిన్ = పర్వత సమూహములు కలవానిని, హత = కొట్టబడిన, మదవత్ = గర్వించిన, విరోధి = శత్రువైన, బలున్ = బలాసురుడుకలవానిని, ఆత్మ = తనయొక్క, చమూ = సేనయందు, చర = సంచరించుచున్న, వారణానన = విఘ్నేశ్వరుని ముఖమునుండి, స్రుత = స్రవించుచున్న, మదగంధి = మదము వాసనతోకూడిన, యుద్ధమహిన్ = యుద్ధభూమిగల, వీనిన్ = వీనిని, మహిన్ = భూమియందున్న, మహేంద్రునిన్, చూడుము.

తా. ఓ కాంతా ! వజ్రాయుధమును విడిచిపెట్టనివాడును, అనేక నేత్రపద్మములు కలవాడును, సంతోషింప చేయబడిన వీరసైన్యము కలవాడును, జయించిన సమస్త పర్వతసమూహములుకలవాడును, మదించిన బలాసురుణ్ణి సంహరించినవాడును, వినాయకుని ముఖమునుండి కారు మదము వాసనతో కూడిన యుద్ధభూమికలవాడునునైన వీనిని భూమికి దిగివచ్చిన మహేంద్రుని చూడుము.

**నలుని పరంగ –** ఓ దమయంతీ ! తొలగిన అపాయములు కలవాడును, విశాలమైన నేత్రపద్మములు కలవాడును, సంతోషపెట్టిన తన తండ్రియగు వీరసేనుడు కలవాడును, జయింపబడిన సమస్త రాజబృందము కలవాడును, మదించిన శత్రుసైన్యమును చంపినవాడును, తన సేనయందున్న ఏనుగుల ముఖములనుండి స్రవించుచున్న మదపరిమళముగల యుద్ధభూమికలవాడునునైన వీనిని భూలోక దేవేంద్రుని చూడుము.

167 సీ. **[illegible] దుద్గతిమంతు(**
**దధిక ప్రతాప సమన్వితుండు**
**హేతి సంభూత ప్రభూత భూతియుతుండు**
**శుచి ధనంజయు(డు విస్ఫూర్తిశాలి**
**నానా మహా సమిన్మధ్య ప్రదీప్తుండు**
**సతతంబు విబుధ సంతతికి ముఖము**
**లాలిత బాల ప్రవాళ తామ్రకరుండు**
**తనకు శాత్రవసముత్కరము తృణము**
తే. **తామరసపత్రనేత్ర యీతండనలు(డు**
**లావు గలవా(డు లోకపాలకులలోన**
**బహుతరస్నేహరుచి మహాబలసహాయ**
**సంపదుద్దాము( డెలమి వీక్షింపు మితని**

తామరస పత్ర నేత్ర = పద్మదళనేత్రీ !, భాస్వర రూప సంపన్నుడు = దేదీప్యమానమైన రూపసంపదకలవాడు, ఉద్గతిమంతుడు = ఊర్ధ్వగమనము కలవాడు, అధిక ప్రతాప సమన్వితుండు = గొప్ప ఉష్ణస్పర్శ కలవాడు, హేతి సంభూత = జ్వాలలవలన పుట్టిన, ప్రభూత = అధికమైన, భూతియుతుండు = భస్మముతోకూడినవాడు, శుచి = పవిత్రతకలవాడు, ధనంజయుడు = ధనంజయుడను పేరు కలవాడు, విస్ఫూర్తిశాలి = అధికమైన ప్రజ్ఞచేత ఒప్పువాడు, నానా = పలువిధములైన, మహా = గొప్పవైన, సమిత్ = సమిధల, మధ్య ప్రదీప్తుండు = మధ్య ప్రకాశించువాడు, విబుధ సంతతికిన్ = దేవతా సమూహమునకు, సంతతంబు = ఎల్లప్పుడును, ముఖము = నోరగుచున్నవాడు, లాలిత = మనోహరమైన, బాల = లేతవైన, ప్రవాళ = చిగుళ్ళవంటి, తామ్ర = ఎఱ్ఱనైన, కరుండు = కిరణములుకలవాడు, తనకున్, తృణము = గడ్డిపరక, శాత్రవసముత్కరము = శత్రుసమూహమైనవాడు, ఇతండు, అనలుడు = అగ్ని, లోకపాలకులలోనన్, లావుగలవాడు = సామర్థ్యముకలవాడు, బహుతర స్నేహరుచి = ఎక్కువగ నూనెను ఇష్టపడువాడు, మహాబల = వాయువుయొక్క, సహాయ సంపత్ = సహకార సంపదచే, ఉద్దాముడు = అడ్డులేనివాడు, ఇతనిన్, ఎలమిన్ = ప్రీతితో, వీక్షింపుము

తా. పద్మదళనేత్రీ ! దేదీప్యమానమైన రూపసంపదకలవాడు, ఊర్ధ్వగమనము కలవాడు, గొప్ప ఉష్ణస్పర్శ కలవాడు, జ్వాలలవలన పుట్టిన అధికమైన భస్మముతో కూడినవాడు, పవిత్రతకలవాడు, ధనంజయుడను పేరుకలవాడు, అధికమైన ప్రజ్ఞచేత ఒప్పువాడు, పలువిధములైన గొప్ప సమిధల మధ్య ప్రకాశించువాడు, దేవతాసమూహమునకు నోరైనవాడు, మనోహరమైన, లేత చిగుళ్ళవంటి ఎఱ్ఱనైన కిరణములుకలవాడు, గడ్డిపరకలను శత్రువులుగా దహించువాడు ఇతడు అగ్నిహోత్రుడు. లోకపాలకులలో సామర్థ్యముకలవాడు. ఎక్కువగ నూనెను ఇష్టపడువాడు, వాయువుయొక్క సహాయ సమృద్ధిచే అడ్డులేనివాడు. వీనిని ప్రీతితో చూడుము.

**నలుని పరంగ –** దీప్తితోను, మధురమైన కంఠస్వరముతోను, సౌందర్యముతోను కూడినవాడు, అభ్యుదయముకలవాడు, గొప్ప క్షాత్ర తేజస్సుకలవాడు, ఆయుధమువలన పుట్టిన అధిక ఐశ్వర్యముతో కూడినవాడు, స్వధర్మముచేతనే ధనమునార్జించినవాడు, గొప్ప జ్ఞాపకశక్తికలవాడు, అనేకమైన గొప్ప యుద్ధములందు ప్రకాశించువాడు, ఎల్లప్పుడు పండితసమూహమునకు అగ్రగణ్యుడు, మనోహరమైన, ఎఱ్ఱని లేత చిగుళ్ళవంటి చేతులుకలవాడు, శత్రుసమూహము గడ్డిపరకగా భావించువాడు, ఇతడే నలుడు.

లోకపాలకులైన రాజులలో బలముకలవాడు, మిక్కిలి గొప్పదగు స్నేహభావముకలవాడు, గొప్ప బలవంతులయొక్క సహాయ సమృద్ధిచే అడ్డులేనివాడు. వీనిని ప్రీతితో చూడుము.

168 **తే. పరభయంకర పటుగదా ప్రహరణుండు**
**ధర్మనిపుణుండు సమవర్తి ధర్మరాజు**
**మిత్రనందను( దంభోజనేత్ర ! చూడు**
**మితని దక్షిణనాయకు నింపుమీఱ**

అంభోజనేత్ర !, ఇతడు, పర = ఇతరులకు, భయంకర = భయమును కలిగించు, పటుగదా = గొప్ప రోగములను, ఆప్రహరణుండు = అంతటా ప్రయోగించువాడు, దండ నిపుణుండు = దండమను అయుధముచే నేర్పరి, సమవర్తి = సమముగా ప్రవర్తించువాడు, ధర్మరాజు, మిత్రనందనుడు = సూర్యుని కుమారుడు, దక్షిణ నాయకున్ = దక్షిణ దిక్కునకు అధిపతియైన, ఇతనిన్, ఇంపుమీఱ = అనురాగముతో, చూడుము

తా. పద్మనేత్రీ ! ఇతడు ఇతరులకు భయమును కలిగించు గొప్ప రోగములను ప్రయోగించువాడు. దండాయుధమునందు నేర్పరి, అందరియందు సమముగా ప్రవర్తించువాడు, సూర్యుని కుమారుడు, ధర్మరాజు దక్షిణ దిక్కునకు అధిపతి ఇతనిని అనురాగముతో చూడుము.

**నలుని పరంగా** – శత్రువులందు భయంకరమైన గదాయుధమును ప్రయోగించువాడు, ప్రజలను శాసించుటయందు నేర్పు కలవాడు, అందరియందు సమన్యాయముచూపువాడు, ధర్మమును పాటించుటయందు సమర్థుడు, మిత్రులను సంతసింప చేయువాడు, ఈ దక్షిణ నాయకుని అనురాగముతో చూడుము.

169 **క. ధవళాక్షి ! చూడు మీతని**
**భువనాధీశ్వరు నపార భూరి గభీర**
**త్వ విశేష నిధి నదీనుని(**
**బ్రవిమలతర వారి నధికబల సత్త్వాఢ్యున్**

ధవళ అక్షి = తెల్లని నేత్రములుకలదానా !, భువన అధీశ్వరున్ = నీటికి అధిపతియైనవానిని, అపార = హద్దులేని, భూరి = గొప్పదైన, గభీరత్వ విశేష = గాంభీర్యాతిశయమునకు, నిధి = స్థానమైనవానిని, నది ఇనునిన్ = నదులకు భర్తయైనవానిని, ప్రవిమల తర వారి = మిక్కిలి నిర్మలమైన జలములుకలవానిని, అధికబలసత్త్వాఢ్యున్ = అధిక బలముకల జలజంతువులున్నవానిని, ఈతనిన్ = ఈ వరుణదేవుని, చూడుము

తా. ధవళాక్షీ ! నీటికి అధిపతియైనవానిని, హద్దులేని గొప్ప గాంభీర్యాతిశయమునకు స్థానమైనవానిని, నదులకు భర్తయైనవానిని, మిక్కిలి నిర్మలమైన జలములు కలవానిని, అధిక బలముకల జలజంతువులున్నవానిని ఈ వరుణదేవుని చూడుము. **నలుని పరంగా** – లోకమున కధిపతియును, విస్తారమైన బంగారము, గాంభీర్యము నిధులుగా కలవాడును, దైన్యగుణము లేనివాడును, మంచి కత్తికలిగి గొప్ప దేహబల సామర్థ్య ప్రయత్నముచే నిండినవాడునునగు ఈ నలమహారాజును చూడుము.

170 **వ. అని యాఖండలు గుఱించియు, నగ్ని నుద్దేశించియు, నంతకు లక్షించియు, నంబుపతిం గూర్చియు( ద్రిభువనార్చిత చరణారవిందయగు నరవిందభవుదేవి తదీయ మాయారూపంబులకు ననురూపంబుగా( బ్రత్యేకంబ యుభయార్థ వచన సమర్థంబులగు వర్ణనా వాక్యంబులం బ్రబోధించిన విదర్భధాత్రీపతిపుత్త్రి నేత్ర శ్రోత్రంబులం జూచియు వినియు నితం డితండని నిర్ణయింపనేరక డెందంబు డోలాందోళనంబు నొంద విధిపజ్జను నిషేధంబుత్రోవనుం బోవని తలంపున నిలింప నిషధ రాజులను నలువుర విస్మయస్మేరంబులగు విలోకనంబుల నవలోకించునది క్రమంబున భారతి నిర్దేశంబున నైసర్గిక విలాస భాసమానుండును నసమాన రూపరేఖా విడంబిత శంబరారాతియునగు నిషధభూపతిం జూచె నప్పుడు**

తా. అని ఇంద్ర, అగ్ని, యమ, వరుణులను గూర్చి ముల్లోకముల వారిచేతను పూజింపబడుచున్న పాదపద్మములుకల బ్రహ్మదేవుని ఇల్లాలు వారియొక్క మాయా రూపములకు తగినవిధముగా ప్రత్యేకంగా రెండు అర్థముల వచనములకు సరిపడిన వర్ణనా వాక్యములతో వివరించగా దమయంతి కనులతో చూచియు, చెవులతో వినియు ఇతడు ఇతడని తెలుసుకొనలేక మనసునందు ఆందోళనచెందగా సరస్వతీ నియోగముచొప్పున వారిలో నొకరిని వరించుటకుగాని, వరింపకుండుటకుగాని పోవని కోర్కెతో దేవతలైన నలులను నలుగురను ఆశ్చర్యకరమైన చూపులతో చూచుచుండిపోయిన దమయంతి క్రమముగా సరస్వతి నియోగముచే స్వభావసిద్ధమైన కాంతులతో ప్రకాశించుచున్న, సాటిలేని రూప సౌందర్యముతో మన్మథుడునునైన నలమహారాజును చూచెను. అప్పుడు

171 **క. శారద మధురాలాప వి**
**శారద యింద్రాగ్నిశమనసలిలేశ నుతి**
**ద్వారమున నిషధపతి( గై**
**వారం బొనరింప( దొడ(గె వాచాప్రౌఢిన్**

మధుర ఆలాప విశారద = చక్కగా పలుకుటయందు నేర్పరురాలైన, శారద, ఇంద్ర, అగ్ని, శమన = యముడు, సలిల ఈశ = వరుణులను, నుతి ద్వారమునన్ = స్తుతించుట ద్వారా, నిషధపతిన్ = నలరాజును, వాచాప్రౌఢిన్ = మాటల నేర్పుతో, కైవారంబు ఒనరింపన్ = స్తుతిచేయుటకు, తొడగెన్ = పూనుకొనెను.
తా. చక్కగా పలుకుటయందు నేర్పరురాలైన సరస్వతి ఇంద్ర,అగ్ని,యమ,వరుణులను స్తోత్రముచేయుటద్వారా నలుని మాటలనేర్పుతో స్తుతిచేయుటకు పూనుకొనెను.

172 తే. **నలిననేత్ర ! ప్రత్యర్థి దానవశ తాహి**
**తాత్మ చేష్టా గరిష్ఠత నరసి చూడ**
**నిత(డు జీమూతవాహను( డింత నిక్క**
**మింపు పొంపిరివోవ నీక్షింపు మితని**

నలిననేత్ర = పద్మనేత్రీ !, ప్రతి అర్థి = ప్రతి యాచకునిగూర్చియు, దానవశతా = దానగుణముచే, ఆహిత = చేయబడిన, చేష్టా = యాచకుల కనుకూలమగు వ్యాపారమునందలి, గరిష్ఠతన్ = గొప్పతనముచే, అరసిచూడన్ = పరిశీలించి చూడగా, ఇతడు = ఈ మహారాజు, జీమూతవాహనుడు = జీమూతవాహనుడను రాజునకు సాటివచ్చువాడు. ఇంత నిక్కము = ఇది సత్యము, ఇంపు పొంపిరివోవన్ = ఆనందము అతిశయించునట్లుగా, ఇతనిన్, వీక్షింపుము = చూడుము.
తా. పద్మనేత్రీ ! ప్రతియాచకునికి దానగుణముచే వశుండై యాచకుల కనుకూలమగు వ్యాపారమునందలి గొప్పతనముచే పరిశీలింపగా ఈ మహారాజు జీమూతవాహనుడే. ఇది సత్యము. ఆనందముతో వీనిని చూడుము.

173 వ. **మఱియు నితండు హుతవహుండునుంబోలె బహువిగాఢ మఘవదధ్వ రాజ్యాభిషేక వికస్వర తేజో విరాజితుం డీశానమూర్తి భేదంబును, దండధరుండునుంబోలె( బరప్రాణోత్క్రాంతిదాన సమర్థ శక్తిసంపన్నుండును, సంజ్ఞానంద కరుండును, వరుణుండునుంబోలె( బ్రతికూలవాత ప్రచారచటుల వాహినీ సహస్ర సంసేవితుండును, బ్రచేతసుండు నితనిం గనుంగొను మిప్పురుష పంచకంబునందు నీకుం గన్నిచ్చకువచ్చునతని వరియింపుమని పలికి పలుకుందొయ్యలి యూరకుండె నప్పుడు మాయా నిషధరాజ కాయచ్ఛాయాంతర్వర్తులగు విబుధచక్రవర్తుల నలువుర నతిక్రమించి పంచమకోటియగు నలునియందు( బురాకృత పరిపాక వాసనావశంబుననో పరమ పాతివ్రత్యగుణ గౌరవంబుననో జాత్యంతరసంగతి గ్రహణంబుననో యక్కురంగలోచన చూపు నెలవుకొనియె. వెండియు**

తా. మరియును ఇతడు అగ్నివలె మిక్కిలి సేవింపబడిన దేవేంద్రునియొక్క మార్గముగలదైన దొరతనమందు పట్టాభిషేకముచే వికసిల్లుచున్న ప్రతాపముచే ప్రకాశించుచున్నవాడును, ఈశానుడనెడి లోకపాలకునియొక్క అపరస్వరూపుడును – యమునివలె శత్రువులను సంహరించుటయందు తగిన శక్తితో కూడికొనియున్నవాడును, పండితులకు ఆనందమును కలిగించువాడును – వరుణునివలె ఎదురుగాలియొక్క ప్రసరణ వేగముగల సేనల బాహుళ్యముచే సేవింపబడుచున్నవాడును, గొప్ప మనసుకలవాడును ఇతనిని చూడుము. ఈ ఐదుగురందును నీకు కంటికి నచ్చినవానిని వరింపుము. అని పలికి సరస్వతి ఊరుకొనెను. అప్పుడు మాయా నలుని రూపములో వర్తించుచున్నవారైన ఇంద్రాదులను నలువురను దాటి ఐదవ స్థానమందున్న వాడగు నలునియందు పూర్వజన్మపుణ్య ఫలముగా సంస్కారాధీనమగుటచేతనో, గొప్ప పాతివ్రత్యగుణాతిశయము చేతనో, జన్మాంతర సంపర్క గ్రహణంబుననో ఆ దమయంతి చూపు నలునిపై స్థిరపడెను. తరువాత
**దిక్పాలకుల పరంగా** – ఇతడు అగ్నివలె పూర్తిగ ప్రవేశించినవాడై ఇంద్రుడుకల యజ్ఞములయందు నేతిపోతలచేత ప్రజ్వలించిన మంటచే ప్రకాశించువాడు, శివుని అష్టమూర్తులలో నొకడున, యమునివలె ఇతరుల ప్రాణములను హరించు శక్తిసంపన్నుడు, తల్లియగు సంజ్ఞాదేవికి అనందము కలిగించువాడు, వరుణునివలె గాలి తోపుదుచే తీరమువైపు తొణుకుచున్న వేగవంతములైన నదుల బాహుళ్యముచే సేవింపబడువాడు, ప్రచేతసుడను పేరు కలవాడు.

174 క. **ద్వాపర మపుడు విదర్భా**
**క్ష్మాపాల తనూజ మనసు( గల(గించె( గలి**
**ద్వాపరములు నలదమయం**
**తీ పరిణయమునకు సమ్మతింపనివె కదా !**

అపుడు, ద్వాపరము = సందేహము, విదర్భరాజతనూజ = దమయంతియొక్క, మనసున్, కలగించెన్ = బాధించెను, కలి ద్వాపరములు = కలిపురుషుడును, సందేహమును, నలదమయంతీ పరిణయమునకు, సమ్మతింపనివెకదా = అంగీరింపనివెకదా!
తా. అపుడు సందేహము దమయంతి మనసును బాధింపసాగెను. కలిపురుషుడును, సందేహమును నలదమయంతీ పరిణయమునకు అంగీకరింపనివెకదా !

175 చ. **స్ఫురదవలేపతన్ నిషధభూపతు లేవురు కారణంబుగా**
**బరువడి నొయ్యనొయ్య యుగపత్పరిమోహయమాణ బాణు(డై**
**మరు(డు విదర్భరాజసుత మానసముం గలగింప( బూనుచున్**

**శరముల సంఖ్యకున్ ఫలము సమ్మతి(గాంచి నటింపకుందునే**

మరుడు = మన్మథుడు, స్ఫురత్ అవలేపతన్ = ఉద్రేకించిన గర్వము కలవాడగుటచే, నిషధ భూపతులు = నిషధరాజులు, ఏవురు కారణంబుగా = ఐదుగురు కారణంగా చేసుకొని, పరువడిన్ = క్రమముగా, ఒయ్యన్ ఒయ్యన్ = మెల్లమెల్లగా, యుగపత్ = ఒక్కసారిగా, పరిమోహయమాణ = మోహమును కలిగించుచున్న, బాణుడై = బాణములుకలవాడై, విదర్భరాజసుత మానసమున్ = దమయంతి మనసును, కలగింపన్ పూనుచున్ = చలింపచేయ సమకట్టుచు, శరముల సంఖ్యకున్ = బాణసంఖ్యకు, ఫలమున్ = సాఫల్యమును, సమ్మతిన్ = ప్రీతిచే, కాంచి = పొంది, నటింపకుందునే = నటింపకుందునా !

తా. మన్మథుడు ఉద్రేకముతోకూడిన గర్వము కలవాడగుటచే నలులను ఐదుగురను కారణముగా చేసుకొని క్రమంగా మెల్లమెల్లగా ఒక్కసారిగా మోహమును కలిగించుచున్న బాణములుకలవాడై దమయంతి మనసును చలింపచేయ సమకట్టుచు బాణసంఖ్యకు సాఫల్యమును పొంది ప్రీతిచే పొంది నాట్యముచేయకుందునా ?

176 చ. **వెలయ(గ( బంచనైషధి విభేదము నేర్పఱుపంగలేక యా**
**కులత వహించి యిట్టితరి( గూరిమి నెచ్చెలి యొద్ద నుండినం**
**దెలియ(గ( జూపి చెప్పునకదేయని డెందమునం దలంచె నిం**
**పలర నరాళకేశి యమరాలయ హేమమరాళపుంగవున్**

అరాళకేశి = కుటిలములైన కేశములుకల దమయంతి, వెలయగన్ = బాగుగా, పంచనైషధి విభేదమున్ = ఐదుగురు నలుల వేర్పాటును, ఏర్పఱుపంగ లేక = విభజించలేక, ఆకులతన్ వహించి = వ్యాకులతను పొంది, ఇట్టి తరిన్ = ఇటువంటి సమయమున, కూరిమి నెచ్చెలి = ప్రియ స్నేహితుడైన హంస, ఒద్దన్ ఉండినన్ = దగ్గర ఉండిన, తెలియగన్ చూపి = స్పష్టమగునట్లుగా చూపి, చెప్పునకదే యని = చెప్పేదికదాయని, డెందమునన్ = మనసునందు, ఇంపు అలరన్ = ప్రేమ పుట్టునట్లుగా, అమర ఆలయ = సత్యలోకవాసియైన, హేమమరాళపుంగవున్ = బంగారు హంసశ్రేష్ఠమును, తలంచెన్ = స్మరించెను.

తా. దమయంతి చక్కగా ఐదుగురు నలులను వేర్పరుపలేక వ్యాకులతను పొంది, ఇటువంటి సమయమున తన ప్రియ స్నేహితుడైన హంస దగ్గరనున్నచో నలుని స్పష్టంగా చూపి చెప్పేదేకదాయని మనసున ప్రేమ పుట్టునట్లుగా సత్యలోకవాసియైన ఆ బంగారు హంసమును స్మరించెను.

177 వ. **శంకాలతావితానం బనేక నలావలంబి యగుచుం బ్రబ్బినం గడు నిబ్బరంబగు విభ్రమంబున నా విదర్భసుభ్రూలలామంబు నెమ్మనంబున నిట్లని వితర్కించు**

తా. సందేహ లతాసమూహములు అనేక నలుల నాశ్రయించి (అనేక తృణముల నాశ్రయించి) వర్ధిల్లగా మిక్కిలి దృఢమైన విభ్రాంతిచే ఆ దమయంతి తన మనసున ఈ రీతిగా మథనపడెను.

178 సీ. **ద్వివిధ చంద్రమతి ప్రతీతియో కాకతి**
**స్వచ్ఛ పదార్థోపసర్పణంబొ**
**యంగుళీముఖ పీడితాక్షి విక్రియయొక్కొ**
**మకరాంకు శాంబరీ మహిమయొక్కొ**
**విరహకాలోద్భ్రాంతి విభవానువృత్తియో**
**రూపింప నలు విశ్వరూపమొక్కొ**
**గణుతింప వేల్పుల కపటనాటకమొక్కొ**
**భారతీ పరిహాస భంగియొక్కొ**
తే. **కాక యీ యేవురందు నొక్కరు(డు నలు(డొ**
**మారు( డొక్క(డొ యొక(డు పురూరవుండొ**
**వరుసనున్న యీ చక్కని వారిరువురు**
**దేవతా వైద్య యుగ్మంబొ తెలియరాదు**

ద్వివిధ = రెండు తెరంగులైన, చంద్ర మతి = చంద్రులనెడి బుద్ధి, ప్రతీతియో = తోచుటయో, కాక, అతిస్వచ్ఛ = మిక్కిలి స్వచ్ఛములైన, పదార్థ ఉపసర్పణంబొ = పదార్థముల సమీపమునందుండుటయో, అంగుళీముఖ = వ్రేలికొనచేత, పీడిత = నలిపివేయబడిన, అక్షి విక్రియమొక్కొ = కంటి వికారమో, మకరాంకు = మన్మథునియొక్క, శాంబరీ మహిమయొక్కొ = శాంబరీవిద్యా మహిమయేమో, విరహకాల = విరహకాలమందలి, ఉద్భ్రాంతి = భ్రాంతి ఆధిక్యత, అనువృత్తియో = అనువర్తించు కొనుటో, రూపింపన్ = అలోచింపగా, నలున్ = నలునియొక్క, విశ్వరూపమొక్కొ = విశ్వరూపమేమో, గణుతింపన్ = యోచించగా, వేల్పుల = దేవతలయొక్క కపట నాటకమొక్కొ = మాయానాటకమేమో, భారతీ = సరస్వతియొక్క, పరిహాసభంగియొక్కొ = పరిహాసపు రీతియేమో, కాక = కాకున్న, ఈ ఏవురందు = అ ఐదుగురిలో, ఒక్కరుండు = ఒకడు, నలుడొ, మారుడు =

మన్మథుడు, ఒక్కడొ, ఒకదు, పురూరవుండొ, వరుసను ఉన్న = వరుసలోనున్న, ఈ చక్కనివారు ఇరువురు, దేవతావైద్యయుగ్మంబొ = దేవవైద్యులైన అశ్వనీకుమారులో, తెలియరాదు = తెలియకున్నది.

తా. రెండు విధములైన చంద్రులనెడి బుద్ధి తోచుటచేతనో కాక మిక్కిలి స్వచ్ఛమైన పదార్ధముల సమీపమునందుండుటయో, వ్రేలికొనచేత నలిపివేయబడిన కంటి వికారమో, మన్మథుని శాంబరీ విద్యా ప్రభావమో, విరహకాలమందలి భ్రాంతి అధికమై అనువర్తించుటయో, ఆలోచింపగా నలునియొక్క విశ్వరూపమేమో, యోచింపగా దేవతలయొక్క మాయానాటకమేమో, సరస్వతియొక్క పరిహాసపు రీతియేమో కాకున్న ఈ ఐదుగురిలో ఒకడు నలుడొ, మన్మథుడొ, పురూరవుడొ, వరుసలోనున్న ఈ చక్కని ఇరువురును అశ్వనీకుమారులో తెలియకున్నది.

179 తే. **విబుధవరులేని ప్రణమిల్లి వే(డుకొందు**
**నలుని వారేల యిత్తురు నాకు నతని**
**మదనశోషణ బాణ సంపాత పీత**
**ఘనకృపాసింధు గహ్వరాకారమతులు**

విబుధవరులు ఏని = వీరు దేవతలే ఐనచో, ప్రణమిల్లి = నమస్కరించి, నలుని, వేడుకొందు = బ్రతిమాలికొందును. మదన శోషణ = మన్మథునియొక్క ఎండింపచేయు, బాణ = బాణములయొక్క, సంపాత = పడుటచే, పీత = ఎండింపచేయబడిన, ఘన కృపాసింధు = గొప్ప దయాసముద్రము కలవారగుటచే, గహ్వరాణి = లోతయిన గోతులవంటి, ఆకార = రూపముగల, మతులు = మనస్సుకలవారగు, వారు = ఆ దేవతలు, నాకున్, అతనిన్, ఏల ఇత్తురు = ఎందుకు ఇస్తారు?

తా. వీరు దేవతలే ఐతే సమస్కరించి నలుని వేడుకుంటాను. కాని మన్మథుని బాణములు పడుటచే ఎండింపబడిన దయా సముద్రులగుటచే లోతయిన గోతులవంటి రూపములు, మనసులు ఉన్నవారు వీరు నలుని నాకెందుకు ఇస్తారు?

180 క. **మంచక మధ్య స్థిత మ**
**ద్వంచక పంచకమునందు వరుసమెయి( బరీ**
**క్షించెద నే నొక్కించుక**
**పంచజన సుపర్వ లక్ష్య పర్వశ్రేణిన్**

మంచక మధ్య = మంచెల నడుమ, స్థిత = ఉన్నట్టి, మద్వంచక = నన్ను మోసపుచ్చెడి, పంచకమునందున్ = ఐదుగురియందును, వరుసమెయిన్ = క్రమముగా, నేను, ఒక్కించుక = కొంచెము, పంచజన = మనుష్యులయందును, సుపర్వ = దేవతలయందును, లక్ష్య = చూడవలసిన, పర్వ = గురుతులయొక్క, శ్రేణిన్ = వరుసను, పరీక్షించెదన్ = పరిశీలించి చూచెదను.

తా. మంచెల మధ్యనున్నట్టి నన్ను మోసపుచ్చెడి ఈ ఐదుగురియందును క్రమముగా కొంచెము నేను మనుష్యులయందు, దేవతలయందు చూడవలసిన గుఱుతులను పరిశీలించి చూచెదను.

181 వ. **అనుచు నేవురం గలయం గనుంగొని యందు**

182 మ. **ధరణిం బొందని కోమలాంఘ్రి కమల ద్వంద్వంబులున్ ఘర్మ శీ**
**కర యుక్తంబులుగాని ఫాలములు వక్షః క్షోణులన్ బత్ర కే**
**సరముల్ గందని పూవుదండలు నిమేష వ్యాఖ్య( గైకోని దృ**
**క్సరసీజంబులు నల్వురందు( గనియెం కాంతాలలామం బొగిన్**

కాంతాలలామంబు = స్త్రీరత్నము, ధరణిన్ = భూమిని, పొందని = తాకని, కోమల అంఘ్రి కమల ద్వంద్వంబులన్ = మృదువైన పద్మములవంటి పాదములను, ఘర్మశీకరయుక్తంబులు కాని = చెమటబిందువులతో కూడినవికాని, ఫాలములు = నుదుళ్ళను, వక్షఃక్షోణులన్ = వక్షః ప్రదేశములందు, పత్ర కేసరముల్ = ఆకులును, కింజల్కములును, కందని పూవుదండలును = వాడిపోని పూలదండలను, నిమేష వ్యాఖ్యన్ = రెప్పపాటు వ్యాఖ్యానమును, కైకోని = పొందని, దృక్ సరసీజంబులు = నేత్రపద్మములను, ఒగిన్ = వరుసగా, నల్వురందున్, కనియెన్.

తా. ఆ దమయంతి భూమిని తాకని పాదపద్మములను, చెమట పట్టని నుదుళ్ళను, వక్షః స్థలములందు వాడిపోని పూలదండలను, రెప్పపాటులేని నేత్రపద్మములను వరుసగా నలుగురియందును చూచెను.

183 వ. **కని యైదవవా(డు నిషధరాజగుట యెఱింగి దేవతాప్రసాదంబు లేక యేకార్యంబు ఫలింపనేరదు. ప్రదక్షిణ ప్రక్రమణాలవాల విలేప ధూపావరణాంబుసేకంబుల సనేకంబులగు ఫలంబు లీ(జాలుటంజేసి వేల్పులు కల్పద్రుమ కాననంబులు సుపర్వులకుం జేయు నమస్య సర్వార్థసిద్ధి సాధక సమస్య విబుధసేవ యఖిలాభీష్ట ప్రదాన సురభి యనుచు సభా జనంబెల్ల విస్మయంబంది కనుంగొనుచుండ దివిజ సభాజనంబునకుం బ్రారంభించి వైశద్య హృద్యంబులగు ప్రస్తుతి ప్రసూన స్తబకంబుల నింద్రాది దేవ చతుష్టయంబు సంతుష్టి నొందించి తత్ప్రసాద లబ్ధంబైన బుద్ధి విభవంబున నమర్త్య విలక్షణంబులగు ధరణిక్షోద సంస్పర్శనంబును, బ్రస్వేదబిందు నిష్యందనంబును, గుసుమ మాల్య మ్లాని యాదిగా( గల చిహ్నంబులను సందేహంబు వాసి మనంబునకుం, జూపునకును సంవాదంబు సమకూడినం గందర్ప మందాక్షుంబులకు వశంవదయై చంచలంబగు కటాక్షాంచలం**

**బతని మూర్తి( బాయను దాయనుంజాలక యట్లాడ ననంతరంబ –**

తా. చూచి, ఐదవవాడు నలుడేయగుట తెలుసుకొని, దేవతల అనుగ్రహము లేక ఏ పనియును సఫలంబు కాదు. దేవతల చుట్టు తిరుగుటయను పాదులచేతను, చందనాదుల పూతయనెడి తెలికపిండి పూతచేతను, సాంబ్రాణి పొగయనెడి దోహద ధూపముచేతను, అంగదేవతా పరివేష్టనమనెడి చుట్టుకంచెచేతను, స్నానమనెడి నీటిపోతచేతను, అనేకంబులగు కార్యసిద్ధులను ఇచ్చుటకు దేవతలు కల్పవృక్ష వనములు. దేవతలకు చేయు నమస్కారము అశేషమైన కార్యసిద్ధుల సాధనములయొక్క సంగ్రాహక మైనది. దేవతా భజనము సమస్త వాంఛితముల నొసంగు కామధేనువువంటిది అని పలుకుచు సభాసదులందరును ఆశ్చర్యముతో చూచుచుండగా దేవతలను పూజించుటకు మొదలిడి మనోహరములైన స్తోత్రములనెడి పుష్పగుచ్ఛములచే ఇంద్రాదులను నలువురను సంతోషపరచి వారి యనుగ్రహమున లభించిన బుద్ధి సమృద్ధిచే దేవతలకు లక్షణములుగానివైన భూపరాగమును తాకుట, చెమట బిందువులు స్రవించుట, పూమాలలు వాడుట మొదలైన గుర్తులచే సందేహము విడిచి మనసునకు, చూపునకు సరిపడుట లభించినప్పటికిని మన్మథునకును, సిగ్గునకును లొంగినదై, చంచలమైన క్రీగంటి చూపు నలునిరూపమును విడుచుటకును, చేరుటకును సమర్థము కాక నడయాడుచుండగా, తరువాత

184 ఉ. **భావములోని కీలు పరిపాటి( బరిస్ఫుటతన్ విలాసమున్**
**బ్రోవ(గ వేడ్కతో నిషధభూపతికై యెడయాడు దృష్టి ల**
**జ్జావతి యెట్టకేల కొక చందమున న్మగిడించి చేర్చె వా**
**గ్దేవి ముఖేందుబింబమున దియ్యము నెయ్యమునుం దలిర్పగన్**

లజ్జావతి, భావములోని = మనసులోనున్న, కీలు = మర్మము (వలపు), పరిపాటిన్ = మీదుమిక్కిలిగా, పరిస్ఫుటతన్ = స్పష్టతను, విలాసమున్, బ్రోవగన్ = కలిగింపగా, నిషధభూపతికై = నలరాజుకై, వేడ్కతోన్ = కోరికతో, ఎడయాడు దృష్టిన్ = సంచరించు చున్న చూపును, ఎట్టకేలకు = చిట్టచివరకు, ఒక చందమునన్ = ఏదోఒక విధమున, మగిడించి = మరల్చి, తియ్యము = ప్రియమును, నెయ్యమునున్ = స్నేహమును, తలిర్పగన్ = అతిశయించునట్లుగా, వాగ్దేవి ముఖేందుబింబమున్ = సరస్వతి ముఖచంద్రునియందు, చేర్చెన్ = ప్రవేశింపచేసెను.

తా. దమయంతి మనసులోనున్న వలపు మీదుమిక్కిలిగా స్పష్టతను, విలాసమును కలిగింపగా నలమహారాజునకై కోరికతో వెదకుచున్న చూపును చిట్టచివరకు ఏదో ఒక విధమున మరల్చి ప్రియమును, స్నేహమును అతిశయించునట్లుగా సరస్వతి ముఖచంద్రునియందు ప్రవేశింపచేసెను.

185 వ. **భారతీదేవియు నయ్యంగన యింగితం బెఱింగి తదీయ హస్తంబు నిజ హస్తంబునం గీలుకొలిపి యుల్లంబు పల్లవింప నిలింప నిషధరాజులం గనుంగొని కనుంగొనల నలంతి నవ్వొలయ నిట్లను 'యింద్రాగ్నియమవరుణులు కరుణాతరంగితంబులగు నంతరంగంబులతో నీయింతి ననుగ్రహింపవలయు.**

తా. సరస్వతీదేవియును ఆ దమయంతి మనసు తెలుసుకొని ఆమె చేతిని తన చేతితో పట్టుకొని మనసు చిగురింపగా నలమహారాజులను చూచి కనుకొనల చిరునవ్వు ప్రకటించుచు ఇట్ల పలికెను 'ఇంద్ర అగ్ని యమ వరుణులు దయతోనిండిన మనసులతో ఈ కాంతపై దయ చూపవలయును'.

186 ఉ. **ఎట్టు వరించు సాధ్వి మిము నిందఱ దేవ చతుష్టయంబునం**
**దెట్టొకనిం దగంగ వరియించి తదన్యుల ధిక్కరించి వే**
**ర్వెట్ట(గ నేర్చు( గావున వరించి కృతార్థత( బొందు(గాక మీ**
**యట్టి మహానుభావు భవదంశ సముద్భవు నైషధాధిపున్**

సాధ్వి, మిమున్ = మిమ్మల్ని, ఇందఱన్ = ఇందర్ని, ఎట్టు వరించు = ఎలా వరిస్తుంది ?, దేవ చతుష్టయంబునందు = దేవతలు నలుగురియందును, ఒకనిన్, తగంగన్ = తగునట్లుగా, వరియించి, తత్ అన్యులన్ = ఆ మిగిలినవారిని, ఎట్టు ధిక్కరించి = ఏ విధంగ తిరస్కరించి, వేరు పెట్టగ నేర్చున్, కావున, మీయట్టి మహానుభావున్ = మీవలె గొప్ప ప్రభావముకలవానిని, భవదంశ సముద్భవున్ = మీ అంశతో పుట్టినవానిని, నైషధాధిపున్ = నిషధరాజును, వరించి, కృతార్థతన్ పొందుగాక

తా. ఈ పతివ్రత మిమ్మల్ని ఇందర్ని ఎలా వరిస్తుంది? దేవతల నలుగురియందును ఒకనిని వరించి ఆ మిగిలినవారిని ఎలా తిరస్కరించి వేరుపెట్టగలుగుతుంది? కావున మీవలె గొప్ప ప్రభావముకలవాడును, మీ అంశతోనే పుట్టినవాడునునగు నిషధరాజును పెండ్లాడి కృతార్థత్వమును పొందుగాక.

187 వ. **అనిన విని లోకపాల చతుష్టయంబు కమలవిష్టరభామినీ నిర్దేశంబును, నిషధదేశాధీశ చిత్తశుద్ధి పరీక్షణంబును, దమయంతీ పరమ పాతివ్రత్య గుణ గౌరవంబునుం గారణంబుగా మనంబులం బ్రసాదంబు వహించి నలాకార మాయాకంచుకంబులు దిగ(ద్రోచి, భీమోద్భవా సాత్వికభావాలోకనాపేక్షంబోలె( జక్షుస్సహస్రంబుతో సహస్రాక్షుండును, గామాంధకార గర్వ నిర్వాపణ దీపికా చక్రవాళంబునుంబోని కీలాజాలంబుతో( గీలియును, సద్యో నిర్వాణ మదనాగ్ని ధూమంబు(బోని ధూమ్ర దేహచ్ఛాయా మండలంబుతో దండధరుండును, నిరవకాశంబైన యాశాపాశంబునుంబోని పాశంబుతోడం బాశపాణియు నిజ**

**రూపంబులు గైకొని రప్పుడు గంధర్వ దర్పాపహార పారీణంబైన వీరసేనతనయు మనోహరాకారంబు మాని వైమానికులు దమ నిక్కంపు రూపులు చేపట్టుట సామ్రాజ్యంబు విడిచి భిక్షాటనంబు పాటించిన విధంబునను, యౌవనంబు( బరిత్యజించి వార్ధకం బంగీకరించిన భంగినిం దో(చె( బేరోలగంబున్న భూపాలవర్గంబు గనుంగొనుచుండ రూపాంతర పరిగ్రహం బొనర్చి యింద్రాదు లింద్రజాల విద్యావిదుల చందంబు నొందిరి యనంతరంబ**

తా. అనగా విని దిక్పాలురు నలుగురును సరస్వతి ఆదేశమును, నలుని చిత్తశుద్ధి పరీక్షయును, దమయంతియొక్క గొప్ప పాతివ్రత్య గుణ గౌరవమును కారణముగా మనసున అనుగ్రహము పూని నలరూప మాయా కవచములను విడిచి, దమయంతి అనురాగమువల్లనైన సాత్వికభావములను చూచుటయందు కోరికతోడనువలె వేయి నేత్రములతో ఇంద్రుడును, కామమనెడి చీకటియొక్క గర్వమును పోగొట్టెడి కాగడాలవంటి మంటల సమూహముతో అగ్నియును, వెంటనే ఆరిపోయిన మన్మథాగ్ని పొగవంటి నల్లని శరీరకాంతి సమూహముతో యముడును, అవకాశములేని ఆశాపాశమువంటి పాశముతో వరుణుడును తమ నిజ రూపములను స్వీకరించిరి. అప్పుడు మన్మథునియొక్క గర్వమును పోగొట్టుటయందు నేర్పుకలదైన నలునియొక్క సుందర రూపమును విడిచి దేవతలు తమ నిజరూపములను స్వీకరించుట సామ్రాజ్యమును విడిచి భిక్షాటనమును పొందిన విధానమును, యౌవనమును విడిచి వార్ధక్యమును అంగీకరించిన రీతిని తోచెను. సభలోనున్న రాజసమూహము చూచుచుండగ రూపములను మార్చుకొని ఇంద్రాదులు ఇంద్రజాల విద్య తెలిసినవారి విధమున పొందిరి. తరువాత

188 **తే.** **క్షీరనీర విభేదంబు చేసినట్టి**
**హంసియునుబోలె హంసవాహనునిదేవి**
**లీల దిక్పాల నిషధభూపాలవరుల**
**భేద మేర్పడ(జేసి సంప్రీతి యెసగ**

హంసవాహనునిదేవి = సరస్వతి, క్షీర నీర విభేదంబు = పాలను, నీటిని వేరుగా, చేసినట్టి, హంసియునుబోలె = ఆడు హంసవలె, లీలన్ = విలాసముగా, దిక్పాల = దిక్పాలురను, నిషధభూవరుల = నలమహారాజును, భేధము ఏర్పడన్ చేసి = వేర్పాటును స్పష్టముచేసి, సంప్రీతి ఎసగన్ = ప్రీతి ఒప్పునట్లుగా,

తా. సరస్వతి పాలను, నీటిని వేరుచేసినట్టి ఆడు హంసవలె విలాసముగా దిక్పాలురను, నలుని వేర్పాటును స్పష్టముచేసి ప్రీతి ఒప్పునట్లుగా,

189 **వ.** **దమయంతి** కిట్లనియె.

190 **తే.** **వీరె యాఖండలాదులు విబుధవరులు**
**వా(డె నిషధాధినాథుండు వనజవదన !**
**భక్తి సొంపార వీరికి( బ్రణతి సేయు**
**మింపు పెంపార(గా వరియింపు మతని**

వనజవదన = పద్మముఖీ !, ఆఖండల ఆదులు = ఇంద్రుడు మొదలైన, విబుధవరులు = దేవతలు, వీరె, నిషధాధినాథుండు = నలుడు, వాడె, భక్తి సొంపారన్ = భక్తిభావము అతిశయించునట్లుగా, వీరికిన్ = ఈ ఇంద్రాదులకు, ప్రణతి చేయుము = నమస్కరింపుము, ఇంపు పెంపారగాన్ = సంతోషాతిశయముచే, అతనిన్ = ఆ నలుని, వరియింపుము.

తా. పద్మముఖీ ! వీరె ఇంద్రాది దేవతలు. వాడె నలుడు. భక్తిభావము అతిశయించునట్లుగా ఈ ఇంద్రాదులకు నమస్కరింపుము. సంతోషాతిశయముచే అతనిని వరింపుము.

191 **వ.** **అని యోంకార భద్రపీఠికాలంకారంబగు పంకజాసనుని రాణి నియోగింపం గంకణ ఝణఝణత్కారం బంకురింప నా శశాంకవదన వేల్పులకుం కేలుదోయి యెత్తి నమస్కరించె.**

తా. అని, ఓంకారమను మంగళప్రదమగు సింహాసనమునకు అలంకారమైన సరస్వతి ఆదేశింపగా హస్తాభరణములయొక్క ఝణఝణధ్వని మొలకెత్తగా ఆ చంద్రముఖి దేవతలకు రెండుచేతులు ఎత్తి నమస్కరించెను.

192 **శా.** **సౌందర్యాపర మత్స్యలాంఛన ! కళాసర్వజ్ఞ ! యర్థార్థి మా**
**కందారామ వసంత ! సంతత మహాకారుణ్య పాథోనిధీ !**
**మందారద్రుమ మంజరీ మధుఝరీ మాధుర్య మా ధుర్య వా**
**క్సందర్భాస్వదమాన మానస కవిగ్రామా బుధగ్రామణీ !**

సౌందర్య = సొగసుదనమందు, అపర = రెండవ, మత్స్యలాంఛన = మన్మథునివంటివాడా !, కళా సర్వజ్ఞ = సమస్త కళలను శివునివంటివాడా! అర్థార్థి = యాచకులనెడి, మాకందారామ = మామిడితోపునకు, వసంత = వసంతునివంటివాడా ! సంతత = ఎల్లప్పుడును, మహాకారుణ్య = గొప్పదయకు, పాథోనిధీ = సముద్రునివంటివాడా ! మందార ద్రుమ మంజరీ = కల్పవృక్షముల గుత్తుల, మధుఝరీ = తేనెప్రవాహమువంటి, మాధుర్య మా ధుర్య = అతి మధురములైన, వాక్ = మాటలయొక్క, సందర్భ = రీతిని, ఆస్వదమాన = ఆకర్షించుచున్న, మానస = మనస్సులుకల, కవిగ్రామా = కవులయొక్క సమూహముకలవాడా ! బుధగ్రామణీ = పండితశ్రేష్ఠుడా ! (అలంకారము – రూపకము)

తా. సొగసుదనమందు రెండవ మన్మథునివంటివాడా ! సమస్త కళలకు శివునివంటివాడా ! యాచకులనెడి మామిడి తోపునకు వసంతునివంటివాడా ! సంతత కారుణ్యమునకు సముద్రునివంటివాడా ! కల్పవృక్షపు గుత్తుల తేనె ప్రవాహమువంటి అతిమధురములైన మాటల రీతిని ఆకర్షించుచున్న మనసులుకల కవుల సమూహముకలవాడా ! పండిత శ్రేష్ఠుడవైన ఓ మామిడి సింగా !

193 క. **వీరావతార ! రక్షణ**
**నారాయణరూప ! రాయనారాయణ ! కం**
**ఠీరవ విక్రమ ! వితరణ**
**పారాయణ ! యుభయవంశ పావన చరితా !**

వీరావతార = పరాక్రమ స్వరూపుడా !, రక్షణ నారాయణరూప = రక్షించుటయందు విష్ణుమూర్తివంటివాడా !, రాయ నారాయణ = శ్రేష్ఠులలో విష్ణుస్వరూపా !, కంఠీరవ విక్రమ = సింహ పరాక్రమముకలవాడా !, వితరణ పారాయణ = దానమిచ్చుటయం దాసక్తి కలవాడా !, ఉభయవంశ పావనచరితా = మాతాపితృవంశములరెండింటిని పవిత్రములుచేయువాడా!
తా. పరాక్రమస్వరూపుడా ! రక్షణయందు విష్ణు స్వరూపుడా ! శ్రేష్ఠులలో విష్ణుస్వరూపా ! సింహ పరాక్రమముకలవాడా!, దానమిచ్చుటయందు ఆసక్తి కలవాడా ! మాతాపితృవంశముల రెండింటిని పవిత్రములు చేయువాడా !

194 **మాలిని** **అవనగుణ విహారా ! అంగనా చిత్తచోరా !**
**భువనభరిత కీర్తీ ! పుణ్య కల్యాణమూర్తీ !**
**కవికువలయచంద్రా ! గౌరవశ్రీ మహేంద్రా !**
**యవితథ పటుకోపా ! యప్రతీప ప్రతాపా !**

అవన గుణ = రక్షించు గుణమునందు, విహారా = సంచరించువాడా ! అంగనా చిత్త = స్త్రీల మనస్సులను, చోరా = దొంగిలించు వాడా !, భువనభరిత = లోకమునిండిన కీర్తికలవాడా ! పుణ్య కల్యాణమూర్తీ = పవిత్రము,శుభప్రదమునైన రూపముకలవాడా ! కవి కువలయ చంద్రా = కవులనెడి కలువలకు చంద్రునివంటివాడా ! గౌరవ శ్రీ మహేంద్రా = గౌరవముచేతను, సంపదచేతను ఇంద్రునివంటివాడా ! అవితథ పటు కోపా = వ్యర్థముకాని సమర్థమైన కోపముకలవాడా ! అప్రతీప ప్రతాపా = అడ్డులేని పరాక్రమముకలవాడా !
తా. రక్షించుగుణమునందు సంచరించువాడా ! స్త్రీల మనస్సులను దొంగిలించువాడా ! లోకమునిండిన కీర్తికలవాడా! పవిత్రము, శుభప్రదమునైన రూపముకలవాడా ! కవులనెడి కలువలకు చంద్రునివంటివాడా ! గౌరవము, సంపదచేతను ఇంద్రుని వంటివాడా ! వ్యర్థముకాని, సమర్థమునైన కోపముకలవాడా ! అడ్డులేని పరాక్రమముకలవాడా !

**ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్త్ర**
**సకలవిద్యాసనాథ శ్రీనాథభట్ట ప్రణీతంబైన**
**శృంగార నైషధ కావ్యంబునందు**
**పంచమాశ్వాసము**

**వ్యాఖ్యాతృ గద్యము**
**ఇది బుధజన విధేయుండును, బులుసు వంశ సంభూతుండును,**
**కీ.శే. శేషమ్మ, వెంకటరమణయ్య పుణ్యదంపతీ తనూజుండును,**
**గౌతమ గోత్రజుండునగు వేంకటసత్యనారాయణమూర్తి**
**ప్రణీతంబైన శృంగార నైషధ మహాకావ్యంబునందు**
**పంచమాశ్వాసమునకు టీక-తాత్పర్యములు**
**సంపూర్ణము**

# శ్రీరస్తు

# శృంగార నైషధము

## షష్ఠాశ్వాసము

**శ్రీ గురు శంకరమౌని ద**
**యా గౌరవ నిత్య వర్ధితాన్వయ ! కరుణా**
**సాగర ! విజయరమైక స**
**మాగమ లీలానుషంగ ! మామిడి సింగా !**

శ్రీ = శోభాయుతుడును, గురు = ఉపదేశికుడునునగు, శంకర మౌని = శంకరాచార్య మునీశ్వరులయొక్క, దయా గౌరవ = కారుణ్యాతిశయముచే, నిత్య = సతతము, వర్ధిత = వృద్ధిపొందింపబడుచున్న, అన్వయ = వంశముకలవాడా ! కరుణా సాగర = దయా సముద్రుడా ! విజయరమ = జయలక్ష్మితో, ఏక = ముఖ్యముగా, సమాగమ = కలిసికొనుటయనెడి, లీలా అనుషంగ = విలాస కూడిక కలవాడా ! మామిడి సింగా !

తా. శోభాయుతుడును, ఉపదేశికుడునునగు శంకరాచార్య మునీశ్వరులయొక్క కారుణ్యాతిశయముచే సతతము వృద్ధి పొందింపబడుచున్న వంశముకలవాడా ! దయా సముద్రుడా ! జయలక్ష్మితో ప్రధానముగా కలిసికొనుటయనెడి విలాసమైన కూడికకలవాడా ! మామిడి సింగనామాత్యా !

**2** వ. **చిత్తగింపుము.**

**3** ఉ. **మానితలీల నల్లన విమానము డిగ్గి వినూత్న రత్న సో**
**పాన పరంపరా సరణి భారతి హస్తముఁ గేల నూఁది పం**
**చానన మధ్య కాంచనమయంబగు మంచకమెక్కి చేర్చె న**
**మ్మానవనాథు కంఠమున మంగళ నవ్య మధూకదామమున్**

పంచానన మధ్య = సింహము నడుమువంటి నడుముకల దమయంతి, మానిత లీలన్ = పొగడదగిన విలాసముతో, అల్లన = మెల్లగా, విమానము డిగ్గి = పల్లకీని దిగి, భారతి హస్తమున్ = సరస్వతీదేవి చేతిని, కేలన్ ఊది = చేతితో ఆనుకొని, వినూత్న = నూతనములైన, రత్న = రత్నమయములైన, సోపాన = మెట్లయొక్క, పరంపరా సరణిన్ = వరుస మార్గమున, కాంచన మయంబగు = బంగారుమయమైన, మంచకము ఎక్కి = మంచెను ఎక్కి, ఆ మానవనాథు కంఠమున, మంగళ = శుభకరమైన, నవ్య = నూతనమైన, మధూక దామమున్ = ఇప్పపూవుల దండను, చెర్చెన్ = వేసెను.

తా. దమయంతి పొగడదగిన విలాసముతో మెల్లగా వాహనమును దిగి సరస్వతీదేవి చేతిని ఊతగా గొని నూతన, రత్న మయమైన మెట్ల వరుస మార్గమున బంగారు మంచెను ఎక్కి ఆ నలమహారాజు కంఠమున శుభకరమైన, నూతనమైన ఇప్ప పూవుల దండను వేసెను.

**4** వ. **ఇట్లు దమయంతీ కరార్పితంబై దూర్వాంకురాలంకృతంబును, మకరాంకపాశ సంకాశంబును, మధుప ఝంకార**

**సంకులంబును, సుదార తారకా నికరాకారంబునునై**

తా. ఈ విధముగా దమయంతి చేతులతో నుంచబడిన గటిక మొలకలచే అలంకరింపబడినదియును, మకరాంక = మన్మథునియొక్క, పాశ = పాశ అయుధముతో, సంకాశంబును = సమానమైనదియును, మధుప = తుమ్మెదలయొక్క ఝుంకార = ధ్వనితో, సంకులంబును = వ్యాపించినదియును, ఉదార = స్వచ్ఛమైన, తారకా నికర = నక్షత్ర సమూహమువంటి, ఆకారంబునై = అకారముకలదియునై

**5 తే. ధారుణీపతి నిద్దంపుఁ బేరురమున**
**నమరెఁ బ్రతిబింబమును దాను నలరు దండ**
**బాహ్యమునఁ గొంత కొంత యభ్యంతరమునఁ**
**గీలుకొనియున్న మదన బాణాళిఁబోలె**

ధారుణీపతి = నలునియొక్క, నిద్దంపున్ = నిర్మలమైన, పేరురమునన్ = విశాలమైన వక్షస్థలమున, అలరు = ఒప్పునట్టి, దండ = కల్యాణమాలిక, తానున్ = తానును, ప్రతిబింబమును = తన నీడయును, కొంత = కొంతభాగము, బాహ్యమున = వెలుపలను, కొంత = కొంతభాగము, అభ్యంతరమున = లోపలను, గీలుకొనియున్న = తగులుకొనియున్న, మదన = మన్మథునియొక్క, బాణాళి పోలె = బాణములవరుసవలె, అమరెన్ = ప్రకాశించెను.

తా. నలుని నిర్మలమైన, విశాలమైన వక్షస్థలమున ఒప్పునట్టి కల్యాణమాలిక తాను, తన నీడయును కొంతభాగము వెలుపలను, కొంతభాగము లోపలను తగులుకొనియున్న మన్మథుని బాణ పరంపరవలె ప్రకాశించెను.

**6 క. తెఱవ పులకాంకురంబులు**
**గిఱికొన నవ్వేళఁ జూడ్కికి ముదంబొసఁగెన్**
**గఱకుఁ బువుమొగ్గతూపులు**
**గిఱికొన్న మనోజ ఖురళికిం బ్రతినిధియై**

ఆ వేళన్ = ఆ నలుని మెడలో కల్యాణమాలికను వేయు సమయమున, తెఱవ = దమయంతికి, పులక అంకురములు = గగుర్పాటులు, గిఱికొనన్ = అలముకొనగా, కఱకు = వాడియైన, పువుమొగ్గ తూపులు = పూలమొగ్గల బాణములచే, గిఱికొన్న = నిండిన, మనోజ ఖురళికిన్ = మన్మథునియొక్క గారడీకి, ప్రతినిధియై = సమానమైనదై, చూడ్కికిన్ = చూపులకు, ముదంబు ఒసగెన్ = సంతోషము నిచ్చెను.

తా. దమయంతి నలుని మెడలో కల్యాణమాలికను వేయు సమయమున ఆమెకు గగుర్పాటు దేహమంతటను వ్యాపింపగా వాడియైన పూమొగ్గల బాణములచే నిండిన మన్మథుని గారడీకి సమానమైనదై చూపరుల చూపులకు సంతోషమును కలిగించెను.

**7 చం. ధరణిపు చక్కఁ గట్టెదురఁ దామరసాక్షికిఁ జేష్ట నష్టతం**
**బొరసె మనోనురాగ పరిపూర్తి నొకించుకసేపు నిర్భర**
**స్మరశరపుంఖ సంఘటిత షట్చరణ ప్రమదాగరు చ్ఛటా**
**స్ఫుర దనిలావతారమున బోరనఁ దా మొదలెత్తెనోయనన్**

ధరణిపు చక్క కట్టెదురన్ = సుందరుడైన ఆ నలరాజు ఎట్ట ఎదుట, తామరసాక్షికిన్ = దమయంతికి, మనోనురాగ పరిపూర్తికిన్ = మనసులోని కోరిక తీరుటకు, ఒకించుక సేపు = కొంచెముసేపు, చేష్ట = చూపులుమొదలైన చేష్టలు, నిర్భర = భరింప శక్యముకాని, స్మరశర = మన్మథుని బాణములయొక్క, పుంఖ = క్రిందికొనలందు, సంఘటిత = కూర్పబడిన, షట్చరణ ప్రమద = ఆడు తుమ్మెదలయొక్క, అగరుచ్ఛటా = రెక్కల గుంపులవలన, స్ఫురత్ = ప్రసరించిన, అనిల = వాయువుయొక్క, అవతారమునన్ = విజృంభణముచే, బోరనన్ = ఆకస్మికముగా, తాన్ = ఆ చేష్టలు, మొదలెత్తెనోయనన్ = మూలములవరకు, నష్టతన్ = నాశనమును, బొరసెన్ = పొందెను.(అలంకారము – ఉత్ప్రేక్ష)

తా. ఆ నలమహారాజు యెదుట దమయంతికి మనసులోని కోరిక తీరుటకు కొంచెముసేపు చేష్టలుడిగి యుండగా భరింపశక్యముకాని మన్మథ బాణముల కొనలందు కూర్పబడిన ఆడు తుమ్మెదల రెక్కలగుంపులవలన వ్యాపించిన గాలి విజృంభణముచే ఆ స్థితి అనుకోకుండా సమూలముగా ఎగురగొట్టబడెను.

**8 ఉ. ఆ హరిణాక్షి యిడ్డ యలరారెడు పువ్వులదండ జాత కౌ**
**తూహలతన్ స్పృశించునెడఁ దోఁచెఁ గరంబున ఘర్మబిందు సం**
**దోహము తేని కవ్విధము దోఁపఁగఁ జేసె నెటిన్ భవిష్య దు**
**ద్వాహ మహోత్సవంబునకు దర్పకుఁ డిచ్చిన హస్తతోయమున్**

ఆ హరిణాక్షి = ఆ లేడిచూపులుకల దమయంతి, ఇడ్డ = వేసిన, అలరారెడు = ఒప్పుచున్న, పువ్వులదండ, జాత

కౌతూహలతన్ = పుట్టిన కుతూహలముతో, కరంబునన్ = చేతితో, స్పృశించునెడ = తాకు సమయమున, ఘర్మబిందు సందోహము = చెమట బిందువుల సముదాయము, తోచెన్ = పుట్టెను. తేనికిన్ = రాజునకు, ఆ విధము = ఆ చెమట, నెఱిన్ = ఆచారముచే, భవిష్యత్ = కాబోయెడి, ఉద్వాహ మహోత్సవంబునకు = వివాహ సంరంభమునకు, దర్పకుడు = మన్మథుడు, ఇచ్చిన, హస్తతోయమున్ = కన్యాదానజలముగా, తోపగన్ చేసెన్ = తోచునట్లు చేసెను.

తా. ఆ దమయంతి వేసిన పూవులదండ నలుడు కుతూహలముతో చేతితో తాకగా దేహమున చెమటబిందు సమూహము పుట్టెను. నలునకు ఆ చెమట సంప్రదాయముగా కాబోయెడి వివాహ మహోత్సవమునకు మన్మథుడు ఇచ్చిన కన్యాదానజలముగా తోచునట్లు చేసెను.

**9 ఉ. చిత్తజు పువ్వుఁ దూపుల రచించిన తుమ్మెద ఱెక్క గాలిచే**
**నత్తరి నేకు వత్తియగు నంగన దూలినఁ దూలెఁగాక య**
**త్యుత్తమధీరతా గుణ సమున్నత మేరు మహీధరంబు భూ**
**భృత్తిలకుండు నైషధుఁడు బిట్టు చలించెఁ గదా తదాహతిన్**

ఆ తఱిన్ = ఆ సమయమందు, ఏకువత్తియగు = ఏకినపత్తిలా మృదువైన, అంగన = దమయంతి, చిత్తపు పువ్వు తూపులన్ = మన్మథుని పూల బాణములతో, రచించిన, తుమ్మెద ఱెక్క గాలిచే = కంకపత్రములుగా కట్టిన తుమ్మెదల ఱెక్కలగాలిచేత, తూలినన్ = ఎగురగొట్టబడినను, తూలుగాక = ఎగురగొట్టబడుగాక, తదాహతిన్ = ఆ బాణపు దెబ్బచే, అత్యుత్తమ = మిక్కిలి శ్రేష్ఠమైన, ధీరతాగుణ = ధైర్యగుణమునందు, సమున్నత మేరు మహీధరంబు = గొప్ప మేరుపర్వతమువంటివాడును, భూభృత్తిలకుండు = రాజశ్రేష్ఠుడునైన, నైషధుడు = నలుడు, బిట్టు = మిక్కిలి, చలించె కదా = చలించిపోయేదుకదా !

తా. దమయంతి నలుని మెడలో కల్యాణమాల వేయు సమయమున ఏకినపత్తిలా మృదువైన దమయంతి మన్మథుని పూలబాణముల తుమ్మెద ఱెక్కల గాలికి తూలిపోతే తూలిపోవచ్చును. కాని ఆ బాణపుదెబ్బచే మిక్కిలి ధైర్యవంతుడైన, మేరుపర్వతము వంటివాడైన నలమహారాజు చాలా చలించిపోవుట ఆశ్చర్యము ! (అలంకారము – రూపకము, విభావన)

**10 క. బిట్టు ఘన స్తంభంబున**
**గట్టువడెన్ నిషధరాజు కామునిచేతన్**
**బిట్టు ఘన స్తంభంబున**
**గట్టువడం దగును రాజు గజరాజు వలెన్**

కామునిచేతన్ = మన్మథునిచే, నిషధరాజు = నలరాజు, ఘన స్తంభంబున = గొప్ప స్తంభమున (స్తంభ మనెడి సాత్త్విక భావమునకు), బిట్టు = గట్టిగా, కట్టువడెన్, ఇది తగినదే. రాజు, గజరాజువలెన్, ఘన స్తంభంబున, బిట్టు, కట్టువడన్, తగును.

తా. మన్మథునిచే నలమహారాజు స్తంభ మనెడి సాత్త్వికభావమునకు కట్టువడెను. ఇది సముచితమే. రాజు గజరాజువలె గొప్ప స్తంభమునకు కట్టువడెను.

**11 వ. ఇవ్విధంబున**

**12 తే. పెద్ద కాలంబునకు మనోభీప్సితంబు**
**సఫల మగుటయు నత్యంత సమ్మదమున**
**సొంపు దళుకొత్త నున్న యా దంపతులకుఁ**
**గరుణ దీవన లిచ్చె నిర్జరగణంబు**

పెద్ద కాలంబునకు = చాల కాలమునకు, మన: అభీప్సితంబు = మనసులోని కోరిక, సఫలము అగుటయు = తీరుటయు, అత్యంత సమ్మదమునన్ = మిక్కిలి సంతోషముతో, సొంపు = సౌభాగ్యము, తళుకొత్తన్ ఉన్న = ప్రకాశించునట్లుగాయున్న , ఆ దంపతులకు, నిర్జరగణంబు = దేవతా సమూహము, కరుణన్ = దయతో, దీవనలు ఇచ్చెన్.

తా. చాల కాలమునకు మనసులోని కోరిక తీరుటతో మిక్కిలి సంతోష సౌభాగ్యముతో ఆనందముగానున్న ఆ దంపతులకు దేవతాసమూహము దయతో దీవనలిచ్చెను.

13 వ. **వెండియు నిషధమండలాధీశ్వరుండు తమకుం జేసిన దూతకృత్యంబునం గానంబడిన చిత్తశుద్ధి కారణంబుగా నమ్మహీపతి కమరపతి ప్రత్యక్షంబైన యాకారంబుతో యాగంబులందు హవిర్భాగంబు భుజియించువాఁడయ్యె. హుతవహుం డిచ్ఛానురూపంబునం బ్రభవింప ననుమతించె, ధర్ముం దక్షయ ప్రహరణంబులును, ధర్మైక నిరత బుద్ధియు నొసంగె. వరుణుండు దలఁచినచోట జలంబులు సంభవింపను, ధరియించిన పుష్పంబులు వాడకుండను ననుగ్రహించె. అప్పుడు భారతీదేవి నానా భువన సమాగతానేక భూవర వర్ణనా ప్రసంగోచితంబైన మానుషాకారంబు మాని వీణా పుస్తకపాణియు, రోహిణీరమణ చూడామణియునై కుందేందు తుషారహార ధవళంబగు దివ్యరూపంబు ధరించె. అందఱు దమయంతి నుద్దేశించి**

తా. తరువాత, నలమహారాజు తమకు చేసిన దూతత్వమందు కనబడిన చిత్తశుద్ధి కారణముగా ఆ నలమహారాజునకు దేవేంద్రుడు తన నిజరూపముతో ప్రత్యక్షమై నలుడు చేయు యజ్ఞములందు హవిర్భాగంబులు స్వీకరించువాడయ్యెను. అగ్ని కోరిన విధముగా జ్వలించుటకు అంగీకరించెను. యముడు అక్షయ బాణములను, ధర్మమునందు సడలని బుద్ధియు నిచ్చెను. వరుణుడు తలచినచోట నీరు పుట్టునట్లును, ధరించిన పూవులు వాడిపోకుండునట్లును అనుగ్రహించెను. అప్పుడు సరస్వతి సమస్త లోకములనుండి వచ్చిన అనేకమంది రాజులను వర్ణించు సందర్భమున ధరించిన మనుష్య రూపమును విడిచి చేతియందు వీణెయు, పుస్తకమును, చంద్రుడు శిరోభూషణముగ కలదియునై మల్లెలు, చంద్రుడు, మంచు, ముత్యాలవలె తెల్లనైన దివ్య రూపమును ధరించెను. అపుడు అందరును దమయంతి నుద్దేశించి

**14 ఉ. ఆదిమశక్తియైన తుహినాచలరాజతనూజవోలె ము**
**త్తైదువవై నిజేశ్వరుని యర్ధశరీరము పాలుగొమ్ము నీ**
**పాదసరోరుహంబు లతిభక్తి భజింతురుగాక యెప్డు బ్ర**
**హ్మాదిక దేవతా సదృశులైన మహామహి మండలేశ్వరుల్**

ఆదిమశక్తియైన = మూల ప్రకృతియైన, తుహినాచలరాజ తనూజవోలె = హిమవంతుని కూతురగు గౌరీదేవివలె, ముత్తైదువవై = సువాసినివై, నిజేశ్వరుని = నలుని, అర్ధశరీరము = సగము దేహమును, పాలుగొమ్ము = పంచుకొమ్ము, ఎప్డు = ఎల్లప్పుడును, బ్రహ్మాదిక దేవతా సదృశులైన = బ్రహ్మమొదలైన దేవతలతో సమానులైన, మహామహి మండలేశ్వరుల్ = గొప్ప రాజులందరును, నీ పాదసరోరుహంబులు = నీ పాదపద్మములు, అతిభక్తిన్, భజింతురుగాక = సేవించెదరుగాక.

తా. మూలప్రకృతియైన హిమవత్పుత్రి గౌరీదేవివలె సువాసినివై నలుని యర్ధదేహమును పంచుకొమ్ము. ఎల్లప్పుడును బ్రహ్మాది దేవతల సమానులైన రాజులందరును నీ పాదపద్మములను అతిభక్తితో సేవించెదరుగాక.

**15 మ. అని వైదర్భిఁ బ్రసాదగర్భ మధుర వ్యాహార సందర్భ సం**
**జనితానందనుఁ జేసి నెయ్యమున నా శక్రాది బృందారకుల్**
**వనితారత్నముచేతఁ గైకొనిరి సేవాహస్త పద్మాంజలుల్**
**ఘనరత్నాంచిత హేమకంకణ ఝణత్కారంబు తోరంబుగన్**

అని, వైదర్భిన్ = దమయంతిని, ప్రసాద గర్భ = అనుగ్రహము లోనిమిడియున్న, మధుర = తియ్యని, వ్యాహార = మాటలయొక్క, సందర్భ = ప్రసంగముచే, సంజనిత = పుట్టిన, ఆనందనున్ = ఆనందము కలదానినిగా, చేసి, నెయ్యమునన్ = ప్రేమతో, ఆ శక్రాది బృందారకుల్ = ఆ ఇంద్రాది దేవతలు, వనితారత్నముచేతన్ = దమయంతిచేతులయందలి, ఘన = గొప్పవగు, రత్న = మాణిక్యములచే, అంచిత = ఒప్పుచున్న, హేమకంకణ = బంగారు కడియములయొక్క, ఝణత్కారంబు = ధ్వనులు, తోరంబుగన్ = అధికమగు నట్లుగా, సేవా = తమ్ము సేవించుటయందలి, హస్త పద్మాంజలుల్ = చేమోడ్పులను, కైకొనిరి = స్వీకరించిరి.

తా. ప్రేమతో ఆ ఇంద్రాది దేవతలు దమయంతిని అనుగ్రహమునిండిన తియ్యని మాటల ప్రసంగముతో ఆనందింపచేసి, ఆ దమయంతిచేతి గొప్ప రత్నమాణిక్యముల బంగారు కడియముల ధ్వనులు అధికమగునట్లుగా తమను సేవించు నమస్కారములను స్వీకరించిరి.

**16 వ. అనంతరంబ నిషధమహీకాంతుం గనుంగొని సరస్వతీదేవి యిట్లనియె**

**17 ఉ. నేమముతోడ విశ్వధరణీ భువనాధిప సంతతంబు జిం**
**తామణి మంత్రరాజము ప్రధానము మంత్ర కదంబకంబులో**
**మామక మమ్మహామనువు మానిత భంగి భజింపుమీవు చిం**
**తామణి కామధేను విబుధద్రుమ సన్నిభ మాశ్రితాళికిన్**

విశ్వ = సమస్తమైన, ధరణీ భువనాధిప = భూలోకనాయకా !, మామకము = నాదైన, చింతామణి మంత్రరాజము, మంత్ర కదంబకంబులోన్ = మంత్ర సమూహములో, ప్రధానము = ముఖ్యమైనది, ఈవు = నీవు, నేమముతోన్ = నియమముతో, సంతతంబున్ = ఎల్లప్పుడును, ఆ మహామనువున్ = ఆ మహామంత్రమును, మానిత భంగిన్ = గౌరవమైన రీతిలో, భజింపుము = సేవింపుము, అది = ఆ చింతామణి మంత్రము, ఆశ్రితాళికిన్ = ఆశ్రయించినవారికి, చింతామణి, కామధేనువు, విబుధ ద్రుమ = కల్పవృక్షము, సన్నిభ = సాటియైనది.

తా. భూలోకనాయకా ! నాదైన చింతామణి మంత్రరాజము మంత్రసమూహములో ప్రధానమైనది. నీవు నియమముతో సతతము ఆ మహామంత్రమును భక్తితో సేవింపుము. అది ఆశ్రయించినవారికి చింతామణి, కామధేనువు, కల్పవృక్షములకు సాటియైనది.

**18 మ. సకలంబై హిమరుక్కళాభరణమై సవ్యాపసవ్యార్ధ యు**
**గ్మకరూపంబయి శైవమై గత కళంకంబై శివంబై యుపా**

**సక చింతామణియై ప్రసిద్ధ భగవచ్ఛబ్దాభిధేయార్థమై**
**యొక మంత్రంబు మదీయ మొప్పునది నీ కుర్వీశ నే నిచ్చితిన్**

ఉర్వీశ = ఓ నలరాజా !, సకలంబై = సమస్త సంపదలుకలదై, హిమరుక్కళాభరణమై = చంద్రుడు అలంకారముగాకలదై, సవ్యార్థ = దక్షిణపు సగమందును, అపసవ్యార్థ = ఎడమ సగమందును, యుగ్మక రూపంబై = పురుష స్త్రీ స్వరూపముకలదై, శైవమై = శివసంబంధియై, గత కళంకంబై = ఏ కళంకములేనిదై, శివంబై = సౌమ్యాకారముకలదై, ఉపాసక చింతామణియై = తనను ఉపాసించినవారికి చింతామణియై, ప్రసిద్ధ = ప్రఖ్యాతిగాంచిన, భగవత్ శబ్ద = భగవంతుడను శబ్దమునకు, అభిధేయార్థమై = వాచ్యార్థమై, మదీయము = నాదైన, ఒక మంత్రంబు, ఒప్పున్ = ఒప్పుచున్నది, అది, నీకున్, ఏన్, ఇచ్చితిన్.

తా. ఓ నలరాజా ! సమస్త సంపదలుకలదై, చంద్రుడు అలంకారముగాకలదై, దక్షిణసగమందును, ఎడమ సగమందును పురుష స్త్రీ స్వరూపముకలదై, శివసంబంధియై, ఏ కళంకము లేనిదై, సౌమ్యాకారముకలదై తనను ఉపాసించినవారికి చింతామణియై ప్రఖ్యాతిగాంచిన భగవత్ శబ్దమునకు వాచ్యార్థమైన నాదగు ఒక మంత్రమును ఒప్పుచున్నదానిని నీకు నేను ఇచ్చెదను.

**19 వ. ఇది చింతామణి మంత్రం బేతదుద్ధార ప్రకారంబు రహస్యంబుగా నిప్పుడుపదేశించితి గురు పరంపరా సంప్రదాయ క్రమంబున సకీలంబుగా సిద్ధ సారస్వత సంసిద్ధికారణంబైన యిమ్మహావిద్య నెఱింగికొనుము.**

తా. ఈ చెప్పినది చింతామణి మంత్రము. దీని ఉద్ధార ప్రక్రియను రహస్యముగా ఇప్పు దుపదేశించితిని. గురుపరంపర వలన వచ్చిన రహస్యములవరుసచేత కీలకమైన యక్షర విశేషముతో కూడ, చదువకయే తనంతట సిద్ధించు వాఙ్మయముయొక్క ప్రాప్తికి హేతుభూతమైన ఈ గొప్ప విద్యను తెలిసికొనుము.

**20 క. ఆచారపరత వేకువ**
**లేచి పఠింపుము కుమార లేఖర్షభ యీ**
**శ్రీ చింతామణి మంత్రము**
**ప్రాచికి నభిముఖుఁడవై శుభం బొడగూఁడున్**

కుమారలేఖర్షభ = కుమారశ్రేష్ఠా !, వేకువన్ = తెల్లవారుఝామున, లేచి, ఆచారపరతన్ = నియమాసక్తితో, ప్రాచికిన్ = తూర్పు దిక్కునకు, అభిముఖుండవై = ఎదుటనున్నవాడవై, ఈ చింతామణి మంత్రమున్, పఠింపుము, శుభంబు, ఒడగూడున్ = కలుగును.

తా. ఓ నలరాజా ! తెల్లవారుఝామున లేచి నిమయాసక్తితో తూర్పు దిక్కునకు ఎదుటనున్నవాడవై ఈ చింతామణి మంత్రమును పఠింపుము. నీకు శుభము కలుగును.

**21 శా. సర్వాంగీణ రసామృత స్తిమిత వాచావీచి వాచస్పతుల్**
**గర్వోన్నద్ధ విరోధి రాడుదధి వాగ్గాంభీర్య కుంభోద్భవుల్**
**స్వర్వామా సదృశాంగనాజన మనస్సంచార పంచాస్త్రు లం**
**తర్వాణుల్ నృప యస్మదీయమగు చింతారత్న విద్యాధరుల్**

నృప = ఓ రాజా, అస్మదీయమగు = మాదైన, చింతారత్న విద్యాధరుల్ = చింతామణి మంత్రము జపించువారు, సర్వాంగీణ = ప్రతి అక్షరమందును, రసామృత = అమృతమువంటి రసముచేత, స్తిమిత = తడిసియున్న, వాచావీచి = తరంగములవంటి వాక్కులకు, వాచస్పతుల్ = బృహస్పతివంటివారు, గర్వ ఉన్నద్ధ = మదముచే అతిశయించిన, విరోధి రాట్ ఉదధి = శత్రు రాజులనెడి సముద్రమందున్న, వాక్ గాంభీర్య = వాక్కులనెడి గాంభీర్యమునకు, కుంభోద్భవుల్ = అగస్త్యుని వంటివారు, స్వర్వామా = దేవతాస్త్రీలతో, సదృశ = సమానమైన, అంగనా జన = స్త్రీజనముయొక్క, మనస్సంచార = మనసులందు విహరించు, పంచాస్త్రులు = మన్మథునివంటివారు, అంతర్వాణుల్ = విద్వాంసులును అగుదురు.

తా. ఓ రాజా ! మాదైన చింతామణి మంత్రము జపించువారు ప్రతి అక్షరమందును అమృతమువంటి రసముచే తడిసిన తరంగములవంటి వాక్కులకు బృహస్పతివంటివారు. మదముచే అతిశయించిన శత్రురాజులనెడి సముద్రమందున్న వాక్కులనెడి గాంభీర్యమునకు అగస్త్యునివంటివారు. దేవతా స్త్రీలతో సమానమైన స్త్రీజనముల మనసులందు విహరించు మన్మథుని వంటివారు. విద్వాంసులును అగుదురు.

**22 సీ. కబరికా భరముపైఁ గన్నె గేదంగి పూ**
**రేకుతోఁ గూడ రేఖేనిఁ బొంది**
**లలిత కస్తూరికా తిలక మధ్యంబున**
**సొబగొందు ముత్యాల చుక్క నిలిపి**
**కుదురునిండిన మించి గుబ్బచన్నులమీఁద**
**జిలుఁగు దువ్వలువ గంచెలయుఁ దొడిగి**

**యచ్చ వెన్నెలచాయ నవఘళింపఁగఁ జాలు**
**నిద్దంపు వెలిపట్టు నెఱిక గట్టి**
**తే. యంచకొదమలఁ బూన్చిన యరదమెక్కి**
**యుపనిషద్వీథి విహరించుచున్న నన్ను**
**మహిత చింతామణీ దివ్య మంత్ర మూర్తిఁ**
**దలఁప సారస్వతం బయత్నమునఁ గలుగు**

కబరికాభరముపైన్ = కేశపాశముపై, కన్నెగేదంగి పూఱేకుతోన్ కూడన్ = లేతపచ్చని మొగలి పూదళముతోకూడ, రేఱేనిన్ = చంద్రుని, చెరివి = గ్రుచ్చి, లలిత = మనోహరమైన, కస్తూరికా తిలక = కస్తూరి బొట్టుయొక్క, మధ్యంబునన్ = మధ్యయందు, సొబగొందు = సుందరమైన, ముత్యాలచుక్క = ముత్యాలబొట్టును, నిలిపి = ఉంచి, కుదురు నిండిన = స్థానమున వృద్ధిపొంది, మించు = ప్రకాశించు, గుబ్బచన్నులమీద = గుండ్రని స్తనములపై, జిలుగు దువ్వలువ = సన్నని వస్త్రద్వయమును, కంచెలయున్ = అవికయును, తొడిగి, అచ్చవెన్నెలచాయన్ = స్వచ్ఛమైన వెన్నెలకాంతిని, అవఘళింపగన్ = తిరస్కరించుటకు, చాలు = సమర్థమైన, నిద్దంపు = మృదువైన, తెలిపట్టునెఱిక = తెల్లని పట్టు వస్త్రమును, కట్టి, అంచకొదమలన్ = యువ హంసలను, పూన్చిన యరదము = కట్టిన రథమును, ఎక్కి, ఉపనిషత్ వీథిన్ = వేదాంతమార్గమందు, విహరించుచున్న, నన్నున్, మహిత = పూజ్యమైన, చింతామణీ దివ్య మంత్రమూర్తి, తలపన్ = స్మరించినచో, సారస్వతంబు = సమస్తవిద్యలును, అప్రయత్నమునన్, కలుగున్ = లభించును.

తా. కేశపాశముపై లేతపచ్చని పూదళమును, చంద్రుని గ్రుచ్చి, మనోహరమైన కస్తూరి తిలకమును మధ్యయందు అందమైన ముత్యాలబొట్టును ఉంచి వృద్ధిపొంది, ప్రకాశించు గుండ్రని స్తనములపై సన్నని దుకూలమును, అవికయును తొడిగి, స్వచ్ఛమైన వెన్నెలకాంతిని తిరస్కరించుటకు సమర్థమైన మృదువైన తెల్లని పట్టు వస్త్రమును కట్టి, యువహంసలను కట్టిన రథము నెక్కి వేదాంతమార్గమందు విహరించుచున్న నన్ను పూజ్యమైన చింతామణి దివ్య మంత్రమూర్తిని స్మరించినచో సమస్తవిద్యలును అప్రయత్నముగా లభించును.

**23 క. ఎంత జడుఁడైనఁగానీ**
**చింతామణి మంత్రరాజ సేవాపరుఁ డ**
**బ్దాంతంబునఁ గవితా సి**
**ద్ధాంత రహస్యోపనిష దుపాధ్యాయుడగున్**

చింతామణి మంత్రరాజ, సేవాపరుడు = కొలుచువాడు, ఎంత జడుడైనగానీ = ఎంత మూర్ఖుడైనగానీ, అబ్దాంతంబునన్ = సంవత్సరము ముగియులోపున, కవితా = కవిత్వముయొక్క, సిద్ధాంత = సిద్ధాంతములయొక్క, రహస్య = రహస్యములనెడి, ఉపనిషత్ = ధర్మములకు, ఉపాధ్యాయుడు అగున్ = చెప్పెడువాడు అగును.

తా. చింతామణి శ్రేష్ఠమైన మంత్రమును సేవించువాడు ఎంత మందబుద్ధియయినను సంవత్సరము ముగియులోపల కవిత్వ సిద్ధాంతముల రహస్యములనెడి ధర్మములకు ఉపాధ్యాయుడగును.

**24 క. వైదర్భివోలెఁ గవితా**
**వైదర్భి నరేంద్ర నీకు వశమయ్యెను సూ**
**ర్యోదయవేళ జపింపు కృ**
**తాదరమున నస్మదీయమగు మంత్రంబున్**

నరేంద్ర = ఓ నలమహారాజా !, సూర్యోదయవేళన్ = సూర్యుడుదయించు సమయమున, కృతాదరమునన్ = ఆసక్తితో, అస్మదీయము = నా సంబంధియగు, మంత్రంబున్ = చింతామణి మంత్రమును, జపింపుము, నీకున్ = అట్లు జపించిన నీకు, కవితా వైదర్భి = వైదర్భి కవితా కన్యక, వైదర్భివలెనే = దమయంతివలెనే, వశమయ్యెడున్ = వశమగును.

తా. ఓ నలమహారాజా ! సూర్యుడుదయించు సమయమున ఆసక్తితో నాసంబంధియగు చింతామణి మంత్రరాజమును జపింపుము. అలా జపించిన నీకు కవిత్వమందు వైదర్భి దమయంతివలెనే వశమగును.

**25 సీ. కలియుగంబందున గాశ్మీరభూమిలో**
**మత్పీఠమున ధరామరుఁడు పుట్టు**
**శ్రీహీరుఁ డనఁగ శేషాహియంశంబున**
**నతఁడు మామల్ల దేవ్యాఖ్యయైన**
**తన భార్యయందుఁ చింతామణీ మంత్ర చిం**
**తన ఫలంబుగ నొక్క తనయుఁ గాంచుఁ**
**గల్పించు నతని కాకాశ వాగ్దేవి తా**

**శ్రీహర్షు డనియెడు చిహ్ననంబు**

**తే.** **వాని కీరేడు విద్యలు వచ్చియుండు**
**వాఁడు ఖండనకారుండు వాఁడు సుకవి**
**కావ్యముఖమున వానిచేఁ గలుగు నీకు**
**నిర్మలంబైన సత్కీర్తి నిషధరాజ !**

కలియుగంబందును, కాశ్మీరభూమిలోన్, శేషాహి యంశంబునన్, మత్పీఠమునన్ = నా చింతామణి పీఠమున, శ్రీహీరుడనగన్ = శ్రీహీరుడనుపేరున, ధరామరుడు = బ్రాహ్మణుడు, పుట్టున్ = పుట్టగలడు. అతడు, చింతామణి మంత్ర, చింతన ఫలంబుగన్ = జపించిన ఫలముగా, మామల్లదేవ్యాఖ్యయగు = మామల్లదేవియను పేరుగల, తన భార్యయందున్, ఒక్క తనయున్ = ఒక కుమారుని, కాంచున్ = పొందును. అతనికిన్ = ఆ బాలునకు, తాన్ = తాను స్వయముగా, ఆకాశ వాగ్దేవి = అశరీరవాణి, శ్రీహర్షుడనియెడు చిహ్ననంబున్ = శ్రీహర్షుడను పేరును, కల్పించున్, వానికిన్, ఈరేడు విద్యలు = పదునాలుగు విద్యలును, వచ్చియుండున్, వాడు, ఖండనకారుడు = ఖండనఖండఖాద్యమనెడి గ్రంథమును చేయువాడు, వాడు, సుకవి, వానిచేన్, నీకు, నిర్మలంబైన = స్వచ్ఛమైన, సత్కీర్తి = మంచి కీర్తి, కావ్యముఖమున = కావ్యముద్వారా, కలుగున్.

తా. ఓ నలరాజా ! కలియుగమందు కాశ్మీరదేశంలో శేషుని యంశతో నా చింతామణి పీఠమున శ్రీహీరుడను బ్రాహ్మణుడు పుట్టగలడు. చింతామణి మంత్రమును జపించిన ఫలముగా మామల్లదేవియను పేరుగల తన భార్యయందు ఒక కుమారుని పొందును. అతనికి ఆశరీరవాణి స్వయముగా శ్రీహర్షుడను పేరును కల్పించును. వానికి పదునాలుగు విద్యలును వచ్చియుండును. వాడు ఖండనఖండఖాద్యమనెడు గ్రంథమును రచించును. వాడు సుకవి యగును, వానిచే నీకు నిర్మలమైన మంచి కీర్తి కావ్యముద్వారా లభించగలదు.

**26** **క.** **నిను దమయంతిని ఋతుప**
**ర్ణునిఁ గర్కోటకుని నెవ్వరు దలంతురు మే**
**ల్కను నప్పు డుషః కాలం**
**బున నృప ! కలికల్మషములు వొందవు వారిన్**

నృప = రాజా !, నిను = నిన్ను, దమయంతిని, ఋతుపర్ణుని, కర్కోటకుని, మేల్కనున్ అప్పుడు = మేలుకొనునప్పుడు, ఉషః కాలంబున = వేకువయందు, ఎవ్వరు తలంతురు, వారిన్, కలికల్మషములు = కలిదోషములు, పొందవు.

తా. రాజా ! నిన్ను, దమయంతిని, ఋతుపర్ణుని, కర్కోటకుని మేలుకొను సమయమున, వేకువయందు ఎవరు స్మరింతురో వారిని కలిదోషములు అంటవు.

**27** **వ.** **హరియునుంబోలెఁ గలికలుషహారి గుణసంకీర్తనుండవు పుణ్యశ్లోకుండవు నగుము. పోయి వచ్చెదను. పునర్దర్శనంబయ్యెడు నని పలికి యద్దేవి దమయంతిం జూచి దేవతలుం దానునుం మఱియును**

తా. విష్ణువువలె కలిదోషములను పోగొట్టెడి గుణములచే పొగడదగినవాడవు కమ్ము. పోయి వచ్చెదను, మరల కలుసుకొందముగాక అని పలికి సరస్వతి దమయంతిని చూచి దేవతలును తానును ఇంకను

**28** **సీ.** **సకల పుణ్యాంగనాజన శిరోమణివైన**
**నీకు పాతివ్రత్య నియతిఁ జేసి**
**సాధింపరాని యాశాస్యంబు గలుగునే?**
**యైన, దేవతలమైనట్టి మాకుఁ**
**బ్రత్యక్షమై మనోరథ మీక పోరాదు**
**మర్త్యుల; కటుగాన మగువ, వినుము;**
**నీదు పాతివ్రత్య నియమంబునకుఁ దప్పు**
**ఖలుఁడు భస్మంబవుఁగాత యపుడ;**
**తే.** **కామరూపులమగు మమ్ముఁ గాంచి నీవు**
**డెందమునఁ జాల నాశ్చర్య మంది తిపుడు;**
**నిక్క, మిది యాదిగాఁగ నో నీరజాక్షి,**
**కామరూపిణి వగుము మా కరుణఁ జేసి**

సకల = సమస్తమైన, పుణ్యాంగనా జన = పతివ్రతా స్త్రీలలో, శిరోమణివైన = శ్రేష్ఠురాలవైన, నీకు, పాతివ్రత్య నియతి చేసి = పాతివ్రత్య నియమముచేత, సాధింపరాని, ఆశాస్యంబు కలదె = కోరికలుండునా?, ఐన = ఐనప్పటికిని, దేవతలము ఐనట్టి మాకు, మర్త్యులకు = మానవులకు, ప్రత్యక్షమై, మనోరథము = కోరికలను, ఈక = ఇయ్యక, పోరాదు, అటుగాన =

అందువలన, మగువ = కాంతా !, వినుము, నీదు పాతివ్రత్య నియమంబునకున్, తప్పు = చెడగొట్టు, ఖలుడు = పాపాత్ముడు, అపుడ = అప్పుడే, భస్మము అవుగాత, కామరూపులమగు = కావలసిన రూపములను దాల్చు, మమ్మున్, కాంచి = చూచి, నీవు, డెందమున = మనసులో, ఇపుడు, చాలన్, ఆశ్చర్యము, అందితి = పొందితివి. నిక్కము = నిజము, ఓ నీరజాక్షి = ఓ పద్మాక్షీ !, ఇది ఆదిగాగన్ = ఇది మొదలుగా, మా కరుణ చేసి, కామరూపిణివి అగుము.

తా. దమయంతీ ! సమస్తమైన పతివ్రతాస్త్రీలలో శ్రేష్ఠురాలవైన నీకు పాతివ్రత్య నియమముచేత సాధింపరాని కోరికలుందునా? ఐనప్పటికిని, దేవతలమైనట్టి మాకు మానవులకు ప్రత్యక్షమై వరముల నీక పోరాదు. అందువలన ఓ మగువ వినుము. నీ పాతివ్రత్య నియమమును చెడగొట్టు పాపాత్ముడు వెంటనే నశించుగాక. కామరూపులమైన మమ్ములను చూచి నీవు మనసున ఆశ్చర్యపడితివి, నిజము. ఓ పద్మాక్షీ ! ఇది మొదలుగా మా దయచే నీవు కామరూపిణి వగుము.

**29 వ. అని పలికి పలుకుబోటియు హరి కృపీటభవ శమన శంబరపతు లంబరమునకు జాంబూనద విమానారూఢులై యెగసిరి. సమయ సముత్థానంబునం గ్రందుకొను రాజనందనుల యందియల మొరపంబుతోడ గెడబెరసి దేవదుందుభి ధ్వానంబు రోదసీ కుహరంబునం దీటుకట్టె. విద్యాధర హస్త ముక్తంబైన పుష్పవర్షంబు హర్షోత్కర్షంబు నాపాదించె. అప్పుడు కల్యాణ విభవ లక్ష్మీ ప్రతిష్ఠాసమానుండగు నిషధరాజు నిజశిబిర ప్రతిష్ఠాసమానుండయ్యె దమయంతియుఁ గన్యా సహస్రంబు గొల్వ నాత్మ మందిరంబునకుం జనియె ననంతరంబ**

తా. అని పలికి, సరస్వతియు, ఇంద్రుడు, అగ్ని, యముడు, వరుణుడును బంగారు విమానముల నెక్కినవారై ఆకాశమున కెగిరిరి. సభాస్థానమునుండి ఒక్కసారి లేచుటచే వ్యాపించిన రాజనందనుల అందియల ధ్వనితో దేవదుందుభి ధ్వనులు జతకలసి భూనభోంతరాళమంతటను నిండుకొనెను. విద్యాధరులచే విడువబడిన పూలవాన సంతోషాతిశయమును కలిగించెను. అప్పుడు పెళ్ళికొడుకగు నలుడు తన శిబిరమునకు పోవగోరుచున్నవాడయ్యెను. దమయంతియును తన వేయిమంది చెలికత్తెలును సేవించుచుండగా తన భవనమునకు వెళ్ళెను. తరువాత

**30 మ. తమ యంశంబగు మేదినీరమణునిన్ ధాత్రిన్ విసర్జించి యా**
**యమృతాశుల్ గడు విన్ననై చనిరి ముక్తాంశత్వ ఖేదంబునన్**
**మమతా సంపద యెట్టిదో యెడనెడన్ వక్రాననాంభోజయై**
**దమయంతిం గనుఁగొంచు నేఁగె వినతాంతర్వాణి శ్రీవాణియున్**

ఆ అమృతాశుల్ = అ నలుగురు దిక్పాలకులు, తమ యంశంబగు = తమ యంశమైన, మేదినీరమణున్ = నలుని, ధాత్రిన్ = భూమిని, విసర్జించి = వదలి, ముక్తాంశత్వ ఖేదంబునన్ = దేహభాగమును విడిచి పోవుచున్నవారివలె, కడు విన్ననై = మిక్కిలి చిన్నబోయినవారై, చనిరి = వెళ్ళిరి. వినత = భక్తులైన, అంతర్వాణి = శాస్త్రజ్ఞులుకల, శ్రీ వాణియున్ = సరస్వతియును, వక్రానన అంభోజయై = వెనుకకు చూచుచున్న ముఖపద్మముకలదై, ఎడనెడన్ = మాటిమాటికి, దమయంతిన్, కనుగొంచు = చూచుచు, ఏగెన్ = వెళ్ళెను. మమతాసంపద = అభిమాన సంపద, ఎట్టిదో = ఎటువంటిదోకదా !

తా. ఆ నలుగురు దిక్పాలకులును తమ అంశయగు నలుని భూమిపై వదలి తమ దేహభాగమును విడిచిపోవుచున్న వారివలె మిక్కిలి చిన్నబోయినవారై వెళ్ళిరి. సరస్వతియును మాటిమాటికి తిరిగి తిరిగి దమయంతిని చూచుచు వెళ్ళెను. అభిమాన సంపద ఎంతటిదోకదా !

**31 ఉ. మంచక వాటికా శిబిర మధ్యమునందు ధనార్థి కోటికిం**
**గాంచనవర్షము ల్గురిసెఁ గంఠ విలోల మధూకమాలికో**
**దంచితుఁ డోషధీపతి కులాగ్రణి వంది జనంబులో విశే**
**షించి విదర్భజా స్తవనశీలుర మిక్కిలి గారవించుచున్**

కంఠ, విలోల = చలించుచున్న, మధూక మాలిక, ఉదంచితుడు = ప్రకాశించువాడు, ఓషధీపతి కులాగ్రణి = చంద్రవంశ శ్రేష్ఠుడైన నలుని, వంది జనంబులోన్ = కైవారము చేయువారిలో, విశేషించి = విస్తరించి, విదర్భజా స్తవనశీలురన్ = దమయంతిని స్తోత్రముచేయువారిని, మిక్కిలి, గారవించుచున్, మంచెక వాటికా = మంచెల స్థలమందున్న, శిబిర మధ్యమునందు, ధనార్థి కోటికిన్ = యాచక సమూహమునకు, కాంచన వర్షముల్ కురిసెన్

తా. కంఠమందు మధూకమాలికతో ప్రకాశించువాడు, చంద్రవంశ శ్రేష్ఠుడునైన నలుని వంది జనములో అధికముగా దమయంతిని స్తోత్రముచేయువారిని మిక్కిలి గౌరవించుచు, మంచెల స్థలమందున్న శిబిర మధ్యమందు యాచకులకు కాంచన వర్షము కురిపించెను.

**32 వ. అప్పుడు గొంద అసూయాపరాయణులైన రాజు లా రాజకుమారుం జూచి చూపోపక 'యత్యుచ్ఛ్రయః పతన హేతు'వనెడువారు, 'సతి సర్వత్ర గర్హితమ్మ'నెడువారును, 'కాముకస్య కుతో లజ్జా' యనువారును, 'సంగమో విప్రయోగాంత' యనువారునై యుండి రప్పుడు**

తా. అప్పుడు కొందరు అసూయాపరాయణులైన రాజులు ఆ నలుని చూచి కన్నుకుట్టి 'అతిగా ఎగురుట అణగుటకే'యని

అనెదువారును, 'అతి అన్నివేళలా గర్వింపదగిన'దనెదువారును, 'కాముకునకు సిగ్గెక్కడిద'నెదువారును, 'కలియుట విడిపోవుటకే' అనువారునై ఉండిరి. అప్పుడు

33 ఉ. **నైషధుఁ డంతరంగమున నవ్వుచునుండు విరోధు లాదు దు**
**ర్భాషణముల్ వినిన్ వినని భంగి నదట్టిద విద్విషన్మృషా**
**దోషగుణాధిరోపణ మదోషతఁ దెల్పుచు నుండుఁగాన ద**
**ద్దూషణ మెప్డు విన్నఁ బరితోషముఁ జెందు మనీషి యాత్మలోన్**

నైషధుడు = నలుడు, విరోధులు = శత్రువులు, ఆడు దుర్భాషణముల్, వినిన్ = వినియును, వినని భంగి = విననట్లు, అంతరంగమునన్ = చిత్తమునందు, నవ్వుచుండున్, అది, అట్టిద = అటువంటిదే, విద్విషత్ = శత్రువులయొక్క, మృషా = అసత్యమను, దోషగుణ, అధిరోపణము = ఆరోపించుట, అదోషతన్ = దోషము లేకపోవుటను, తెల్పుచునుండును కాన, మనీషి = విద్వాంసుడు, తత్ దూషణము = ఆ దూషణమును, ఎప్డు విన్నన్, ఆత్మలోన్, పరితోషము చెందున్ = సంతసించును.

తా. నలుడు తన శత్రువులు పలుకు దుర్భాషణములను వినియు విననియట్లు మనసునందు నవ్వుకొనుచుండును. అది అలాగే ఉంటుంది. శత్రువులాడు అసత్యమును, దోషగుణములను నారోపించుట దోషము లేకపోవుటను తెల్పుచునుండును. కాన విద్వాంసుడు ఆ దూషణమును ఎపుడు విన్నను మనసులో సంతోషించును. (అలంకారము – అర్థాంతరన్యాసము)

34 క. **క్రించులగు రాజతనయులు**
**వంచింపక యాడుదురపవాదోక్తుల లోఁ**
**గొంచు నృపాలుని మ్రోలన**
**పంచ మహాశబ్దములును బహుళములయ్యెన్**

క్రించులగు = అల్పులైన, రాజతనయులు, వంచింపక = సందేహించక, ఆడుదురు, అపవాద ఉక్తులన్ = దుష్టవాక్యములను, లోఁగొంచున్ = వినబడకుండ చేయుచు, పంచ మహాశబ్దములును = ఢక్కా మృదంగాది ఐదు ధ్వనులను, నృపాలుని మ్రోలన్ = నలరాజు యెదుట, బహుళములు అయ్యెన్ = అధికముగా వాయింపబడెను.

తా. అల్పులైన రాజకుమారులు సందేహించక దుష్టవాక్యములను ఆడుదురు. వానిని వినబడకుండచేయుచు ఢక్కా, మృదంగాది ఐదు వాద్య ధ్వనులను నలరాజు యెదుట అధికముగ వాయించబడెను.

35 వ. **ఇవ్విధంబున నిషధరాజు శిబిరంబు ప్రవేశించె నట విదర్భమహీవల్లభుండు**

36 సీ. **కార్తాంతికులఁ బిల్చి కర్పూర సమ్మిశ్ర**
**తాంబూల దాన పూర్వంబు గాఁగ**
**జాంబూనదాంబర స్రక్చందనంబులఁ**
**బూజించి భూపాలపుంగవుండు**
**సర్వ లక్షణ కలా సంపూర్ణమై యుద**
**యాస్త నిర్దోషమై యతిశయిల్లు**
**శోభనాంశము మీరు శోధించి చెప్పుఁడా**
**యని పల్క వారును నట్టి లగ్న**

తే. **మరసి చేపట్టి యాసన్నమయ్యె దేవ**
**శుభముహూర్తంబు కాలసంశుద్ధి లెస్స**
**పిలువఁ బంపుము వేవేగ పెండ్లికొడుకు**
**ననిన నట్టుల కాకంచు నాప్తజనుల**

భూపాలపుంగవుండు = విదర్భరాజు, కార్తాంతికులన్ = సిద్ధాంతులను, పిల్చి, కర్పూర = పచ్చకప్పురముతో, సమ్మిశ్ర = కూడిన, తాంబూల, దాన = ఇచ్చుట, పూర్వంబుగాగన్ = ముందు కలుగునట్లుగా, జాంబూనద అంబర = బంగారు వస్త్రములను, స్రక్ = పుష్పమాలికలను, చందనంబులన్ = మంచిగంధముతోను, పూజించి = సత్కరించి, మీరు, సర్వలక్షణకలాసంపూర్ణమై = అన్ని లక్షణముల సంపదలతో నిండినదై, ఉదయాస్త నిర్దోషమై = ఉదయాస్తమయాది దోష రహితమై, అతిశయిల్లు = ఒప్పుచున్న, శోభనాంశము = శుభముహూర్తమును, శోధించి = పరీక్షించి, చెప్పుడాయని = చెప్పవలసినదని, పల్కన్ = పలుకగా, వారును = ఆ సిద్ధాంతులును, అట్టి లగ్నమున్ = అట్టి శుభముహూర్తమును, చేపట్టి = సంగ్రహించి, దేవా = ఓ భీమరాజా !, శుభ ముహూర్తంబు, ఆసన్నమయ్యెన్ = చేరువయ్యెను, కాలసంశుద్ధి = ముహూర్త పరిశుద్ధి, లెస్స = బాగున్నది. పెండ్లికొడుకున్ = పెండ్లికుమారుడగు నలుని, వేవేగ = శీఘ్రముగా, పిలువవన్, పంపుము, అనినన్ = అని పలుకగా, అట్టులెకాక అంచున్, (భీమరాజు) ఆప్తజనులన్ = ఇష్టులను

తా. భీమరాజు సిద్ధాంతులను పిలిచి తాంబూలాదులతో సత్కరించి బంగారు వస్త్రాదుల నిచ్చి మీరు అన్ని లక్షణములతో దోషరహితమైన శుభముహూర్తమును చెప్పవలసినదని పలుకగా, ఆ సిద్ధాంతులు అలాంటి శుభముహూర్తమును సంగ్రహించి 'ఓ భీమరాజా ! శుభముహూర్తము చేరువనే యున్నది. ముహూర్త పరిశుద్ధి బాగుగానున్నది. పెండ్లికుమారుని వెంటనే పిలిపింపుము' అని పలుకగా రాజు అట్టులేనని తన ఇష్టులను

**37 వ. అంతఁ గుమారునిం దోడ్తేర నియమించె నటమున్న కన్యాంతఃపురంబున.**

**38 తే. కువలయాక్షులు ముత్యాలచవికలోన**
**జలకమార్చిరి నిజకులాచారసరణిఁ**
**బసిఁడి పీఠంబునందుంచి పద్మనయనఁ**
**జెలువమగు కన్నెరాకమ్ము చేతికిచ్చి**

కువలయాక్షులు = కలువలవంటి నేత్రములుకలవారు, ముత్యాల చవికలోన = ముత్యాల మండపములో, పసిడి పీఠంబునన్ = బంగారు పీటయందు, పద్మనయనన్ = దమయంతిని, ఉంచి = కూర్చుండబెట్టి, చెలువమగు = అందమైన, గన్నెరాకమ్ము = గన్నేరాకువంటి బాణమును, చేతికిన్, ఇచ్చి, నిజకులాచారసరణిన్ = తమ వంశాచారపద్ధతిగా, జలకము ఆర్చిరి = స్నానము చేయించిరి.

తా. కలువనేత్రులగు స్త్రీలు ముత్యాల మండపములో బంగారు పీటయందు దమయంతిని కూర్చుండబెట్టి అందమైన గన్నేరాకు వంటి బాణమును చేతికిచ్చి తమ వంశాచారపద్ధతిగా స్నానము చేయించిరి.

**39 తే. గంధజల పూరితంబులై కమలముఖుల**
**కరములందున్న మణిహేమ కలశములకుఁ**
**జెలువమగు భీమకన్య చన్నులకు నోడి**
**దాస్యమున నీళ్ళు మోచు చందంబు గలిగె**

గంధజలపూరితంబులై = చందనపు నీటిచే నిండింపబడినవై, కమలముఖుల = చెలికత్తెలయొక్క, కరములందున్న = చేతులందున్న, మణిహేమ కలశములకు = మణుల బంగారు కడవలకు, చెలువమగు = సొగసైన, భీమకన్య = దమయంతియొక్క, చన్నులకున్, ఓడి, దాస్యమునన్ = సేవాభావముతో, నీళ్ళు మోచు చందంబు = నీళ్ళు మోయు విధము, కలిగెన్.

తా. చందనపు నీటిచే నిండింపబడినదై చెలకత్తెల చేతులందున్న మణుల బంగారు కడవలు సొగసైన దమయంతియొక్క స్తనములకు ఓడిపోయి సేవాభావముతో నీళ్ళు మోస్తున్న విధము కలిగెను.(అలంకారము – ఉత్ప్రేక్ష)

**40 తే. చెలువ వినివృత్త సలిలాభిషేచనయును**
**జంద్రికా పాండు పరిధాన శాలినియును**
**నగుచు వర్షాశరత్తుల యంతరమున**
**నొప్పు సంధ్యాధిదేవత కుద్దియయ్యె**

చెలువ = దమయంతి, వినివృత్త = జరుపబడిన, సలిల అభిషేచనయును = స్నానముకలదియును, చంద్రికా = వెన్నెలవలె, పాండు = తెల్లనైన, పరిధాన = వస్త్రముచే, శాలినియును = ప్రకాశించునదియును, అగుచు, వర్షా శరత్తుల అంతరమున = వర్షాకాల,శరత్కాల మధ్యమున, ఒప్పు = ఒప్పునట్టి, సంధ్య అధిదేవతకు = సంధ్యాకాలదేవతకు, ఉద్ది అయ్యెన్ = సాటి అయ్యెను.

తా. దమయంతి మంగళస్నానము జరుపబడి, వెన్నెలవలె తెల్లని వస్త్రమును ధరించినదై వర్షాకాల, శరత్కాల మధ్య ఒప్పునట్టి సంధ్యాకాల దేవతకు సాటియయ్యెను.(అలంకారము – ఉపమ)

**41 క. సమధిక చామర నిర్జయ**
**సముపార్జిత విమల కీర్తి శౌక్తిక ముక్తా**
**సముదయ శంక ఘటించెం**
**గమలానన చికురవారికణ కోరకముల్**

కమలానన = పద్మముఖి, చికుర = తలవెంట్రుకలయందున్న, వారికణకోరకముల్ = పూమొగ్గలవంటి నీటికణములు, సమధిక = అధికమగునట్టి, చామర నిర్జయ = చామరముల జయించుటచేత, సముపార్జిత = సంపాదింపబడినదియును, విమల = నిష్కళంకమగు, కీర్తి = కీర్తియనెడు, శౌక్తిక ముక్తా = ముత్యముల, సముదయ = సమూహములనెడి, శంకన్ = సందేహమును, ఘటించెన్ = కూర్చెను. (అలంకారము – ఉత్ప్రేక్ష)

తా. దమయంతి తల వెంట్రుకలయందున్న పూమొగ్గలవంటి నీటికణములు అధికమైన చామరముల జయించుటచేత సంపాదింపబడిన నిష్కళంకమైన కీర్తియనెడు ముత్యాల సమూహముల శంకను కూర్చెను.

**42 క. నునుఁజాత మెఱుఁగు వెట్టిన**

**కనక శలాకయును బోలెఁ గన్నియ యొప్పెన్**
**దనువగు తడియొత్తు మణుం**
**గున నొయ్యన మేని తడి యిగుర్పఁగ నొత్తన్**

కన్నియ = దమయంతి, తనువగు = సన్ననిదైన, తడియొత్తు మణుంగునన్ = తడియొత్తుకొనెడి వస్త్రముచే, ఒయ్యనన్ = మెల్లగా, మేని తడి = శరీరపు తడి, ఇగుర్పగ = పోవునట్లుగా, ఒత్తన్ = తుడువగా, నునుఱాతన్ = నున్నని ఱాతితో, మెఱుగు పెట్టిన, కనక శలాకయునుబోలె = బంగారు కణికవలె, ఒప్పెన్ = ప్రకాశించెను.

తా. దమయంతి సన్ననిదైన తడియొత్తుకొనెడి వస్త్రముచే మెల్లగా శరీరపుతడిని ఒత్తగా నున్నని ఱాతితో మెఱుగుపెట్టిన బంగారు కణికవలె ప్రకాశించెను. (అలంకారము – ఉపమ)

**43** ఉ. **వాసనఁ గేతకీదళమువంకఁ గళంకములేని పైఁడి య**
**భ్యాసముచేసెనేని యగు నప్డు సమానము గంధసార చ**
**ర్చా సురభీకృతంబగుచు జారుతటిల్లతికామతల్లికా**
**భాసురవర్ణమైన నరపాలతనూభవ దేహయష్టితోన్**

కళంకము = మాలిన్యము, లేని పైడి = లేనట్టి బంగారము, కేతకీదళము వంకన్ = మొగలిరేకుయొద్ద, వాసన = పరిమళమును, అభ్యాసము చేసెనేనియున్ = సాధించుట తెలుసుకొనినయెడల, అప్డు, గంధసార = మంచిగంధముయొక్క, చర్చా = పూతచేత, సురభీకృతంబగు = పరిమళింపచేయబడిన, చారు = మనోహరమైన, తటిల్లతికామతల్లికా = శ్రేష్ఠమైన తీగవంటి మెఱుపుకలదై, భాసుర = ప్రకాశించు, వర్ణమైన = కాంతికలదైన, నరపాల తనూభవ = దమయంతియొక్క, దేహయష్టితోన్ = సన్నని దేహముతో, సమానము అగున్ (అలంకారము – అభూతోపమ)

తా. మాలిన్యములేని బంగారము మొగలిరేకుయొద్ద పరిమళమును సాధించుట తెలుసుకొనినయెడల అప్పుడు మంచి గంధముయొక్క పూతచేత పరిమళింపచేయబడిన మనోహరమైన శ్రేష్ఠమైన తీగవంటి మెఱుపుకలదై ప్రకాశించు కాంతికలదైన దమయంతియొక్క సన్నని దేహముతో సమానమగును.

**44** వ. **తదనంతరంబ కనకవేదికాంతరంబునం బసిండి పీఠమున నునిచి ప్రతిప్రతీకంబును బ్రతికర్మ నిర్మాణ కర్మఠంబైన సైరంధ్రికాజనం బప్పురంధ్రీరత్నంబుం బ్రయత్నంబున నలంకరింపం దొణంగె. అందొక ముద్దియ మదనాంధకార పటారంభణ తంతుసంతతియగు కుంతలమంజరికి నధివాస ధూప ధూమంబొసంగె. ఒక్క యలివేణి పెన్నెఱివేణిపై నెగయుచున్న ధూపధూమాంకురంబు గనుంగొని కుటిల కచచ్ఛటాభ్రాంతిఁ గొనగోళ్ళ దువ్వంబోయినఁ జెలులు నవ్విరి. ఒక్క యిందువదన గళిందకన్యకాభంగభంగురంబైన నెఱిదుఱుమునం జెంగలువలు దుఱిమె. ఒక్క కుటిలాలక లలాటపట్టంబునం గేశాంబుద విద్యుద్దండంబుగాఁ బసిండి పట్టంబు గట్టె. ఒక్క వరవర్ణిని చూర్ణాలకంబులను నీలకజ్జలంబులకు దీపజ్వాలంబుగా మనశ్శిలా చిత్రకంబు నొసల నష్తించె. ఒక్క తన్వంగి యనంగలీలావశంబున నపాంగ ప్రాంగణంబునకు నిగుడు కనీనికా నీలమణులకుం గిరణ కందళికలను సందేహంబు నాపాదింపం జాలునట్లుగా నీలాంజనరేఖలు వాలారుం గలికి కన్నుల కొలుకులు వెడలం దీర్చె. ఒక్క బోటి తాటంకమణి మహఃకలాపంబులను మరుపలాశ కుసుమ చాపంబులకుఁ దూపులుంబోలె నిందీవరావతంసంబులు చెవులం బొందుపఱిచె. ఒక్క విలాసిని నాసాతిల ప్రసూనంబునం బ్రసూన శరగుళికా శరంబునుంబోని ముక్తాఫల కలాపంబుఁ దాపించె. ఒక్క నితంబిని యధరబింబంబున యావకంబమర్చె. ఒక్క కలకంఠకంఠి కంఠకందళికయందుఁ గంటసరిఁ దొడిగె. ఒక్క యెలనాగ వక్షోజభాగంబునం బద్మరాగపదకంబుఁ బదిలపఱిచె. ఒక్క లేమ హేమమయ వినూత్నరత్న మేఖలా దామంబు జఘనసీమంబునం గట్టె. ఒక్క పూఁబోఁణి పైఁడియందియలు చరణారవిందంబులం దమర్చె. ఒక్క మత్తకాశిని యదుగు నెత్తమ్ములం గ్రొత్త లత్తుక హత్తించె. మఱియు సాంగోపాంగంబుగాఁ బ్రత్యంగంబు నంగనలు ముత్యాల జల్లి చెందిరంపుఁ జేరుచుక్క, చిన్ని పూఁతేకులు, పాలికలు, మకరికాపత్రభంగంబులు, హారంబులుం, గేయూరంబులుం, గంకణంబులు, మద్దియలు, వీరమద్దియలు, పాయవట్టంబు లాదిగాఁ గల యలంకారంబుల నలంకరించిరి. ఇవ్విభూషణంబులచేత, భాగ్యంబుచేత నీతియు ధర్మంబుచేత విభూతియు, వితరణంబుచేత విఖ్యాతియుంబోలె నన్నాతి యతిశయిల్లె నయ్యవసరంబున**

తా. అటుతరువాత బంగారువేదికమధ్య బంగారు పీటపై కూర్చుండబెట్టి ప్రతి అవయవమును అలంకారము చేయుటయందు నేర్పరియైన పరిచారికాజనము ఆ దమయంతిని పూనికతో అలంకరింప సాగెను. అందున్న ఒక ముద్దరాలు కామాంధకారమనెడి వస్త్రమును నేయుటకు తగిన దారముల సమూహమైన కేశపాశమునకు అధిక పరిమళముగల ధూప ధూమమును వేసెను. ఒక తెఱవ పెద్ద కేశపాశముపై ఎగయుచున్న ధూపపు పొగను చూచి కుటిలములైన తలవెంట్రుకల సమూహమను భ్రాంతితో కొనగోళ్ళతో దువ్వుటకు యత్నింపగా అక్కడి స్త్రీలు పరిహసించిరి. ఒక కాంత యమునానది తరంగముల వలె వక్రమైన, మనోహరమైన కేశపాశమునందు చెంగల్వపూవులను అలంకరించెను. ఒక్క కుంతల నుదుటియందు కేశములనెడి మేఘమునకు మెఱుపుతీగయగునట్టుగా బంగారు రేకును కట్టెను. ఒక్క ముదిత వక్రములగు ముంగురులనెడి

నల్లని కాటుకలకు దీపశిఖయగునట్టుగా మణిశిలయను ద్రవ్యముతోనైన బొట్టును ఫాలమునందు చేర్చెను. ఒక వనిత మన్మథలీలావశంబున కడకన్నులకు ప్రసరించుచున్న నల్లగ్రుడ్లనెడి యింద్రనీలమణులకు కిరణాంకురములను సందేహము కలిగించుటకు సమర్థములగు నల్లని కాటుకగీతలు వాడియైనవియును, మనోహరమైనవియును కనుకొలకులు వెడల తీర్చిదిద్దెను. ఒక్క బోటి కర్ణభూషణములందున్న రత్నములయొక్క కాంతిసమూహమైన మన్మథుని మోదుగుపూవనెడి చాపమునకు బాణములవలెనున్న నల్లకలువలనెడి యలంకారంబులు చెవులకు పొందుపఱిచెను. ఒక యింతి నువ్వుపువ్వువంటి నాసికయందు మన్మథుని గుళికా బాణమును పోలు ముత్యమనెడి అలంకారమును చేర్చెను. ఒక వనిత అధరోష్ఠమునందు లత్తుకను చేర్చెను. ఒక వనిత మృదువైన కంఠమునందు కంటెను వేసెను. ఒక వనిత వక్షస్థలమున పద్మరాగ పదకమునుంచెను. ఒక లేమ బంగారపు మొలత్రాటిని జఘనసీమను కట్టెను. ఒక భామ బంగారపు అందెలు పాదపద్మముల కమర్చెను. ఒక కాంత క్రొత్త లత్తుకను పాదములకు పూసెను. మఱియు పూర్తిగా ప్రతి యవయవమునందు అంగనలు ముత్యాల కొప్పువల, సిందూరపు పాపటబొట్టు, కమ్మలు, మకరికా పత్రములు, హారములు, బాహుపురులు, కడియములు, మద్దియలు, మట్టెలు, అందెలు మొదలగు అలంకారములచే అలంకరించిరి. ఈ అలంకారములచే దమయంతి ఐశ్వర్యము చేత నీతియు, ధర్మము చేత సంపదయు, వితరణలచే కీర్తియువలె ప్రకాశించెను. ఆ సమయంబున

**45 ఉ. అంతరమెట్టిదోయని నిజాస్యముతోఁ బ్రతివెట్టి రోహిణీ**
**కాంతుఁ బరీక్ష సేయుటకుఁగా నటు పట్టిన భంగి లీల న**
**య్యింతి ధరించె భూషణములెల్ల వహించిన యంతమీఁద శు**
**ద్ధాంతవధూటి యొక్కతె ప్రియంబున నిచ్చిన మించుటద్దమున్**

ఆ యింతి, భూషణములు ఎల్లన్, వహించినయంతమీదన్ = ధరించిన తరువాత, శుద్ధాంత వధూటి = అంత:పుర దాసి, ఒక్కతె, ప్రియంబున, మించుటద్దమున్ = ప్రకాశించు అద్దమును, ఇచ్చినన్, లీలన్ = విలాసముతో, నిజాస్యముతో = తన ముఖమును, రోహిణీకాంతున్ = చంద్రుని, ప్రతివెట్టి = పోటీగాపెట్టి, అంతరము ఎట్టిదో అని = తేడా ఎటువంటిదోనని, పరీక్ష చేయుటకుగాన్, అటు పట్టిన భంగిన్ = అలా పట్టుకొన్న రీతిగా, ధరించె = పట్టుకొనెను. (అలంకారము – ఉత్ప్రేక్ష)

తా. ఆ దమయంతి అలంకారముల నన్నిటిని ధరించిన తరువాత అంత:పుర దాసి ఒకతె ప్రీతితో అద్దమును ఈయగా విలాసముతో తన ముఖమునకును, చంద్రునకును పోటీపెట్టి తేడా ఎటువంటిదోనని పరీక్ష చేయుటకుగా అలా పట్టుకొన్నదేమో అనునట్లుగా అద్దమును పట్టుకొనెను.

**46 తే. నవ చతుర్విధ శృంగార మవధరించి**
**యమ్మహాదేవి విప్ర పుణ్యాంగనలకు**
**సకల పూజలు వేడ్కతో సరగఁ జేసి**
**మోడ్పుఁ గేలెత్తి ఫాలంబు మోపి మ్రొక్కె**

ఆ మహాదేవి = ఆ దమయంతి, నవ = క్రొత్తగా, చతుర్విధ = నాలుగు విధములైన, శృంగారము = అలంకారములను, అవధరించి = చేసుకొని, విప్రపుణ్యాంగనలకు = బ్రాహ్మణ స్త్రీలకు, సరగన్ = ఒప్పునట్లుగా, వేడ్కతోన్ = సంతోషముతో, సకల = సమస్తమైన, పూజలు చేసి, మోడ్పు కేలు ఎత్తి = రెండుచేతులను ఎత్తి, ఫాలంబునన్ = నుదుటిని, మోపి = ఉంచుకొని, మ్రొక్కె = నమస్కరించెను.

తా. ఆ దమయంతి నాలుగు విధములైన అలంకారములను చేసుకొని బ్రాహ్మణ స్త్రీలకు తగినరీతిగా సంతోషముతో పూజలుచేసి రెండుచేతులను ఎత్తి నుదుటిని మోపుకొని సమస్కరించెను.

**47 ఉ. అంతరమొప్ప శోభన సమాగత బాంధవ భూమిపాల శు**
**ద్ధాంత నితంబినీ నివహ మప్డు ప్రణామ మొనర్చె భీమ భూ**
**కాంతుని కూర్మి కన్యకకుఁ గౌతుక భూషణ భూషితాంగి క**
**త్యంత ఝుణత్క్రియా రవణ హాటక నూపుర పారిహార్యమై**

అప్డు, శోభన సమాగత = వివాహమునకు వచ్చిన, బాంధవ = బంధువులు, భూమిపాల = రాజులు, శుద్ధాంత నితంబినీ = అత:పుర స్త్రీలయొక్క, నివహము = సమూహమునకు, అంతరము = సమయము, ఒప్పన్ = తగినట్లుగా, అత్యంత = మిక్కిలి, ఝుణత్క్రియా = ధ్వనించుచున్న, రవణ = మెరయుచున్న, హాటక నూపుర = బంగారు అందెలను, పారిహార్యమై = ముంజేతి కంకణములుకలదై, ప్రణామము ఒనర్చెను = నమస్కరించెను.

తా. అప్పుడు వివాహమునకు వచ్చిన బంధువులకు, రాజులకు, అంత:పురస్త్రీలకు తగినరీతిగా మిక్కిలి ధ్వనించుచున్న, మెరయుచున్న బంగారు అందెలును, ముంజేతి కంకణములును కలదై దమయంతి నమస్కరించెను.

**48 వ. అటఁ గుమారుండును మంగళాభిషేకానంతరంబ యాకల్ప కల్పనా శిల్ప పారగలగు ప్రౌఢాంగనా జనంబులవలన వివాహోచితంబగు శృంగారం బంగీకరించె నప్పుడు**

తా. అక్కడ పెండ్లికుమారుడును మంగళస్నానమైన తరువాత అలంకార విద్య సంపూర్ణముగ నెరిగినవారైన వృద్ధ స్త్రీజనములవలన వివాహమునకు తగిన అలంకారమును అంగీకరించెను. అప్పుడు

**49 తే. అభినవోచిత తాలవృంతానిలమున**
**నల్లనల్లనఁ దడియార్చి యతివ యోర్తు**
**ధారుణీ నాయకుని కేశభారమునకు**
**నగరు ధూపాధివాసనం బాచరించె**

అభినవ = క్రొత్త, ఉచిత = తగిన, తాలవృంత = విసనకఱ్ఱయొక్క అనిలమున = వాయువున, అల్లనల్లన్ = మెల్లమెల్లగా, తడి ఆర్చి = తడిని పోగొట్టి, ధారుణీ నాయకుని = నలునియొక్క, కేశభారమునకు = జుట్టునకు, అగరు ధూప అధివాసనంబు = అగరు ధూప వాసనను పట్టించుటను, ఆచరించె = చేసెను.

తా. క్రొత్తదైన తగిన విసనకఱ్ఱ వాయువున మెల్లమెల్లగా తడి యారబెట్టి నలుని కేశపాశమునకు అగరు ధూప వాసనను పట్టించెను.

**50 ఉ. వెన్నెల కుప్పసంబిడిన వింతవిలాసము వాసి కెక్కఁగాఁ**
**గిన్నరకంఠి యోర్తు మరుకీర్తియుఁబోని పటీర పంకము**
**న్విన్నను వొప్పఁగా నలఁదె నిద్దపుఁ జాయ మెఱుంగునం బదా**
**ర్వన్నె పసిండితోడ నొరవచ్చు నృపాలుని యంగకంబులన్**

కిన్నరకంఠి ఓర్తు = కిన్నెర ధ్వని గొంతుకల ఒక స్త్రీ, వెన్నెల కుప్పసంబు = వెన్నెల వస్త్రమును, ఇడిన = తొడిగినట్టి, వింత విలాసము = వింత సొగసు, వాసికి ఎక్కగాన్ = ప్రసిద్ధి చెందునట్లుగా, మరు కీర్తియున్ = మన్మథుని కీర్తిని, పోని = పోలుచున్న, పటీర పంకము = మంచిగంథపు బురదను, నిద్దపు చాయ మెఱుంగునన్ = నున్నని దేహకాంతిచే, పదార్వన్నె పసిండితోడన్ = పదాఱువన్నె బంగారముతో, ఒరవచ్చు = సాటియగు, నృపాలుని = నలుని, అంగకంబులన్ = అవయవములయందు, విన్ననువు ఒప్పగాన్ = నేర్పు కనబడునట్లుగా, అలందెన్ = పూసెను.

తా. ఒక కాంత వెన్నెల వస్త్రమును తొడిగినట్టి వింతసొగసుతో ప్రసిద్ధి చెందునట్లుగా మన్మథుని కీర్తిని పోలిన మంచిగంధమును నున్నని దేహకాంతిచే పదాఱువన్నె బంగారముతో సాటియైన నలుని దేహమునందు నేర్పు కనబడునట్లుగా పూసెను. (అలంకారము – ఉత్ప్రేక్ష, ఉపమ)

**51 చ. లలిత కలాప కోమల కలాప కలాప కలాపలాప పే**
**శల మృదు కేశమంజరులు సన్నపు గోళ్ళను చిక్కువాపి చెం**
**గలువలు జాజులుం గలయఁ గమ్మని పువ్వులసేసకొప్పు దా**
**పలి కొరుగంగఁ బెట్టె నొక భామిని నైషధ భూమిభర్తకున్**

ఒక భామిని = ఒక స్త్రీ, లలిత = సుందరములైన, కలాప = అలంకారములైన, కోమల = లేతవైన, కలాపకలాప = పించెల సమూహముయొక్క, కలా = పెంపును, అపలాప = నిరాకరించునట్టి, పేశల = మనోహరమైన, మృదు = మెత్తని, కేశ మంజరులు = కేశగుబురులను, సన్నపు గోళ్ళను = కొనగోళ్లతో, చిక్కువాపి = చిక్కుతీసి, చెంగలువలు = ఎఱ్ఱ తామరలు, జాజులున్, కలయన్ = కలియుగా, కమ్మని పువ్వులన్ = పరిమళ పుష్పములను, నైషధభూమిభర్తకున్, సేసకొప్పున్ = సిగను, దాపలికి = ఎడమ ప్రక్కకు, ఒరుగంగన్ = ఒరుగునట్లుగా, పెట్టెన్

తా. ఒక కాంత సుందరములైన అలంకారములైన, లేతవైన పించెలసమూహముయొక్క ఆధిక్యమును నిరాకరించునట్టి మనోహరమైన మెత్తని కేశములను కొనగోళ్ళతో చిక్కుతీసి ఎఱ్ఱతామరలు, జాజులు కలిపి పరిమళ పుష్పములను నలమహారాజు సిగను ఎడమప్రక్కకు ఒరుగునట్లుగా పెట్టెను.

**52 ఉ. రాజనిభాస్య యోర్తు నవరత్న కిరీటము సంఘటించె ని**
**ర్వ్యాజ మనోజ్ఞమైన మహివల్లభు మూర్ధమునందు నప్పు డా**
**రాజను కల్పశాఖి కది రత్నమయంబగు పువ్వుగుత్తి పే**
**రోజ వహించి కన్నులకు నుత్సవముం బొనరించె నెంతయున్**

రాజనిభాస్య ఓర్తు = చంద్రునింటిముఖముకల ఒక స్త్రీ, నిర్వ్యాజ మనోజ్ఞమైన = సహజ సౌందర్యముకల, మహివల్లభు మూర్ధమునందు = నలుని శిరసునందు, నవరత్న కిరీటము, సంఘటించెన్ = ఉంచెను, అప్పుడు, ఆ రాజను కల్పశాఖికి = ఆ నలుడనెడి కల్పవృక్షమునకు, అది = ఆ కిరీటము, రత్నమయంబగు, పువ్వుగుత్తి పేరోజన్ = పుష్పగుచ్ఛమనెడి గొప్ప ఖ్యాతిని, వహించి, కన్నులకు, ఎంతయున్, నుత్సవమున్ = ఆనందమును, ఒనరించెన్ = చేసెను.

తా. ఒక కాంత సహజ సౌందర్యముకల నలుని శిరసునందు నవరత్న కిరీటము నుంచెను. అప్పుడు ఆ నలుడనెడి కల్పవృక్షమునకు అది రత్నమయమైన పుష్పగుచ్ఛమనెడి గొప్ప ఖ్యాతిని పొంది కన్నులకు గొప్ప ఆనందమును కలిగించెను.

(అలంకారము – రూపకోత్థాపిత ఉత్ప్రేక్ష)

53 మ. **పదియార్వన్నె పసిండి పట్ట మవనీ పాలావతంసంబు నె**
**న్నుదుటం గట్టె లతాంగి యోర్తు కడవీనుల్సోఁక నేర్పొప్పఁగా**
**నది లీలాపరివేష చక్రవలయార్థాకారతం బొందె న**
**ప్పదసీయానన చంద్రమండలము చంద్రాధిక్యముం బొందుటన్**

లతాంగి ఓర్తు = ఒక కాంత, పదియార్వన్నె పసిండి పట్టము = పదునాఱు వన్నె బంగారు పట్టమును, అవనీపాల అవతంసంబు = నలరాజుయొక్క, నెన్నుదుటన్ = నుదుటియందు, కడవీనుల్ సోకన్ = చెవులవెనుకవరకు తగులునట్లుగా, నేర్పు ఒప్పగాన్, కట్టెన్, అప్డు, అదసీయానన చంద్రమండలము = ఆ నలరాజుయొక్క ముఖచంద్రమండలము, చంద్రాధిక్యమున్ = చంద్రునికంటె గొప్పదగుటను, పొందుటన్ = పొందుటచే, అది = ఆ కట్టిన పట్టము, లీలా = విలాసార్థమగు, పరివేషచక్ర వలయ = సూర్యచంద్రుల తేజోవలయముయొక్క, అర్థాకారతన్ = సగముభాగమును, పొందెన్

తా. ఒక కాంత పదునాఱువన్నె బంగారుపట్టమును నలరాజుయొక్క నుదుటను చెవులవెనుకవరకు తగులునట్లుగా నేర్పు కనబడునట్లుగా కట్టెను. అప్పుడు ఆ నలరాజుయొక్క ముఖచంద్రమండలము చంద్రునికంటె గొప్పదగుటను పొందుటచే ఆ కట్టిన పట్టము విలాసార్థమగు సూర్యచంద్రుల తేజోవలయముయొక్క సగము భాగమును పొందెను.(అలం –ఉత్ప్రేక్ష)

54 శా. **భామా యోజిత కుండలాభరణము ల్భామావలంబంబులై**
**భూమీవల్లభసూను వ్రేలు చెవులం బొల్పారె గండస్థలీ**
**సీమాంత ప్రతిబింబ మండల యుగ శ్రీ సంవిభాగంబుతో**
**గామస్యందన హేమచక్రయుగ యుగ్మంబుం విడంబించుచున్**

భామా = ఒక కాంతచే, యోజిత = కూర్చబడిన, భూమీవల్లభసూను = రాజకుమారునియొక్క, వ్రేలు చెవులన్ = వ్రేలాడు చెవులందు, కుండలాభరణముల్, భామ అవలంబులై = కాంతిసంపదకాస్పదములై, గండస్థలీ = చెక్కిళ్ళయొక్క, సీమాంత = ప్రాంతములందు, ప్రతిబింబమండలయుగ = మండలాకారముగానున్న ప్రతిబింబముల జతయొక్క, శ్రీ = శోభయొక్క సంవిభాగంబుతోన్ = ఏర్పాటుతో, కామస్యందన = మన్మథుని రథముయొక్క, హేమ = స్వర్ణమయమైన, చక్రయుగ యుగ్మంబున్ = నాలుగు చక్రములను, విడంబించుచున్ = అనుకరించుచు, పొల్పారెన్ = ప్రకాశించెను.

తా. ఒక కాంతచే కూర్చబడిన రాజకుమారుని చెవుల కుండలాభరణములు కాంతికాస్పదములై చెక్కిళ్ళ ప్రాంతములందు మండలాకారముగానున్న ప్రతిబింబపు జతయొక్క శోభయొక్క ఏర్పాటుతో మన్మథుని రథముయొక్క స్వర్ణమయమైన నాలుగు చక్రములను అనుకరించుచు ప్రకాశించెను.(అలంకారము – ఉత్ప్రేక్ష)

55 ఉ. **ఇందునిభాస్య యోర్తు గదియించెఁ గుమారుని పేరురంబునం**
**గందక యాణిపాణియును గల్గిన తోరపుఁ దారహారమున్**
**జిందిలిపాటు లేక యదసీయ ముఖేందు వినిర్గళత్సుధా**
**తుందిల బిందుబృందములతోయముఁ గైకొని యుండెనోయనన్**

ఇందునిభాస్య ఓర్తు = ఒక కాంత, చిందిలపాటు లేక = తొందర పడక, కందక = అలసట పడక, అదసీయ = అతనిదైన, ముఖేందు వినిర్గళత్ = ముఖచంద్రునినుండి జారుచున్న, సుధా = అమృతమయమైన, తుందిల = పెద్దవైన, బిందు బృందముల = బిందు సమూహముల, తోయమున్ = జలమును, కైకొని = తీసుకొని, ఉండెనోయనన్ = ఉండెనేమో అనునట్లుగా, ఆణి పాణియును కల్గిన = గుండ్రనయు, నీరును కల్గిన, తోరపు తారహారమున్ = పెద్ద ముత్యాలహారమును, కుమారుని = రాజకుమారునియొక్క, పేరురంబునన్ = విశాలమైన వక్షస్థలమందు, కదియించెన్ = చేర్చెను.

తా. ఒక కాంత తొందరపడక, అలసటలేక, ఆ నలుని ముఖచంద్రునినుండి జారుచున్న అమృతమయమైన, పెద్దవైన బిందు సమూహముల చెమటనీటిని తీసుకొని ఉండెనేమోయనునట్లుగా గుండ్రనయు, నీరునుకల్గిన పెద్ద ముత్యాల హారమును రాజకుమారునియొక్క విశాల వక్షస్థలమునందు చేర్చెను.(అలంకారము – ఉత్ప్రేక్ష)

56 తే. **తరుణ సైరంధ్రికా ప్రయత్నమునఁ జేసి**
**యతని వ్రేళ్ళు సముద్రంబులయ్యె నపుడు**
**ఘన సమూహంబు కమలాభికాంక్షఁ జేసి**
**తద్వితీర్ణికిఁ జను టన్వితంబుగాఁగ**

ఘన సమూహంబు = యాచక సమూహము (మేఘ సమూహము), కమలాభికాంక్షన్ చేసి = ధనాభిలాషచే (నీటియందలి కోర్కెచే), తత్ వితీర్ణికిన్ = ఆ నలుని దానగుణమునకు (ఆ సముద్రుని దానగుణమునకు), చనుట = పోవుట, అన్వితంబుగాగన్ = సమన్వయమగునట్లుగా, అతని వ్రేళ్ళు = ఆ నలుని చేతివ్రేళ్ళు, తరుణ = మధ్యవయసులోనున్న, సైరంధ్రికా = అలంకరణచేయు స్త్రీయొక్క, ప్రయత్నమునన్ చేసి, అపుడు = ఆ అలంకరించు సమయమున, స ముద్రంబులు = ముద్రతో కూడినవి, అయ్యెన్

= అయినవి.

తా. యాచక సమూహము ధనాభిలాషచే ఆ నలునిచెంతకు పోవుట మేఘము నీటికొరకు సముద్రుని చేరుటతో సమన్వయమగునట్లుగా ఆ నలుని చేతివ్రేళ్ళు తరుణ సైరంధ్రిచే రాజముద్ర, ఉంగరములతో అలంకరింపబడినవి.

**57 క. అలవఱిచె నృపతి కరముల**
**నలికుంతల యొకతె కంకణాభరణంబుల్**
**నల హస్త కల్పకములకు**
**వలయము లవి యాలవాల వలయము లయ్యెన్**

అలి కుంతల ఒకతె = తుమ్మెదలవంటి కేశపాశముకల ఒక కాంత, నృపతి కరములన్ = నలుని చేతులకు, కంకణ ఆభరణంబుల్ = కంకణములనెడి ఆభరణములను, అలవఱిచెన్ = పొందించెను. అవి = ఆ ఆభరణములు, నల హస్త కల్పకములకు = నలుని చేతులనెడి కల్పవృక్షములకు, వలయములు = కడియములనెడి, ఆలవాల వలయములు = వట్రువ పాదులు, అయ్యెన్.(అలంకారము – రూపకోత్థాపిత గమ్యోత్ప్రేక్ష)

తా. ఒక కాంత నలుని చేతులకు కంకణములనెడి ఆభరణములను పొందించెను. ఆ ఆభరణములు నలుని చేతులనెడి కల్పవృక్షములకు కడియములనెడి వట్రువ పాదులయినవి.

**58 మ. భుజదండంబున నొక్క భామ దొడిగెన్ భూభర్తకు న్భూరి ది**
**గ్విజయారంభ విజృంభణార్జిత మహాకీర్తి ప్రతాప ప్రభా**
**వ్రజ శంకావహ నూత్న వజ్రమణి రుగ్వ్యాపార దుర్వారమున్**
**త్రిజగల్లోచన పర్వ దానకలనా ధీరంబుఁ గేయూరమున్**

ఒక్క భామ = ఒక కాంత, భూభర్తకున్ = నలునకు, భుజదండంబునన్ = భుజాదండమునందు, భూరి = విస్తారమైన, దిగ్విజయ = దిక్కులను జయించుటయొక్క ఆరంభ విజృంభణ = ప్రారంభ అతిశయమునందు, ఆర్జిత = సంపాదింపబడిన, మహా కీర్తి ప్రతాప = గొప్ప కీర్తియొక్కయు, శౌర్యముయొక్కయు, ప్రభావ్రజ = కాంతి సమూహమనెడి, శంకావహ = భ్రాంతిని కలిగించుచున్న, నూత్న = క్రొత్తవియగు, వజ్రమణి రుక్ = వజ్రముల, మణుల కాంతులయొక్క, వ్యాపార = ప్రవర్తనచే, దుర్వారము = నిరతిశయమైనది, త్రిజగత్ = మూడులోకముల జనులయొక్క, లోచన = నేత్రములకు, పర్వ దానకలనా = ఉత్సవము నిచ్చుటయందు, ధీరంబున్ = తగినదియునగు, కేయూరమున్ = బాహుపురిని, తొడిగెన్.

తా. ఒక కాంత నలుని భుజాదండమునకు దిక్కులను జయించు ప్రారంభాతిశయమునందు సంపాదింపబడిన గొప్ప కీర్తియొక్కయు, శౌర్యముయొక్కయు కాంతి సమూహమనెడి భ్రాంతిని కలిగించుచున్న క్రొత్తవియగు వజ్రముల, మణుల కాంతులయొక్క వ్యాపారముచే నిరతిశయమైనదియు, మూడులోకములందలి జనుల నేత్రములకు ఉత్సవము నిచ్చుటయందు తగినదియునగు బాహుపురిని తొడిగెను. (అలంకారము – యథాసంఖ్యము, భ్రాంతిమంతము)

**59 వ. ఇట్లు శృంగారం బంగీకరించి**

**60 ఉ. ఔచితి గావున న్నిలువుటద్దమునందు నిజాస్య బింబమున్**
**జూచెనె కాని మున్న యతి శోభన రూప విలాస పుష్ప నా**
**రాచుఁడు రాజలంకృతి విరామమునందు నిజాభిరమ్యతన్**
**జూచినవాఁడు భూషణ విశుద్ధ మహామణి మండలంబునన్**

అతిశోభన = మిక్కిలి ప్రకాశించునట్టి, రూప = రూపమునందును, విలాస = కాంతియందును, పుష్పనారాచుడు = మన్మథుడైన, రాజు, ఔచితి కావునన్ = తగినది కావున, నిలువుటద్దమునందు, నిజ ఆస్య బింబమున్ = తన ముఖమును, చూచెనె కాని, మున్న = ఇంతకుపూర్వమే, అలంకృతి విరామమునందున్, నిజ అభిరమ్యతన్ = తన సౌందర్యమును, భూషణ = నగలయొక్క విశుద్ధ = స్వచ్ఛమైన, మహామణి మండలంబునన్ = గొప్ప మణుల సమూహమందు, చూచినవాడు = చూచియేయున్నాడు. (అలంకారము – సమాధి)

తా. రూపముచేతను, కాంతిచేతను మిక్కిలి ప్రకాశించునట్టి మన్మథుడైన రాజు ఔచిత్యమని నిలువుటద్దమునందు తన ముఖమును చూచుకొనెనే కాని ఇంతకుపూర్వమే అలంకరణ విరామసమయమునందు తన సౌందర్యమును స్వచ్ఛమైన ఆభరణముల గొప్ప మణుల సమూహమందు చూచుకొనియేయున్నాడు.

**61 తే. రాజు దొడిగిన దివ్యాభరణ చయంబు**
**నెల్లవారును రతిఁ జూచు టేమి చెప్ప**
**నొరిమ నొండొంటిఁ జూచు నాభరణములును**
**విమల హరి నీలమణి విభా వీక్షణముల**

రాజు = నలుడు, తొడిగిన, దివ్య ఆభరణ చయంబున్ = మనోహరములగు ఆభరణ సమూహములను, ఎల్లవారును =

అందరును, రతిన్ = ప్రీతితో, చూచుట = చూస్తూండడం, ఏమిచెప్పన్ = ఏం చెప్పాలి?, ఆభరణములును = నలుడు ధరించిన అలంకారములుకూడా, ఒరిమన్ = ఆనుకూల్యముతో, ఒండొంటిన్ = ఒకదానినొకటి, విమల = స్వచ్ఛములైన, హరి నీలమణి విభా = ఇంద్రనీలమణుల కాంతులనెడి, వీక్షణములన్ = చూపులచే, చూచున్ = చూచుకొనుచున్నవి.

తా. నలుడు తొడిగిన దివ్యాభరణ సమూహములను ఎల్లవారును ప్రీతితో చూచుటను ఏమి చెప్పవలయును? నలుడు ధరించిన అలంకారములు కూడా ఆనుకూల్యముతో ఒకదానినొకటి స్వచ్ఛములైన ఇంద్రనీలమణులకాంతులనెడి చూపులచే చూచుకొనుచున్నవి. (అలంకారము – అర్థాపత్తి)

**62 వ. అనంతరంబ వార్ష్ణేయ నియంతృకంబైన రథంబెక్కి యమ్మహారథుండు జిష్ణుండును, గిరీటియు. విజయుండును నగుటంజేసి ధనంజయుండనం బొలిచి రాజమార్గంబునఁ జనునప్పుడు పౌరాంగనలయందు.**

తా. తరువాత వార్ష్ణేయుడను సారధి నడుపుచున్న రథమునెక్కి ఆ మహారథుడైన నలమహారాజు జయస్వభావము కలవాడును, కిరీటముకలవాడును, విజయములుకలవాడు నగుటచే అర్జునుని పోలి రాజమార్గమున వెళ్ళునప్పుడు పట్టణమందలి స్త్రీలయందు

**63 తే. తమ్ములము సేయుచో నొక్క తలిరుఁబోణి**
**రాకుమారునిఁ జూచు పరాకుకతన**
**మడిచి తాంబూల పత్రంబు మాఱుగాఁగఁ**
**గఱచెఁ గెంగేలి నడి కేలి కమలదలము**

ఒక తలిరుబోణి = ఒక కాంత, తమ్ములము చేయుచోన్ = తాంబూలము వేసుకుంటూ, రాకుమారునిన్ = నలుని, చూచు పరాకు కతన = చూచే పారవశ్యము కారణముగ, తాంబూల పత్రంబు మాఱుగాగన్ = తమలపాకునకు బదులుగా, కెంగేలి = కెంపువంటి, నడి కేలి = అరచేతిలోనున్న, కమలదలము = పద్మపత్రమును, మడిచి, కఱచెన్

తా. ఒక కాంత తాంబూలము వేసుకుంటూ నలుని చూచు పారవశ్యమున తమలపాకుకు బదులుగా కెంపువంటి అరచేతిలోనున్న తామర రేకును మడిచి తినసాగెను.

**64 మ. జవరాలోర్తు ప్రియోపనాయక భుజాసంశ్లేష లీలాసుఖ**
**వ్యవసాయంబు సమాజ సంకటమునన్ బ్రార్థించి కైకొంచు భూ**
**ధవ దేవేంద్రునిఁ జూచె హేమకలశ ద్వైరాజ్య సంపత్తి వై**
**భవ శుంభత్కుచ కుంభపీఠి బులక ప్రారంభ మేపారగన్**

జవరాలు ఓర్తు = ఒక యువతి, సమాజ సంకటమునన్ = జనసమ్మర్దమునందు, ప్రియ = ఇష్టుడైన, ఉపనాయక = జారునియొక్క, భుజా = బాహువును, సంశ్లేష = కౌగలించుకొను, లీలా = విలాసముచే, సుఖ వ్యవసాయంబున్ = సుఖ వ్యాపారమును, ప్రార్థించి = యాచించి, కైకొంచు = స్వీకరించుచు, హేమకలశ = బంగారు కుండలయొక్క, ద్వైరాజ్య = ఎదిరి రాజు, సంపత్తి = సంపద, వైభవ = సమృద్ధిచే, శుంభత్ = ప్రకాశించుచున్న, కుచకుంభపీఠిన్ = స్తనప్రదేశమందు, పులక ప్రారంభము = గగురుపాటు, ఏపారగన్ = వృద్ధిపొందునట్లుగా, భూధవదేవేంద్రునిన్ = రాజేంద్రుడైన నలుని, చూచెన్ = చూచెను.

తా. ఒక యువతి జన సమ్మర్దమునందు తన ప్రియుని కౌగలించుకొను విలాసముచే సుఖమును కోరి పొందుచు ఎదిరి రాజు సంపదసమృద్ధిచే ప్రకాశించు బంగారు కలశములవంటి స్తనకలశములు గగురుపాటుతో వృద్ధిపొందునట్లుగా ఆ రాజేంద్రుడైన నలుని కనుగొనెను.

**65 తే. ఒక్క తరళాక్షి యప్సరో యువతివోలెఁ**
**జూచెఁ గనురెప్ప వెట్టక రాచవారి**
**రాజసంబున వలరాచ రాచవారు**
**తేఁటి ఱెక్కల గఱియమ్ముఁ దీదుకొనఁగ**

ఒక్క తరళాక్షి = ఒక స్త్రీ, రాచవారిన్ = నలుని, కనురెప్ప వెట్టక = కన్ను రెప్పవేయకుండా, వలరాచ రాచవారు = మన్మథు డనెడి రాజు, రాజసంబునన్ = గర్వముతో, తేటిఱెక్కలగఱియమ్మున్ = తుమ్మెదరెక్కలే రెక్కలుగాకల బాణమును, తీదుకొనగన్ = పదునుపెట్టునట్లుగా, అప్సరోయువతివోలెన్ = అప్సరస స్త్రీవలె, చూచెన్.(అలంకారము – ఉపమ, ఉత్ప్రేక్ష)

తా. ఒక యువతి అచ్చర స్త్రీవలె నలుని కనురెప్ప వేయకుండా మన్మథుడనెడి రాజు గర్వముతో తుమ్మెదరెక్కలబాణమును పదును పెట్టునట్లుగా తదేకముగా చూచెను.

**66 తే. ఎల్ల చిగురాకుఁబోండ్లకు నెంత వేడ్క**
**యంత వేడుక దనలోన నతిశయిల్ల**
**నొక్క గుబ్బల కొమరాలు చక్క వచ్చి**

**కనియె నొడలెల్లఁ గన్నులై మనుజవిభుని**

ఒక్క గుబ్బలకొమరాలు = గొప్ప స్తనములుకల ఒక కాంత, ఎల్ల చిగురాకుబోండ్లకున్ = అందరు స్త్రీలకును, ఎంత వేడ్క = ఎంత కౌతూహలమో, అంత వేడుక = అంత కౌతూహలము, తనలోనన్ అతిశయిల్ల = తనలో అతిశయింపగా, చక్కన్ వచ్చి = చక్కగా వచ్చి, ఒడలు ఎల్లన్ = దేహమంతయు, కన్నులై, మనుజవిభుని = రాజుని, కనియెన్ = చూచెను.

తా. ఒక కాంత అందరు స్త్రీలకును ఎంత కుతూహలమో అంతటి కుతూహలము తనలో అతిశయింపగా చక్కగా వచ్చి దేహమంతయు కన్నులుగా ఆ రాజుని కనుగొనెను.(అలంకారము – అతిశయోక్తి)

**67 మ. జిలుఁగుం బయ్యెద జీరువారియెడలన్ శృంగార పత్రాంకురం**
**బులతో నొక్క చకోరలోచన కుచంబు ల్పూర్ణ కల్యాణ మం**
**గళ కుంభంబులు నూత్న పల్లవ విభంగ శ్రీ సమేతంబులై**
**న లలిం జెన్నెసలారె నైషధ మహీనాథావలోకంబునన్**

నైషధ మహీనాథ, అవలోకనంబునన్ = చూచుటయందు, జిలుగుం పయ్యెద = సన్నని పైటకొంగు, జీరువారి ఎడలన్ = జారిపోవు సమయమున, ఒక్క చకోరలోచన కుచంబులు = చకోరపక్షి నేత్రములవంటి నేత్రములుకల ఒక స్త్రీయొక్క స్తనములు, పూర్ణ కల్యాణ మంగళ కుంభంబులు = శుభకార్యములందు నీటితోనిండినమంగళ కలశములు, నూత్న = క్రొత్తవగు, పల్లవ = చిగుళ్ళయొక్క, విభంగ = భాగములయొక్క, శ్రీసమేతంబులైన = సంపదతోకూడినవైన, లలిన్ = విధమున, చెన్ను ఎసలారెన్ = ప్రకాశించెను. (అలంకారము – ఉత్ప్రేక్ష)

తా. నలుని చూచుటయందు సన్నని పైటకొంగు జారిపోగా ఒక స్త్రీయొక్క స్తనములు శుభకార్యములందు నీటితోనిండిన మంగలకలశములు క్రొత్తవైన చిగుళ్ళ సంపదతో కూడినవైన విధమున ప్రకాశించెను.

**68 సీ. కలికిచూపులు రత్నకలికా కలాపంబు**
**గుబ్బచన్నులు హేమకుంభవితతి**
**మెఱుఁగుఁ జెక్కులు క్రొత్త మించుటద్దంబులు**
**పాణియుగ్మంబులు పల్లవములు**
**వెలఁది మందస్మితంబులు కమ్మఁబువ్వులు**
**పలుకులు వల్లకీ కలకలములు**
**పరిపాటలోష్ఠబింబములు తేనియతొొలల్**
**తనుకాంతి యొలగందంపుఁ బసుపు**

**తే. గాఁగ సౌభాగ్య వివిధ మంగళపదార్థ**
**వర్గములు గ్రంత నడచు భావంబు దోఁచెఁ**
**బౌరకాంతలు రాజకుమార దర్శ**
**నోత్సవంబున కేతెంచుచున్నయపుడు**

పౌరకాంతలు = పురస్త్రీలు, రాజకుమారదర్శనోత్సవంబునకు = నలుని చూచుటయను ఉత్సవమునకు, ఏతెంచుచున్న యపుడు = వచ్చుచున్నప్పుడు, కలికిచూపులు = మనోజ్ఞములగు చూపులు, రత్నకలికా కలాపంబు = రత్నపు మొగ్గల సమూహములును, గుబ్బచన్నులు, హేమకుంభవితతి = బంగారు కుండలసమూహమును, మెఱుగు చెక్కులు, క్రొత్త మించుటద్దంబులు = ప్రకాశించెడి క్రొత్త అద్దములును, పాణియుగ్మంబులు = చేతులు, పల్లవములు = చిగుళ్ళును, వెలది మందస్మితంబులు = కాంత చిరునవ్వులు, కమ్మ పువ్వులు = సుగంధపు పువ్వులును, పలుకులు, వల్లకీ కలకలములు = వీణాధ్వనులును, పరిపాటలోష్ఠబింబములు = ఎఱ్ఱని అధరోష్ఠములు, తేనెతొలల్ = తేనెలూరు తొనలును, తనుకాంతి, ఓలగందపు పసుపు = పూతతావి పసుపును, కాగన్, సౌభాగ్య = శుభప్రదములగు, వివిధ, మంగళ పదార్థ వర్గములు = మంగళవస్తుసంచయములు, క్రంత నడచు = పెండ్లికూతురునకిచ్చు కానుకల ఊరేగింపు, భావంబుతోచెన్ = ఊహ మెదిలెను, (అలంకారము – ఉత్ప్రేక్ష)

తా. పురస్త్రీలు నలుని చూచుటయను ఉత్సవమునకు వచ్చుచున్నప్పుడు వారి మనోజ్ఞములగు చూపులు రత్నపు మొగ్గల సమూహములని, గుబ్బచన్నులు బంగారు కుండల సమూహములని, మెరిసే చెక్కిళ్ళు ప్రకాశించెడి క్రొత్త అద్దములని, చేతులు చిగుళ్ళని, చిరునవ్వులు సుగంధపు పువ్వులని, మాటలు వీణా ధ్వనులని, అధరోష్ఠములు తేనెలూరు పనస తొనలని, దేహకాంతి పూత తావి పసుపని ఊహ మెదిలి శుభప్రదములగు వివిధ మంగళ వస్తు సంచయములు పెండ్లి సమయమున పెండ్లికూతునకిచ్చు కానుకల ఊరేగింపనిపించెను.

**69 స్రగ్ధర. ఈతండే పొడిజాణం డితఁడె మగల రాజీతఁడే ధీరుఁడంచున్**
**జేతోమోదంబునం జూచిరి పురయువతుల్ చిత్తసంజాతమూర్తిన్**
**జ్యోతిష్టోమాది యజ్ఞ శ్రుతఫల నిఖిల క్షోణి సామ్రాజ్యలక్ష్మీ**

**పాతివ్రత్యైకదీక్షా పణితు నిషధ భూపాలు దిక్పాలమిత్త్రున్**

పురయువతుల్ = పురస్త్రీలు, ఈతండే = ఈ నలుడే, పాడిజాణండు = స్వభావముచేతనే విలాసి, ఇతడె, మగలరాజు = శూరులకు దొర, ఈతడే, ధీరుడు, అంచున్, చేతోమోదమునన్ = మనసునందు సంతోషముతో, చిత్తసంజాతమూర్తిన్ = మన్మథునివంటి రూపముకలవానిని, జ్యోతిష్టోమ ఆది = జ్యోతిష్టోమము మొదలుగాగల, యజ్ఞ = యజ్ఞములయొక్క, శ్రు తఫల = వినబడు ఫలితములతో, నిఖిల = సమస్తమైన, క్షోణి = భూమండలముయొక్క, సామ్రాజ్య లక్ష్మీ= సార్వభౌమ లక్ష్మియొక్క, పాతివ్రత్య = పతివ్రతాధర్మమనెడి, ఏక = ముఖ్యమైన, దీక్షా = నియమముతో, పణితు = కొనియాడబడిన వాడును, దిక్పాలమిత్రున్ = దిక్పతులకు మిత్రుడైనవానిని, నిషధభూపాలున్ = నలమహారాజును, చూచిరి.

తా. పురస్త్రీలు ఈ నలుడే స్వభావముచేతనే విలాసి, శూరులకు దొర, ధీరుడు అనుచూ సంతోషముతో మన్మథుని వంటి రూపముకలిగి, జ్యోతిష్టోమాదియాగములఫలితములతో, సమస్త భూమండల సార్వభౌమ లక్ష్మి పతివ్రతాధర్మ దీక్షతో కొనియాడబడినవాడును, దిక్పతులకు మిత్రుడునునగు నిషధరాజు నలుని చూచిరి.

**70 వ. అప్పుడు పౌరాంగనలు తమలోన**

**71 మ. తనకుం దాన పురందరాది దివిజేంద్రవ్రాత మేతెంచి ని**
**ల్చిన సంప్రీతి వరాటకన్యక వరించెం గావునం బ్ఫాలలో**
**చన కోపానలదగ్ధ మన్మథ మహాసామ్రాజ్య కంఠీరవా**
**సన మెక్కందగు వీడకుంఠిత విలాస ప్రౌఢ భావంబునన్**

పురందరాది = ఇంద్రుడు మొదలైన, దివిజేంద్ర వ్రాతము = దేవతల సమూహము, తనకుం దాన = తమంతట తామే, ఏతెంచి = స్వయంవరమునకు వచ్చి, నిల్చినన్ = ఉండగా, వరాట కన్యక = దమయంతి, ఇతనిన్ = నలుని, సంప్రీతిన్ = ఇష్టముతో, వరించెన్, కావునన్, వీడు = ఈ నలుడు, అకుంఠిత = నిరతిశయమైన, విలాస ప్రౌఢ భావంబునన్ = విలాసమునందలి చాతుర్యముచే, ఫాలలోచన = శివునియొక్క, కోప అనల = కోపాగ్నిచే, దగ్ధ = దహింపబడిన, మన్మథ = మన్మథునియొక్క, మహాసామ్రాజ్య = గొప్ప సామ్రాజ్యముయొక్క, కంఠీరవాసనము = సింహాసనము, ఎక్కందగు = ఎక్కడానికి అర్హుడు.

తా. ఇంద్రుడు మొదలైన దేవతల సమూహము తమంతటతామే స్వయంవరమునకు వచ్చి యుండగా దమయంతి వారిని కాదని నలుని ఇష్టముతో వరించెను. కావున ఈ నలుడు నిరతిశయమైన విలాస చాతుర్యముచే శివుని కోపాగ్నిచే దహింపబడిన మన్మథ సామ్రాజ్య సింహాసనము నెక్కుటకు అర్హతకలవాడు.

**72 సీ. సుద్యుమ్నుఁడను రాజు సుదతియై యెవ్వాని**
**ప్రథమ సీమంత గర్భమునఁ గాంచె**
**గ్రహరాజు గారాపు రాణివాసంబైన**
**గంధర్వి యెవ్వారి కన్నతల్లి**
**యిన్నూఱు మున్నూఱు నేనూఱు గన్నులు**
**గలవేలు పెవ్వానిఁ గన్నతండ్రి**
**రజతాచలం బేలు రాజు పట్టపుదేవి**
**గోరి యెవ్వనిఁ గాంచె గొడ్డు నీఁగి**

**తే. యా పురూరవు దాదస్రు లాజయంతు**
**డా పులస్త్యుని మనుమ డీ యధిపుతోడ**
**సాటి యగుదురె నిఖిల విశ్వంబులోన**
**భావ సమ్మోహనాతి సౌభాగ్యరేఖ**

నిఖిల విశ్వంబులోనన్ = సమస్త ప్రపంచమునందును, భావ = చిత్తములను, సమ్మోహన = మోహింపచేయు, అతి సౌభాగ్యరేఖన్ = గొప్ప సౌందర్యరేఖచే, సుద్యుమ్నుడు అను రాజు, సుదతియై = స్త్రీగామారి, ఎవ్వానిన్ = ఏ పురూరవుని, ప్రథమ సీమంత గర్భమునన్ = మొదటి కాన్పున, కాంచెన్ = కనెనో, గ్రహరాజు = సూర్యునియొక్క, గారాపు రాణివాసమైన = ముద్దులభార్యయైన, గంధర్వి = గోడిగ, ఎవ్వారి = ఏ అశ్వనీదేవతల, కన్నతల్లి, ఇన్నూఱు = రెండు వందలు, మున్నూఱున్ = మూడువందలు, ఏనూఱు = అయిదు వందలు, + కన్నులు = వేయి కన్నులు, కల వేలుపు, ఎవ్వానిన్ = ఏ జయంతుని, కన్నతండ్రి, రజతాచలంబు ఏలు రాజు = కుబేరుని, పట్టపుదేవి = రాణి, కోరి, ఎవ్వనిన్ = ఏ నలకూబరుని, గొడ్డున్ ఈగి = గొడ్రాలితనముపోయి, కాంచె = కనెనో, ఆ పురూరవుడు, ఆ దస్రులు = ఆ దేవ వైద్యులు, ఆ జయంతుడు, ఆ పులస్త్యుని మనుమడు = నలకూబరుడు, ఈ అధిపుతోడ = ఈ రాజుతో, సాటి అగుదురె.

తా. సమస్త ప్రపంచములోని జనుల చిత్తములను మోహింపచేయు గొప్ప సౌందర్యరేఖచే పురూరవుని, అశ్వనీ దేవతలను, జయంతుని, నలకూబరుని నలుడు సాటికారనుచున్నాడు.

**73 మ. సమయోత్కంఠిత కంఠ లోఠి వరణస్రగ్భూషణుండైన యీ**
**దమయంతీవరుఁ జూచి యద్దివికి సుత్రాముండు వోకుంట పం**
**తము నిర్లజ్జతఁ బోయినం దను నిరర్థ ప్రార్థనుం దొంటి నె**
**య్యమునం జేరగ నేల యిచ్చు శచియాత్మాంతః పురోద్దేశమున్**

సుత్రాముండు = దేవేంద్రుడు, సమయ = స్వయంవరకాలమున, ఉత్కంఠిత = ఉవ్విళ్ళూరుచున్న, కంఠ = కంఠమున, లోఠి = దొరలుచున్న, వరణస్రక్ = స్వయంవరమాలికయే, భూషణుడైన = అలంకారముగాకలవాడైన, ఈ దమయంతీవరున్ = ఈ నలరాజును, చూచి, ఆ దివికిన్ = ఆ స్వర్గమునకు, పోకుంట = వెళ్ళకుండుట, పంతము = పౌరుషము, నిర్లజ్జతన్ = సిగ్గులేనివాడై, పోయినన్ = వెళ్ళినను, నిరర్థకప్రార్థనున్ = కోరికతీరని, తనున్ = తనను, శచి = తనభార్య, తొంటి నెయ్యమునన్ = పూర్వపు ప్రేమతో, ఆత్మ అంత:పుర ఉద్దేశమున్ = తన అంత:పురములోనికి, ఏల = ఎందులకు, చేరగన్ ఇచ్చున్ = ప్రవేశింపనిచ్చును.

తా. ఇంద్రుడు స్వయంవరకాలమున ఉవ్విళ్ళూరుచున్న కంఠమునందలి స్వయంవరమాలికయే అలంకారమైన ఈ నలుని చూచి ఇక స్వర్గమునకు పోకుండుట పౌరుషము. సిగ్గులేనివాడై వెళ్ళినా కోరికతీరని తనను చూచి శచీదేవి పూర్వపు ప్రేమతో అంత:పురములోనికి ఏల ప్రవేశింపనిచ్చును?

**74 మ. విబుధేంద్రావరణ ప్రసాదిత శచీ విశ్రాణితాశీర్వచ**
**స్తబక వ్రాతములున్ దిగీశ పురుషార్థ ప్రక్రమోపార్జిత**
**ప్రబలఖ్యాతియుఁ బూటకాఁపులుసుఁడీ భావించి చూడంగ ని**
**య్యబలారత్న నృపాలరత్నములనిత్యైశ్వర్య సంపత్తికిన్**

భావించి చూడంగన్ = అలోచించి చూడగా, ఈ అబలారత్న నృపాలరత్నముల = ఈ దమయంతీ నలమహారాజుల, నిత్య = శాశ్వతమైన, ఐశ్వర్య సంపత్తికిన్ = ఐశ్వర్య సమృద్ధికి, విబుధేంద్ర = ఇంద్రుని, అవరణ = వరింపకపోవుటచే, ప్రసాదిత = సంతసించిన, శచీ = శచీదేవిచే, విశ్రాణిత = ఈయబడిన, ఆశీర్వచ: స్తబక వ్రాతములన్ = ఆశీర్వచన గుత్తుల సమూహమును, దిగీశ = దిక్పతులయొక్క, పురుషార్థ = సందేశమును కొనిపోవు కార్యముయొక్క, ప్రక్రమ = ప్రారంభముచే, ఉపార్జిత = సంపాదింపబడిన, ప్రబల ఖ్యాతియున్ = గొప్ప కీర్తియును, పూటకాపులుసుడీ = ఐశ్వర్యమును తప్పక ఈయవలసినవిజుడీ !

తా. ఆలోచించి చూస్తే ఇంద్రుని వరింపకపోవుటచే సంతోషించిన శచీదేవి ఇచ్చిన ఆశీర్వచనములును, దిక్పతుల రాయబారమును సక్రమముగా జరిపించిన ఖ్యాతియును ఈ నల దమయంతుల ఐశ్వర్యకారణములగుచున్నవి.

**75 శా. చేసెంగావలయు న్విరించి నిఖిల స్త్రీపుంస సంయోజనా**
**భ్యాసప్రౌఢి ప్రకాశమొంద గడులియ్యంబైన సంసర్గ మి**
**ట్టా సంసార పురంధ్రిపూరుషమిథో హర్షోదయ ప్రేమముల్**
**పోసెం గావలయు న్మరుండు హృదయాంభోజంబుల న్వీరికిన్**

విరించి = బ్రహ్మ, వీరికిన్ = ఈ నలదమయంతులకు, నిఖిల = సమస్తమైన, స్త్రీపుంస = స్త్రీపురుషులయొక్క, సంయోజనా = కూర్చుటయందైన, అభ్యాసప్రౌఢి = అభ్యాసమునందలి నేర్పు, ప్రకాశమొందన్ = ప్రకాశించునట్లుగా, కదులియ్యంబైన = మిక్కిలి కలిసినట్టిదైన, సంసర్గము = కూడికను, చేసెంగావలయున్ = చేసియుండవచ్చును, మరుండు = మన్మథుడు, వీరికిన్, ఆసంసార = సృష్టిమొదలుకొని, పురంధ్రి పూరుష = స్త్రీపురుషులయొక్క, మిథ: = అన్యోన్యములగు, హర్షోదయ = సంతోషముకలుగుటను, ప్రేమముల్ = ప్రేమయును, హృదయాంభోజములన్ = హృత్పద్మములను, పోసెంగావలయున్ = పోసియుండవచ్చును.(అలంకారము – ఉత్ప్రేక్ష)

తా. బ్రహ్మ ఈ నలదమయంతులకు లోకమునందలి స్త్రీపురుషులను కూర్చుటయందైన నేర్పు ప్రకాశించునట్లుగా ఎప్పుడూ కలిసియుండునట్లుగా చేసియుండవచ్చును. మన్మథుడు వీరికి సృష్టిమొదలుకొని స్త్రీపురుషులకు అన్యోన్యములగు సంతోషము, ప్రేమలను హృత్పద్మములందు నింపియుండెనేమో!

**76 శా. వైదర్భీ బహుజన్మ నిర్మల తపోవర్ధిష్ణు తల్లోచనా**
**స్వాద ప్రౌఢ విలాసుఁ డీ వసుమతీచక్రేశ పుష్పాయుధుం**
**డాదిత్యాలయ సార్వభౌమ సుకృతాహంకార దుష్ప్రాప భై**
**మీ దాంపత్యమునం జిరాయువయి నెమ్మిం బొందుఁ గాకెంతయున్**

వసుమతీచక్ర = భూమండలమునగల, ఈశ = ప్రభువులలో, పుష్పాయుధుండు = మన్మథుడు, వైదర్భీ = దమయంతి యొక్క, బహుజన్మ, నిర్మల = స్వచ్ఛమైన, తప: = తపస్సుచే, వర్ధిష్ణు = పెరుగుచున్న, తత్ = ఆమెయొక్క, లోచన = కన్నులకు, ఆస్వాద = ఆనందముకల్గించుటయందు, ప్రౌఢ = నేర్పుగల, విలాసుడు = సొగసులుకలవాడు, ఆదిత్యాలయ = స్వర్గలోకమునకు, సార్వభౌమ = చక్రవర్తియైన ఇంద్రునియొక్క, సుకృతాహంకార = పుణ్య అతిశయముచే, దుష్ప్రాప = పొందనలవిగాని, భైమీ

= దమయంతితోడి, దాంపత్యమునన్ = దాంపత్యముచే, ఇలన్ = భూమియందు, చిరాయువయి, ఎంతమున్, నెమ్మిన్ = సంతోషమును, ఒందుగాక = పొందునుగాక.

తా. భూమండలములోని ప్రభువులలో మన్మథుడును, దమయంతి పలుజన్మల తపస్సుచే వృద్ధిపొందిన నేత్రానంద విలాసములుకలవాడును, స్వర్గలోక ప్రభువగు ఇంద్రుని పుణ్యాతిశయముచే పొందనలవిగాని దమయంతీ దాంపత్యముచే ఈ భూమియందు చిరాయువయి ఎంతయు సంతోషమును పొందుగాక.

**77 శా. సంబంధంబిటుగూడునే రమణికిన్ క్ష్మాభర్తకు న్నేత్రప**
**ర్వంబైయుండె స్వయంవరం బసిత గౌర స్మేర దృగ్రోచులన్**
**బింబోష్ఠీ నివహం బమోఘ కుతుక ప్రేమంబులన్వీరి మా**
**ఘం బాడించెనఘాతిఘాతి యమునా గంగౌఘ యోగంబునన్**

రమణికిన్ = దమయంతికిని, క్ష్మాభర్తకున్ = నలునకును, సంబంధంబు, ఇటు కూడునే = ఇలా కుదురుతుందా?, నేత్ర పర్వంబై = కన్నులకానందమై, ఉండెన్, బింబోష్ఠీనివహంబు = స్త్రీ సమూహము, అమోఘ, కుతుక = సంతోషముతోను, ప్రేమంబులన్ = ప్రీతితోను, అసిత = నల్లని, గౌర = తెల్లని, స్మేర = వికసించిన, దృక్ = నేత్రముల, రోచులన్ = కాంతులను, అఘ = పాపములను, అతిఘాతి = పూర్తిగా నశింపచేసెడి, యమునా గంగా, ఓఘ = ప్రవాహములయొక్క, యోగంబునన్ = కలయికచే (ప్రయాగ), వీరిన్ = ఈ దంపతులను, మాఘంబు = మాఘ స్నానము, ఆడించెను = చేయించెను.

తా. నలదమయంతులకు సంబంధము ఇంత చక్కగా కుదురుతుందా? నేత్రపర్వంగా ఉంది. స్త్రీలందరూ అంతులేని సంతోషంతోను, ప్రీతితోను నల్లని, తెల్లని వికసించిన నేత్రకాంతులతో పాపాలను నశింపచేసెడి గంగా యమునా నదుల ప్రవాహముల కలయికకల ప్రయాగయందు పవిత్ర మాఘస్నానము నాడించెను.(అలంకారము – రూపకము, ఉత్ప్రేక్ష)

**78 తే. దివిజపతిఁ బొందెనేని రెండవ శచియగు**
**ధరణిపతిఁ బొంద దమయంతితనము చెడదు**
**తివిరి శచియౌట దమయంతి యవుటఁ బోల**
**దింతి యీ తారతమ్య మెట్లెఱిఁగెనొక్కొ**

ఇంతి = దమయంతి, దివిజపతిన్ = ఇంద్రుని, పొందెనేని = వరించినచో, రెండవ శచి అగున్, ధరణిపతిన్ = నలుని, పొందన్, దమయంతితనము = దమయంతీత్వము, చెడదు = పోదు, తివిరి = ప్రయత్నించి, శచియౌట = ఇంద్రుని భార్యయగుట, దమయంతియవుటన్ = దమయంతియై యుండుటకు, పోలదు = సరికాదు. ఈ తారతమ్యము = ఈ తేడాను, ఎట్లు = ఏరీతిగా, ఎఱిగెనొక్కొ = తెలుసుకొన్నదోకదా!

తా. దమయంతి ఇంద్రుని వరించినచో రెండవ శచిగానే మిగులును. నలుని పొందుటచే దమయంతీత్వము పోదు. అందువలన ప్రయత్నించి ఇంద్రుని భార్యయగుట దమయంతియై యుండుటకు సరికాదు. ఈ తేడాను దమయంతి ఎట్లు తెలుసుకొందోకదా!

**79 శా. స్వారాజ ప్రముఖామర ప్రవరుల న్వర్జించి లజ్జాపరీ**
**హారంబుం బొనరించె రాజులకు సంప్రార్థించి తాదేవ స**
**త్కారంబై యితని న్వరించిన వివేకప్రౌఢిఁ దద్దేవతా**
**హ్రీరోషా పయశః ప్రమార్జన మొనర్చెన్ భైమి మేలెంతయున్**

భైమి = దమయంతి, స్వారాజ = ఇంద్రుడు, ప్రముఖ = మొదలుగాగల, అమర ప్రవరులన్ = దేవతా శ్రేష్ఠులను, వర్జించి = విడిచి, రాజులకున్ = వచ్చిన రాజులకు, లజ్జాపరీహారంబున్ = సిగ్గుపడకుండా చేసేట్లు, ఒనరించెన్ = చేసెను. ప్రార్థించి = ఇంద్రాదులను ప్రార్థించి, దేవతాసత్కారంబై = దేవతలచే గౌరవింపబడినదై, ఇతనిన్ = ఈ నలుని, వరించిన = చేపట్టిన, వివేకప్రౌఢిన్ = బుద్ధిమత్వముచే, తత్ దేవతా = ఆ దిక్పాలకులయొక్క, హ్రీరోషా = లజ్జాకోపములను, అపయశః = అపకీర్తిని, ప్రమార్జనము = తొలగించుకొనుటను, ఒనర్చెన్ = చేసెను.

తా. దమయంతి ఇంద్రుడు మొదలైన దిక్పాలకులను విడిచిపెట్టి వచ్చిన రాజులను సిగ్గుపడకుండునట్లుగా చేసెను. ఇంద్రాదులను ప్రార్థించి నలుని చేపట్టిన బుద్ధిమత్వముచే ఆ దిక్పాలకులయొక్క లజ్జా కోపములను అపకీర్తిని తొలగించుకొనెను.

**80 వ. అనుచు నీ చందంబునం గ్రందుకొని యిందీవరాక్షులు డెందంబు లానంద జలధిం దేలియాడం గొనియాడుచు సందర్శనోత్సవం బనుభవింపం గుమార బృందారకుండు కురువింద కందళీ సందోహ సుందర కరుండగుటను హృదయానందుండగుటనుం బొడము చందురునిం దొరయుచుఁ బురందర హరిత్క్రీడామందిరంబగు నుదయగిరి కందరంబునుంబోని కనకస్యందనంబుపై హరిద్రాభంగరంగంబుల భంగింప నంగలించు నఖిలాంగకంబులం దొడిగిన మంగళా భరణంబులం గీలింపఁబడిన యింద్రనీలంబుల మెఱుంగుల చెఱుంగులు పౌరాంగనాపాంగ దృక్తరంగంబుల నాలింగనంబుసేయం గంకణ ఝణఝణత్కారంబు తోరంబుగాఁ బంకజాక్షులు వీచు వీచోపులం బొడము సన్న గరువలి పొలపంబుల నున్నంబులై**

**నున్న కురులు పొలుపార, మందగమనంబున వందిసందోహ సంకీర్తనంబును, మాగధ మధుర గానంబును, బాఠక పఠన రవంబును మనంబు రజింపంజేయ, ముందఱం జను మూర్ధాభిషిక్తుల మణికిరీటంబులను నడదివియలతోడం గూడి గంధతైల ధారాభిషేక ప్రదీపితంబగు కరదీపికా సహస్రంబు, నాసీరగత తుక్ఖార ఖరఖుర ఘట్టనంబులం బుట్టిన ధరణీపరాగంబున దట్టంబైన సంధ్యాంధకారంబు దూరంబుసేయం గరిఘటా గ్రైవేయ ఘంటికా టంకార రవంబులఁ బ్రోదిసేయుచుఁ బుంఖానుపుంఖంబులుగా శంఖ కాహళ భేరీ మృదంగ వేణు వీణా నినాదంబులు రోదసీ కటాహంబు నుద్ఘాటింపం బటత్పట్టపట పతాకాభిరామంబును, నముత్తంభిత రంభాస్తంభ సంభారంబును, గర్పూర పాంసు విరచిత రంగవల్లీమతల్లికా వేల్లిత ప్రాంగణంబును గస్తూరీ కర్దమాలిప్త వితర్దికా ద్వితయోప శోభితంబును, బుణ్యాంగనా కరకిసలయావలంబిత చూతపల్లవ లాజాక్షతాది శోభన పదార్థ సార్థంబునునైన రాజమందిరంబు చేరం జనుదెంచునప్పుడు.**

తా. ఈ రీతిగా పలుకుచు కలువలనేత్రులైన స్త్రీలు గుంపుగా మనసులు ఆనందసంద్రమున ఈదులాడుచుండగా నలదమయంతుల నుతించుచు, నలుని చూచుటయనెడి ఉత్సవమును అనుభవించుచుండగా, నలుడు పద్మరాగములయొక్క మొలకల సమూహమువలె అందమైన చేతులు కలవాడగుటచేతను (ఉదయకాలమందు చంద్రుడు ఎఱ్ఱగానుండుట సహజము) మనసున కానందము కలిగించువాడగుటచేతను ఉదయకాల చంద్రునికి సమానమగుచు తూర్పు దిక్కనెడి స్త్రీకి క్రీడాగృహమగు పొడుపుకొండ గుహను పోలిన బంగారు రథముపై కూర్చుండి పసుపుఖండముల రంగును తిరస్కరించుటకు ప్రయత్నించుచున్న యవయవములయందు ధరించిన ఆభరణములయందు స్థగితములైయున్న ఇంద్రనీలమణుల కాంతులయొక్క కొనలు పౌరస్త్రీల క్రీగంటిచూపుల యాలింగనము నలమికొనుచుండగా కంకణముల ఝణంకారధ్వనులు వర్ధిల్లునట్లుగా స్త్రీలు వీచుచున్న వింజామరలవలన ఉదయించు మందమారుతప్రసారములచే పైకి త్రోయబడిన మెత్తని కేశములు కదలి ప్రకాశించుచుండగా మెల్లని నడకతో వందిజనముల పొగడ్తలును, మాగధజన తియ్యని పాటలును, పాఠక పఠనధ్వనియును మనసుల నానందింపచేయుచుండగా నలునికి ముందు నడచుచున్న గొప్ప రాజులయొక్క రత్నకిరీటములనెడి నడచుచున్న దీపములతో కలిసి పరిమళ తైలధారలచే తడుపబడి వెలిగింపబడిన దివిటీల సమూహము సేనాముఖమును పొందిన గుఱ్ఱముల వాడియైన డెక్కలయొక్క సంఘర్షణముచే పుట్టిన భూపరాగముచేనయిన సాయంకాలపు చీకటిని దూరము చేయుచుండగా, ఏనుగుల కంఠాభరణములైన గంటలయొక్క ధ్వనులను వృద్ధిపొందించుచు పుంఖానుపుంఖంబుగా శంఖముల, కాహళుల వాద్య విశేషములు, వేణు వీణా భేరీ మృదంగ ధ్వనులు భూమ్యాకాశముల పగులగొట్టుచుండ, పటపటమని ధ్వనించు పట్టుగుడ్డ జండాలతో మనోహరమై ఎత్తబడిన అరటిస్తంభముల సమూహముకలదియు, కర్పూర చూర్ణముచే రచింపబడిన ముగ్గులచేతను చుట్టబడిన ముంగిళ్లుకలదియు, కస్తూరి పూయబడిన రెండరుగులచేత ప్రకాశించుచున్నదియు, పుణ్యాంగనల చిగురువంటి చేతులచే పట్టుకొనబడిన మామిడి చిగుళ్ళును, పేలాలు, అక్షతలు మొదలైన మంగళ పదార్థములయొక్క సమూహముకలదియునైన రాజగృహమును సమీపింపగా వచ్చుచున్న సమయమందు

**81 ఉ. చేరెను లగ్నవేళ యతిశీఘ్రము రమ్మని విన్నవింపఁ బు**
**త్తేరఁగ నంతనంతఁ జనుదెంతురు కుంతల గౌడ చోళ గాం**
**ధారముఖావనీశులు విదర్భనరేంద్రుని యాజ్ఞఁ బాద సం**
**చారమునన్ శశాంకకుల సంభవుపాలికి భక్తినమ్రులై**

లగ్నవేళ = ముహూర్త సమయము, చేరెను = సమీపించెను, అతి శీఘ్రము రమ్మని, విన్నవింపన్ = చెప్పుటకు, పుత్తేరగన్ = పంపగా, కుంతల, గౌడ, చోళ, గాంధార, అవనీశులు = రాజులు, విదర్భనరేంద్రుని, ఆజ్ఞన్, భక్తి నమ్రులై = భక్తిచే వినయముకలవార్రై, పాద సంచారమునన్ = కాలినడకనే, శశాంకకులసంభవుపాలికి = చంద్రవంశ సంభూతుడగు నలరాజు చెంతకు, అంతనంతన్ = మెలమెల్లగా, చనుదెంతురు = వచ్చెదరు.

తా. ముహూర్తసమయము సమీపించెనని వేగముగా రమ్మని చెప్పుటకు పంపగా కుంతల, గౌడ, చోళ, గాంధార రాజులు విదర్భరాజు ఆజ్ఞతో భక్తి, వినయముకలవార్రై కాలినడకనే చంద్రవంశ సంభూతుడగు నలుని చెంతకు మెల్లమెల్లగా వచ్చిరి.

**82 సీ. యామవేదండ కర్ణానిలస్ఫాలన**
**విలసిత భ్రూవల్లి వేల్లనముగఁ**
**దోరణమాలికా హీరాంకుర చ్ఛాయ**
**వెలఁది లేఁజిఱునవ్వు మొలకగాఁగఁ**
**బ్రోది రంభాస్తంభముల మోసుటాకులు**
**లలిఁ బచ్చవట్టు చేలంబుగాఁగఁ**
**వీతెంచు మృదు వేణు వీణా నినాదంబు**
**కలికి తీయని నున్న పలుకుగాఁగఁ**

**తే.** **పేరఁటాం డ్రురుహస్త పంకేరుహములఁ**
**బూఁచి యెత్తిన కనకంపుఁ బూజెగుండ**
**లున్నత స్తనములు గాఁగఁ నొప్పు మిగిలెఁ**
**దరుణియునుబోలె నృపగృహద్వారభూమి**

యామ = ఒక్కొక్క జామునకు, వేదండ = ఏనుగుయొక్క, కర్ణ అనిల = చెవివలన వచ్చు గాలియొక్క, స్ఫాలన = కదలికలు విలసిత = ప్రకాశించుచున్న, భ్రూవల్లి = లతవంటి కనుబొమలయొక్క, వేల్లనముగన్ = చలనముగాను, తోరణమాలికా = మాలికవంటి తోరణమునందున్న, హీరాంకుర = వజ్రపు మొలకలయొక్క, ఛాయ = కాంతి, వెలది = స్త్రీయొక్క, లేజిఋనవ్వు మొలకగాగన్ = మందహాసపు అంకురములగుచుండగా, ప్రోది = అలంకారముంచిన, రంభాస్తంభముల మోసుటాకులు = అరటిచెట్ల లేత ఆకులు, లలిన్ = ఒప్పునట్లుగా, పచ్చపట్టు చేలంబుగాగన్ = పచ్చని పట్టు పీతాంబరము కాగా, వీతెంచు = వచ్చుచున్న, మృదు = మధురమైన, వేణు వీణా, నినాదంబు = ధ్వని, కలికి = మనోహరమైన, తీయని = మధురమైన, నున్న = మృదువైన, పలుకుగాగన్ = మాటకాగా, పేరటాండ్రురు = ముత్తైదువలు, హస్త పంకేరుహములన్ = పద్మములవంటి చేతులతో, పూచి = పూని, ఎత్తి = పట్టుకొని, కనకంపు పూజెకుండలు = బంగారు ఐరేని కుండలు, ఉన్నత స్తనములు కాగన్, నృపగృహద్వారభూమి, తరుణియును పోలెన్, ఒప్పు మిగిలెన్ = ప్రకాశించెను.

తా. ప్రతియొక్క జామునకు యుండెడి ఏనుగుయొక్క చెవులగాలి కదలికలు ప్రకాశించుచున్న లతవంటి కనుబొమలయొక్క చలనముగాను, ద్వారమునందున్న మాలికలందున్న వజ్రపుమొలకల కాంతి స్త్రీ మందహాసముకాగా, అలంకారము కొరకుంచిన అరటిస్తంభముల లేతయాకులు పచ్చని పట్టు పీతాంబరముకాగా, వచ్చుచున్న మృదువైన వేణు వీణా నినాదము మనోహరమైన మృదువైన, మధురమైన పలుకుకాగా ముత్తైదువలు తమ పద్దములవంటిచేతులతో పూని పట్టుకొనిన బంగారు ఐరేని కుండలుకాగా రాజద్వారము స్త్రీవలె ప్రకాశించెను. (అలంకారము – ఉత్ప్రేక్ష)

**83** **ఉ.** **శంబరవైరి మూర్తి జలజ ద్విష దన్వయ చక్రవర్తి ర**
**మ్యంబగు మందయానమున నర్థిమెయిం జనుదెంచెఁ గేతు చీ**
**నాంబర వల్లి వేల్లన విహార తరంగిత వారివాహ మా**
**ర్గంబగు రాజమందిరము ప్రాంగణభూమికి సమ్మదంబునన్**

శంబరవైరి మూర్తి = మన్మథునివంటి రూపముకలవాడును, జలజద్విషత్ = పద్మములకు విరోధియైన చంద్రుని, అన్వయ = వంశమువాడైన, చక్రవర్తి, కేతు = ధ్వజములందున్న, చీనాంబరవల్లి = పట్టువస్త్రములయొక్క, వేల్లన = కదలికయనెడి, విహార = సంచారములచే, తరంగిత = తరంగములుకలదిగా చేయబడిన, వారివాహమార్గంబగు = ఆకాశమార్గముకలదైన, రాజమందిరము ప్రాంగణభూమికిన్ = రాజమందిర ప్రాంతమునకు, సమ్మదంబునన్ = సంతోషముతో, అర్థిమెయిన్ = కోరికతో, రమ్యంబగు = అందమైన, మందయానమునన్ = మెల్లని నడకతో, చనుదెంచెన్ = వచ్చెను.

తా. మన్మథునివంటి రూపముకలవాడును, చంద్రుని వంశ చక్రవర్తియునైన నలుడు పతాకములందున్న పట్టు వస్త్రముల కదలికల సంచారములచే తరంగములుకలదిగా చేయబడిన ఆకాశమార్గముకలదైన రాజమందిర ప్రదేశమునకు నలుడు సంతోషముతో కోరికతో చక్కని మెల్లని నడకతో చేరెను.

**84** **తే.** **ఎదురుగా నేఁగుదెంచుచో నింద్రమయ్యెఁ**
**బెండ్లి యిరువంక చుట్టంపుఁ బెద్దలకును**
**నాభిముఖ్యౌచితీ సమ్యగర్హణార్హ**
**భాషణాలింగనాది సంభావనముల**

ఎదురుగాన్, ఏగుదెంచుచోన్ = రాగా, పెండ్లి = పెండ్లికివచ్చిన, ఇరువంక = రెండువైపులవారి, చుట్టంపున్ = చుట్టాలైన, పెద్దలకును, ఆభిముఖ్య = ఎదురుకోలుయొక్క, ఔచితీ = మర్యాదచే, సమ్యక్ = చక్కగా, అర్హణ అర్హ భాషణ = తగిన మాటలచేతను, ఆలింగనాది = కౌగిలి మొదలైన, సంభావనములన్ = గౌరవములచే, ఇంద్రము = ఇఱకాటము, అయ్యెన్

తా. వధూవరులవైపు చుట్టాలైనవారు ఎదురుగా రాగా ఎదురుకోలు మర్యాదచే చక్కగా మాటలచేతను, కౌగిలి చేతను మొదలగు గౌరవములచే ఇఱకాటమయ్యెను.

**85** **మ.** **దమయంతీ ప్రియసోదరుండు దముఁ డాద్వార ప్రదేశంబు నె**
**య్యమునం గాల్నడ నేఁగుదెంచెఁ బరిచర్యాయుక్తి గారాపు వి**
**య్యముఁ దోడ్కొంచరుగంగఁ గంచుక పరీహారంబునం దారహా**
**రముఁ దోరంబుగఁ బేరురంబున విహారక్రీడ వాటింపగన్**

దమయంతీ ప్రియ సోదరుండు, దముడు, కంచుక పరీహారంబునన్ = చొక్కా లేకుండగనే, తారహారము = ముత్యాలహారము, తోరంబుగన్ = చక్కగా, పేరురంబునన్ = విశాల వక్షస్థలమున, విహారక్రీడన్ = విహరించు ఆటను, పాటింపగన్ = చేయుచుండగా, ఆ ద్వారప్రదేశంబు = ఆ రాజమందిర ద్వారభాగమునకు, నెయ్యమునన్ = స్నేహభావముతో, కాల్నడన్ =

కాలినడకతో, పరిచర్యాయుక్తిన్ = సేవాభావముతో, గారాపు వియ్యమున్ = ప్రియ బావగారిని, తోడ్కొంచున్ = తీసుకొని, అరుగగ = వెళ్లుటకు, ఏగుదెంచెన్ = ఎదురు వచ్చెను.

తా. దమయంతీ సోదరుడైన దముడు కవచము లేకపోవుటచే ముత్యాలహారము చక్కగా విశాల వక్షస్థలమున విహరించుచుండగా ఆ రాజమందిరద్వారభాగమునకు స్నేహభావముతో కాలినడకన ముద్దుల బావగారిని సేవాభావముతో తీసుకొని వెళ్ళుటకు ఎదురువచ్చెను.

**86 తే. సైన్యముల నెల్ల వెలినుండఁ జాటఁబనిచి**
**వలయు పడవాళ్ళ రాకుమారులను దొరల**
**నిషధరాజును గొలిచి రా నియతిఁ జేసె**
**నపుడు మొగసాలఁ గ్రథకైశికావనిపుఁడు**

క్రథకైశిక అవనిపుడు = క్రథకైశిక దేశపాలకుడగు భీమరాజు, అపుడు, మొగసాలన్ = తలవాకిట, సైన్యములనెల్లన్, వెలిన్ ఉండన్ = బయటనే ఉండునట్లుగా, చాటన్ పనిచి = తెలియునట్లుగా పంపి, వలయు పడవాళ్లన్ = కావలసిన సేనాపతులను, రాకుమారులను, దొరలన్ = దేశాధిపతులను, నిషధరాజును, కొలిచి = సేవించి, రాన్ = తీసుకొనివచ్చుటకు, నియతి చేసెన్ = ఆజ్ఞాపించెను.

తా. భీమరాజు అపుడు తలవాకిట సైన్యములనెల్లను బయటనే ఉండునట్లుగా తెలియపరచి కావలసిన సేనా పతులను, రాకుమారులను, దేశాధిపతులను, నిషధరాజును సేవించి తీసుకొనివచ్చుటకు ఆజ్ఞాపించెను.

**87 వ. తదనంతరంబ యభ్యంతర కక్ష్యాంతర విభాగంబున నరదంబు డిగ్గి పుణ్యాంగనా విహిత నీరాజనాది మంగళోపచారుఁడై గారాపు వియ్యంపు ముంజేయి కరతలంబున నవలంబించి యల్లనల్లన నడిచి బంధుజన పరంపరా పరివేష్టితంబై పురోహిత బ్రాహ్మణ సహితంబై పురంధ్రీ నికురుంబ సంబాధ భరితంబైన వివాహ మంటపంబు చేరం జనుదెంచి దూరంబున నెదురుగా వచ్చు భీమభూపాలునకు నభివాదనంబు సేసి యతం డునుప సమున్నత కనకాసనంబున నాసీనుండై.**

తా. తరువాత నలుడు లోపలి వాకిళ్ళ లోపలి ప్రదేశమున రథమును దిగి పుణ్యస్త్రీలచే చేయబడిన నీరాజనము మొదలైన మంగళ ఉపచారములను పొంది ప్రియమైన బావమరిది అరచేతిని చేతితో పట్టుకొని మెల్లమెల్లగా నడిచి బంధుజనుల సమూహము కూడా రాగా పురోహితులైన బ్రాహ్మణుల సహితుడై, స్త్రీ సమూహము సమ్మర్దముతో నిండిన వివాహ మంటపమును చేరి దూరముననే ఎదురువచ్చు భీమరాజునకు నమస్కరించి అతడు కూర్చుండబెట్టిన ఉన్నత బంగారు ఆసనమున కూర్చుండి

**88 ఉ. పారణ చేసె రాజు మధుపర్కపుఁ దేనియ మామ భీమధా**
**త్రీరమణుండు మంత్ర సముదీరణ పూర్వముగాఁగఁ బోయఁ ద**
**త్పారణ భోజభూపతి సుతా మధురాధర చుంబనక్రియా**
**పారణకు న్నిదానమయి భావము నువ్విళులూరఁ జేయగన్**

రాజు = నలరాజు, మామ = మామగారైన, భీమ ధాత్రీరమణుండు = భీమరాజు, మంత్రసముదీరణపూర్వముగాగన్ = మంత్రోచ్చారణ పూర్వకంబుగా, పోయన్ = చేతిలో పోయగా, మధుపర్కపు తేనియన్, పారణచేసెన్ = త్రాగెను. తత్ పారణ = ఆ త్రాగుట, భోజభూపతిసుతా = దమయంతియొక్క, మధుర అధర = తియ్యని అధరముయొక్క, చుంబన క్రియా = ముద్దురూపమున, పారణకున్ = త్రాగుటకు, నిదానమయి = కారణమయి, భావమున్ = చిత్తమును, ఉవ్విళులూరుచున్ = ఉత్సాహపరచుచుండగా

తా. నలుడు తన మామగారైన భీమరాజు మంత్రోచ్చరణ పూర్వకముగా చేతిలో పోయగా మధుపర్కపు తేనెను త్రాగెను. ఆ త్రాగుట దమయంతియొక్క తీయని అధరముయొక్క ముద్దురూపమున త్రాగుటకు కారణమైన చిత్తమును ఉవ్విళ్ళూరించుచుండగా

**89 చ. సకల ధరాధినాథునకుఁ జంద్రనిభాస్యకుఁ గేలుఁదామరల్**
**ప్రకటముగాఁగఁ గట్టుపడెఁ బావన కౌతుక సూత్రరక్షచే**
**నొకటి పరోపఘాతకము నొక్కటి పంకజ కాంతి తస్కరం**
**బొకమరి యేలకట్టువడకుండు మహీపతి యాజ్ఞ గల్గినన్**

సకల ధరాధినాథునకున్ = సమస్త భూతలమునకు అధిపతియైన నలునకు, చంద్రనిభాస్యకున్ = దమయంతికిని, పావన = పవిత్రమైన, కౌతుక సూత్రరక్షచే = కంకణపు దారముచే, కేలుదారముల్ = హస్తపద్మములు, ప్రకటముగాగన్ = స్పష్టమగునట్లుగా, కట్టుబడెన్ = బంధింపబడెను. ఒకటి = అందులో ఒకటైన నలునిచేయి, పరోపఘాతము = శత్రువులను సంహరించునది, ఒకటి = మరియొకటైన దమయంతి చేయి, పంకజకాంతి తస్కరంబు = పద్మముల కాంతిని హరించునది, (ఒకచేయి పరహింస చేయునది – ఒకచేయి దొంగతనము చేయునది) మహీపతి ఆజ్ఞ = రాజాజ్ఞ, కల్గినన్ = చేయబడినచో, ఒకమఱి = ఒక్కమారుగా, ఏలకట్టువడకుండు = ఎందుకు బంధింపబడకుండును? అలంకారము – హేతూత్ప్రేక్ష)

తా. సమస్త భూతలమునకు అధిపతియైన నలునకు దమయంతికిని పవిత్రమైన కంకణపు దారముచే హస్త పద్మములు కట్టబడెను. అందులో నలుని చేయి శత్రువులను సంహరించునది, దమయంతి చేయి పద్మములు కాంతిని హరించునది. రెండూ హింసచేయునవియే. రాజు ఆజ్ఞాపిస్తే ఒక్కమారుగా ఎందుకు బంధిపబడకుండా ఉంటారు?

**90 తే. నృపతిచేతికి మీఁదుగా నెలఁత చెయ్యి**
**గీలుకొనఁజేసె నొక పేరఁటాలపడఁతి**
**యదియ పుణ్యాహవాచనావాప్తియయ్యె**
**భావియగు నంబుజాక్షి పుంభావమునకు**

ఒక పేరటాలపడతి = ఒక పేరంటాలు, నృపతిచేతికిమీదుగాన్ = నలునిచేతిమీదుగా, నెలత చెయ్యి = దమయంతి చేతిని, కీలుకొనన్ చేసెన్ = హత్తించెను, అదియ = ఆ హత్తించుటే, భావియగు = ముందువచ్చెడిదగు, అంబుజాక్షి పుంభావమునకున్ = దమయంతి పురుషాయితమునకు, పుణ్యాహవాచన = పుణ్యాహమని చెప్పించుటయొక్క, అవాప్తియయ్యెన్ = పొందుటయ్యెను.

తా. ఒక పేరంటాలు నలుని చేతిమీదుగా దమయంతి చేతిని హత్తించెను. ఆ హత్తించుటచే ముందువచ్చెడిదగు దమయంతి పురుషాయితమునకు పుణ్యాహమని చెప్పించడం జరిగినట్టుంది.

**91 వ. తదనంతరంబ**

**92 ఉ. వాసికినెక్కు కూర్మిజనవల్లభుఁ డిచ్చెను వైరసేని క**
**బ్జాసనవంద్య దుర్గ తనకర్థివరంబుగ నిచ్చె నెద్ది య**
**క్కాసర రక్తబీజ మధుకైటభ శుంభ నిశుంభ చండముం**
**డాసుర కంఠఖండన విహార మహొగ్రము మండలాగ్రమున్**

వాసికిన్ = ప్రఖ్యాతికి, ఎక్కు కూర్మిన్ = పొందిన ప్రేమతో, జనవల్లభుడు = భీమరాజు, తనకున్, అబ్జాసనవంద్య = బ్రహ్మదేవునిచే స్తుతింపనగు, దుర్గ, అర్థిన్ = ప్రీతితో, వరంబుగన్ = వరరూపముగా, ఎద్ది = ఏ ఖడ్గమును, ఇచ్చెన్ = ఒసంగెనో, ఆ = ప్రసిద్ధులైన, కాసర = మహిషాసురుడు, రక్తబీజుడు, మధుడు, కైటభుడు, శుంభుడు, నిశుంభుడు, చండుడు, ముండుడు, అను = అనునట్టి, అసుర = రాక్షసులయొక్క, కంఠ = మెడలను, ఖండన = ఛేదించుటయనెడి, విహార = క్రీడచే, మహొగ్రమున్ = మిక్కిలి భయంకరమైన, మండలాగ్రమున్ = కత్తిని, వైరసేనికి = వీరసేనుని కుమారుడైన నలునికి, ఇచ్చెను.

తా. అధికమైన ప్రేమతో భీమరాజు తనకు దుర్గాదేవి ప్రీతితో వరరూపముగా ఇచ్చిన ప్రసిద్ధులైన మహిషాసురుడు, రక్తబీజుడు, మధుడు, కైటభుడు, శుంభుడు, నిశుంభుడు, చండుడు, ముండుడు అను రాక్షసుల మెడలను ఛేదించిన క్రీడచే మిక్కిలి భయంకరమైన కత్తిని నలునకు ఇచ్చెను.

**93 క. సంతోషంబున ధరణీ**
**కాంతుం డల్లునకు నిచ్చె గారామారం**
**జింతామణి దామకముం**
**జింతిత కామప్రదాన శిక్షాక్షమమున్**

ధరణీకాంతుండు = భీమరాజు, సంతోషంబుననన్, గారమా అరన్ = ప్రేమ నిండునట్లుగా, చింతిత = కోరిన, కామ = కోర్కెను, ప్రదాన = ఇచ్చుటయందలి, శిక్షా = నేర్పునందు, క్షమమున్ = సమర్థమైన, చింతామణి దామకమున్ = చింతామణి హారమును, అల్లునకున్ = నలునకు, ఇచ్చెన్

తా. భీమరాజు సంతోషముతో ప్రేమ నిండునట్లుగా కోరిన కోర్కెను తీర్చు నేర్పున సమర్థమైన చింతామణి హారమును అల్లునకు ఇచ్చెను.

**94 తే. జముని నాలుకతో నెకసక్కెమాడఁ**
**దమకపడు క్రొత్తపైఁడి మొళము కటారి**
**భీమనృపు డిచ్చె గారాపుఁ బెద్ద పెండ్లి**
**కొడుకుఁ గుఱ్ఱకు నైషధక్షోణిపతికి**

జముని నాలుకతోన్: = యముని నాలుకతో, ఎకసక్కెమాడన్ = పరిహాసమాడుటకు, తమకపడు = ఆసక్తిపడు, క్రొత్త పైడి మొళము కటారి = క్రొత్త బంగారుపూతగల కత్తిని, గారాపు = ప్రియమైన, పెద్ద = అల్లుడైన, పెండ్లికొడుకున్ , కుఱ్ఱకు = యువకునికి, నైషధక్షోణిపతికిన్, ఇచ్చెన్. (అలంకారము – ఉపమ)

తా. యముని నాలుకతో పరిహాసమాడుటకు ఆసక్తిపడు క్రొత్త బంగారుపూతగల కత్తిని ప్రియమైన అల్లుడైన పెండ్లికొడుకు యువకునికి నలునికి ఇచ్చెను.

**95 తే. వీరమాహేశ్వరాచార పారగునకుఁ**
**దనకు శశిమౌళి యిచ్చిన కనకరథము**

**కామగమనంబు నైషధక్ష్మావరునకు**
**మామ యిచ్చెను మాయని మహి నుతింప**

మామ = భీమరాజు, నైషధక్ష్మావరునకున్, మహి = భూజనులు, మాయని = వహ్వారేయని, నుతింపన్ = పొగడునట్లుగా, కామగమనంబున్ = స్వేచ్ఛాగమనము కలదియు, వీరమాహేశ్వరాచార = వీరశైవాచారములయొక్క పారగునకున్ = పండితునకు, తనకున్, శశిమౌళి = శివుడు, ఇచ్చిన, కనక రథము, ఇచ్చెను.(అలంకారము – కావ్యలింగము)

తా. భీమరాజు నలునకు భూజనులు వహ్వారేయని పొగడునట్లుగా స్వేచ్ఛాగమనము కలదియు వీరశైవాచారముల యొక్క పండితునకు తనకు శివుడు ఇచ్చిన కనకరథము ఇచ్చెను.

**96** క. **అల్లునికి నిచ్చె ధరణీ**
**వల్లభుఁ డనురక్తి నమరవల్లభు హరితో**
**నుల్లస మాడం జాలెడు**
**తెల్లని యొక కత్తలాని తేజీ హయమున్**

ధరణీవల్లభుడు = భీమరాజు, అనురక్తిన్ = ప్రేమతో, అమరవల్లభు హరితోన్ = ఇంద్రుని ఉచ్చైశ్రవముతో, ఉల్లసము ఆడన్ = పరిహాసముచేయుటకు, చాలెడు = సరిపడునట్టి, తెల్లని, ఒక కత్తలాని = ఒక ప్రశస్తమైన, తేజీ = వేగముకల హయమున్ = గుఱ్ఱమును, అల్లునికిన్ ఇచ్చెన్

తా. భీమరాజు ప్రేమతో ఇంద్రుని ఉచ్చైశ్రవముతో పరిహాసములాడజాలునట్టి తెల్లని ఒక ప్రశస్తమైన వేగముకల గుఱ్ఱమును అల్లునికి ఇచ్చెను.

**97** తే. **ప్రథమ జామాత కిచ్చె భూపాల తిలకుఁ**
**డగ్ని శోభంబులైన దివ్యాంబరములు**
**సౌహృదంబు ఘటింప వైశ్వానరుండు**
**తనరు నెయ్యవి పుత్తెంచెఁ దాను మొదల**

భూపాలతిలకుండు = భీమరాజు, తనకు, సౌహృదంబు = స్నేహమును, ఘటింపన్ = నెఱపుటకై, వైశ్వానరుండు = అగ్ని, తాన్ = తానుగా, మొదలన్ = ఇంతకు పూర్వము, ఎయ్యవి = ఏ వస్త్రములను, పుత్తెంచెన్ = పంపెనో, అగ్నిశోభంబులైన = కాంతితో ప్రకాశించునట్టివైన, దివ్య అంబరములు = దివ్యమైన వస్త్రములను, ప్రథమ = ముందుగా, జామాతకు = అల్లునకు, ఇచ్చెన్.

తా. భీమరాజు తనతో స్నేహమును నెఱపుటకై అగ్నిదేవుడు తానుగా ఇంతకు పూర్వము ఏ వస్త్రములను పంపెనో కాంతితో ప్రకాశించునట్టి దివ్యమైన వస్త్రములను ముందుగా అల్లునకు ఇచ్చెను.

**98** తే. **మలఁచి యేకాండముగ నొక్క మానికమున**
**వేడ్క నెద్దాని నిర్మించె విశ్వకర్మ**
**యట్టి దేవేంద్ర దత్త మహార్ఘ నూత్న**
**వీటికాపేటి మామ భూవిభున కొసఁగె**

విశ్వకర్మ, మలచి = తొలిచి, ఏకాండముగన్ = అతుకులు లేకుండగ, ఒక్క మానికమునన్ = ఒక్క రత్నమునందే, వేడ్కన్ = పూనుకొని, ఎద్దానిన్ = ఏ పెట్టెను, నిర్మించెన్ = తయారుచేసెనో, అట్టి = అటువంటి, దేవేంద్ర = ఇంద్రునిచే, దత్త = ఈయబడిన, మహార్ఘ = మిక్కిలి విలువైన, నూత్న = క్రొత్తదైన, వీటికాపేటిన్ = తాంబూలపు పెట్టెను, మామ = భీమరాజు, భూవిభునకు = నలమహారాజుకు, ఒసగె = ఇచ్చెను.

తా. దేవశిల్పియగు విశ్వకర్మ తొలిచి అతుకులు లేకుండగ ఒక్క రత్నమునే పూనుకొని ఏ పెట్టెను తయారుచేసెనో అటువంటిదేయైన ఇంద్రునిచే నీయబడిన మిక్కిలి విలువైన నూతన తాంబూలపు పెట్టెను మామగారైన భీమరాజు నలునకు ఇచ్చెను.

**99** మ. **పవనాహార విషంబు సోఁకదు యదౌపమ్యంబునం గేకిఁ గే**
**కి విలాసంబునఁ దాండవారభటి సంక్రీడించుటన్ క్ష్వేళ మ**
**భ్యవహారించెఁ గపాలియన్న మతి యేలా చెప్ప దచ్ఛక్తి య**
**న్నవ గారుత్మత భుక్తిపాత్ర నొసగె న్రాజాత్మజాభర్తకున్**

కేకిన్ = నెమలితో, యత్ ఔపమ్యంబునన్ = ఏ పోలికచేతనైతే, పవన ఆహార విషంబు = సర్ప విషము, సోకదు = తగులదో, మతి = ఇంకను, కపాలి = శివుడు, కేకి విలాసంబునన్ = నెమలి శోభతో, తాండవ ఆరభటిన్ = తాండవ నృత్యముతో, సంక్రీడించుటన్ = ఆడుటచే, క్ష్వేళము = కాలకూట విషమును, అభ్యవహారించెన్ అన్నన్ = తినెను అనినచో, తత్ శక్తిన్ = ఆ పాత్రముయొక్క శక్తిని, చెప్పన్ ఏలా = చెప్పుటెందులకు?, యత్ = అటువంటి పాత్ర ఏదైతే కలదో దానిని, నవ = క్రొత్త, గారుత్మత భుక్తిపాత్రన్ = గరుడపచ్చలతోకూడిన భోజనపాత్రను, రాజు, ఆత్మజాభర్తకున్ = తన కూతురిభర్తకు,(అల్లునకు),

ఒసగెన్ = ఇచ్చెను.(అలంకారము – ఉత్ప్రేక్ష, అర్థాపత్తి)

తా. నెమలిని పోలి పాము విషము సోకనట్టియు, పరమశివుడు నెమలి శోభతో తాండవ నృత్యము ఆడుటచేతనే కాలకూటవిషమును తినెనో అట్టి శక్తికలదని చెప్పుటయెందులకు? అటువంటి పాత్ర ఏదైతే కలదో దానిని, క్రొత్త గరుడ పచ్చలతో కూర్చిన భోజన పాత్రను భీమరాజు అల్లునకు ఇచ్చెను.

**100 చ. గరిమ వరాటరాజు తన గాదిలి యల్లున కిచ్చె ఘోటికా**
**కరటి పటీర హీర గణికామణి కాంచన ముఖ్య వస్తువుల్**
**పరిణయ దక్షిణార్థమయి ప్రౌఢత మీఱగ నప్పదార్థముల్**
**సరిఁ బరిపాటి నెన్నఁగ నశక్యము గీష్పతియంతవానికిన్**

వరాటరాజు = భీమరాజు, తన గాదిలి యల్లునకున్ = తన ముద్దుల అల్లునికి, పరిణయ దక్షిణార్థమయి = వివాహ సమయ వరకట్నముగా, ఘోటికా = గుఱ్ఱములు, కరటి = ఏనుగులు, పటీర = గంధపు చెక్కలు, హీర = వజ్రములు, గణికామణి = వేశ్యారత్నములను, కాంచన ముఖ్య వస్తువుల్ = బంగారు ప్రధాన వస్తువులను, గరిమన్ =గొప్పగా, ఇచ్చెన్, ప్రౌఢత మీఱగన్ = తన గొప్పతనము వెల్లడియగునట్లుగా ఇచ్చిన, ఆ పదార్థముల్ = ఆ వస్తువులను, సరిన్ = సరిగా, పరిపాటిన్ = క్రమముగా, ఎన్నగన్ = ఎంచుటకు, గీష్పతి యంతవానికిన్ = బృహస్పతి యంతవానికిని, అశక్యము = వీలుకానిది. (అలంకారము – అతిశయోక్తి, ఉదాత్తము)

తా. భీమరాజు తన ముద్దుల అల్లునికి వివాహసమయ వరకట్నముగా గుఱ్ఱములు, ఏనుగులు, గంధపు చెక్కలు, వజ్రములు, వేశ్యారత్నములు, బంగారు ప్రధాన వస్తువులు గొప్పగా ఇచ్చెను. తన గొప్పతనము వెల్లడియగునట్టుగా ఇచ్చిన ఆ వస్తువులను సరిగా వరుసగా ఎంచుటకు బృహస్పతి యంతవానికిని సాధ్యముకానిది.

**101 సీ. భక్తి ప్రదక్షిణ ప్రక్రమంబులఁ జేసి**
**రాశుశుక్షణికి నుపాసనంబు**
**నంశుక గ్రంథికల్యాణ క్రియాచార**
**మాచరించిరి మందహాస మెసఁగ**
**నఱ్ఱెత్తి చూచిరి యాకాశమండలా**
**స్థాన రత్నంబు నౌత్తానపాదిఁ**
**ద్రైలోక్య పతిదేవతా ఫాలతిలకంబుఁ**
**దివిరి యరుంధతీదేవిఁ గనిరి**

**తే. బ్రాహ్మణోత్తమ పుణ్య పురంధ్రి వర్గ**
**మంగళాశీర్వచోయుక్త మహిమశోభ**
**నాక్షతారోపణంబుల నాదరించి**
**రంబుజాక్షియు నిషధదేశాధిపతియు**

అంబుజాక్షియున్ = దమయంతియును, నిషధదేశాధిపతియును = నలుడును, భక్తి ప్రదక్షిణ, ప్రక్రమంబులన్ = నడచుటల చేత, ఆశుశుక్షణికిన్ = అగ్నికి, ఉపాసనంబున్ = పూజను, చేసిరి. మందహాసము = చిఱునవ్వు, ఎసగన్ = ఒప్పునట్లుగా, అంశుకగ్రంథి = కొంగులు ముడివేయుట యనెడి, కల్యాణ = వివాహసంబంధమగు, క్రియ = పనియొక్క, ఆచారము. ఆచరించిరి. ఆకాశమండల, ఆస్థాన = సభకు, రత్నంబు = అలంకారమైన, ఔత్తానపాదిన్ = ధ్రువుని, అఱ్ఱెత్తి = మెడ ఎత్తి, చూచిరి. త్రైలోక్య = మూడులోకములందలి, పతిదేవతా = పతివ్రతాస్త్రీలయొక్క, ఫాల = నొసళ్ళకు, తిలకంబు = తిలకమువంటిదైన, అరుంధతీదేవిన్, తివిరి = ప్రయత్నించి, కనిరి = చూచిరి. బ్రాహ్మణోత్తమ = బ్రాహ్మణశ్రేష్ఠులయొక్క, పుణ్యపురంధ్రి = ముత్తైదువుల, వర్గ = సమూహముయొక్క, మంగళ = శుభప్రదములైన, అక్షత = అక్షింతలయొక్క, ఆరోపణంబులన్ = చల్లుటను, ఆదరించిరి = స్వీకరించిరి.

తా. దమయంతియును, నలుడును అగ్నికి భక్తితో ప్రదక్షిణలు చేసి పూజలు సల్పిరి. చిఱునగవులతో కొంగులు ముడివేయుటయనెడు వివాహ కార్యక్రమమును ఆచరించిరి. ఆకాశమండలమనెడి సభకు అలంకారమైన ధ్రువుని మెడ ఎత్తి చూచిరి. మూడులోకములందలి పతివ్రతాస్త్రీల నొసళ్ళ తిలకమైన అరుంధతీదేవిని ప్రయత్నముతో చూచిరి. బ్రాహ్మణ శ్రేష్ఠులయొక్క ముత్తైదువుల సమూహముయొక్క శుభప్రదములైన అక్షతలను స్వీకరించిరి.

**102 ఉ. కంకణ నిక్వణంబు మొగకట్టఁగఁ గౌనసియాడ రత్న తా**
**టంక విభూషణంబులు వడంకఁ గుచంబులు రాయిడింపఁగాఁ**
**బంకజనేత్ర గౌతముని పంపున లాజలు దోయిలించి ధూ**
**మాంకునియందు వేల్చె దరహాసము తెప్పలలోన దాఁచుచున్**

పంకజనేత్ర = దమయంతి, కంకణ నిక్వణంబు = గాజుల ధ్వని, మొగకట్టగన్ = మ్రోగుచుండగా, కౌను = నడుము,

అసియాడన్ = కదలుచుండగా, రత్నతాటంకవిభూషణములు = రత్న చెవి అలంకారములు, వడంకన్ = చలించుచుండగా, కుచంబులు = స్తనములు, రాయిడింపగా = ఒరసికొనుచుండగా, లాజలు = పేలాలను, గౌతముని పంపునన్ = పురోహితుని ఆదేశమున, దోయిలించి = దోసిటపట్టి, దరహాసమున్ = చిఱునవ్వును, ఱెప్పలలోనన్ = కనుఱెప్పలలో, దాచుచున్ = దాచుకొనుచు, ధూమాంకునియందున్ = అగ్నియందు, వేల్చెన్ = హోమము చేసెను.

తా. దమయంతి గాజుల ధ్వని మ్రోగుచుండగా, నడుము కదలుచుండగా, రత్నాల చెవి అలంకారములు చలించుచుండగా, స్తనములు ఒరసికొనుచుండగా పేలాలను పురోహితుని ఆనతిచే దోసిటపట్టి చిఱునవ్వు కనుఱెప్పలలో దాచుకొనుచు అగ్నియందు హోమము చేసెను.

**103 సీ. చెక్కుటద్దములపైఁ జెఱలాడునప్పుడు**
**కస్తూరికా పత్రకములఁ బోలె**
**శ్రవణపాశములలోఁ జాఁగి పాఱెడునప్డు**
**లలితతమాల పల్లవముఁ బోలెఁ**
**గలికి కన్నులలోనఁ బొలుపారు నప్పుడు**
**నవలీల నీలాంజనంబుపోలె**
**ఫాలభాగంబుపైఁ బఱతెంచు నప్పుడు**
**కమనీయ చూర్ణాలకములఁబోలె**

**తే. నప్పు డావర్జితాజ్య ధారాభిఘార**
**పరిమిళ ల్లాజ నవశమీ పల్లవాగ్ర**
**హుతహుతాశన జిహ్వా సముత్థమగుచు**
**హోమధూమంబు బాలపై నొయ్యఁ బొలసి**

హోమధూమంబు, ఆవర్జిత = దంపతులచే విడువబడిన, ఆజ్యధార అభిఘార = నేతి ధారల పోతలయందు, పరిమిళత్ = పరిమళించుచున్న, లాజ = పేలాలచే, నవశమీ పల్లవాగ్ర = క్రొత్త జమ్మిచివురులచేత, హుత = హోమముచేయబడిన, హుతాశన జిహ్వా = అగ్నిజ్వాలలవలన, సముత్థము అగుచు = పుట్టినదగుచు, ఒయ్యన్ = క్రమముగా, చెక్కుటద్దములపైన్ = అద్దములవంటి చెక్కిళ్ళపైన, చెఱలాడునప్పుడు = తిరుగునప్పుడు, కస్తూరికా పత్రకములపోలెన్ = మకరికా పత్రముల వలెను, శ్రవణపాశములలోన్ = చెవుల ప్రక్కలనుండి, చాగి = సాగి, పాఱెడునప్డు = పోవునప్పుడు, లలిత తమాల పల్లవముపోలెన్ = అందమైన కానుగు చిగురువలె, కలికి కన్నులలోనన్ = అందమైన కన్నులయందు, పొలుపారు నప్పుడు = ప్రకాశించునప్పుడు, నవలీల లీలాంజనంబుపోలెన్ = క్రొత్త శోభకల నల్లని కాటుకవలె, ఫాలబాగంబుపైన్ = నుదుటిపై, పఱతెంచునప్పుడు = ప్రసరించునప్పుడు, కమనీయ చూర్ణాలకములపోలెన్ = మనోహరమైన ముంగురులవలె, బాలపైన్ = దమయంతిపైన, పొలసి = వ్యాపించి (అలంకారము – ఉత్ప్రేక్ష)

తా. నలదమయంతులచే చేయబడిన నేతి ధారల పోతలయందు పరిమళించుచున్న పేలాలచే క్రొత్త జమ్మి చివురులచే హోమము చేయబడిన అగ్నిజ్వాలలవలన పుట్టినదైన హోమధూమము క్రమముగా చెక్కుటద్దములపై తిరుగునప్పుడు మకరికా పత్రములవలెను, చెవులప్రక్కనుండి సాగిపోవునప్పుడు అందమైన కానుగు చిగురువలెను, అందమైన కన్నులయందు ప్రకాశించునప్పుడు క్రొత్తశోభకలనల్లనికాటుకవలెను, నుదుటిపై ప్రసరించునప్పుడు మనోహరమైన ముంగురుల వలెను దమయంతిపైన వ్యాపించి

**104 ఉ. కాంచన ముద్రికా మణి నికాయ కరాళ వలన్మయూఖ రే**
**ఖాంచల చక్ర చుంబిత నఖాంకురమైన నృపాలు చెట్టఁ బ**
**ట్టించెఁ బ్రమోద సంపద ఘటిల్లఁగ నొక్క పురంధ్రి నవ్య రో**
**మాంచము గ్రొత్త లేఁజెమరు నయ్యిరుగేలను సంభవింపగన్**

ఒక్క పురంధ్రి = ఒక పడతి, ప్రమోద సంపద = సంతోషాతిశయము, ఘటిల్లగన్ = కలుగుచుండగా, ఆ ఇరు కేలన్ = ఆ ఇద్దరి చేతులయందును, నవ్యరోమాంచమును = క్రొత్త గగుర్పాటును, క్రొత్త లే చెమరు = క్రొత్త చిఱుచెమట, సంభవింపగాన్ = పుట్టుచుండగా, కాంచన ముద్రికా = బంగారు ఉంగరములందున్న, మణి నికాయ = మణుల సమూహముయొక్క, కరాళ = దట్టములైన, వలత్ = వ్యాపించుచున్న, మయూఖ రేఖా = కిరణపంక్తుల, అంచల = కొనలయొక్క, చక్ర = వలయముచే, చుంబిత = ముద్దిడబడుచున్న, నఖాంకురమైన = గోళ్ళుకలదైన, నృపాలు చెట్టన్ = నలుని చేతిని, పట్టించెన్ = పట్టుకొనునట్లు చేసెను.

తా. ఒక ముత్తైదువ సంతోషాతిశయము కలుగుచుండగా దంపతుల చేతులయందు క్రొత్త గగుర్పాటును, క్రొత్త చిఱుచెమటయు పుట్టుచుండగా బంగరు ఉంగరములయందున్న రత్నముల దట్టమైన కాంతి వలయముచే ఆక్రమింపబడిన

గోళ్ళుకలదైన దమయంతి చేతిని నలుని చేతిని పట్టుకొనునట్లు చేసెను.

**105 వ. ఇట్లు పాణిగ్రహణం బొనర్చి పురంధ్రీజన విలోకనార్థంబు సహస్ర రంధ్రీకృతంబుగాఁ జేయఁబడిన కౌతుకాగారంబు ప్రవేశించి**

తా. ఈ రీతిగా వివాహము చేసి స్త్రీజనము చూచు నిమిత్తము వేయిరంధ్రములుకలదిగా చేయబడిన వివాహ మందిరము ప్రవేశించి

**106 తే. దశశతాక్షుండు తొడుగు కుందనపుఁ బైఁడి**
**కంకటముఁబోలు వేజాలకముల యింటి**
**మధ్యభాగంబునందు శ్రీమంచమెక్కి**
**రంబుజాక్షియు నిషధదేశాధిపతియు**

అంబుజాక్షియు = దమయంతియును, నిషధదేశాధిపతియు = నలుడును, దశశతాక్షుండు = వేయికనులుకల ఇంద్రుడు, తొడుగు = ధరించు, కుందనపు పైడికంకటమున్ పోలు = మేలిమి బంగారు కవచమునుపోలిన, వేజాలకముల ఇంటి = వేయి కిటికీలుకల మందిరముయొక్క, మధ్యభాగంబునందున్, శ్రీ మంచము ఎక్కిరి = శోభాయుక్తమైన మంచమునెక్కిరి.

తా. దమయంతియును, నలుడును వేయికనులుకల ఇంద్రుడు ధరించు మేలిమిబంగారు కవచమునుపోలిన వేయి కిటికీలుకల మందిరముయొక్క మధ్యభాగమునందు శోభాయుక్తమైన మంచమున ఆసీనులైరి.

**107 వ. అనంతరంబ భోజకులాభరణంబులగు దమ దమను లిరువంకఁ బెండ్లి చుట్టంబులకు భోజనంబులు వెట్టం గట్టడఁ జేసి రప్పుడు**

**108 సీ. పట్టాంశుకములపైఁ బన్నీరు ప్రోక్షించి**
**చేయార్చి చాఁపట్లు చేయువారు**
**మక్కళించిన తావు మంజిళ్ళ పెందెర**
**లుంగరంబులఁబట్టి యొత్తువారు**
**నగరు ధూపముఁబెట్టి యభ్యంతరంబైన**
**గగనావకాశంబుఁ బొరపువారు**
**వెండి యొద్దెనలపై వెలచి తెచ్చిన పైఁడి**
**పళ్ళెంబు లాయత్త పఱుచువారు**
**తే. రంకు మృగరోమ కృత నూత్న రత్నకంబ**
**ళాది నానావిధాభ్యర్చి తాసనములు**
**పెట్టువారునునై రిందుబింబవదన**
**లుభయ బాంధవ భోజనోద్యోగవేళ**

ఉభయ బాంధవ = ఇరువంకల చుట్టములును, భోజన ఉద్యోగవేళన్ = భోజన ప్రయత్న సమయమున, ఇందుబింబ వదనలు = చంద్రబింబమువంటి ముఖముకలస్త్రీలు, పట్టాంశుకములపైన్ = పట్టువస్త్రములమీద, పన్నీరున్ ప్రోక్షించి = పన్నీరును చల్లి, చేయార్చి = చేతితోరాసి తడిపోగొట్టి, చాపట్లు చేయువారు = చాపలువలె చదునుగా ఉండునట్లు చేయువారును, మక్కళించిన = సరిపడు, తావు = ప్రదేశములలో, మంజిళ్ళ = చిత్రవర్ణ వస్త్రముల, పెందెరలు = పెద్ద తెరలు, ఉంగరములన్ పట్టి = ఇనుప రింగులను పట్టుకొని, ఒత్తువారు = పక్కకు తోయువారు, అగరు ధూపమున్, పెట్టి, అభ్యంతరంబైన = మధ్యప్రదేశమైన, గగనావకాశంబున్ = ఖాళీ ప్రదేశమున, పొరపువారు = పొగ వేయువారు, వెలచి తెచ్చిన = తోమి తెచ్చిన, పైడి పళ్ళెంబులు = బంగారు కంచములను, వెండి యొద్దెనలపై = వెండి బల్లలపై, ఆయత్త పఱచువారు = సిద్ధముచేయువారు, రంకుమృగ = ఇఱ్ఱియొక్క, రోమ = వెండ్రుకలచే, కృత = చేయబడిన, నూత్న = క్రొత్తవైన, రత్న కంబళ, ఆది = మొదలైన, నానావిధ, అభ్యర్చిత = పూజనీయములగు, ఆసనములు, పెట్టువారును, ఐరి

తా. ఇరువంకల చుట్టములును భోజనములకు సిద్ధమగు సమయమున చంద్రబింబాననలు పట్టువస్త్రముల మీద పన్నీరు చిలికించి చేతితోరాసి తడి పోగొట్టి చాపలవలె చదునుగా ఉండునట్లు చేయువారును, తగిన ప్రదేశములలో చిత్రవర్ణవస్త్రముల పెద్ద తెరలు కట్టి ఇనుప రింగులను పక్కకుత్రోసి సరిచేయువారును, అగరు ధూపముతో మధ్యనున్న ఖాళీ ప్రదేశమున పొగవేసి పరిమళింపచేయువారును, శుభ్రపరచిన బంగారు కంచములను వెండి బల్లలపై సిద్ధపరచువారును, ఇఱ్ఱియొక్క వెండ్రుకలచే చేయబడిన క్రొత్త రత్నకంబళ్ళను మొదలైన పలువిధములైన పూజనీయ ఆసనములను అమర్చువారును అయ్యిరి.

**109 క. వ్రయ్యవడకుండ నాడిరి**
**వియ్యపు మేలంబు లుభయవిధ బాంధవులున్**

**నెయ్యంబునఁ దియ్యంబున**
**జయ్యనఁ జతురాక్షరాధికోక్తి ప్రౌఢిన్**

ఉభయవిధ బాంధవులున్ = ఇరువంకల బంధువులును, ఒయ్యనన్ = మెల్లగా, నెయ్యంబునన్ = స్నేహభావముతోను, తియ్యంబునన్ = ప్రేమభావముతోను, చతుర అక్షర = నేరిమి మాటలతో, అధిక = గొప్ప, ఉక్తి ప్రౌఢిన్ = మాటల నేర్పరితనముతో, వియ్యపు మేలములు = వియ్యంకులాడుకొనెడు హాస్యోక్తులు, వ్రయ్యవడక ఉండన్ = ఒకరికొకరు తగ్గకుండగా, ఆడిరి = ఆడుకొనిరి.

తా. ఇరువంకల బంధువులును మెల్లగా స్నేహభావముతోను, ప్రేమభావముతోను నేరిమి మాటలతో గొప్ప మాటల నేర్పరితనముతో వియ్యంకులాడుకొను హాస్యోక్తులు ఒకరికొకరు తగ్గకుండగా ఆడుకొనిరి.

**110** సీ. **సర్వతోముఖ పిపాసకుఁ దప్పి పడియెదు**
**కామమోదనము నిక్కముగ వలయు**
**నీ ముఖంబున మాకు నెఱయంగ సుఖమబ్బుఁ**
**గాంచు గావుత నిన్నుఁ గమలయోని**
**యనులోమమున లెస్స పనిచేసి కొంటిప్డు**
**భగవదారాధన ప్రాప్తినిధివి**
**విద్వజ్జనులు నిన్ను విషయించి వత్తురు**
**కలమధురములు నీ గళరవములు**

తే. **అనుచు నెయ్యంపు వియ్యంబు లల్లనల్ల**
**సరస నర్మోక్తి చాతుర్య సౌష్ఠవమున**
**గోష్ఠి సలిపిరి తమలోనఁ గొంత ప్రొద్దు**
**భోజనాగార పర్యంత భూములందు**

సర్వత: ముఖ పిపాస = నీళ్ళు త్రాగాలనుకొని, తప్పి పడియెదు = తప్పి పడిపోతావు, కామమోదనము = నీకిష్టమైన ఆహారము, నిక్కముగ వలయు = నిజంగా కావాలి, నీ ముఖంబునన్ = నీవుండటంవలన, మాకున్, నెఱయంగన్ = బాగుగా, సుఖము అబ్బు = సుఖం కలుగుతుంది. కమలయోని = బ్రహ్మ, నిన్నున్, గాంచు గావుత = రక్షించుగాక, ఇప్డు = ఈ ఉత్సవమునకై, అనులోమమున = వెంద్రుకలను, లెస్స పనిచేసికొంటి = చక్కగా దువ్వుకొంటివి, భగవదారాధన = భగవంతుని సేవకు, ప్రాప్త నిధివి = పట్టయినవాడవు, విద్వజ్జనులు = పండితులు, నిన్ను, విషయించి = వెదకుకొనుచు, వత్తురు = వచ్చెదరు, నీ గళ రవములు = నీ కంఠధ్వని, కలమధురములు = మిక్కిలి మనోహరములు, అనుచు, నెయ్యంపు వియ్యంబులు = తెలిసిన చుట్టములు, అల్లన్ అల్లన్ = మెల్లమెల్లగా, సరస నర్మ ఉక్తిన్ = సరసమైన, పరిహాసమైన మాటల, చాతుర్య సౌష్ఠవమున = చక్కని నేర్పుతో, తమలోనన్ = తమలోతాము, భోజనాగార పర్యంత భూములందు = భోజనశాల ప్రాంత ప్రదేశములందు, కొంత ప్రొద్దు = కొంతసేపు, గోష్ఠి సలిపిరి = సంభాషణలను జరిపిరి.

తా. నీళ్లు త్రాగాలనుకొని పడిపోతావు, నీకిష్టమైన ఆహారమే నీకు కావాలి, నువ్వుండడంవల్లే మాకు సుఖం కలుగుతోంది. బ్రహ్మ దేవుడు నిన్ను రక్షించుగాక, ఇప్పుడ ఈ ఉత్సవంకోసమని బాగానే వెంద్రుకలను దువ్వుకొన్నావు. భగవంతుని సేవకి పట్టయినవాడివి, పండితులు నిన్ను వెదుక్కుంటూ వస్తారు, నీ గొంతు చాలా బాగుంటుంది అంటూ తెలిసిన చుట్టములు మెల్లమెల్లగా తమలోతాము ఆ భోజనశాల ప్రాంత ప్రదేశములందు కొంతసేపు సంభాషణలను జరిపిరి.

**111** చ. **లలన యొకర్తు వగ్గు కృకలాసము చేరఁగఁ దెచ్చి వంచనన్**
**నలునకుఁ గుంచెవట్టు నెలనాగ పదద్వయ మధ్యమంబునన్**
**నిలిపినఁ గాలుప్రాఁక నది నీవియసీమకుఁ దోడిభామినుల్**
**గలకలనవ్వ నూడ్చె నది గట్టినపుట్ట ముపాయశూన్యతన్**

లలన ఒకర్తు = ఒకానొక స్త్రీ, వగ్గు కృకలాసము = చిక్కిన తొండను, చేరగన్ తెచ్చి = చెంతకు తెచ్చి, వంచనన్ = మోసముతో, నలునకున్, కుంచె పట్టు = వింజామర వీచుచున్న, ఎలనాగ = స్త్రీయొక్క, పదద్వయ మధ్యంబునన్ = పాదముల మధ్య, నిలిపినన్ = ఉంచగా, అది = ఆ తొండ, నీవియ సీమకున్ = పోకముడి దాపునకు, కాలు ప్రాకన్ = కాలుమీద ప్రాకగా, అది = ఆ స్త్రీ, తోడిభామినుల్ = తోటి స్త్రీలు, కలకలనవ్వన్, ఉపాయశూన్యతన్ = ఏంచేయాలో తెలియక, కట్టిన పుట్టము = కట్టుకున్న చీరను, ఊడ్చెన్ = విప్పివేసెను.

తా. ఒక స్త్రీ చిక్కిన తొండను తెచ్చి మోసంగా నలునికి వింజామర వీస్తున్న స్త్రీ పాదాలమధ్య ఉంచగా ఆ తొండ ఆమె పోకముడివరకు ప్రాకగా ఆ స్త్రీ తోటి స్త్రీలు కలకలనవ్వుతుండగా ఏంచేయాలో తెలియక కట్టుకున్న చీరను విప్పేసింది.

**112** చ. **అలికులవేణి యొర్తొకని హస్తములన్ ముఖమజ్జనాంబువుల్**
**గలఁతియ నెత్తిపోయ నవి గార్చుచునుండె నతండు దోయిటన్**

**నెలకొని దాని క్రొమ్మెఱుఁగు నిద్దపుఁ జెక్కులు ముద్దువెట్టుకోఁ**
**గెలవుల వారి చూపు గిలిగిళ్ళు మొఱంగఁగ వేళగోరుచున్**

అలికులవేణి = తుమ్మెదలగుంపువంటి జుట్టుకలది, ఒర్తు = ఒక స్త్రీ,, ఒకని హస్తములన్ = ఒకని చేతులలో, ముఖ ప్రక్షాళన అంబువుల్ = ముఖము కడుగుకొనుటకు నీటిని, గలతియన్ = గిండిచెంబుతో, ఎత్తిపోయన్ = ఎత్తి పోయుచుండగా, అతడు = ఆ పురుషుడు, నెలకొని = కుదురుకొని, దాని = ఆ స్త్రీయొక్క, క్రొమ్మెఱుంగు = క్రొత్త మెఱుపుగల, నిద్దపున్ చెక్కులు = తళుకు చెక్కిళ్ళను, ముద్దు పెట్టుకోన్ = ముద్దు పెట్టుకొనుటకై, కెలవులవారి చూపు = ప్రక్కనున్నవారి చూపుల యొక్క, గిలిగిళ్ళు = గిలిగింతలు, మొఱంగగన్ = తప్పించుకొనుటకు, వేళన్ = సమయమును, కోరుచున్ = ఎదురుచూచుచు, దోయిటన్ = దోసిలినుండి, అవి = ఆ నీటిని, కార్చుచునుండెన్ = వదలివేయుచుండెను.

తా. ఒక యువతి మరొకని చేతులలో ముఖము కడుగుకొనుటకు నీటిని చెంబు ఎత్తి పోయుచుండగా ఆ పురుషుడు కుదురుకొని ఆ స్త్రీయొక్క చెక్కిళ్ళను ముద్దుపెట్టుకోవాలని ప్రక్కనున్నవారి చూపుల గిలిగింతలు తప్పించుకోడానికి సమయంకోసం ఎదురుచూస్తూ దోసిలినుండి నీటిని వదలివేయుచుండెను.

**113 ఉ. అవ్వలిదిక్కు మోమయి ప్రియంబున నొందులతోడ ముచ్చటల్**
**ద్రవ్వుచు నొక్క కోమలి పరాకున నుండఁగ ధూర్తుఁ డొక్కరుం**
**డివ్వల వచ్చి వంచనమెయి న్నునుమించు మెఱుంగుటద్దమున్**
**నవ్వుచుఁబెట్టె దాని చరణంబులకు న్నడుమైన మేదినిన్**

ఒక్క కోమలి, అవ్వలి దిక్కు = అటువైపు, మోము అయి = ముఖమునుంచుకొని, ప్రియంబునన్ = ఇష్టముగా, ఒందులతోడ = మరొకరితో, ముచ్చటల్ త్రవ్వుచున్ = ముచ్చటలాడుచు, పరాకునన్, ఉండగన్, ధూర్తుడు ఒక్కరుండు = ఒక మోసగాడు, ఇవ్వల వచ్చి = ఇటువైపుగా వచ్చి, వంచనమెయిన్ = మోసముతో, దాని చరణంబులకున్ = దాని పాదములకు, నడుమైన = మధ్యస్థమైన, మేదినిన్ = భూమియందు, నునుమించు = ప్రకాశించెడు, మెఱుంగు అద్దమున్ = మెరిసే అద్దమును, నవ్వుచున్, పెట్టెన్ = ఉంచెను.

తా. ఒక కాంత అటువైపు ముఖముపెట్టి మరొకరితో ముచ్చటలాడుచు పరాకునయుండగా ఒక మోసగాడు ఇవతలివైపునకు వచ్చి మాయతో దాని పాదములకు మధ్య ప్రదేశమున అద్దమును ఉంచెను.

**114 తే. ఓమె యేమె యిదే మేమె లేమ యేమె**
**మేఘపుష్పంబుఁ దేవంచు మేలమాడ**
**మేమె మేమెలు తఱచయ్యె మేలుమేలు**
**మేఁక మేఁకన సభవారు మిగుల నగిరి**

ఓమె = ఓ బాలా!, ఏమె ఇది ఏమె, ఏమె లేమ = ఓ కాంతా! ఏమె, మేఘపుష్పంబున్ = నీటిని, తేవు అంచున్, మేలము ఆడన్ = వేళాకోళముచేయగా, మేమె మేమెలు తఱచయ్యె = మె అను అక్షరములు ఎక్కువయ్యాయి, మేలు మేలు = మంచిది మంచిది, మేక మేక అనన్, సభవారు = అచటనున్నవారు, మిగుల నగిరి = మిక్కిలి నవ్విరి.

తా. ఓ బాలా! ఏమె ఇది? ఓ కాంతా! ఏమె నీటిని తేవు? అని పరిహాసము చేయగా 'మె' అను అక్షరములు ఎక్కువయ్యాయి బాగుంది బాగుంది 'మేక మేక' అనగా అచటనున్నవారు మిక్కిలి నవ్విరి.

**115 ఉ. లాలనఁ గ్రొత్త బెబ్బులి కళాసము వెట్టిరి యాసనంబుగా**
**గోలయు సాధువైన యొక కోమటికి న్నిషధేంద్రుబచ్చుకున్**
**మేలముమై వడిందమ సమీపపు ధూర్తులు తత్పురస్థలాం**
**గూలత యవ్వణిక్కునకుఁ గోశ విజృంభణ శంక సేయగన్**

నిషధేంద్రుబచ్చుకున్ = నలుని కోశాధికారియును, గోలయు = ముగ్ధుడును, సాధువు ఐన = మంచివాడునయిన, ఒక కోమటికిన్, లాలనన్ = బుజ్జగించుచు, ఆసనంబుగాన్, క్రొత్త బెబ్బులి కళాసము = క్రొత్తదైన పెద్దపులి చర్మమును, మేలము మైన్ = పరిహాసము చేయు, వడిన్ = విధముగా, తమ సమీపపు ధూర్తులు = ఆ కోమటి దగ్గరకూర్చున్న మాయగాళ్ళు, తత్ = ఆ పెద్దపులి చర్మమును, పురస్థ = ముందుభాగముననున్న, లాంగూలతన్ = తోక కలదైయునికి, ఆ వణిక్కునకున్ = ఆ కోమటికి, కోశ విజృంభణ శంకన్ = కోశము విజృంభించినదనెడు భ్రమను, చేయగన్ = కలిగించునట్లుగా, పెట్టిరి = ఉంచిరి.

తా. నలుని కోశాధికారియును, ముగ్ధుడును, మంచివాడునయిన ఒక కోమటిని బుజ్జగించుచు ఆసనముగా వేసిన పెద్దపులి చర్మమును పరిహాసముకొరకు ఆ కోమటి చెంతనున్న మాయగాళ్లు ఆ పెద్దపులి చర్మమును ముందు భాగమున తోకకలదై యునికి ఆ కోమటికి కోశ విజృంభణము భ్రమ కలుగునట్లుగా చేసిరి.

**116 తే. పెడమరలి చూచె నొక చంద్రబింబవదన**
**వేడ్క దళుకొత్త నొక రాజ విటకుమారుఁ**

**బెడమరలి యేసె వాని నప్పుడ మరుండు**
**సానఁబెట్టిన మోహనాస్త్రంబుఁ దొడిగి**

ఒక చంద్రబింబవదన, పెడమరలి = ప్రక్కకు తిరిగి, వేడ్క తళుకొత్తన్, ఒక రాజ విటకుమారున్ = ఒక విటుడైన రాజకుమారుని, చూచెన్, అప్పుడ = అప్పుడే, మరుండు = మన్మథుడు, పెడమరలి = ప్రక్కకు తిరిగి, సానపెట్టిన = పదునైన, మోహనాస్త్రంబు = సమ్మోహనాస్త్రమును, తొడిగి = సంధించి, వానిన్ = ఆ విటుని, ఏసెన్ = కొట్టెను.

తా. ఒక కాంత ప్రక్కకు తిరిగి వేడుక తళుకొత్తగా ఒక విటుడైన రాజకుమారుని చూచెను. ఆ సమయముననే మన్మథుడు అతినివైపు తిరిగి పదునైన సమ్మోహనాస్త్రమును సంధించి ఆ విటునిపై వేసెను.

**117 ఉ. ఇంచిన భక్తి నొక్క తరళేక్షణ నైషధభూమిభర్త మ**
**న్నించు వరూధినీపతికి నేఱుపు మీఱఁగ వట్టివేళ్ళఁ గా**
**వించిన తాళవృంతమున వీచుచునుండెఁ జెమర్చుచుండె నా**
**చంచలనేత్ర క్రొమ్మెఱుఁగుఁ జన్నుల బింకముఁ జూచి యాతఁడున్**

ఒక్క తరళ ఈక్షణ = ఒక చంచలనేత్ర, నైషధభూమిభర్త = నలమహారాజు, మన్నించు = గౌరవించు, వరూధినీపతికి = సేనానికి, నేఱుపు మీఱగన్, వట్టివేళ్ళన్, గావించిన = తయారుచేసిన, తాళవృంతమున = విసనకఱ్ఱతో, వీచుచునుండెన్ = విసరుచుండెను, ఆ చంచలనేత్ర, క్రొమ్మెఱుంగు = క్రొత్త మెఱుపులుకల, చన్నుల బింకమున్ = చన్నుల పటుత్వమును, చూచి, ఆతడున్, చెమర్చుచుండెన్ = చిఱుచెమట పట్టుచుండెను.

తా. ఒక చంచటనేత్ర నలమహారాజు గౌరవించు సేనానికి వట్టివేళ్ళ విసనకఱ్ఱతో విసరుచుండెను.ఆ చంచటనేత్ర క్రొత్త మెఱుపులుకల చన్నుల పటుత్వమును చూచి అతనికిని చిఱుచెమట పట్టుచుండెను.

**118 వ.** **ఇట్లు హస్త పాద ప్రక్షాళన గండూష ముఖ మజ్జనంబు లాచరించి బంధువులు తమ తమ నిర్దిష్టంబు లగు నర్హాసనంబులఁ గూర్చుండి చతుర్విధాహారంబులు భుజియింపం దొణంగి రప్పుడు**

తా. ఈ రీతిగా చేతులు, కాళ్ళు కడుగుకొని, పుక్కిలించి ముఖము కడుగుకొని బంధువులు వారి వారికి నిర్దేశింపబడిన తగిన ఆసనములలో కూర్చుని భక్ష్య భోజ్య చోష్య లేహ్యంబులగు ఆహారములను అప్పుడు భుజించుటకు మొదలిడిరి.

**119 తే. పచ్చ ఱామానికంబుల పళ్ళెరములఁ**
**బచ్చగందని కూర లేర్పడమిఁ జూచి**
**పెట్టరని పెండిపెద్దలు పెడము వెట్టఁ**
**బెట్టుటకు నంగనలకును బట్టెఁ దడవు**

పచ్చఱా మానికంబుల = మరకత మాణిక్యముల, పళ్ళెరములన్ =కంచములలో, పచ్చగందని కూరలు = పసరు రంగు చెడని కూరలు, ఏర్పడమిన్ చూచి = రాకుండుటను చూచి, పెట్టరని = వడ్డించరని, పెండ్లిపెద్దలు, పెడము పెట్టన్ = కోపింపగా, పెట్టుటకు = సరిపెట్టుటకు, అంగనలకున్ = స్త్రీలకు, తడవు పట్టెన్ = సమయము పట్టెను.

తా. మరకత మాణిక్య కంచములలో పసరు రంగు కూరలు రాకుండుటను చూచి పెండ్లిపెద్దలు కోపింపగా సరిపెట్టుటకు స్త్రీలకు సమయము పట్టెను.

**120 మ. నివస ద్బాష్ప మఖండి తాఖిలము నిర్ణిక్తం బసంత్యక్త మా**
**ర్దవ మన్యోన్య మసంగతం బహృత సారస్యంబు గౌరం బగౌ**
**రవ మామోదన మోదనం బమృత పర్యాయంబు సంబంధి బాం**
**ధవ భూపాల సుతుల్ భుజించిరి వయో దర్పానురూపంబుగన్**

సంబంధి బాంధవ భూపాల సుతుల్ = వియ్యాలవారును, బంధువులునైన రాజకుమారులు, వయోదర్ప అనురూపంబుగన్ = యౌవనశక్తికి తగినట్లుగా, నివసత్ బాష్పము = ఆవిరితోచేసినవి, అఖండిత అఖిలము = పగులని నిండు మెదుకులు కలది, నిర్ణిక్తం = కల్మషరహితమైనది, అసంత్యక్త మార్దవము = మృదుత్వ మెడలినిది, అన్యోన్యము అసంగతంబు = ఒక మెదుకుతో మరొక మెదుకు కలిసిపోనిది, అహృత సారస్యంబు = రుచి కోల్పోనిది, గౌరంబు = తెల్లనిది, అగౌరవము = తేలికగా జీర్ణమగునది, ఆమోదనము = ఆహ్లాదమును కలిగించునది, అమృత పర్యాయంబు = అమృతముతో తుల్యమైన, ఓదనము = అన్నమును, భుజించిరి.

తా. వియ్యాలవారును, బంధువులునైన రాజకుమారులు యౌవనశక్తికి తగినట్లుగా ఆవిరితో చేసినవి, పగులని నిండు మెదుకులు కలది, కల్మష రహితమైనది, మృదుత్వమెడలినిది, ఒక మెదుకుతో మరొక మెదుకు కలసిపోనిది, రుచి కోల్పోనిది, తెల్లనిది, తేలికగా జీర్ణమగునది, ఆహ్లాదమును కలిగించునది, అమృతముతో తుల్యమైన అన్నమును భుజించిరి.

**121 సీ. గోధూమ సేవికా గుచ్ఛంబు లల్లార్చి**
**ఖండ శర్కరలతోఁ గలపి కలపి**

**గుజ్జుగాఁ గాఁచిన గోక్షీర పూరంబు**
**జమలి మండెఁగలపైఁ జల్లి చల్లి**
**మిరియంబుతోఁ గూడ మేళవించిన తేనెఁ**
**దోరంపు లడ్వాలు దోఁచి తోఁచి**
**పలుచఁగా వండిన వలిపెంపుఁ జాఁపట్లు**
**పెసరపప్పులతోడఁ బెనఁచి పెనఁచి**
**తే. గోవ జవ్వాదిఁ గస్తూరిఁ గొఱఁత పఱుచు**
**వెన్న పడిదెంబు జొబ్బిల విద్రిచి విద్రిచి**
**వారయాత్రికు లనుమోదవంతు లగుచు**
**వలచి భుజియించి రొగిఁ బిండివంటకములు**

వార యాత్రికులు = వరునితో వచ్చినవారు, అనుమోదవంతులు అగుచు = సంతోషము కలవారగుచు, గోధూమ సేవికా గుచ్ఛంబులు = గోధుమ నూక భక్ష్యము, అల్లార్చి = విడదీసి, ఖండశర్కరలతోన్ = పులకండములతో, కలపి కలపి = చక్కగా మిశ్రముచేసి, గుజ్జుగా = చిక్కగా, కాచిన, గోక్షీర పూరంబు = ఆవుపాల వెల్లిని, జమిలి మండెగలపైన్ = జంట పూరీలమీద, చల్లి చల్లి, మిరియంబుతోన్ కూడ, మేళవించిన = కలిపిన, తేనెన్, తోరంపు లడ్వాలు = లావుపాటి లడ్డుకములను, తోచి తోచి = ముంచి ఊరించి, పలుచగా వండిన, వలిపెంపు జాపట్లు = తెల్లని పలుచని దోసెలను, పెసరపప్పులతోడన్, పెనచి పెనచి = కలపి కలపి, గోవ = మేలయిన, జవ్వాది కస్తూరిన్, కొఱత పఱుచు = మించునట్టి, వెన్న పడిదెంబు = వెన్నతోచేసిన భక్ష్యము, జొబ్బిలన్ = ద్రవము ఉట్టిపడునట్లు, విద్రిచి విద్రిచి = విరిచి విరిచి, వలచి = ఇష్టముగా, ఒగిన్ = క్రమముగా, బిండివంటకములు, భుజియించిరి.

తా. వరునితో వచ్చినవారు సంతోషము కలవారగుచు గోధూమనూకతోచేసిన భక్ష్యమును విడదీసి పులకండములతో కలపి కలపి చిక్కగా కాచిన ఆవుపాల వెల్లిని జంట పూరీలమీద చల్లి చల్లి మిరియాలు కలిపిన తేనెను లావుపాటి లడ్డుకములను ముంచి ఊరించి పలుచగా వండి తెల్లని పలుచని దోసెలను పెసరపప్పులతో కలపి కలపి మేలైన జవ్వాది కస్తూరిలను మించినట్టి వెన్నతో చేసిన భక్ష్యమును ద్రవము ఉట్టిపడునట్లు విరిచి విరిచి ఇష్టముగా వరుసగా భుజించిరి.

**122 చ. తరుణులు చంచలాలతలు తత్కరభాండ నికాయ మంబుదో**
**త్కరములు పాలుఁ దేనెలు ఘృతంబులు వాన లఖండ ఖండశ**
**ర్కరలును ద్రాక్షపండ్లు వడగండ్లును శోభన భుక్తి వేళ దొ**
**ల్కరి సమయంబు పేరెలమి గైకొనకుండునె భోక్తృసస్యముల్**

తరుణులు = యువతులు, చంచలా లతలు = మెఱుపు తీగెలు, తత్ = వారియొక్క, కరభాండ నికాయము = చేతులలోని పాత్రలు, అంబుద ఉత్కరములు = మేఘముల గుంపులు, పాలు తేనెలు, ఘృతంబులు = నేతులు, వానలు = వర్షములు, అఖండ ఖండ శర్కరలును = ముక్కలుకాని కండచక్కెరలును, ద్రాక్షపండ్లు, వడగండ్లును, శోభన భుక్తివేళ = వివాహ భోజనవేళ, తొల్కరి సమయంబు = వర్షారంభకాలమున, భోక్తృసస్యముల్ = భుజించువారనెడి పైరులు, పేరెలమిన్ = గొప్ప సంతోషమును, కైకొనకుండునె = స్వీకరింపకుండునా? (అలంకారము – రూపకము)

తా. యువతులు మెఱుపుతీగలు, వారి చేతులలోని పాత్రలు మేఘసమూహము, పాలు, తేనెలు, నేతులు వానలు, కండచక్కెరలు ద్రాక్షపండ్లు వడగండ్లు కాగా వివాహ భోజనవేళ తొలకరి సమయమున భుజించువారనెడి పైరులు గొప్ప సంతోషమును పొందకుండునా?

**123 క. అరుదుగ నపు డొక్కొకయెడ**
**మరకత మణిపాత్ర గగనమండలమయ్యెన్**
**జిరువడముల పాసెము శశ**
**ధరుఁడయ్యెం జుక్కలయ్యె ద్రాక్షఫలంబుల్**

అపుడు = ఆ భోజన సమయమున, అరుదుగన్ = ఆశ్చర్యకరముగా, ఒక్కొకయెడన్ = ఒక్కొకచోట, మరకతమణి పాత్ర, గగనమండలము ఆయ్యెన్ = అంతరిక్షమయ్యెను, చిరువడముల పాసెము = చిన్ని పాత్రలలోని పాయసము, శశధరుండు ఆయ్యెన్ = చంద్రుడయ్యెను, ద్రాక్షఫలంబుల్, చుక్కలు ఆయ్యెన్.

తా. ఆ భోజన సమయమున ఆశ్చర్యకరముగా ఒక్కొకచోట మరకతమణి పాత్ర అంతరిక్షమయ్యెను. చిన్ని పాత్రలలోని పాయసము చంద్రుడయ్యెను. ద్రాక్షపండ్లు చుక్కలయ్యెను.

**124 సీ. అమృతరసోపమంబైన కమ్మనియాన**
**వాల పాయసము జంబాలమయ్యె**

గరుడపచ్చల చాయగల పచ్చ గందని
కూరలు శైవలాంకురము లయ్యె
మంచులప్పల మించు మండెంగ మడుపులు
పొరలి తెట్టువగట్టు నురువులయ్యె
గప్పురంబుల యొప్పుఁ దప్పు వట్టఁగఁ జాలు
ఖండశర్కరలు సైకతములయ్యె
తే. నొలుపుఁ బప్పుల తీరంబు లురలఁ బడగఁ
బూరియలు లడ్డువంబులు పొరలి పాఱ
విమల శాల్యోదనంబుపై వెల్లిసూపు
నాజ్యధారా ప్రవాహ సాహస్రమునకు

విమలశాల్యోదనంబుపైన్ = స్వచ్ఛమైన వరియన్నముపై, వెల్లి చూపు = ప్రవహించు, ఆజ్యధారా = నేతిధారలయొక్క ప్రవాహ సాహస్రమునకు = ప్రవాహ సమూహములకు, ఒలుపు పప్పుల తీరంబులు = చాయపప్పులను ఒడ్లు, ఉరల పడగన్ = దాటిపోవగా, బూరియలు లడ్డువంబులు = బూరెలు, లడ్డూలు, పొరలి పాఱ = దొర్లిపోవుచుండగా, అమృత రసోపమంబైన = అమృతమునకు సాటివచ్చునదైన, కమ్మని = మధురమైన, ఆనవాల పాయసము = ఇగుర గాచిన పాలతో చేయబడిన పాయసము, జంబాల మయ్యెన్ = బురదయయ్యెను. గరుడపచ్చలచాయకల = మరకతముల కాంతికల, పచ్చ కందని కూరలు = పసరుచెడని కూరలు, శైవల అంకురములు అయ్యెన్ = నాచుతీగలైనవి, మంచులప్పలన్ = మంచు కుప్పలను, మించు = అతిక్రమించు, మండెంగ మడుపులు = తెల్లని పూరీల మడతలు, పొరలి = పొర్లిపోయి, తెట్టువ కట్టు నురువులు ఆయ్యెన్ = తెట్టుకట్టిన నురుగు లయ్యెను, కప్పురంబుల ఒప్పున్ = కర్పూరముయొక్క అందమును, తప్పు పట్టగన్ చాలు = తిరస్కరింపజాలిన, ఖండశర్కరలు = కండ చక్కెరలు, సైకతములు ఆయ్యెన్ = ఇసుకతిన్నెలయ్యెను. (అలంకారము-రూపకము)

తా. స్వచ్ఛమైన వరియన్నముపై ప్రవహించు నేటిధారలయొక్క ప్రవాహములకు చాయపప్పులను ఒడ్లను దాటిపోయెను, బూరెలు లడ్డూలు దొర్లిపోయెను., అమృతమువంటి మధురమైన ఇగుర గాచిన పాలతో చేయబడిన పాయసము బురదయయ్యెను. మరకతకాంతికల పసరు చెడని కూరలు నాచుతీగలైనవి. మంచుకుప్పలను మించు తెల్లని పూరీల మడతలు పొర్లిపోయి తెట్టుకట్టిన నురుగులయ్యెను. కర్పూరముయొక్క తెల్లదనమును మించు కండచక్కెరలు ఇసుక తిన్నెలయ్యెను.

125 ఉ. ఆదరణంబుతో నభినవాజ్య విపాండుర ఖండశర్కరా
క్షోద సమన్వితంబుగ విశుద్ధ హిరణ్మయ భాజనంబులం
బైదలు లర్థిమై నిడఁగ బంధుజనుల్ భుజియించి రన్న పూ
ర్ణాదరహాస చంద్రకిరణంబులఁ బోలిన పాయసాన్నముల్

విశుద్ధ = స్వచ్ఛమైన, హిరణ్మయ భాజనంబులన్ = బంగారు కంచములందు, పైదలులు = స్త్రీలు, అర్థిమైన్ = ప్రీతితో, ఆదరణంబుతోన్, ఇడగన్ = వడ్డించగా, అభినవ = క్రొత్తదైన, ఆజ్య = నేతితోను, విపాండుర = మిక్కిలి తెల్లనైన, ఖండశర్కర అక్షోద = కండచక్కెర పొడితోను, సమన్వితంబుగన్ = కూడియుండగా, అన్నపూర్ణా, దరహాస చంద్ర కిరణంబులన్ = చిఱునవ్వు వెన్నెలలను, పోలిన, పాయస అన్నముల్, బంధుజనుల్, భుజియించిరి.

తా. స్వచ్ఛమైన బంగారు కంచములయందు స్త్రీలు ప్రీతితో, ఆదరముతో వడ్డించగా నేతితోను, కండ చక్కెర పొడితో కూడినట్టి అన్నపూర్ణాదేవియొక్క చిఱునవ్వు వెన్నెలలను పోలిన పాయసమును, అన్నములను బంధుజనులు భుజించిరి.

126 తే. ఆరగించి రసాధారణానురక్తి
వారయాత్రికులగు పెద్దవరుసవారు
దివుట శశిలాంఛన క్రవ్యతేమనంబు
నసమశర కేతన వ్యంజనామృతంబు

వారయాత్రికులగు = మగపెళ్లివారైన, పెద్దవరుసవారు = పెండ్లి పెద్దలు, తివుటన్ = కోరికతో, శశిలాంఛన = చంద్రుని చిహ్నమైన కుందేలుయొక్క క్రవ్య = మాంసముతోచేయబడిన, తేమనంబు = మజ్జిగపులుసును, అసమశర = మన్మథునికి, అసమశర కేతన = మన్మథుని ధ్వజమైన మత్స్యముచే చేయబడిన, వ్యంజన అమృతంబు = అమృతమువంటి కూరను, అసాధారణ = అధికమైన, అనురక్తిన్ = ఇష్టముతో, ఆరగించిరి = భుజించిరి.

తా. మగపెళ్లివారైన పెండ్లిపెద్దలు కోరికతో చంద్రుని చిహ్నమైన కుందేలు మాంసముతో చేయబడిన మజ్జిగపులుసును, మన్మథునికి ధ్వజమైన మత్స్యముతో చేయబడిన అమృతమువంటి కూరను మిక్కిలి ప్రీతితో భుజించిరి.

127 క. సేవించి రొకటిఁ దొలఁగం

**ద్రోవక జంబీరరసముతో నూనియతో**
**నావం బెట్టిన కిటి ము**
**ద్రావలయముల యతి మధుర రసఖండంబుల్**

జంబీర రసముతోన్ = నిమ్మరసముతో, నూనియతో, ఆవన్ = ఆవరసముతో, పెట్టిన, కిటి = అడవిపందులయొక్క, ముద్రావలయముల = గుండ్రములైన ముక్కలయొక్క, అతి మధుర = మిక్కిలి కమ్మదనముకల, రస = రుచిగల, ఖండముల్ = తునియలవంటివానిని, ఒకటిన్ = ఒక ముక్కను, తొలగన్ ద్రోవక = విడిచిపెట్టకుండా, సేవించిరి = భుజించిరి.

తా. నిమ్మరసముతోను, నూనెతోను, ఆవరసముతోను పెట్టిన అడవిపందులయొక్క గుండ్రములైన ముక్కలయొక్క కమ్మదనముకల, రుచికల తునియలవంటివానిని ఒక ముక్కను విడిచిపెట్టకుండా భుజించిరి.

**128 క. ఆమిష మనామిషముగ న**
**నామిష మామిషముగాఁ గుహక మార్గ కళా**
**సామర్థ్యంబునఁ జేసిన**
**తేమనములు మనములం బ్రతిష్ఠించె రుచుల్**

కుహకమార్గ = వంచనా మార్గమందలి, కళా సామర్థ్యంబునన్ = నేర్పరి శక్తిచే, ఆమిషమున్ = మాంసమును, అనామిషముగ = మాంసముకానిదానినిగను, అనామిషమున్ = మాంసముకానిదానిని, ఆమిషముగాన్ = మాంసముగాను, చేసిన = వండిన, తేమనములు = మజ్జిగ పులుసులు, రుచుల్ = రుచులు, మనములన్, ప్రతిష్ఠించెన్ = నింపెను.

తా. కపటమందలి నేర్పుకల శక్తిచే మాంసమును మాంసము కానిదానినిగను, మాంసముకానిదానిని మాంసముగను వండిన మజ్జిగపులుసులు రుచులు మనసులందు నిలిచిపోయెను.

**129 చ. అసమ సుధారస హ్రదమునందలి రొంపులనంగ మంచునం**
**బిసికిన పంచదారలనఁ బేరిన మీఁగడతో మనంబులన్**
**బసిగొనఁ జేయు వాహరిపు బష్కయణీ దధిపిండ ఖండముల్**
**మెసగిరి కంఠదఘ్నముగ మిక్కిలి వేడుక వారయాత్రికుల్**

వారయాత్రికులు = పెండ్లివారు, మిక్కిలి వేడుకన్, అసమ = సాటిలేని, సుధారస హ్రదమునందలి = అమృత మడుగునందలి, రొంపులు అనంగన్ = బురదలు అనునట్టుగా, మంచునన్ = చల్లని నీటితో, పిసికిన పంచదారలనన్, పేరిన మీగడతోన్, మనంబులన్, పసికొనచేయు = ఆకర్షించు, వాహరిపు బష్కయణీ = తఱపి బఱ్ఱెలయొక్క, దధిపిండ = గడ్డ పెరుగుయొక్క, ఖండముల్ = ముక్కలను, కంఠదఘ్నముగ = పీకలవరకు, మెసగిరి = తినిరి.

తా. పెండ్లివారు మిక్కిలి వేడుకతో సాటిలేని అమృతసరోవరమునందలి బురదలు అనునట్టుగా, చల్లని నీటితో పిసికిన పంచదారలనగా, పేరిన మీగడతో మనముల నాకర్షించు తఱపి బఱ్ఱెల గడ్డపెరుగు ముక్కలను పీకలవరకు భుజించిరి.

**130 తే. మిసిమిగల పుల్లపెరుఁగుతో మిళితమైన**
**యావ పచ్చళ్ళ చవి చూచి రాదరమునఁ**
**జుఱ్ఱుమని మూర్ధములు దాఁకి యెఱ్ఱఁదనముఁ**
**బొగలు వెడలింప నాసికాపుటములందు**

మిసిమిగల పుల్లపెరుగుతోన్ = వెన్న కలిగిన పుల్లని పెరుగుతో, మిళితమైన = కలిపిన, యావ పచ్చళ్ళు, చుఱ్ఱుమని, మూర్ధములు = నెత్తికి, తాకి, నాసికా పుటములందు, ఎఱ్ఱదనమున్ , పొగలున్, వెడలింపన్ = బయల్పరచుచుండగా, ఆదరమున = ప్రీతితో, చవి చూచిరి = రుచి చూచిరి,

తా. వెన్న కలిగిన పుల్లని పెరుగుతో కలిసిన యావపచ్చళ్ళు చుఱ్ఱుమని నెత్తికి తాకి ముక్కు రంధ్రములందు ఎఱ్ఱదనమును, పొగలును వెడలగ్రక్కుచుండగా ప్రీతితో రుచి చూచిరి.

**131 చ. అవికయుఁ బట్టుపుట్టము చెఱంగు మఱుంగయి యున్కిఁ జేసి గౌ**
**రవ పరిమాణముం దెలియరామికి ముచ్చి రుచున్న యొక్క ప**
**ల్లవునకుఁ జూపె నొక్కతె విలాసముతోఁ దన తోరపుం జనుం**
**గవ పొడవింత పొమ్మనిన కైవడిఁ బానక హేమకుంభమున్**

ఒక్కతె = ఒక స్త్రీ, అవికయు, పట్టుపుట్టము చెఱంగున్ = పట్టువస్త్రము కొంగును, మఱుంగయి యున్కిన్ = చాటుగా నుండుటచేత, గౌరవ పరిమాణమున్ = గొప్పతనపు కొలతను, తెలియ రామికిన్ = తెలిసికొనలేకపోవుటకు, ముచ్చిరుచున్న ఒక్క పల్లవునకున్ = దు:ఖించుచున్న ఒక విటునకు, విలాసముతోన్ = లీలతో, తన = తనయొక్క, తోరపు చనుగవ పొడవు = గొప్ప స్తనద్వయముయొక్క కొలత, ఇంత పొమ్ము = ఇంత పో అని, అనిన కైవడిన్ = అన్న విధముగా, పానక హేమ

కుంభమున్ = పానకముతోనున్న బంగారు కలశమును, చూపెన్. (అలంకారము – ఉత్ప్రేక్ష)

తా. ఒక స్త్రీ అవికయు, పట్టు వస్త్రముకొంగును దాచుటచే ఆమె స్తనముల ఔన్నత్యమును తెలుసుకొనలేకపోతినని దు:ఖించుచున్న విటునకు లీలగా తన స్తనముల గొప్పతనము ఇంత పో అని అన్న విధముగా పానకముతోనున్న బంగారు కలశమును చూపెను.

**132 ఉ. ఎట్టి వినీతుఁడో యొకరు డేణవిలోచన బంతి వెంట మా**
**ర్వెట్టఁగ దాని వక్త్ర శశిబింబముఁ జూడగ నోడి తాల్మిమై**
**బట్టము గట్టెఁ దచ్చరణ పద్మ యుగాంతర చంద్రమశ్శిలా**
**కుట్టిమ భూమి భాగమునకుం దన మంజుల దృష్టిపాతమున్**

ఒకరుడు = ఒకడు, ఏణ విలోచన = లేడి కన్నులవంటి కన్నులుకల స్త్రీ, బంతి వెంటన్ = తింటున్నవారి వరుసలో, మాఱువెట్టగాన్ = మాఱు వడ్డిస్తుండగా, దాని వక్త్ర శశిబింబమున్ = దాని ముఖచంద్రుని, చూడగన్ = చూచుటకు, ఓడి = భయపడి, తాలిమిమైన్ = ఓర్పుతో, తత్ = దానియొక్క, చరణ పద్మ యుగ = పాదపద్మముల జంటయొక్క, అంతర = మధ్యనున్న, చంద్రమశ్శిలాకుట్టిమ = చంద్రకాంతమణిమయకట్టడపు, భూమి భాగమునకుం = నేలకు, తన, మంజుల = సుందరమైన, దృష్టిపాతమున్ = చూపును, పట్టము కట్టెన్ = లగ్నము చేసెను. ఎట్టి వినీతుడో = ఎంతటి నీతిమంతుడోకదా!

తా. ఒకడు ఒక స్త్రీ తింటున్న వరుసలో మాఱు వడ్డిస్తుండగా దాని ముఖచంద్రుని చూచుటకు బెదరి ఓర్పుతో దాని పాదపద్మముల మధ్యనున్న చంద్రకాంతశిలా కట్టడమైన నేలయందు తన చూపును లగ్నము చేసెను. ఎంత నీతిమంతుడోకదా!

**133 చ. ఒసపరి జాణఁడొక్కఁ డొక యుగ్మలి చేరువ మాఱువెట్టగా**
**బసని కురంగికాపలల ఫాలి నిజాధర పల్లవంబుపైఁ**
**బసిగొని చేరఁబట్టి మునిపందుల నొయ్యన నప్పళింపఁగా**
**ముసిముసి నవ్వు నవ్వెలఁది మోమొక యించుక యోరసేయుచున్**

ఒసపరి జాణడు = సుందరుడైన విటుడు, ఒకడు, ఒక యుగ్మలి = ఒక స్త్రీ, చేరువన్ = చెంతను, మాఱువెట్టగాన్ = మాఱు వడ్డించుచుండగా, బసని కురంగికా పలలఫాలిన్ = ఎఱ్ఱని లేడిమాంసపు ముక్కను, నిజాధర పల్లవంబుపైన్ = తన చిగురువంటి అధరోష్ఠముపై, చేరన్ పట్టి = చేరునట్లుగా పట్టుకొని, పసిగొని = వాసననుబట్టి, మునిపందులన్ = పంటి కొనలతో, ఒయ్యనన్ = మెల్లగా, అప్పళింపగాన్ = నొక్కుచుండగా, ఆ వెలది = ఆ భామ, మోము = ముఖమును, ఒక యించుక = కొంచెము, ఓరచేయుచున్ = ప్రక్కకు త్రిప్పుచు, ముసిముసినవ్వు నవ్వెన్.

తా. సుందరుడైన ఒక విటుడు ఒక స్త్రీ చేరి మాఱు వడ్డించుచుండగా ఎఱ్ఱని లేడిమాంసపు ముక్కను తన పెదవులలో చేరునట్లుగా పట్టుకొని వాసనుబట్టి పంటికొనలతో మెల్లగా నొక్కుచుండగా ఆ భామ ముఖమును ప్రక్కకు త్రిప్పుకొని ముసిముసిగా నవ్వెను.

**134 క. చలివాలు నవ్వు లడ్డువ**
**ములు చన్నులు పనసతొనలు మోవులు మండెం**
**గలు చీరలుగ భుజిక్రియ**
**వలపించెన్ బెండ్లివారి వనితయుబోలెన్**

భుజిక్రియ = భోజనక్రియ, చలివాలు = తెల్లనిపాలు, నవ్వు, లడ్డువములు = లడ్డూలు, చన్నులు, పనసతొనలు, మోవులు = పెదవులు, మండెంగలు = పూరీలు, చీరలుగ = వస్త్రములుగ, వనితయు పోలెన్ = స్త్రీవలె, పెండ్లివారిన్, వలపించెన్ = సంతోషింపచేసెను. (అలంకారము – రూపకము)

తా. భోజనక్రియలో తెల్లనిపాలు నవ్వుగాను, లడ్డూలు చన్నులుగాను, పనసతొనలు పెదవులుగాను, పూరీలు మడతలుగాను పెండ్లివారిని అతివవలె ఆనందపరిచెను.

**135 తే. పద్మ కోశాభినయ హస్త పల్లవంబు**
**చూపె నొక మచ్చెకంటికి సొబగుఁ డొక్కఁ**
**డంత యోగిర మడిగెనో యంతలేసి**
**కొమరు పాలిండ్ల నడిగెనో రమణి నతఁడు**

సొబగుడు ఒక్కడు = ఒక సొగసుకాడు, ఒక మచ్చెకంటికిన్ = ఒక మీన నేత్రకు, పద్మకోశ = తామరమొగ్గను, అభినయ = సూచించు, హస్త పల్లవంబున్ = చిగురువంటి చేతిని, చూపెన్, అతడు, అంత ఓగిరము = అంత అన్నమును, అడిగెనో = అడిగేడో, కొమరు పాలిండ్లన్ = వయసు స్తనములను, అడిగెనో= అడిగేడో? (అలంకారము – సందేహము)

తా. ఒక సొగసుకాడు ఒక మీననేత్రను తామరమొగ్గను సూచించుచూ తన చేతిని చూపెను. అతడు అంత అన్నమును

అడిగేడో? ఆ స్త్రీ వయసు పాలిడ్డ నడిగేడో? తెలియదు.

**136 తే. చూచె నొకఁడు వయోవశస్తోక వికచ**
**కుచ సమున్మేషయగు నొక్క కువలయాక్షి**
**నుభయ దోర్మూల కూలంకషోరు కఠిన**
**లలిత వక్షోజ సరిలేమ లజ్జఁబొంద**

ఒకడు, వయోవశ = వయసు ప్రభావమున, స్తోక వికచ = కొంచెముగా వికసించిన, కుచ సమున్మేషయగు = స్తనముల కాంతికలదైన, ఒక్క కువలయాక్షిన్ = ఒక కలువకంటిని, ఉభయ = రెండైన, దోర్మూల = భుజమూలములయొక్క, కూలంకష = తటముల నొరయుచున్న, ఉరు = గొప్పవగు, కఠిన = గట్టివగు, లలిత = సుందరమైన, వక్షోజ సరిలేమ = స్తనములుకల స్త్రీ, లజ్జన్ = సిగ్గును, పొందన్ చూచెన్ = పొందునట్లుగా చూచెను.

తా. ఒకడు యౌవనారంభకాలమున కొంచెము వచ్చుచున్న స్తనముల కాంతికలదైన ఒక కలువకంటిని రెండైన భుజమూలముల తటముల నొరయుచున్న గొప్పవైన, గట్టివైన, సుందరమైన స్తనములుకలదానిని సిగ్గుపడునట్లుగా చూచెను.

**137 తే. ఉష్ణ శీతాన్న కబళంబు లొకఁడు సూపఁ**
**బవలొ రాత్రియొ గెడఁగూడ నవసరమని**
**దాని కుత్తర మొక లతాతన్వి యిచ్చె**
**నధర బింబంబు విఱిచి సంధ్యాగమమని**

ఒకడు = ఒక రసికుడు, గెడగూడన్ = కలియుటకు, అవసరము = సమయము, పవలొ రాత్రియొ అని, ఉష్ణ శీతాన్న కబళంబులు = వెచ్చని చల్లని ముద్దలను, చూపన్, దానికిన్, ఒక లతాతన్వి = ఒక తీగవంటి శరీరముకల స్త్రీ, సంధ్యాగమమని = సంధ్యాకాలమని, అధరోష్ఠమును విఱిచి = పెదవి విరిచి, ఉత్తరము ఇచ్చెన్ = బదులిచ్చెను.

తా. ఒక రసికుడు కలియుటకు పగలా రాత్రియా సమయము అని వెచ్చని చల్లని ముద్దలను చూపగా ఆ స్త్రీ సంధాకాలమని పెదవి విరిచి బదులిచ్చెను.(అలంకారము – సూక్ష్మము)

**138 ఉ. నానదొఱంగి చుంబన మొనర్చుటె కాదొకఁ డొక్క చంద్ర బిం**
**బానన మోముచంద్రుఁ జషకాంతర బింబితునిం బునఃపునః**
**పానక పానకర్మము నెపంబునఁ జేసిఁ దదోష్ఠపల్లవం**
**బానుచు నాచరించెను సమంచిత సీత్కృత చూత్కృతంబులన్**

ఒకడు, నాన = సిగ్గును, తొఱంగి = విడిచి, చషకాంతర బింబితునిన్ = త్రాగునీటి పాత్రయందు ప్రతిబింబించిన, ఒక్క చంద్రబింబానన మోము చంద్రున్ = ఒక స్త్రీ ముఖచంద్రుని, చుంబనము ఒనర్చుటె = ముద్దుపెట్టుకొనుటయే, కాదు = కాదని పున:పున: = మాటిమాటికిని, పానక = పంచదార పానకమును, పానకర్మ = త్రావుటయనెడి, నెపంబునన్ చేసి = మిషచే, తత్ ఓష్ఠ పల్లవంబు = ఆ ప్రతిబింబముయొక్క చివురువంటి పెదవిని, ఆనుచున్ = నొక్కుచు, సీత్కృత చూత్కృతంబులన్ = సీత్కారము చూత్కారములను, ఆచరించెను.(అలంకారము – అపహ్నవము)

తా. ఒకడు సిగ్గు విడిచి త్రాగునీటిపాత్రయందు ప్రతిబింబించిన ఒక స్త్రీ ముఖచంద్రుని ముద్దుపెట్టుకొనుటయే చాలదని మాటిమాటికిని పంచదార పానకమును త్రావుటయనెడి మిషచే ఆ ప్రతిబింబముయొక్క చివురువంటి పెదవిని నొక్కుచు సీత్కారమును చూత్కారమును చేసెను.

**139 ఆ. పంచదారఁ బొరపి భక్షింపఁగా నెత్త**
**భావదుష్టమనుచు బావ నగిన**
**దొలఁగఁబెట్టె రోష కిలికించితంబుతో**
**గొమ్మ నరఁటిపండ్లు గూర్మి మఱఁది**

కూర్మి మఱది = ముద్దుల మరదియొకడు, కొమ్ము అనన్ = తీసుకొమ్మనగా, అరటిపండ్లు, పంచదారన్, పొరపి = కలిపి, భక్షింపన్ = తినుటకు, ఎత్తన్ = సిద్ధపడుచుండగా, భావ దుష్టము = చెప్పదగని వస్తువువలెనున్నదని, అనుచున్ = అంటూ, బావ నగిన = బావ నవ్వగా, కిలికించితంబుతోన్ = ఉడుకుమోత్తనముతో, తొలంగ పెట్టెన్ = తినుటమానివేసెను.

తా. ఒక ముద్దుల మరిది ఆ స్త్రీ తీసుకొమ్మంటే అరటిపండ్లు పంచదారతో కలిపి తినడానికి సిద్ధపడుచుండగా అది చెప్పదగని వస్తువువలె నున్నదని అంటూ బావ నవ్వగా ఉడుకుమోత్తనంతో తినుటమానివేసెను.

**140 వ. ఇవ్విధంబున శుచియు, మృష్టంబును, బథ్యంబునునగు భోజనంబు సేసి పెండ్లి దొరలును సుగంధోదకంబులం జేతులు దొడసి వార్చి ముఖ వాసనంబు గైకొని కర్పూర తాంబూలంబులు పరిగ్రహించి దమదమనుల ప్రియోక్తులకు హర్షించుచు నిజనివాసంబుల కరిగి రప్పుడు**

తా. ఈ రీతిగా శుభ్రమైనదియు, మృదువైనదియు, హితమైనదియునైన భోజనము చేసి పెండ్లి పెద్దలును పరిమళోదకములచే చేతులు కడిగికొని నోటికి పరిమళము కొరకు కర్పూర తాంబూలములు స్వీకరించి దమ, దమనుల ప్రియోక్తులకు ఆనందించుచు తమతమ నివాసములకు అరిగిరి. అప్పుడు

**141 చ. కలికి వరాటరా జపుడు గప్పుర వీడెము పెట్టె నవ్వుచున్**
**నలునడపంబు వానికి ఫణాధరవల్లిద ళాంతరంబునన్**
**బలితపుఁ దేలు మైనమునఁ బన్ని యతండది చూచి భీతిఁద**
**మ్ములమిలవైచిన న్నగిరి మూఁగిన రాజకుమారులందఱున్**

కలికి వరాటరాజు = వరాట యువరాజు (దముడు), అపుడు = ఆ తాంబూలము లిచ్చునపుడు, ఫణాధరవల్లిదళ = తములపాకులయొక్క, అంతరంబునన్ = మధ్యయందు, మైనమునన్ = మైనముతో, బలితపు తేలున్ = పెద్ద తేలును, పన్ని = ఉంచి, నలు నడపంబువానికిన్ = నలునకు తాంబూలమిచ్చు భృత్యునకు, నవ్వుచున్ = చిఱునవ్వుతో, కప్పుర వీడెము =కర్పూర తాంబూలమును, పెట్టెన్ = చేతిలోపెట్టెను. అతడు = ఆ భృత్యుడు, అది చూచి = ఆ తేలును చూచి, భీతిన్ = భయముతో, తమ్ములమున్ = తాంబూలమును, ఇలన్ వైచిన = నేలపై పారవేయగా, మూగిన రాజకుమారులందరున్, నగిరి = నవ్విరి.

తా. దముడు తాంబూలములిచ్చునపుడు తములపాకుల మధ్య మైనంతో చేసిన తేలును ఉంచి నలునకు తాంబూలమిచ్చు సేవకునకు కర్పూర తాంబూలమును చేతిలో పెట్టగా ఆ సేవకుడు అందు ఆ తేలును చూచి భయంతో ఆ తాంబూలమును పారవేయగా అక్కడ చేరిన రాజకుమారులందరును నవ్వసాగిరి.

**142 మ. మృదుమృష్టాన్నము లీప్రకారమున నెమ్మిన్వారు ముప్పొద్దు గొ**
**న్ని దినంబు ల్భుజియించుచుండిరి సమున్నిద్రానురాగంబుతోఁ**
**బదియాతేడుల పువ్వుఁబోండ్ల నునుపుం బాలిండ్ల కాఠిన్య సం**
**పదతో రాత్రులు మల్లు సాము మదనోన్మాదంబునం జేయుచున్**

వారు = పెండ్లివారు, రాత్రులు = రాత్రులందు, సమున్నిద్రానురాగంబుతోన్ = అత్యంత ప్రీతితో, మదనోన్మాదంబునన్ = మన్మథ వికారముతో, పదియాతేడుల పువ్వుబోండ్ల, నునుపుం పాలిండ్ల = నున్నని స్తనముల, కాఠిన్యసమృద్ధితోన్ = కఠినత్వ సమృద్ధితో, మల్లసాము = మల్లయుద్ధమును, చేయుచున్, ఈ ప్రకారమున = ఈ రీతిగా, ముప్పొద్దు = మూడు పూటలును, నెమ్మిన్ = ప్రీతితో, మృదుమృష్టాన్నములు = మృదువైన విందులను, కొన్ని దినంబులు, భుజియించుచుండిరి.

తా. పెళ్ళివారు రాత్రులందు మిక్కిలి ప్రీతితో, మన్మథ వికారముతో పదియారేండ్ల స్త్రీల నున్నని స్తనముల కఠినత్వముతో మల్లయుద్ధము చేయుచు, ఈ రీతిగా మూడు పూటలును ప్రీతితో విందులు కొన్ని దినములు భుజించుచుండిరి.

**143 వ. నిషధ మహీవల్లభుండును దమయంతీ పరిణయ మహోత్సవం బివ్విధంబున ననుభవించి దివస చతుష్టయానంతరమున**

తా. నలుడును దమయంతీ వివాహ మహోత్సవమును ఈ విధముగా అనుభవించి నాలుగు రోజులు తరువాత

**144 శా. నారీచిత్త సరోమరాళ నయ చాణక్యా విరించ్యన్వయ**
**క్షీరాంభోధి సుధామయూఖ కవితా సిద్ధాంత సర్వజ్ఞ జం**
**భారాతి ద్విపహస్తకాండ నిభ బాహాఖడ్గధారాపయో**
**ధారా శాంత విరోధి భూధవ మహోదగ్ర ప్రతాపానలా!**

నారీ = స్త్రీలయొక్క, చిత్త = మనస్సనెడి, సర: = సరస్సునకు, మరాళ = హంసవంటివాడా!, నయ = నీతియందు, చాణక్యా = చాణక్యునివంటివాడా!, విరించి అన్వయ = బ్రహ్మవంశమనెడి, క్షీరాంభోధి = పాలసంద్రమునకు, సుధామయూఖా = చంద్రునివంటివాడా!, కవితా = కవిత్వమందలి, సిద్ధాంత = సిద్ధాంతములను, సర్వజ్ఞ = సర్వము తెలిసినవాడా!, జంభారాతి ద్విప = ఇంద్రుని ఏనుగు ఐరావతముయొక్క, హస్తకాండ = తొండముతో, నిభ = సమానమైన, బాహా = చేతియందున్న, ఖడ్గధారా = కత్తియంచనెడి, పయోధారా = నీటిధారచే, శాంత = చల్లార్చబడిన, విరోధిభూధవ = శత్రు రాజులయొక్క, మహోదగ్ర = తీక్షణమగు, ప్రతాపానలా = ప్రతాపాగ్నికలవాడా! (అలంకారము – రూపకము)

తా. స్త్రీలయొక్క మనస్సనెడి సరస్సునకు హంసవంటివాడా! నీతియందు చాణక్యునివంటివాడా! బ్రహ్మ వంశమనెడు పాలసంద్రమునకు చంద్రునివంటివాడా! కవిత్వమందలి సిద్ధాంతములను సర్వమును తెలిసినవాడా! ఐరావతము యొక్క తొండముతో సమానమైన చేతియందలి కత్తియంచనెడి నీటిధారచే చల్లార్చబడిన శత్రురాజులయొక్క తీక్షణమైన ప్రతాపాగ్నికలవాడా!

**145 క. అరివీర బసవశంకర**
**శరణాగత రక్షణాను సంధాన ధురం**
**ధర సచివ గంధ సింధుర**

**ధరణీ భరణైక దక్ష దక్షిణహస్తా!**

అరివీరబసవశంకర = శత్రువులనెడి యెద్దులకు రుద్రునివంటివాడా, శరణాగత = శరణన్నవారికి, రక్షణ అనుసంధాన = రక్షణను కూర్చుటయొక్క, ధురంధర = భారమును వహించువాడా! సచివ = మంత్రులలో, గంధసింధుర = శ్రేష్ఠుడా!, ధరణీ = భూమియొక్క, భరణ = మోయుటయందు, ఏక = ముఖ్యముగా, దక్ష = సమర్థమైన, దక్షిణ హస్తా = కుడిభుజము కలవాడా!

తా. శత్రువీరులనెడి యెద్దులకు రుద్రునివంటివాడా! శరణన్నవారికి రక్షణ భారమును వహించువాడా! మంత్రులలో శ్రేష్ఠుడా! భూభారమును మోయుటయందు సమర్థమైన కుడిభుజము కలవాడా!

**146** మాలిని **ధరణిభర దిధీర్షాధఃకృత స్తబ్ధరోమ**
**ద్విరద కమఠ రాజోర్వీధ్ర దర్వీకరేంద్రా**
**హరచరణ రిరంసా వ్యంజితానందసాంద్రా**
**పరిహృతమతి తంద్రా భాగ్య సంపన్మహేంద్రా!**

ధరణి = భూమండలముయొక్క, భర = బరువును, దిధీర్ష = ధరించునిచ్ఛచే, అధఃకృత = క్రిందుగాచేయబడిన, స్తబ్ధరోమ = ఆదివరాహమును, ద్విరద = దిగ్గజములను, కమఠరాజ = కూర్మరాజును, ఉర్వీధ్ర = కులపర్వతములును, దర్వీకరేంద్రా = శేషుడునుకలవాడా! హరచరణ = శివుని పాదమునందలి, రిరంసా = క్రీడింపనిచ్ఛచే, వ్యంజిత = ప్రకటితమైన, ఆనంద = సంతోషముచే, సాంద్రా = దట్టమైనవాడా! పరిహృతమతితంద్రా = బుద్ధిమాంద్యము లేనివాడా! భాగ్యసంపన్మహేంద్రా = భాగ్యసంపదతో ఇంద్రునివంటివాడా!

తా. భూభారమును ధరించు కోర్కెతో క్రిందుగాచేయబడిన ఆదివరాహమును, దిగ్గజములును, కూర్మమును, కులపర్వతములును, శేషుడును కలవాడా! శివపాద ధ్యానముచే అధిక సంతోషముకలవాడా! బుద్ధిమాంద్యము లేనివాడా! భాగ్యసంపదలో ఇంద్రునివంటివాడా! ఓ మామిడిసింగా!

**ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్త్ర**
**సకలవిద్యాసనాథ శ్రీనాథభట్ట ప్రణీతంబైన**
**శృంగార నైషధ కావ్యంబునందు**
**షష్ఠాశ్వాసము**

**వ్యాఖ్యాతృ గద్యము**
**ఇది బుధజన విధేయుండును, బులుసు వంశ సంభూతుండును,**
**కీ.శే. శేషమ్మ, వెంకటరమణయ్య పుణ్యదంపతీ తనూజుండును,**
**గౌతమ గోత్రజుండునగు వేంకటసత్యనారాయణమూర్తి**
**ప్రణీతంబైన శృంగార నైషధ మహాకావ్యంబునందు**
**షష్ఠాశ్వాసమునకు టీక-తాత్పర్యములు**
**సంపూర్ణము**

శ్రీరస్తు

# శృంగార నైషధము

## సప్తమాశ్వాసము

**శ్రీరెడ్డి వేమ విశ్వ**
**క్ష్మారమణ కృపా విశేష సమధిగతైశ్వ**
**ర్యారూఢ విభవశృంగా**
**మారారి పదాబ్జభృంగ మామిడిసింగా!**

శ్రీ = లక్ష్మీయుతుడైన, రెడ్డి = రెడ్డి వంశజుడైన, వేమ విశ్వక్ష్మారమణ = వేమ భూపాలునియొక్క, కృపా విశేష = దయాతిశయమువలన, సమధిగత = పొందబడిన, ఐశ్వర్య = సంపదలచే, ఆరూఢ = స్థిరమైన, విభవ శృంగా = వైభవ ఔన్నత్యము కలవాడా!, మారారి = శంకరుని, పదాబ్జభృంగ = పాదపద్మములయందు తుమ్మెదయైనవాడా! మామిడి సింగా = మామిడి సింగనామాత్యా!

తా. లక్ష్మీయుతుడైన, రెడ్డి వంశజుడైన, వేమ భూపాలునియొక్క దయా విశేషముచే పొందబడిన సంపదలచే స్థిరమైన వైభవ ఔన్నత్యము కలవాడా! శంకరుని పాదపద్మములయందు తుమ్మెదయైనవాడా! మామిడి సింగనామాత్యా!

2 వ. **వినుము**

3 తే. **పయనమై స్వపురోహిత ప్రవరుఁడైన**
**గౌతముండు ప్రస్థానసంగతికిఁ దగిన**
**మంగళాచార మొనరింప మహివరుండు**
**శిబిరమెత్తఁ బదాళ్ళకుఁ జెప్పఁ బనిచె**

స్వ పురోహిత ప్రవరుడైన = తన పురోహిత శ్రేష్ఠుడైన, గౌతముండు, ప్రస్థాన సంగతికిన్ = బయలుదేరుటకు, తగిన మంగళాచారము = అనుకూల మంగళక్రియను, ఒనరింపన్ = చేయగా, మహివరుండు = రాజైన నలుడు, పయనమై, శిబిరము ఎత్తన్ = సైన్యము బయలుదేరుటకు, పదాళ్ళకున్ = సేనాపతులకు, చెప్పన్ = చెప్పుటకు, పనిచెన్ = ఆజ్ఞాపించెను.

తా. తన పురోహితుడైన గౌతముడు బయలుదేరుటకు తగిన శుభక్రియను చేయగా నలుడు పయనమై సైన్యము బయలుదేరుటకు సేనాపతులకు చెప్పుటకు ఆజ్ఞాపించెను.

4 ఉ. **పుట్టిననాఁటఁగోలె నొక ప్రొద్దు నిజాంక తలంబుఁ బాయకు**
**న్నట్టి యనుంగుఁ గూఁతు దమయంతిఁ గడుంగడు దూరమన్పుచో**
**నిట్టి విషాదమాత్మ నుదయింపదు కూరిమి యల్లు నంపుచో**
**నెట్టి విషాదమాత్మ నుదయించెనొ మామకు నత్తగారికిన్**

మామకున్ = భీమరాజునకు, అత్తగారికిన్, కూరిమిన్ అల్లున్ = ప్రియమైన అల్లుని, అంపుచోన్ = పంపునపుడు, ఎట్టి విషాదము = ఎటువంటి దుఃఖము, ఆత్మన్ = మనసులో, ఉదయించెనొ = కలిగెనో, ఇట్టి విషాదము = ఇటువంటి దుఃఖము, పుట్టిననాటగోలెన్ = పుట్టినప్పటినుండియు, ఒక ప్రొద్దున్ = ఒక్క రోజైనను, నిజాంకతలంబున్ పాయక = తన ఒడిని విడువక, ఉన్నట్టి = ఉన్నటువంటి, అనుంగు కూతున్ = ప్రియమైన కూతురును, దమయంతిన్, కడుంగడు = మిక్కిలి, దూరము అన్పుచోన్ = దూరము పంపునప్పుడు, ఉదయింపదు = కలుగదు. (అలంకారము – విభావన)

తా. మామగారికి, అత్తగారికి అల్లుని పంపునపుడు ఎలాంటి దుఃఖము మనసులో కలిగిందో ఇలాంటి దుఃఖము

పుట్టినప్పటినుండియు ఒక్క రోజైనా తన ఒడిని విడువక ఉన్న ప్రియమైన కూతురును దమయంతిని దూరము పంపునపుడు కలుగదు.

5 ఉ. **అక్షయ రాజ్యవైభవ రమానుభ వాభినవ ప్రభా సహ**
**స్రాక్షుఁడు గుండినాధిపతి యాత్మసుతారమణు న్వినీతతా**
**లక్ష గుణీ భవద్గుణకలాపుని నైషధుని న్వరాట దే**
**శక్షితి మండలావధిగ సమ్మతి నంపె సుతద్వయంబుతోన్**

అక్షయ = నాశరహితమగు, రాజ్య వైభవ రమా = రాజ్య సంపదను, అనుభవ = అనుభవించుటయందలి, అభినవ = క్రొత్తవైన, ప్రభా = కాంతులకు, సహస్రాక్షుడు = ఇంద్రునివంటివాడైన, కుండిన అధిపతి = భీమరాజు, ఆత్మసుతారమణున్ = తన అల్లుని, వినీతతా = అధిక వినయముచే, లక్షగుణీభవత్ = లక్షరెట్లధికమైన, గుణకలాపునిన్ = గుణములతో కూడినవానిని, నైషధునిన్ = నలుని, సుతద్వయంబుతోన్ = తన ఇరువురు కుమారులతో, వరాటదేశక్షితి మండలావధిగన్ = వరాటరాజ్య సరిహద్దులవరకును, సమ్మతిన్ = సంతోషముతో, అంపెన్ = సాగనంపెను.

తా. అక్షయమైన రాజ్యసంపదను అనుభవించుటలో ఇంద్రునివంటివాడైన భీమరాజు తన అల్లుని మిక్కిలి వినయముతో లక్షరెట్లధికమైన గుణములు కల నలుని తన ఇరువురు కుమారులతో రాజ్య సరిహద్దుల వరకు సంతోషముతో సాగనంపెను.(అలంకారము – రూపకము, కావ్యలింగము)

6 తే. **ఆత్మ మండల మవధిగా ననుచరించి**
**యవనినాథుఁడు జామాత ననిపి మరలె**
**నాప్రతీరంబు గంధవాహంబు ననిచి**
**మరలిపోవు తటాకంబు తరఁగ వోలె**

ఆప్రతీరంబు = తీరమువరకును, గంధవాహంబున్ = గాలిని, అనిచి = పంపి, మరలిపోవు = వెనుకకువచ్చు, తటాకంబు తరగ పోలెన్ = చెఱువులోని కెరటమువలె, అవనినాథుడు = భీమరాజు, ఆత్మమండలము అవధిగాన్ = తన రాజ్య సరిహద్దులవరకు, జామాతన్ = అల్లుని, అనుచరించి = అనుసరించి, అనిపి = పంపి, మరలెన్ = వెనుతిరిగెను.

తా. గట్టువరకు గాలిని పంపి వెనుకకువచ్చు చెఱువులోని కెరటమువలె భీమరాజు తన రాజ్య సరిహద్దుల వరకును అల్లుని అనుసరించి పంపి వెనుతిరిగెను. (అలంకారము – ఉపమ)

7 వ. **అప్పుడు నిజ వియోగజనిత క్లేశంబునం గన్నుల బాష్పాంబుకణంబు లురలఁ బ్రణామంబు చేసి తలవాంచియున్న కూఁతుం గౌఁగిలించుకొని గద్గద స్వరంబునఁ దండ్రి యిట్లనియె**

తా. అప్పుడు తన వియోగముచే కలిగిన కష్టమువలన కన్నులనుండి కన్నీటి బిందువులు కారుచుండగా నమస్కరించి తలవంచియున్న కూతురును కౌగిలించుకొని గద్గద స్వరముతో తండ్రి భీమరాజు ఇట్లు పలికెను.

8 మ. **గురువన్నన్ ధనమన్నఁ బుణ్యమనినన్ గోత్రోదయంబన్న దే**
**వరయన్న న్మనమన్నఁ దుష్టియనినన్ వాత్సల్యమన్నన్ నిజే**
**శ్వరుఁడన్నం బరమోపకారమనినన్ సర్వంబునన్నం దలో**
**దరి నీకు న్నిషధాధినాథుఁడె చుమీ తథ్యంబుగా చెప్పితిన్**

తలోదరీ = కృశించిన ఉదరముకలదానా!, గురువు అన్నన్ = గురువు అనినను, ధనము అన్నన్, పుణ్యము అనినన్, గోత్ర ఉదయంబు అన్నన్ = వంశాభివృద్ధియన్నను, దేవర అన్నన్ = దైవమన్నను, మనము అన్నన్ = మనస్సన్నను, తుష్టి అన్నన్ = సంతోషమన్నను, వాత్సల్యము అన్నన్ = అనురాగమన్నను, నిజేశ్వరుడు అన్నన్ = ప్రాణనాథుడన్నను, పరమ ఉపకార మనినన్, సర్వంబున్ అన్నన్ = సమస్తము అనినను, నిషధాధినాథుడె చుమీ = నలుడే సుమా! తథ్యంబుగాన్ = నిక్కముగా, చెప్పితిన్ = చెప్పుచున్నాను.

తా. తలోదరీ! గురువన్నా, ధనమన్నా, పుణ్యమన్నా, వంశాభివృద్ధియన్నా, దైవమన్నా, మనస్సన్నా, సంతోషమన్నా, వాత్సత్యమన్నా, ప్రాణనాథుడన్నా, పరమోపకారమన్నా, సమస్తము అన్నా నలుడే సుమా నిజం చెబుతున్నాను.

9 సీ. **పాటించి కొలువుము భవనదైవతముల**
**సవతులఁ గొనియాడు సఖులఁ బోలె**
**నారాధనము సేయు మత్తమామల నెప్డుఁ**
**బరిజనంబులమీఁదఁ గరుణ గలుగు**
**మలుగకు కోపించినపుడు నాధునితోడ**
**మదిలోన నుబ్బకు మన్ననలకుఁ**
**దోడికోడండ్రతోఁ గూడిమాడి చరింపు**

దాసీజనముఁ బ్రోవు తల్లి కరణి

తే. బ్రాహ్మణులయందు గురులందు బంధులందు
భక్తి విశ్వాస సౌహార్ద పరత నెఱపు
భవ్య పతిదేవతాచార పరమపుణ్య
ధర్మ మేమఱకుండుమీ తల్లికాన

తల్లికాన = నాతల్లీ, భవన దైవతములన్ = ఇలవేల్పులను, పాటించి = అంగీకరించి, కొలువుము = సేవింపుము, సవతులన్, సఖుల పోలెన్ = చెలికత్తెలవలె, కొనియాడుము = ఆదరించుము, ఎప్డున్ = ఎప్పుడును, అత్తమామలన్, ఆరాధనము చేయుము = పూజింపుము, పరిజనంబులమీదన్ = సేవకులమీద, కరుణ కలుగు = దయ చూపుము, కోపించినపుడు = భర్త కోపించినపుడు, నాథునితోన్ = భర్తతో, అలుగకుము = కోపింపకుము, మన్ననలకున్ = పొగడ్తలకు, మదిలోన = మనస్సులో, ఉబ్బకుము = పొంగిపోకుము, తోడికోడంద్రతోన్, కూడిమాడి = కలసిమెలసి, చరింపు = ప్రవర్తించుము, దాసీజనమున్, తల్లి కరణి, ప్రోవు = రక్షింపుము. బ్రాహ్మణులయందు, గురులందు, బంధులందు, భక్తి విశ్వాస సౌహార్ద పరతన్ = ప్రేమ, నమ్మకము, స్నేహాతిశయమును, నెఱపుము = చూపుము, భవ్య = పవిత్రులైన, పతిదేవతా = పతివ్రతలయొక్క, ఆచార = సంప్రదాయముయొక్క, పరమ పుణ్య ధర్మము, ఏమఱకుండుమీ = మరువకుము.

తా. నా తల్లీ ! ఇలవేల్పులను గౌరవముతో సేవింపుము, సవతులను చెలికత్తెలవలె ఆదరించుము, సతతము అత్తమామలను పూజింపుము, పరిజనముమీద దయ చూపుము, భర్త కోపించినపుడు నీవు కోపింపకుము, పొగడ్తలకు పొంగిపోకుము, తోడికోడంద్రతో కలసిమెలసి వర్తించుము, దాసీజనమును తల్లిలా రక్షింపుము, బ్రాహ్మణులయందు, గురువులయందు, బంధువులయందు ప్రేమ, నమ్మకము, స్నేహభావములతో నుండుము, పవిత్రులైన పతివ్రతలయొక్క ఆచారములను పరమపుణ్య ధర్మమని మరచిపోకుము.

**10 వ. అని బుజ్జగించి బుద్ధిచెప్పి కూఁతు వీడ్కొనియె. దమ దమనులుం జెలియలి ననునయించి**

**11 ఉ. సంకుమదంబుఁ గస్తురియుఁ జాఁదుఁ బటీరముఁ గప్పురంబునున్**
**గుంకుమపువ్వునుం బునుఁగు గొజ్జెఁగ నీరు ననేక భారముల్**
**కంకణ కంఠికా కటక కాంచిముఖాభరణ వ్రజంబుతోఁ**
**గొంకక తోడఁబుట్టువులు కూరిమి చెల్లెలి కిచ్చి రిద్దఱున్**

తోడబుట్టువులు ఇద్దఱున్ = దమ దమను లిద్దరును, కొంకక = సందేహించక, కంకణ = గాజులు, కంఠికా = హారములు, కటక = మురుగులు, కాంచి = మొలత్రాడులు, ముఖ = మొదలైన, ఆభరణ వ్రజంబుతోన్ = నగల సముదాయముతో, సంకుమదంబును = జవ్వాదిని, కస్తురియున్, చాదున్ = తిలకమును, పటీరము = చందనమును, కప్పురంబునున్ = కర్పూరమును, కుంకుమపువ్వునున్, పునుగు, గొజ్జెగ నీరున్ = పన్నీరును, అనేక భారముల్ = ఎంతో బరువును, కూరిమి చెల్లెలికిన్, ఇచ్చిరి.

తా. సోదరులు దమ దమను లిద్దరును సందేహించక గాజులు, హారములు, మురుగులు, మొలత్రాడులు మొదలైన నగలసముదాయముతో జవ్వాదిని, కస్తూరిని, తిలకమును, చందనమును, కర్పూరమును, కుంకుమపువ్వును, పునుగును, పన్నీరును ఎంతో పరిమళ వస్తువులను కూరిమి చెల్లెలికిచ్చిరి.

**12 సీ. కదళికా చంపక క్రముక పాటల చూత**
**కంకేళి వాటికా సంకులంబు**
**లక్షీణ బహుళ పుండ్రేక్షు రాజాన్నాది**
**భూరి సస్య సమృద్ధి భూషణములు**
**కమల నీలాంబుజ కల్హార కుముదాఢ్య**
**శుంభ త్తటాకోప శోభితములు**
**వివిధాపణస్థలీ విన్యస్త రత్నాది**
**బహుపదార్థ వ్రాత బంధురములు**

**తే. గ్రామములు నూఱు క్రథ కైశికంబులోనఁ**
**బసుపు కిచ్చిరి భీమ భూపాలసుతులు**
**దండ్రి యాజ్ఞ సహోదర ధర్మమొప్ప**
**ననుఁగు సైదోడు దమయంతి ననుపు నపుడు**

భీమభూపాల సుతులు = భీమరాజు కుమారులైన దమ, దమనులు, సహోదర ధర్మము, ఒప్పన్ = ఒప్పునట్లుగా, తండ్రి యాజ్ఞన్, అనుగు సైతోడు = ప్రియమైన చెల్లెలు, దమయంతిని, అనుపు నపుడు = పంపునప్పుడు, క్రథకైశికంబులోనన్ =

క్రథకైశికరాజ్యములోని, కదళికా = అరటి, చంపక = సంపెంగ, క్రముక = పోక, పాటల = కలుగొట్టు, కంకేళి = అశోక, వాటికా = (వృక్షముల) వరుసలచే, సంకులములు = నిండియున్నవియు, అక్షీణ = నశింపని, బహుళ = అనేకములైన, పుండ్రేక్షు = నామాల చెఱుకు, రాజాన్న = శ్రేష్ఠమైన వరి, ఆది = మొదలైన, భూరి = అధికమైన, సస్య = పైరులయొక్క సమృద్ధి = సంపదలే, భూషణములు = అలంకారములుగాకలవియు, కమల = పద్మములు, నీలాంబుజ = నల్లకలువలు, కల్హార = సుగంధ కలువలు, కుముద = తెల్ల కలువలు, వీనిచే ఆఢ్య = నిండినవై, శుంభత్ = ప్రకాశించుచున్న, తటాక = చెఱువులచే, ఉపశోభితములు = మిక్కిలి ప్రకాశించునవియు, వివిధ = అనేకములైన, ఆపణస్థలీ = అంగడి వీధులయందు, విన్యస్త = ఉంచబడిన, రత్న = రత్నములు, ఆది = మొదలైన, బహు పదార్థ = అనేక వస్తువులయొక్క, వ్రాత = సమూహములచే, బంధురములు = సుందరములైనవియునగు, గ్రామమలు నూఱు, పసుపుకు = పసుపు కుంకుమలుగా, ఇచ్చిరి.

తా. దమ, దమనులు సోదరధర్మము ఒప్పునట్లుగా తండ్రి యాజ్ఞతో ప్రియమైన చెల్లెలిని పంపునప్పుడు విదర్భ రాజ్యములోని అరటి, సంపెంగ, పోక, అశోక వృక్షములపంక్తులచే నిండియున్నవియు, నశించని అనేకములైన చెఱకు, వరి మొదలైన విస్తారమైన పైరులయొక్క సంపదలే భూషణములుగా కలవియు, పద్మములు, నల్ల, సుగంధ, తెల్ల కలువలతో నిండిన మంచి చెఱువులచే ప్రకాశితములైనవియు, అనేకములైన అంగడివీధులయందు ఉంచబడిన రత్నములు మొదలైన అనేక వస్తువులయొక్క సమూహములచే సుందరములైనవియునైన నూరు గ్రామములను పసుపు కుంకుమగా ఇచ్చిరి.

**13 తే. ఉభయ వంశలలామ యయ్యుత్పలాక్షి**
**యత్తవారింటి కరిగెడు నవసరమున**
**మాతృ జనక సఖీజన భ్రాతృ విరహ**
**మధిపతి ప్రేమ జలరాశి కౌర్వమయ్యె**

ఉభయ వంశ లలామ = రెండువంశములకు చెందినదైనకాంత, ఆ ఉత్పలాక్షి = ఆ కలువలవంటికన్నులకల దమయంతి, అత్తవారింటికిన్ అరిగెడు, అవసరమున = సమయమున, మాతృ జనక సఖీజన భ్రాతృ విరహము = తల్లి, తండ్రి, చెలికత్తెలు, సోదరుల ఎడబాటు, అధిపతి ప్రేమ జలరాశికిన్ = నలునిపైనున్న అనురాగ సంద్రమునకు, ఔర్వము అయ్యెన్ = బడబాగ్ని అయ్యెను.

తా. రెండు వంశములకు చెందినదైన దమయంతి అత్తవారింటికి వెళ్ళెడు సమయమున తల్లి, తండ్రి, చెలికత్తెలు, సోదరుల ఎడబాటు నలునిపైనున్న అనురాగ సంద్రమునకు బడబాగ్ని అయ్యెను.
(బడబాగ్ని సముద్రము నింకించునట్లే కుటుంబముపై ప్రేమ నలునిపై ప్రేమను ఇంకించెను)

**14 వ. ఇవ్విధంబున సంబంధి బంధుజనంబుల సముచిత ప్రకారంబుల వీడ్కొలిపి కతిపయ ప్రయాణంబుల**

తా. ఈ విధముగా సంబంధించిన బంధుజనాలకు తగిన రీతిగా వీడ్కోలు పలికి కొన్ని విరామములతో

**15 సీ. ప్రణిధి లోకానీత పరితోష వార్తాభి**
**నందితామాత్య బృందారకంబు**
**రాజవీథీ మహాప్రాసాద శిఖరాగ్ర**
**కీలితాలంకార కేతనంబుఁ**
**గ్రథకైశికాధీశ కన్యావలోకన**
**వ్యగ్రపౌరవధూ సమాకులంబుఁ**
**గస్తూరికాలేప కర్పూర రంగ వ**
**ల్ల్యభిరామ మందిర ప్రాంగణంబు**
**తే. సార సారమ సారాశ్మ తోరణాంశు**
**చూర్ణకుంతల మాలికా శోభమాన**
**గోపురశ్రీ లలామంబు గూర్మిపురము**
**డాయ నేతెంచె నిషధ భూనాయకుండు**

ప్రణిధిలోక = దూతల సముదాయముచే, ఆనీత = తీసుకొనిరాబడిన, పరితోష వార్త = సంతోష వార్తచే, అభినందిత = ఆనందితులైన, అమాత్య బృందారకంబు = మంత్రి సమూహమును, రాజవీథీ, మహత్ = గొప్పవయిన, ప్రాసాద = భవనములయొక్క, శిఖరాగ్ర = పైభాగములందు, కీలిత = అమర్చబడిన, అలంకార = అలంకరణకోసమైన, కేతన = ధ్వజములయు, క్రథకైశికాధీశ కన్య =దమయంతిని, అవలోకన = చూచుటయందు, వ్యగ్ర = త్వరపడుచున్న, పౌరవధూ = పుర స్త్రీలచే, సమాకులంబు = నిండియున్నదియు, కస్తూరికా లేప = కస్తూరి పూతలచేతను, కర్పూర రంగవల్లీ = కర్పూరపు ముగ్గులచేతను, అభిరామ = మనోహరములైన, మందిర, ప్రాంగణంబు = ప్రాంతములు కలదియు, సారసార = శ్రేష్ఠములైన అంచులుకల, మసారాశ్మ = ఇంద్రనీల మాణిక్యముల, తోరణ = మాలికలయొక్క, అంశు = కాంతులనెడి, చూర్ణ కుంతల

మాలికా = ముంగురుల పంక్తులచేత, శోభమాన = ప్రకాశించుచున్న, గోపుర శ్రీ = గోపురపు శోభ, లలామంబు = తిలకముగా కలదియు, కూర్మిపురము = ప్రియమైన తన పట్టణము, నిషధభూనాయకుండు = నలుడు, డాయన్ ఏతెంచెన్ = సమీపించెను. (అలంకారము – రూపకము)

తా. దూతల సమూహముచే తీసుకొనిరాబడిన సంతోష వార్తచే ఆనందితులైన మంత్రి సమూహమును, రాజవీథిలోని గొప్ప ప్రాసాదముల శిఖరాగ్రములపైనుండి దమయంతిని చూచుటయందు త్వరపడుచున్న పురస్త్రీలచే నిండియున్నదియు, కస్తూర పూతలచేతను. కర్పూర రంగవల్లులచేతను మనోహరములైన మందిర ప్రాంతములుకలదియు, శ్రేష్ఠములైన అంచులుకల ఇంద్రనీల మాణిక్య మాలికలయొక్క కాంతులనెడి ముంగురుల పంక్తులచే ప్రకాశించుచున్న గోపురపు శోభ తిలకముగాకలదియునైన ప్రియమైన తన పట్టణమును నలుడు సమీపించెను.

**16 తే. కదియ నేతెంచి నైషధక్ష్మావరుండు**
**దివుటఁ బురలక్ష్మిపై వ్రాలు దృష్టిఁ దివిచె**
**నాత్మ యొక్కించుకయుఁ బరాకయ్యెనేనిఁ**
**బ్రాణవల్లభ దన్నేమి యనునొ యనుచు**

నైషధ క్ష్మావరుండు = నలుడు, కదియన్ ఏతెంచి = పుర సమీపమునకు వచ్చి, ఆత్మ = తన మనస్సు, ఒక్కించుకయున్ = కొంచెమును, పరాకు అయ్యెనేని, ప్రాణవల్లభ = దమయంతి, తన్నున్ = తనను, ఏమి, అనునొ = తలంచునొ, అనుచున్, తివుటన్ = ప్రయత్నముచే, పురలక్ష్మిపైన్ = నగరశోభపై, వ్రాలు దృష్టిన్ = పడెడి చూపును, తివిచెన్ = మరలించెను.

తా. నలుడు నగర సమీపమునకు వచ్చి తన మనస్సు కొంచెమైనను పరాకుచెందిన దమయంతి తనను గూర్చి ఏమి తలంచునోయని ప్రయత్నపూర్వకముగ నగరశోభపై పడెడిచూపును మరలించుకొనెను.

**17 చ. ఎదురుగ నేఁగుదెంచిరి మహీపతికిం బురివారు సర్వసం**
**పదలు ప్రమోద వైభవ సమగ్రతయు న్నెరయంగ మిండ తు**
**మ్మెద కదుపుల్మదోదయము మిక్కిలి వేడుకయు న్మనంబులం**
**బొదలగఁ గ్రొత్తయామనికిఁ బొచ్చెము లేకెదురేగుచాడ్పునన్**

పురివారు = పురప్రజలు, సర్వ సంపదలు, ప్రమోద = సంతోషకరములైన, వైభవ = సంపదల, సమగ్రతయున్ = నిండుతనమును, నెరయంగన్ = ఒప్పునట్లుగా, మిండతుమ్మెద కదుపుల్ = మగతుమ్మెదల సమూహములు, మదోదయము = మద అభివృద్ధియును, మిక్కిలి వేడుకయున్, మనంబులన్, పొదలగన్ = వర్ధిల్లుచుండగా, క్రొత్త యామనికిన్ = నవ వసంతమునకు, పొచ్చెము లేక = తక్కువకాని రీతిలో, ఎదురేగు చాడ్పునన్ = ఎదురు వచ్చు విధమున, మహీపతికిన్ = నలునకు, ఎదురుగన్, ఏగుదెంచిరి = వచ్చిరి. (అలంకారము – ఉపమ)

తా. పురప్రజలు సమస్త సంతోషకరములైన సంపదల నిండుతనము ఒప్పునట్లుగా మగతుమ్మెదల గుంపులు మదముయొక్క అభివృద్ధితోను, మిక్కిలి వేడుకతోను మనసులు వర్ధిల్లుచుండగా నవ వసంతమునకు తక్కువకాని రీతిలో ఎదురు వచ్చు విధమున నలునకు ఎదురు వచ్చిరి.

**18 వ. ఇట్లు మంత్రి పురోహితామాత్య దండనాథ ప్రధానంబుగాఁ బౌరజన సమూహంబు దన్నెదుర్కొన సముచిత ప్రకారంబున**

**19 శా. ఏమేఁ గ్రొత్త యపూర్వ వార్త వినుచేమేఁ జెప్పుచున్ దండనా**
**థామాత్యాదులు పాదచారమున సేవాసక్తిమైఁ గొల్చిరా**
**భూమీశాగ్రణి సొచ్చెఁ బట్టణము సంపూర్ణానురాగంబుతో**
**భామానేత్ర చకోర చుంబితముఖ ప్రాలేయరుగ్బింబుఁడై**

భూమీశాగ్రణి = నలుడు, ఏమేని = ఏదయినను, క్రొత్త అపూర్వ వార్త, వినుచున్, ఏమేన్ = ఏదైనను, చెప్పుచున్, దండనాథ అమాత్య ఆదులు, పాదచారమునన్ = కాలినడకన, సేవ ఆసక్తిమైన్ = సేవించుటయందు ఆదరముతో, కొల్చిరాన్ = సేవించి వచ్చుచుండగా, భామా = పురస్త్రీలయొక్క, నేత్రచకోర = నేత్రములనెడి చకోరపక్షులచే, చుంబిత = ముద్దుపెట్టుకొనబడుచున్న, ముఖ ప్రాలేయ రుక్ బింబుడై = మంచువెలుగులవాని మండలమువంటి ముఖము కలవాడై, సంపూర్ణ అనురాగంబుతోన్, పట్టణము, చొచ్చెన్ = ప్రవేశించెను. (అలంకారము – రూపకము)

తా. నలుడు ఏదైనా క్రొత్త అపూర్వ వార్త వింటూ, ఏదైనా చెబుతూ సేనాపతులు, మంత్రులు మొదలైనవారు కాలినడకన సేవాసక్తితో సేవించి వచ్చుచుండగా, పురస్త్రీలయొక్క చకోర నేత్రములచే ముద్దుపెట్టుకొనబడుచున్న ముఖ చంద్రుడు కలవాడై సంపూర్ణ అనురాగముతో పట్టణమును ప్రవేశించెను.

**20 క. సకల ధరాధీశ్వరుపైఁ**

**బ్రకటముగాఁ జల్లిరపుడు పౌరపురంధ్రుల్**
**సుకుమార బాహువల్లీ**
**ముకుళకుల సకుల్య లాజ ముక్తాఫలముల్**

పౌర పురంధ్రుల్ = పురస్త్రీలు, అపుడు, సుకుమార = కోమలములైన, బాహు = భుజములనెడి, వల్లీ = తీగెలయొక్క, ముకుళ కుల = మొగ్గల సమూహముతో, సకుల్య = సమానములైన, లాజ = పేలాలను, ముక్తాఫలముల్ = ముత్యములను, ప్రకటముగాన్ = ప్రభువుకు శుభముకలుగుట స్పష్టమగునట్లుగా, సకలధర అధీశ్వరునిపైన్ = రాజుపై, చల్లిరి.

తా. పురస్త్రీలు అపుడు కోమలములైన, తీగెల మొగ్గలతో సమానములైన భుజములతో పేలాలను, ముత్యములను ప్రభువుకు శుభముకలుగుట స్పష్టమగునట్లుగా నలునిపై చల్లిరి.(అలంకారము – రూపకము, ఉపమ)

**21 మ. దమయంతీ వదనావలోకన సముత్కంఠావలద్భామినీ**
**సముదాయానన చంద్రబింబ పరిషత్సాన్నిధ్యయోగంబునన్**
**సముపేతార్థములయ్యె సౌధమణి భాస్వచ్చంద్ర శాలా వితా**
**నము లుర్వీపతినందనుండు పురఘంటావీథి నేతెంచుచోన్**

ఉర్వీపతి నందనుండు = రాజకుమారుడు, పురఘంటావీథిన్ = నగర రాజవీథియందు, ఏతెంచుచోన్ = వచ్చునపుడు, సౌధ = మేడలందలి, మణి = రత్నములచే, భాస్వత్ = ప్రకాశించుచున్న, చంద్రశాలా = శిరోగృహములయొక్క, వితానములు = సమూహములు, దమయంతీ, వదన = ముఖమును, అవలోకన = చూచుటయందలి, సముత్కంఠా = వేడుకతో, వలత్ = సంయుతులైన, భామినీ సముదాయ = స్త్రీ సమూహములయొక్క, ఆనన చంద్రబింబ = ముఖములనెడి చంద్రబింబములయొక్క, పరిషత్ = సంఘముయొక్క, సాన్నిధ్య యోగంబునన్ = సామీప్య సంబంధమువలన, సముపేతార్థములు = సార్థకములగు నామములుకలవి, అయ్యెన్. (అలంకారము – రూపకము)

తా. రాజకుమారుడు నలుడు నగర రాజవీధియందు వచ్చునపుడు మేడలందలి రత్నములచే ప్రకాశించుచున్న శిరోగృహములయొక్క సముదాయములు దమయంతీ ముఖమును చూచుటయందలి కోరికతో కూడిన స్త్రీ సమూహములయొక్క ముఖములనెడి చంద్రబింబముల సామీప్య సంబంధమువలన సార్ధకనామములుకలవి అయినవి.(చంద్రశాలలైనవి)

**22 తే. ధరణినాథాననేందు సుధారసంబు**
**సౌధజాల మృణాళికా జాలకముల**
**నుత్పలాక్షీ కటాక్ష నీలోత్పలములు**
**ప్రేమమున దప్పిపోవంగఁ బీల్చుకొనియె**

ఉత్పలాక్షీ = కలువలవంటి కన్నులుకల స్త్రీలయొక్క, కటాక్ష నీలోత్పలములు = క్రీగంటి నల్లకలువలు, సౌధజాల = మేడల కిటికీలనెడి, మృణాళికా = తామరతూండ్లయొక్క, జాలకములన్ = రంధ్రములచేత, ధరణినాథ = నలునియొక్క, ఆనన ఇందు సుధారసంబు = ముఖచంద్రుని అమృతరసమును, ప్రేమమునన్ = ప్రీతితో, దప్పి పోవంగన్ = దాహము తీరునట్లుగ, పీల్చికొనియెన్ = త్రాగెను. (అలంకారము – రూపకము)

తా. కలువకన్నుల స్త్రీలయొక్క క్రీగంటి నల్లకలువలు మేడల కిటికీలనెడి తామరతూండ్లయొక్క రంధ్రములచేత నలుని ముఖచంద్రుని అమృతరసమును ప్రీతితో దాహము తీరునట్లుగా త్రాగినవి.

**23 వ. అప్పుడు**

**24 సీ. నిరుపమాన స్వయంవర మహోత్సవమును**
**మధుపర్క సత్కార మంగళంబు**
**గమనీయతర కరగ్రహణ హోమంబును**
**విహరణాగార ప్రవేశవిధియు**
**నుభయ బంధుభుజి క్రియోపచారంబును**
**బ్రాస్థానిక స్వస్తి భాషణంబు**
**హరణార్థ సంభార హారికాకృతియును**
**నగరసంవేశనానందకళయు**

**తే. ననెడు వృత్తాంతముల నొప్పు నధిప చరిత**
**మాది మధ్యావసానంబు లవధరించి**
**యమరముఖ్యులు గురియించి రలరువాన**
**యన్ని దినములు దారున్కి యెఱుక పడఁగ**

నిరుపమాన = సాటిలేని, స్వయంవర మహోత్సవమును, మధుపర్క సత్కార = మధుపర్క సత్కారమనెడి, మంగళంబు = మంగళకృత్యమును, కమనీయతర = మిక్కిలి మనోహరమైన, కరగ్రహణ హోమంబును = వివాహ సమయ హోమమును, విహరణాగార = కౌతుక మందిరమును, ప్రవేశవిధియున్ = ప్రవేశించు కృత్యమును, ఉభయ బంధు = ఇరుపక్షముల పెండ్లివారును, భుజిక్రియ ఉపచారంబును = భోజనములు సల్పుటయును, ప్రాస్థానిక = ప్రయాణసమయమున, స్వస్తి భాషణంబు = పురోహిత స్వస్తి వాచకములును, హరణార్థ = కానుకలకొరకై, సంభార = వివిధ వస్తువులయొక్క హారికా కృతియును = తెచ్చుటయును, నగర సంవేశన = నగరమును ప్రవేశించుటలో, ఆనందకళయు = ఆనందాతిశయమును, అనెడి వృత్తాంతములన్ = అనునట్టి విషయములచే, ఒప్పెడున్ = ఒప్పుచున్న, అధిపు చరిత్రము = నలుని వృత్తాంతము, ఆదిమధ్యావసానంబులు, అవధరించి = పరికించి, అమరముఖ్యులు = దేవతాశ్రేష్ఠులు, ఇన్ని దినములు, తారు = వారు, ఉన్కి = భూమిపై ఉంటుట, ఎఱుకపడగన్ = తెలియునట్లుగా, అలరువాన = పుష్పవర్షమును, కురియించిరి.

తా. సాటిలేని స్వయంవర మహోత్సవమును, మధుపర్క సత్కార మంగళ కృత్యమును, మనోహరమైన హోమమును, కౌతుక మందిర ప్రవేశమును, ఇరుపక్షములవారి భోజన క్రియలను, ప్రయాణ సమయ స్వస్తివాచకములును, అరణముగా వివిధ వస్తువులును తెచ్చుటయును, నగర ప్రవేశ సమయ ఆనందాతిశయమును అనునట్టి వృత్తాంతములచే ఒప్పుచున్న నలుని కథ తొలి మధ్య అంతములను పూర్తిగా చూసి ఇంద్రాదులు ఇన్ని దినములు వారు భూమిపైనే ఉండుటను తెలియపరచుచున్నట్లుగా పుష్పవర్షమును కురిపించిరి.

**25 తే. వికచ పౌరాంగనాపాంగ వీక్షణములు**
**హర్షితామర కృత పుష్ప వర్షములును**
**గురియ, నృపవీథి నరిగి భూవరుఁడు సొచ్చె**
**నీరజాక్షీ సమేతుఁడై నిజ గృహంబు**

భూవరుడు = రాజు, నీరజాక్షీ సమేతుడై = దమయంతితో కూడి, వికచ = వికసించిన, పౌరాంగనా = పురస్త్రీలయొక్క, అపాంగ వీక్షణములు = క్రీగంటి చూపులును, హర్షిత = సంతసించిన, అమర = దేవతలచే, కృత = వర్షింపబడిన, పుష్పవర్షములును, కురియన్ = తనపై కురియుచుండగా, నృపవీథిన్ అరిగి = రాజవీధిని వెళ్లి, నిజగృహంబును = తన భవనమును, చొచ్చెన్ = ప్రవేశించెను. (అలంకారము – తుల్యయోగిత)

తా. నలమహారాజు దమయంతితోకూడి సంతోషముతో వికసించిన పురస్త్రీలయొక్క క్రీగంటి చూపులును, సంతసించిన దేవతలచే వర్షింపబడిన పుష్పవర్షములును తనపై కురియుచుండగా రాజవీధిని వెళ్లి తన భవనమున ప్రవేశించెను.

**26 వ అట విబుధులు వృథా ప్రయోజనంబైన వసుధా ధావన ప్రయాస ఖేదం బనుభవించి పయోధి పాథ స్తరంగంబులుంబోలె వచ్చిన త్రోవయ పట్టి మరలిరప్పుడు**

తా. అక్కడ ఇంద్రాది దేవతలు నిష్ఫలమైన భూమికి పరుగిడుటవలన కలిగిన శ్రమను అనుభవించి సముద్ర తరంగములవలె వచ్చిన త్రోవను పట్టి మరలిరి. అప్పుడు

**27 తే. స్ఫటిక భూమీధ్రములమీఁదఁ బ్రతిఫలించు**
**నర్క బింబంబులునుబోలె నమరవరులు**
**కనక రథములమీఁద నాకాశ వీథిఁ**
**జారు నైసర్గిక ప్రభా సౌష్ఠవమున**

అమరవరులు = దేవతాశ్రేష్ఠులు, స్ఫటిక భూమీధ్రములమీదన్ = స్ఫటికపు పర్వతములమీద, ప్రతిఫలించు = ప్రతిబింబించుచున్న, అర్క బింబంబులును పోలెన్ = సూర్య బింబములవలె, ఆకాశవీథిన్ = గగనమార్గమున, కనక రథములమీదన్ = బంగారు రథములపై, చారు = సుందరమైన, నైసర్గిక = స్వభావసిద్ధమైన, ప్రభాసౌష్ఠవమునన్ = కాంతియొక్క ఒప్పిదముతో

తా. దేవతాశ్రేష్ఠులు స్ఫటికపు పర్వతములమీద ప్రతిబింబించుచున్న సూర్యబింబములవలె గగనమార్గమున బంగారు రథములపై అందమైన, స్వభావసిద్ధమైన కాంతి ఒప్పిదముతో –

**28 వ. చనునప్పుడు**

**29 మ. మెఱుఁగుం దీఁగల చాయఁ గేతనము గ్రొమ్మించారు పీతద్యుతిం**
**గొఱలం జక్ర విఘట్టనంబునఁ బరిక్షుణ్ణంబులై మేఘముల్**
**పఱియల్వాయఁగఁ గింకిణుల్మోరయఁగాఁ బాఱెన్నభోవీథి న**
**త్తఱి జంభాంతకు తేరు మాతలి కశాత్రస్తాశ్వ వేగంబునన్**

ఆ తఱిన్ = ఆ సమయమున, జంభాంతకు తేరు = ఇంద్రుని రథము, మాతలి = ఇంద్రుని సారథియొక్క, కశా = కొరడాకు, త్రస్త = భయపడిన, అశ్వ = గుఱ్ఱములయొక్క, వేగంబునన్, మెఱుగుం దీగల చాయన్ = మెఱుపు తీగల కాంతితో, కేతనము = ధ్వజము, క్రొమ్మించారు = క్రొత్త కాంతులచే ఒప్పు, పీతద్యుతిం = పచ్చని వర్ణముతో, కొఱలన్ = ప్రకాశింపగా, చక్ర

ఘట్టనంబునన్ = చక్రముల సంఘర్షణముచేత, పరిక్షుణ్ణంబులై = నలిగినవై, మేఘముల్, పఱియలు పాయగన్ = ముక్కలై చెదరిపోవుచుండగా, కింకిణుల్ = చిఱుగంటలు, మొరయగాన్ = ధ్వనిచేయుచుండగా, నభోవీథిన్ = ఆకాశమార్గమున, పాఱెన్ = పరుగెత్తెను.

తా. ఆ సమయమున ఇంద్రుని రథము సారథి మాతలి కొరడాకు భయపడిన గుఱ్ఱములయొక్క వేగమున మెఱుపు తీగలకాంతితో ధ్వజము క్రొత్తకాంతులతో ఒప్పు పచ్చని వర్ణముతో ప్రకాశింపగా, చక్రముల సంఘర్షణముచేత నలిగినవై మేఘములు ముక్కలై చెదరిపోవుచుండగా, చిఱుగంటలు ధ్వనిచేయుచుండగా ఆకాశమార్గమున పరుగెత్తెను.

**30 తే. మాటిమాటికి నాకాశ మండలమున**
**నవల నివలఁ బయోవాహ నివహమునకు**
**నమరనాథ రథాలంబియైన ధనువు**
**భాసురస్ఫూర్తి విభ్రమాభరణమయ్యె**

ఆకాశ మండలమునన్, పయోవాహ నివహమునకున్ = మేఘ సమూహమునకు, అవలన్ ఇవలన్ = రెండు ప్రక్కలయందు, మాటిమాటికిన్ = తఱచుగా, అమరనాథ = దేవేంద్రునియొక్క, రథ = రథమునందు, ఆలంబియైన = వ్రేలాడుచున్న, ధనువు = ఇంద్రధనుస్సుయొక్క, భాసుర స్ఫూర్తి = ప్రకాశమానమైన తళుకు, విభ్రమ ఆభరణము = విలాసార్థమైన అలంకారము, అయ్యెన్. (మేఘములకు ఇంద్రధనుస్సు అలంకారము)

తా. ఆకాశ మండలమున మేఘ సమూహమునకు రెండు ప్రక్కలయందును తఱచుగా దేవేంద్రుని రథమునందు వ్రేలాడుచున్న ఇంద్రధనుస్సుయొక్క తళుకు విలాసార్థమైన అలంకారమయ్యెను.

**31 క. ధళధళమని జలములలో**
**బలరిపు వజ్రాయుధంబు ప్రతిబింబింపన్**
**గెలఁకుల దండడిఁ దిరిగెడి**
**జలధరముల కపుడు కులిశ సంగతి గలిగెన్**

జలములలోనన్ = మేఘములందలి నీటిలో, బలరిపు వజ్రాయుధంబు = ఇంద్రుని వజ్రాయుధము, ధళధళమని, ప్రతిబింబింపన్ = ప్రతిబింబించగా, కెలకులన్ = పార్శ్వములందు, దండడిన్ = తఱుచుగా, తిఱిగెడి జలధరములకున్ = తిరుగు మేఘములకు, అప్పుడు = ఆ సమయమున, కులిశ సంగతి = వజ్రాయుధ సంబంధము, కలిగెన్.(అలంకారము – ఉత్ప్రేక్ష)

తా. మేఘములందలి నీటిలో ఇంద్రుని వజ్రాయుధము తళతళమని ప్రతిబింబించగా రథమునకు ప్రక్కలందు తఱుచుగా తిరుగుచున్న మేఘములకు ఆ సమయముననే వజ్రాయుధముతో సంబంధము కలిగెను.

**32 తే. వర్ణితంబైన సావర్ణి వంశమునకుఁ**
**బట్టు గొడుగైన యంభోజబాంధవునకుఁ**
**గూడ నేతెంచు గారాపుఁ గొడుకు చేతి**
**దండ మవ్వేళ నాలంబ దండమయ్యె**

వర్ణితంబైన = స్తుతింపబడ్డ, సావర్ణి వంశమునకున్ = మనువంశమునకు, పట్టు గొడుగు ఐన = ఛత్రమైన (రక్షకుడైన), అంభోజ బాంధవునకున్ = సూర్యునకు, కూడన్ = దాపునకు, ఏతెంచు = వచ్చుచున్న, గారాపు కొడుకు = ముద్దుల కొడుకైన యముని, చేతిదండము = చేతిలోని దండము, అవ్వేళన్ = ఆ సమయమున, ఆలంబ దండము = గొడుగు పట్టుకొను కామ, అయ్యెన్.(ఉదయ అస్తమయములందు సమాన వర్ణము కలవాడు కనుక సూర్యుడు సవర్ణుడు)

తా. స్తుతింపబడ్డ మనువంశమునకు రక్షకుడైన సూర్యుని చేరువకు వచ్చుచున్న ముద్దుల కొడుకైన యముని చేతిలోని దండము ఆ సమయమున గొడుగు పట్టుకొను కఱ్ఱ అయినది.(అలంకారము – రూపకము)

**33 ఆ. అధిక దూరమగుట నాకాశలక్ష్మికిఁ**
**గర్ణపాశమగుచుఁ గరము వొలిచె**
**దివ్య భవ్య కాంతి దేదీప్యమానమై**
**పాశపాణి పాణి పాశవల్లి**

పాశపాణి = వరుణునియొక్క, పాణి = చేతియందలి, పాశవల్లి = తీగెవంటి పాశము, దివ్య = దివ్యమైన, భవ్య = ఉత్తమమైన, కాంతి = శోభచే, దేదీప్యమానమై = ప్రకాశించుచున్నదై, అధిక దూరము, ఆకాశ లక్ష్మికి = ఆకాశమనెడి లక్ష్మికి, కర్ణపాశము = చెవిపోగు, అగుచున్, కరము = మిక్కిలి, పొలిచెన్ = ఒప్పెను.

తా. వరుణుని చేతిలోని పాశము దివ్యమైన, ఉత్తమమైన శోభతో ప్రకాశించుచున్నదై చాల దూరము ఆకాశలక్ష్మికి చెవిపోగు అగుచు మిక్కిలి ఒప్పియున్నది. (అలంకారము – రూపకము)

**34 తే. పరివహస్కంధ మారుతాస్ఫాలనమున**
**వీతిహోత్రుండు నర్తించు విధము చూచి**

**భీమనందన నీతడు పెండ్లియాడఁ**
**బోలునని యభ్రచరకోటి బుద్ధి దలఁచె**

అభ్రచర కోటి = దేవతాసమూహము, పరివహ స్కంధ = పరివహమనెడి స్కంధపు, మారుత = గాలియొక్క, ఆస్ఫాలనమున = తాకుటచే, వీతిహోత్రుండు = అగ్ని, నర్తించు విధము = జ్వాలగా ఆడెడు రీతిని, చూచి, భీమనందనను = దమయంతిని, ఈతడు, పెండ్లియాడన్ పోలునని, బుద్ధిన్, తలచెన్

తా. పరివహమనెడు స్కంధపు గాలియొక్క తాకుడుచే అగ్ని జ్వాలగా ఆడెడు రీతిని చూచి దేవతాసమూహము దమయంతిని ఇతడు పెండ్లియాడియుండెనని బుద్ధిని తలచిరి.

35 శా. **క్షోణీవల్లభు ముద్దుఁ గన్నె నునుఁబల్కుల్ గ్రోలుకో లేమి ని**
**ర్వాణానందములైన వీనులకుఁ దత్ప్రాయంబు గంధర్వరా**
**డ్వీణానాద మొకింత సమ్మదము గావింపంగ నింద్రాది గీ**
**ర్వాణాధీశ చతుష్టయం బరిగెఁ దారావీథి దూరంబునన్**

ఇంద్రాది గీర్వాణాధీశ చతుష్టయంబు = దిక్పాలకులు నలుగురును, క్షోణీవల్లభు ముద్దు కన్నె = దమయంతియొక్క, నును పల్కుల్ = మెత్తని మాటలు, క్రోలుకోలేమిన్ = వినలేకపోవుటచే, నిర్వాణ ఆనందములు ఐన = నివృత్తి చెందిన ఆనందము కలవైన, వీనులకున్ = చెవులకు, తత్ ప్రాయంబు = ఆ దమయంతి పలుకులతో సమానమైన, గంధర్వరాట్ వీణానాదము = గంధర్వరాజుయొక్క వీణానాదము, ఒకింత సమ్మదము = కొంచెము ఆనందమును, కావింపంగన్ = కలిగింపగా, తారావీథిన్ = నక్షత్రమార్గమున, దూరంబునన్ ఏగిరి = దూరము వెళ్లిరి.

తా. ఇంద్రాది దిక్పాలకులు నలుగురును దమయంతియొక్క మెత్తని మాటలను వినలేకపోవుటచే నివృత్తి చెందిన ఆనందముకలవైన చెవులకు ఆ దమయంతి పలుకులతో సమానమైన గంధర్వరాజుయొక్క వీణానాదము కొంచెము ఆనందమును కలిగించగా నక్షత్రమార్గమున దూరము వెళ్లిరి.(అలంకారము – వ్యతిరేకము)

36 ఉ. **చిత్తములోనఁ బాయక వసించిన భోజనృపాలకన్య న**
**త్యుత్తమ రాజుఁ గూర్చి సుర లూఱటఁ బొందిరి యెంతయేనియుం**
**జిత్తములోనఁ బాయక వసించిన నిర్మల తత్త్వవిద్య య**
**త్యుత్తమ శిష్యుఁగూర్చి గురుఁ డూఱటఁ బొందినయట్టి లాగునన్**

చిత్తములోనన్ = మనసులో, పాయక = విడువక, వసించిన, నిర్మల తత్త్వవిద్య = స్వచ్ఛమైన ఆధ్యాత్మికవిద్య, అత్యుత్తమ శిష్యున్ = మిక్కిలి యోగ్యుడైన శిష్యుని, కూర్చి = పొందించి, గురుడు, ఊఱటన్ = నెమ్మదిని, పొందినయట్టి లాగునన్ = పొందిన విధముగా, సురలు = ఇంద్రాది దేవతలు, చిత్తములోనన్ = తమ మనస్సులలో, పాయక = వదలక, వసించిన = ఉన్నటువంటి, భోజనృపాలకన్యన్ = దమయంతిని, అత్యుత్తమ రాజున్ = మిక్కిలి యోగ్యుడైన రాజునకు, కూర్చి = జతకూర్చి, ఎంతయేనియున్ = ఎంతగానో, ఊఱటన్ = సంతృప్తిని, పొందిరి. (అలంకారము – ఉపమ)

తా. తన మనసులో విడువక ఉన్నటువంటి ఆధ్యాత్మిక విద్యను మిక్కిలి యోగ్యుడైన శిష్యునకు ఇచ్చి గురువు శాంతము పొందినరీతిగా ఇంద్రాది దేవతలును తమ మనస్సులలో నిలిచినటువంటి భోజరాజ కన్య దమయంతిని మిక్కిలి యోగ్యుడైన నిషధరాజు నలునికి జతకూర్చి ఎంతగానో సంతృప్తిని పొందిరి.

37 సీ. **పక్షులు చరియించు పదవి నుల్లంఘించి**
**ఘనములు దిరుగు మార్గంబు గడచి**
**విద్యాధరశ్రేణి విహరించు పథ మెక్కి**
**కరువలి యేఁగెడు కక్ష్య సొచ్చి**
**గ్రహరాజు పాఱెడు ఘంటాపథము దాఁటి**
**చుక్కలు వొదలెంచు చక్కి వెడలి**
**చదలేఱు ప్రవహించు చాయ యుత్తరయించి**
**ధ్రువమండలంబు పెంద్రోవ నడచి**

తే. **యూర్ధ్వలోకంబునకుఁ బోవుచున్నవారు**
**భీమభూపాల సుతమీఁది ప్రేమభరము**
**వీడియును వీడ కాత్మ భావించువారు**
**వాసవుం డాదియైన గీర్వాణవరులు**

వాసవుండు ఆదియైన = ఇంద్రుడు మొదలైన, గీర్వాణవరులు = దేవతాశ్రేష్ఠులు, పక్షులు చరియించు పదవిన్ = పక్షులు సంచరించు మార్గమును, ఉల్లంఘించి = దాటి, ఘనములు తిరుగు మార్గమున్ = మేఘములు సంచరించెడు మార్గమును,

కడచి = దాటి, విద్యాధర శ్రేణి = విద్యాధరుల సమూహము, విహరించు పథము = సంచరించు మార్గమును, ఎక్కి, కరువలి = వాయువు, ఏగెడి కక్ష్య = సంచరించెడు మార్గమును, చొచ్చి, గ్రహరాజు = సూర్యుడు, పాఱెడు = పయనించు, ఘంటాపథము = రాజమార్గమును, దాటి, చుక్కలు = నక్షత్రములు, పొడతెంచ చక్కి = కనిపించు మార్గమును, వెడలి = వెళ్ళి, చదలేఱు = ఆకాశగంగ, ప్రవహించు చాయ = ప్రవహించు ప్రదేశమును, ఉత్తరియించి = దాటి, ధ్రువమండలంబు, పెను త్రోవ = గొప్ప మార్గమును, కడచి = దాటి, భీమభూపాల సుతమీది = దమయంతి మీదనున్న, ప్రేమభరము = ప్రేమాతిశయమును, వీడియు వీడక, ఆత్మన్ = మనసునందు, భావించువారు = తలంచుచున్నవారయి, ఊర్థ్వలోకంబునకున్, పోవుచున్నవారు,

తా. ఇంద్రుడు మొదలైన దేవతలు పక్షులు సంచరించు మార్గమును, మేఘముల మార్గమును, విద్యాధరులు సంచరించు మార్గమును, వాయుమార్గమును, సూర్య సంచార మార్గమును, నక్షత్ర మండలమును, ఆకాశగంగను, ధ్రువమండలమును దాటి దమయంతిమీది ప్రేమను వదలియు వదలక మనసునందు తలంచుచున్నవారై స్వర్గలోకమునకు పోవుచుండిరి.

**38 మహాస్రగ్ధర కని రంతంత న్నభోమార్గమున ఘన తమ స్కాంద సందేహ సంపా**
**దన లీలా జాగరూకాతను వికట తనూ ధామ ధూమాయితంబున్**
**వనరాశ్యంత స్తరంగ ధ్వని సమధిక దు ర్వార కోలాహలంబున్**
**జనసందోహంబు భూషాచ్ఛవి ధగధగితా శాకటా హోదరంబున్**

అంతంతన్ = కొంతదూరములో, నభోమార్గమునన్ = ఆకాశమార్గమునందు, ఘన = దట్టమయిన, తమస్కాండ = చీకటి గుంపేమోయనెడి, సందేహ = సంశయమును, సంపాదన లీలా = కలిగించుటయను విలాసమునందు, జాగరూక = అప్రమత్తమైయున్న, అతను = విస్తారమైన, వికట = విరుద్ధమై, తనూధామ = శరీర కాంతులచే, ధూమాయితంబున్ = పొగవలె కనబడుచున్నదియు, వనరాశి అంతః = సముద్రములోని, తరంగ ధ్వని = అలల చప్పుడుకంటె, సమధిక = అధికమైన, దుర్వార = వారింపశక్యముకాని, కోలాహలంబున్ = కలకలధ్వనికలదియు, భూషాచ్ఛవి = అలంకార కాంతులచే, ధగధగిత = ధగధగలాడుచున్న, ఆశాకటాహ = దిక్కుల భూములుకల, ఉదరంబున్ = మధ్యభాగము కలదియునగు, జనసందోహంబున్ = జనసముదాయమును, కనిరి = చూచిరి.(అలంకారము – రూపకము, ఉపమ)

తా. ఆ దిక్పాలకులు కొంతదూరములో ఆకాశమార్గమునందు దట్టమైన చీకటియనడి సందేహమును కలిగించుచున్న అప్రమత్తమైయున్న విస్తారమైన విరుద్ధమైన శరీర కాంతులచే పొగవలె కనబడుచున్నదియు, సముద్రములోని అలల చప్పుడుకంటె అధికమైన వారింపశక్యముకాని కలకలధ్వనికలదియు, భూషణముల కాంతులచే ధగధగలాడుచున్న దిక్కుల మధ్యభాగము కలదియునగు జనసముదాయమును చూచిరి.

**39 తే. ఇరులు గవియుచు నేరాళ మెట్టయెదుర**
**నల్లనల్లన నేతెంచె నల్లమంది**
**గరిమ నాకాశచరుల కాకాశవీథి**
**గదలి యెదురుగ వచ్చెనో కాక యనఁగ**

ఏరాళము = అధికమైన, నల్లమంది = నల్లని జనులు, ఇరులు = చీకట్లను, కవియుచున్ = వ్యాపింపచేయుచు, ఆకాశ వీథిన్ = ఆకాశ మార్గమున, కదలి = బయలుదేరి, గరిమన్ = గౌరవముతో, ఆకాశచరులకున్ = దిక్పాలకులకు, ఎదురుగన్ వచ్చెనో కాక, అనగన్, ఎట్టయెదుర, అల్లనల్లన్ = మెల్లమెల్లగా, ఏతెంచెన్ = వచ్చిరి.(అలంకారము –ఉత్ప్రేక్ష)

తా. విస్తారమైన నల్లని జనులు చీకట్లను వ్యాపించచేయుచు ఆకాశమార్గమున బయలుదేరి గౌరవముతో దిక్పాలకులకు స్వాగతమునకు వచ్చిరో అనునట్లుగ ఎదురకు మెల్లమెల్లగా వచ్చిరి.

**40 వ. ఆ జనసమూహంబు ముందట**

**41 సీ. రతిదేవి నెవ్వీఁగు రారాపుఁ జన్నులు**
**గడకన్నులకు నింపు గడలుకొలుప**
**గుడుసైన పూవింటిఁ గూడి కమ్మనితూపు**
**కటకాముఖపుఁ గేలఁ గరము మెఱయఁ**
**గటిమండలంబుపైఁ గనకంపుఁ జెఱఁగుల**
**జిలుఁగుఁ బచ్చని పట్టుఁ జేల మమర**
**నాలీఢ పాదవిన్యాసంబు శృంగార**
**వీరాద్భుతములకు విందుసేయఁ**

**తే. జిన్ని చిగురాకుఁ జేర్కోలఁ జేతఁ బట్టి**
**పేరుటామని రాచిల్క తేరు నడుప**

**నుక్కడీఁదయి యేతెంచె నుక్కుమిగిలి**
**కలికి గారాపుఁ జెలికాఁడు కలికిమరుఁడు**

కలికి గారాపు చెలికాడు = కలిపురుషునకు ప్రియస్నేహితుడైన, కలికి మరుడు = అందగాడైన మన్మథుడు, రతిదేవి, నెవ్వీగు = మిక్కిలి నిక్కియున్న, రారాపున్ = ఒకదానితో ఒకటి ఒరసికొనుచున్న, చన్నులు, కడకన్నులకు = కంటికొనలకు, ఇంపున్ = ప్రీతిని, గడలు కొలుపన్ = పుట్టించుచుండగా, గుదుసైన = గుండ్రముగానున్నట్టి, పూవింటిన్ కూడి = పుష్పచాపముతో, కమ్మని తూపు = పరిమళముకల బాణము, కటకాముఖము కేలన్ = కటకాముఖ చేతియందు, (ఐదు వ్రేళ్లు కొంచెము వంచి బాణము పట్టిన ఆకార విశేషము కటకాముఖము), కరము = మిక్కిలి, మెఱయన్ = ప్రకాశింపగా, కటిమండలముపైన్ = మొలయందు, కనకంపు చెఱగుల = బంగారు అంచుల, జిలుగు = సన్నని, పచ్చని పట్టుచేలము = పచ్చని పట్టు వస్త్రము, అమరన్ = ఒప్పుచుండగా, ఆలీఢ పాదవిన్యాసంబు = ఆలీఢముగానుంచిన పాదము, (యుద్ధమందు విలుకాడు నుంచొను విధములు ఐదు, 1 ప్రత్యాలీఢము, 2 ఆలీఢము, 3 సమపదము, 4 విశాఖము, 5 మండలము) శృంగార వీరాద్భుతములకున్ = శృంగార వీర అద్భుత రసములకు, విందు చేయన్, చిన్ని చిగురాకు, చేర్కోల = తోలే కఱ్ఱగా, చేత పట్టి, పేరుట ఆమని = పేరున్న వసంతుడు, రాచిల్క తేరున్ = రామచిలుక రథమును, కడపన్ = నడుపుచుండగా, ఉక్కు మిగులన్ = శౌర్యము అతిశయింపగా, ఉక్కుడీడయి = శూరుడై, ఏతెంచెన్ = వచ్చెను.

తా. కలిపురుషునకు ప్రియస్నేహితుడైన మన్మథుడు రతిదేవి చన్నులు తన కన్నులకు ప్రీతిని గొల్పుచుండగా గుండ్రటి పుష్పచాపముతో పూ బాణమును కటకాముఖ చేతియందు ప్రకాశించుచుండగా, మొలయందు బంగారు అంచులుగల సన్నని పచ్చని పట్టువస్త్రము ఒప్పుచుండగా ఆలీఢముగా పాదమునుంచి శృంగార వీర అద్భుత రసములకు విందు చేయుచు చిగురాకు చెర్కోల చేతపట్టి ప్రసిద్ధుడైన వసంతుడు రామచిలుక రథమును నడుపుచుండగా శౌర్యము అతిశయింప శూరుడై వచ్చెను.

**42 ఉ. చీకటి తప్పునం బరుల చేడియలన్ రమియింప దూతికా**
**లోకముమాట తీపులకు లోపడి భీత్యభిమానలజ్జలన్**
**బోకడఁబెట్టి ప్రాణమొక పోఁకకుఁ గైకొనకుండు సాహసుల్**
**పైకొని చేరి తన్నుభయ పార్శ్వములందును భక్తిఁ గొల్చిరాన్**

చీకటి తప్పునన్ = జారత్వముచేత, పరుల చేడియలన్ = పరకాంతలను, రమియింపన్ = కూడుటకు, దూతిక ఆలోకము మాట తీపులకున్ = దూతికల మాట తీపులకు, లోపడి = లొంగిపోయి, భీతి అభిమాన లజ్జలన్, పోకడ పెట్టి = విడిచి పెట్టి, ప్రాణము ఒక పోకకున్ = ప్రాణమును ఒక పోకచెక్క పాటిగా, కైకొనకుండు = తలచనట్టి, సాహసుల్ = సాహసముకల కాముకులు, పైకొని = అతిశయించి, చేరి = సమీపించి, ఉభయపార్శ్వములందున్ = ఇరుప్రక్కలను, భక్తిన్ = భక్తితో, తన్నున్ = తనను, కొల్చిరాన్ = సేవించుచుండగా

తా. దూతికాజనుల ప్రియ వచనములకు లొంగిపోయి జారత్వముచే పరకాంతలను కూడుటకు భయమును, అభిమానమును, సిగ్గును విడిచిపెట్టి ప్రాణత్యాగమునకైన సిద్ధపడునట్టి సాహసముకల కాముకులు ఇరువైపుల సేవించుచు వచ్చుచుండగా

**43 తే. బుద్ధదేవ పరిస్పర్ధఁ బోలెఁ దాల్చె**
**లోక జిద్భావ మెవ్వాఁడు లోక మెఱుఁగ**
**నీశ్వరుని మీఁదఁ గలిగిన యీర్ష్యఁబోలె**
**నతనుఁడై యేలె నెవ్వఁడీ యఖిల జగము**

ఎవ్వాడు = ఏ మన్మథుడు, లోకము, ఎఱుగన్ = తెలుసుకొనునట్లుగా, బుద్ధదేవుని పరిస్పర్ధన్ పోలెన్ = బుద్ధదేవునితో పోటీయా యనునట్లుగా, లోకజిద్భావము = లోకమును జయించెడు ధర్మమును, తాల్చెన్ = వహించెను,(మన్మథుడు సహజముగనే లోకజిత్తు కాగా బుద్ధునితో పోటీకనుట ఉత్ప్రేక్ష), ఎవ్వడు = ఏ మన్మథుడు, ఈశ్వరునిమీదన్, కలిగిన యీర్ష్యన్పోలెన్ = కలిగిన ఈర్ష్యచేతనువలె, అతనుడై = అశరీరుడై, ఈ అఖిల జగమున్ = ఈ సమస్త లోకమును, ఏలెన్ = పాలించెనో (అలంకారము – ఉత్ప్రేక్ష)

తా. మన్మథుడు లోకము తెలుసుకొనునట్లుగా బుద్ధదేవునితో పోటీపడుచు లోకమును జయించెడు ధర్మమును వహించెను. ఆ మన్మథుడు శివునిమీద ఈర్ష్యచేతనువలె అశరీరుడై ఈ సమస్తలోకమును పాలించెను.
(బుద్ధునకు లోకజిత్ అని పేరు, శివుడు జగత్పాలకుడు, అశరీరుడు ఈ లక్షణములు మన్మథున కున్నవనుట)

**44 వ. అమ్మదనుండు త్రిభువనైక వీరుండు నాసీరగతుండై నభోమండలంబున గండుమీనుపడఁగ పొలుపారఁ జిగురుజగజంపు గొడుగునీడ వాడని వనమాల వక్షస్థలంబున గ్రాల రతియును దాను నేతెంచిన**

తా. మూడు లోకములకు ప్రధాన వీరుడైన, సేనాముఖమును పొందినవాడైన, ఆకాశమున మీనధ్వజము చక్కగ ప్రకాశించుచుండగా, చిగురు జాలరులుకల గొడుగునీడయందు వాడిపోని వనమాల వక్షస్థలమున ప్రకాశింపగా రతీదేవితో

కూడి వచ్చిన

45 తే. **నలునిఁ జూచిన పిదప మన్మథునిఁ జూడ**
**నాకనిలయుల నయనంబు లోఁకిలించె**
**నయ్యరోచక మమర వైద్య ద్వయంబు**
**దీర్పఁజాలునొ చాలదో తెలియరాదు**

నలునిన్, చూచిన, పిదప = తరువాత, మన్మథుని చూడన్, నాక నిలయుల = స్వర్గలోకవాసుల, నయనంబులు = కనులు, ఓకిలించెన్ = రోతచెందెను, అమర వైద్య ద్వయంబు = దేవ వైద్యులైన అశ్వి కుమారులు, ఆ అరోచకము = ఆ రోతను, తీర్పన్ = పోగొట్టుటకు, చాలునో, చాలదో, తెలియన్, రాదు.

తా. నలుని అందాన్ని చూచిన తరువాత స్వర్గలోకవాసుల కనులు మన్మథుని చూడాలంటే రోత పుడుతోంది. ఆ రోతను పోగొట్టడానికి దేవవైద్యులయిన అశ్వికుమారులైన సరిపోతారో లేదో తెలియదు.

46 సీ. **కట్టెఱ్ఱ సెరల దీర్ఘ విలోచనంబుల**
**కడలనగ్ని స్ఫులింగంబు లురల**
**జృంభించి మిగులంగఁ జేవుతించెడు మేనఁ**
**బ్రస్వేద జలముఁ గంపంబుఁ బొడమఁ**
**గుటిలమై చిమ్మచీఁకటి సంఘటించుచు**
**నిటలభాగమున భ్రూకుటి నటింప**
**నత్యంత గాఢ దంతాగ్ర పీడనమునఁ**
**సొట్ట వాతెఱ నెత్తు రుట్టిపడఁగఁ**

తే. **గటము లదరంగ మీసాలు గత్తరిల్లఁ**
**గంఠ కుహరంబునందు హుంకార మెసఁగ**
**నింగి నేలయుఁ దాటింప నంగలించు**
**పగిది నేతెంచెఁ గ్రోధంబు గగనవీథి**

కడు యెఱ్ఱ = మిక్కిలి యెఱ్ఱనైన, సెరల = రక్తరేఖలుకల, దీర్ఘవిలోచనంబుల కడలన్ = దీర్ఘములైన నేత్రముల కొనలయందు, అగ్నిస్ఫులింగములు = అగ్నికణములు, ఉరలన్ = ఒలుకుచుండగా, జృంభించి = ఆవులించి, మిగులంగన్ = మిక్కిలి, జేవుతించెడు మేనన్ = ఎఱ్ఱనైన దేహమునందు, ప్రస్వేదజలము = చెమటలును, కంపంబు = వణుకును, పొడమన్ = కలుగుచుండగా, కుటిలమై = వక్రమై, చిమ్మచీకటి = దట్టమైన చీకటిని, సంఘటించుచున్ = సమకూర్చుచు, భ్రూకుటి = బొమముడి, నిటలభాగమునన్ = నుదుటియందు, నటింపన్ = నటించుచుండగా, అత్యంత = మిక్కిలి, గాఢ = తీవ్రమైన, దంత అగ్ర పీడనమునన్ = పంటికొనల పీడచే, సొట్ట వాతెఱన్ = సొట్టపడిన పెదవియందు, నెత్తురు, ఉట్టిపడగన్ = ఉబికి వచ్చుచుండగా, కటములు = దవడలు, అదరంగన్ = చలించుచుండగా, మీసాలు, కత్తరిల్లన్ = చెదరుచుండగా, కంఠకుహరంబునందున్ = కంఠనాళమునందు, హుంకారము = హుంకార ధ్వని, ఎసగన్ = ఒప్పుచుండగా, నింగి నేలయున్, తాటింపన్ = కొట్టుకొనునట్లుగా, అంగలించుపగిదిన్ = ఉత్సాహము చూపించునట్లు, క్రోథంబు = కోపము, గగనవీథిన్ = ఆకాశవీథిని. ఏతెంచెన్ = వచ్చెను. (అలంకారము – ఉత్ప్రేక్ష, అతిశయోక్తి)

తా. మిక్కిలి యెఱ్ఱనైన రక్తరేఖలుకల దీర్ఘములైన కంటికొనలయందు అగ్నికణములు రాలుచుండగా ఆవులించి మిక్కిలి ఎఱ్ఱనైన దేహమునందు చెమటయు, వణుకును కలుగుచుండగా వక్రమై దట్టమైన చీకటిని సమకూర్చుచు బొమముడి నుదుటియందున నాట్యముచేయుచుండగా మిక్కిలి తీవ్రమైన పంటికొనటపీడచే సొట్టపడిన పెదవియందు నెత్తురు ఉబికి వచ్చుచుండగా, దవడలు చలించుచుండగా, మీసాలు చెదరుచుండగా, కంఠనాళమునందు హుంకారము ఒప్పుచుండగా, ఆకాశము నేల కొట్టుకొనునట్లుగా ఉత్సాహము చూపించునట్లు కోపము గగనవీథిని వచ్చెను.

47 స్రగ్ధర **ఆక్రోశాక్రోశ ఘోషంబయి వికట కఠో రాట్టహాసోద్భటంబై**
**వక్రభ్రూవల్లరీ సంవలన భయదమై స్ఫార నిశ్వాసధారా**
**చక్రంబై రక్త రూక్షేక్షణమయి విగత క్షాంతియై నిర్దయంబై**
**యా క్రోధం బభ్రవీథిన్ హఠగతి నమృతాహారులన్ ధిక్కరించెన్**

ఆక్రోశ = రెండు మైళ్ళవరకు వినిపించెడు, ఆక్రోశ ఘోషంబై = తిట్ల ధ్వనికలదై, వికట = విరుద్ధమును, కఠోర = దుస్సహమైనదియునైన, అట్టహాస = పెద్దనవ్వుచే, ఉద్భటంబై = భయంకరమైనదై, వక్ర = కుటిలమైన, భ్రూవల్లరీ = లతవంటి కనుబొమలయొక్క, సంవలన = తిరుగుటచే, భయదంబై = భయమును కలిగించునదై, స్ఫార = వర్ధిల్లుచున్న, నిశ్వాసధారా = నిట్టూర్పు గాలియొక్క, చక్రంబై = సమూహముకలదై, రక్త రూక్షేక్షణమయి = ఎఱ్ఱని వికృతములైన చూపులుకలదై, విగతక్షాంతియై =

ఓర్పు లేనిదై, నిర్దయంబై = దయలేనిదై, ఆ క్రోధంబు = ఆ వచ్చిన క్రోధము, హఠగతిన్ = బలవంతపు నడకచే, అభ్రవీథిన్ = ఆకాశవీథిలో, అమృతాహారులన్ = దేవతలను, ధిక్కరించెన్ = తిరస్కరించెను.

తా. క్రోశము దూరమువరకు వినిపించెడు తిట్ల ధ్వనికలదై, విరుద్ధమును, దుస్సహమునైన పెద్దనవ్వుచే భయంకరమైనదై, కుటిలమైన బొమముడి తిరుగుటచే భయమును కలిగించునదై, వర్ధిల్లుచున్న నిట్టూర్పు గాలియొక్క సమూహము కలదై, ఎఱ్ఱని వికృతములైన చూపులు కలదై, ఓర్పు లేనిదై, దయలేనిదై ఆ క్రోధము బలవంతపు నడకచే ఆకాశవీథిలో దిక్పాలకులను తిరస్కరించెను.

**48 ఉ. ఈసునఁ బుష్పసాయకుని యేటునకుం గడు దూరమైన దూ**
**ర్వాసుని నెమ్మనంబునఁ దిరంబుగ మన్నెముదన్ని రాజ్య సిం**
**హాసన మెక్కకుండఁ దను నాఁగిన క్రోధముఁ జూచి భీతిమై**
**వాసవు డొయ్యనొయ్య నఱ్రాలిచె ఱెప్పలు వేయుఁ గన్నులన్**

ఈసునన్ = వైరముచే, పుష్పసాయకుని = మన్మథుని, ఏటునకున్ = బాణపు దెబ్బకు, కడు దూరమైన = మిక్కిలి లొంగని వాడైన, దూర్వాసుని, నెమ్మనంబునన్ = మనసునందు, తిరంబుగ = స్థిరముగా, మన్నెముదన్ని = రాజ్య మేలుచు, రాజ్య సింహాసనము ఎక్కకుండ, తనున్ ఆగిన క్రోధమున్ = ఇంద్రుని నిల్పగలిగిన క్రోధమును, చూచి, భీతిమైన్ = భయముతో, వాసవుడు = ఇంద్రుడు, ఒయ్యన్ ఒయ్యన్ = మెల్లమెల్లగా, వేయు గన్నులన్, ఱెప్పలు, అఱ్రాలిచె = సగము మూసెను.

తా. శత్రుత్వముతో మన్మథుని బాణపు దెబ్బకు మిక్కిలి లొంగనివాడైన దూర్వాసుని మనసునందు స్థిరముగా తలచుకొనుచు తనను సింహాసన మెక్కకుండ నిల్పిన క్రోధమును చూచి భయముతో ఇంద్రుడు మెల్లమెల్లగా వేయి కన్నుల ఱెప్పలను సగము మూసికొనెను. (దూర్వాసుడు ఇంద్రుని రాజ్యభ్రష్టుని కమ్మని శపించెను)

**49 తే. మందునఁట దాను హృదయ మర్మములఁ దవిలి**
**కన్నుఁగవ నంధకారంబు గవయుటెట్లు**
**రాగ మొనరించునఁట తా విరక్తి యెట్లు**
**తన ప్రభావంబు క్రోధంబు తాన యెఱుగు**

తాను = క్రోధము, హృదయ మర్మములన్ = మనసును, మర్మస్థానములను, తవిలి = చొచ్చి, మందునట, కన్నుగవన్ = రెండుకన్నులను, అంధకారంబు = చీకటి, గవయుట ఎట్లు = ఎలా వ్యాపించును.రాగము = ఎఱ్ఱదనమును (అనురాగమును), ఒనరించునట = కలిగించునట, తాన్ = తాను, విరక్తి ఎట్లు = రాగములేనిదగుట ఎలా?, క్రోధంబు, తన ప్రభావంబు = తన శక్తిని, తాన = తానే, ఎఱుగు = తెలిసికొనును.(అలంకారము – విరోధాభాసము)

తా. క్రోధము మనసును, మర్మస్థానములను చొచ్చి మండుచుండగా కన్నులకు చీకటి ఎలా వ్యాపించును? కోపము వచ్చినపుడు కనులెఱ్ఱబడుట, అన్ని వస్తువులను నిరసించుట సహజము. రాగము కలిగించుచుండగా రాగములేనిదెట్లగును? కావున క్రోధము తన శక్తి తానే ఎఱుగును. క్రోధశక్తిని ఎవరూ తెలిసికొనజాలరు.

**50 మ. భ్రుకుటీ కాల భుజంగ రాజతరుణీ ఫూత్కార శంకావహా**
**ధిక నిశ్వాస సమీరణ ధ్వనులు సంతీక్ష్ణాగ్ర దంతావళీ**
**సకలీభూత నిజాధరోష్ఠ రుధిరస్రావ ప్రతి ద్వంద్వి ర**
**క్త కటాక్షుల్ దన పారిపార్శ్వకులుగా దర్పంపుఁ బెంపేర్పడన్**

భ్రుకుటీ = బొమముడి యనెడి, కాలభుజంగరాజ తరుణీ = కాలసర్పరాజుయొక్క స్త్రీయొక్క, ఫూత్కార = ఫూత్కార ధ్వనులనెడి, శంకావహ = సందేహమును కలిగించెడి, అధిక, నిశ్వాస = నిట్టూర్పుల, సమీరణ = గాలియొక్క, ధ్వనులు = ధ్వనులుకలవాడును, తీక్ష్ణ = వాడియైన, అగ్రదంతావళీ = దంతాగ్రముల పంక్తిచే, శకలీభూత = చూర్ణముగా చేయబడిన, నిజ = తనయొక్క, అధరోష్ఠ = క్రిందిపెదవియొక్క, రుధిరస్రావ = రక్తము కారుటయొక్క, ప్రతిద్వంద్వి = సామ్యముకల, రక్త = ఎఱ్ఱని, కటాక్షుల్ = కడకన్నులు కలవారును, తన పారిపార్శ్వకులు = తన అనుచరులు, కాన్ = అగుచుండగా, దర్పంబు పెంపు = గర్వాతిశయము, ఏర్పడన్ = స్పష్టమగునట్లుగా

తా. బొమముడి యనెడి కాలసర్పరాజ స్త్రీయొక్క ఫూత్కార ధ్వనులనెడి సందేహమును కలిగించు నిట్టూర్పుల గాలియొక్క ధ్వనులు కలవారును, వాడియైన దంతాగ్రముల పంక్తిచే చూర్ణముగా చేయబడిన తనయొక్క క్రిందిపెదవియొక్క రక్తము కారుటతో సామ్యముకల ఎఱ్ఱని కడకన్నులు కలవారునుగా తన అనుచరులు అగుచుండగా గర్వాతిశయము స్పష్టమగునట్లుగా

**51 వ. ఇట్లేతెంచె ననంతరంబ**

**52 తే. హస్తములు విస్తరించుచు నఱపలుకుచుఁ**
**గంఠ గద్గదికావ్యక్త కాకు వికృతి**
**రాలువడఁ బండ్లిగిల్చుచు డీలుపాటుఁ**

**ప్రకట దైన్యంబుఁ దోఁప లోభంబు వచ్చె**

లోభంబు = లోభమనెడి గుణము, హస్తములు = చేతులు, విస్తరించుచు = చాచుచు, అఱ పలుకుచున్ = సగమే పలుకుచు, కంఠ గద్గదికా = బొంగురు గొంతుతో, అవ్యక్త = స్పష్టముకాని, కాకు వికృతి = స్వర వికారము, రాలుపడన్ = కంపించుచుండగా, పండ్లు ఇగిల్చుచున్ = పండ్లిగిలించుచు, డీలుపాటున్ = దిగులుపడుటయు, ప్రకట దైన్యంబున్ = స్పష్టమైన దీనత్వమును, తోపన్ = కనబడునట్లుగా, వచ్చెన్

తా. చేతులు చాచుచు, సగమే పలుకుచు, బొంగురు గొంతుతో స్పష్టముకాని స్వర వికారమున కంపించుచుండగా పండ్లిగిలించుచు దిగులుపాటును, దీనత్వమును కనబడునట్లుగా లోభము వచ్చెను

**53 సీ. కడుపు మండించు నాఁకటి చిచ్చు సెగ దాఁకి**
**గవరనైయున్న కన్గవలవారు**
**భోగించువారలఁ బుల్కు పుల్కునఁ జూచి**
**మెల్లన గ్రుక్కిళ్ళు మింగువారు**
**కుక్షింభరిత్వంబు కొలఁది కగ్గలముగాఁ**
**గూడెంత వెట్టినఁ గుడుచువారు**
**ప్రాణగొడ్డములైన పరమ సాహసములఁ**
**బరుల సొమ్ముల కాస పడెడువారు**

**తే. పామునకు బలి వెట్టని ప్రతినవార**
**లీఁగకెన్నఁడునే నిలి యిడనివారు**
**ధనము గాఁపున్న దయ్యాలఁ దఱుమువారు**
**బలిసి లోభంబు నిరువంకఁ గొలుచువారు**

కడుపున్, మండించున్ = మంటరేపుచున్న, ఆకటి చిచ్చు సెగ = ఆకలి అగ్ని జ్వాలలు, తాకి = వ్యాపించుటచే, గవరపై యున్న = ఎఱ్ఱబడిన, కన్గవలవారు = కన్నులజంటకలవారు, భోగించువారలన్ = అనుభవించుచున్నవారిని, పుల్కు పుల్కునన్ = కళ్ళు మిఱుమిట్లు పడగా, చూచి, మెల్లన, గ్రుక్కిళ్ళు మింగువారు = గుటకలు వేయువారును, కుక్షింభరిత్వంబు = పొట్టపోసికొనుట, కొలదికి = మితికి, అగ్గలముగాన్ = అధికముకాగా, కూడు = అన్నము, ఎంత వెట్టినన్ = ఎంత పెట్టినను, కుడుచువారు = తినువారును, ప్రాణగొడ్డములైన = ప్రాణములను హరించునవైన, పరమ సాహసముల = గొప్ప సాహసకృత్యములచేత, పరుల సొమ్ములకు, ఆస పడెడువారు, పామునకు, బలి వెట్టని = ఉపహారము పెట్టని, ప్రతినవారలు = ప్రతిజ్ఞ కలవారు, ఈగకు, ఎన్నడునేన్ = ఏ నాడును, ఇలి ఇడనివారు = ఎంగిలిమెతుకును పెట్టనివారు, ధనము = సంపదకు, కాపున్న = కాపలాగావున్న, దయ్యాలన్ = పిశాచములనైనను, తఱుమువారు, బలిసి = సంపదతో బలిసి, లోభంబున్ = లోభగుణమును, ఇరువంకన్ = తాము తినక, ఇతరులకు పెట్టక రెండు విధముల, కొలుచువారు = సంపదకు కాపలాకాయువారు.

తా. కడుపులో ఆకలి మంట రేగుచుండగా ఎఱ్ఱబడిన కన్నులుకలవారు, అనుభవించువారిని చూచి కళ్ళు మిఱుమిట్లుపడగా చూచి మెల్లగా గుటకులు మ్రింగువారు, పొట్టపోసికొనుట మితికి అధికముకాగా ఎంత పెట్టినా అన్నము తినువారు, ప్రాణములను హరించునట్టి గొప్ప సాహసకృత్యములను చేసి పరుల సొమ్ముకు ఆశపడెడువారు, పాముకు బలిపెట్టని ప్రతిజ్ఞకలవారు, ఈగకు ఏ నాడును ఎంగిలిమెతుకు విదల్చనివారు, సంపదకు కాపున్న పిశాచముల నైనను తఱిమికొట్టువారు, సంపదతో బలిసి లోభగుణముతో తాము తినక ఇతరులకు పెట్టక రెండు విధముల సంపదకు కాపలాకాయువారు. (పై పద్యములో లోభము గుణములు చెప్పి ఈ పద్యమున లోభుల గుణములు చెప్పినాడు)

**54 మ. కమియం బాపము లొందు రెండు వరుసం గల్పింపఁగాఁ జాలు కో**
**పముఁ గామంబును నిచ్చ మెచ్చక యహంభావంబుతో నుండు బం**
**చ మహాపాతక సంగ్రహైక ఘటనా చాతుర్య ధుర్యంబు లో**
**భము లోభంబుగదా గుణ ద్విరదరాట్పంచాస్య మూహింపగన్**

కమియన్ =నలిగిపోయి, వరుసన్ = క్రమముగా, పాపములు = పాప కృత్యములు, ఒందు రెండు, కల్పింపగాన్ = ఒనర్చుటకు, చాలు = సమర్థమైన, కోపము, కామంబునున్. పంచమహాపాతక = ఐదు గొప్ప పాతకములను, సంగ్రహ = సంపాదించుటయందు, ఏక ఘటనా = మిళితము చేయుటయందు, చాతుర్య = నేర్పుచే, ధుర్యంబు = శ్రేష్ఠమైనది. లోభంబు = లోభగుణము, ఇచ్చమెచ్చక = రెండుపాతకములను (కామ,క్రోధములు)మెచ్చుకొనక, అహంభావంబుతోన్ = అహంకారముతో, ఉండున్ = వర్తించు, ఊహింపగన్ = ఆలోచింపగా, లోభంబుగదా = లోభగుణమేకదా!, గుణ = గుణములనెడి, ద్విరదరాట్ = ఏనుగుమిన్నలకు, పంచాస్య = సింహమువంటిది, (అలంకారము – అతిశయోక్తి)

తా. నలిగిపోయి క్రమముగా పాపకృత్యములు ఒకటి, రెండు ఒనర్చుటకు సమర్థమైన కోపము, కామములను ఐదు

గొప్ప పాతకములను సంపాదించుటయందు, మిళితము చేయుటయందు నేర్పుచే శ్రేష్ఠమైనది. లోభగుణము రెండు పాతకములను మెచ్చుకొనక అహంకారముతో వర్తించు ఆలోచింపగా లోభగుణమేకదా! గుణములనెడి ఏనుగు మిన్నలకు సింహమువంటిది.

55 సీ. **ఇన్ని యింద్రియములు నెవ్వానికి గృహంబు**
**లట విశేషంబు జిహ్వాంచలంబు**
**సంప్రార్థనాధీన చాటూక్తి యెవ్వాని**
**కాజన్మ సంసిద్ధమైన మతము**
**పాత్రహస్తములపైఁ బడు దాన జలవృష్టి**
**వారించు నెవ్వాఁ డవగ్రహమయి**
**యన్య విత్తాపేక్ష యాత్మ విత్తాపరి**
**త్యాగ మెవ్వని యంతరంగగుణము**
తే. **జారచోరాది ధూర్తవిహారభూమి**
**దైన్య కార్పణ్య జలరాశి ధవళకరుఁడు**
**కలిమహారాజు నెచ్చెలికాఁడు లోభు**
**డతడు సురలకు జోహారు ననుచు మ్రొక్కె**

ఎవ్వానికిన్ = ఏ లోభునకు, ఇన్ని ఇంద్రియంబులు = ఇంద్రియములన్నియును, గృహంబులు = నివాసస్థానములగు చున్నవియో, అటన్ = ఆ ఇంద్రియములలో, విశేషంబు = ముఖ్య నివాసస్థానము, జిహ్వ అచలంబు = నాలుక తుదయో, ఎవ్వానికి = ఏ లోభునకు, సంప్రార్థనాధీన = యాచనకధీనమైన, చాటూక్తి = చాటు వచనము, ఆజన్మ సంసిద్ధము = పుట్టుకతోడనే లభించినది. ఎవ్వాడు = ఏ లోభుడు, అవగ్రహమయి = అనావృష్టి దోషమయి, పాత్రహస్తములపై = దానార్హులగువారి చేతులలో, పడు = పడుచున్నట్టి, దానజలవృష్టికిన్ = దానజలమనెడి వర్షమును, వారించున్ = నివారించుచున్నాడో, అన్యవిత్తాపేక్ష = పరధనాభిలాషయు, ఆత్మవిత్తాపరిత్యాగము = స్వీయ ధనమును విడువకుండుటయు, ఎవ్వని = ఏ లోభుని, అంతరంగ గుణము = అంతరంగమందుండెడి గుణమో, ఎవడు, జార, చోర, ఆది = మొదలైన, ధూర్త = ధూర్తజనులకు, విహారభూమి = విహారస్థానమైనవాడో, ఎవడు, దైన్య = దీనత్వము, కార్పణ్య = దారిద్ర్యము అనెడి, జలరాశి = సముద్రమునకు, ధవళకరుడు = చంద్రునివంటివాడో, కలిమహారాజు, నెచ్చెలికాడు = స్నేహితుడు, అతడు = ఆ, లోభుడు, సురలకు = దేవతలకు, జోహారుననుచు, మ్రొక్కెన్

తా. ఏ లోభునకు పంచేద్రియములును నివాసస్థానములగుచున్నవియో, ఆ ఇంద్రియములలో నాలుక తుద ముఖ్య నివాసస్థానమో, ఏ లోభునకు యాచనకధీనమైన చాటు వచనము పుట్టుకతోనే లభ్యమో, ఏ లోభుడు అనావృష్టి దోషమయి దానార్హులగువారి చేతులలో పడుచున్నట్టి దానజలమనెడి వర్షమును నివారించుచున్నాడో, పరధనాభిలాషయు, స్వీయ ధనమును విడువకుండుటయు ఏ లోభుని అంతరంగ గుణములో, ఏ లోభుడు జారులు, చోరులు మొదలైన ధూర్తజనులకు విహారస్థానమైనవాడో, ఏ లోభుడు దైన్యము, దారిద్ర్యము అనెడి సముద్రమునకు చంద్రునివంటివాడో, ఏ లోభునకు కలిమహారాజు స్నేహితుడో ఆ లోభుడు దేవతలకు జోహారనుచు నమస్కరించెను.

56 వ. **అనంతరంబ**

57 మ. **తనకుం బట్టపురాణి వాసమగు మిథ్యాదృష్టి చేసేతఁ గీ**
**ల్కొన హత్తించి విరించి ముఖ్య దివిషత్కోటి న్విడంబించుచున్**
**ఘనమార్గంబున నేఁగుదెంచెను మహాకాయంబు మోహంబు మో**
**హన విద్యాగమ సంప్రదాయ ఘటనా వ్యాపార మేపారగన్**

మహా కాయంబు = గొప్ప శరీరముకల, మోహంబు = మోహము, మోహనవిద్యా = మోహింపచేయు విద్యయనెడు, ఆగమ = శాస్త్రముయొక్క, సంప్రదాయ = సంప్రదాయమును, ఘటనా = కూర్చుటయను, వ్యాపారము = క్రియ, ఏపారగన్ = వర్ధిల్లునట్లుగా, తనకున్ = మోహమునకు, పట్టపురాణి వాసమగు = పట్టపుదేవియైన, మిథ్యాదృష్టిచేన్ = అసత్య జ్ఞానముచే, చేసేతన్ = తనచేతితో, కీల్కొనన్ హత్తించి = గట్టిగా పట్టుకొని, విరించి ముఖ్య = బ్రహ్మ మొదలైన, దివిషత్ కోటిన్ = దేవతాసమూహమును, విడంబించుచున్ = తన అధీనము గావించుకొనుచు, ఘనమార్గమునన్ = ఆకాశమునుండి, ఏతెంచెన్ = వచ్చెను.

తా. పెద్ద శరీరముకల మోహము మోహింపచేయు విద్యయనెడు శాస్త్రముయొక్క సంప్రదాయమును కూర్చుటయను వ్యాపారము వర్ధిల్లునట్లుగా, తన పట్టపురాణియైన అసత్య జ్ఞానము చేతిని గట్టిగా పట్టుకొని బ్రహ్మ మొదలైన దేవతా సమూహమును తన అధీనము గావించుకొనుచు ఆకాశనుండి వచ్చెను.

58 తే. **బాలు రాత్మ కుటుంబ జంబాలమగ్ను**
**లనధిగత శాస్త్రు లనధీతు లలసమతులు**

**దన్ను సేవింప మోహంబు దప్పుంద్రోవ**
**నల్లనల్లన సురల డాయంగ వచ్చె**

మోహంబు = మోహము, బాలురు = జ్ఞాన హీనులు, ఆత్మ = తమయొక్క, కుటుంబ = సంసారమనెడి, జంబాల = బురదలో, మగ్నులు = మునిగినవారును, అనధిగత శాస్త్రులు = ఏ శాస్త్రము చదువనివారును, అనధీతులు = వేదము చదువనివారును, అలసమతులు = వివేకము లేనివారును, తన్ను సేవింప = తనను సేవించుచుండగా, తప్పు త్రోవన్ = అన్యాయ మార్గమున, అల్లన అల్లన = మెల్లమెల్లగా, సురలన్ = దిక్పాలకులను, డాయంగన్ = చేరుటకు, వచ్చెన్

తా. మోహము జ్ఞానహీనులు, తమ సంసారమనెడి బురదలో మునిగినవారు, ఏ శాస్త్రము చదువనివారు, వేదము చదువనివారు, వివేకము లేనివారు తనను సేవించుచుండగా అన్యాయమార్గమున మెల్లమెల్లగా దిక్పాలకులను చేరుటకు వచ్చెను.

**59** సీ. **జ్ఞాన ప్రదీపికా జంఝూ సమీరంబు**
**కామ లోభ క్రోధ కారణంబు**
**సంసార కపటేంద్రజాల విద్యా పింఛ**
**మామ్నాయ పథ కంటకాంకురంబు**
**శూన్య వాదారణ్య శుండాల కలభంబు**
**కుమత సిద్ధాంత విభ్రమ గృహంబు**
**బహుళ ఘట్ట కుటీ ప్రభాత దిగ్భ్రమ బంధు**
**వంధ పరంపరా వ్యాప్తి ఖురళి**
తే. **కన్నులకు నిద్రయును మదికన్ను శ్రుతికి**
**వినమియును జేయు నెద్ది భావించి చూడ**
**నమ్మహామహుం డెదురుగా నరుగు దేర**
**భ్రమసి చూచిరి వాసవాద్యమరవరులు**

ఎద్ది = ఏ మోహము, జ్ఞాన ప్రదీపికా జంఝూ సమీరంబు = జ్ఞానమనెడి దీపమునకు పెనుగాలివంటిది, కామ లోభ క్రోధ కారణంబు, సంసార, కపట ఇంద్రజాలవిద్యా, పింఛము = కుంచెవంటిదో, ఆమ్నాయ పథ = వేద మార్గమునకు , కంటక అంకురంబు = ముల్లువంటిదో, శూన్యవాద = నిరీశ్వర వాదమనెడు, అరణ్య = అడవికి, శుండాల కలభంబు = ఏనుగు గున్నవంటిదో, కుమత సిద్ధాంత = కుత్సిత సిద్ధాంతములకు, విభ్రమ గృహంబు = క్రీడా మందిరమో, బహుళ = అధికమైన, ఘట్టకుటీ ప్రభాత = పన్ను చెల్లింపకుండుటకు పక్కదారి పట్టి ఉదయానికి అక్కడికే చేరిన న్యాయమున, దిగ్భ్రమ = దిగ్భ్రాంతికి, బంధువు = చుట్టమువంటిదో, అంధ పరంపరా = గ్రుడ్డివారు ఒకరినొకరు అనుసరించి నూతిలో పడిన న్యాయముయొక్క, వ్యాప్తి = ప్రచారమునకు, ఖురళి = సాము చేసెడి స్థలమువంటిదో, భావించి చూడన్ = ఆలోచించి చూడగా, ఎద్ది = ఏ మోహము, కన్నులకున్, నిద్రయును, మదికిన్ = మనస్సునకు, అన్ను = పారవశ్యమును, శ్రుతికి = చెవికి, వినమియును = వినపడకుండుటయును, చేయున్ = చేయునో, ఆ మహామహుడు, ఎదురుగాన్, అరుగుదేరన్ = రాగా, వాసవాది అమరవరలు = ఇంద్రాది దేవతలు, భ్రమసి = భ్రాంతులై, చూచిరి.

తా. ఏ మోహము జ్ఞానమనెడి దీపమునకు పెనుగాలివంటిదో, కామ,లోభ,క్రోధములకు కారణమో, సంసారమనెడి మాయా ఇంద్రజాలవిద్యకు కుంచెవంటిదో, వేదమార్గమునకు ముళ్ళ మార్గమువంటిదో, నిరీశ్వరవాదమనెడు అరణ్యమునకు ఏనుగు గున్న వంటిదో, కుత్సిత సిద్ధాంతములకు క్రీడామందిరమో, గొప్పగా పన్ను చెల్లింపకుండుటకు పక్కదారిపట్టి ఉదయానికి తిరిగి అక్కడికే చేరినట్టు దిగ్భ్రాంతికి చుట్టమువంటిదో, గ్రుడ్డివారు ఒకరినొకరు అనుసరించి నూతిలో పడిన న్యాయముయొక్క ప్రచారమునకు సాముచేసెడి స్థలమువంటిదో, ఆలోచించి చూడగా ఏ మోహము కన్నులకు నిద్రయును, మనస్సునకు పారవశ్యమును, చెవికి వినపడకుండుటయును చేయునో ఆ మహామహుడు ఎదురుగా రాగా ఇంద్రాది దేవతాశ్రేష్ఠులు భ్రాంతితో చూచిరి.

**60** సీ. **పాతకంబులు నీలి పట్టుబొందదములు**
**పగలింటి నిద్రలు పచ్చడములు**
**పరదూషణంబులు ప్రాలంబహారంబు**
**లన్య కాంతాసక్తి యంగరాగ**
**మీర్ష్యా పరత్వంబు హేలావతంసంబు**
**బుధజన ద్వేషంబు పువ్వుదండ**
**మిథ్యా ప్రలాపంబు మృగనాభి తిలకంబు**

బహుళాశనత్వంబు పరికరముగఁ
తే. బరులఁ జూపులు వాకొల్పఁ బ్రసభలీల
రాసభాంగరుహాగ్ర ధూమ్ర ప్రకార
బర్బరాకార దేహు లంబరమునిండి
సరస వచ్చిరి కలిరాజ సైన్యభటులు

పాతకంబులు = పాపములు, నీలి పట్టుబొందడములు = నల్లని పట్టు చొక్కాలుగాను, పగలింటి నిద్రలు = పగటిపూట నిద్ర, పచ్చడములు = దుప్పట్లుగాను, పర దూషణంబులు = పరులను నిందించుటలు, ప్రాలంబ హారంబులు = మెడలో వ్రేలాడు హారములుగాను, అన్యకాంతాసక్తి = ఇతర స్త్రీలపై ఆశ, అంగరాగము = చందనపూతగాను, ఈర్ష్యా పరత్వంబు = అసూయపడుట, హేలావతంసంబు = శిరోభూషణముగాను, బుధజన ద్వేషంబు = పండితజనులపై ద్వేషము, పువ్వుదండ = పూలదండగాను, మిధ్యా ప్రలాపంబు = అసత్య భాషణము, మృగనాభి తిలకంబు = కస్తూరి బొట్టుగాను, బహుళ అశనత్వంబు = తిండిపోతు తనము, పరికరముగన్ = నడికట్టుగాను, ప్రసభలీలన్ = తొందరగా, రాసభ = గాడిదల, అంగరుహ = రోమములయొక్క. అగ్ర = కొనలందున్న, ధూమ్ర ప్రకార = బూడిదరంగు పోలికగల, బర్బరాకార = బర్బరజాతివారి రూపముకల, దేహులు = దేహములుకలవారు, కలిరాజ సైన్య భటులు, అంబరమునుండి, సరస = చెంతకు, వచ్చిరి.(అలంకారము – రూపకము)

తా. పాపములు నల్లని చొక్కాలుగాను, పగటిపూట నిద్ర దుప్పట్లుగాను, పరుల నిందించుట హారములుగాను, పరకాంతలను కోరుట చందనపూతగాను, అసూయపడుట శిరోభూషణముగాను, పండితజన ద్వేషము పూలదండగాను, అసత్య భాషణము కస్తూరి తిలకముగాను, తిండిపోతుతనము నడికట్టుగాను, తొందరగా గాడిదల రోమములయొక్క కొనలందున్న బూడిదరంగు పోలికగల బర్బరజాతివారి రూపమువంటి దేహముకలవారైన కలిరాజ సైనిక భటులు ఆకాశమునుండి దిక్పాలకుల చెంతకు వచ్చిరి.

**61 వ. ఆ సుభటుల యుభయ పార్శ్వంబుల**

**62 సీ. కుండ బొజ్జల క్రింద ద్రిండుగా బిగియించి**
**గడితంపు మడుఁగులు గట్టినారు**
**బూజువట్టిన దేహములపై దళంబుగా**
**మలయజ పంకంబు లలఁదినారు**
**నునుబట్ట తలలపైఁ గనకంపుఁ జెఱఁగుల**
**పట్టుచీరలు మూయఁ జుట్టినారు**
**కరము వ్రేలుదులైన కర్ణపాశంబులఁ**
**దోరంబుఁ బోఁగులు దొడిగినారు**
**తె. వెలయ మృగనాభి గీర్బొట్టు వెట్టినారు**
**పసిఁడి లాతాలు సేతులఁ బట్టినారు**
**చండ ముద్రాధరుల్ నభోమండలంబు**
**బూరటిల బట్లు కలిరాజుఁ బొగడి పొగడి**

కుండ బొజ్జల క్రిందన్ = కుండలవంటి కడుపులకు క్రిందుగా, ద్రిండుగా = బిగియించి, గడితంపు మడుగులు = ముదుక వస్త్రములు, కట్టినారు, బూజువట్టిన దేహములపైన్ = మలిన దేహములపై, దళంబుగాన్ = దట్టముగా, మలయజ గంధంబులు = మంచి గంధములు, అలందినారు = పూసినారు, నునుబట్ట తలలపైన్ = నున్నని బట్టతలలపైన, కనకంపు చెఱగుల పట్టు చీరలు = బంగారు అంచులుగల పట్టు వస్త్రములు, మూయన్ = బట్టతల కనపడకుండగా, చుట్టినారు, కరము = మిక్కిలి, వ్రేలుదులైన = వ్రేలాడుచున్నవైన, కర్ణపాశంబులన్ = చెవులందు, తోరంపు బోగులు = పెద్ద పోగులు, తొడిగినారు = ధరించినారు, వెలయన్ = ఒప్పునట్లుగా, మృగనాభిన్ = కస్తూరిని, గీర్బొట్టు = నామముగా, పెట్టినారు, పసిడి లాతాలు = బంగారు దుడ్లు, చేతులన్ పట్టినారు, చండముద్రాధరులైన = కోపస్వభావముకలవారైన, బట్లు = వందులు, నభోమండలంబు = ఆకాశమండలము, బూరటిలన్ = నిండునట్లుగా, కలిరాజున్, పొగడి పొగడి.

తా. కుండలవంటి బొజ్జల క్రిందికి బిగించి ముదుక వస్త్రాలను కట్టినారు, మలిన దేహాలపై దట్టముగా మంచి గంధము పూసినారు, నున్నని బట్టతలలపైన బంగారు అంచులుగల పట్టు వస్త్రములను చుట్టినారు, వ్రేలాడుచున్న చెవులందు పెద్ద పోగులు ధరించినారు, కస్తూరిని నామముగా పెట్టినారు, బంగారు దుడ్లు చేతుల పట్టినారు, కోపస్వభావము కలవారైన వందులు ఆకాశమండలము నిండునట్లుగా కలిపురుషుని పొగడి పొగడి.

**63 వ. త్రైలోక్యంబును వినునట్లుగా నిట్లనిరి. “యాగఫలంబు పాషాణ సలిలోన్మజ్జనంబు, దేశాంతర దేహాంతర కాలాంతరంబులం గర్మఫలభోక్త యాత్మ యనుమాట యసత్యంబు. వేదం బప్రమాణంబు. వేద మర్మ భేదంబునఁ గదా**

**బోధిసత్త్వుండు సత్వహేతువుగా జగం బస్థిరంబని సమర్థించె. ఎద్ది యెద్ది సత్తద్దియద్ది యధ్రువంబు. అగ్నిహోత్రంబుం ద్రయీ తంత్రంబుఁ ద్రిదండంబున్ భస్మకుంఠనంబు బుద్ధి పౌరుషహీనులగు పురుషాధములకు జీవికోపాయంబులు. స్వచ్ఛందంబు ధర్మంబు. కామదేవుండ దైవంబు. మరణంబె యపవర్గంబు. భస్మీభూతంబగు భూతంబునకుం బునరాగమనంబు గలదనుట భ్రాంతిగాదే? ఆమ్నాయంబు లేమి యెఱుంగు? ఎఱింగెనేని 'కోహితద్వేద యద్యముష్మిన్ లోకేఽస్తివానవేతి' యని సందేహించునే" యని వెండియు**

తా. మూడులోకములవారు వినునట్లుగా ఇట్లు పలికిరి "యజ్ఞాదు లొనర్చుటవలన గల్గునట్టి ఫలము బండరాయి నీళ్ళలో తేలుటవంటిది. మన ఆత్మ పరలోకమునందు మరియొక దేహమును పొంది మరియొక కాలమున కర్మఫలము ననుభవించును అని చెప్పెడి మాట అసత్యము. వేదము ప్రమాణము కాదు. వేదము మర్మమును భేదించుటచేతనేకదా మహాప్రాజ్ఞుడైన బుద్ధుడు సత్వరూపమగు హేతువుచేతనే విశ్వము అస్థిరమైనది అని స్థిరపఱిచెను. ఏదేది సత్పదార్థమో, ఆయా పదార్థము అనిత్యమైనది. ఉదయాస్తమయముల అగ్నికార్యము నాచరించుటయు, వేదవిహిత కర్మకలాపమును, సన్యాసమును, బూడిద పూతయును బుద్ధిసామర్థ్యము లేనట్టి మనుజులకు బ్రతుకుదెరువు. స్వేచ్ఛావిహారమే ధర్మము. మన్మథుడే దేవుడు, చావే మోక్షము. భస్మమయినది తిరిగి వచ్చుననుట భ్రాంతి కాదా? వేదములు ఏమి నిర్ణయింపగలవు? వానికే తెలిసినచో 'పరలోకవిషయమున ఉన్నదో లేదో ఎవ్వడెఱుంగును?'అని సంశయమొందునా? అని పలికి ఇంకను

**64** క. **తారుఁ దము గాచుకొనలే**
**రీరసమునఁ గావఁబోదు రింతుల వంశా**
**చారస్థితి దాంభికులగు**
**వారు మరుఁడు తమకె కాని వారికి లేఁడే**

వంశాచారస్థితిన్ = కులాచారములయొక్క స్థితి = మర్యాదచే, దాంభికులగువారు = కపటులైనవారు, తారు = వారు, తమున్ = తమను, కాచుకొనలేరు = విషయేచ్ఛవలన రక్షించుకొనలేరు, కాని, ఈరసమునన్ = కోపముతో, ఇంతులన్ = స్త్రీలను, కావబోదురు = రక్షింపబోదురు, మరుడు = మన్మథుడు, తమకె కాని, వారికి = ఆ స్త్రీలకు, లేడే

తా. కులాచారముల మర్యాదచే కపటులైనవారు తమను తాము విషయేచ్ఛవలన రక్షించుకొనలేరు. కాని కోపముతో వారి స్త్రీలను రక్షింపబోదురు. మన్మథుడు తమకె కాని ఆ స్త్రీలకు లేడా?

**65** క. **శతమన్యునంత ధర్మ**
**స్థితి యెఱిఁగినవాఁడు గలఁడె త్రిభువనమున యం**
**దతని యహల్యా జారత**
**యితరుల జారత కనుజ్ఞ యిచ్చుట కాదే!**

త్రిభువనమునయందు = మూడులోకములందును, శతమన్యునంత = ఇంద్రునియంత, ధర్మస్థితి = ధర్మ మర్యాదను, ఎఱిగినవాడు = తెలిసినవాడు, కలడే?, అతని = ఆ ఇంద్రునియొక్క, అహల్యాజారత , ఇతరుల జారతకు, అనుజ్ఞ, ఇచ్చుట కాదే!

తా. ముల్లోకములయందును ఇంద్రునియంత ధర్మస్థితిని తెలిసినవాడు కలడా? యని ఆ ఇంద్రుని అహల్యా జారత్వము ఇతరులకు జారత్వమునకు అనుమతి ఇచ్చుటే కదా!

**66** క. **మారుఁడు దుర్వారుఁడు సం**
**సార మిది యనాది వంశ సంరక్షణ మం**
**భోరుహ వదనల చేతిది**
**యే రూపున జాతిశుద్ధి యేర్పఱుపనగున్**

మారుడు = మన్మథుడు, దుర్వారుడు = వారింపశక్యముకానివాడు, సంసారము ఇది = ఈ సంసారము, అనాది = మొదలు లేనిది, వంశ సంరక్షణము = కుల రక్షణము, అంభోరుహవదనల చేతిది = స్త్రీల యధీనమైయున్నది, ఏ రూపునన్ = ఏ విధముగా, జాతి శుద్ధి = కుల పవిత్రత, ఏర్పఱుపనగున్ = నిర్ణయింపగలము.

తా. మన్మథుడు వారింపశక్యముకానివాడు. ఈ సంసారము అనాదియైనది. కుల రక్షణము స్త్రీల యధీనమై యున్నది. ఏ విధముగా కులము నిష్కలంకమని నిర్ణయించగలము?

**67** క. **రాజానుమతము ధర్మము**
**రాజు నిశాకరుఁడు మీకు బ్రాహ్మణులారా!**
**రాజు ప్రవర్తించిన పే**
**రోజన గురుతల్పగమన ముచితము మీకున్**

బ్రాహ్మణులారా, రాజ అనుమతము = రాజుచే అంగీకరింపబడినది, ధర్మము, రాజు, మీకు, నిశాకరుడు = చంద్రుడు, రాజు = చంద్రుడు, ప్రవర్తించిన, పేరోజన = విధముగానే, మీకున్, గురుతల్ప గమనము = గురుపత్నితో కూడుట,

ఉచితము = తగినదే!

తా. బ్రాహ్మణులారా! రాజుచే అంగీకరింపబడినది ధర్మము. మీకు రాజు చంద్రుడు. చంద్రుడు ప్రవర్తించిన విధముగానే మీకును గురుపత్నితో కూడుట తగినదేయగును.

**68 క. ఏ కార్యంబు సుఖోత్తర**
**మా కార్యము సేయ నర్హమగునెడ సుకృతం**
**బాకాంక్షింతురు సురతము**
**నాకాక్షింప రదియేమి యవనీవిబుధుల్**

ఏ కార్యంబు = ఏ పని, సుఖోత్తరము = ఎక్కువ సుఖమునిచ్చునో, ఆ కార్యము = ఆ పని, చేయన్ = చేయుటకు, అర్హమగునెడన్ = తగినదైనప్పుడు, అవనీ విబుధుల్ = బ్రాహ్మణులు, సుకృతంబు = పుణ్యమును, ఆకాంక్షింతురు = కోరుదురు, సురతమున్ = సంభోగమును, ఆకాంక్షింపరు = కోరరు, అది ఏమి = అదేమిటి?

తా. ఏపని ఎక్కువ సుఖమునిచ్చునో ఆ పని చేయుటకు తగినదైనప్పుడు బ్రాహ్మణులు పుణ్యమును కోరుకుంటారు కాని సంభోగమును కోరుకొనరు. అదేమిటి?

**69 చ. మలిచిన ఱాలయందుఁ గుసుమంబులు వోయఁగ మీఁద నెన్నఁడే**
**ఫలమొకనాఁడు గల్గునను పల్కది యెవ్వఁడు నమ్మినాఁడు కో**
**మల వనరాజిలోనఁ గుసుమంబులు గోయుట యెప్పుడప్పుడే**
**ఫలములు వోవొ పోవునొ యుపాసకులార! తలంచి చూడుఁడా**

మలచిన ఱాలయందున్ = విగ్రహములయందు, కుసుమంబులు పోయగన్ = పూవులతో పూజింపగా, మీదన్ = తరువాత, ఎన్నడేన్ = ఎప్పుడో, ఒకనాడు, ఫలము = ఫలితము, కల్గును అను, పలుకు, అది, ఎవ్వడు, నమ్మినాడు? కోమల వనరాజిలోనన్ = మనోహరమైన ఉద్యానవనములో, కుసుమంబులు కోయుట = పూవులను కోయుట, ఎప్పుడు = ఎప్పుడు జరుగునో, అప్పుడే, ఫలములు = పండ్లు, పోవొ పోవునొ = పోతాయా పోవా?, ఉపాసకులార = పూజించువారలారా! తలంచి చూడుడా = ఆలోచించి చూడండి.

తా. విగ్రహములను పూలతో పూజింపగా తరువాత ఎప్పుడో ఒకనాడు ఫలితము కలుగుతుందనే మాట, అది ఎవడు నమ్ముతాడు? తోటలో పూలు కోయడం ఎప్పుడు జరిగిందో అప్పుడే పండ్లు కాయడం పోయినట్టేకదా! పూజించువారలార! ఆలోచించండి.

**70 తే. అన్య దేహాప్తి సందేహమైన యెడను**
**గలుషములు మాన నెబ్భంగి వలయునేని**
**విడుఁడు యాగంబు లో వేదవిప్రులార!**
**జంతుహింసా మహాదోష సంశయమున**

ఓ వేదవిప్రులార = ఓ వేదాధ్యయన బ్రాహ్మణులారా! అన్య దేహాప్తి = మరొక దేహమును పొందుట, సందేహము ఐన ఎడను = సందేహమైనప్పుడు, జంతుహింసా మహా దోష = జంతుహింసయనెడి గొప్ప పాపముయొక్క, సంశయమున = సందేహమున, కలుషములు = పాపములు, మానన్ = పోవుటకు, ఏ భంగిన్ = ఏ విధముగానైనా, వలయునేని = కావలయునన్న, యాగంబులు = యజ్ఞములను, విడుడు = విడిచిపెట్టండి.

తా. ఓ వేదబ్రాహ్మణులారా! వేరొక దేహమును పొందుట సందేహమైనప్పుడు జంతుహింసయనెడు గొప్ప పాపముయొక్క సందేహమున ఆ పాపములు పోవుటకు ఏలాగైనా ఆ యాగములను విడిచిపెట్టండి.

**71 తే. స్మృతులయందు బలాత్కార కృతములెల్ల**
**నకృతములుగా విధించినాఁడట్టె మనువు**
**బలిమి బ్రాహ్మణులార! పాపములు చేయుఁ**
**డేమి చేసినఁ జేయరయ్యెదరు మీరు**

మనువు, స్మృతులయందున్ = మనుస్మృతి మొదలగు స్మృతులందు, బలాత్కార కృతములు = బలాత్కారముచే చేయబడినవి, ఎల్లన్ = అన్నిటిని, అకృతములుగాన్ = చేయబడనట్టుగా, విధించినాడట్టె = ఏర్పరచినాడు, బ్రాహ్మణులార; పాపములు = పర స్త్రీ సంగమాది పాపములు, బలిమిన్ = బలాత్కారముగా, చేయుడు, ఏమి చేసినన్ = ఎట్టి పాపములు చేసినను, మీరు, చేయరు అయ్యెదరు = చేయనివారే అగుదురు.

తా. ఓ బ్రాహ్మణులారా ! మనువు మనుస్మృతి మొదలైన గ్రంథములందు బలాత్కారముగా చేయబడినట్టివన్నిటిని చేయబడనట్టుగానే ఏర్పరచినాడు. కావున పరస్త్రీ సంగమాది పాపములు బలాత్కారాముగా చేయుడు. మీరు ఎట్టి పాపములు చేసినను చేయనివారే అగుదురు.

**72 సీ.** **ఐకమత్యంబులే దఖిల శాస్త్రములకు**
**నిగమంబు లొకజాడ నిలువకాదు**
**నాగమంబుల త్రోవ యది యొందు చందంబు**
**పంకంబులోని కంబంబు తర్క**
**మతిగూఢమై యుండు యామళంబులచాయ**
**యుపనిషత్తుల భావ మొక్కరీతి**
**బహువిధంబులు మంత్ర పారాయణంబులు**
**సాంఖ్యయోగముల వాసనలు వేఱు**
**తే. పట్టి యే దర్శనంబైనఁ బ్రతిభ కలిమి**
**వలసినట్లు వక్కాణింప వచ్చియుండు**
**నరసి దుఃఖంబులేక సౌఖ్యంబు గలుగు**
**ధర్మ మొకఁ డేరికొనుఁడు విద్వాంసులార !**

విద్వాంసులార = ఓ పండితులారా!, అఖిల శాస్త్రములకున్, ఐకమత్యంబు లేదు = ఏకత్వము లేదు, నిగమంబులు = వేదములు, ఒకజాడన్ = ఒకే మాటకు, నిలువక = నిలబడక, ఆడున్ = చెప్పుచుండును, ఆగమంబుల త్రోవ = శ్రౌతాగమముల మార్గము, అది, ఒందు చందంబు = ఒక పద్ధతిలోనుండును, తర్కము = తర్కశాస్త్రము, పంకంబులోని = బురదలోని, కంబంబు = స్తంభమువంటిది, యామళంబుల చాయ = యామళ మతస్థుల విధానము, అతి గూఢమై ఉండు = మిక్కిలి రహస్యమైనదై యుండును, ఉపనిషత్తుల భావము = ఉపనిషద్వాక్యముల అభిప్రాయము, ఒక్క రీతి = అదొక రీతిలోనుండును, మంత్ర పారాయణములు = గాయత్ర్యాది మంత్ర పారాయణలు, బహువిధంబులు = అనేక ప్రకారములు, సాంఖ్యయోగముల వాసనలు = సాంఖ్యయోగ శాస్త్ర మర్యాదలు, వేఱు = వేరైనవి, ప్రతిభ కలిమిన్ = బుద్ధి బలముచే, ఏ దర్శనంబు ఐనన్ = ఏ శాస్త్రమునైనను, పట్టి = పట్టుకొని, వలసినట్లు = ఇష్టమువచ్చినట్లు, వక్కాణింపన్ = చెప్పుటకు, వచ్చియుండున్ = తగియుండును, అరసి = ఆలోచించి, దుఃఖములేక, సౌఖ్యంబు కలుగు, ధర్మము, ఒకడు = ఒకదానిని, ఏరికొనుడు = ఎంచుకొనుడు.

తా. ఓ పండితులారా! శాస్త్రములన్నిటిలోను ఏకత్వము కనబడదు, వేదములు ఒకేమాటకు నిలబడవు, శ్రౌతాగమమములది అదో పద్ధతి, తర్కశాస్త్రమంటే అది బురదలోని స్తంభంవంటిది, యామళమతస్థుల విధానము చాలా రహస్యంగా ఉంటుంది, ఉపనిషద్వాక్యముల అభిప్రాయము అదొక రీతిలో ఉంటుంది, గాయత్ర్యాది మంత్ర పారాయణలు అనేక విధాలు, సాంఖ్యయోగ మర్యాదలు వేరుగా ఉంటాయి. బుద్ధిబలంతో ఏ శాస్త్రాన్నయినా పట్టుకొని ఇష్టంవచ్చినట్లు చెప్పడానికి వీలవుతుంది. కాబట్టి ఆలోచించి దు:ఖం లేని సౌఖ్యం కలిగే ధర్మం ఒకటి ఎంచుకొనుడు.

**73 తే.** **అస్మితాబుద్ధిగల దేహ మనల శిఖల**
**భస్మమైపోవ నెచ్చోటఁ బాప ముండు**
**సౌఖ్యదములైన పరదార సంగమాది**
**పాపములు సేయుఁ డోపినభంగి జనులు**

జనులు = ఓ జనులారా!, అస్మితాబుద్ధి = నేను అనెడి బుద్ధి, కల దేహము = కలిగినట్టి శరీరము, అనల శిఖలన్ = అగ్ని కొనలందు, భస్మమై పోవన్, ఎచ్చోట = ఎక్కడ, పాపము ఉండున్, ఓపిన భంగిన్ = శక్తికొలదిని, సౌఖ్యదములైన = సుఖమునిచ్చునవైన, పరదార సంగమాది = పరస్త్రీ సంగమము మొదలైన, పాపములు చేయుడు.

తా. ఓ జనులారా! నేను అనెడి బుద్ధి కలిగినట్టి దేహము అగ్నిశిఖలలో భస్మమై పోగా ఇక పాపములు ఎక్కడ ఉ ండును. కావున శక్తికొలది సుఖవంతములైన పరదారా సంగమము మొదలైన పాపములు చేయండి.

**74 క.** **మృతుఁడఁట పుట్టుఁ బెరుంగును**
**మృతుఁడఁట వేఱొకఁడు గుడువ మేకొనుఁ దృప్తిన్**
**మృతునకు నఁట కర్మఫలం**
**బతి ధూర్తుల వార్త లేటి కావర్తింపన్**

మృతుడట = చచ్చినవాడుట, పుట్టున్ = పుడతాడట, పెరుంగును = పెరుగుతాడట, మృతుడట, వేఱొకడు కుడువ = ఇంకొకడు తింటే, తృప్తిన్ = సంతృప్తిని, మేకొనున్ = పొందుతాడట, మృతునకున్ = చచ్చినవానికి, కర్మఫలంబు అట = పాప పుణ్య కర్మములు ఫలమట, అతి ధూర్తుల = మిక్కిలి మోసగించువారి, వార్తలు = మాటలు, ఆవర్తింపన్ ఏటికి = స్వీకరించుట ఎందులకు?

తా. చచ్చినవాడుట తిరిగి పుడతాడట, పెరుగుతాడట. అలాగే చచ్చినవాడట ఇంకొకడు తింటే సంతృప్తిని పొందుతాడట.

చచ్చినవానికి పాప పుణ్య కర్మముల ఫలమట. మిక్కిలి మోసగించువారి మాటలు ఎందుకు స్వీకరిస్తారు?

**75 ఉ. చీటికి మాటికిన్ నిఖిల జీవులునుం బొనరించు పాపముల్**
**గోటులు దన్నుఁ జుట్టుకొని ఘోరపు బాధలఁ బొందు చొంటిమైఁ**
**బాటిలు నాత్మకున్ భరమె పాపము నీయది నిండు బండికిన్**
**జేట భరంబె యేమిటికిఁ జేయవు విప్రుఁడ కిల్బిషంబులన్**

నిఖిలజీవులునున్ = సమస్త ప్రాణులును, చీటికి మాటికిన్, పొనరించు పాపముల్ = చేయునట్టి పాపములు, కోటులు = కోట్ల కొలది, తన్నున్ చుట్టుకొని = తనను ఆవరించి, ఘోరపు బాధలన్ = భయంకరమైన బాధలను, పొందుచు, ఒంటిమైన్ = ఏకాకిగా, పాటిలు = వర్తించెడు, ఆత్మకున్, నీయది పాపము, భరమె = భారమా?, నిండు బండికిన్ = వస్తువులతో నిండిన బండికి, చేట భరంబె = చేట బరువగునా?, విప్రుడ = ఓ బ్రాహ్మణుడా!, కిల్బిషంబులన్ = పాపములను, ఏమిటికి చేయవు = ఎందులకు చేయకున్నావు?

తా. జీవులన్నిటిలోను ఆత్మ ఒక్కటేకదా ! సమస్త ప్రాణులును చీటికి మాటికి చేయునట్టి కోట్లకొలది పాపములు ఆ ఆత్మను ఆవరించి భయంకరమైన బాధలను పొందుచునే యున్నదికదా !. ఏకాకిగా వర్తించే ఆత్మకు నీవొక్కడవు చేయునట్టి పాపము భారమగునా? నిండు బండికి చేట బరువగునా? మరి, ఓ బ్రాహ్మణుడా! పాపములను ఎందులకు చేయకున్నావు?

**76 చ. కలుగుట లేమి సందియము కార్యఫలంబులయందు నిట్టిచో**
**ఫలముదయించెనేని దమ పాలిటి వేల్పులు మంత్ర తంత్ర శ**
**క్తులును దదీయ లాభమునకుం దగు హేతువులందు రన్యథా**
**కలనకు నంగలోపములు కారణమందురు మాంత్రికాధముల్**

కార్య ఫలంబులయందు = చేసిన ఉపాసనలకు ఫలితములయందు, కలుగుట లేమి = ఫలితము లభించుట, లభింపకపోవుట, సందియము = సందేహము, ఇట్టిచోన్ = ఇలా ఫలితము విషయమై సందేహము వచ్చినప్పుడు, ఫలము = ఫలితము, ఉదయించెనేనిన్ = కలిగినచో, తదీయ లాభమునకున్ = ఆ ఫలప్రాప్తికి, మాంత్రికాధముల్ = జపాదులనొనరించు మోస గాళ్ళు, తమపాలిటి వేల్పులు = తాము అర్చించు దేవతలు, మంత్ర తంత్ర శక్తులును = మంత్రముల, తంత్రముల సామర్థ్యములును, తగు హేతువులందురు = ముఖ్య కారణమని చెప్పుదురు. అన్యథాకలనకున్ = ఫలితమురాకపోయినచో, అంగలోపములు = ఉపాసనలోని లోపములు, కారణము, అందురు.

తా. చేసిన ఉపాసనలకు ఫలము లభించుట, లభింపకపోవుట సందేహము. ఇలా సందేహము కలిగినప్పుడు ఫలితము కలిగినచో జపాదులనొనరించు మోసగాళ్ళు ఆ ఫలప్రాప్తికి తాము అర్చించు దేవతలు, తమ మంత్ర. తంత్ర శక్తులును ముఖ్య కారణమని పేర్కొందురు. ఫలము రాకపోయినచో ఉపాసనలో లోపము కారణమని చెప్పుచుందురు.

**77 తే. అర్థి నర్జింప వర్జింప నలవికాని**
**ధర్మము నధర్మమును జెప్పెఁ దగిలి మనువు**
**నేరములు వెట్టి దండువు నిశ్చయించి**
**ధరణిఁ గలచోట నర్థమెత్తంగఁ దలఁచి**

నేరములు = విధి నిషేధ రూపములైన అపరాధములను, పెట్టి = ఏర్పరచి, దండువు నిశ్చయించి = ప్రాయశ్చిత్తములను నిర్ణయించి, ధరణిన్ = ఈ భూమిపై, కలచోటన్ = ఉన్నవారినుండి, అర్థము = ధనమును, ఎత్తంగన్ తలచి = లాగవలెనని ఆలోచించి, అర్థిన్ = వారే ప్రీతితో, అర్జింపన్ = చేయడానికి, వర్జింపన్ = విడిచిపెట్టడానికి, అలవికాని = శక్యముకాని, ధర్మమును, అధర్మమును, తగిలి = పూనుకొని, మనువు, చెప్పెన్,

తా. విధి,నిషేధరూపములను ఏర్పరచి, ప్రాయశ్చిత్తములను నిర్ణయించి మనువు ఈ భూమిపై సంపదున్నవారినుండి ధనమును లాగవలెనని యెంచి ఆ ఉన్నవారే ప్రీతితో చేయడానికి, చేయకపోవడానికి శక్యముకాని ధర్మమును, అధర్మమును పూనుకొని చెప్పియున్నాడు.

**78 శా. లాలామూత్రపురీష ఘర్మజల కీలాలాత్మిక ల్భామలం**
**చేలా రోఁతలుపుట్ట నాఁడుదురు యోగీంద్రుల్ వృథాలాపముల్**
**లాలామూత్రపురీష ఘర్మజల కీలాలాత్ములో తారటే**
**ప్రాలేయాంబు పటీర పంక ఘనసారక్షోద దివ్యాత్ములో**

భామలు = స్త్రీలు, లాలా = చొంగ, మూత్ర, పురీష, ఘర్మజల = చెమట, కీలాల = రక్తము, ఆత్మికలు = దేహముగా కలవారు, అంచు = అనుచు, యోగీశ్వరులు = యోగీంద్రులు, రోతలు పుట్టన్ = స్త్రీలపై విరక్తి పుట్టునట్లుగ, వృథాలాపముల్ = వ్యర్థమైన మాటలను, ఆడుదురు = పల్కుదురు, ఏలా = ఎందులకు? తారటే = తాముకూడా, లాలామూత్రపురీష ఘర్మజల కీలాల, ఆత్ములో = దేహులేకదా ! ప్రాలేయ అంబు = హిమజలము, పటీరపంక = మంచి గంధము, ఘనసార క్షోద = పచ్చకప్పురపు

పొడితో కూడిన, దివ్య = లోకోత్తరమైన, ఆత్మలో = దేహముకలవారలా?

తా. స్త్రీలు చొంగ మూత్రము పురీషము, చెమట, రక్తము దేహముగా కలవారని యోగీంద్రులు స్త్రీలపై విరక్తి కలుగునట్లుగ వ్యర్థమైన మాటలను పలుకుచుందురు ఎందులకు? తాముకూడా వాటితోనిండిన దేహులేకదా ! లేక హిమజలము, మంచిగంధము, పచ్చకప్పురపు పొడితో కూడిన లోకోత్తరమైన దేహముకలవారలా?

**79 వ. పురాణంబుఁ బ్రమాణీకరింతుమేని తత్ప్రణేత పారాశర్యుండు పాండవుల నగరి చాటుకవి. కవుల మాటల కేటిపాటి? మత్స్య పురాణంబునందు మత్స్యంబు వక్తయఁట. తిర్యగ్జంతు మతంబులు సిద్ధాంతీకరింప వచ్చునే? అది యట్లుండె.**

తా. పురాణములను ప్రమాణములని స్వీకరించినట్లైన, ఆ పురాణములను రచించిన వ్యాసుడు పాండవుల పురమగు హస్తినాపురమున ప్రియములు చెప్పుకవి. మరి కవుల మాటలకు ఎంత ప్రామాణ్యము? మత్స్యపురాణంలో చేప వక్తయట, పశుపక్ష్యాదుల అభిప్రాయములు సిద్ధాంతములుగా తీసుకొనవచ్చునా? అది అలా ఉండగా –

**80 సీ. దిననాథనందను దిత్తొల్చి విడిచిరి**
**కరుణ లే కెముక లేరిరి దధీచిఁ**
**బాతాళ బిలమున బలిఁ గట్టివైచిరి**
**జీమూతవాహను జీవి వాపి**
**రెత్తి పాల్గొనిరి శిబీంద్రునంతటివానిఁ**
**గలగుండు వెట్టిరి కలశవార్ధిఁ**
**దివుటఁ జుక్కలతేనిఁ దినగోరు మెసఁగిరి**
**పండు దుల్చిరి కల్ప పాదపంబు**

**తే. నయ్య లెంతకు నేర రర్థార్థి జనులు**
**వీరి మనసులు పట్ట నెవ్వారితరము**
**కీర్తి యటులుండె విడుదు దాక్షిణ్యమింకఁ**
**దారు గల్గినఁ బదివేలు తమకుఁ గలవు**

అర్థార్థిజనులు = ప్రయోజనాభిలాషులు, దిననాథనందను తిత్తి = కర్ణుని చర్మమును, ఒల్చి విడిచిరి = ఒలిచి విడిచిపెట్టిరి. కరుణలేక = దయలేక, దధీచి ఎముకలు, ఏరిరి = ఏరుకొనిరి, పాతాళ బిలమునన్ = పాతాళ లోకమున, బలిన్ = బలిచక్రవర్తిని, కట్టివైచిరి = బంధించిరి, జీమూతవాహను, జీవి = ప్రాణము, పాపిరి = తొలగించిరి, శిబీంద్రు నంతటివానిన్ = శిబిచక్రవర్తి యంతటివానిని, ఎత్తి = తూచి, పాలు = భాగమును, కొనిరి = తీసుకొనిరి, కలశవార్ధిన్ = పాలసంద్రమును, కలగుండు వెట్టిరి = కలచివైచిరి, తివుటన్ = కాంక్షతో, చుక్కలతేనిన్ = చంద్రుని, దినగోరు = ఒక్కొక్కనాడు ఒక్కొక్క భాగముగా, మెసగిరి = తినిరి, కల్పపాదపమును = కల్పవృక్షమును, పండ్లు = ఫలములు (దంతములు), దుల్చిరి = రాల్చిరి, అయ్యలు = అర్థార్థిజనులు, ఎంతకున్ నేరరు = ఏంచెయ్యడానికైనా నేర్తురు, వీరిమనసులు = ఈ యాచకుల కోర్కెలు, పట్టన్ = నెఱవేఱుటకు, ఎవ్వారి తరము = ఎవరికిని శక్యముకాదు, కీర్తి = ప్రసిద్ధి, అటులు ఉండెన్ = ఆ రీతిగా ఉండెను, ఇకన్ = ఇంక, దాక్షిణ్యమున్ = ఆ యాచకులపై జాలిని, విడువుడు = విడిచిపెట్టుడు, తారు = తాము, కల్గినన్ = బ్రతికినచో, తమకున్, పదివేలు కలవు = పదివేల లాభములు కలవు.

తా. ప్రయోజనాభిలాషులు కర్ణుని చర్మమును ఒలిచి విడిచిపెట్టిరి, దయలేక దధీచి ఎముకలు ఏరుకొనిరి, బలిని పాతాళలోకమున బంధించిరి, జీమూతవాహనుని ప్రాణములు తొలగించిరి, శిబిచక్రవర్తిని తూచి శరీరమును తీసుకొనిరి, పాలసముద్రమును కలచివైచిరి, కాంక్షతో చంద్రుని ఒక్కొక్కనాడు ఒక్కొక్క భాగముగా తినిరి. కల్పవృక్షము పళ్ళు రాల్చిరి. యాచకులు ఎంతపనినైనను చేయుదురు. వీరి కోర్కెలు తీర్చుట ఎవరితరము కాదు. వారి కీర్తి ఆ రీతిగా నుండెను. కావున ఆ యాచకులపై జాలిని విడిచిపెట్టండి. మనం బ్రతికుంటే మనకి పదివేల లాభములు కలుగును.

**81 తే. శాంతమతిఁ గాముకత మాని సప్తతంతు**
**దీక్ష గైకొన్న వారల తెఱఁగు లెస్స**
**స్వర్గమున కేగి రంభాది వారసతుల**
**కుచభరంబులపై వ్రాలఁ గోరరేని**

స్వర్గమునకున్, ఏగి = వెళ్ళి, రంభాది, వారసతుల = వేశ్యల, కుచభరంబులపై, వ్రాలన్, కోరరు ఏని, కాముకతన్ = కాముకత్వమును, మాని = విడిచిపెట్టి, శాంతమతిన్ = శాంతచిత్తముతో, సప్తతంతు దీక్ష = యజ్ఞ దీక్షను, కైకొన్న వారల = స్వీకరించిన వారియొక్క, తెఱగు = పద్ధతి, లెస్స = తగినది,

తా. స్వర్గమునకు వెళ్ళి రంభ మొదలైె దేవకాంతల స్తనములపై వ్రాలుటకు కోరుకొనకున్నచో కాముకత్వమును

విడిచిపెట్టి శాంతచిత్తముతో యజ్ఞదీక్షను స్వీకరించినవారియొక్క పద్ధతి తగినది.

**82 తే. ఆహవంబున మృతులైనయట్టి వీరు**
**లమరలోకంబునకుఁ బోదు రనుట గల్ల**
**నిజమయేని దైత్యారిచే నిహతిఁ బొంది**
**యతనితో విగ్రహింపరే యసురు లచట**

ఆహవంబునన్ = యుద్ధమునందు, మృతులు ఐన యట్టి వీరులు, అమరలోకమునకు = స్వర్గలోకమునకు, పోదురు అనుట, కల్ల = అబద్ధము, నిజము ఏని = నిజమే ఐనచో, అసురులు = రాక్షసులు, దైత్యారిచేన్ = నారాయణునిచే, నిహతిన్ పొంది = మరణమును పొంది, అచటన్ = ఆ స్వర్గమునందు, విగ్రహింపరే = పోరాడకుందురా?

తా. యుద్ధమునందు చనిపోయిన వీరులు స్వర్గలోకమునకు పోదురనుట అసత్యము. అది నిజమే ఐనచో రాక్షసులు నారాయణునిచే మరణమును పొంది ఆ స్వర్గంలోనే అతనితో పోరాడకుండా ఉంటారా?

**83 క. అక్ష చరణుండు చెప్పిన**
**మోక్షములు శిలాస్వరూపములు వీనికిఁ గాఁ**
**బ్రేక్షావంతులు దచ్ఛా**
**స్త్రాక్షరములు చదువనేల యతి బాలిశులై**

అక్ష చరణుండు = పాదమందు నేత్రమున్న గౌతముడు, చెప్పిన, మోక్షములు = ముక్తులు, శిలాస్వరూపములు = పాషాణ స్వరూపములు, వీనికి గాన్ = ఇటువంటి శిలాస్వరూపముక్తికై, ప్రేక్షావంతులు = బుద్ధిమంతులగు మీరు, అతి బాలిశులై = మిక్కిలి అతివివేకులరై, తత్ శాస్త్రాక్షరములు = ఆ గౌతముడు చేసిన న్యాయశాస్త్ర వచనములు, చదువనేల = చదువుల వలన ఏమి ప్రయోజనము?,

తా. పాదమందు నేత్రమున్న గౌతముడు చెప్పిన న్యాయశాస్త్ర ముక్తులు పాషాణ స్వరూపములు. ఇటువంటి శిలాస్వరూపములైన ముక్తులకై బుద్ధిమంతులగు మీరు మిక్కిలి అవివేకులై ఆ గౌతముడు చేసిన న్యాయశాస్త్ర వచనములు చదువుటవలన ఏమి ప్రయోజనము?

**84 ఆ. దైన్యమునకుఁ ద్రోవ దలఁప నస్తైన్యంబు**
**గుక్షి వంచనంబు గుడుపుడుగుట**
**బుద్ధియైన యట్ల భోగింప నేర్చుట**
**సారమైన బోధిసత్త్వమతము**

తలపన్ = ఆలోచింపగా, అస్తైన్యంబు = దొంగతనము చేయకపోవుట, దైన్యమునకున్ = దారిద్ర్యమునకు, త్రోవ = మార్గము, కుడుపు ఉడుగుట = భోజనము మానుట, కుక్షి వంచనంబు = కడుపును వంచించుట, బుద్ధియైన యట్ల = మనసుకు తోచినట్లు, భోగింప నేర్చుట = అనుభవింప గలుగుట, సారమైన = శ్రేష్ఠమైన, బోధిసత్త్వమతము = బౌద్ధ సిద్ధాంతము.

తా. ఆలోచింపగా దొంగతనము చేయకపోవుట దారిద్ర్యమునకు మార్గము. భోజనము మానుట కడుపును వంచించుట. కావున మనసుకు తోచినట్లు అనుభవింప గలుగుట శ్రేష్ఠమైన బౌద్ధ సిద్ధాంతము.

**85 తే. క్రోధనులు దార పరుల కక్రోధ శిక్ష**
**చేయుచుందురు కపట వసిష్ఠమునులు**
**దారు నిర్ధనులై యుండి ధాతువాద**
**మొకరికిం జెప్పు విప్రలంభకులు వోలె**

కపట = కపటముచే, వసిష్ఠ మునులు = గొప్ప మునులవలె నటించువారు, తారు = తామె, క్రోధనులు = అకారణముగా కోపము పొందువారు, పరులకున్ = ఇతరులకు, అక్రోధ శిక్ష = కోపము కూడదను ఉపదేశమును, చేయుచుందురు, తారు = వారు, నిర్ధనులై ఉండి, ధాతువాదము = బంగారము చేయుటను, ఒకరికిం చెప్పు = వేరేవారికి చెప్పునట్టి, విప్రలంభకుల వోలె = వంచకులవలె

తా. మోసంతో గొప్ప మునులవలె తామే కోపమును జయింపలేక ఇతరులకు కోపము కూడదను ఉపదేశమును చేయుచుందురు. వారు నిర్ధనులై యుండి ఇతరులకు బంగారము చేయుటను చెప్పునట్టి వంచకులవలె

**86 తే. కలవు విధ్యర్థ మంత్రభాగములు మూఁడు**
**శ్రుతుల, నా మూఁటియందు మీ మతికి నెక్క**
**కర్థవాదాంశ మఖిలంబు ననృతమయ్యె**
**నట్ల యగుఁగాఁక మంత్ర విధ్యంశములును**

శ్రుతులన్ = వేదములందు, విధి అర్థ మంత్ర భాగములు, మూడు, కలవు. ఆ మూటియందున్ , మీ మతికిన్ = మీ

మనసునకు, ఎక్కక, అర్థవాదాంశము = అర్థవాదభాగము, అఖిలంబు = సమస్తమును, అనృతమయ్యెన్ = అసత్యమయ్యెను, మంత్ర విధి అంశములును, అట్ల అగుగాక = అసత్యములే అగుగాక.

తా. వేదములందు మూడు భాగములున్నవి. అవి విధిభాగము, అర్థభాగము, మంత్రభాగము అనునవి. ఆ మూటియందును అర్థవాదభాగము అసత్యమని చెప్పుచున్నారు. కొంత సత్యము కొంత అసత్యము ఉండునా? కావున మంత్ర, విధి భాగములును అసత్యములే అగుగాక.

**87 వ. అని యీ ప్రకారంబు వాచాటులై టిట్టిభంబులునుంబోలెఁ గర్ణకంటకంబులైన దుర్వర్ణనంంబుల వేదంబు ప్రమాణంబు గాదనియును, నాగమంబుల నగడుసేసియు, ధర్మంబుల మర్మంబులుచ్చి పోనాడియుఁ, బురాణంబుల త్రాణలు సెఱచియు, నితిహాసంబుల నపహసించియు, జన్నంబులఁ జిన్నవుచ్చియు, మంత్ర పారాయణంబులఁ దృణీకరించియు, యామళంబులం గలంచియు, గలికిఁ గౌతూహలంబును, జైనులకు సమ్మానంబును, బౌద్ధులకు నుద్ధతియును, జార్వాకులకు నిర్వృతియు, లోకాయతుల కుత్సేకంబును, బాషండులకుం జెవులపండువును, గాపాలికుల కుపకారంబునుంగాఁ గైవారంబు సేయు పాఠకులం గనుంగొని శక్రుండు సక్రోధుండును, వరుణు దరుణలోచనుండును, నగ్ని యుద్విగ్న మానసుండును, గృతాంతు డత్యంత రోషుండునునై యయ్యాశాపతులు నలువురు నల్దిక్కు మొగంబై 'యో దురాత్ములారా! ఏమి దుర్భాషణంబులాడెదరు? దంభోళి ధారా సంరంభంబును, బాశవల్లీ సముల్లాసంబును, సముజ్జ్వల జ్వాలా కరాళతయు, నుద్దండ గదా తాడనంబును నెఱుంగరే? ఏల ప్రేలెదరు? పుత్ర కామేష్టి శ్యేనకారీరీ ప్రముఖంబులగు మఖంబులు దృష్ట ఫలంబులగుట గన్నులం గానరే? ఆవేశంబున గయా శ్రాద్ధాదు లపేక్షించు భూతంబులం జూచి పుణ్యఫలంబులు దెలియరాదే? అంగార ప్రవేశంబుల దేహంబులు వొక్కకుండుట, నేత్రోత్పాటనంబునఁ గన్నులు వచ్చుట యాదిగాఁగల విశేషంబుల దేవతా ప్రభావంబులు భావింపందగదే? ఇవ్విధంబునం బ్రల్లదంబు లాడెదరు గాన మిమ్ము నాలుకలు గోయక, సెలవులు వ్రీల్పక, ప్రాణంబులం గొనక యెట్లు సైరింపవచ్చు' ననిన భయంబంది యవ్వందిజనంబులు బృందారకులకు నమస్కరించి యిట్లనిరి.**

తా. పైన వర్ణించిన విధమున వాచాలురై తీతువు పిట్టలవలె చెవులకు ముల్లైన చెడు వాక్యముల వేదములు ప్రమాణములు కాదనియు, శాస్త్రముల నిందించియు, ధర్మ రహస్యములను గూర్చి చెడ్డగా పలికియు, పురాణముల శక్తులను చెడగొట్టియు, ఇతిహాసములను అపహాస్యముచేసియు, యాగములను తక్కువచేసియు, మంత్రములను, ఉపాసనలను తృణీకరించియు, తంత్రములను చెఱచియు కలిపురుషునకు కుతూహలమును, జైనులకు సత్కారమును, బౌద్ధులకు అతిశయమును, చార్వాకులకు ఆనందమును, లోకాయతులకు గర్వంబును, పాషండులకు చెవులపండువును, కాపాలికులకు ఉపకారమును స్తోత్రము చేయునట్టి కలి స్తోత్రపాఠకులను చూచి ఇంద్రుడు కోపము కలవాడును, వరుణుడు రక్త నేత్రుడును, అగ్ని ఉద్విగ్న మానసుండును, యముడు మిక్కిలి కోపముకలవాడునునై ఆ దిక్పతులు నలుగురును ముఖములు త్రిప్పుకొని 'ఓ దుర్మార్గులారా! ఎలాంటి చెడ్డమాటలు పలుకుచున్నారు? వజ్రాయుధ అంచుల అతిశయమును, తీగెవంటి పాశముయొక్క గొప్పతనమును, అగ్నిహోత్రుని మంటల భయంకరత్వమును, యమదండముయొక్క భయంకరమైన దెబ్బను తెలిసికొనక ఏల పేలెదరు? పుత్రకామేష్టియు, డేగ, వెదురు సాధనములుగా చేయు యాగములును కానవచ్చు ఫలితములు కలవగుట కన్నులతో చూడరా? ఒకని నావేశించుటవలన గయాశ్రాద్ధము మొదలైనవి కోరుచున్న భూతములను చూచి పుణ్య ఫలితములను తెలిసికొనరాదా? నిప్పులలో ప్రవేశించినా దేహములు పొక్కకుండుట, కనులు పెకలించుకున్నా మరల కన్నులు వచ్చుట మొదలైన గొప్ప కార్యములచే దేవతా ప్రభావములను ఊహించలేరా? ఈ విధంగా ఊరికే వాగుతున్నారు కనుక మిమ్మల్ని నాలుకలు తెగ్గోయక, మర్మస్థానములు చీల్చక, ప్రాణములు తీయక ఎలా ఊరుకోవచ్చు?' అని పలుకగానే భయపడి ఆ స్తోత్రపాఠకులు దేవతలకు నమస్కరించి ఇలా పలికిరి.

**88 మ. బలభి ద్వహ్ని యమ ప్రచేతసులకున్ బ్రహ్మాయు వే మెల్లనుం**
**గలి భూపాలుని యొద్ది పాఠకుల మీ కైవార దుర్భాషణం**
**బులకుం గాని యతండు మెచ్చఁడు దయాబుద్ధిం బరాధీన వృ**
**త్తుల నీ పేదల మమ్ముఁ గావఁదగు నీ ద్రోహంబు లేకుండగన్**

బలభిత్ = బల అనే రాక్షసుని చంపిన ఇంద్రుడు, వహ్ని = అగ్ని, యమ, ప్రచేతసులకున్ = వరుణులకు, బ్రహ్మాయువు = బ్రహ్మ ఆయువు కలుగుగాక, ఏము ఎల్లనుం = మేమందఱమును, కలి భూపాలుని యొద్ది పాఠకులము = కలి మహారాజు దగ్గర వందులము, ఈ కైవార దుర్భాషణంబులకున్ = ఈ స్తోత్ర చెడు భాషణములకు, కాని, అతదు = కలి, మెచ్చడు. పరాధీన వృత్తులము = పరులపై ఆధారపడి బ్రతుకువారము, ఈ పేదలన్, మమ్మున్, ఈ ద్రోహంబు = ఈ నేరము, లేకుండగన్ = చేయనివారినిగ, కావన్ తగున్ = రక్షింపవలయును.

తా. ఇంద్ర, అగ్ని, యమ, వరుణులకు బ్రహ్మాయుస్సు కలుగుగాక. మేమందఱమును కలిమహారాజు దగ్గర వందులము. ఈ స్తోత్ర చెడు భాషణములకు కాని అతదు సంతోషింపడు. కావున పరాధీనమై బ్రతుకువారమైన మా ఈ పేదలను ఈ నేరము చేయనివారిగ రక్షింపవలయును.

89 సీ. **వంది జాతులము మా వాచాటతాటోప**
**మునకు నల్గకుమయ్య యనిమిషేంద్ర**
**యనపరాధులము మాయందు నక్కటికంబు**
**పాటింపుమయ్య కృపీటజన్మ**
**పరతంత్రులము మా యబద్ధవాక్యములకుఁ**
**దప్పు పట్టకుమయ్య ధర్మరాజ**
**యాశార్థులము మా యహంకృతి స్ఫురణకు**
**నెరసు లేరకుమయ్య వరుణదేవ**
తే. **భయముఁ గొందుము నిర్ఘాత పాతమునకుఁ**
**దలఁకుదుము భీషణోల్కా ప్రదాహమునకుఁ**
**జంచలింతుము పటు దండ చండిమలకుఁ**
**బగులుదుము పాశవల్లరీ బంధములకు**

అనిమిషేంద్ర = ఓ దేవేంద్రా!, వంది జాతులము = వంది జాతికి చెందినవారము, మా వాచాటత ఆటోపమునకున్ = మా వాగుడు అతిశయానికి, అల్గకుము అయ్య = కోపింపకుము, కృపీటజన్మ = ఓ అగ్నిహెూత్రా!, అపరాధులము, మాయందు, అక్కటికంబు = కరుణను, పాటింపుమయ్య = ఉంచవయ్య, ధర్మరాజ = యమా! పరతంత్రులము = పరుని సేవించువారము, మా అబద్ధ వాక్యములకు, దప్పు పట్టకుమయ్య, వరుణదేవ, యాశార్థులము = ప్రభువు దయ కోరువారము, మా అహంకృతి స్ఫురణకు = మా అహంకార అతిశయమునకు, నెరసులు ఏరకుమయ్య = దోషము లెంచకుమయ్య, నిర్ఘాతపాతమునకున్ = వజ్రాయుధము దెబ్బకు, భయము కొందుము = భయపడుదుము, భీషణ = భయంకరమైన, ఉల్కాప్రదాహమునకు = ఉల్కలవంటి మంటలకు, తలకుదుము = భయపడుదుము, పటు = సమర్థమైన, దండ చండిమలకు = యమదండ తీవ్రతకు, చంచలింతుము = వణుకుచున్నాము, పాశవల్లరీ బంధములకు = తీగెలవంటి పాశ బంధనములకు, పగులుదుము = ముక్కలగుదుము.

తా. ఓ దేవేంద్రా! వంది జాతికి చెందినవారము. మా అధిక ప్రసంగమునకు కోపింపకుము. ఓ అగ్నిహెూత్రా! తప్పుచేసిన మా యందు దయను చూపుము. ఓ యమధర్మరాజా! పరుని సేవించువారము. మా అబద్ధ వాక్యములకు తప్పు పట్టకుము. ఓ వరుణదేవ! ప్రభువు దయ కోరువారము. మా అహంకార అతిశయమునకు దోషము లెంచకుము. వజ్రాయుధము దెబ్బకు, భయంకరమైన ఉల్కలవంటి మంటలకు, సమర్థమైన యమదండ తీవ్రతకు, పాశ బంధనములకు భయపడి ముక్కలగుదుమని వణుకుచున్నాము.

90 వ. **అని యంజలి పుటంబులు లలాటంబున ఘటియించి యచ్చాటుకారులు గైవారంబు లుడిగి యూరకుండి రనంతరంబ**

91 ఆ. **గగన మండలమునఁ గాలాయసపుఁ దేర**
**మాలకాకి పడగ తూలియాడ**
**ద్వాపరంబుఁ దాను దన్మధ్యవర్తియై**
**వచ్చువాని నీల వర్ణ దేహు**

గగన మండలమునన్ = ఆకాశమునందు, కాలాయసపు తేరన్ = ఇనుప రథమునందు, మాలకాకి పడగ = మాలకాకి జండాగా, తూలియాడ = ఎగురుచుండగా, ద్వాపరంబున్ = ద్వాపర పురుషునితో, తాను = ఆ కలి, తత్ = ఆ రథముయొక్క, మధ్యవర్తియై = మధ్య కూర్చున్నవాడై, వచ్చువానిన్ = వచ్చుచున్నవానిని, నీలవర్ణదేహున్ = నల్లని దేహచ్ఛాయకలవానిని

తా. ఆకాశమునందు ఇనుముతో చేయబడిన రథముపై మాలకాకి జండా ఎగురుచుండగా ద్వాపర పురుషునితో కూడి ఆ కలిపురుషుడు ఆ రథము మధ్య కూర్చున్నవాడై వచ్చుచున్నవానిని నల్లని దేహచ్ఛాయకలవానిని

92 సీ. **కఱకులై పెరిఁగిన కుఱు వెండ్రుకలతోడ**
**బట్ట యౌదలఁ గావిపాగ యమర**
**నిగిడి పూతేకు బాగుగఁ గత్తిరించిన**
**గడ్డంబు కొన ఱొమ్ము గమ్మరింప**
**బండి కందెనతోడఁ బ్రతివచ్చు మైచాయ**
**నీలి పచ్చడముతో మేలవింప**
**నవ రక్త చందన ద్రవ కల్పితంబైన**
**నూత్న త్రిపుండ్రంబు నొసల నొప్పఁ**

తే. **గోరమీసలు మిడిగ్రుడ్లు కుఱుచపొడవు**
**డొప్పచెవులును గొగ్గి పండులును గలిగి**
**యున్నమద్గ్రీవుడై వచ్చుచున్నవానిఁ**
**గలి మహారాజు గనిరి దిక్పాలవరులు**

కఱకులై = కర్కశములై, పెరిగిన, కుఱు వెండ్రుకలతోడన్ = పొట్టి వెంట్రుకలతో, బట్టయౌదలన్ = బట్టతలయందు, కావి పాగ = ఎఱ్ఱని పాగ, అమరన్ = ఒప్పుచుండగా, నిగిడి = సాగి, పూతేకు = పూలతేకువలె, బాగుగ కత్తిరించిన, గడ్డంబు, తొమ్ము కొన = తొమ్ము కొనను, కమ్మరింపన్ = మూయుచుండగా, బండి కందెనతోడన్ = బండి యిరుసుకుందు నల్లని నూనెతో, ప్రతివచ్చు మైచాయ = సాటివచ్చు శరీరకాంతి, నీలి పచ్చడముతోన్ = నల్లని పై వస్త్రముతో, మేలవింపన్ = కలియుచుండగా, నవ = నూతనమైన, రక్తచందన = ఎఱ్ఱ చందనముయొక్క, ద్రవ = రసముచే, కల్పితంబైన = కల్పింపబడిన, నూత్న త్రిపుండ్రంబు = క్రొత్త విబూతిరేఖలు, నొసలన్ ఒప్పన్ = నుదుటిని ఒప్పుచుండగా, కోర మీసలు = పెద్ద మీసములును, మిడిగ్రుడ్లు, కుఱుచపొడవు = పొట్టి రూపము, డొప్ప చెవులును, గొగ్గి పండులును = వంకర పండ్లును, కలిగి, ఉన్నమత్ గ్రీవుడై = కంఠమెత్తినవాడయి, వచ్చుచున్నవానిన్, కలి మహారాజున్, దిక్పాలవరులు, కనిరి = చూచిరి.

తా. కర్కశములై పెరిగిన పొట్టి వెండ్రుకలుకల బట్టతలయందు ఎఱ్ఱనిపాగ ఒప్పుచుండగా, సాగి పూలతేకువలె బాగుగా కత్తిరించిన గడ్డము తొమ్ము కొనను మూయుచుండగా, బండి కందెనతో సాటివచ్చు శరీరకాంతి నల్లని పై వస్త్రముతో కలియుచుండగా, క్రొత్త ఎఱ్ఱచందనముయొక్క రసముచే కల్పింపబడిన నూత్న విబూది రేఖలు నుదుటన ఒప్పుచుండగా, కోరమీసములు, మిడిగ్రుడ్లు, కుఱుచ రూపము, డొప్ప చెవులు, గొగ్గి పండ్లు కలిగి కంఠమెత్తినవాడయి వచ్చుచున్న కలి మహారాజును దిక్పాలకులు చూచిరి.

93 క. **హేలా బృందారకుఁడగు**
**నాలవయుగరాజుఁ గాంచి నయనాంబుజముల్**
**వ్రాలిచిరి నిర్జరేంద్రులు**
**మాలనిఁ గనుఁగొన్న యుత్తమ ద్విజులక్రియన్**

హేలా బృందారకుడగు = అందరిచే తిరస్కరింపబడు దేవతయైన, నాలవయుగరాజు కాంచి = నాల్గవ యుగమైన కలియుగ రాజును చూచి, నిర్జరేంద్రులు = దేవతలు, మాలని కనుగొన్న = మాలవానిని చూచిన, ఉత్తమ ద్విజుల క్రియన్ = ఉత్తమ బ్రాహ్మణులవలె, నయన అంబుజముల్ = నేత్ర పద్మములను, వ్రాలిచిరి = మూసుకొనిరి.

94 తే. **ప్రౌఢ గురుకోపరీఢావలీఢుఁడయిన**
**యా త్రిశంకుండు వోలె జంభారి యెదుటఁ**
**గాంతి సంపద కోల్పోయి కలియుగంబు**
**సాధ్వసాతిరేకంబున జలదరించె**

ప్రౌఢ = గొప్పదైన, గురు = గురువుయొక్క, కోప = కోపముచేతనైన, రీఢ = అవమానముచేత, అవలీఢుడయిన = వ్యాప్తి చెందినవాడైన, ఆ త్రిశంకుండు పోలెన్ = ఆ త్రిశంకునివలె, కలియుగంబు = కలిరాజు, జంభారి ఎదుట = ఇంద్రుని ఎదుట, కాంతి సంపద కోల్పోయి = తన గొప్పతనమును విడిచిపెట్టి, సాధ్వస అతిరేకంబునన్ = భయాతిరేకముచే, జలదరించెన్ = వణకెను.

తా. గొప్పదైన గురువుయొక్క కోపముచేతనైన అవమానముచేత వ్యాప్తి చెందినవాడైన ఆ త్రిశంకునివలె కలి పురుషుడు ఇంద్రుని యెదుట తన గొప్పతనమును విడిచిపెట్టి భయాతిరేకముచే వణకసాగెను.

95 వ. **ఇట్లు ప్రభావోపసమ్రుఁడై ప్రణిపాతంబుచేసి**

తా. ఈ ప్రకారముగా తన గొప్పతనమును తగ్గించుకొని నమస్కరించి

96 తే. **సేమమే నిర్జరస్వామి శిఖి సుఖంబె**
**శర్మమే నీకు యో యమధర్మరాజ**
**స్వస్తియే పాశహస్త మీ ప్రస్తవమునఁ**
**దగ నపాస్త రజస్తమస్తముఁడనయితి**

నిర్జరస్వామి = ఓ ఇంద్రా!, సేమమే = క్షేమమా?, శిఖి = అగ్నిదేవా! సుఖంబె = సుఖమేనా?, ఓ యమధర్మరాజా!, నీకు శర్మమే = సుఖమా?, పాశహస్త = ఓ వరుణదేవా! స్వస్తియే = శుభమేకదా?, మీ ప్రస్తవమునన్ = మిమ్మల్ని కలియడంచే, తగన్ = తగురీతిగా, అపాస్త = తొలగింపబడిన, రజస్తమస్తముడున్ = రజస్తమోగుణములుకలవారిలో మొదటివాడను,
అయితి = అయితిని.

తా. ఓ ఇంద్రా! ఓ అగ్ని! ఓ యమా! ఓ వరుణా! మీకు క్షేమమా? మిమ్మల్ని కలియటంవలన తగినరీతిగా నేను

తొలగింపబడిన రజస్తమోగుణములుకలవారిలో మొదటివాడను అయితిని.

**97 వ. దమయంతీ స్వయంవరంబునకుఁ బోవుచున్నవాఁడ. కాలాతిపాతంబు గాకుండ నన్ను వీడ్కొలుపుఁడు. నా మనోరథంబు సఫలంబగునట్లుగా ననుగ్రహంబు సేయుండు. మీ యాశీర్వాదంబునం గ్రథకైశికాధీశ్వర తనూభవ వివాహంబై మిమ్ము దర్శింపంగలవాఁడనని పల్కుటయు.**

**98 క. వా రన్యోన్యంబు ముఖాం**
**భోరుహములు సూచి నేత్రములఁ జిఱునగవుల్**
**దేరఁగ నిట్లనిరి యహం**
**కార గుణాంకురిత బహుళ కలికిం గలికిన్**

వారు = ఆ దిక్పాలకులు, అన్యోన్యంబు = పరస్పరము, ముఖ అంభోరుహములు = ముఖ పద్మములను, చూచి, నేత్రములన్, చిఱునగవుల్, తేరగన్ = ప్రకాశించునట్లుగా, అహంకార గుణ, అంకురిత = మొలచినట్టి, బహుళ = అధికమైన, కలికిన్ = కయ్యములుకల, కలికిన్ = కలిపురుషునకు, ఇట్లనిరి.

తా. ఆ దిక్పాలకులు పరస్పరము వారి ముఖపద్మములను చూచుకొని నేత్రములందు చిఱునవ్వులు ప్రకాశించు చుండగా అహంకారగుణము మొలచినట్టియు, అధికమైన కయ్యములుకలిగినట్టియు కలిపురుషునకు ఈ రీతిగా పలికిరి.

**99 సీ. తగునయ్య కలిరాజ తగవు ధర్మము దప్పి**
**యాడునె యిట్లు నీయంతవాఁడు**
**పరమేష్ఠి నైష్ఠిక బ్రహ్మచారిగ నిన్ను**
**నాఁడెఱుంగఁగఁ జేసి నాఁడు తొలుత**
**నవకీర్ణియని నిన్ను నవధరించిన యప్డు**
**ద్రోహిగాఁ దలఁపఁడె ద్రుహిణుఁ డాత్మ**
**నీశ్వరాజ్ఞాసేతువెట్లు దాఁటఁగ వచ్చుఁ**
**దదధీనులకు నన్యథాకరించి**

**తే. మాకుఁ జూడంగ నిది యసమంజసంబు**
**మిన్న కరుగుము గాదు నీకన్న తెఱఁగు**
**సత్వరంబునఁ బరుల కిచ్ఛావిఘాత**
**మాచరింపరు కృతబుద్ధులైనవారు**

కలిరాజ!, తగునయ్య = నీకిది తగునా?, తగవు = న్యాయమును, ధర్మము, తప్పి, నీయంతవాడు, ఇట్లు, ఆడునె = పల్కునా? పరమేష్ఠి = బ్రహ్మ, నిన్ను, నైష్ఠిక బ్రహ్మచారిగ = నిష్కళ బ్రహ్మచారిగా, నాడు తొలుతన్ = ఆనాడు నీవు జన్మించినపుడే, నాడు ఎఱుగంగన్ చేసి = లోకమునకంతకును తెలియునట్లుచేసి, అవకీర్ణియని = బ్రహ్మచర్యము పాడుచేసిన వాడవని, నిన్ను, అవధరించిన అప్డు = తెలుసుకొన్నప్పుడు, ద్రుహిణుడు = బ్రహ్మ, ఆత్మన్ = మనసునందు, ద్రోహిగా తలపడె = ద్రోహంచేశావని అనుకోడా?, ఈశ్వరాజ్ఞా సేతువు = భగవంతుని ఆజ్ఞ అనే ఆనకట్టను, తదధీనులకున్ = ఆతని ఆజ్ఞను పాటించువారికి, అన్యథాకరించి = దానికి వ్యతిరేకముగా, ఎట్లు దాటంగ వచ్చున్ = ఎట్లు దాటగలుగును?, చూడంగ = ఆలోచింపగ, మాకున్, ఇది = ఇపుడు నీవు చేయుపని, అసమంజసము = తగినదికాదు. నీ కన్న తెఱగు = నీవు అలోచించిన మార్గము, కాదు = సరియైనదికాదు, మిన్నక అరుగుము = ఈ పనిమాని వెనుకకు పొమ్ము, కృతబుద్ధులైనవారు = బుద్ధిమంతులు, సత్వరంబునన్ = ఆలోచింపకుండగ, పరులకు = ఇతరులకు, ఇచ్ఛావిఘాతము = కోరికకు అంతరాయమును, ఆచరింపరు = కలిగింపరు.

తా. కలిరాజ! నీకిది తగునా? న్యాయము, ధర్మము తప్పి నీయంతవాడు ఇలా మాటాడవచ్చునా? బ్రహ్మ నిన్ను నైష్ఠిక బ్రహ్మచారిగ ఆనాడు నీవు పుట్టినప్పుడే లోకానికంతకు తెలియజేసి, ఇపుడు బ్రహ్మచర్యము పాడుచేసినవాడవని తెలుసుకొన్నప్పుడు బ్రహ్మ నిన్ను ద్రోహంచేసినవాడినిగా తలంపడా? ఈశ్వరాజ్ఞ అనే ఆనకట్టను అతని ఆజ్ఞకు బద్ధులమైన వారికి దానిని వ్యతిరేకించి ఎట్లు దాటి వెళ్ళగలము? ఆలోచింపగ మాకు ఇపుడు నీవు చేయదలచిన పని తగినది కాదు. నీ ఆలోచనా మార్గము సరియైనదికాదు. ఊరకనే వెనుకకు పొమ్ము. బుద్ధిమంతులు ఆలోచించకుండా ఇతరుల కోరికకు విఘ్నమును కలిగింపరు.

**100 వ. త్రిభువనానంద మాకందవాటికా వసంతంబైన యా వృత్తాంతంబు సరిగడచె అచ్చోట నుండియ కదా మేము మరలి వచ్చుచున్నవారము. సానురాగులగు నాగులం బరిత్యజించి, యనల్పులగు వేల్పుల నధిక్షేపించి, యసమానులగు రాజసూనులం దృణీకరించి యన్నళినాక్షి నలుండనువాని వరించె, ఏమి సేయవచ్చు. ఈశ్వరాజ్ఞ బలీయసి. నీవును మాతోడి**

**వాఁడవకదా! మఱలి రమ్మనవుడు రోషాంధుండై యక్కలిరాజు దివిజరాజుల కిట్లనియె.**

తా. మూడు లోకములకు ఆనందమును కలిగించు గున్నమావితోటకు వసంతకాలమైన ఆ స్వయంవర వృత్తాంతము అయిపోయినది. అక్కడనుంచేకదా మేము తిరిగి వస్తున్నాము. ఆ దమయంతి తనయందు ప్రేమకలవారైన నాగులను విడిచిపెట్టి, తక్కువవారుకాని దేవతలను తిరస్కరించి, సామాన్యులుకాని రాజకుమారులను తీసివేసి నలుడనువానిని వరించినది. ఏం చేస్తాం. ఈశ్వరాజ్ఞ బలమైనదికదా! నువ్వుకూడా మాతోడివాడవేకదా! తిరిగిపోదాం రమ్మనగా ఆ కలిరాజు కోపావేశమున గ్రుడ్డివాడై దిక్పాలకులతో ఇట్లు పలికెను.

**101** గీ. **పద్మజునకేమి మీకేమి పరులకేమి**
**యంగనా పరిభోగ లోలాత్మకులకు**
**నైష్ఠిక బ్రహ్మచారియై నష్టిఁ బొంది**
**చేరుగడ లేక కలి చెడం జెడియెఁ గాక**

అంగనా పరిభోగ = స్త్రీ సౌఖ్యములందు, లోల = ఆసక్తికల, ఆత్మకులకు = మనసుకలవారలకు, పద్మజునకు = బ్రహ్మకు, ఏమి = ఏమి నష్టము?, మీకు, ఏమి?, పరులకు, ఏమి?, నైష్ఠిక బ్రహ్మచారియై = బ్రహ్మచర్య నిష్ఠకలవాడై, నష్టిన్ పొంది = సుఖనాశనమును పొంది, చేరుగడ లేక = దిక్కులేక, కలి, చెడన్ = చెడినచో, చెడియెగాక = చెడిపోయేదుకాని

తా. బ్రహ్మచర్య నిష్ఠకలవాడై సుఖనాశనమును పొంది దిక్కులేక కలి చెడిపోతే చెడిపోయేదుకాని. స్త్రీ సౌఖ్యములందు ఆసక్తికలవారలైన బ్రహ్మకు, మీకు, ఇతరులకు ఏమి నష్టము?

**102** వ. **ఏక పత్నీవ్రతస్థులైన మీరేల దమయంతిం గామించిపోయితిరి.ధర్మంబు పరుల కుపదేశింపవచ్చుంగాక తమకుం జేయవచ్చునె? పోదురుగా కేమి మీయం దొక్కరుం డక్కొమ్మ వరియింపం గలిగెనే? నిషధరాజు భోజ కన్యక వరియింప, మీరు లజ్జ వరియించితిరి. ఇంతియకాక యేమి? మిమ్ముం గడకంటం జూచుచు నెమ్మొగం బోరపుచ్చుచు నటఁగదచి యప్పుణఁతి యెట్లుసనియె? మీరెట్లు సహించితిరి? ఇదియ సంగతంబు. చిత్తంబులు చిలివిలివోవ నక్షైత్తి మీరు సూచుచుండ సమ్మత్తకాశిని మనుష్యు నెట్లు వరించె? మీయంతవార లపేక్షించియుండ నప్పద్మాక్షి సతిసాహసంబున నవ్వీరసేని యెట్లుచేకొనియె? అతఁడు చేకొనినం గొనియెఁగాక యాకృపీటయోని యతని వివాహంబునం గూటసాక్షియై కైలాటంబు సేసి యప్పాటఁ దనకుం బెండ్లి ఘటింపం జేయ నావటంబై యుండునట్లు సేయక హుతంబెట్లు పరిగ్రహించె? మహానుభావులగు మీరు భావంబుల నిట్టి యభిమానభంగం బెబ్బంగి సంగీకరించితిరో కాని ననుబోఁటి కియ్యపవాదకందళి చందురునియందుఁ గందునుంబోలె డెందంబునం బాయదు. మీ యందర కొక్క విన్నపంబు అనుగ్ర హించి వినుండు. అవ్వసుమతీశు మోసపుచ్చి యమ్మచ్చెకంటి నెత్తుకొని మింటిమీఁదికిం దెచ్చెద. అప్పుడు మీకడగంటికిం గెంపు రాదుగదా? మహాలాభంబు పట్టున నీర్ష్యారోషంబు లెట్టివారికిం బుట్టు. అనాదికాల ప్రవృత్తంబులైన రాగద్వేషంబులు భేదింప నెవ్వరికి శక్యంబగు? అదియట్లుండె. మఱియొక్క యుపాయం బవధరింపుఁడు. పాకశాసనుండు, పావకుఁడు, పరేతపతి, పాశహస్తుండు, పంచముండనైన యేను నియ్యేవురముం బాండవులు పాంచాలినింబోలెఁ బంచికొని యనుభవింతము గాని యప్పంకజాక్షిం బట్టికొనివత్తునే అని పరమ కపటోపాయ మాయాప్రయోగ పరిపాటీ పాటవంబు దేటపడ బహు ప్రకారంబులం బలికిన.**

తా. ఏక పత్నీవ్రతులైన మీరు దమయంతిని కోరి ఎందులకు వెళ్ళిరి? ధర్మమును ఇతరులకు చెప్పవచ్చును కాని తమకే చెప్పవచ్చునా? వెళ్ళేరు. తప్పేమి. మీలో ఒక్కడు ఆ కాంతను వరింప గలిగేడా? నలుడు దమయంతి వరింప, మీరు లజ్జను వరించితిరి. ఇంతేకాని, ఇంకేమిటి? మిమ్మల్ని ఓరకంట చూచుచు, ముఖము ప్రక్కకు తిప్పుకొనుచు అక్కడినుంచి కదలి ఆ యువతి ఎలా వెళ్ళగలిగింది? మీరెలా సహించగలిగారు? ఇది మీకు తగినది కాదు. మనసులు చిన్నపోవునట్లుగా కంఠమెత్తి మీరు చూచుచుండగా ఆ దమయంతి మానవుని ఎలా వరించింది? మీ యంతటివారు కోరియుండగా ఆ పద్మాక్షి అతి సాహసంతో ఆ నలుని ఎలా చేపట్టింది? అతడు చేపడితే చేపట్టేడు ఈ అగ్ని అతని వివాహమునకు కపట సాక్షియై మాయోపాయమున ఆ పట్టున తాను పెండ్లి చేసికొనుట పొందికయై యుండునట్లు చేయక హవిస్సును ఎలా స్వీకరించగలిగేడు? మహానుభావులగు మీరు మనసులలో ఇంతటి అభిమాన భంగాన్ని ఎలా అంగీకరించేరో కాని నావంటివానికి ఈ నిందాంకురము చంద్రునియందు మచ్చవలె మనసునుండి పోదు. మీ యందరికి ఒక విన్నపము దయతో వినండి. ఆ నలుని మోసపుచ్చి ఆ దమయంతిని ఎత్తుకొని ఆకసము మీదికి తెచ్చెదను. అలా చేసేనని అపుడు మీ క్రీగంటికి ఎఱుపు రాదుకదా! గొప్ప లాభము కలుగుచున్నప్పుడు ఎంతటివారికైనను అసూయ, కోపమును పుట్టుచుండును. అనాదికాలమునుండి వచ్చుచున్న రాగద్వేషములను పోగొట్టుట ఎవరికి శక్యమవుతుంది? అది అలా ఉండనివ్వండి. మరియొక ఉపాయాన్ని వినండి. ఇంద్రుడు, అగ్ని, యముడు, వరుణుడు, ఐదవవాడుగా నేను ఈ ఐదుగురము పాండవులు ద్రౌపదిని వలె పంచుకొని అనుభవిద్దాంకాని ఆ దమయంతిని ఎత్తుకొనిరానా? అని గొప్ప కపటోపాయ మాయా ప్రయోగ సమర్థ శక్తి స్పష్టమగునట్లుగా పలువిధములుగా పలికిన

**103** ఆ. **హరిహయాది విబుధు లక్కలి మూర్ఖతా**
**ముఖరతా వికారములకు రోసి**

**కడcగి పలికి రపుడు గంభీర భారతీ**
**భార తీవ్రమైన భాషణముల**

హరిహయాది విబుధులు = ఇంద్రాది దేవతలు, ఆ కలి = ఆ కలిరాజుయొక్క, మూర్ఖతా = మూర్ఖత్వముయొక్కయు, ముఖరతా = అతి వాగుడుయొక్కయు, వికారములకు, రోసి = అసహ్యపడి, కడగి = పూనుకొని, గంభీర = అర్థగంభీరములగు, భారతీ = వాక్యములయొక్క, భార = అతిశయముతోకూడిన, తీవ్రమైన = కఠినమైన, భాషణముల = మాటలతో, అపుడు పలికిరి.

తా. ఇంద్రాది దేవతలు ఆ కలిపురుషునియొక్క మూర్ఖత్వమునకు, వాగుడుతనమునకు అసహ్యపడి పూనుకొని అర్థగంభీరములగు వాక్యములయొక్క అతిశయముతోకూడిన కఠినమైన మాటలతో అపుడు ఈ రీతిగా పలికిరి.

**104 సీ. అర్హ మెవ్వనిరూప మంగసంభవ రాజ్య**
**రుక్మ సింహాసనారోహమునకు**
**గడగు నెవ్వని కీర్తి కార్తికీ తిథి నిశా**
**నాథ బింబంబు నెన్నడిమి కందు**
**భవన మెవ్వని ప్రతాప ప్రదీపమునకుc**
**బుండరీక భవాండ మండలంబు**
**చుట్ట మెవ్వని కేలు సురభి చింతారత్న**
**రోహణాచల వారి వాహములకుc**
**తే. గలుష మెవ్వానిc దలcచినc గ్రాగిcపోవుc**
**బుణ్య మెవ్వానిc గీర్తింపc బొడవు వడయు**
**వాcడు నిషధేశ్వరుండు మా వరుసవాcడు**
**కలిమహారాజ మన్నింతుగాక వాని**

కలిమహారాజ, ఎవ్వని రూపము = ఏ నలుని సౌందర్యము, అంగసంభవ = మన్మథునియొక్క, రాజ్య రుక్మ సింహాసన = రాచరికపు బంగారు సింహాసనమును, ఆరోహమునకున్ = ఎక్కుటకు, అర్హము = తగినదో, ఎవ్వని కీర్తి, కార్తికీ తిథి = కార్తికమాస దినములలో, నిశానాథ బింబంబు = చంద్రుని బింబముమొక్క, నెన్నడిమి = మధ్యనున్నటువంటి, కందు = మచ్చను, కడగున్ = కడిగివేయునో, ఎవ్వని ప్రతాప ప్రదీపమునకున్ = ఏ నలుని ప్రతాపమనెడి గొప్ప దీపమునకు, పుండరీక భవాండ మండలంబు = బ్రహ్మాండ మండలము, భవనము = మందిరమగుచున్నదియో, ఎవ్వని కేలు = ఏ నలుని చేయి, సురభి = కామధేనువునకును, చింతారత్న = చింతామణికిని, రోహణాచల = రోహణ పర్వతమునకును, వారి వాహములకున్ = మేఘములకును, చుట్టము = బంధువో, ఎవ్వాని తలచినన్ = ఎవనిని తలచినంతమాత్రముననే, కలుషము = పాపము, క్రాగిపోవున్ = ఇంకిపోవునో, ఎవ్వాని కీర్తింపన్, పుణ్యము, పొడవు వడయు = పెరుగునో, వాడు = అట్టివాడు, నిషధేశ్వరుండు = నలమహారాజు, మా వరుసవాడు = మాతో సమమైనవాడు, వానిన్ = ఆ నలుని, మన్నింతుగాక = గౌరవించవలయును.

తా. కలిమహారాజ! ఏ నలుని సౌందర్యము మన్మథుని రాచరికపు బంగారు సింహాసనమును ఎక్కుటకు తగినదో, ఎవని కీర్తి కార్తికమాస దినములలో చంద్రబింబముయొక్క మధ్యనున్న మచ్చను కడిగివేయునో, ఎవని ప్రతాప దీపమునకు బ్రహ్మాండ మండలము మందిరమగుచున్నదో, ఎవని హస్తము కామధేనువునకు, చింతామణికి, రోహణ పర్వతమునకు , మేఘమునకు చుట్టమో, ఎవనిని తలంచినంతమాత్రమున పాపము ఇంకిపోవునో, ఎవనిని కీర్తించిన పుణ్యము పెరుగునో, అట్టివాడు నలమహారాజు. మాతో సమానమైనవాడు. ఆతనిని గౌరవింపవలయును.

**105 ఉ. మచ్చిక వీరసేనుని కుమారునకుం బరమోపకారికిన్**
**మెచ్చి జగంబెఱుంగc దము నెయ్యపుc జెల్లెలి నిండుకొల్వులో**
**నిచ్చితి మింత లోపలనె యింతటివారముc దప్పనేర్తుమే**
**యచ్చపలాక్షిc గూcతు రతcడల్లుcడు మాటలు వేయునేటికిన్**

మచ్చికన్ = ఆసక్తితో, పరమ ఉపకారికిన్ = గొప్ప ఉపకారము చేసినవానికి, వీరసేనుని కుమారునకున్, మెచ్చి = మెచ్చుకొని, జగంబు ఎఱుంగన్ = లోకము తెలియునట్లుగా, దము నెయ్యపు చెల్లెలిన్ = దముని ప్రియ చెల్లెలిని, నిండుకొల్వులోన్, ఇచ్చితిమి, ఇంతటి వారము = ఇంత గొప్పవారము, ఇంతలోపలనె = ఇంత స్వల్పకాలము లోనే, తప్పనేర్తుమే = తప్పుగా ప్రవర్తింతుమా?, మాటలు వేయును ఏటికిన్ = వేయి మాటలెందులకు?, ఆ చపలాక్షి = ఆ దమయంతి, కూతురు, అతడు, అల్లుడు,

తా. ఓ కలిరాజా! గొప్ప ఉపకారము చేసిన ఆ నలుని మెచ్చి ఆసక్తితో లోకమంతా తెలియునట్లుగా దమయంతిని నిండుకొల్వులో ఇచ్చితిమి. ఇంతలోపలనె ఇంత గొప్పవారము తప్పుగా ప్రవర్తింతుమా?, వేయి మాట లెందులకు? ఆ

దమయంతి మా కూతురు, ఆ నలుదు మా అల్లుదు.

106 ఆ. ఏము నలువురందు నెవ్వాఁడు కాఁజాలు
యిచ్చి పుచ్చుకొన్న యీల గ్రద్ద
మాకు నింపుగావు మాను మీ సుద్దులు
కలహముల మొగంబ కలియుగంబ

కలహముల మొగంబ = కయ్యాలమారి!, కలియుగంబ, ఏము నలువురందు = మా నలుగురియందును, ఇచ్చి = ఇచ్చివేసి, పుచ్చుకొన్న = తిరిగి తీసుకొన్న, ఈల గ్రద్ద = లోభి, ఎవ్వాదు = ఎవదు, కాజాలున్ = అవ్వాలనుకుంటాదు, ఈ సుద్దులు = ఇటువంటి మాటలు, మాకును ఇంపు కావు = మాకు ఇష్టముకావు, మానుము = మానివేయుము.

తా. కయ్యాలమారి! కలియుగమా! మా నలుగురియందును ఇచ్చి తిరిగి పుచ్చుకొన్న లోభి కావాలని ఎవదు అనుకుంటాదు? ఇటువంటి మాటలు మాకు రుచించవు. విడిచిపెట్టుము.

107 క. పామరతఁ బట్టఁ బాఱు కు
పామర! కలిరాజ! నిషధపతి మదలీలా
పామ రసావేశంబునఁ
బా మరవిందారిఁ బట్టఁ బాఱిన భంగిన్

పామర = మూర్ఖుడా!, కలిరాజ!, మదలీలా = గర్వాతిశయమనే, పామ = దురదను, రస = అనుభవించుట యొక్క, ఆవేశంబునన్ = ఉద్రేకముచే, పాము = రాహువు, అరవిందారిన్ = చంద్రుని, పట్టన్ = పట్టుకొనుటకు, పాఱిన భంగిన్ = పరుగిడిన విధముగా, నిషధపతిన్ = నలుని, పామరతన్ = మూర్ఖముగా, పట్టన్ = పట్టుకొనుటకు, పాఱుకు = పరుగెత్తకు.

తా. మూర్ఖుడా! కలిరాజ! గర్వాతిశయమనే దురదను అనుభవించు ఉద్రేకముచే రాహువు చంద్రుని పట్టుకోదానికి పరుగిడిన విధంగా నలుని మూర్ఖంగా పట్టుకోదానికి పరుగెత్తకు.

108 క. కాలోచితమగు కార్యం
బాలోచితముగ నొనర్పు మది మేలు విరు
ద్ధాలాపంబులు బలుమఱు
నేలా! పచరింప నిపుదు హేలానిమిషా!

హేల అనిమిషా = విలాస దేవతా!, కాల ఉచితమగు = సమయమునకు తగిన, కార్యంబు = పనిని, ఆలోచితముగన్ = ఆలోచించి, ఒనర్పుము = చేయుము, అది మేలు = అది మంచిచేయును, ఇపుదు, పలుమఱు = ఎక్కువగా, విరుద్ధ ఆలాపంబులు = పనికిరాని మాటలు, పచరింపన్ = పలుకుట, ఏలా = ఎందులకు?

తా. విలాస దేవతా! సమయమునకు తగిన పనిని ఆలోచించి చేయుము. అది మంచి చేయును. ఇపుదు ఎక్కువగా పనికిరాని మాటలు పలుకుట ఎందులకు?

109 వ. అని తమలోన

110 క. పోయెదరు పో యిపుదు తా
ర్తీయాక యుగంబునుం దురీయ యుగంబున్
దోయి యయి నలున కుపహతి
సేయంగా లేరు వాని శీలము కలిమిన్

ఇపుదు, తార్తీయాక యుగంబునుం = ద్వాపరమును, తురీయ యుగంబున్ = కలియుగమును, దోయియయి = జంటగా, పోయెదరు పో = వెళ్ళెదరుగాక, వాని శీలము కలిమిన్ = వాని సత్ప్రవర్తన సంపదచే, నలునకు, ఉపహతి = చెఱుపు, చేయంగా లేరు = చేయలేరు.

తా. ఇప్పుదు ద్వాపరమును, కలియును కలిసి జంటగా వెళ్ళినా ఆ నలుదు సత్ప్రవర్తన సంపదకలవాదగుటచే ఏమీ చెఱుపు చేయలేరు

111 క. యుగ శేష మశేష మహీ
జగదవన పరాయణుందు సమధిక బాహా
యుగ యుగ యుగపదుపార్జిత
జగతీ విజయుందు నలుఁడు సామాన్యుండే

యుగ శేషము = ఈ కృతయుగపు మిగతా కాలము, అశేష మహీ జగత్ = సమస్తమైన భూలోకమును, అవన = రక్షించుటయందు, పరాయణుందు = ఆసక్తికలవాదును, సమధిక = మిక్కిలి గొప్పవగు, బాహాయుగ యుగ = కాదులవంటి బాహువుల జంటచే, యుగపత్ = ఒక్కసారిగా, ఉపార్జిత = సంపాదింపబడిన, జగతీ విజయుందు = లోకమును జయించినవాడైన, నలుదు,

సామాన్యుండే = సామాన్యుడా?

తా. ఈ కృతయుగపు మిగతాకాలము సమస్తమైన భూలోకమును రక్షించుటయందు ఆసక్తికలవాడును మిక్కిలి గొప్పవగు కాదులవంటి బాహువుల జంటచే ఒక్కసారిగా లోక విజయమును సంపాదించినవాడును అగు నలుడు సామాన్యుడా?

**112 వ. అని వెండియు నాఖండలాదులు 'పరోక్ష ప్రియా దేవా'యను పురాణ వచనంబు కారణంబుగా నిగూఢ ప్రౌఢ నిజ భాషణ విశేషంబున**

తా. అని తిరిగి ఇంద్రాదులు దేవతలు పరోక్ష ప్రియులు అను పురాణవచనము కారణముగా గూఢమైన ప్రౌఢమైన తమ మాటల విశేషముచే

**113 తే. యామి తత్రేత్యసజ్జ్ఞాన మమరశేష**
**రాజసం సదిహాస్యతాం రహ తమాంసి**
**తత్ర మాగాస్త్వమితిగతో ద్వాపరేణ**
**రాజ సంసది హాస్యతాం ప్రథమమనిరి**

అమరశేష = దేవతలలో నీచుడా!, తత్ర = నలుని పట్టణమునకు, యామి = వెళ్ళుచున్నాను, ఇతి = అని, జ్ఞానము = తలంపు, రాజసం = రజోగుణమైన ఆలోచన లేనిది, సత్ = అగుచు, అసత్ = తగినదికానిది, ఇహ = ఇక్కడనే, ఆస్యతాం = ఉందువుగాక, తమాంసి = అజ్ఞానమును, రహ = విడువుము, తత్ర = నిషధ నగరమునకు, త్వమ్ = నీవు, మాగా: = వెళ్ళకుందువుగాక, ఇతి = అనే మా మాటను వినక, ద్వాపరేణ = ద్వాపరునితో కూడి, గత: = వెళ్ళినవాడవైతే, రాజ సంసది = రాజ సభలో, హాస్యతాం = పరిహాసము, ప్రథమం = ముందే తప్పదు, అనిరి.

తా. దేవతలలో నీచుడా ! నలుని నగరమునకు వెళ్ళుచున్నాననే ఆలోచన రజోగుణమైన ఆలోచన లేనిది. అది తగినది కాదు. ఇక్కడనే ఉండిపొమ్ము. అజ్ఞానమును విడిచిపెట్టుము, నిషధ నగరమునకు వెళ్ళకుము. మా మాటను వినక ద్వాపరునితో కూడి వెళ్ళినవాడవైతే రాజసభలో పరిహాసము ముందే తప్పదు అని పలికిరి.

**114 వ. మఱియు బహుప్రకారంబుల బుద్ధి సెప్పియుం, ప్రియంబు వలికియుం, హెచ్చు కుందాడియు బృందారకులు గలిద్వాపరంబుల భూలోక గమనంబు ప్రతిషేధించిరి. ఇట్లు ప్రతిషేధించినను వారి సుభాషితంబులు పెడచెవులంబెట్టి మౌఢ్యంబును, సాహసంబును, మదంబును, నసూయయు, నవివేకంబును దనకు నైజ గుణంబులగుటం కలియుగంబు కరయుగంబు మొగిచి యిట్లనియె.**

తా. ఇంకను అనేకరీతుల బుద్ధి చెప్పియును, హితవు పలికియును, ఎక్కువ తక్కువలు చెప్పియును దేవతలు కలి, ద్వాపరములను భూలోకమునకు వెళ్ళుటను నిషేధించిరి. ఇట్లు నిషేధించినను వారి మంచి మాటలు వినక మూర్ఖత్వమున, సాహసముతో, గర్వము, అసూయ, అవివేకము తనకు సహజ గుణములగుటచే కలియుగము చేతులు జోడించి ఇట్లు పలికెను.

**115 ఉ. వేలుపులార మీకుఁ బదివేల నమస్కృతు లాచరించెదన్**
**మేలుదలంపుఁడే నవని మీదఁ జరించెదఁ గొంతకాల ము**
**ద్వేలత నెవ్వఁడే నొకఁడు దేశములోన నధర్మవర్తియై**
**వ్రాలినవాఁడు లేఁడె పలువంకలు నారసి చూడవచ్చినన్**

వేలుపులార = దేవతలార!, మీకున్, పదివేల నమస్కృతులు, ఆచరించెదన్ = చేసెదను, ఏను = నేను, కొంతకాలము, అవని మీద చరించెదన్ = భూమండలమున సంచరించెదను, మేలు తలంపుడు = మంచిని కోరుడు, ఉద్వేలతన్ = మర్యాదల నతిక్రమించుటచే, ఎవ్వడేని ఒకడు = ఎవడైనా ఒకడు, దేశములోన, అధర్మవర్తియై = అధర్మమును చేయుచున్నవాడై, వ్రాలినవాడు = గర్వించినవాడు, పలువంకలు = నలుదిక్కులను, ఆరసి = వెదకి, చూడవచ్చినన్ = పరిశీలించిన, లేడె = లేకపోవునా?

తా. ఓ దేవతలారా! మీకు పదివేల నమస్కారములు చేసెదను. నేను కొంతకాలము భూలోకమున సంచరించెదను. నాకు మంచిని కోరుడు. ఉద్రేకముతో ఎవ్వడైన ఒక్కడైనా దేశంలో అధర్మము చేయువాడై గర్వించినవాడు నలుదిక్కులు వెదకి చూచిన ఉండకపోవునా?

**116 తే. వాని దుర్వృత్తి నెపముగా వసుధ యేలు**
**నలునిపైఁ బ్రత్యవాయంబు గొలుపువాఁడఁ**
**గొలిపి యతనిఁ బ్రవేశించి నిలుచువాఁడ**
**నిలిచి యాతని మననీక యలఁచువాఁడ**

వాని = ఆ అధర్మపరుని, దుర్వృత్తి నెపముగా = చెడు ప్రవర్తన వంకతో, వసుధ ఏలు = భూమిని పాలించుచున్న, నలునిపై, ప్రత్యవాయంబు = దోషమును, కొలుపువాడ = ఆరోపించువాడను, కొలిపి = ఆరోపించి, అతనిన్ = అతనిలో, ప్రవేశించి,

నిలుచువాడ = ఉండెదను, నిలిచి = ఉండి, ఆతని = ఆ నలుని, మననీక = బ్రతుకనీయక, అలచువాడ = బాధించెదను.

తా. ఆ అధర్మపరుని చెడుప్రవర్తన వంకతో భూమిని పాలించుచున్న నలునిపై దోషమును ఆరోపించి అతనిలో ప్రవేశించి నిలచెదను. నిలిచి ఆ నలుని బ్రతుకనీయక బాధించెదను.

**117 మ.** **వినుఁడీ నాదు ప్రతిజ్ఞ వేల్పులు జగద్విఖ్యాత చారిత్రు నా**
**తని నేఁ బట్టెద నెద్దియేని యొక రంధ్రం బబ్బెదుంగాక యే**
**ననువేలంబును గొల్చు దేవతలు ఱాలా యేమి యావంత ద**
**ప్పునసైనం గలిసొచ్చుఁగాని మెయిమై బోనిచ్చునే యెవ్వరిన్**

వేల్పులు = ఓ దేవతలారా!, నాదు ప్రతిజ్ఞన్ వినుడీ, జగత్ విఖ్యాత చారిత్రున్ = లోక ప్రఖ్యాత చరిత్రకలవాడైన, ఆతనిన్ = ఆ నలుని, ఏన్ పట్టెదన్ = నేను పట్టుకుంటాను, ఎద్ది ఏని = ఏదైనా, ఒక రంధ్రంబు = ఒక దారి, అబ్బెదుంగాక = దొరకకపోదు, ఏను = నేను, అనువేలంబును = ప్రతి దినమును, కొల్చు = సేవించు, దేవతలు, ఱాలా ఏమి = ఱాళ్ళా ఏమిటి?, ఆవంత తప్పునసైనన్ = ఏ కొద్ది తప్పుతోనైనను, కలిసి ఒచ్చున్ కాని, ఎవ్వరిన్ = ఏ ఒక్కరినైనను, మెయిమై = ప్రాణములతో, పోనిచ్చునే = పోనిచ్చునా?

తా. ఓ దేవతలారా! నా ప్రతిజ్ఞ వినండి. లోకప్రఖ్యాత చరిత్రకలవాడైన ఆ నలుని నేను పట్టుకుంటాను. ఏదైనా ఒక దారి దొరకకపోదు. నేను నిత్యము సేవించు దేవతలు ఱాళ్ళుకాదుకదా! ఏ కొద్ది తప్పుతోనైనను కలిసొస్తారుకాని ఏ ఒక్కరిని ప్రాణాలతో పోనివ్వరు.

**118 తే.** **ఆవగింజలు తాటికాయలుగ నాడి**
**దొడ్డసేయుదు సన్నంపు దోసమైన**
**హరిహరబ్రహ్మలైన నాయంతవారె**
**కపట మాయేంద్రజాలాది కౌశలమున**

ఆవగింజలు = ఆవగింజలంత దోషములను, తాటికాయలుగన్, ఆడి = పలికి, సన్నంపు దోసమైన = చిన్న దోషమైనను, దొడ్డ చేయుదు = పెద్దదిచేసెదను, కపట మాయ ఇంద్రజాల ఆది = మోసము, మాయ, ఇంద్రజాలము మొదలైన విద్యల, కౌశలమున = నేర్పున, హరిహరబ్రహ్మలైన = త్రిమూర్తులైనను, నా అంతవారె = నా యంతటివారా!

తా. ఆవగింజలంత దోషములను తాటికాయలుగ పలికి, చిన్న దోషమైనను పెద్దది చేసెదను. మోసము, మాయ, ఇంద్రజాలము మొదలైన విద్యల నేర్పున త్రిమూర్తులైనను నాకు సాటి రాలేరు.

**119 క.** **కాదంబరిఁ ద్రావింతును**
**జూదం బాడింతు వలలఁ జొక్కులఁ బెట్టం**
**బైదలుల నియోగింతును**
**వైదర్భ తనూజ మీఁది వలపుడిగింతున్**

కాదంబరిన్ = మద్యమును, త్రావింతును = త్రాగించెదను, జూదంబు, ఆడింతు, వలలన్ = మాయలచేత, చొక్కులన్ పెట్టన్ = మోహింపచేయుటకు, పైదలుల = స్త్రీలను, నియోగింతును = ఉపయోగించెదను, వైదర్భ తనూజ మీది = దమయంతి మీది, వలపు = ప్రేమను, ఉడిగింతున్ = లేకుండ చేసెదను.

తా. మద్యమును త్రాగించెదను, జూదము ఆడించెదను, మాయలచేత మోహింపచేయుటకు స్త్రీలను ఉపయోగించెదను. దమయంతిమీది ప్రేమను లేకుండ చేసెదను.

**120 తే.** **వేయు మాట లవేల యో విబుధులార**
**యవధరింపుడు నిజము మీ యడుగులాన**
**భైమితో భూమితోఁ బెడఁ బాపువాఁడ**
**నిమిష మాత్రంబునంద యా నిషధపతిని**

ఓ విబుధులార = ఓ దేవతలారా!, వేయు మాటలు అవి ఏల. మీ అడుగులు ఆన = మీ పాదములపై ఒట్టు, నిజము, అవధరింపుడు = వినుడు, ఆ నిషధపతిని = ఆ నలుని, నిమిష మాత్రంబునంద = క్షణకాలములో, భైమితో = దమయంతితో, భూమితో = రాజ్యముతో, పెడన్ పాపువాడ = దూరము చేసెదను.

తా. ఓ దేవతలారా! వేయి మాటలెందుకు? మీ పాదాలసాక్షిగా నిజం చెబుతాను వినండి. ఒక్క క్షణకాలంలో ఆ నలుని దమయంతినుండి, రాజ్యమునుండి దూరంచేసేస్తాను.

**121 వ.** **అని పలికిన నెమ్మనంబులం గుత్సించుచు నతని యుత్సాహంబు దైవకల్పితంబు గావున నన్యథాకరింప నలవిగాక నాక ప్రముఖులగు బర్హిర్ముఖు లన్యోన్య ముఖావలోకనంబు సేసి మనకుం గలిరాజుతోడం సంవాదం బింతియ చాలు**

**తమ్ముండు నన్నయునగు కలిద్వాపరంబులు బ్రహ్మలోకంబునుండి యా బ్రహ్మ నియోగంబునఁ బోవుచున్నవారు గావలయు. పాఱెడు నీళ్ళకుం గట్టపెట్టం బనియేమి? పొదండు పొదండని పోయిరి. కలియును కామ,క్రోధ,లోభ,మోహ పరివార పరివృతుండై నిషధ దేశంబు చాయన భూమండలంబునకు డిగ్గె నప్పుడు**

తా. అని పలికి ఇంద్రాదులు తమ మనసులందు నిందించుచు, ఆతని ప్రయత్నము దైవకల్పితము కావున వేరుగా చేయుటకు వీలుకాక ఒకరి ముఖాలొకరు చూసుకొని, మనకు కలిరాజుతో సంభాషణ ఇంతే చాలు, తమ్ముడును, అన్నయునగు ఈ కలిద్వాపరములు బ్రహ్మలోకమునుండి ఆ బ్రహ్మ ఆదేశముతో వెళ్ళుచున్నారు కావలయును. ప్రవహిస్తున్న నీళ్ళకు గట్టు కట్టడ మెందుకు? పదండి పదండి అని వెళ్ళిపోయిరి. కలియును కామము, క్రోధము, లోభము, మోహము అనే పరివారముతోకూడినవాడై నిషధదేశము చేరువన భూమిపై దిగెను. అప్పుడు –

**122 సీ. హోమాజ్య గంధోర్మికుద్వేగమొందుచుఁ**
**క్రతు ధూమములచేత గాసిపడుచు**
**నతిథి పాదక్షాళ నాంభః ప్లుతములైన**
**గృహమేధిమందిర క్షితితలముల**
**జీరు వాఱుచుఁ బూర్త శిశిరానిలంబులఁ**
**జలివట్టి వణఁకుచు సవనశుష్మ**
**పుటపాకముల వెక్కఁ బురపురం బొక్కుచుఁ**
**బశుబంధములఁ జూచి భయముపడుచు**
**తే. వ్రతుల బృసులకు యతికోటి రాంభములకు**
**బ్రహ్మచారుల యాషాఢపంక్తులకును**
**నంతరంగంబులో నాత్మహనన శంక**
**తరతరమ యుద్భవిల్లంగఁ దల్లడిలుచు**

(కలిపురుషుడు వచ్చాడు కాని పరివారముతో నలుని నగరములో ప్రవేశించాలనుకున్నాడు కాని ప్రవేశించలేకపోయాడు) హోమ ఆజ్య = హోమపు నేతియొక్క, గంధ = పరిమళముయొక్క ఊర్మికిన్ = తరంగమునకు, ఉద్వేగము = భయము, ఒందుచున్ = పొందుచు, క్రతుధూమములచేత = యాగ పొగలచేత, గాసి పడుచున్ = బాధపడుచు, అతిథి = అతిథులయొక్క, పాదక్షాళన = పాదములు కడుగుకొనుటకు పోసిన, అంభః = నీటిచే, ప్లుతములైన = తడిసినవైన, గృహమేధి = గృహస్థులయొక్క, మందిర క్షితితలములన్ = ఇంటి వాకిళ్ళయందు, జీఱివారుచున్ = జాఱిపడుచు, పూర్త = ధార్మికులచే నిర్మింపబడిన నూతులు, చెఱువులు మొదలైనవాటినుండి వచ్చెడి, శిశిర అనిలంబులన్ = చల్లని వాయువులచే, చలివట్టి = చలిగొని, వణకుచున్ = కంపమునొందుచు, సవనశుష్మ = యాగాగ్ని సంబంధియగు, పుటపాకముల = రెండుప్రక్కలయందును కలిగెడి తాపములయొక్క, వెక్కన్ = వేడిచేత, పురపురం పొక్కుచు = మిక్కిలి బొబ్బలు పొందుచు, పశుబంధములన్ = యాగ పశు వులను బంధించుటలను, చూచి, భయముపడుచు, వ్రతుల బృసులకు = ఋషుల దర్భాసనములకు, యతికోటి రాంభములకు = యతీంద్రుల వెదురుకఱ్ఱలకును, బ్రహ్మచారుల ఆషాఢపంక్తులకును = బ్రహ్మచారుల మోదుగుదండ వరుసలకును, అంతరంగంబులోన్ = మనస్సులో, ఆత్మహననశంక = తాను చచ్చునేమోయను సందేహము, తరతరమ = క్రమముగా, ఉద్భవిల్లంగన్ = కలుగగా, తల్లడిలుచున్ = భయమునొందుచు

తా. హోమపు నేతి పరిమళముయొక్క తరంగమునకు భయము పొందుచు యాగపొగలచేత బాధపడుచు అతిథులయొక్క పాదములు కడుగుకొనుటకు పోసిన నీటిచే తడిసినవైన గృహస్థులయొక్క ఇంటి వాకిళ్ళయందు జాఱిపడుచు, ధార్మికులచే నిర్మింపబడిన నూతులు, చెఱువులు మొదలైనవాటినుండి వచ్చెడి చల్లని వాయువులచే చలిగొని కంపముగొనుచు, యాగాగ్ని సంబంధియగు రెండు ప్రక్కలయందును కలిగెడి తాపములయొక్క వేడిచేత మిక్కిలి బొబ్బలు పొందుచు, యాగ పశువులను బంధించుటలను చూచి భయముపడుచు ఋషుల దర్భాసనములకు యతీంద్రుల వెదురుకఱ్ఱలను, బ్రహ్మచారుల మోదుగుదండ వరుసలకును, మనస్సులో తాను చచ్చునేమోయను సందేహము క్రమముగా కలుగగా భయమునొందుచు

**123 సీ. సవనయూపస్తంభ సంభారములఁ జూచి**
**శూలంబులోయని స్రుక్కి స్రుక్కి**
**భూదేవ నిటలోర్ధ్వ పుండ్రంబు లీక్షించి**
**ఖడ్గంబులోయని కలఁగి కలఁగి**
**బ్రహ్మచారి జనోత్కరంబు మౌంజులు సూచి**
**పాశంబులోయని భ్రమసి భ్రమసి**
**యధ్వర స్రుక్స్రువకాయంబు లాలోకించి**

**యురగంబులోయని యులికి యులికి**

తే. **విప్ర నికరం బనుష్ఠాన వేళలందు**
**బాణి పంకేరుహోదరాభ్యంతరమున**
**నిలిచి యెత్తిన యాచమనీయ తీర్థ**
**జలము శాపోదకంబని యలికి యలికి**

ముంజగడ్డి త్రాళ్ళను, చూచి, పాశంబులోయని = పాశములేమోయని, భ్రమసి భ్రమసి = భ్రమించి, అధ్వర = యాగములందలి, స్రుక్ నికాయంబులు = హోమ సాధనములు, ఆలోకించి = చూచి, ఉరగంబులోయని = సర్పములేమోయని, ఉలికి ఉలికి = త్రుళ్ళిపడి, విప్ర నికరంబు = బ్రాహ్మణులు, అనుష్ఠానవేళలన్ = అనుష్ఠాన సమయములందు, పాణి పంకేరుహ = హస్త పద్మములయొక్క, ఉదరాభ్యంతరమున = మధ్యప్రదేశమునందు, నిలిచి = ఉంచుకొని, ఎత్తిన = పైకెత్తిన, ఆచమనీయ తీర్థజలము, శాపోదకంబని = తనను శపించడానికి ఎత్తిన జలమని, అలికి అలికి = భయపడి,

తా. యజ్ఞమందలి యూపస్తంభములను చూచి శూలములని జంకి, బ్రాహ్మణుల నుదుటి బొట్టులను చూచి కత్తులేమోయని కలతచెంది, బ్రహ్మచారుల మొలలనున్న మౌంజులను చూచి పాశములేమోయని భ్రమించి, యాగములందలి హోమ సాధనములను చూచి సర్పములేమోయని త్రుళ్ళిపడి, బ్రాహ్మణులు అనుష్ఠానకాలమందు చేతులలో ఉంచుకొనిన ఆచమనీయ జలము శాపమునకైన ఉదకమేమోయని భయపడి

124 సీ. **ఆత్మఘాతకుఁ జూచి హర్షింపఁగా నేల**
**యతఁడు సర్వస్వార యజ్ఞకర్త**
**బ్రహ్మఘ్నుఁ గని యేల పరితోషమందంగ**
**నాతఁడు సర్వమేధాభిరతుఁడు**
**బ్రహ్మచారీ త్వరీ రతికేల మోదింప**
**నది మహావ్రత దీక్ష కంగకంబు**
**విప్రుల మధుపాన విధి కేల యలరంగ**
**సౌత్రామణేష్టి యాజకులువారు**

తే. **ధూళిధూసరుఁ బరికించి యేల నిక్క**
**పావన స్నాన విధి మృదాభవ్యుఁ డాతఁ**
**డనుచు మూఁడవయుగము దన్నచట నచట**
**భ్రాంతి దీర్పఁగ గతిలేక భంగపడుచు**

ఆత్మఘాతకున్ చూచి = ఆత్మహత్య చేసుకొనువానిని చూచి, హర్షింపగాన్ ఏల = సంతసింపగా ఏల?, అతడు, సర్వస్వార యజ్ఞకర్త = సర్వస్వార మను యజ్ఞమును చేయువాడు, బ్రహ్మఘ్నున్ కని = బ్రహ్మహత్య చేసినవానిని చూచి, పరితోషము అందంగ ఏల = సంతసింపగా ఏల?, ఆతడు, సర్వమేధ అభిరతుడు = సర్వమేధమను యజ్ఞముచేయువాడు, బ్రహ్మచారి ఇత్వరీ రతికిన్ = బ్రహ్మచారియు, వేశ్యయును సంభోగమునకు, మోదింపన్ ఏల = సంతసింపగా ఏల?, అది, మహావ్రత దీక్షకు అంగకంబు = మహావ్రతమను యజ్ఞమునకు భాగము, విప్రుల = బ్రాహ్మణుల, మధుపాన విధికి = మద్యపానము చేయుటకు, అలరంగన్ ఏల = సంతసింపగా ఏల?, సౌత్రామణేష్టి యాజకులువారు = సౌత్రామణి అను యజ్ఞము చేయువారు, ధూళి ధూసరున్ = గోపాద ధూళిని పూసుకొన్నవానిని, పరికించి = చూచి, నిక్క ఏల = ఎగిరిపడుట ఏల?, ఆతడు, పావన స్నానవిధి = పవిత్రమైన స్నానవిధియొక్క, మృదా = మట్టిచే, భవ్యుడు = శుభుడు, అనుచు, మూడవ యుగము = ద్వాపరుడు, తన్ను = తనను, అచట అచట, భ్రాంతి తీర్పగ = భ్రమను తొలగించుచుండగా, గతిలేక = దారి లేక, భంగపడుచు = కలి భంగపాటుచెందుచు

తా. ఆత్మహత్య చేసుకొనువానిని చూచి సంతసించకు అతడు సర్వస్వార యజ్ఞమును చేయువాడు. బ్రహ్మహత్య చేసినవానిని చూచి సంతసించకు అతడు సర్వమేధమను యజ్ఞముచేయువాడు, బ్రహ్మచారి, వేశ్య సంభోగమునకు సంతసింపకు అతి మహావ్రతదీక్షకు భాగము, బ్రాహ్మణుల మద్యపానమునకు సంతసించకు వారు సౌత్రామణి అను యజ్ఞము చేయువారు. గోపాద ధూళిని పూసుకొన్నవారిని చూచి సంతసించకు పవిత్రమైన స్నానవిధియొక్క మట్టిచే వారు శుభులు అనుచు ద్వాపరుడు తనను అక్కడక్కడ భ్రమను తొలగించుచుండగా దారిలేక కలి భంగపాటునుచెందుచు

125 వ. **నిషధ దేశంబులోఁ జనువాఁడు మతియును**

126 తే. **స్నాతకుల ఘాతకులఁగాఁగ సంస్మరించి**
**నహితులకుఁ బోలె వెఱచు నగ్న్యాహితులకుఁ**
**దలఁచు దాంతుఁ గృతాంతుఁగాఁ గలియుగంబు**

**మానితంబైన యా మహీ మండలమున**

మానితంబైన = పూజ్యమైన, ఆ మహీమండలమున = ఆ నిషధ దేశమునందు, కలియుగము, స్నాతకులన్ = వేదపండితులను, ఘాతుకులన్ కాగన్ = మారకులనుగా, సంస్మరించి = తలంచి, అగ్ని ఆహితులకున్ = ఆహితాగ్నులకు, అహితులకు పోలె = శత్రువులకు వలె, వెఱచు = భయపడుచు, దాంతున్ = తపస్విని, కృతాంతుగాన్ = యమునిగా, తలచు

తా. పూజనీయమైన ఆ నిషధదేశమునందు కలియుగము వేదపండితులను మారకులనుగా తలంచును. ఆహితాగ్నులను శత్రువులుగా తలంచి భయపడును. తపస్వులను యమునిగా తలంచును.

**127** సీ. **బౌద్ధులఁ బాటించుఁ బరమ బంధులఁ బోలెఁ**
**జార్వాకులకుఁ గరాంజలి ఘటించు**
**జైనులం బొడగన్న సంతోషమునఁ దేలు**
**జే యని మ్రొక్కు లోకాయతులకు**
**వైతండికుల కభివాదనం బొనరించుఁ**
**బాషండులకుఁ జాల భక్తిఁ జేయుఁ**
**గాపాలికులకు సత్కారంబుఁ గావించుఁ**
**బరిచయించును దిగంబరులతోడఁ**

తే. **బాశుపత కక్షపాలికా భస్మధూళి**
**పాళి యుద్ధూళన క్రియా వేళయందు**
**గాలి వెంబడిఁ బై రాలఁ గళవళించుఁ**
**గలియుగము పావకస్ఫులింగమ్ములనుచు**

కలియుగము, బౌద్ధులన్, పరమ బంధులన్ పోలెన్, పాటించున్ = గౌరవించుచుండును. చార్వాకులకున్ = నాస్తికులకు, కరాంజలి ఘటించు = నమస్కరించును. జైనులన్, పొడగన్న = చూచిన, సంతోషమునన్ తేలున్. లోకాయతులకు, జే అని = జయమని, మ్రొక్కున్. వైతండికులకు = వితండవాదము సల్పువారలకు, అభివాదనంబు ఒనరించు = నమస్కరించును. పాషండులకున్, చాల భక్తి చేయున్, కాపాలికులకున్, సత్కారంబున్ కావించున్. దిగంబరుల తోడన్, పరిచయించును = సంబంధముంచుకొనును. పాశుపత = పాశుపత దీక్షాపరుల, కక్షపాలికా = చంకనున్న సంచియందున్న, భస్మధూళి పాళి = విభూతి సముదాయమును, ఉద్ధూళన క్రియా వేళయందు = ఒంటికి పూసుకొను సమయమందు, గాలి వెంబడిన్ = వాయు వశమున, పై రాలన్ = మీద పడగా, పావకస్ఫులింగములనుచు = అగ్నిహోత్రకణములనుచు, కళవళించున్ = తొట్రుపడుచుండును.

తా. కలియుగము బౌద్ధులను పరమ బంధువులుగా గౌరవించును, చార్వాకులకు నమస్కరించును. జైనులను చూచిన సంతోషమున తేలును. లోకాయుతులకు జయమనును, వైతండికులకు మ్రొక్కును. పాషండులకు చాల భక్తిని చూపును, కాపాలికులకు సత్కారములు చేయును. దిగంబరులతో మిత్రత్వము పాటించును, పాశుపతుల సంచిలోని విభూతి ఒంటికి పూసుకొను సమయమున వాయువశమున పైన రాలగా వానిని అగ్నిహోత్రకణములని తొట్రుపడును.

**128** క. **వేగుంబోకల మేల్కొని**
**భాగవతోద్గీయమాన భగవద్గీతా**
**రాగంబులకును మది ను**
**ద్వేగంబు వహించుఁ జేఁదు తిన్న విధమునన్**

వేగుంబోకలన్ = వేకువజాములందు, మేల్కని = లేచి, భాగవత = భక్తులచే, ఉద్గీయమాన = గానముచేయబడుచున్న, భగవద్గీతా, రాగంబులకును = శ్లోక గానమునకు, చేదు = విషము, తిన్న విధమునన్, మదిన్ = మనసులో, ఉద్వేగంబు వహించున్ = భయమును పొందుచుండును.

తా. వేకువజాములందు లేచి భక్తులచే గానముచేయబడుచున్న భగవద్గీతా శ్లోక గానమునకు విషము త్రాగినట్లుగ భయపడుచుండును.

**129** సీ. **అప్పరాకుఁడు పరాకమ్మగా రేతెంచు**
**త్రోవకు దూరంబు తొలఁగిపోవు**
**నా దోషకారి సన్న్యాసి దవ్వులఁ గాంచి**
**యోలంబునకుఁ దారి యొదిఁగియుండు**
**నా పాపజాతి మాసోపవాసిని గని**
**లంఘింపఁబోయి కాల్నలియఁ గూలు**
**నా వెనుగొఱుకు యాయావరవ్రతధారి**

బదదారి యని పేర్చి పండ్లు గొఱుకు

తే. నా నృశంసుఁ డోసరిలు వైఖానసులకు
నా దురాత్ముండు శ్రోత్రియు నపహసించు
నా ఖలుఁడు సోమయాజి నిరాకరించు
నక్కిరాతుఁ డనుష్ఠాతు ధిక్కరించు

ఆ పరాకుడు = నీచుడైన ఆ కలి, పరాక అమ్మగారు = పరాక వ్రతమాచరించిన స్త్రీ, ఏతెంచు = వచ్చుచున్న, త్రోవకు = దారికి, దూరంబు తొలగిపోవు = దూరముగా తప్పుకొనును. ఆ దోషకారి = ఆ పాపాత్ముడు, సన్న్యాసిన్, దవ్వులన్ = దూరమునందే, కాంచి = చూచి, ఓలంబునకున్ = చెట్ల చాటునకు, తారి = పోయి, ఒదిగి ఉండు = దాగియుండును. ఆ పాపజాతి = ఆ పాపాత్ముడు, మాసోపవాసిని = నెల ఉపవాస వ్రతము పూనిన స్త్రీని, కని = చూచి, లంఘింపబోయి = పరుగెత్తబోయి, కాల్నలియ = కాలు మడతపడగా, కూలున్ = పడిపోవును. ఆ వెనుగొఱుకు = ఆ దోషాత్ముడు, యాయావర వ్రతధారి = యాయావర వ్రతముచేయువానిని, పగదారియని = శత్రువని, పేర్చి = అతిశయించి, పండ్లు గొఱుకును = పళ్ళు నూఱును, ఆ నృశంసుడు = ఆ క్రూరుడు, వైఖానసులకున్ = వానప్రస్థులకు, ఓసరిలు = ప్రక్కకు తప్పుకొనును. ఆ దురాత్ముండు, శ్రోత్రియున్ = వేదపండితుని, అపహసించు = పరిహాసముచేయును. ఆ ఖలుడు = ఆ దుర్మార్గుడు, సోమయాజిన్ = యజ్ఞముచేసినవానిని, నిరాకరించు = తిరస్కరించును, ఆ కిరాతుడు = ఆ నీచుడు, అనుష్ఠాతున్ = అనుష్ఠానముచేయువానిని, ధిక్కరించు = తిరస్కరించును.(12 రాత్రులు ఉపవసించడం పరాకవ్రతం)

తా. ఆ నీచుడైన కలి పరాక వ్రతమాచరించిన స్త్రీ వచ్చుచున్న దారికి దూరముగా తొలగిపోవును. ఆ పాపాత్ముడు సన్న్యాసిని దూరముననే చూచి చాటునకు పోయి దాగియుండును. ఆ పాపాత్ముడు నెల ఉపవాస వ్రతముపూనిన స్త్రీని చూచి పరుగెత్తబోయి కాలుమడతపడగా పడిపోవును. ఆ దోషాత్ముడు యాయావర వ్రతముచేయువానిని చూచి శత్రువని పండ్లు పటపట కొఱుకును. ఆ క్రూరుడు వానప్రస్థులకు ప్రక్కకు తప్పుకొనును. ఆ దురాత్ముడు వేదపండితుని పరిహసించును. ఆ దుర్మార్గుడు సోమయాజిని తిరస్కరించును.

130 శా. ఆ నిర్భాగ్యుఁడు గాళరాత్రియని హాహాకారముం జేయు డెం
దాన న్సాధ్వసమంది బ్రాహ్మణులు సంధ్యావేళఁ జేతస్సమా
ధానం బొప్పఁగ నావహింప నుదయ త్సప్తాశ్వబింబంబులోఁ
గా నాకాశ పథంబు నిండుకొని శ్రీ గాయత్రి యేతేరఁగాన్

ఆ నిర్భాగ్యుడు = ఆ కలి, బ్రాహ్మణులు, సంధ్యావేళన్ = సంధ్యవేళలందు, చేత: సమాధానంబు = మనస్సునకు సావకాశత, ఒప్పన్ = ఒప్పునట్లుగా, ఆవహింపన్ = ఉపాసింపగా, ఉదయత్ = ఉదయించుచున్న, సప్తాశ్వబింబంబులోగాన్ = సూర్యమండలములోనుండి, ఆకాశపథంబు = ఆశాశమార్గమును, నిండికొని = వ్యాపించి, శ్రీ గాయత్రి = గాయత్రీ దేవి, ఏతేరగాన్ = వచ్చుచుండగా, కాళరాత్రి అని = ప్రళయరాత్రియని, డెందానన్ = మనసునందు, సాధ్వసమంది = భయపడి, హాహాకారమున్ చేయున్ = గోలచేయును.

తా. ఆ కలి బ్రాహ్మణులు ఉదయ సాయం సంధ్యావేళలలో మనస్సునకు ప్రశాంతత ఒప్పునట్లుగా ఉపాసింపగా ఉదయించుచున్న సూర్యబింబములోనుండి ఆకాశమార్గమును వ్యాపించి గాయత్రీదేవి వచ్చుచుండగా ప్రళయరాత్రియని ఆ నీచుడు మనసునందు భయపడి గోలచేయును.

131 తే. జినగవేషణ నిరతుఁడౌ చెట్టసూచు
నజినవద్బ్రహ్మచారి చయంబు నెదుర
క్షపణకాలోకనార్థి యాఖలుఁడు గాంచు
నక్షపణ కేళి రాజసూయాధ్వరమున

జిన = జినుని, గవేషణ = వెదకుటయందు, నిరతుడౌ = ఆసక్తుడైన, చెట్ట = చెడ్డవాడైన కలి, ఎదురన్, అజినవత్ = కృష్ణమృగ చర్మమును ధరించిన, బ్రహ్మచారి చయంబున్ = బ్రహ్మచారి సమూహమును, చూచున్, క్షపణక = బౌద్ధులను, ఆలోకన = చూచుటను, అర్థి = కోరుచున్న, ఆ ఖలుడు = ఆ దుష్టుడు, రాజసూయ అధ్వరమునన్ = రాజసూయ యాగమందు, అక్ష పణ కేళిన్ = పాచికలందు ఒడ్డిన ధనమందలి ఆటను, కాంచున్ = చూచును.

తా. కలి జినుని వెదకుటయందు ఆసక్తుడైన ఎదుట అజినవస్త్ర ధారులగు బ్రహ్మచారులను చూచును. క్షపణకులను చూడగోరిన ఆ దుష్టుడు రాజసూయ యాగమునందు అక్షపణ కేళిని చూచును.

132 మ. యజమాన ప్రమదా వికస్వర భగ న్యస్తాశ్వ దీర్ఘస్మర
ధ్వజ దండం బగు నశ్వ మేధ మఖ తంత్రంబు న్నిరీక్షించి యి
క్కుజనుం డొత్తిలి నవ్వె వేదవిదులం గుత్సించి పుష్పాస్త్రు చే
నిజహస్తంబున వ్రేసి యశ్రుకణముల్ నిండార నేత్రంబులన్

యజమాన ప్రమదా = యజమానుని స్త్రీయొక్క, వికస్వర = వికసించిన, భగన్యస్త = భగమునందుంచబడిన, అశ్వ = గుఱ్ఱముయొక్క, దీర్ఘ స్మరధ్వజదండంబగు = పొడవైన మన్మథుని దండమైన, అశ్వమేథమఖ తంత్రంబున్ = అశ్వమేథ యజ్ఞ విధానమును, నిరీక్షించి = చూచి, ఈ కుజనుండు, వేదవిదులం = వేదపండితులను, కుత్సించి = నిందించి, పుష్పాస్త్రుచే = మన్మథునిచే, నిజహస్తంబున వ్రేసి = తనచేతితోకొట్టబడి, నేత్రంబులన్, అశ్రుకణముల్ నిండారన్, ఒత్తిలి, నవ్వెన్.

**133 వ. ఇవ్విధంబున**

**134 ఉ. భాండిక మండలీ ప్రకృతి బంధుఁడు బంధకికా ప్రియుండు పా**
**షండ సఖుండు జైనతరుషండ వసంతుఁడునుం దిరస్కృత**
**స్థండిలశాయియుం గపట ధార్మిక మిత్రుఁడునై వినింద్య క**
**ర్ముం డతడుండెఁ గొన్ని దినముల్నిషధావని మండలంబునన్**

భాండిక మండలీ = బండబూతులాడు సమూహమునకు, ప్రకృతి బంధుడు = సహజ చుట్టమును, బంధకికా = వేశ్యలను, ప్రియుడు = ఇష్టపడువాడును, పాషండ = పాషండులకు, సఖుండు = మిత్రుడును, జైన = జైనులనెడి, తరుషండ = వృక్ష సమూహమునకు, వసంతుడునున్, తిరస్కృత = ధిక్కరింపబడుచున్న, స్థండిలశాయియున్ = కటికనేలపై పరుండు నియమముతో వేదాధ్యయనము చేయువారు కలవాడును, కపట = మోసగాండ్రైన, ధార్మిక = ధార్మికులకు, మిత్రుడునై = స్నేహితుడునై, వినింద్యకర్ముడు = నిందార్హమగు పనులుచేయువాడు, అతడు = ఆ కలి, కొన్ని దినముల్, నిషధావని మండలంబునన్ = నలుని రాజ్యములో, ఉండెన్.

తా. బండబూతులాడు సమూహమునకు సహజ చుట్టమును, వేశ్యలను ఇష్టపడువాడును, పాషండులకు మిత్రుడును, జైనులనెడి వృక్ష సమూహమునకు వసంతుడును, కటికనేలపై పరుండి వేదాధ్యయనముచేయువారిని తిరస్కరించువాడును, మోసగాండ్రైన ధార్మికులకు స్నేహితుడునై నిందార్హమగు పనులుచేయుచు ఆ కలి కొన్ని దినములు ఆ నిషధ రాజ్యములో ఉండెను.

**135 మ. కలికాలంబు విదర్భరాజతనయా గాఢాంక పాళీ మహో**
**త్కలికాలంబమునం జరించె నిషధ క్ష్మామండలి న్మార్గభూ**
**నల నిగ్రాహిణియైన పారిషద సైన్యశ్రేణి దర్పోద్ధతుల్**
**నల నిగ్రాపణియైన యాత్రకు సముల్లాసంబు సంధింపఁగన్**

కలికాలంబు = కలి, మార్గ = దారియందు, భూ = పుట్టిన, నల = కిక్కసగడ్డిని, నిగ్రాహిణియైన = లేకుండచేయునట్టిదైన, పారిషద = సభ్యులైన, సైన్యశ్రేణి = సైన్య పంక్తియొక్క, దర్పోద్ధతుల్ = అతిశయమును, నల నిగ్రాపణియైన యాత్రకు = నలుని దండించుటకైన దండయాత్రకు, సముల్లాసంబు = అధికమైన ఉత్సాహమును, సంధింపగన్ = కలిగింపగా, విదర్భరాజతనయా = దమయంతియొక్క, గాఢాంక పాళీ = బిగువైన కౌగలింతయందలి, మహత్ = గొప్పదైన, ఉత్కలికా = వేడుకయొక్క, ఆలంబమునన్ = ఆసక్తితో, చరించెన్ = సంచరించెను.

తా. కలి తన సభ్యులైన సైనికులయొక్క అతిశయమున దారిలోని కిక్కసగడ్డిని కూడ లేకుండచేయుచుండగా అది నలునిపై దండయాత్రకు ఉత్సాహమును కలిగింపగా దమయంతి బిగువైన కౌగిలియందలి గొప్పదైన వేడుకతో సంచరించెను.

**136 వ. ఇవ్విధంబునఁ గలియుగంబు దిరిగి తిరిగి యెప్పట్టునం బాపంబు రూపింపలేక యొక్కచోట నేకాంతంబునం దనయంతవట్టువారినింగూడి మంతనంబుండి 'రంధ్రాన్వేషణంబులంగాని దోషంబులు గానంబడవు. రంధ్రాన్వేషణంబులు గాలక్రమంబునంగాని ఫలింపనేరవు. కావున ద్వాపరంబ దేశంబున వివాద లేశంబు లరయునది. నాకుం గామ క్రోధ లోభ మోహంబులకును వేఱువేఱ యధికారంబులు పాలువెట్టెద. అది యెయ్యవి యంటేని**

తా. ఈ విధముగా కలిపురుషుడు తిరిగి తిరిగి ఎక్కడను పాపమును నిరూపించలేక ఒకచోట ఏకాంతంగ తనకు సంబంధించినవారిని కూడి ఆలోచించుచు 'అవకాశములు వెదకుటవలనగాని దోషములు కనబడవు. అవకాశములు వెదకుట కాలక్రమమునకాని ఫలితము నీయవు. కావున ఓ ద్వాపరమా! రాజ్యమున వివాదాంశములను చూడండి. నాకును, కామ క్రోధ లోభ మోహములకను వేరువేరుగా అధికారములు పంచిపెట్టెదను. ఆ అధికారములు ఏవి అనగా

**137 సీ. యతి మాచకమ్మయు నతిథి దీక్షితపత్ని**
**మగనిఁ బాసిన యింతి మరునిపాలు**
**తీర్థవాసులును మాంత్రికులు దాయాదులుఁ**
**దర్కవాదులును గ్రోధంబు పాలు**
**యజన దీక్షితులు నధ్యయన పాఠకులును**
**భస్మకుంఠనులు లోభంబు పాలు**
**బాల వైతండిక పామ రాహంకార**

**చుంబకమతులు మోహంబు పాలు**

**తే. కేళి సౌధ మహాచంద్రశాలయందు**
**హంసతూలిక పాన్పుపై నహరహంబు**
**నవ వధూకేళి విహరణోన్మత్తుఁడైన**
**నిషధనాథుండు నా పాలు నిక్కమరయ**

యతి = సన్యాసియు, మాచకమ్మ = పురుష లక్షణములుకల స్త్రీయు, అతిధియు, దీక్షిత పత్ని = వ్రతదీక్షలోనున్నవాని భార్యయు, మగనిన్ పాసిన ఇంతి = భర్తను వదలిపెట్టిన స్త్రీయును, మరుని పాలు = కామము వంతు, తీర్థవాసులును = తీర్థయాత్రికులును, మాంత్రికులు = మంత్రగాళ్ళును, దాయాదులున్ = జ్ఞాతులును, తర్కవాదులును = అడ్డముగా వాదించువారును, క్రోధంబు పాలు = క్రోధము వంతు, యజన దీక్షితులున్ = యజ్ఞదీక్ష వహించినవారును, అధ్యయన పాఠకులును = వేదాధ్యయనముచేయువారును, భస్మకుంఠనులు = తపస్వులును, లోభంబు పాలు = లోభము వంతు, బాల= మూర్ఖులును, వైతండిక = స్వపక్షపాతముగా వాదించువారును, పామర = అజ్ఞానులును, అహంకార చుంబక మతులు = అహంకారమునకు వశులయిన బుద్ధులు, మోహంబు పాలు = మోహము వంతు, కేళి సౌధ = క్రీడా గృహముయొక్క, మహా = గొప్పదైన, చంద్రశాలయందు = ఆకాశ భవనమందు, హంసతూలికపాన్పుపైన్, అహరహంబు = అనునిత్యము, నవవధూ = క్రొత్త భార్యతో, కేళి విహరణ = క్రీడావిహారముచే, ఉన్మత్తుడైన = మదించినవాడైన, నిషధ నాథుండు = నలుడు, నా పాలు, అరయన్ = ఆలోచింపగా, నిక్కము = ఇది సరియైనది.

తా. సన్యాసియు, పురుష లక్షణములుకల స్త్రీయు, అతిధియు, వ్రతదీక్షలోనున్నవాని భార్యయు, భర్తను వదలివేసిన స్త్రీయు కామము వంతు, తీర్థయాత్రికులు, మాంత్రికులు, దాయాదులు, తర్కవాదులు క్రోధము వంతు, యజ్ఞదీక్ష వహించినవారు, వేదాధ్యయనముచేయువారు, తపస్వులు లోభము వంతు, మూర్ఖులు, స్వపక్షపాతముగా వాదించువారు, అజ్ఞానులు, అహంకారమునకు వశులయిన బుద్ధులు మోహము వంతు, క్రీడా గృహమున చంద్రశాలయందు హంసతూలికాశయ్యపై అనునిత్యము క్రొత్త భార్యతో క్రీడావిహారముచే మదించినవాడైన నలుడు నా వంతు, ఆలోచింపగా ఇది సరియైనది.

**138 వ. అని యందఱ నియోగించి**

**139 ఉ. కాక పతాకతో ఘన సృగాల కిశోరక రథ్యపంక్తితోఁ**
**గీకస పేటికా ఘటిత కింకిణికావలితోడఁ గూడి భ**
**ల్లూక ప్రకృతి క్లిప్తమగు లోహ శతాంగము గొంచుఁ బోవ నా**
**జ్ఞాకృతిఁ బంచె నప్డు నిజ సారథియైన దురాత్ము దుస్సహున్**

అప్డు = అప్పుడు, కాక పతాకతోన్ = కాకి జండాతోను, ఘన = గొప్పవైన, సృగాల కిశోరక = నక్క పిల్లలనెడి, రథ్య పంక్తితోన్ = గుఱ్ఱములనముదాయముతో, కీకస పేటికా ఘటిత = ఎముకల సమూహముచే కూర్చబడిన, కింకిణికావలితోడన్ = చిఱుగంటలతోను, కూడి, భల్లూక ప్రకృతి క్లిప్తమగు = ఎలుగుబంటి తోలుతో నావృతమైన, లోహ శతాంగము = ఇనుప రథమును, కొంచు పోవన్ = తీసుకొని పోవుటకు, నిజ సారథియైన = తన సారథియైన, దురాత్మున్ = దుర్మార్గుడైన, దుస్సహున్ = దుస్సహుని, ఆజ్ఞాకృతిన్ పంచెన్ = ఆజ్ఞాపించెను.

తా. అప్పుడు కలి కాకి పతాకముతో, నక్క పిల్లలనెడి గుఱ్ఱములతో, ఎముకలతో కూర్చబడిన చిఱుగంటలతో కూడి, ఎలుగుబంటి తోలుతో కప్పబడిన ఇనుప రథమును తీసుకొనిపోవుటకు తన సారథియైన దర్మార్గుడు దుస్సహునికి ఆజ్ఞాపించెను.

**140 వ. పంచి యనంతరంబ యన్నిర్దయుండు దానును గార్దభధూళి లగ్నంబున నిషధ నగరంబుఁ బ్రవేశించి, సంధ్యాకాలంబున మసమసక చీఁకటిం గుఱుమాపుదుం బుట్టంబు ముసుంగు వెట్టుకొని పెడతెరువున శూన్య భవన ద్వార వేదికా విటంకంబుల విశ్రమించుచు, దేవమందిర ప్రాంగణంబులకుం దొలంగి, వేశ్య వాటంబు నడుమ నొయ్యన నడిచి యట మలంగి దురోదర క్రీడావినోదంబుల ననుమోదించుచు, గాదంబరీ గృహంబు లొరసికొనుచుఁ, జైత్యంబులు గడచి, శృంగాటకంబులు దాఁటి, దూరంబు చని నిభృత ప్రకారంబున నృపాగారంబు డాసి యచ్చేరువం గేళీ సౌధంబు కెలన శిలాప్రాకార పరివృతంబై నందనవనంబునకు విందనం జాలి, చాలం జెన్నొందు మందిరోద్యానంబుఁ దతిసి నెత్తమ్మికొలని కుత్తరంబునఁ గేళాకూళికిం బడమట గుటజకురంటక ఝింటికాసర్జ ఖర్జూర కేతకీషండ మండలంబు లోనం గారుకొని గాలికిం దూఱరానియొక్క యీరంబు సొచ్చి యచ్చట**

తా. తన సారథిని పంపివేసి, అటుతరువాత ఆ దయలేని తానును గాడిదల దుమ్మురేగు సమయమున నలుని పట్టణమున ప్రవేశించి, సాయం సమయమున చీకటిపడుతున్నవేళ కొంచెము మాసిన వస్త్రమును ముసుగు వేసుకొని వెనుక వైపునుండి జనశూన్యములైన యిండ్లయొక్క అరుగులపై విశ్రాంతి తీసుకొనుచు, దేవాలయ ప్రాంతములకు దూరముండుచు, వేశ్యావాటికల మధ్య మెల్లగా నడచి, అక్కడినుండి కదలి జూద క్రీడావినోదములను అంగీకరించుచు, కల్లుపాకలను ప్రవేశించుచు, కట్టడములు, రహదారులను దాటి దూరము వెళ్ళి రహస్యముగా రాజమందిరమును చేరి ఆ సమీపమున క్రీడాగృహముచెంత

రాతిగోడతో చుట్టబడినదై నందనవనమునకు చుట్టమనగా చాలిన, మిక్కిలి సుందరమైన మందిర ఉద్యానవనమును సమీపించి, పద్మ సరోవరమునకు ఉత్తర దిక్కున, క్రీడా సరస్సునకు పశ్చిమమున కొండమల్లె, పచ్చగోరింట, ములుగోరింట, మద్ది, ఖర్జూర, మొగలిచెట్ల సమూహముచే చుట్టబడిన ప్రదేశమున దట్టముగానుండి గాలికూడ ప్రవేశింపలేని యొక పొదరింటిని ప్రవేశించి, అక్కడ

**141 శా. సంతోషంబున నాశ్రయించె విలసచ్ఛాఖోపశాఖాశిఖా**
**సంతానోదయ చుంబితాంబర దిశాచక్రంబు భూపాల శు**
**ద్ధాంతారామ రమాంగనాభిసరణ వ్యాపార సంకేత వి**
**శ్రాంతి స్థానకము న్విభీతక మహా సర్వంసహాజాతమున్**

విలసత్ = ప్రకాశించుచున్న, శాఖ ఉపశాఖా = పెద్ద, చిన్న కొమ్మలయొక్కయు, శిఖా = చిగురులయొక్క, సంతాన = సమూహముయొక్క, ఉదయ = పుట్టుకచే, చుంబిత = తాకబడుచున్న, అంబర = ఆకాశమును, దిశా చక్రంబు = దిక్కుల సమూహమునుకల, భూపాల = నలుని, శుద్ధాంత = అంత:పురముయొక్క, ఆరామ రమా = ఉద్యానవనలక్ష్మియనెడి, అంగన = స్త్రీయొక్క, అభిసరణ వ్యాపార = అభిసారికా కృత్యమునకు, సంకేత = గుర్తగుచున్న విశ్రాంతి స్థానకమున్ = విశ్రాంతిస్థానమును, విభీతక = తాండ్రయనెడు మహత్ = గొప్పదైన, సర్వంసహాజాతమున్ = (భూమినుండి మొలచిన) వృక్షమును, సంతోషంబునన్ = సంతోషముగా, ఆశ్రయించెను = చేరెను.

తా. వెలుగొందుచున్న పెద్ద, చిన్న కొమ్మలయొక్క చిగురుల సమూహముల పుట్టుకచే తాకబడుచున్న ఆకాశమును, దిక్కుల సమూహమునుకల నలుని అంత:పురముయొక్క ఉద్యానవనలక్ష్మియనెడు స్త్రీయొక్క అభిసారిక కృత్యమునకు గుర్తగుచున్న విశ్రాంతి స్థలమగు తాండ్రయనెడు గొప్ప వృక్షమును సంతోషముగా చేరుకొనెను.

**142 వ. ఇట్లు కలిరాజు నిషధరాజ ధర్షనార్థంబు శుద్ధాంత లీలావనంబులోని తాఁడి మ్రాని కోటరంబున నివసించి రంధ్రాన్వేషణ తత్పరుండై యుండె నట పూర్వంబు**

తా. ఈ రీతిగా కలిపురుషుడు నలుని జయించుటకు అంత:పుర క్రీడావనములోని తాడిచెట్టు తొఱ్ఱలో ఉండి, దారి వెదకుచు ఉండెను. అక్కడ అంతకు ముందు

**143 తే. అవ్విధంబున నిషధదేశాధిరాజు**
**నగరు సొత్తెంచి యంతరాంతరములందు**
**దొరల మంత్రుల దండనాథులను నృపుల**
**నిజ నివాసంబులకు నన్పె నిలిచి నిలిచి**

ఆ విధంబున = ఆ ప్రకారముగా, నిషధ దేశ అధిరాజు = నలమహారాజు, నగరు సొత్తెంచి = నగరమును ప్రవేశించి, అంతర అంతరములందు = మధ్య మధ్య, నిలిచి నిలిచి, దొరలన్ = ప్రభువులను, మంత్రులన్, దండనాథులను = సైన్యాధ్యక్షులను, నృపులన్ = సామంతులను, నిజ నివాసంబులకున్ = వారి వారి నివాసములకు, అన్పె = పంపెను

తా. ఆ ప్రకారముగా నలమహారాజు తమ పట్టణమును ప్రవేశించి మార్గ మధ్యమున అక్కడక్కడ నిలిచి ప్రభువులను, మంత్రులను, సేనాధ్యక్షులను, సామంతులను వారి వారి నివాసములకు పంపివేసెను.

**144 ఉ. పాయఁ దొలంగుఁడం చుభయ పార్శ్వములం బగళంబు సేయుఁచున్**
**దోయజలోచన ల్గొలిచి తోఁజనుఁ దేరఁగఁ బెండ్లికూఁతుర**
**త్యాయత వైభవస్ఫురణ నంతిపురంబున కేగుఁదెంచెఁ బై**
**డాయఁగ జిడ్డి వైచిన కడాని మెఱుంగు పసిండి పాలకిన్**

పాయన్ = దూరముగా, తొలంగుడు అంచు = జరగండనుచు, ఉభయ పార్శ్వములన్ = రెండు వైపులను, బగళంబు చేయుయున్ = ఒత్తిగించుచు, తోయజలోచనల్ = స్త్రీలు, కొలిచి = సేవించి, తోన్ చనున్ తేరగన్ = కూడా రాగా, పెండ్లికూతురు = దమయంతి, అత్యాయత వైభవస్ఫురణన్ = మిక్కిలి గొప్ప వైభవముతో, పైన్ = మీద, డాయగన్ = దగ్గరగా, జిడ్డివైచిన = మోటుగుడ్డ అమర్చియుంచిన, కడాని = మిక్కిలి, మెఱుంగు = మెఱసిపోవుచున్న, పసిండి పాలకిన్ = బంగారు పల్లకిలో, అంతిపురంబునకున్, ఏగు తెంచెన్ = వచ్చెను.

తా. దూరముగా జరగండని రెండు వైపుల ఒత్తిగించుచు స్త్రీలు సేవించి కూడా రాగా దమయంతి మిక్కిలి గొప్ప వైభవముతో మీద దగ్గరగా మోటుగుడ్డ అమర్చియుంచిన బంగారు పల్లకిలో అంత:పురమునకు వచ్చెను.

**145 ఉ. కైశికవృత్తియొప్పఁ గ్రథకైశిక రాజసుతా వివాహ దీ**
**క్షా శుభవస్తు సంయుతముగా బయకారు లొనర్చినట్టి ప్రా**
**వేశిక మంగళధ్రువలు వీనుల కింపుగఁ బాడి రంగనల్**

**దేశి విధంబు మార్గమున తేటయు నొక్కటసాళగింపగాన్**

కైశికవృత్తి = కైశికఅనెడు పదరచన, ఒప్పన్ = ఒప్పునట్లుగా, క్రథ కైశిక రాజ సుతా = దమయంతియొక్క వివాహ దీక్ష = పెండ్లిదీక్షయనెడు, శుభవస్తు = మంగళ కథతో, సంయుతముగాన్ = కూడునట్లుగా, బయకారులు = సంగీతోపాధ్యాయులు, ఒనర్చినట్టి = చేసినట్టి, ప్రావేశిక = గృహప్రవేశకాలమందలి, మంగళధ్రువలు = కల్యాణ గీతములు, దేశి విధంబు = దేశి రచనను, మార్గమున = మార్గ విశేషరీతిలో, తేటయున్ = స్వచ్ఛత, ఒక్కటన్ = ఒక్కచోట, సాళగింపగాన్ = కలియుచుండగా, వీనులకు ఇంపుగన్ = చెవుల కానందము కలుగునట్లుగా, అంగనల్ = స్త్రీలు, పాడిరి.

తా. కైశికయనెడు పద రచన ఒప్పునట్లుగా దమయంతియొక్క వివాహదీక్షయనెడు మంగళ కథతో కూడునట్లుగా సంగీతోపాధ్యాయులు కూర్చినట్టి గృహప్రవేశకాలమందలి కల్యాణ గీతముల దేశి రచనను, మార్గ విశేష రీతిలో, స్వచ్ఛతయు ఒక్కచోట కలియునట్లుగా చెవుల కానందము కలిగించుచు అంగనలు పాడిరి.

**146 వ. అనంతరంబ వధూవరులు లౌకిక వైదికాచార పారంగతులగు పెద్దల పనుపున గృహప్రవేశ సమయోచితంబులగు మంగళాచారంబులు ప్రవర్తించుచుండిరి. అప్పుడు వివిధ శిల్పకల్పనా నిపుణులగు శిల్పిజనులు సుపర్వ పర్వత శిఖరోత్సేధంబగు విహారసౌధం బలంకరించి రందు –**

తా. తరువాత వధూవరులు లౌకికమైన, వైదికమైన ఆచారములను తెలిసినవారైన పెద్దల అనుమతితో గృహ ప్రవేశ కాలమునకు తగిన మంగళ కృత్యములను ప్రవర్తించుచుండిరి. అప్పుడు పలు శిల్పరచనా నేర్పరులగు శిల్పిజనులు మేరుపర్వత శిఖరమువలె ఉన్నతమైన క్రీడాసౌధమును అలంకరించిరి. అందు = ఆ మేడయందు

**147 క. ఒకచోటఁ బువ్వుఁ బందిరి**
**యొకచోఁ జప్పరము తూఁగుటుయ్యెల యొకచో**
**సకినల గిలిగిలి మంచం**
**బొకచోఁ గప్పురపుఁ బలుఁగు టోవరి యొకచోన్**

ఒకచోటన్ = ఒక ప్రదేశమున, పువ్వు పందిరి, ఒకచోన్ = ఒకచోట, చప్పరము = గుడారము, ఒకచోన్, తూగు ఉయ్యెల, ఒకచోన్, సకినల గిలిగిలి మంచము = చేతపిట్టలయొక్క గిలిగిలి ధ్వనిచేయు మంచము, ఒకచోన్, కప్పురపు పలుగు ఓవరి = తెల్లని స్ఫటికశిలల చంద్రశాల

తా. ఒకచోట పూలపందిరి, ఒకచోట గుడారము, ఒకచోట తూగుటుయ్యెల, ఒకచోట సకినల ధ్వనికల మంచము, ఒకచోట తెల్లని స్ఫటికశిలల చంద్రశాల

**148 సీ. ఒకచోట సాలభంజిక గీలు వన్నిన**
**మురిపెంపు రవగొండ్లి పరిఢవించుఁ**
**గుడ్య గర్భాగార గూఢయై యొకచోట**
**నలవోక నొక్క పద్మాక్షి పలుకు**
**నొకచోట జలయంత్రయుక్తి నీలపుఱాల**
**మొగులు గూర్చిన చిన్ని ముసురు గురియు**
**నొకచోటఁ బగలు చంద్రికలు గాయుచునుండుఁ**
**జంద్రకాంతోపల స్తంభ వితతి**

**తే. రమణఁ బోషిత రాజకీరముల తోడ**
**నొక్కచోట విటంక నిర్వ్యూహపంక్తి**
**నసమశర శాస్త్ర కారిక లభ్యసించు**
**శారికలు నూత్న కనక పంజరములందు**

ఒకచోటన్, సాలభంజిక = ఒక బొమ్మ, కీలు పన్నినన్ = మఱ అమర్పగా, మురిపెంపు = మనోహరమైన, రవగొండ్లి = చిఱుత నృత్యమును, పరిఢవించున్ = ఆడును. కుడ్య గర్భాగార గూఢయై = గోడలోపల దాగినదై, ఒక్క పద్మాక్షి = ఒక స్త్రీ, అలవోకన్ = హేలగా, పలుకు = పలుకును. ఒకచోట, జలయంత్రయుక్తి = నీటియంత్ర కల్పనచే, నీలపుఱాలన్ = ఇంద్రనీలమణులతో, మొగులు కూర్చిన = మేఘములు కల్పించిన, చిన్ని ముసురు కురియు = చిఱుజల్లు వర్షించును. ఒకచోటన్, చంద్రకాంత ఉపల = చంద్రకాంత శిలలయొక్క, స్తంభ వితతి = స్తంభముల సమూహము, పగలు, చంద్రికలు = వెన్నెలను, కాయుచున్ ఉండు = కాయుచుండును. రమణన్ = సొంపుగా, విటంక నిర్వ్యూహ పంక్తి = పక్షులుండు గూడుల వరుసల సముదాయము, పోషిత = పెంపుడు, రాజకీరములతోడన్ = శ్రేష్ఠమైన చిలుకలనుండి, శారికలు = గోరువంకలు, నూత్న కనక పంజరములందు, అసమశర శాస్త్ర కారికలు = కామశాస్త్రమందలి శ్లోకములను, అభ్యసించు = నేర్చుకొనుచుండును.

తా. ఒకచోట ఒక బొమ్మ మఱ అమర్చుటచేత మురిపెంగా చిఱుత నృత్యమును ఆడుచుండును. ఒకచోట గోడ

లోపల దాగిన ఒక స్త్రీ హేలగా మాటాడును. ఒకచోట నీటియంత్ర కల్పనచే ఇంద్రనీలమణులతో మేఘములు కల్పింపబడిన చిఱుజల్లు వర్షించును. ఒకచోట చంద్రకాంతశిలల స్తంభములు పగలే వెన్నెలను కాయుచుండును. చక్కగా పక్షుల గూడుల వరుసలందున్న పెంపుడు చిలుకలనుండి బంగారు పంజరములందున్న గోరువంకలు కామశాస్త్ర శ్లోకములు నేర్చుకొనుచుండును.

**149 తే. కోరగించిన కడకంటి కొలికిఁ జూచి**
**వాడివాలిక పూఁదూపు వంకదీర్చు**
**చొరగి రతిదేవి పాలిండ్ల నొత్తగిలిన**
**యించు విలుకాని వ్రాసినారిడుపునందు**

కోరకించిన = ముకుళించిన, కడకంటి = కడకన్నుయొక్క, కొలికిన్ = కొలికితో, చూచి, వాడి వాలిక = వాడియైన, నిడుదయైన, పూదూపు = పూలబాణముయొక్క, వంక = వంకరను, తీర్చుచు = పోగొట్టుచు, ఒరగి = ఒకప్రక్కకు వ్రాలి, రతిదేవి పాలిండ్లన్ = రతీదేవియొక్క స్తనములపై, ఒత్తిగిలిన = చేరబడిన, ఇంచువిలుకాని = మన్మథుని, ఇడుపునందు = గోడపై, వ్రాసినారు .

తా. ముకుళించిన కడకన్నుయొక్క కొలికితో చూచి, వాడియైన నిడుదయైన పూలబాణముయొక్క వంకరను పోగొట్టుచు, ఒక ప్రక్కకు వ్రాలి రతిదేవి స్తనములపై చేరబడిన మన్మథుని చిత్రమును గోడపై వ్రాసినారు.

**150 సీ. అమర వల్లభుఁడు గౌతము కూర్మి యిల్లాలి**
**జీఁకటి తప్పు సేసిన విధంబు**
**సితభానుఁ డాచార్యు చిగురాకు బోఁడిపైఁ**
**గన్నువైచిన కన్నె కలుపు మరులు**
**నట్టేట దాశకన్యకకు నువ్విళులూరి**
**జాలిఁబొందిన పరాశరు విరాళి**
**గారాపుఁ గూఁతుపైఁ గాఁగాని పనిఁబూను**
**వనజసంభవుని నెమ్మనము వెలితి**

**తే. దారువనవీథి శీతాంశుధరుని రంతు**
**శౌరి గోపాల కామినీ చౌర్యకేళి**
**కామరసభావములు మించి కానఁబడఁగ**
**దీర్చి యిడుపులయందుఁ జిత్రించినారు**

అమరవల్లభుడు = ఇంద్రుడు, గౌతము కూర్మి యిల్లాలిన్ = అహల్యను, చీకటితప్పు చేసిన విధంబు = సంభోగించిన రీతియు, సితభానుడు = చంద్రుడు, ఆచార్యు చిగురాకుబోడిపై = తారపై, కన్నువైచిన = కన్నేసిన, కన్నెకలుపుమరులు = కూటమికైన మోహమును, నట్టేటన్ = నదిమధ్యను, దాశకన్యకకున్ = సత్యవతికొఱకు, ఉవ్విళులూరి = ఆసక్తిపడి, జాలిపొందిన = మన్మథతాపము పొందిన, పరాశరు విరాళి = పరాశరుని విరహతాపమును, గారాపు కూతుపైన్ = గారాల కూతురుపైన, కాగాని పని = కూడని పని, పూను = పూనినట్టి, వనజసంభవుని = బ్రహ్మయొక్క, నెమ్మనము వెలితి = మనస్సుయొక్క లోపమును, దారువనవీథిన్ = దారుకావనమందు, శీతాంశుధరుని = శివుని, రంతు = క్రీడయును, శౌరి = విష్ణుని, గోపాల కామినీ = గొల్ల కాంతలతో, చౌర్యకేళి = దొంగ రతియు, కామరసభావములు = శృంగార రసభావములు, మించి = అతిశయించి, కానబడగ = కనబడునట్లు, తీర్చి = కూర్చి, ఇడుపులందున్ = క్రీడాగృహ గోడలయందు, చిత్రించినారు.

తా. ఇంద్రుడు గౌతముని యిల్లాలైన అహల్యను సంభోగించిన విధమును, చంద్రుడు గురుపత్ని తారపై కన్నేసిన కూటమికైన మోహమును, నదిమధ్య దాశరాజు కూతురిపై ఆసక్తిపడి మన్మథతాపముచెందిన పరాశరుని విరహతాపమును, గారాల కూతురిపై కూడని పనికి పూనుకొన్న బ్రహ్మదేవుని మనస్సుయొక్క లోపమును, దారుకావన మధ్యమున చంద్రధరుని శివుని క్రీడయును, కృష్ణుని గొల్లకాంతలతో రహస్య రతిని శృంగార రసభావములు అతిశయించి కనబడునట్లు కూర్చి క్రీడాగృహ గోడలయందు చిత్రించిరి.

**151 చ. భవజలరాశి దాఁటునెడ భావజవాయువు వీచినం దపః**
**ప్రవహణముల్ సమున్నత సుపర్వ వధూకుచ పర్వతాహతిం**
**బవిలిన దీనతా వికల భావమునొందిన మౌనినావిక**
**ప్రవరుల భావచిత్రములు వ్రాసినవారు కపోతపాలికన్**

భవజలరాశి = సంసారసముద్రమును, దాటునెడ = దాటునపుడు, భావజవాయువు = కామమనెడిగాలి, వీచినన్ = వీచగా, తపః ప్రవహణముల్ = తపస్సనెడి ఓడలు, సమున్నత = మిక్కిలి ఉన్నతములైన, సుపర్వ వధూకుచ = దేవకాంతల స్తనములనెడి, పర్వతాహతిన్ = పర్వతములయొక్క తాకిడిచే, పవిలినన్ = బ్రద్దలుకాగా, దీనతా = దైన్యముచే, వికలభావమును = తొట్రుపాటును, ఒందిన = పొందినట్టి, మౌనినావిక ప్రవరుల = మునీశ్వరులనెడి నావికులయొక్క, భావచిత్రములు = అవస్థల చిత్రములు,

కపోతపాళికన్ = పావురముల మూకుడుపై, వ్రాసినవారు = చిత్రించినారు. తా. సంసారసముద్రమును దాటునపుడు కామమనెడి గాలి వీచగా తపస్సనెడి ఓడలు మిక్కిలి ఉన్నతములైన దేవకాంతల స్తనములనెడి పర్వతములయొక్క తాకిడిచే బ్రద్దలుకాగా దైన్యముచే తొట్రుపాటును పొందినట్టి మునీశ్వరు లనెడి నావికులయొక్క అవస్థల చిత్రములను పావురముల మూకుడుపై చిత్రించిరి.

**152 శా. చూడా హేమ విటంక కోణముల యంచుల్మెట్టి యవ్వారికిం**
**జూడం గాళ్ళు వడంకు నన్నెలవునం జోద్యంబు వేద్యంబుగా**
**బాడుం గోమల బంచమస్వరములం బంచేషు శౌర్యాంకముల్**
**గ్రీడా కిన్నర యుగ్మముల్ నఖరపాళిం గిన్నెరల్ మీటుచున్**

చూడా హేమవిటంక = ముంజూరు లందలి బంగారు గువ్వ గూండ్లయొక్క, కోణములయంచుల్ = కొట్టకొనలందు, మెట్టి = నిలువబడి, చూడన్ = చూచినచో, ఎవ్వారికిన్ = ఎట్టివారికైనను, కాళ్ళు వడంకు = కాళ్ళు వణకునట్టి, అన్నెలవునన్ = ఆ స్థలమునందు, చోద్యంబు = వింత, వేద్యంబుగాన్ = తెలియబడునట్లుగా, నఖరపాళిన్ = గోళ్ళతో, కిన్నెరల్ = కిన్నెరయను వాద్యవిశేషమును, మీటుచున్, క్రీడా కిన్నర యుగ్మముల్ = విలాసార్థమైన కిన్నర దంపతుల చిత్రములు, పంచేషు శౌర్యాంకముల్ = మన్మథుని పరాక్రమ గాథలను, కోమల = మృదువైన, పంచమస్వరములన్, పాడున్

తా. ముంజూరలందలి బంగారు గువ్వగూండ్లయొక్క కొట్టకొనలందు నిలవబడి, చూచినవారికి ఎట్టివారికైనను కాళ్ళువణకునట్టి ఆ స్థలమునందు వింత తెలియబడునట్లుగా గోళ్ళతో కిన్నెరలు మీటుచు విలాసార్థమైన కిన్నెర దంపతుల బొమ్మలు మన్మథుని పరాక్రమ గాథలను మృదువైన పంచమస్వరముతో పాడును.

**153 తే. వలచుఁ గస్తూరి నిగరాల తలుపు దెఱవ**
**గాజుటోవరిలో దీపగంధ లహరి**
**హటదురుస్ఫూర్తి నాసికాపుటకుటీర**
**కోటరాంతః కుటుంబితా పాటవమున**

కస్తూరి నిగరాల తలుపు = మేలైన కస్తూరితోచేసిన తలుపు, తెఱవన్ = తీయగా, గాజుటోవరిలోన్ = గాజుతో చేయబడిన గదిలో, దీపగంధ లహరి = ధూపపరిమళ ప్రవాహము, హటత్ = ఒప్పుచున్న, ఉరు = గొప్పదైన, స్ఫూర్తి = స్ఫురణముచేత, నాసికాపుట = నాసికా రంధ్రములనెడి, కుటీర = గుడిసెలయొక్క, కోటర = వివరముయొక్క, అంత: = మధ్యమునందు, కుటుంబితా = కాపురముయొక్క, పాటవమున = సామర్థ్యముచే, వలచున్ = పరిమళించుచున్నది.

తా. మేలైన కస్తూరితో చేసిన తలుపు తెఱవగానే గాజుతో చేయబడిన ఆ గదిలోని ధూప పరిమళ ప్రవాహము ఒప్పుచున్న గొప్పదైన స్ఫురణముచేత నాసికారంధ్రములనెడి గుడిసెలయొక్క వివరమధ్యమునందు కాపుర సామర్థ్యముచే పరిమళించును.

**154 క. అచ్చట నచ్చట నిడుపుగ**
**విచ్చినఁ గుసుమాస్త్ర శాస్త్రవేదుల మనముల్**
**మెచ్చించుఁ దెరల మంజిడి**
**పచ్చడములు చతురశీతి బంధంబులతోన్**

అచ్చటన్ అచ్చట = ఆ కేళీగృహమున అక్కడక్కడ, తెరల మంజిడి పచ్చడములు = విచిత్ర వర్ణములుకల తెరచీరలు, నిడుపుగ = పొడవుగా, విచ్చిన = విప్పినచో, చతురశీతి బంధంబులతోన్ = ఎనుబదినాలుగు బంధములతోను, కుసుమాస్త్ర శాస్త్రవేదుల మనముల్ = కామశాస్త్ర పండితులైనవారి మనసులను, మెచ్చించున్ = మెప్పించును.

తా. ఆ కేళీగృహమున అక్కడక్కడ విచిత్రవర్ణముల తెరవస్త్రములు పొడవుగా విప్పినచో ఎనుబదినాలుగు బంధములతోను కామశాస్త్రపండితులైనవారి మనసులను మెప్పించును.

**155 క. కలకంఠులకును సురతపుఁ**
**గులుకు టెలుఁగు లలవరించు గురువులపోలెన్**
**వలభులఁ గలకలరవములఁ**
**గలకలయని పలుకుఁ గలికి కలవింకంబుల్**

కలికి = మనోహరమైన, కలవింకంబుల్ = ఊరపిచ్చుకలు, కలకంఠులకును = స్త్రీలకు, సురతపున్ = సంభోగ సమయమందలి, కులుకు ఎలుగులు = శృంగార ధ్వనులు (మణితములు), అలవరించు = నేర్పు, గురువులపోలెన్ = ఉపాధ్యాయులవలె, వలభులన్ = ముంజూరులందు, కలకలరవములన్ = కలకలధ్వనులతో, కలకల అని, పలుకున్.

తా. మనోహరమైన ఊరపిచ్చుకలు స్త్రీలకు సంభోగసమయమందలి మణితములను నేర్పు గురువులవలె ముంజూరులందు కలకలధ్వనులతో కలకలమని పలుకుచుండును.

**156 ఉ. టంక ముఖంబుల న్మణి విటంకముల న్లిఖియించియున్న మీ**

**నాంక రస ప్రసంగమధురాదిమ గాథలు పారదారికా**
**హంకరణ క్రియా సమభి హార మహా పరిహాస సంకథా**
**సంకలితంబు లొప్పిదపు శైలిఁ బఠింతురు ప్రౌఢభామినుల్**

ప్రౌఢ భామినుల్ = ప్రగల్భురాండ్రైన స్త్రీలు, మణి విటంకములన్ = రత్నమయములైన గువ్వగూడులందు, టంక ముఖంబులన్ = ఉలులు మొనలచేత, లిఖియించియున్న = చెక్కియున్న, పారదారికా = పరస్త్రీలతో సంగమించు, అహంకరణ క్రియా = అహంకార చేష్టలయొక్క, సమభిహార = మరల మరల చేయుటయొక్క, మహాపరిహాస = గొప్ప పరిహాసము కలిగించునట్టి, సంకథా = చరిత్రములతో, సంకలితంబులు = కూడియున్నవగు, మీనాంకరస = శృంగార రసముయొక్క, ప్రసంగ = ప్రసక్తిచేత, మధుర = శ్రావ్యములైన, ఆదిమ గాథలు = పురాతన కథలు, ఒప్పిదపు శైలిన్ = సొగసైన రీతిలో, పఠింతురు = పాడుదురు.

తా. పరిణతులైన స్త్రీలు రత్నమయములైన గువ్వగూడులందు ఉలులతో చెక్కబడియున్న పరస్త్రీలతో సంగమించు అహంకారచేష్టలను మరలమరలచేయు గొప్ప పరిహాసము కలిగించు చరిత్రములతో కూడిన శృంగారరస ప్రసక్తికల శ్రావ్యములైన పురాతన కథలను సొగసైన రీతిలో పాడుదురు.

**157 వ. ఇట్టి కేళీసౌధంబున నిషధరాజు వధూసహాయుండై రతి సహాయుండైన మన్మథుండునుంబోలె నభీష్ట విషయోపభోగంబులం దృతీయ పురుషార్థంబు చరితార్థంబుగాఁ జేయువాఁడై**

తా. ఇటువంటి క్రీడాగృహమున నలమహారాజు దమయంతితో కూడి రతిదేవితోకూడిన మన్మథునివలె కోరిన విషయ భోగములను కామ ప్రయోజనార్థముగ చేయువాడయి

**158 తే. కామశర వృత్త వర్తికా గంధతైల**
**దీపితానేక దీపికా దీప్తిజాల**
**వర్థితాటోప కామదేవ ప్రతాప**
**మయిన యా హర్మ్య మెక్కె నింతియును దాను**

ఇంతియును తాను = దమయంతియును తానును, కామశర = కర్పూరమువలన, వృత్త = సృజింపబడిన, వర్తికా = వత్తులచేతను, గంధ తైల = సుగంధ తైలముచేతను, దీపిత = వెలిగింపబడిన, అనేక దీపికా = అనేక దీపములయొక్క, దీప్తిజాల = కాంతి సమూహముచే, వర్థిత = వృద్ధిపొందింపబడిన, ఆటోప = అతిశయముగల, కామదేవప్రతాపమయిన = మన్మథుని ప్రభావముకలదైన, ఆ హర్మ్యము = ఆ సౌధమును, ఎక్కెను.

తా. నలుడు తన భార్యతో కర్పూరమువలన సృజింపబడిన వత్తులచేతను, పరిమళ తైలముచేతను వెలిగింపబడిన అనేక దీపములయొక్క కాంతిసముదాయముచే వృద్ధిపొందింపబడి అతిశయముగల మన్మథ ప్రభావముకలదైన సౌధమును ఎక్కెను.

**159 సీ. ప్రథమానురాగంబు రాజహంసముచేతఁ**
**దెలిపి యంపినయట్టి దిట్టతనము**
**పేరోలగంబునఁ బెద్దగద్దియనుండి**
**దృష్టించి డిగ్గని ధీరతయును**
**నుత్తర ప్రత్యుత్తరోక్తి నైపుణ శక్తి**
**గర్వంబుసూపిన కలికితనము**
**వరణావసరమున వాసవాదుల మాయ**
**మాయింప నేర్చిన మతిబలంబు**
**తే. నాత్మ దివ్యావతారతా వ్యంజకంపుఁ**
**బ్రౌఢిఁ బచరింప వ్రీడాభరంబు కలిమి**
**వైశికంబయి యుండు నెవ్వరికిఁ జూడ**
**గాన లజ్జింప లజ్జించెఁ గమలవదన**

రాజహంసముచేతన్ = నలుడు పట్టుకొన్న హంసచేత, ప్రథమానురాగంబు = తొలిప్రేమ, తెలిపి అంపినయట్టి దిట్టతనము = తెలిపి పంపిన ధైర్యము, పేరోలగంబున = సభలో, పెద్ద గద్దియను ఉండి, దృష్టించి = చూచియును, డిగ్గని = తగ్గని, ధీరతమును = ధైర్యమును, ఉత్తర ప్రత్యుత్తరోక్తి = నలుని ప్రశ్నలకు తానిచ్చిన జవాబులందలి, నైపుణ శక్తి = నేరుపు శక్తిచే, గర్వంబుచూపిన = అతిశయమును చూపెట్టిన, కలికితనము = సొంపు, వరణ అవసరమున = స్వయంవరమున, వాసవాదుల మాయ = ఇంద్రాదులయొక్క మాయను, మాయింప నేర్చిన = పోగొట్టుటకు నేర్చినట్టి, మతి బలంబు = బుద్ధిబలమును, ఆత్మ = తనయొక్క, దివ్య అవతారతా = దివ్య అవతారత్వమునకు వ్యంజకమైన, ప్రౌఢి = గొప్పతనము, పచరింప = తెలియునట్లుగా,

వ్రీడాభరంబు కలిమి = సిగ్గును కలిగియుండుటను, చూడన్ = పరిశీలింపగా, ఎవ్వరికిన్ = ఎట్టివారికిని, వైశికంబయి = వంచనకలదయి, ఉండున్, కాన, కమలవదన = దమయంతి, లజ్జింపన్ = సిగ్గుపడుటకు, లజ్జించెన్ = సిగ్గుపడెను.

తా. నలుడు పట్టుకొన్న హంసచేత తొలిప్రేమను తెలిపి పంపినప్పటి ధైర్యము, సభలో గద్దియపైనుండగా చూచినను తగ్గని ధైర్యము, నలుని ప్రశ్నలకు బదులు చెప్పుటలో చూపెట్టిన ధైర్యము, స్వయంవర మంటపమున ఇంద్రాదుల మాయను పోగొట్టుటకు నేర్చిన ధైర్యము, తన దివ్యమైన అవతారపు గొప్పతనము తెలియునట్లుగా సిగ్గును కలిగియుండుటను పరిశీలింపగా ఎంతటివారికైనను అతి వంచనగానే కనబడును. కావున దమయంతి సిగ్గుపడుటకు సిగ్గుపడెను.

**160 తే. స్వప్న సంభోగ శతసహస్రములు వోయె**
**భ్రమ సమీక్షా వినోదార్బుదములు సనియె**
**మనములోన నిండియున్నది ననుపుఁ గూర్మి**
**యింక లజ్జా భయంబుల కెడము గలదె**

స్వప్న = కలలయందు, సంభోగ శతసహస్రములు = కలియు లక్షలు, పోయె = పోయినవి. భ్రమ = భ్రాంతిచేత, సమీక్షా = చూచుటయనెడి, వినోదార్బుదములు = కోటిదశకములు, చనియె = పోయెను. మనములోన, ననుపు కూర్మి = కామముతో కూడిన ప్రేమ, నిండియున్నది. ఇంకన్ = ఇకమీద, లజ్జా భయంబులకు, ఎడము కలదె = చోటు కలదా?

తా. కలలయందు కలిసిన లక్షలు పోయివి. భ్రాంతిచేత చూచిన కోటిదశకములును పోయినవి. మనసులో కామముతో కూడిన ప్రేమ నిండియున్నది. కావున ఇకమీద సిగ్గునకు, భయమునకు చోటేలేదు.

**161 తే. ఉపలములకంటెఁ గఠినంబు లొక్కవేళఁ**
**గుసుమములకంటె నొకవేళఁ గోమలములు**
**గాన లజ్జా భయంబులు గలవొ లేవొ**
**పువ్వుఁబోఁడుల హృదయంబు లెవ్వఁ డెఱుఁగు**

ఒక్కవేళన్ = ఒకానొక సమయమున, పువ్వుబోడుల = స్త్రీల, హృదయంబులు = మనసులు, ఉపలములకంటె = రాళ్ళకంటె, కఠినంబులు, ఒకవేళ, కుసుమములకంటె = పూలకంటెను, కోమలములు, కాన = కావున, లజ్జా భయంబులు, కలవొ లేవొ, ఎవ్వడు ఎఱుగు?

తా. స్త్రీల మనసులు ఒక సమయమున రాళ్ళకంటె కఠినములు, ఒక సమయమున పూలకంటె మెత్తనివి. కావున స్త్రీలయొక్క సిగ్గు, భయము వీటిగురించి తెలియగలవాడు ఎవడు? (లేడు)

**162 వ. కళావతీ ప్రముఖ సఖీ ప్రయత్నంబున నవరత్న శయ్యా సనాథంబును ధవళ దుకూల కీలిత మనోజ్ఞంబును బ్రత్యంత స్థాపిత కనక కలశ భృంగారు తాలవృంత దర్పణ తాంబూల పేటికా ఫల కుసుమ గంధ కస్తూరికాది పరికరోపశోభితంబునునగు కౌతుకాగారంబు ప్రవేశించి**

తా. కళావతి మొదలైన చెలికత్తెల ప్రోత్సాహమున నవరత్నముల పానుపుతో కూడిన, తెల్లని వస్త్రము పరువబడి మనోహరమును, చేరువనే యుంచబడిన బంగారు కలశమును, విసనకఱ్ఱయును, అద్దమును, తాంబూల పెట్టెయును, పండ్లు, పూలు, గంధము, కస్తూరి మొదలైన వస్తువులచే శోభించుచున్నట్టిదియునగు క్రీడాగృహమును ప్రవేశించి

**163 క. వ్రీళా సరి న్నిమజ్జన**
**లీలోచిత నమనసల్లలిత ముఖి యగుచున్**
**నేలఁ బదాంగుళి వ్రాయుచు**
**బాలామణి నిల్చెఁ దలిమ పర్యంతమునన్**

బాలామణి = దమయంతి, వ్రీళా = సిగ్గు అనెడు, సరిత్ = నదియందు, నిమజ్జన = మునుగుటయను, లీల = పనికి, ఉచిత = తగినట్టి, నమనసత్ = వంచుటచేత, లలిత = సుందరమైన, ముఖి యగుచున్ = ముఖము కలదగుచు, నేలన్ = నేలను, పద అంగుళి = కాలిబొటనవ్రేలితో, వ్రాయుచు, దలిమ పర్యంతమునన్ = పానుపు చేరువన, నిల్చెన్.

తా. దమయంతి సిగ్గు అనెడు నదియందు మునుగుటయను పనికి తగినరీతిగ సుందరమైన ముఖమును వంచినదగుచు, నేలను కాలిబొటనవ్రేలితో వ్రాయుచు పానుపు చెంతన నిలిచెను.

**164 ఉ. భావము పల్లవింపఁ బువుఁబానుపు మీఁదికి నేర్పున న్వయ**
**స్యావళి దార్పనెంతయును నర్మిలితోఁ గుసుమాస్త్రశాస్త్ర వి**
**ద్యావిదుఁ డొయ్యఁ బైఁదిగిచి యక్కునఁజేర్చె భుజాయుగాంకపా**
**ళీ వలయంబులోనఁ దవిలించి కురంగవిశాబలోచనన్**

వయస్యావళి = చెలికత్తెల సమూహము, భావము పల్లవింపన్ = మనసు చిగురింపగా, కురంగ విశాబ లోచనన్ = లేడిపిల్ల కన్నులవంటి కన్నులుకల దమయంతిని, నేర్పునన్, పువు పానుపు మీదికి = పూలపానుపుమీదికి, తార్పన్ = చేర్చగా,

కుసుమాస్త్ర శాస్త్ర విద్యావిదుడు = కామశాస్త్ర విద్యనెఱిగినవాడైన నలుడు, భుజయుగ అంకపాళీ వలయంబులోనన్ = రెండుభుజములయొక్క కౌగిలిలో, దవిలించి = చిక్కించి, అక్కునన్ = ఱొమ్మున, చేర్చెన్

తా. చెలికత్తెలు ఉత్సాహవంతమైన మనసులతో దమయంతిని నేరుపుతో పూలపానుపుమీదికి చేర్చగా, కామవిద్యా విశారదుడైన నలుడు ఆమెను తన కౌగిలిలో చిక్కించుకొని ఱొమ్మున చేర్చుకొనెను.

**165 క. హారపరీక్షా మిషమున**
**భూరమణుఁడు గమిచె నింతి పొంకపుఁ జన్నుల్**
**కూరిమి మీఱఁగఁ బులకాం**
**కూరంబులు వొడమఁ జిగురు గోరుల కొనలన్**

భూరమణుడు = రాజు, హార = ముత్యాలహారమును, పరీక్షా మిషమున = పరిశీలించు వంకతో, ఇంతి = దమయంతియొక్క, పొంకపు చన్నుల్ = బిగువైన స్తనములను, కూరిమి మీఱగన్ = ప్రేమాతిశయముతో, పులకాంకురంబులు = గగుర్పాటు, పొడమన్ = కలుగుచుండగా, చిగురు గోరుల కొనలన్ = చిగుళ్ళవంటి గోరుల కొనలతో, కమిచెన్ = పట్టెను.

తా. నలుడు ముత్యాలహారమును పరిశీలించు నెపమున దమయంతియొక్క బిగువైన స్తనములను ప్రేమాతిశయముతో గగుర్పాటుకలుగుచుండగా చిగుళ్ళవంటి గోరుల కొనలతో పట్టుకొనెను.

**166 చ. శుచియగు హారదామమున శుక్తిజ రత్న విభావరీక్షణం**
**బుచితపుఁ గైతవంబుగఁ బ్రియుండు ప్రియంబెసలారఁ జాఁచినన్**
**గుచలికుచద్వయం బొరసికొంచుఁ బయిం బులకాంకురంబులన్**
**బ్రచురము సేయుచున్నిగిడెఁ బాణి వధూమణి కంఠసీమకున్**

శుచియైన = శుద్ధమైన, హార దామమున = ముత్యాల సరమున, శుక్తిజ = ముత్యములనెడి, రత్న = రత్నములయొక్క, విభావరీ = కాంతిని, ఈక్షణంబు = పరీక్షించుట, ఉచితపున్ కైతవంబుగన్ = తగినదను వంకతో, ప్రియుండు = నలుడు, ప్రియంబు ఎసలారన్ = ప్రీతి అతిశయించుచుండగా, చాచినన్ = చేతిని చాచగా, కుచలికుచద్వయంబు = గజనిమ్మపండ్లవంటి స్తనములజంట, ఒరసికొంచున్ = రాసికొనుచు, పయిన్ = పైకిరాగా, పులకాంకురంబులన్ = గగుర్పాటును, ప్రచురము చేయుచున్ = అధికము చేయుచు, పాణి = ఆ చేయి, వధూమణి = దమయంతియొక్క, కంఠసీమకున్ = మెడదగ్గరకు, నిగిడెన్ = వ్యాపించెను.

తా. ముత్యాలహారములోని రత్నములను పరీక్షించు నెపముతో నలుడు ప్రేమగా చేతిని చాచగా గజనిమ్మ పండ్లవంటి స్తనద్వయము రాసికొనుచు పైకిరాగా గగుర్పాటును అధికముచేయుచు ఆ చేయి దమయంతియొక్క మెడదగ్గరకు వ్యాపించెను.

**167 తే. నవసమాగమవేళ నయ్యవసరమున**
**నువిద లజ్జాభరంబున కోహటించి**
**యైదు పది సేసె వలరాజునంతవాఁడు**
**నరయ నెవ్వాని సొమ్ము జయాపజయము**

వలరాజునంతవాడు = మన్మథునంతవాడగు నలుడు, నవసమాగమవేళన్ = క్రొత్తగా కలియు సమయమున, ఆ అవసరమున = ఆ సందర్భమున, ఉవిద = దమయంతియొక్క, లజ్జాభరంబునకు = సిగ్గు పెంపునకు, ఓహటించి = వెనుదీసి, ఐదు పది చేసె = ముందుంచిన కాలును వెనుకకు తీసెను (ముందుంచిన కాలుకు 5 వ్రేళ్ళు, వెనుకకు తీయగానే వెనుక కాలుతో కలిసి 10 వ్రేళ్ళు.), అరయన్ = చూడగా, జయ అపజయము, ఎవ్వాని సొమ్ము = ఎవరి సొంతము?

తా. మన్మథునివంటి నలమహారాజు క్రొత్తగా దమయంతిని కలియు సందర్భమున ఆమె అధికమైన సిగ్గునకు వెనుకంజవేసి ఐదు పది చేసినాడనగా జయాపజయములు ఎవరి సొంతము?

**168 సీ. ఒకదీప మార్చిన నున్న దీపంబులు**
**నప్పుడ తమకు దా మాఱుటయును**
**దాలవృంతానిల చేలాంచలాదిక**
**వ్యాపారముల దీప మాఱమియును**
**నాఱిన దీపంబు లప్రయత్నంబున**
**మఱిచూడఁ జూడగ మండుటయును**
**మండి యాఱియు నాఱి మండిన దీపంబు**
**వెలుఁగుఁ జీఁకటియుఁ గావించుటయును**

**తే. గలుగునట్లుగ వరశక్తివలన రాజు**
**శిల్పముల నవ్వుటాలకుఁ జేయుచుండఁ**
**దరుణి కుతుక త్రపాద్భుతాతంక భార**

**సంకటస్థాయి వైసారిణాంక యయ్యె**

ఒక దీపము, ఆర్చినన్ = ఆర్పివేయగా, ఉన్న దీపంబులున్, అప్పుడ = వెంటనే, తమకు తాము, ఆఱుటయును, తాలవృంత = విసనకఱ్ఱలయొక్క, అనిల = గాలి, చేలాంచల ఆదిక = వస్త్రపు చెఱగు లోనగువాని, వ్యాపారములన్ = విసరుటచేత, ఆఱమియును = ఆరకుండుటయును, ఆఱిన దీపంబులు, అప్రయత్నమున = తమకు తామే, మఱి = మళ్ళీ, చూడన్ చూడగ = చూచుచుండగనే, మండుటయు = వెలుగుటయును, మండి = వెలిగి, ఆఱుటయును, ఆఱి, మండిన = వెలిగిన, దీపంబు, వెలుగున్, చీకటియున్, కావించుటయును, కలుగునట్లుగ, వరశక్తివలన, రాజు = నలుదు, శిల్పములన్, నవ్వుటాలకున్ = నవ్వులాటకు, చేయుచుండన్, తరుణి = దమయంతి, కుతుక = ఉత్సాహముతో, త్రప = సిగ్గుతో, ఆతంక = శంకతో, భార = అతిశయముయొక్క, సంకటస్థాయి = సందేహమున నిలిచియున్నట్టి, వైసారిణ అంక = మీనకేతనుడు (కామము) కలది, అయ్యెన్.

తా. ఒక దీపము ఆర్పివేయగా ఉన్న దీపములన్నియును వెంటనే తమకు తామే ఆఱిపోవుటయును, విసనకఱ్ఱలయొక్క గాలి, చీర కొంగు మున్నగువాని విసరుటచే ఆఱిపోకుండుటయును, ఆఱిపోయిన దీపములు తమకు తామే చూచుచుండగనే వెలుగుటయును, వెలిగి అఱిపోవుటయును, ఆఱిపోయి వెలిగిన దీపములు వెలుగును, చీకటిని కావించుటయును కలుగు నట్లుగా వరశక్తివలన నలుడు శిల్పములను నవ్వులాటకు చేయుచుండగా దమయంతి ఉత్సాహముతో, సిగ్గుతో, శంకతో వీటి ఆధిక్యమువలన సందేహమున నిలిచిపోయిన కామముకలది యయ్యెను.

169 తే. **తరుణి లజ్జా భరంబుచేఁ దన్ను వడియుఁ**
**దోయజానన వెఱపుచేఁ ద్రోపువడియు**
**నుల్లమున ఖేదమొందక యుందునట్టె**
**బాలుఁడా యేమి తలపోయఁ బంచశరుఁడు**

తరుణి = దమయంతి, లజ్జాభరంబుచేన్ = సిగ్గుయొక్క అతిశయముచే, తన్ను వడియున్ = తాను ఓడియును, తోయజానన = పద్మముఖి, వెఱపుచేన్ = భయముచే, త్రోపువడియున్ = త్రోయబడియును, ఉల్లమున = మనసున, ఖేదము ఒందక = దు:ఖపడక, ఉందును అట్టె = ఉండుట ఆశ్చర్యమేకదా! తలపోయ = ఆలోచింపగా, పంచశరుడు = మన్మథుడు, బాలుడా ఏమి = తెలియినివాడా ఏమిటి? (సిగ్గు, భయమ ఇత్యాదులు కామమును అతిక్రమింప లేకపోయెనని అర్థము)

తా. దమయంతి సిగ్గుయొక్క అతిశయముచే తాను ఓడియును, భయముచే త్రోయబడియును, మనసున ఖేదమును పొందలేదు. ఇది ఆశ్చర్యమేకదా! ఆలోచింపగా కామము సిగ్గు, భయములను జయించినది.

170 ఉ. **ఇంచుక యుల్లసించినను నేమని చెప్పఁగ లజ్జ వచ్చి త**
**ర్జించును సాధ్వసంబదరి శిక్ష యొనర్చును మౌగ్ధ్యమేచి వా**
**రించుఁ బ్రగల్భభావము ధరించియటేని వధూమనోగతిం**
**బంచశిలీముఖుండు పసిపాపఁడువో నవసంగమంబునన్**

పంచశిలీముఖుండు = మన్మథుడు (కామము), ఇంచుక ఉల్లసించినను = కొంచెము తల ఎత్తినను, ఏమని చెప్పగన్ = చెప్పడానికి ఏముంది? లజ్జ వచ్చి = సిగ్గు వెంటనే వచ్చి, తర్జించును = బెదరించును. సాధ్వసంబు అదరి = భయమును కలిగించి, శిక్ష ఒనర్చును = దండించును. ప్రగల్భభావము ధరించి = పెద్దతనము పాటించి, మౌగ్ధ్యము = బేలతనము, ఏచి = పెంచి, వారించున్, అటేని = అట్లయిన, నవ సంగమంబునన్ = తొలి కలయికయందు, పంచశిలీముఖుండు = మన్మథుడు, వధూ = పెండ్లికూతురైన దమయంతి, మనోగతిన్ = మనో వీథియందు, పసిపాపడువో = పసిబాలుడేసుమా! (లజ్జ, భయము, మౌగ్ధ్యము కామమును అణగ త్రొక్కుచుండెనని అర్థము)

తా. కామము కొంచెము తల ఎత్తగానే సిగ్గు వెంటనే వచ్చి బెదరించును. భయమును కలిగించి దండించును. పెద్దతనము పాటించి బేలతనమును పెంచి వారించును. అట్లయిన తొలి కలయికయందు కామము దమయంతి మనోవీథియందు పసిపాపేసుమా!

171 సీ. **చూర్ణాలకంబుల స్రుక్కుఁ జక్కఁగఁ దీర్చి**
**నలువు నెమ్మనములో మొలవఁబెట్టుఁ**
**గర్పూర హారంబు గదియించు నెపమునఁ**
**గుచ కోరకంబుల గోళ్ళఁ గముచుఁ**
**దల్ప యంత్రణ నిరోధంబు నంకిలి కోర్చి**
**యర్ధాంక పాళిక నాదరించు**
**నిబిడ నీవీ బంధ నిర్మోక్షణమునకుఁ**
**బనిపూని భీతిఁ గంపంబు నొందు**

తే. **నూరు సంవాహనమునకు నుత్సహించు**
**ఘన నితంబంబు పైనుండ మనసువెట్టు**
**నిమ్న నాభికి డిగ్గంగ నెమ్మి సేయుఁ**
**బద్మలోచన మరిగి భూపాలుకరము**

భూపాలు కరము = నలుని చేయి, పద్మలోచనన్ = దమయంతిని, మరిగి = ఆశించి, చూర్ణ అలకంబుల = ముంగురులయొక్క, స్రుక్కు = చిక్కును, చక్కగన్ తీర్చి = సరిచేసి, నెమ్మనములోన్ = దమయంతి మనసులో, నలువున్ = మచ్చికను, మొలవ పెట్టు = నాటును. కర్పూర హారంబున్ = ముత్యాల హారమును, కదియించు నెపమున = సరిచేయు వంకతో, కుచ కోరకంబులన్ = చను మొగ్గలను, గోళ్ళన్ కముచున్ = గోళ్ళతో పట్టుకొనును. తల్ప యంత్రణ = దేహముతో శయ్యను ఒత్తుటచేతనైన, నిరోధంబు = అడ్డగింత (చేయి కిందకు పోవుటకు వీలులేకపోవుట), అంకిలికిన్ = విలంబమునకు, ఓర్చి = సహించి, అర్ధాంకపాళికన్ = సగము కౌగిలినే (ఒక చేతితోనే), ఆదరించున్ = అంగీకరించును. నిబిడ = గట్టిగా, నీవీ బంధ = పోకముడిని, నిర్మోక్షణమునకు = విప్పుటకు, పని పూని = ప్రయత్నించి, భీతిన్ = భయముతో (ఏమనుకొనునోయని), కంపంబును = వణుకును, ఒందున్ = పొందును. ఊరు సంవాహనమునకున్ = తొడలను ఒత్తుటకు, ఉత్సహించు = కోరును, ఘన నితంబంబుపైన్ = పెద్దవైన పిఱుదులమీద, ఉండన్ = ఉండుటకు, మనసు పెట్టు = అభిలషించును, నిమ్న నాభికి = బొడ్డు క్రిందకు, డిగ్గంగ = దిగుటకు, నెమ్మి చేయున్ = మనసు పడును,

తా. నలుని చేయి దమయంతిని కోరి ముంగురుల చిక్కుతీయు నెపముతో ఆమెను మచ్చికచేసుకొనసాగెను. ముత్యాల హారమును సరిచేయు వంకతో చను మొగ్గలను గోళ్ళతో పట్టుకొనును. శరీరమును పక్కపై గట్టిగా ఒత్తుటచే చేయి క్రిందకు చాచలేక ఒంటిచేతితోనే కౌగలించుకొనెను. గట్టిగా పోకముడిని విప్పదలచినను ఆమె ఏమనుకొనునోయని భయపడి చేయి వణకును. తొడలను ఒత్తుటకు కోరును. పిఱుదులపై నుండాలని అభిలషించును. బొడ్డు క్రిందకు దిగుటకు మనసుపడును.

**172** తే. **విభుఁడు పరిహాసమాడి నవ్వించుఁగాని**
**పడయలేఁడయ్యె నెన్ని యుపాయములను**
**రాజబింబాస్య తాంబూల రాగసుభగ**
**దంత కురువింద మాలికా దర్శనంబు**

రాజబింబాస్య = చంద్రముఖి, తాంబూల, రాగ = ఎఱుపుచేత, సుభగ = సొగసయిన, దంత కురువింద మాలికా = కెంపులవంటి దంతముల వరుసను, దర్శనంబు = చూచుటను, విభుడు = నలుడు, పరిహాసమాడి, నవ్వించు కాని, ఎన్ని ఉపాయములను, పడయలేడు ఆయ్యెన్ = పొందలేకపోయెను.

తా. చంద్రముఖియైన దమయంతియొక్క తాంబూలముచే ఎఱుపైన సొగసయిన కెంపులవంటి దంతములను చూడాలనే కోరిక పరిహాసమాడి నవ్వించ ప్రయత్నించు కాని, ఎన్ని యుపాయములను నలుడు పొందలేకపోయెను.

**173** మ. **మనుజాధీశుఁడు మగ్నహారలతికా మాణిక్య ముద్రాంకిత**
**స్తనభారంబుగ గాఢ నిర్దయ పరిష్వంగంబు పూఁబోఁడికిన్**
**ననుపుం గూరిమి మైవడిన్ మరపెఁ దన్మందాక్షభారంబునుం**
**దన పూవిల్లును నొక్క చందమునఁ గందర్పుం డొగిన్వంపఁగాన్**

మనుజాధీశుడు = నలుడు, మగ్న = తగులుకొనిన, హార లతికా = ముత్యాలపేరులోని, మాణిక్య = పద్మరాగముయొక్క, ముద్రా = ఒత్తుడుచేత, అంకిత = గుర్తుగలదైన, స్తన భారంబుగన్ = భారమైన స్తనములుకలదిగా, గాఢ = బిగువైన, నిర్దయ = కనికరములేని, పరిష్వంగంబు = కౌగిలిని, ననుపుం కూరిమి మైవడిన్ = వికాసముగల మక్కువతో, తత్ మందాక్ష భారంబునున్ = ఆ దమయంతియొక్క లజ్జాతిశయమును, కందర్పుడు = మన్మథుడు, తన పూవిల్లును, ఒక్క చందమున = ఒకే రీతిగా, ఒగిన్ = క్రమముగా, వంపగాన్ = వంచునట్లుగా, మరపెన్ = మరగచేసెను.

తా. నలుడు తగులుకొనిన ముత్యాలపేరులోని పద్మరాగముయొక్క ఒత్తుడుచేత గుర్తుగలదైన భారమైన స్తనముల బిగువైన కనికరములేని కౌగిలిని వికాసముగల మక్కువతో ఆ దమయంతియొక్క లజ్జాతిశయమును మన్మథుడు తన పూవింటిని ఒకే రీతిగా క్రమముగా వంచునట్లుగా మరగచేసెను.

**174** తే. **మెలత యప్పుడు మందాక్ష మీలితములు**
**సౌహృద స్మేరములునైన సంగమములు**
**ముకుళితంబులు బుష్పితంబులునునైన**
**భూజములతోడి యుద్యాన భూమిఁ బోలె**

అప్పుడు = అట్లు మన్మథావేశము అతిశయించినప్పుడు, మందాక్ష మీలితములు = సిగ్గుచే ముడువబడినవి, సౌహృద స్మేరములునైన = నెయ్యముచే వికసించినవినైన, సంగమములు = కలయికలు, ముకుళితంబులు = మొగ్గలుకలవి, పుష్పితంబులునునైన =

పుష్పించినవియునైన, భూజములతోడి = వృక్షములతో, ఉద్యానభూమి పోలె = ఉద్యానవనమును, పోలెన్ = అనుకరించెను.

తా. అట్లు మన్మథావేశము అతిశయించునప్పుడు సిగ్గుచే ముదువబడినవి, నెయ్యముచే వికసించినవినైన కలయికలు మొగ్గలుకలవి, పుష్పించినవియునైన వృక్షములతో ఉద్యానవనమును అనుకరించెను.

175 సీ. **అధరంబు చవిఁ జూపుమన్య మేమియు నొల్ల**
**నని చెక్కుఁ జేరి మంతనము వలుకు**
**దైన్యంబుదోఁపఁ బ్రార్థనసేసి తుదిఁబోయి**
**బలిమి సొంపునను జుంబనమొనర్చు**
**వదనారవిందాసవముఁ బ్రసాదము సేసి**
**నను నేలుకొంటిగాయనుచు మెచ్చు**
**ననుఁగు భృత్యునకు నీ పని యర్హమగు నంచు**
**నూరు సంవాహనం బొయ్యఁ జేయు**

తే. **నేల కుసుమాస్త్ర కేళికి నింత వెఱవ**
**వెఱవ కేనేమి నీ సఖీ వితతి యేమి**
**యనుచుఁ దగ బుజ్జగించి హస్తాంబుజమున**
**వలపుఁగీలు దెమల్చు భూవల్లభుండు**

భూవల్లభుండు = రాజు, చెక్కు చేరి = చెంపను చేరి, అన్యము ఏమియును ఒల్లనని = ఇతర మేమియు కోరనని, మంతనము = రహస్యము, పలుకుచు, అధరంబు = క్రిందిపెదవి, చవి చూపు = రుచి చూపును, దైన్యంబు తోప = దీనముగా, ప్రార్థన చేసి = ప్రార్థించి, తుదిన్ పొంచి = చివరకు సమయము వేచి, బలిమి సొంపునన్ = బలాత్కార సౌభాగ్యముచేతనే, చుంబనము = ముద్దు, ఒనర్చు = చేయును. వదనారవింద ఆసవము = ముఖపద్మమనెడి మద్యమును, ప్రసాదము చేసి = అనుగ్రహించి, నను = నన్ను, ఏలుకొంటిగా అనుచు = దాసునిగ చేసుకొన్నావుకదా! అనుచు, మెచ్చున్ = మెచ్చుకొనును. ననుగు భృత్యునకున్ = ప్రియ సేవకునకు నాకు, ఈ పని యర్హమగునంచున్ = ఈ పని తగినదేయనుచు, ఊరుసంవాహనంబు = తొడలను పిసుకుట, ఒయ్యన్ = మెల్లగా, చేయున్, కుసుమాస్త్ర కేళికి = మదన క్రీడకు, ఇంత వెఱవనేల, వెఱవకు = భయపడకు, ఏను ఏమి = నేనైతే ఏమి, నీ సఖీ వితతి ఏమి = నీ చెలికత్తెలైతేనేమి, అనుచు, తగన్ = తగురీతిగా, బుజ్జగించి = లాలన చేసి, హస్త అంబుజమున = పద్మమువంటి చేతితో, వలపు కీలు = పోకముడిని, తెమల్చు = లాగివైచును.

తా. నలుడు దమయంతి చెంపను చేరి ఇతరమేమియు కోరనని రహస్యము పలుకుచు అధరము రుచి చూపును. దీనముగా ప్రార్థించి చివరకు సమయము చూచి బలాత్కారముగా ముద్దు పెట్టును. ముఖపద్మమనెడి మద్యమును అనుగ్రహించి నన్ను దాసుని చేసితివికదా యని మెచ్చుకొనును. ప్రియ సేవకునకు నాకు ఈ పని తగినదేయని తొడలను పిసుకుట మెల్లగా మొదలిడును. మదనక్రీడకు ఇంత భయపడాలా? భయపడకు నేనొకటి, నీ చెలికత్తె లొకటినా?యని తగురీతిగా లాలనచేసి పద్మమువంటి చేతితో పోకముడిని లాగివేసెను.

176 సీ. **పతి పాణిపల్లవ చ్యుత నీవిబంధన**
**వ్యగ్ర బాలాహస్త వనరుహంబు**
**ధవ కృతాధర బింబ దశన క్షత వ్యథా**
**భుగ్న లీలావతీ భ్రూలతంబు**
**ధరణినాయక భుజా పరిరంభ మండలీ**
**గాఢ పీడిత వధూ ఘన కుచంబు**
**వర నఖాంకుర మృదు వ్యాపార పులకిత**
**నీరజాక్షీ నితంబోరు యుగళి**

ఆ. **అస్తి వామ్య భార మస్తి కౌతూహలం**
**బస్తి ఘర్మ సలిల మస్తి కంప**
**మస్తి భీతి యస్తి హర్ష మస్తి వ్యథం**
**బస్తి వాంఛ మయ్యె నపుడు రతము**

అపుడు, రతము, పతిపాణిపల్లవ = చిగురువంటి నలుని చేతిచేత, చ్యుత = వీడిన, నీవిబంధన = పోకముడిని ముదుచుకొనుటయందు, వ్యగ్ర = ఆసక్తమైన, బాలా = దమయంతియొక్క, హస్త వనరుహంబు = పద్మమువంటి చేయికలది, ధవ = భర్తచే, కృత = చేయబడిన, అధరబింబ = దొండపండువంటి క్రింది పెదవిని, దశన క్షత = గాటుల నొప్పికి, వ్యథా = బాధ కలది, భుగ్న = ముడివడిన, లీలావతీ = యా విలాసినియొక్క, భ్రూలతంబు = తీగవంటి కనుబొమలు కలది, ధరణినాయక = నలునియొక్క, భుజా పరిరంభ మండలీ = బాహువుల ఆలింగన వలయమునందు, గాఢ పీడిత = గట్టిగా ఒత్తబడిన, వధూ = దమయంతియొక్క,

ఘన కుచంబు = గొప్ప స్తనములుకలది, వర = శ్రేష్ఠమైన, నఖాంకుర = గోళ్ళచే, మృదు వ్యాపార = గుచ్చుటచే, పులకిత = పులకించిన, నీరజాక్షీ = పద్మనేత్రియైన దమయంతియొక్క, నితంబోరు యుగళి = పిఱుదును, తొడల జంటయు కలది, వామ్యభారము అస్తి = ప్రాతికూల్యాతిశయము కలది, కౌతూహలం అస్తి = వింతపాటు కలది, ఘర్మ సలిలమ్ అస్తి = చెమటనీరు కలది, కంపమ్ అస్తి = వణకుట కలది, భీతి అస్తి = భయము కలది, హర్షమ్ అస్తి = సంతోషము కలది, వ్యథంబు అస్తి = పీడింపబడుట కలది, వాంఛమ్ అస్తి = కోరిక కలది, అయ్యెన్

తా. అపుడు రతము నలుని చేతితో వీడిన పోకముడిని ముడుచుకొనుటయందు ఆసక్తమైన దమయంతియొక్క పద్మమువంటి చేయి కలది, నలునిచే చేయబడిన దొండపండువంటి అధరపు గాటుల నొప్పికి బాధ కలది, ముడివడిన యా లీలావతియొక్క కనుబొమలు కలది, నలుని బాహువుల ఆలింగనమునందు గట్టిగా ఒత్తబడుచున్న స్తనములు కలది, గోళ్ళచే గుచ్చుటచే పులకించిన పిఱుదులు, ఊరువులు కలది, ప్రాతికూల్యాతిశయము కలది, వింతపాటు కలది, చెమటనీరు కలది, వణకుట కలది, భయము కలది, సంతోషము కలది, పీడ కలది, కోరిక కలది అయ్యెను.

**177 చ. కుతుకమునం గురంగమద కుంకుమచర్చ వహించి నీలలో**
**హిత రుచులై స్వయంభులయి యీహిత సౌఖ్య విధాయులైన యా**
**యతివ పయోధరంబులకు నర్థనిశా సమయంబునన్ సమం**
**చిత నఖకింశుకార్చనము సేసె మహీపతి భక్తి యేర్పడన్**

కురంగమద కుంకుమచర్చ = కస్తూరి, కుంకుమలయొక్క పూతను, వహించి = పొంది, నీలలోహిత రుచులై = నల్లని, ఎఱ్ఱని కాంతులుకలవై, స్వయంభులయి = తమకు తామే పుట్టినవయి, ఈహిత = కోరిన, సౌఖ్య విధాయులైన = సుఖమును కలిగించునవైన, ఆ అతివ = ఆ దమయంతియొక్క, పయోధరంబులకు = స్తనములకు, అర్థనిశాసమయంబునన్ = అర్థరాత్రి వేళయందు, సమంచిత = మిక్కిలి ఒప్పుచున్న, నఖ కింశుకార్చనము = గోటినొక్కులపూజను, మహీపతి = నలుడు, భక్తి ఏర్పడన్, చేసెన్.

శివుని పరంగ – కంఠమందు నల్లగాను, కేశములు ఎఱ్ఱగాను కలిగి, తనంతట తానే పుట్టినవాడయి, కోరిన కోర్కెలు తీర్చేవాడయిన శివునివలె నున్నవి కావున స్తనములతో పోలిక రాజు అర్థరాత్రివేళ మోదుగు పువ్వులతో పూజించెను.

తా. కస్తూరి కుంకుమల పూతను పొంది, నల్లని, ఎఱ్ఱని కాంతులు కలవై, తమకు తామే పుట్టినవయి, కోరిన సౌఖ్యములను కలిగించునవైన ఆ దమయంతియొక్క స్తనములకు అర్థరాత్రివేళ నలుడు మిక్కిలి ఒప్పుచున్న గోటి నొక్కులతో పూజను విశ్వాసముతో చేసెను.

**178 తే. లావునను గూడి పాణిపల్లవయుగమున**
**నొత్తిపట్టిన సరకు గా కుల్లసమున**
**హార కాంతి చ్ఛలంబున నల్లనవ్వు**
**తరుణి చన్నులు రాజు చిత్తము హరించె**

లావునను = వలుదలగుటచేతను, కూడి = కలిసియున్నవై, పాణిపల్లవ యుగమున = చిగురువంటి చేతులజంటతో, ఒత్తిపట్టిన = అదిమి పట్టుకొనగా, సరకుగాక = లక్ష్యపెట్టక, ఉల్లసమున = దుడుకుతనముచే, హారకాంతి చ్ఛలంబున = ముత్తెపు హారముల కాంతియనెడు మిషతో, నల్లన్ = మెల్లగా, నవ్వున్ = నవ్వుచున్నవైన, తరుణి చన్నులు = దమయంతియొక్క స్తనములు, రాజు = నలునియొక్క, చిత్తము = మనస్సును, హరించెన్ = దొంగిలించెను. (అలంకారము – అపహ్నుతి)

తా. లావు కలవగుటచేత కలిసియున్నవై, చిగురువంటి చేతులతో అదిమి పట్టుకొనగా లక్ష్యపెట్టక, దుడుకు తనముచే ముత్యాల హారముల కాంతి యనెడు మిషతో మెల్లగా నవ్వుచున్నవైన ఆ దమయంతియొక్క స్తనములు నలుని మనసును హరించెను.

**179 క. తరుణికి ధాత్రీపతికిని**
**బరిచుంబనవేళ దంత పరిపీడన మి**
**క్షురసంబు పానకములో**
**మిరియపుఁ గారంబువోలె మెచ్చొనరించెన్**

తరుణికి = దమయంతికి, ధాత్రీపతికిని = నలునకును, పరిచుంబనవేళ = అధరచుంబన సమయమునందు, దంత పరిపీడనము = పంటి నొక్కు, ఇక్షురసంబు పానకములో = చెఱకురసం పానీయములో, మిరియపు కారంబు పోలెన్ = మిరియాల కారమువలె, మెచ్చు = ఇంపును, ఒనరించెన్ = కలిగించెను.

తా. దమయంతికి, నలునకును అధరచుంబనవేళ పంటినొక్కులు చెఱకురసం పానీయములో మిరియాల కారము వలె ఇంపును కలిగించెను.

**180 తే. చూచియునుఁ జూచుఁ గ్రమ్మఱ సుదతిఁ దివుటఁ**
**గౌఁగిలించియు నప్పుడ కౌఁగిలించుఁ**

**జుంబనము సేసియును రాజసూనుఁ డెలమిఁ**
**జుంబనము సేయుఁ బౌనరుక్త్యంబుగాగ**

రాజసూనుడు = రాజకుమారుడు నలుడు, సుదతిన్ = దమయంతిని, బౌనరుక్త్యంబుగాగన్ = చెప్పినదే చెప్పుటవలె, తివుటన్ = కోరికతో, చూచియును, క్రమ్మఱన్ = తిరిగి, చూచున్, కౌగలించియున్, అప్పుడ = వెంటనే, కౌగలించున్, చుంబనము చేసియును = ముద్దిడియును, ఎలమిన్ = ప్రీతితో, చుంబనము చేయున్.

తా. నలుడు దమయంతిని చెప్పినదే చెప్పుటవలె కోరికతో చూచియును మరల చూచును. కౌగలించియును తిరిగి కౌగలించును. ముద్దిడియును ప్రీతితో ముద్దిడును.

181 తే. **కులుకు టెలుఁగుల నలరారు పులకములను**
**గంపములను సమగ్ర సీత్కారములను**
**జుంబన క్రీడలందు రాసుతుని మోము**
**శీతకరుఁడౌట చెప్పక చెప్పె నహహ !**

కులుకు ఎలుగులన్ = సొగసైన కంఠధ్వనులచేతను,, పులకుములను = గగుర్పాటులచేతను, కంపములను = వడకుట చేతను, సమగ్ర సీత్కారములను = నిండయిన సీత్కృతులచేతను, అలరారు = ఒప్పుచున్న, రాసుతుని మోము = నలుని ముఖము, శీతకరుడు ఔటన్ = చంద్రుడగుటను, అహహ = ఆశ్చర్యము, చెప్పక చెప్పెను.

తా. సొగసైన కంఠధ్వనులచేతను (మణితములు), పులకింతలచేతను, వడకుటచేతను, నిండయిన సీత్కారములచేతను ఒప్పుచున్న నలుని ముఖమును చుంబనము చేయునపుడు చలిచేత కలుగు ధ్వనులన్నియు కలుగుటచే నలుని ముఖము చంద్రుడగుటను చెప్పకనే చెప్పుచున్నది.

182 ఉ. **వంచనలేక యాననము వాంచినయప్పుడు ఫాల మోర గా**
**వించినఁ జెక్కుటద్దములు వ్రీడభరంబున కీలెఱింగి చుం**
**బించి మనంబు తాలిమి గభీరత రిత్తకు రిత్త పూనినన్**
**మించి ముఖాబ్జ చుంబనము మేకొని నవ్వు విభుండు నేర్పునన్**

వ్రీడభరంబున = అధికమైన సిగ్గుచే, ఆననము వాంచిన అప్పుడు = ముఖము వంచుకొనినయప్పుడు, ఫాలము = నుదుటిని, ఓరగావించినన్ = ముఖము ప్రక్కకు త్రిప్పుకొన్న, చెక్కుటద్దములు = చెక్కిళ్ళను, వంచనలేక = మోసగించక, కీలెఱింగి = సమయముచూచి, చుంబించి = ముద్దిడి, మనంబు తాలిమి = మనసునందలి ధైర్యము, గభీరతన్ = సిగ్గు లేమిని, రిత్తకురిత్త = మిక్కిలి వ్యర్థముగా, పూనినన్ = వహింపగా, మిచి = ఒప్పి, ముఖాబ్జ చుంబనము, నేర్పునన్, మేకొని = పొంది, విభుండు = రాజు, నవ్వు

తా. మిక్కిలి సిగ్గుచే ముఖము వంచినప్పుడు నుదుటిని, ముఖము ప్రక్కకు త్రిప్పుకొన్నప్పుడు చెక్కిళ్లను మోసగించక సమయముచూచి ముద్దిడగా, మనసునందలి ధైర్యము, సిగ్గు లేకపోవుటయును వ్యర్థములును కాగా నలుడు దమయంతి ముఖపద్మమును నేర్పుగా ముద్దాడి నవ్వును.

183 తే. **సతత తాంబూల భోగ కషాయితములు**
**నుదయ భాస్కర నవసౌరభోల్బణములు**
**నయిన యధరామృతముల నింతియును బతియుఁ**
**జలిపి రన్యోన్య మధుపాన లలితకేళి.**

సతత = ఎడతెగక, తాంబూల, భోగ = అనుభవించుటచే, కషాయితములు = ఎఱ్ఱనైనవి. ఉదయభాస్కర = ఉదయ భాస్కరమనెడి కర్పూర విశేషముయొక్క, నవ = క్రొత్తదైన, సౌరభ ఉల్బణములును = పరిమళ స్ఫుటములును అయిన, అధరామృతములను, అన్యోన్య = పరస్పరము, మధుపాన = మధువును పానముచేయు, లలిత కేళి = వినోద క్రీడను, ఇంతియును, పతియును, చలిపిరి = చేసిరి.

తా. ఎడతెగని తాంబూల సేవనమున ఎఱ్ఱనైన ఉదయభాస్కర కర్పూర విశేషముయొక్క క్రొత్తదైన పరిమళ స్ఫుటములయిన అధరామృతములను నలుడును దమయంతియును పరస్పరము పానముచేయు వినోద క్రీడను సలిపిరి.

184 చ. **అవహిత భావ భావిత సహస్ర కరామృత భాను మండలుం**
**డవుచు నసమ్మత క్షణ సమభ్యుదితంబగు భావ లాభ లా**
**ఘవము మదిన్ జయించి ప్రియ కాంత రసాంతర సన్నిరుద్ధ మా**
**ర్దనఁ గరగించుచుం గరఁగె రాజు సమంచిత పారవశ్యుఁడై**

అవహిత = ఎచ్చరికగల, భావ = మనస్సుతో, భావిత = భావింపబడిన, సహస్రకరామృత భాను మండలుండు = సూర్య చంద్ర మండలములు కలవాడగుచు, అసమ్మత = ఇష్టపడని, క్షణ = క్షణమందు, సమభ్యుదితంబగు = పుట్టిన, భావ

లాభ లాఘవము = భావప్రాప్తిచేనయిన ఉరవడిని, మదిన్ జయించి = మనసులో గెలిచి, రసాంతర సన్నిరుద్ధ మార్దవన్ = లజ్జాదులచే అడ్డగింపబడిన మెత్తదనము కలది (రతికి సులువుగా నియ్యకొనుట), ప్రియకాంతన్ = భార్యను, కరగించుచున్, సమంచిత = ఒప్పుచున్న, పారవశ్యుడై = పరవశత్వము కలవాడై, రాజు, కరగెన్

తా. ఏకాగ్రమయిన మనస్సుతో భావింపబడిన సూర్య చంద్ర బింబములుకలవాడగుచు తానిచ్చగింపని నిముసమందు పొడమినట్టి భావప్రాప్తిచేనగు త్వరితత్వమును మనసులో గెలిచి లజ్జాదులచే అడ్డగింపబడిన మెత్తదనముకల ప్రియ భార్యను కరగించుచు అధికమైన సుఖపారవశ్యముచే తానును కరగుచుండెను.

**185 తే. భాగ్యవశమున భావలాభంబు లపుడు**
**రెండు సమమైనఁ గుసుమకోదండ నర్మ**
**కర్మకాండ సమాపన శర్మ సార**
**సంవిభాగంబు సమమయ్యె సతికిఁ బతికి**

అపుడు, భాగ్య వశమున, భావ లాభంబులు = = భావప్రాప్తులు, రెండు సమమైనన్ = రెండును ఏకకాలమందే యగుటచే, కుసుమ కోదండ = మన్మథునియొక్క, నర్మ కర్మకాండ = కేళీకృత్యములయొక్క పరంపర, సమాపన = ముగించుటవలన, శర్మసార = సౌఖ్యముయొక్క సారము, సంవిభాగంబు = పంచుకొనుట, సతికిన్ పతికిన్, సమమయ్యెన్

తా. అపుడు భాగ్యవశమున భావప్రాప్తులు రెండును ఏకకాలమందే యగుటచే సంగమ క్రీడల పరంపర ముగించుటవలన సౌఖ్యసారము ఇరువురును పంచుకొనుట సతికిని పతికిని సమానమయ్యెను.

**186 వ. ఇవ్విధంబున నవ్వామ వామపాదతల విలుప్త మన్మథశ్రీ విలాసుండైన యవ్విలాసివలనం బ్రథమ పరిహాసంబునం బతంగపుంగవ గవీహైయంగవీన రసాయనాస్వాద ప్రరూఢంబును, జిరకాలావస్థాన సుస్థిరంబును, వివిధ విఘ్న పరంపరా నిస్తార నిరంకుశ భాగ్యోదయంబును, సౌభాగ్య గర్వ సర్వస్వ సహాయంబునునైన నిజానురాగంబునకుం దగి వ్రీడాజిత మన్మథంబులును, దుల్య లజ్జా స్మరంబులును, గంధర్వ విజిత మందాక్షంబులునునగు కేళీ విశేషంబులఁ గుచకుంకుమ పంకంబులచేతను, ముంగురుల చిన్ని పువ్వులచేతను, నడుగు నెత్తమ్ముల క్రొత్త లత్తుకచేతను, బింబాధరంపుఁ దాంబూల రసరాగంబులచేతనుం బర్యంకభాగంబు దేటపఱుపం, దులాకోటీరటనంబును, గంకణ ఝణత్కారంబును, మేఖలాకలాప కింకిణీ కలకలంబును, గులుకు తెలుంగులం గలసి సకినల కీలుఁ బఱుపుల చప్పుళ్ళు విప్పుసేయం గ్రమంబున విచ్ఛిన్న హారమండలంబగు సురత తాండవంబునకుం గళాసికయగు, పారవశ్యంబునం గుసుమ కార్ముక నర్మ కర్మకాండ కేళీసమాపనా శర్మసారంబు సమవిభాగంబుగాఁ బంచికొని యనుభవించుచు నిశ్వాస ధారాసారంబుల వాసాగారం బధివసించుచు నెడనెడం బ్రియనఖ క్షతార్పణంబులు ఫాణితంబునం దొనర్చిన మరిచావ చూర్ణంబులంబోలు నర్ధనిమీలిత నయనతారకంబును, బ్రస్వేత బిందు కందళిత నాసికా శిఖరంబును, జర్వణాధౌత బింబాధర శయాళు యావకంబును, సామి లుప్త లలాట తిలకంబునునగు వదనకమలంబు హృదయవల్లభు వక్షస్థలైకదేశంబునం జేర్చె నప్పు డమ్మిథునంబు**

తా. ఆ దమయంతి ఎడమపాదముచేత పోగొట్టబడిన మన్మథుని శోభయొక్క విలాసముకలవాడైన (మన్మథుని మించినవాడైన) ఆ విలాసవంతుడైన నలునిచేత తొలి క్రీడయందు పక్షిశ్రేష్ఠమైన హంసయొక్క వాక్కనెడి తాజా అవుపాల నేయియొక్క రసాయనము నాస్వాదించుటచేత మొలచినదియు, చాలకాలమునుండి ఉండినందున గట్టిగా నాటుకొన్నదియు, పలువిధములైన విఘ్నపరంపరలను దాటుటచే అడ్డులేని అదృష్టముయొక్క ప్రాదుర్భావముకలదియు, చక్కదనంబు గర్వముయొక్క సర్వస్వమునకు తోడయినదియునైన తన అనురాగమునకు తగి సిగ్గుచేత జయింపబడిన మన్మథుడుకలవియు, సమానమైన సిగ్గు, కామము కలవియు, మన్మథునిచే జయింపబడిన సిగ్గుకలవియునగు రతి విశేషములను, స్తనములపైనున్న కుంకుమముచేతను, కేశములందలి చిన్న పువ్వులచేతను, పాదములందలి లత్తుకచేతను, దొండపండువంటి అధరపు తాంబూలరస ఎఱుపుదనము చేతను శయ్య వెల్లడిచేయుచుండగ, అందెల చప్పుడు, గాజుల చప్పుడు, మొలనూలి చిఱుగంటల ధ్వనియును, ఆనందపు ధ్వనులను (మణితములు)కలసి సకినల మంచముయొక్క చప్పుళ్లు పెంచగా క్రమముగా తెగిన హారముల సమూహమైన సురత క్రీడకు గండకత్తెరయగును. పరవశంతో సురత క్రీడయొక్క సమాప్తి సౌఖ్యసారమును సమానముగా పంచుకొని అనుభవించుచు నిట్టూర్పుల పరంపరల జడివానచే పడకటింటిని పరిమళింపచేయుచు మధ్య మధ్య ప్రియుడొనర్చిన గోటి గిచ్చులు కండచక్కెరతో చేసిన మిరియపు పొడి చూర్ణమునుపోలును. సగము మూయబడిన కంటి నల్లగ్రుడ్లుకలదియు, చెమట చిఱుబొట్లుకల ముక్కుకొనలుకలదియు, చుంబనముచే కడిగివేయబడిన దొండపండువంటి పెదవియందలి లత్తుకకలదియు, సగము లోపించిన నుదుటి కుంకుమముకలదియునైన ముఖపద్మమును భర్తయొక్క ఱొమ్మునందలి ఒక భాగమునందు చేర్చెను. అప్పుడు ఆ జంట

**187 మహాస్రగ్ధర సరి యాతాయాత రంహశ్చల కలిత రతిశ్రాంతి నిశ్వాసధారా**
**పరిషద్వ్యామిశ్రభావ ప్రవిఘటిత మిథః ప్రాణభేదోదయంబై**
**యొరిమన్వక్షోజపాలీయుగ కరిమకరీ యుగ్భుజా మధ్య చిహ్నా**
**భరణ వ్యక్తైకభావో భయవిలసిత హృద్భాగమై నిద్రవోయెన్**

యాతాయాత = రాకపోకలయొక్క, రంహః = వేగముయొక్క, ఛల = నెపముచేత, కలిత = తెలుపబడిన, రతిశ్రాంతి = సురత శ్రమవల్లనైన, నిశ్వాసధారా = నిట్టూర్పుల వరుసయొక్క, పరిషత్ = సమూహములయొక్క, వ్యామిశ్రభావ = కలయికచే, ప్రవిఘటిత = పోగొట్టబడిన, మిథస్ = అన్యోన్యము, ప్రాణభేదోదయంబై = ప్రాణములు వేఱువేఱగుట తోపిక కలదై, ఒరిమన్ = ఐకమత్యముచేత, వక్షోజపాళీయుగ = స్తనప్రదేశ జంటయందలి, కరిమకరీయుక్ = కరి మకరీ రూప పత్త్రరేఖలతోకూడిన, భుజా మధ్య = నలుని వక్షమందలి, చిహ్న ఆభరణ = ముద్రలనెడి అలంకారములచేత, వ్యక్త = తేటపడిన, ఏకభావ = ఐక్యముకలవైన, ఉభయవిలసిత = ఇద్దరియొక్క ఒప్పుచున్న, హృద్ భాగము = హృదయభాగము కలదియునై, నిద్రపోయెన్ (నలదమయంతుల నిట్టూర్పులు ఏకమగుటచేతను, దమయంతి స్తన చిత్రిత కరి మకరీ రేఖలు నలుని వక్షమునందు ముద్రిత మగుటచే ఇరువురి హృదయములును ఏకమను భావము ద్యోతకమగుచున్నది)

తా. ఉచ్ఛ్వాస నిశ్వాసలయొక్క వేగము నెపముగా తెలుపబడిన సురత శ్రమవల్లనైన నిట్టూర్పుల వరుస సమూహముల యొక్క కలయికచే పోగొట్టబడిన అన్యోన్యము ప్రాణములు వేఱువేఱగుట తోపికగలదై ఐకమత్యముచేత స్తనయుగళప్రదేశమందలి కరి మరకీ రూప పత్త్రరేఖలతో కూడిన నలుని వక్షమందలి ముద్రలనెడి అలంకారములచేత తేటబడిన ఐక్యతకలవైన ఇద్దరియొక్క ఒప్పుచున్న హృదయభాగములుకలదియునై నిద్రపోయెను.

**188 వ. మఱియును**

**189 తే. సురత పారవశ్యంబులఁ జొక్కి చొక్కి**
**కేళి నిద్రాసుఖంబులఁ దేలి తేలి**
**మేలుకొని బాహ్యరతిలీల మించి మించి**
**దంపతులు క్రీడ సల్పిరి తనివి సనక**

సురత పారవశ్యంబుల = రతి పరవశత్వంతో, చొక్కి చొక్కి = సుఖించి, కేళి = రతిక్రీడచేతను, నిద్రా సుఖంబులన్, తేలి తేలి = తేలియాడి, మేలుకొని, బాహ్య రతిలీలన్ = దర్శన, స్పర్శన, చుంబనాది క్రియలచేత, మించి మించి = అతిశయించి, దంపతులు, తనివి సనక = తృప్తిపొందక, క్రీడ సల్పిరి.

తా. రతి పరవశత్వముతో సుఖించి, రతిక్రీడచేతను నిద్రాసుఖంబుల తేలియాడి, మేలుకొని దర్శన, స్పర్శన, చుంబనాది క్రియలచేత అతిశయించి నల దమయంతులు తృప్తిపొందక క్రీడసల్పిరి.

**190 సీ. ప్రాణేశు నొసలి లాక్షాంకంబు వొడగాంచి**
**ముసి ముసి నగవుతో మోము మలఁచు**
**నేల నవ్వితి చెప్పు మిప్పు డంచడిగిన**
**నధిపు చేతికి మించుటద్ద మిచ్చు**
**మఱుపెట్టి చనుదోయి మదనాంకములు సూచు**
**దను నవ్వు విభుఁ జూపులన యదల్చు**
**రాజుచేఁ జికురభారంబు సెజ్జ మోవంగ**
**మ్రొక్కించుకొనుఁ బాదములకు నలిగి**

**తే. రుద్రమూర్తి జిగీషానురూపకలన**
**కతనుఁ డేకాదశాకృతియైన భంగిఁ**
**జరణ నఖ దర్పణములందు ధరణి విభుఁడు**
**లీలఁ బ్రతిబింబితుండుగా లోలనయన**

లోలనయన = చంచలాక్షి దమయంతి, ప్రాణేశు = భర్తయొక్క, నొసలి = నుదుట, లాక్షాంకంబు = లత్తుక గుర్తు, పొడగాంచి = చూచి, ముసిముసి నగవుతో, మోము, మలచును = ప్రక్కకు త్రిప్పుకొనును. ఏల నవ్వితి చెప్పుము, ఇప్పుడు అనుచు, అడిగిన, అధిపు చేతికి = భర్తచేతికి, అద్దము ఇచ్చున్. మఱుపెట్టి = చాటుగా తిరిగి, చనుదోయి, మదనాంకములు = మన్మథ చిహ్నములు, చూచు = చూచునపుడు, తను నవ్వు = తననుచూచి నవ్వు, విభున్ = భర్తను, చూపులన = చూపులతోనే, అదల్చు = బెదరించును. అలిగి = కోపించి, రాజుచేన్, చికురభారంబు = పెద్ద జుట్టుముడి, సెజ్జ మోవంగ = శయ్యకు తగులునట్లుగ, రుద్రమూర్తి జిగీష = ఏకాదశ రుద్రులను జయించుకోరుటకు, అనురూపకలన = తగిన సామర్థ్యముకొఱకు, అతనుడు = మన్మథుడు, ఏకాదశాకృతి = పదకొండు మూర్తులుకలవాడు, ఐన భంగిన్ =అయినాడో యనునట్లుగా, చరణ నఖ దర్పణములందు = కాలిగోళ్ళనెడు అద్దములందు, ధరణివిభుడు = రాజు, లీలన్ = విలాసముగా, ప్రతిబింబితుడుగాన్ = ప్రతిబింబించునట్లుగా, పాదములకు, మ్రొక్కించుకొనున్.

తా. దమయంతి భర్త నుదుట లత్తుకగుర్తు చూసి ముఖము ప్రక్కకు తిప్పుకొని ముసిముసి నవ్వు నవ్వగా, ఏల నవ్వితివి చెప్పుమని అడుగగా ఆమె భర్తచేతికి అద్దము నిచ్చెను. చాటుగా తిరిగి మన్మథాంకములు చూచుకొనునపుడు తనను చూసి నవ్విన భర్తను చూపులతోనే బెదరించును. కోపించి రాజు జట్టుముడి శయ్యను తాకునట్లుగ ఏకాదశ రుద్రులను జయించుకోరికతో

తగిన సామర్థ్యముకొఱకు మన్మథుడు పదకొండు మూర్తులుకలవాడయ్యెననునట్లుగా కాలి గోళ్లనెడి అద్దములందు రాజు విలాసముగా ప్రతిబింబించినట్లుగా పాదములకు మ్రొక్కించుకొనును.

**191 సీ.** **దంతక్షతా వ్యథాదాయి కాస్యమునకు**
**దంతక్షత వ్యథ దండువయ్యె**
**గుచకుంభ మర్దన క్రూరకర్మంబైన**
**కరము పాదములొత్తి కరుణఁ వడసె**
**దీప మార్చిన యప్డు దీప్తి సూపిన కల్ల**
**మౌళిరత్నము మ్రొక్కి మాన్చికొనియె**
**నొత్తిన తప్పువో నుడిపెఁ గ్రీడాశ్రాంతి**
**నమృతంబు గురిసి దివ్యాభరణము**
**తే.** **మోసగాకుండ నపరాధములకుఁ దగిన**
**శాస్తి యన్నింటి కిబ్భంగి సంభవించె**
**సతికిఁ బతికిని నవ్వేళ సంఘటిల్లు**
**శంబరారాతి ధర్మయుద్ధంబునందు**

ఆ వేళన్, సతికిన్ పతికిన్, సంఘటిల్లు = పొసగిన, శంబరారాతి ధర్మయుద్ధమునందు = ధర్మబద్ధమైన రతిక్రీడయందు, దంతక్షతా వ్యథాదాయికి = పంటినొక్కుచే నొప్పిని ఇచ్చునదైన, ఆస్యమునకున్ = నలుని వదనమునకు, దంతక్షతవ్యథ = పంటినొప్పితో బాధకలిగించుట, దండువు అయ్యెన్ = శిక్ష అయ్యెను. కుచకుంభ మర్దన = కలశములవంటి కుచములను ఒత్తుటయనునది, క్రూరకర్మంబైన = క్రూరకృత్యముచేసినందులకు, కరము = పరిహారముగా, పాదములు ఒత్తి, కరుణన్, పడసె = పొందెను, దీపము, అర్చిన = ఆర్పిన, అపుడు, దీప్తి చూపిన = వెలుగును చూపిన, కల్ల = దొంగయైన, మౌళిరత్నము = నలుని చూడామణి తప్పును, మ్రొక్కి, మాన్చికొనియె = మన్నింపించికొనియెను. దివ్యాభరణము = నలుని దివ్యమైన హారము, ఒత్తిన తప్పువోన్ = ఒత్తిన తప్పు పోవుటకు, క్రీడా శ్రాంతి = రతి అలసటను, అమృతంబు కురిసి = చల్లని కాంతిని వర్షించి, ఉడిపెన్ = పోగొట్టెను. మోసము కాకుండన్ = మోసము లేకుండునట్లుగా, అపరాథములకు తగిన, శాస్తి = శిక్ష, అన్నింటికి, ఈ భంగి = ఈ రీతిగా, సంభవించె = కలిగెను.

**192 ఉ.** **మంకెనపూవుమీఁది యళి మాడ్కి నృపాధర పల్లవోదరా**
**లంకృతి యైన దంత పద లాంఛనముంగని కన్నుఁగోనలం**
**దంకురితంబులైన దరహాస లవంబులు పద్మనేత్ర యి**
**ట్టింకులు సేసెఁ బక్ష్మముల యీఱమిఁ గాటుక చిమ్మచీఁకటిన్**

పద్మనేత్ర = దమయంతి, మంకెన పూవుమీది, అళిమాడ్కిన్ = తుమ్మెదరీతిని, నృపాధరపల్లవ ఉదర అలంకృతియైన = రాజుయొక్క పెదవిఅను చిగురుపొట్టకు అలంకారమైన, దంతపదలాంఛనమున్ = పంటినొక్కు గుర్తును, కని = చూడగా, కన్ను కోనలందు = తనకు కన్ను కొనలయందు, అంకురితంబులైన = పొడమినట్టివైన, దరహాస లవంబులు = చిఱునవ్వులను, పక్ష్మముల యీఱమిన్ = దట్టమైన కనురెప్పలయందు, కాటుక = నల్లని, చిమ్మచీకటిన్ = దట్టమైన చీకటియందు, ఇట్టింకులు = బాగుగా ఇంకిపోవునట్లు, చేసెన్

తా. దమయంతి మంకెనపూవుమీది తుమ్మెదరీతిగా రాజుయొక్క చిగురువంటి పెదవికి అలంకారమైన పంటినొక్కు గుర్తును చూసి తన కన్నుకొనలయందు పొడమిన చిఱునవ్వును కనురెప్పలను నల్లని చిమ్మచీకటియందు ఇంకిపోవునట్లుగా చేసివేసెను.

**193 ఉ.** **క్రిక్కిఱి చన్నుదోయి యిరుగ్రేవల కాంతియుఁ బంచబాణుఁ గ్రొ**
**వ్వెక్కగఁజేయ హస్తయుగమెత్తి విహారభరంపుఁ బేర్మికిన్**
**విక్కి ప్రసూనముల్గురియు వేనలి వీడిచి కొప్పు వెట్టుచోఁ**
**జొక్కులఁబెట్టె భూవరుని చూపులఁ గోమలి బాహుమూలముల్**

క్రిక్కిఱి చన్నుదోయి = క్రిక్కిరిసిన స్తనములకు, ఇరుగ్రేవల కాంతియున్ = రెండు ప్రక్కలమెఱుగు, పంచబాణున్ = మన్మథుని, క్రొవ్వెక్కగచేయ = గర్వించునట్లుచేయగా, హస్తయుగము ఎత్తి = రెండు చేతులను పైకెత్తి, విహారభరంపు పేర్మికిన్ = రతి భేదముల పెంపుచేత, విక్కి = గర్వించి, ప్రసూనముల్ కురియు = పూవులను వర్షించుచున్న, వేనలి వీడిచి = జడను విప్పి, కొప్పు పెట్టుచోన్ = కొప్పుగ ముడుచుకొను సమయమున, కోమలి బాహుమూలముల్, భూవరుని చూపులన్, చొక్కులన్ పెట్టెన్ = మిక్కిలి వలపులను పెట్టెను.

తా. దమయంతియొక్క స్తనములకు రెండువైపులనున్న కాంతి మన్మథుని గర్వించునట్లుచేయగా రెండుచేతులను ఎత్తి రతిభేదముల పెంపుచేత గర్వించి పూవులను వర్షించుచున్న జడను విప్పి కొప్పుగ ముడుచుకొను సమయమున దమయంతియొక్క

బాహుమూలములు రాజు చూపులను మిక్కిలి వలపించినవి.

**194 శా. వాసోభూషణ గంధ మాల్య రచనా వైచిత్ర్య సజ్జాంగియై**
**యా సీమంతిని యన్యకాంతయను మిథ్యాభ్రాంతి పుట్టించుచున్**
**వాసాగారమునందు నొక్కతెయ నానాభంగి వర్తించు న**
**త్యాసక్తి న్నవ సౌఖ్యలీలల విభుం డామోదముం బొందఁగాన్**

ఆ సీమంతిని = ఆ దమయంతి, వాసోభూషణ, గంధ, మాల్య రచనా = వస్త్రములు, అలంకారములు, పరిమళములు, పూదండలను అలంకరించుకొనుటయందలి, వైచిత్ర్య = విచిత్ర ప్రకారములచేత, సజ్జాంగియై = అలంకరింపబడిన శరీరముకలదై, ఒక్కతెయ, అన్య కాంతయను = వేఱొక స్త్రీయను, మిథ్యాభ్రాంతి = కల్లభ్రమను, పుట్టించుచున్, వాసాగారమునందు = పడకటింటియందు, నానాభంగి వర్తించు = పెక్కువిధముల, విభుడు = భర్త, అత్యాసక్తిన్ = మిక్కిలి ఆసక్తితో, నవసౌఖ్య లీలలన్ = సరిక్రొత్త సుఖ క్రీడలచే, ఆమోదమున్ పొందగాన్ = ఆనందమును పొందునట్లుగా, వర్తించున్

తా. ఆ దమయంతి వస్త్రములు, అలంకారములు, పరిమళములు, పూదండలను అలంకరించుకొనుటయందలి విచిత్ర ప్రకారములచేత అలంకరింపబడిన శరీరముకలదై ఆమెయే వేఱొక స్త్రీయను కల్ల భ్రమను కలిగించుచు పడకటింటియందు పెక్కువిధముల భర్త మిక్కిలి ఆసక్తితో సరిక్రొత్త సుఖక్రీడలచే ఆనందము పొందునట్లుగా ప్రవర్తించును.

**195 ఉ. కైటభవైరియున్ జలధికన్యయు నాదిగఁ గీటకంబునుం**
**గీటకపత్నియుం దుదిగఁ గృత్స్నము రాజును దానునై నిరా**
**ఘాట రతిన్ సుఖించుటకుఁ గాంక్ష యొనర్చు మనోంబుజంబునన్**
**బాటలగంధి నిత్యనిరుపాధిక రాగనిబంధనంబునన్**

కైటభవైరియున్ = విష్ణువును, జలధికన్యయున్ = లక్ష్మీదేవియును, ఆదిగన్ = మొదలుగా, కీటకంబునుం = మగపురుగును, కీటకపత్నియున్ = ఆడపురుగును, తుదిగన్ = అంతముగా, కృత్స్నము = అన్ని జీవులను, రాజునున్ తానునై = లక్ష్మీవిష్ణులనుండి కీటకములవరకు అన్నిజీవులు తామేయై, నిరాఘాటరతిన్ = హద్దులేని క్రీడచేత, పాటలగంధి = దమయంతి, నిత్య = నిలుకడయైన, నిరుపాధిక = నిర్వ్యాజమైన, రాగనిబంధనంబునన్ = ప్రేమకు కట్టువడి, సుఖించుటకున్, మనోంబుజంబునన్ = మనస్సనెడి పద్మమునందు, కాంక్ష ఒనర్చు = కోరును.

తా. నలుడును దమయంతియును లక్ష్మీ విష్ణువులనుండి కీటకములవరకు సమస్త జీవులును తామేయై మేరలేని రతిక్రీడచేత నిలుకడయైన, నిర్వ్యాజమైన ప్రేమకు కట్టువడి సుఖించుటకు మనసునందు కోరుకొనిరి.

**196 ఆ. వనిత రూప వేష వాసోంగవాసనా**
**భూషణాది బహు విశేష రచన**
**నన్య దివ్యకాంత యనుశంక పుట్టించి**
**నేర్పు క్రొత్తగాఁగ నృపతిఁ గవయు**

వనిత = దమయంతియొక్క రూపము వేష, వాస = వస్త్రములు, అంగవాసనా, భూషణాది, బహు విశేష రచన = ఎక్కువ విశేషములతో అలంకరింపబడుటవలన, అన్య = వేఱొక, దివ్యకాంతయను = దేవకాంతయను, శంక = సందేహమును, పుట్టించి, క్రొత్తగాగ = క్రొత్తయగుటచే, నృపతి = రాజు, గవయు = కలియుటను, నేర్పు

తా. దమయంతియొక్క రూపము వేషము వస్త్రములు, పరిమళములు, భూషణములు మొదలైన పలు విశేషములతో అలంకరింపబడుటవలన ఆమె వేఱొక దేవకాంతయను సందేహమును పుట్టించగా రాజు క్రొత్తయగుటచే కలియుటను నేర్చును.

**197 వ. ఇవ్విధంబున నమ్మిథునంబు నిధువన క్రియా పరాధీనంబై యానందజలధి నోలలాడుచుండ నవ్విభావరి జరాభావంబు ధరించె. మనోభవుండు కోదండం బెక్కుడించి సంగ్రామ విరామ సూచకంబుగాఁ గుక్కుట కంఠ కాహళంబులు వట్టించె నప్పుడు వైతాళికులు గేళీ ప్రాసాదపర్యంత భాగంబుననుండి యుచ్చైస్స్వరంబున నిట్టనిరి.**

తా. ఈ ప్రకారముగా ఆ దంపతులు రతిక్రీడకు మిక్కిలిలోనై ఆనంద సాగరమున తేలియాడుచుండ తెల్లవాఱెను. మన్మథుడు ధనుస్సును ఎక్కుపెట్టుట మాని కామ పోరాటమునకు విరామ సూచకంబుగ కోళ్ళ కూతలను బాకాలను పట్టించెను. అప్పుడు వైతాళికులు క్రీడాభవన సమీపమునుండి గట్టిగా ఇట్లు పలికిరి.

**198 మ. ప్రణతానేక నృపాల మౌళి వలభీ పర్యంక రత్నావళీ**
**ఘృణి కిర్మీరిత పాదపీఠ జయలక్ష్మీ కేళి మాణిక్య ద**
**ర్పణ దర్పాంధ విరోధి రాజనివహ ప్రాణానిలాహార భ**
**క్షణ కుక్షింభరి భూరిదక్షిణ భుజాస్తంభాసి కుంభీనసా!**

ప్రణత = నమస్కరించుచున్న, అనేక = పెక్కురైన, నృపాల మౌళి = రాజుల శిఖలనెడి, వలభీ = చంద్రశాలలయొక్క, పర్యంక

= మంచములందున్న, రత్నావళీ = రత్నపంక్తులయొక్క, ఘృణి = కిరణములచే, కిర్మీరిత = పలువర్ణములు కలదిగా చేయబడిన, పాదపీఠ = పాదములుంచుకొనెడు పీటయనబడు, జయలక్ష్మీ కేళి = విజయలక్ష్మీ విలాసార్థమైన, మాణిక్య దర్పణ = మణిముకురము కలవాడా!, దర్పాంధ విరోధిరాజ నివహ = గర్వాంధులయిన శత్రురాజులయొక్క ప్రాణానిల = ప్రాణవాయువనెడి, ఆహార = భోజనమును, భక్షణ = తినుటయందు, కుక్షింభరి = అధికాసక్తికల, భూరి = గొప్పదైన, దక్షిణభుజ = కుడిభుజమునందలి, అసి కుంభీనసా = కత్తియనెడు పాముకలవాడా!

తా. నమస్కరించుచున్న అనేక రాజుల శిఖలనెడి చంద్రశాలలయొక్క మంచములందున్న రత్నపంక్తులయొక్క కిరణములచే పలువర్ణములుకలదిగాచేయబడిన పాదపీఠమనబడు విజయలక్ష్మీ విలాసార్థమైన మణిముకురముకలవాడా! గర్వాంధులైన శత్రురాజులయొక్క ప్రాణవాయువనెడి ఆహారమును భుజించుటయందు అధికాసక్తికల గొప్ప కుడిచేతియందలి కత్తియనెడు సర్పరాజు కలవాడా!

**199 క.**
**ప్రౌఢ జయశ్రీ కుచభర**
**గాఢ పరీరంభ కేళి కౌతుక సుఖసం**
**రూఢ నవపులక ముకుళ**
**వ్యూఢోరస్థ్సల విలోచనోత్సవమూర్తీ !**

ప్రౌఢ = ప్రౌఢురాలైన, జయశ్రీ = జయలక్ష్మియొక్క, కుచభర = దొడ్డ స్తనములను, గాఢ = గట్టిగా, పరీరంభ = కౌగలించుకొనుట యని, కేళి కౌతుక = క్రీడయందు వేడుకచేత, సుఖ సంరూఢ = సౌఖ్యముచే పుట్టిన, నవ = క్రొత్తవైన, పులక ముకుళ = మొగ్గలవంటి గగుర్పాటు కలదియు, వ్యూఢ = వెడల్పయినదియు, ఉరస్థ్సల = వక్షస్థలముకలవాడా! విలోచన ఉత్సవ మూర్తీ = నేత్రములకు ఆనందమును కలిగించు రూపముకలవాడా!

తా. ప్రౌఢురాలైన జయలక్ష్మియొక్క పెద్ద స్తనములను గట్టిగా కౌగలించుకొనుటయనెడి క్రీడయందు వేడుకచేత, సౌఖ్యముచేత పుట్టిన క్రొత్తవైన మొగ్గలవంటి గగుర్పాటుకలదియు, వెడల్పయినదియునైన వక్షస్థలముకలవాడా! నేత్రములకు ఆనందమును కలిగించు రూపముకలవాడా!

**200 మాలిని**
**అమృత జలధికన్యా ప్రాణనాథాంఘ్రిసీమా**
**సముదిత సురగంగా సామ్యకీర్తిప్రదీపా**
**కమలభవపురంధ్రీ కంఠ నక్షత్రమాలా**
**సమధిక మణిరోచి స్స్వచ్ఛ లీలానులాపా**

అమృతజలధికన్యా = లక్ష్మీదేవియొక్క, ప్రాణనాథ = ప్రియునియొక్క, అంఘ్రిసీమా = పాదతలమున, సముదిత = పుట్టిన, సురగంగా = ఆకాశగంగయొక్క, సామ్య = సాటికల, కీర్తి ప్రదీపా = యశస్సుచే ప్రకాశించువాడా! కమలభవ పురంధ్రీ = సరస్వతీదేవియొక్క, కంఠ = గళమందున్న, నక్షత్రమాలా = నక్షత్రమాలికయందలి, సమధిక = గొప్పవైన, మణి = ముత్యములయొక్క, రోచిస్ = కాంతివలె, స్వచ్ఛ = నిర్మలమైన, లీల = విలాసముగల, అనులాపా = వాక్కులుకలవాడా!

తా. విష్ణుమూర్తియొక్క పాదతలమున పుట్టిన ఆకాశగంగకు సాటిగల కీర్తిచే ప్రకాశించువాడా! సరస్వతీదేవి కంఠమందున్న నక్షత్రమాలికలోని గొప్పవైన ముత్యాలయొక్క కాంతివలె నిర్మలమైన విలాసముగల వాక్కులుకలవాడా!

**ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర**
**సకలవిద్యాసనాథ శ్రీనాథభట్ట ప్రణీతంబైన**
**శృంగార నైషధ కావ్యంబునందు**
**సప్తమాశ్వాసము**

**వ్యాఖ్యాతృ గద్యము**
**ఇది బుధజన విధేయుండును, బులుసు వంశ సంభూతుండును,**
**కీ.శే. శేషమ్మ, వెంకటరమణయ్య పుణ్యదంపతీ తనూజుండును,**
**గౌతమ గోత్రజుండునగు వేంకటసత్యనారాయణమూర్తి**
**ప్రణీతంబైన శృంగార నైషధ మహాకావ్యంబునందు**
**సప్తమాశ్వాసమునకు టీక-తాత్పర్యములు**
**సంపూర్ణము**

# శృంగార నైషధము

## అష్టమాశ్వాసము

**శ్రీధామ రెడ్డివేమ**
**క్ష్మాధీశ్వర సచివ సింగనామాత్య దిశా**
**సౌధ శిఖరాగ్ర కీలిత**
**సాధీయస్స్ఫటిక కుంభ సన్నిభ కీర్తీ**

శ్రీధామ = లక్ష్మికి స్థానమైనవాడా!, రెడ్డి వేమక్ష్మాధీశ్వర సచివ = వేమారెడ్డిప్రభువునకు మంత్రియైనవాడా!, సింగనామాత్య, దిశా = దిక్కులనెడి, సౌధ = మేడలయొక్క, శిఖరాగ్ర = శిఖరముల కొనలయందు, కీలిత = అమర్చబడిన, సాధీయః = మిక్కిలి మేలైన, స్ఫటిక కుంభ = పటికపు కలశముతో, సన్నిభ = సమానమైన, కీర్తీ = కీర్తికలవాడా!

తా. సంపదకు స్థానమైవవాడా! వేమారెడ్డికి మంత్రియైనవాడా! సింగనామాత్య! దిక్కులనెడి మేడలయొక్క శిఖరాగ్రములందు అమర్చబడిన మేలైన స్ఫటిక కలశముతో సమానమైన కీర్తి కలవాడా!

**2 వ. అవధరింపుము**

**3 మ జయ శీతాంశుకులావతంస! నిషధస్వామీ! మహారాజ! య**
**వ్యయ ధైర్యాకర! నిద్రమేల్కొనుము! సంధ్యావేళ యేతెంచె నీ**
**నయనాబ్జంబుల కిచ్చు భవ్య శకునానందైక కల్యాణముల్**
**శయనోత్థాయము భోజరాజతనయా సంపుల్ల నేత్రాబ్జముల్**

శీతాంశుకులావతంస = చంద్రవంశమున శ్రేష్ఠుడా!, నిషధస్వామీ = నల ప్రభూ!, మహారాజ, అవ్యయ = నాశనములేని, ధైర్యాకర = ధైర్యమునకు స్థానమైనవాడా!, జయ = జయము, సంధ్యావేళ = ఉదయము, ఏతెంచెన్ = కావచ్చెను, నిద్ర మేల్కొనుము, శయనోత్థాయము = పడకనుండి లేచినవెంటనే, భోజరాజతనయా = దమయంతియొక్క, సంపుల్ల = వికసించిన, నేత్రాబ్జముల్ = నేత్రపద్మములు, భవ్య = మంగళకరమైన, శకున = శకునములై, ఆనంద = సంతోషకరమైన, కల్యాణముల్ = శుభములను, నీ నయనాబ్జంబులకున్ = నీ పద్మములవంటి నేత్రములకు, ఇచ్చున్ = ఇచ్చుగాక.

తా. చంద్రవంశ శ్రేష్ఠుడా! నలమహారాజా! అంతులేని ధైర్యముకలవాడా! నీకు జయమగుగాక. ఉదయమయ్యెను. నిద్ర మేల్కొనుము. లేచినవెంటనే దమయంతియొక్క నేత్రపద్మములు నీకు శుభకరమైన శకునములై సంతోషకరమైన శుభములను నీ నేత్రపద్మములకు ఇచ్చునుగాక.

**4 మ. వరుణ ప్రేయసియైన దిక్కుఁ గదియ న్వాఛించుచుం జంద్రికా**
**పరిధానంబుఁ గ్రమక్రమంబునఁ బరిభ్రంశంబు నొందించు చం**
**దురునిం గన్గొని యింద్ర దిగ్వనిత ప్రత్యూష ప్రసాదోదయ**
**స్ఫురణ వ్యాజమునన్నిజాననమునం బూనెం బ్రహాసద్యుతుల్**

ఇంద్రదిగ్వనిత = తూర్పుదిక్కు అనెడి స్త్రీ, వరుణ ప్రేయసియైన = వరుణదేవుని ప్రియురాలైన, దిక్కున్ = పశ్చిమమును, కదియన్ = చేరుటకు, వాంఛించుచున్ = ఇష్టపడుచు, చంద్రికా పరిధానంబున్ = వెన్నెలయనెడి కట్టిన వస్త్రమును, క్రమక్రమంబునన్ = మెల్లమెల్లగా, పరిభ్రంశమున్ = జారుటను, ఒందించు = పొందించుచున్నట్టి, చందురునిన్ = చంద్రుని, కన్గొని = చూచి, నిజాననమునన్ = తన ముఖమునందు, ప్రత్యూష = ప్రాత:కాలమందలి, ప్రసాద = నైర్మల్యముయొక్క, ఉదయ = పుట్టుకయొక్క స్ఫురణ = ప్రకాశమనెడి, వ్యాజమునన్ = మిషచేత, ప్రహాసద్యుతుల్ = నవ్వుల కాంతులను, పూనెన్ = పొందెను. (ఉత్ప్రేక్ష)

తా. వరుణదేవుని దిక్కైన పశ్చిమమునందు ప్రీతికలవాడై చేరుటకై వెన్నెలయనెడి వస్త్రము జారుచున్నను తెలియని చంద్రుని చూచి తూర్పు దిక్కు ప్రకాశమనెడి వంకతో నవ్వులకాంతులను వెదజల్లుచుండెను.

5 సీ. చంద్రాతపంబులు సాంద్రక్షపాతమ
స్సహయుద్ధులై పరిశ్రాంతిఁ బొందె
నతి దరిద్రాణ దేహ ద్యుతి ప్రాణమై
ప్రాలేయ కిరణ బింబంబు వ్రాలె
నపరస్పరంబులై యాకాశవీథికిఁ
గొన్ని భాస్కర కరాంకురము లెగసె
నమహతితరదీప్తి నంతంతఁ జుక్కలు
సంఖ్యా విధేయ శేషంబు లయ్యెఁ
తే. గుముద కేదారముననుండి క్రొత్త విరియు
కమలషండంబునకు వేడ్కఁ గాఁపువచ్చు
కొదమతుమ్మెద కడతెక్కఁ గుసుమవెట్టె
నభినవంబైన ప్రథమ సంధ్యాగమంబు

చంద్రాతపంబులు = వెన్నెలలు, సాంద్ర = దట్టములయిన, క్షపా = రాత్రియందలి, తమస్ సహ = చీకట్లతో, యుద్ధులై = పోరాడినవై, పరిశ్రాంతిన్ = విశ్రాంతిని, పొందెన్, అతి దరిద్రాణ = మిక్కిలి నశించిన, దేహ ద్యుతి = దేహకాంతి యనెడి, ప్రాణమై = సత్తువకలదై, ప్రాలేయ కిరణ బింబంబు = చంద్రమండలము, వ్రాలెన్ = ఒరిగిపోయెను, కొన్ని భాస్కర కర అంకురములు = కొన్ని సూర్యకిరణములు, అపరస్పరంబులై = అవిచ్ఛిన్నములై, ఆకాశవీథికిన్ = గగన మార్గమునకు, ఎగసెన్ = ఎగిరి వ్యాపించెను, అమహతితరదీప్తిన్ = మిక్కిలి సూక్ష్మమైన కాంతిచే, అంతంతన్ = అచ్చటచ్చట, చుక్కలు = నక్షత్రములు, సంఖ్యావిధేయశేషంబులయ్యెన్ = లెక్కదగినవిగా మిగిలినవి. అభినవంబైన = క్రొత్తదైన, ప్రథమ సంధ్యాగమంబు = ప్రాతస్సంధ్యారాగము, కుముద కేదారముననుండి = కలువల మడినుండి, క్రొత్త విరియు = అపుడే వికసించుచున్న, కమలషండంబునకు = పద్మసమూహములకు, వేడ్కన్ = వేడుకతో, కాపువచ్చు = కాపురమునకు వచ్చు, కొదమ తుమ్మెద కడ తెక్కన్ = పిల్లతుమ్మెదలయొక్క తెక్కల చివరలను, కుసుమ పెట్టెన్ = కాషాయ రంగును పెట్టెను.

తా. వెన్నెలలు రాత్రితో యుద్ధము చేసినవై విశ్రాంతి పొందుచున్నవి. దేహకాంతి నశించి సత్తువలేని చంద్రమండలము క్రుంకిపోయెను. కొన్ని సూర్యకిరణములు అవిచ్ఛిన్నములై గగనమార్గమున ఎగిరి వ్యాపించెను. మిక్కిలి సూక్ష్మమైన కాంతితో అక్కడక్కడ నక్షత్రములు లెక్కకు మిగిలినవి. నూతన ప్రాతస్సంధ్యారాగముతో కలువలమడినుండి తుమ్మెదలు అప్పుడే విరిసిన పద్మములసమూహమునకు వేడుకతో కాపురమునకు వచ్చుచుండగా వాని తెక్కల కొనలకు కాషాయరంగు పెట్టెను.

6 క. కర వాఁడి సూదితుదమొన
నర దఱువంబడిన ముత్తియంబును బోలెన్
గరమొప్పె రజని కరిణీ
కర వమథువు హిమము కుశ శిఖా శిఖరమునన్

రజని కరిణీ = రాత్రియనెడి ఆడుఏనుగుయొక్క, కర = తొండముయొక్క, వమథువు = తుంపరయగు, హిమము = మంచు, కుశ శిఖా శిఖరమునన్ = దర్భ చిగుళ్ళయొక్క కొనలయందు, కర వాడి సూదిమొనన్ = మిక్కిలి వాడియైన సూదిమొనచేత, అర దఱువంబడిన = సగము తొలువబడిన, ముత్తియంబును పోలెన్ = ముత్యమువలె, కరమొప్పెన్ = మిక్కిలి ప్రకాశించెను.

తా. రాత్రియనెడు ఆడుఏనుగు తొండముయొక్క తుంపరయగు మంచు దర్భచిగుళ్ళకొనలయందు మిక్కిలి వాడియైన సూదిమొనచేత సగము తొలువబడిన ముత్యమువలె మిక్కిలి ప్రకాశించెను. (అలంకారము –ఉపమ)

7 మ. దివిషద్దంపతి తల్పమైన గగనోద్దేశంబునం దారకా
నివహంబు ల్గుసుమ స్రగంశములుగా నిర్వాణ కాంతిచ్ఛటా
నవ తూల ప్రకరోదరంభరి నిశానాథుండు గండోపథా
న విధాలీల వహించె నత్తఱి నఖండంబైన బింబంబుతోన్

ఆ తఱిన్ = ఆ ప్రాత:కాల సమయమున, దివిషత్ దంపతి తల్పము ఐన = దేవతా మిథునములకు పానుపుయైన, గగనోద్దేశంబునన్ = ఆకాశ ప్రదేశమునందు, తారకా నివహంబుల్ = నక్షత్ర సమూహములు, కుసుమ స్రగంశములుగాన్ = పూలమాలికల తునియలగుచుండగా, నిర్వాణ = శాంతించిన, కాంతిచ్ఛటా = కాంతిసమూహములనెడి, నవ తూల ప్రకర = క్రొత్తదూది మొత్తముచే, ఉదరంభరి = కడుపు నిండించుకొన్నవాడగు, నిశానాథుండు = చంద్రుడు, అఖండంబు = పూర్ణమైన, బింబంబుతోన్ = మండలముతో, గండోపథాన విధాలీలన్ = దిండుయొక్క ప్రకారంబు విలాసమును, వహించెన్ = ధరించెను.

తా. ఆ ప్రాత:కాల సమయమున దేవతా మిథునముల పానుపైన ఆకాశ ప్రదేశమందు నక్షత్ర సమూహములు పూలమాలికల తునియలగుచుండగా శాంతించిన కాంతిసమూహములనెడి క్రొత్తదూది మొత్తముచే కడుపునిండించుకొన్న వాడగు చంద్రుడు పూర్ణమైన మండలముతో దిండుయొక్క ప్రకారంబు విలాసమును ధరించెను. (అలంకారము – నిదర్శన)

8 శా. **శ్యైనంపాతమెయి న్నభంబున సహస్రాంశుండు వైచెం గర**
**శ్యేన వ్రాతము నంధకార బలిభుక్ర్శేణీ జిఘాంసారతిన్**
**దానం జంద్రుదు పశ్చిమాశకు శశత్రాణార్థమై యేఁగెను**
**డ్డీనంబయ్యె నుడువ్రజంబు పరిపాటిం బారువాలోయనన్**

సహస్రాంశుండు = సూర్యుడు, శ్యైనంపాత మెయిన్ = డేగ వేటతో, అంధకార = చీకటియనెడి, బలిభుక్ = కాకులయొక్క, శ్రేణీ = పంక్తులయొక్క, జిఘాంసా = చంపుటయందలి, రతిన్ = ఆసక్తిచే, నభంబునన్ = ఆకాశమునందు, కరశ్యేన వ్రాతము = కిరణములనెడి డేగల సమూహమును, వైచెన్ = వదలెను. దానన్ = ఆ డేగలతో వేటాడుటచేతనే, చంద్రుడు, శశ త్రాణార్థమై = కుందేలుపిల్లను రక్షించుకొనుటకై, పశ్చిమాశకున్ = పడమటి దిక్కుకు, ఏగెన్ = పోయెను. ఉడువ్రజంబు = నక్షత్ర సమూహము, పరిపాటిన్ = క్రమముగా, పారువాలో యనన్ = పారువా పిట్టలేమో యనునట్లుగా, ఉడ్డీనంబు అయ్యెన్ = ఎగిరి అదృశ్యమయ్యెను. (అలంకారము – రూపకము, ఉత్ర్పేక్ష)

తా. సూర్యుడు డేగవేటతో చీకటియనెడి కాకులను చంపుటయందలి ఆసక్తిచే ఆకాశమునందు కిరణములనెడి డేగల సమూహమును వదలెను. ఆ డేగలతో వేటాడుటచేతనే చంద్రుడు తన కుందేలుపిల్లను రక్షిచుకొనుటకై పడమటి దిక్కుకు వెళ్ళిపోయెను. నక్షత్రసమూహము క్రమముగా పావురాలేమోయనగా ఎగిరి అదృశ్యమయ్యెను.

9 క. **లఘుగతి ననూరు సారథి**
**విఘటిత తిమిరుఁడయి వీఁడె విచ్చేసె దివిన్**
**మఘవపుర ప్రాసాద**
**ప్రఘాణక ప్రాంగణము లుపఘ్నంబులుగాన్**

అనూరు సారథి = సూర్యుడు, లఘుగతిన్ = శీఘ్ర గమనముచే, విఘటిత తిమిరుడయి = చీల్చిన చీకట్లు కలవాడయి, మఘవ = ఇంద్రుని, పుర ప్రాసాద = వైజయంతముయొక్క ప్రఘాణక = తలవాకిటి చావడియొక్క ప్రాంగణములు = వాకిళ్ళు, ఉపఘ్నంబులుగాన్ = సమీపాశ్రయములగుచుండగా, వీడె = ఇదుగో, దివిన్ = అకసమందు, విచ్చేసెన్.

తా. సూర్యుడు శీఘ్ర గమనముచే చీకట్లను పారద్రోలినవాడయి ఇంద్రునియొక్క వైజయంతము తలవాకిట చావడియొక్క వాకిళ్ళు సమీపాశ్రయములగుచుండగా ఇదుగో ఆకసమున వచ్చియున్నాడు.

10 చం. **గ్రహములు నిర్జరీ సురతకాల విసూత్రితహార రత్న సం**
**గ్రహములు మేఘవీథియను కౌతుక మందిర చత్వరంబునన్**
**బహుకర మార్జనావిధి ప్రభాత ముఖంబునఁ బాయఁదట్టె ని**
**ష్టహహ! భుజిష్యవో నియతి యంతక యారసి చూడవచ్చినన్**

మేఘవీథియను = ఆకాశమను, కౌతుకమందిర చత్వరంబునన్ = కేళీమందిరపు వాకిటియందు, నిర్జరీ = దేవతాస్త్రీలయొక్క, సురతకాల = రతి సమయమున, విసూత్రిత = తెగిపోయినవగు, హారరత్న సంగ్రహములు = హారములందలి రత్న సముదాయములను,(గ్రహములు = నక్షత్రములను), బహుకర = తుడుచువానియొక్క (పెక్కు కిరణములకలవాడైన సూర్యుని యొక్క), మార్జనావిధి = తుడుచుటయను పని, ప్రభాత ముఖంబునన్ = ప్రాత:కాలమునందు, పాయదట్టెన్ = తుడిచివేసెను. అహహ = ఆశ్చర్యము, ఆరసి చూడన్ = పరిశీలించి చూడగా, నియతి = నియమము, భుజిష్యవో = స్వతంత్రమైనది కాబోలును, అంతక = అదియే నిజము కావచ్చును.

తా. ఆకాశమను కేళీమందిరపు వాకిటియందు దేవతాస్త్రీల రతిసమయమున తెగిన హారములందలి రత్నములనెడి నక్షత్రములను తుడుచువాడైన సూర్యుడు తుడిచే పనిచేసి ప్రాత:కాలమున తుడిచివేసెను. ఆశ్చర్యమగును. బ్రహ్మ నియమము స్వతంత్రమైనది కాబోలు, పరిశీలించి చూడగా అదియే సత్యము కావచ్చును.

11 సీ. **ఆమ్నాయశాఖా సహస్ర వివర్తంబు**
**లుడురాజ కల్యాణ హోమవహ్ను**
**లాకాశ హర్మ్యాగ్ర హస్తదీపంబులు**
**ప్రాలేయ జలరాశి బాడబములు**
**చక్రవాక మనో విశల్యౌషధంబులు**
**దశ దిశీ కుంకుమ స్థాసకములు**
**రాజమండల కాంతి రాజయక్ష్మము లంధ**
**కార వేదండ కంఠీరవములు**

తే. **పద్మవన నిర్ణిబంధన బాంధవములు**
**కైరవాకర సమ్మోహ కారణములు**
**సవితృమణి పావకేంధన సామిధేను**
**లెగసె నుదయాద్రి యవుల నీరెండకొనలు**

ఆమ్నాయ = వేదములందుగల, శాఖా సహస్ర = తైత్తిరీయాది వేయి శాఖలయొక్క, వివర్తంబులు = రూపాంతరములు (సూర్యుని వేయి కిరణములు), ఉడురాజ = చంద్రునియొక్క, కల్యాణ = వివాహమందలి, హోమ వహ్నులు = హోమాగ్ని హోత్రములు, ఆకాశ హర్మ్య అగ్ర = ఆకాశమనెడి మేడ కొనయందలి, హస్త దీపంబులు = కాగడాలు, ప్రాలేయ జలరాశి = మంచుయనెడు సముద్రమునకు, బడబాగ్ని = బడబాగ్నివంటివి, చక్రవాక = చక్రవాక పక్షులయొక్క, మనో విశల్య ఔషధములు = మనమున నాటిన బాణమును పెకలించు ఔషధములు, దశ దిశీ = పది దిక్కులందును, కుంకుమ స్థాసకములు = కుంకుమ నుంచుచున్నవి, రాజమండల కాంతి = చద్రమండల కాంతికి, రాజయక్ష్మంబులు = క్షయరోగముల వంటివి, అంధకార = చీకట్లనెడి, వేదండ = ఏనుగులకు, కంఠీరవములు = సింహముల వంటివి, పద్మవన = కమల వనములకు, నిర్నిబంధన = అకారణములయిన, బాంధవములు = చుట్టములు, కైరవాకర = కలువతోటలకు, సమ్మోహ = మోహమును కలిగించునట్టి, కారణములు, సవితృమణి = సూర్యకాంత మణులందు, పావక = అగ్నిని, ఇంధన = ప్రజ్వలింపచేయు, సామిధేనులు = ఋక్కులు, ఉదయాద్రి యవుల = పొడుపుకొండ అవతలి ప్రక్క, ఈరెండ కొనలు, ఎగసెన్ = వ్యాపించెను. (అలంకారము – రూపకము)

తా. వేదములందుకల తైత్తిరీయాది వేయిశాఖలయొక్క రూపాంతరములు, చంద్రునియొక్క వివాహసమయమందలి హోమాగ్నిహోత్రములు, ఆకాశసౌధమందలి కాగడాలు, మంచుసముద్రమునందు బడబాగ్ని, చక్రవాకపక్షులయొక్క మనసున నాటిన బాణములను తొలగించు ఔషధము, పది దిక్కులందును చల్లబడిన కుంకుమ, చంద్రమండల కాంతికి క్షయరోగము, చీకట్లనెడి ఏనుగులకు సింహము, కమలవనములకు అకారణ చుట్టము, కలువతోటల మూర్ఛకు కారణము, సూర్యకాంత మణులందు అగ్నిని ప్రజ్వలింపచేయు ఋక్కులు అనగా ఈరెండకొనలు ఉదయాద్రి ఆవలప్రక్క వ్యాపించినవి.

**12 క. పసిపాప యెండ కొనలను**
**మసమసకని యిరులుఁ గలిసి మన మలరించెన్**
**దెసల నలుగడలఁ గుంజా**
**విసరంబుల సరులు వ్రేల విడిచిన భంగిన్**

పసిపాప యెండ కొనలును = బాల సూర్యకాంతులును, మసమసకని యిరులు = మసక మసక చీకట్లు, కలిసి, దెసల నలుగడలన్ = నాలుగు దిక్కులయందును, గుంజావిసరంబుల సరులు = గురివెందగింజల దండలు, వ్రేలవిడిచిన భంగిన్ = వ్రేలాడవైచినట్లుగా, మనము = మనసును, అలరించెన్ = సంతసింపచేసెను. (అలంకారము – ఉత్ప్రేక్ష)

తా. బాల సూర్యకాంతులును, మసక మసక చీకట్లును కలిసి నాలుగు దిక్కులయందును గురివెందగింజల దండలను వ్రేలాడవైచినట్లుగా మనసును సంతసింపచేసెను.

**13 సీ. నముచిసూదను వీటి నడువీథి చక్కికి**
**నింతకు నేతెంచు నినుని తేరు**
**కట్టుపకాసులై గగనాంగణంబున**
**మందేహు లింతకు మాఱుకొంద్రు**
**ద్రవియించు నింతకుఁ బ్రథమాద్రి చఱులలో**
**నూష్మసోఁకి శిలాజ తూత్కరములు**
**ప్రీతి నింతకు నేఁగుఁ బిచ్చుకుంటుకు మ్రొక్క**
**వినుత సౌభ్రాతుండు వినతపట్టి**

**తే. మేలుకొనఁగదె రాజన్య మీనలక్ష్మ**
**కాలకంఠ సమర్చనా కాలమయ్యె**
**విశ్వ విశ్వంభరా భార విధృతి దక్ష**
**దీర్ఘతరనేత్ర నిషధధాత్రీ కళత్ర**

రాజన్య మీనలక్ష్మ = ఓ రాచ మన్మథుడా!, ఇంతకున్ = ఈ పాటికి, ఇనుని తేరు = సూర్యుని రథము, నముచి సూదను = ఇంద్రునియొక్క, వీటి నడువీథి చక్కికిన్ = పురవీథి మధ్యమునకు, ఏతెంచున్ = వచ్చును, ఇంతకున్, గగనాంగణమునన్ = ఆకాశప్రదేశమందు, మందేహులు = మందేహులనెడి రాక్షసులు, కట్టుపకాసులై = అడ్డుపడి, మాఱుకొంద్రు = ఎదురింతురు, ఇంతకున్, ప్రథమాద్రి చఱులలోన్ = ఉదయాద్రి చరియలలో, శిలాజతూత్కరములు = శిలాజిత్తు సమూహములు, ఊష్మసోకి = ఎండవేడికి, ద్రవియించును = కరగుచుండును, ఇంతకున్, ప్రీతిన్ = ప్రేమతో, వినుత = స్తుతింపదగిన, సౌభ్రాత్రుండు = సోదరభావముకలవాడైన, వినతపట్టి = గరుత్మంతుడు, పిచ్చుకుంటుకు = అనూరునకు, మ్రొక్కన్ = నమస్కరించుటకు, ఏగున్ = వెళ్ళుచున్నాడు. కాలకంఠ సమర్చానాకాలము = శివుని పూజించువేళ, అయ్యెన్ = అయినది, విశ్వ = సమస్తమైన, విశ్వంభరా = భూమియొక్క, భార = బరువును, విధృతి = భరించుటయందు, దక్ష = నేర్పుకలవాడా!, దీర్ఘతర నేత్ర = మిక్కిలి విశాలమైన నేత్రములు కలవాడా! నిషధధాత్రీ కళత్ర = నిషధ రాజా!, మేలుకొనగదె = మేలుకొనుమా!

తా. ఓ రాచమన్మథుడా! ఈపాటికి సూర్యుని రథము ఇంద్రుని పట్టణ నడువీథికి వచ్చును. ఈపాటికి ఆకాశమునందు మందేహులనెడి రాక్షసులు సూర్యుని రథమునకు అడ్డుపడి ఎదురింతురు. ఈపాటికి ఉదయాద్రి చరియలలో శిలాజిత్తులు ఎండవేడికి కరగుచుండును, ఈపాటికి ప్రేమతో గరుత్మంతుడు సోదర ప్రేమతో అనూరునకు నమస్కరించపోవును. శివుని పూజకు వేళ అయినది. సమస్తమైన భూమండలపు బరువును భరించుటయందు సమర్థతకలవాడా! మిక్కిలి విశాలమయిన నేత్రములు కలవాడా! నిషధరాజా! మేలుకొనుమా!

**14 వ. మఱియుం దిమిర విరహపాండూయమాన దిఙ్మండలంబును, విచేయ తారకంబును, దరిద్రాణ ప్రాణ రోహిణీ రమణ బింబ చుంబ్యమాన చరమాచల శిఖరభాగంబును, శిశిర సలిలక్షోదకుక్షింభరి క్షీరకంఠ రవిమయూఖంబును, గుముద కేదార నిద్రాసుఖ నిదానంబును, నిశావిరహ విహ్వల చక్రాహ్వయ విహంగమ స్త్రీపుంస హృదయ బృంహితాహ్లాదంబును, గువలయినీ కుక్షి భ్రూణాయమాన మదసుప్త బంభరంబును, లవణస్య దౌపవాహ్యహయ విలేహ్యమాన మాణిమంథ శిలా శకలంబును, సంధ్యా మౌనవ్రతపరాయణ విశిష్టాధ్యేతృజన విహితాధ్యయన విరామంబును, బ్రాహ్మణాభి మంత్రి తార్ఘ్యాంజలి జల వజ్రధారా విరాజిత మందేహ దేహంబునునై యత్తఱిం, గ్రొత్త విరియు నెత్తమ్మి విరుల కేసరంబుల వాసనలు గ్రోలి మత్తిల్లి యుల్లాసంబునం దూలియాడు కొదమతుమ్మెద కదుపులు ఘుసృణ సుమన శ్రేణీ శోణంబగు పొదుపుసంజ కెంజాయయుఁ గలయ బెరసి గురివెందపేరుల యందంబు వహించుటయును, గుశ కిసలయంబుల మీఁదం బ్రాలేయాంభఃకణ క్రమ సంభృతంబులై రజనియను పిడియేనుఁగు పూత్కారంబు సేసి యుమిసినం జిలికిన కరవమథు శీకరంబులంబోని యుదక బిందు సందోహంబులు సుషిర కరణ నిపుణకర నిశాతాయస సూచీ శలాకా శిఖాంకుర సంకరంబునం గరమ్ము హత్తిన ముత్తియంబుల ననుకరించుటయు, వికసితైకదళంబులగు కుశేశయ కోరకంబులచేతం గమలాకరంబులు మిహిరకిరణాభోగ భోజనార్థంబు సంధ్యారాగాంబువుంజేత మొదల నాపోశనంబెత్తు భావంబు భజియించుటయుఁ జులుకిత తమస్సింధు పూరంబులగు బిసినీబాంధవుని కరంబులవలన రంధ్రస్రుతంబులగు నంధకార బిందుసందోహంబు లిందిందిర వ్యాజంబున నంభోజ వనంబులలోనం దొరఁగి విస్మృమర మధుస్రోతః కచ్ఛద్వయీ పరిసరంబులం బంక శంకావహంబగుటయుఁ, దటరుహ తరు నికాయ నిష్కుహ క్రీడా నీడంబుల నిద్రించి మేల్కాంచి కలగొనం బలుకు పులుఁగుల యెలుంగుల కోలాహలంబుల చేతనుంబోలెఁ బ్రత్యుద్బుద్ధంబులగు సరోజాతంబులలో మధువ్రత వ్రాతంబులు, వధూ వదన లబ్ధ మధురాధర సుధాపానంబు తోడ సాధు విధీయమానంబులైన మధుపాన మహోత్స వంబులం బ్రవర్తిల్లుటయును, గాఢ సమస్తమాల గహనభంగ మాతంగంబులుం గనదనఘ కనకరేణు త్రసరేణువిసర పిశంగం బులునగు పతంగకిరణ శృంగంబులు భవనవలభి జాలంబులం దూఱి, భ్రమదణుగణాక్రాంతంబులై కుంద పరిభ్రమణ భ్రాంతి నాపాదించుటయు, విభాత లక్ష్మీవిలాసంబు విశ్వ నయనోత్సవం బయ్యె వెండియు**

తా. మఱియు చీకట్లు లేకపోవుటచేత తెల్లనివగు దిక్కుల సమూహము కలదియును, వెడకదగిన నక్షత్రములు కలదియు, క్షీణతనొందిన ప్రాణతుల్యమగు కాంతిగల చంద్రబింబముచే తాకబడుచున్న పడమటి కొండయొక్క శిఖర ప్రదేశముకలదియు, మంచునీటి బిందువులను మ్రింగినట్టి బాలసూర్యకాంతులుకలదియు, కలువ వనములకు నిద్రా సౌఖ్యమునకు మూలమయినదియు, రాత్రియందలి యెడబాటుచే వివశములైన జక్రవాకపక్షుల జంటయొక్క మనసులందు వృద్ధిపొందింపబడిన సంతసముకలదియు, కలువతీగ గర్భమున గర్భస్థ శిశువులుగ చేయబడి, మత్తుచే నిద్రించిన తుమ్మెదలు కలదియు, ఉప్పు తినగోరుచున్న రాజవాహనములైన గుఱ్ఱములచేత నాకబడుచున్న సైంధవ లవణపు రాళ్ళ తునకలుకలదియు, సంధ్యాకాలమందు మౌనవ్రత మాచరింప యాసక్తులయినట్టి శిష్టుల యధ్యయనముచేయువారిచే చేయబడుచున్న యధ్యయనముయొక్క పూర్తికలదియు, బ్రాహ్మణులచే మంత్రింపబడిన యర్ఘ్యప్రదాన జలములనెడి వజ్రాయుధపుటంచుచే చీల్చబడిన మందేహ రాక్షసుల దేహములుకలదియునై, యా ప్రాతఃకాలమున నూతనముగా వికసించుచున్న మనోహరములైన తామరపూవులయొక్క కేసరముల పరిమళములను యనుభవించి మదించి సంతసముచే యెగిరిపడెడి తుమ్మెద గుంపులును, కుంకుమపువ్వువలె యెఱ్ఱనైన యుదయకాల సంధ్యారాగమును కలియగూడుకొని గురివెందగింజల పేరులయొక్క రీతిని తాల్చుటచేతను, దర్భకొనలపైని మంచుబిందువుల వరుసచే సంపాదితములై రాత్రి యనెడు ఆడయేనుగు పూత్కారముచేసి పూరించి యుమియగా చిలికిన తొండమందలి మదబిందువులవంటి యుదక సందోహంబులు బెజ్జము వేయుటయందు నేర్పుకలవాని చేతియందలి వాడియైన ఇనుపసూదులయొక్క కొట్టకొనలందు మిక్కిలి అంటియున్న ముత్యములను అనుకరించుటయును, వికసించిన యొకే దళముకలవగు తామర మొగ్గలచేత తామర కొలకులు సూర్యుని కిరణసమూహమును తినుటకొఱకు సంజకెంజాయ యనెడి నీటిని తన చేతియందు భోజనమునకు ముందు ఆపోశనము పట్టురీతిని అవలంబించుటచేతను, హస్తకుహరమున గ్రహింపబడిన చీకటి సముద్రముకలవియగు సూర్యునికిరణములయొక్క రంధ్రములవలన క్రిందికి జారిన చీకట్ల బిందుసమూహములు తుమ్మెదల వంకతో పద్మవనము లందుండి ప్రవహించి వ్యాపించిన మకరంద ప్రవాహ సంబంధముచే తడిసిన తీరములందు బురదయను శంకను కలిగించుచున్నట్టియు, నదీతీరములందున్న వృక్షసమూహముల తొఱ్ఱలనెడి క్రీడాకులాయములందు నిద్రించి, మేలుకొని వ్యాపించునట్లుగా కూయుచున్న పక్షులయొక్క కోలాహలధ్వనులచేతనువలె మేల్కొలుపబడిన పద్మములలో తుమ్మెద గుంపులు ఆడుతుమ్మెదల ముఖములవలన పొందబడిన తియ్యని అధరోష్ఠమందలి అమృతపానముతో కూడ బాగుగా చేయబడుచున్నవి

యైన మధుపానకేళుల ప్రవర్తించుచుండుటచేత దట్టమైన చీకట్లనెడి కానుగుతోపును ధ్వంసముచేయుటయందు ఏనుగుల వంటివియు, ప్రకాశించుచున్న నిర్మలమైన బంగారు లేశములు త్రసరేణు సమూహములైన సూర్య కిరణముల యగ్రములు ఇండ్ల ముంజూరులందున్న గవాక్షములను ప్రవేశించి తిరుగుచున్న యణుసముదాయముచే వ్యాప్తములై తరిమెన చక్రమందు తిరుగుటయను భ్రాంతిని చేయుటచేతను ప్రాతఃకాలశోభ యందఱి నేత్రములకు సంతసము కలిగించునదయ్యెను. మఱియు

15 మ. **సలిలాభ్యుక్షిత కంబుసంభవ రజోజంబాల పాండూభవ**
**జ్జలజచ్ఛిత్కరపత్రభావ భజనన్ సంధిల్లె శీతాంశు మం**
**డల మిప్డస్తమితార్ధబింబమగుచున్ నక్షత్ర శంఖచ్ఛిదా**
**కలనోత్సేక సరోజబాంధవ కరాగ్ర స్వైర నిష్పీడనన్**

నక్షత్రశంఖ = నక్షత్ర రూపమగు శంఖములను, ఛిదా = భేదించుటయనెడి, కలన = లీలయందలి, ఉత్సేక = గర్వముగల, సరోజబాంధవ = సూర్యునియొక్క, కరాగ్ర = కిరణములనెడి చేతుల కొనలచేత, స్వైర = యథేష్టముగా, నిష్పీడనన్ = పీడించుటచేతను, సలిలాభ్యుక్షిత = నీటిచే తడుపబడి, కంబుసంభవ = శంఖమువలన కలిగిన, రజస్ = ధూళిసంబంధియగు, జంబాల = బురదచేత, పాండూభవత్ = తెల్లనిదగు, జలజచ్ఛిత్ = శంఖమును కోసెడిదగు, కరపత్ర = అంపముయొక్క, భావ భజనన్ = ధర్మ ప్రాప్తిచే, శీతాంశుమండలము = చంద్రమండలము, ఇప్డు = ఈ సమయమందు, అస్తమితార్ధబింబము = అస్తమించిన సగము బింబముకలది, అగుచున్, సంధిల్లెన్ = ఒప్పెను.

తా. నక్షత్రరూపమగు శంఖములను కోయుటయందు నేర్పుగల సూర్యునియొక్క కిరణములనెడి చేతులచేత యథేష్టముగా కోయుటచేత నీటిచే తడుపబడి శంఖమువలన కలిగిన ధూళిసంబంధియగు బురదచేత తెల్లనిదై శంఖమును కోసెడి అంపముయొక్క ధర్మము కలదగుటచే ఇపుడు చంద్రమండలము అస్తమించిన సగము బింబముకలదై ఒప్పెను.

16 చ. **తటుకున నస్తమించెఁ బతి దైన్యముఁ జూడఁగనోడి తారకా**
**పటలమునుం ద్రియామయును బాపురె! యింతుల వాఁడిపంతముల్**
**కటకట తద్వియోగమునఁ గ్రాఁగి నశింపఁడ నిష్ఠురాత్ముఁడై**
**పటికమొకో విధుండు నడుపట్టు కలంకము నల్లఱాయియో**

తారకాపటలమునున్ = నక్షత్ర సమూహమును, త్రియామయును = రాత్రియును, పతి దైన్యము = తమ భర్తయగు చంద్రుని దురవస్థను, చూడగన్ = చూచుటకు, ఓడి = భయపడి, తటుకునన్ = శీఘ్రముగా, అస్తమించెన్ = నశించెను, బాపురె = వహ్వా, ఇంతుల పంతముల్ వాడి = స్త్రీలయొక్క పంతములు మిక్కిలి సాహసవంతములుకదా!, కటకట = అయ్యయ్యో, తత్ వియోగమునన్ = తన భార్యలగు నక్షత్రముల ఎడబాటుచే, క్రాగి = సంతాపమునొందియు, నిష్ఠురాత్ముడై = కఠినహృదయుడై, నశింపడ = నశింపనే నశింపడు, విధుండు = చంద్రుడు, పటికము ఒకో = పటికఱాయి కాబోలును, నడుపట్టు = మధ్యభాగమునందున్న, కలంకము = మచ్చ, నల్లఱాయియో = నల్లఱాయి కాబోలును.

తా. నక్షత్రములు, రాత్రియును తమ భర్తయగు చంద్రుని దురవస్థను చూచుటకు భయపడి తొందరగా నశించెను. వహ్వా! స్త్రీలయొక్క పంతములు చాల సాహసవంతములుకదా! అయ్యయ్యో! తన భార్యల యెడబాటుచేత సంతాపము నొందియు కఠినహృదయుడై చంద్రుడు నశింపనే నశింపడు. మఱి చంద్రుడు పటికపు ఱాయియో, లేక మధ్యభాగమునందున్న మచ్చ నల్లఱాయియో కావచ్చును.

17 ఉ. **నిద్దుర మేలుకొమ్ము, రజనీకర వంశవతంస! కుంకుమం**
**బద్దిన భంగి మింటనదె యామిని చెల్లెలు కాల్య సంధ్య దా**
**నుద్దియ సేయుచున్నయది యుష్ణమయూఖ సుత ప్రసూతికిన్**
**బ్రొద్దులు సొచ్చియున్నయవి పూర్వదిశా సరసీరుహాక్షికిన్**

రజనీకరవంశవతంస = చంద్రవంశమునకు భూషణమైన ఓ నలరాజా!, మింటన్ = ఆకాశమునందు, అదె = అదిగో, యామిని చెల్లెలు కాల్య సంధ్య = రాత్రి చెల్లెలగు ప్రాతఃకాలసంధ్య, కుంకుమంబు అద్దిన భంగిన్, తాను, ఉద్దియ చేయుచున్నయది = నిన్ను తొందరచేయుచున్నది, ఉష్ణమయూఖ = సూర్యుడనెడి, సుత ప్రసూతికిన్ = కుమారుని కనుటకు, పూర్వదిశాసరసీ రుహాక్షికిన్ = పూర్వదిక్కనెడి స్త్రీకి, ప్రొద్దులు = రోజులు, చొచ్చియున్నయవి = నిండినవి, నిద్దుర మేలుకొమ్ము.

తా. ఓ నలరాజా! ఆకాశమున అదిగో రాత్రి చెల్లెలగు ప్రాతఃకాలసంధ్య కుంకుమ అద్దిన రీతిగా తాను ప్రకాశించుచున్నది. సూర్యుడనెడి కుమారుని కనుటకు తూరుపుదిక్కనెడు స్త్రీకి నెలలు నిండినవి. నిద్దుర మేలుకొనుము.

18 శా. **వైదర్భీ హృదయేశ! మేలుకొని నిర్వర్తింపు సంధ్యా నవ**
**ప్రాదుర్భావ విధేయమున్ విధికలాపంబున్ముహూర్తంబులో**
**నాదిత్యుండిటఁ దోఁదు సూపుఁ బటు రంహః పిష్ట పిష్టీకృత**
**క్ష్మాదిగ్వ్యోమ మహా తమోఘమున మోఘంబున్మయూఖౌఘమున్**

వైదర్భీహృదయేశ = దమయంతి ప్రియుడా!, మేలుకొని, సంధ్యా నవ ప్రాదుర్భావ = ప్రాతఃసంధ్యాకాలము క్రొత్తగా సంభవించుటయందు, విధేయమున్ = చేయదగినదగు, విధికలాపంబున్ = క్రియాకలాపమును, నిర్వర్తింపు = నెఱవేర్పుము, ముహూర్తంబులోన్ = క్షణకాలములో, ఆదిత్యుండు = సూర్యుడు, ఇటన్ = ఇక్కడ, పటు = సమర్థమైన, రంహః = వేగముచే, పిష్ట పిష్టీకృత = మిక్కిలి చూర్ణముగా చేయబడిన, క్ష్మా = భూమి సంబంధియు, దిక్ = దిక్కుల సంబంధియు, వ్యోమ = ఆకాశ సంబంధియునగు, మహా తమోఘమున = గొప్ప చీకటియనెడు మాలిన్యముకలదియు, అమోఘంబున్ = వ్యర్థముకానిదియునగు, మయూఖ ఓఘమున్ = కిరణ సమూహమును, తోడు చూపున్ = ప్రసరింపచేయును.

తా. దమయంతీ ప్రియుడా! మేలుకొని ప్రాతఃసంధ్యాకాలమున చేయదగు క్రియాకలాపమును చేయుము. క్షణ కాలములో సూర్యుడు ఇక్కడ భూమి, దిక్కులు, ఆకాశము నందలి చీకటి మాలిన్యమును నశింపచేసి తన అమోఘమైన కిరణసమూహమును ప్రసరింపచేయును.

**19 శా. ప్రాతఃకాలము వాయసంబు పణినాపత్యోక్త శాస్త్రంబులోఁ**
**దాతజ్స్థానులు చెప్పుఁ డెవ్వియను చందంబొప్పఁ గౌకౌయనం**
**జాతుర్యం బలరార నుత్తరము విస్పష్టంబుగాఁ గోకిల**
**వ్రాతంబిచ్చెఁ దుహీ తుహీయని గృహారామ ప్రదేశంబులన్**

ప్రాతఃకాలము, వాయసంబు = కాకి, పణినాపతి ఉక్త శాస్త్రంబులోన్ = పాణినీయ వ్యాకరణ శాస్త్రమునందు, తాతజ్ స్థానులు = తాతజ్ అనెడి ఆదేశమునకు స్థానులను చెప్పుడు, ఎవ్వియను = అవి ఏవియను, చందంబు ఒప్పన్ = రీతి ఒప్పునట్లుగా, కౌ కౌ అనన్ = కౌ కౌ యని కూయగా, కోకిల వ్రాతంబు = కోకిలల సమూహము, గృహారామ ప్రదేశంబులన్ = గృహోద్యానవనములందు, విస్పష్టంబుగాన్, చాతుర్యంబు = నేర్పు, అలరారన్ = ఒప్పునట్లుగా, తుహీ తుహీయని, ఉత్తరము ఇచ్చెన్ = సమాధానము చెప్పెను.

తా. ప్రాతఃకాలమున కాకి పాణినీయ వ్యాకరణ శాస్త్రములోని తాతజ్ అనెడి ఆదేశమునకు స్థానులను చెప్పండి. అవి ఏవి యన్న రీతి ఒప్పునట్లు కౌ కౌ యని కూయగా, కోకిలలు గృహోద్యానములందుండి స్పష్టముగా నేర్పుతో తుహీ తుహీయని సమాధానములిచ్చుచున్నట్లుండెను.

**20 ఉ. వారక రాత్రియెల్లఁ బ్రియవల్లభుఁడైన శశాంకుఁ గూడి యి**
**చ్ఛారతి కేళి జాగరము సల్పిన ఖిన్నత నొక్కొ దీర్ఘికా**
**కైరవరాజి యిప్డు నిజగర్భ నివిష్ట మదద్విరేఫ ఝం**
**కార మిషంబునం దఱుచుగా గుఱువెట్టుచు నిద్రవోయెడిన్**

వారక = విడువక, రాత్రి ఎల్లన్, ప్రియవల్లభుడైన = ప్రియమైన భర్తయగు, శశాంకు కూడి = చంద్రునితో కలిసి, ఇచ్ఛా రతికేళిన్ = ఇష్టమైన రతిక్రీడయందు, జాగరము సల్పిన, ఖిన్నతను ఒక్కొ = అలయికచేతనేమో, దీర్ఘికా కైరవరాజి = క్రీడా సరస్సునందలి తెల్లకలువ పంక్తి, నిజ = తమయొక్క, గర్భ = గర్భములందు, నివిష్ట = ప్రవేశించియున్న, మదద్విరేఫ = మదించిన తుమ్మెదలయొక్క, ఝంకార మిషంబునన్ = ఝంకారధ్వనులనెడు వంకతో, తఱుచుగా = అధికముగా, గుఱు పెట్టుచు = గురకపెట్టుచు, నిద్ర పోయెడిన్ = నిద్రించుచున్నది.

తా. విడువక రాత్రియంతా భర్తయగు చంద్రునితో కలిసి రతిక్రీడయందు జాగరము చేసిన అలయికచేత క్రీడా సరస్సునందలి తెల్లకలువల పంక్తి తమ గర్భములందు ప్రవేశించియున్న తుమ్మెదలయొక్క ఝంకారధ్వనులనెడు వంకతో ఎక్కువగా గురకపెట్టి నిద్రపోవుచున్నవి.

**21 వ. అని యివ్విధంబునం బ్రభాతకాల వర్ణనంబు చేయు వైతాళికుల నాదరించి**

**22 మహాస్రగ్ధర బలవద్దారిద్ర్యముద్రా ప్రకుపిత కమలా పాటలా పాంగరోచిః**
**కలికా సందేహ దానక్షమ కమల మణిగ్రామ జాగ్రన్మయూఖో**
**జ్జ్వల శుద్ధ స్వర్ణభూషా సముదయ ముదయత్స్వాంత సంప్రీతినా సూ**
**తులకుం బుత్తెంచె భూనాథు సతి యుడిగపుం దోయజాతాక్షిచేతన్**

భూనాథుసతి =దమయంతి, ఉదయత్ = పుట్టుచున్న, స్వాంత సంప్రీతిన్ = మనసునందలి సంతోషముచే, బలవత్ = బలవంతమగు, దారిద్ర్యముద్రా = ఆక్రమించుకొన్న పేదఱికముమీద, ప్రకుపిత = మిక్కిలి కోపించిన, కమలా = లక్ష్మీదేవియొక్క, పాటల = ఎఱ్ఱనైన, అపాంగ రోచి: = క్రీగంటి కాంతియొక్క, కలికా = మొగ్గలోయనెడి, సందేహ = సంశయమునకు, దానక్షమ = ఇచ్చుటకు సమర్థమైన, కమలమణిగ్రామ = పద్మరాగమణుల సమూహములయొక్క, జాగ్రత్ = ప్రసరించుచున్న, మయూఖ = కిరణములచే, ఉజ్జ్వల = ప్రకాశించుచున్న, శుద్ధ = స్వచ్ఛములైన, స్వర్ణభూషా = బంగారు నగలయొక్క, సముదయ = సమూహమును, ఉడిగపుం తోయజాతాక్షిచేతన్ = పరిచారికచేత, ఆ సూతులకున్ = ఆ వైతాళికులకు, పుత్తెంచెన్ = పంపెను.

తా. దమయంతి తన మనసునందలి సంతోషముచే వైతాళికుల దారిద్ర్యముపై మిక్కిలి కోపించిన లక్ష్మీదేవియొక్క

ఎఱ్ఱనైన క్రీగంటి కాంతి మొగ్గలోయని సందేహమునకు సమర్థమైన పద్మరాగమణుల కాంతులచే ప్రకాశించుచున్న స్వచ్ఛములైన బంగారు నగలను పరిచారికచేత ఆ వైతాళికులకు పంపెను.

23 వ. **అప్పుడు**

24 తే. **తనకు నెద్దానిఁ గన్యా ప్రదానవేళ**
**యౌతుకంబున నిచ్చె నెయ్యంపు మామ**
**యట్టి యీశ్వర వరదత్తమైన రథముఁ**
**గామ గమనంబుఁ దలఁచె నా క్షణమ నృపతి**

నెయ్యంపు మామ = ప్రియమైన మామగారు భీమరాజు, కన్యా ప్రదానవేళన్ = కూతురునిచ్చునపుడు, ఔతుకంబునన్ = ఆదరణతో, ఎద్దానిన్ = ఏ రథమును, తనకున్, ఇచ్చెను, అట్టి = అటువంటి, ఈశ్వర వర దత్తమైన = ఈశ్వరుని వరముగా ఈయబడిన, రథమున్, కామ గమనంబున్ = స్వేచ్ఛాగమనముకలదానిని, ఆ క్షణమ = అప్పుడే, నృపతి, తలచెను.

తా. తన మామగారు కూతురునిచ్చువేళ ఆదరణతో ఏ రథమును తనకు ఇచ్చెనో ఆ ఈశ్వరవరదత్తమైన రథమును కామగమనముకలదానిని నలుడు ఆ సమయమందే తలంచెను.

25 క. **మదిఁ దలఁచినంత మాత్రన**
**యుదయించు సహస్రరశ్మి కుపమానంబై**
**మదన క్రీడా సౌధము**
**తుద నిలువున నిలిచె రథము తోయద వీథిన్**

మది = మనసునందు. తలచినంత మాత్రనన్, ఉదయించు సహస్రరశ్మికిన్ = ఉదయించు సూర్యునకు, ఉపమానంబై = పోలికకలదై, మదన క్రీడాసౌధము = కేళీ సౌధముయొక్క, తుద నిలువునన్ = కొనయందు, రథము, తోయద వీధిన్ = ఆకాశ వీధియందు, నిలిచెన్

తా. మనసున తలచినంతనే ఉదయించు సూర్యునకు సాటియగు రథము క్రీడాసౌధముయొక్క పైన కొనయందు ఆకాశవీథిలో నిలిచెను.

26 తే. **కనక కింకిణికా జాలకములు మెఱయ**
**గగనతరు పుష్పమగు పుష్పకంబు వోలె**
**నెచటనుండియొ యేతెంచి యెదుటనున్న**
**పసిఁడి తేరెక్కి వసమతీపాల సుతుఁడు**

గగనతరు పుష్పమగు = ఆకాశవృక్షమునకు పుష్పమువంటిదైన, పుష్పకంబువోలెన్ = పుష్పక విమానమువలె, కనక = బంగారు, కింకిణికా = చిఱుగంటలయొక్క, జాలకములు = సమూహములు, మెఱయ = ప్రకాశింపగా, ఎచటినుండియొ, ఏతెంచి, ఎదుటనున్న, పసిడి తేరు = బంగారు రథమును, వసుమతీపాల సుతుడు = రాజకుమారుడు, ఎక్కి (ఉపమ)

తా. ఆకాశమనెడి వృక్షమునకు పుష్పమువంటిదైన పుష్పక విమానమువలె బంగారు చిఱుగంటల సమూహములు ప్రకాశించుచుండగా ఎక్కడినుండియో వచ్చి ఎదుట నిలబడిన బంగారు రథమును నలుడు ఎక్కి

27 శా. **వాతాహార విరోధి నెక్కి చను విష్వక్సేనుఁడుం బోలె ని**
**ర్ధౌతాసి ద్యుతి మేచకంబగు వియద్భాగంబునన్ భాస్కర**
**ద్యోతాన్వీత విమానమెక్కి మదిలో నుత్సాహ మేపారఁగాఁ**
**బ్రాతస్స్నానము చేయఁబోయె ధరణీపాలుండు మిన్నేటికిన్**

వాతాహార విరోధిన్ = సర్పములకు శత్రువైన గరుత్మంతుని, ఎక్కి, చను = వెళ్ళు, విష్వక్సేనుండున్ పోలె = విష్ణునివలె, నిర్ధౌత = తోమబడిన, అసి = కత్తియొక్క, ద్యుతి = కాంతులవలె, మేచకంబగు = నల్లనైన, వియద్భాగంబునన్ = ఆకాశమునందు, భాస్కర ద్యోత = సూర్య కాంతులవంటి కాంతులతో, అన్వీత = కూడుకొనిన, విమానము ఎక్కి, మదిలో, ఉత్సాహము, ఏపారగాన్ = వర్ధిల్లగా, ధరణీపాలుండు = నలుడు, మిన్నేటికిన్ = ఆకాశగంగకు, ప్రాతస్స్నానము, చేయన్, పోయెను.

తా. గరుత్మంతుని ఎక్కి వెళ్ళు విష్ణునివలె తోమబడిన కత్తియొక్క కాంతులవలె నల్లనైన ఆకాశమునందు సూర్య కాంతులవంటి కాంతులతో కూడుకొనిన విమానమునెక్కి నలుడు ఆకాశగంగకు ఉదయ స్నానము చేయుటకు వెళ్ళెను.

28 వ. **ఏఁగి యట మహానటజటాటవీవాటి నవతరించి నభోవీథీ మేథీ భూతంబగు ధ్రువమండలం బొరసికొనుచు శింశుమారాకారంబునం దారకామూర్తియై పవ్వళించిన పాంచజన్యధరుని చరణ పల్లవంబు ప్రక్షాళించుచు, సోమార్కమయ మహాసోపానంబులం బ్రవహించి పరివహ పవన ఝంపా సంపాతంబులం దూఁగియాడు కరళ్ళ చప్పుళ్ళు దిక్పుటంబుల నాస్ఫోటింపం ద్రివిష్టప లలాటికా తిలకంబును, నరకపుర గోపుర ద్వార దంతార్గళయును, నారాయణ చరణారవింద మకరంద బిందు నిష్యందంబును, బుండరీక భవ కమండలు తీర్థధారయు నైన యమ్మహానది డాసి విమానంబు**

**డిగ్గి, జలావగాహ నాయాత జంభారాతి కుంభి కుంభస్థలీ సాంద్ర సిందూర పరాగ సంధ్యాయమాన సలిలంబును, నప్సరః కుచతటీ పటీర చర్చామచర్చికా సురభితంబును, బ్రతీర పారిజాత కుసుమ ధూళిపాళి పిశంగిత సైకతంబును జింతామణి శిలాసంఘాత సంఘట్టన సముచ్చల జ్జల శీకరాసారచ్ఛటా స్ఫోటిత గగనభాగంబును, గనత్కనక పులినవేదికా మధ్యాసీన కామధుగ్ధేనూధస్యధారా ధోరణీ ప్రవాహ బృంహితోర్మియునగు నొక్క రేవున డిగ్గి తత్ప్రదేశంబున**

తా. వెళ్ళి అక్కడ ఈశ్వరునియొక్క జటలనెడి వనవీథినుండి దిగి ఆకాశమార్గమునకు కట్టుగొయ్యగు ధ్రువమండలము తాకుచు, మొసలి రూపమున నక్షత్రరూపుడై శయనించిన విష్ణుని చిగురువంటి పాదములను కడుగుచు, చంద్రుడు, సూర్యుడునను గొప్ప మెట్లనుండి ప్రవహించి, పరివహ వాయువుయొక్క దూకుడుచే ఊగుచున్నట్టి కెరటముల ధ్వనులు దిక్కుల సంధులను పగులగొట్టుచుండగా స్వర్గమునకు నుదుట తిలకముగానున్నదియు, యమపురి ప్రవేశమార్గమునకు దంతపు గడియవంటిదియు, విష్ణునియొక్క పాదపద్మములందలి తేనె బిందువుల స్రవణమైనదియు, బ్రహ్మ కమండలములో జలధారయైనదియునైన ఆ మహానదిని చేరి విమానమును దిగి, గంగానదీ జలములో నీదులాడుటకు వచ్చిన ఐరావతము కుంభస్థలమునందలి సిందూర చూర్ణముచే సంధ్యాకాలమువలె నెఱ్ఱగా కానవచ్చు జలముగలదియు, అచ్చరల స్తన తటములందున్న మంచి మంచిగంధపు పూతలచేత పరిమళించునదియు, తీరములందున్న పారిజాతవృక్షముల పూవుల పరాగ సముదాయముచే పచ్చని ఇసుకతిన్నెలుకలదియు, చింతామణి రాళ్ళను తాకుటచే మీదికెగయుచున్న వర్ష రూపముగా పడు జలబిందువుల సమూహముచేత చఱువబడుచున్న ఆకాశముకలదియు, ప్రకాశించుచున్న అరుగుల వంటి బంగారపు టిసుక తిన్నెల మధ్యభాగమునందుండిన కోరికల తీర్చు కామధేనువు పొదుగునుండి జాఱుచున్న క్షీర ధారల విధమున ప్రవాహముచే వర్ధింపబడిన కెరటములుకలదియునగు నొక్క రేవున దిగి ఆ ప్రదేశమున

**29 సీ. అత్యంత నియతిఁ బంచాంగంబు పఠియించె**
**నఘమర్షణ స్నాన మాచరించె**
**దైవత ఋషి పితృ తర్పణం బొనరించె**
**సంధ్య నారాధించె సవితృఁ గొల్చె**
**గాంగేయ వాలుకా లింగమూర్తిని నిల్పి**
**కాంచనాబ్జములఁ బూజించె శివునిఁ**
**బారిజాత కలతా పల్లవాగ్రంబులు**
**చిదిపి యొయ్యన మేపెఁ ద్రిదశగవికిఁ**

**తే. గేలు దో యెత్తి యౌదలఁ గీలుకొల్పి**
**గగన మునిరాజులయిన చుక్కలకు మ్రొక్కి**
**దివ్య రథమెక్కి వేగ యేతెంచె మరలి**
**యధిపుఁ డట్టుల సురనదీ యాత్ర సల్పి**

అధిపుడు = ఆ నలుడు, అత్యంత నియతిన్ = మిక్కిలి నిష్ఠతో, పంచాంగంబు = తిథి వార నక్షత్ర యోగ కరణము లైదింటిని, పఠియించెన్, అఘమర్షణస్నానము = అఘమర్షణ మంత్రముతో స్నానమును, ఆచరించెన్, దైవత ఋషి పితృ తర్పణంబున్, ఒనరించెన్, సంధ్యన్, ఆరాధించెన్, సవితృన్ = సూర్యుని, కొల్చెన్, గాంగేయ వాలుకా లింగమూర్తిని = గంగానదిలోని ఇసుకతో లింగమును, నిల్పి, శివునిన్, కాంచన అబ్జములన్ = బంగారు కమలములచే, పూజించెన్, పారిజాత కలతా పల్లవాగ్రంబులు = పారిజాత తీగెలయొక్క చిగుళ్ళు, చిదిమి = కోసి, ఒయ్యనన్ = మెల్లగా, త్రిదశగవికి = కామధేనువునకు, మేపెన్, కేలుదోయి = రెండుచేతులు, ఎత్తి, ఔదలన్ కీలుకొల్పి = శిరముననుంచుకొని, గగనముని రాజులు = ఆకాశమందున్న మునిశ్రేష్ఠులైన సప్తర్షులకు, చుక్కలకు = నక్షత్ర రూపులకు, మ్రొక్కి = నమస్కరించి, దివ్య రథము ఎక్కి, అట్టుల = ఆ ప్రకారముగా, సురనదీయాత్ర = ఆకాశగంగ ప్రయాణమును, సల్పి = చేసి

తా. ఆ నలమహారాజు మిక్కిలి నిష్ఠతో పంచాంగములైదింటిని పఠించెను. అఘమర్షణస్నాన మాచరించెను. దేవ ఋషి పితృ తర్పణముల నొనరించెను. సంధ్యను ఆరాధించెను. సూర్యుని సేవించెను. గంగానది ఇసుకతో లింగమునుచేసి శివుని బంగారు కమలములచే పూజించెను. పారిజాత తీగెల చిగుళ్ళను కోసి మెల్లగా కామధేనువునకు తినిపించెను. రెండుచేతులు ఎత్తి శిరమునందుంచుకొని నక్షత్రరూపులైన సప్త ఋషులకు నమస్కరించెను. మరల దివ్యరథమును ఎక్కి తిరిగి వచ్చెను. ఆ ప్రకారముగా సురనదీయాత్రను చేసి

**30 తే. హృద్య సౌధాగ్ర కుట్టిమానేక రూప**
**ధాతుకాధిత్యకా తటాంతరము సేరె**
**ధరణినాథ పురందరాధ్యాసితంబు**
**రత్న దివ్య విమాన ధారాధరంబు**

ధరణినాథ = నలుడనెడి, పురందర = ఇంద్రునిచే, అధ్యాసితంబు = అధిష్టింపబడిన, రత్న, దివ్య, విమాన, ధారాధరంబు = మేఘము, హృద్య = మనోహరమైన, సౌధ అగ = మేడయనెడి పర్వతముయొక్క, కుట్టిమ = పైన కట్టడముల, అనేక రూప = పలు విధములగు, ధాతుకా = గైరికాది ధాతువులుకల, అధిత్యకా = ఉపరిభాగముయొక్క, అంతరము = మధ్యభాగమును, చేరెను

తా. ఇంద్రునివంటి నలునిచే అధిష్టింపబడిన రత్న దివ్య విమానమనెడి మేఘము మనోహరమైన మేడయనెడి పర్వతముపై పలు విధముల గైరికాది ధాతువుల కట్టడముల ఉపరిభాగ మధ్యభాగమును చేరెను.

**31 తే. దివసముఖ కార్యజాతంబు తీర్చివచ్చు**
**పతి నెదుర్కొనె భక్తి సంభ్రమ మెలర్పఁ**
**జెలువ ప్రత్యగ్దిశా సింధు సలిలవీచి**
**తూర్పుదెస వచ్చు నిండు చందురునిఁ బోలె**

చెలువ = దమయంతి, ప్రత్యగ్దిశా సలిలవీచి = పడమటి సముద్రపు కెరటము, తూర్పుదెసవచ్చు = తూర్పుదిక్కున ఉదయించు, నిండుచందురునిపోలె = పున్నమినాటి చంద్రునివలె, దివసముఖ కార్యజాతంబు = ప్రాత:కాలకృత్య సమూహమును, తీర్చి = నెఱవేర్చి, వచ్చు = వచ్చుచున్న, పతిని = నలుని, భక్తిసంభ్రమమెలర్ప = భక్తివలని తొట్రుపాటు ఒప్పునట్లుగా, ఎదుర్కొనెన్ = ఎదురుగా వచ్చెను.

తా. దమయంతి తూర్పుదిక్కున ఉదయించు పున్నమినాటి చంద్రుని పడమటి సముద్రపు కెరటమువలె ప్రాత: కాలకృత్యము నెఱవేర్చి వచ్చుచున్న భర్తను భక్తివల్ల ఏర్పడిన తొట్రుపాటుతో ఎదురు వచ్చెను.

**32 వ. తరణి ఖర కిరణ కందళిత మందాకినీ కనకారవిందంబునకు విందై, నిజసందర్శనానంద మందస్మిత సుందరంబగు నయ్యిందువదన వదనంబు మదనరాగంబు సంపాదింప సర్వసర్వంసహా నిలింప సార్వభౌముండు.**

తా. సూర్యునియొక్క వాడి కిరణములచే వికసించిన గంగానదియందలి బంగారు పద్మమునకు చుట్టమై తనను చూచుటవలన కలిగిన ఆనందముచే చిఱునవ్వుతో అందమైనదగు ఆ చంద్రముఖి దమయంతి ముఖము కామావేశమును కలిగింపగా సమస్త భూమండలమునకు అధిపతియైన నలచక్రవర్తి

**33 ఉ. మానస సంప్రమోదము సమగ్రముగా సురలోకవాహినీ**
**స్నానవిధి ప్రవృత్తి వచనంబున జెప్పక చెప్పినట్లు స**
**న్మానత దన్నెదుర్కొనిన మానవతీ జనతా లలామకున్**
**గానుక యిచ్చెఁ దావి వెలిగాని కనత్కనకారవిందమున్**

మానస సంప్రమోదము = మనసునందలి సంతోషము, సమగ్రముగాన్ = నిండుగా, సురలోకవాహినీ = ఆకాశగంగ యందు, స్నానవిధి = స్నానకార్యమునందు, ప్రవృత్తి = ప్రవర్తనను, వచనంబున = మాటలతో, చెప్పక చెప్పినట్లు, సన్మానతన్ = గౌరవముతో, తన్ను = తనను, ఎదుర్కొనిన = స్వాగతించుటకు వచ్చుచున్న, మానవతీ జనతా లలామకున్ = స్త్రీలలో శ్రేష్ఠురాలగ దమయంతికి, తావి వెలిగాని = వాసనపోని, కనత్ = ప్రకాశించుచున్న, కనక అరవిందమున్ = బంగారు కమలమును, కానుక ఇచ్చెన్.

తా. మనసున సంతోషము నిండగా ఆకాశగంగకు స్నానకార్యముకొఱకు వెళ్ళిన విధమును మాటలతో చెప్పక చెప్పినట్లు ప్రేమతో తనను ఎదుర్కొనుటకు వచ్చిన దమయంతికి ఆ నదియందలి బంగారు కమలమును కానుకగా ఇచ్చెను.

**34 క. పురుషోత్తమ లాలిత య**
**త్తరుణీమణి మిగులనొప్పెఁ దత్సమయమునన్**
**సురసింధు హేమకమలము**
**కరకమలంబున ధరించు కమలయుఁ బోలెన్**

పురుషోత్తమ = పురుషశ్రేష్ఠుడైన నలునిచే, లాలిత = గౌరవింపబడిన, ఆ తరుణీమణి = ఆ దమయంతి, సురసింధు హేమ కమలము = ఆకాశగంగయందలి బంగారు పద్మము, కర కమలంబునన్ = హస్త పద్మమునందు, ధరించు = ధరించు నట్టి, కమలయు పోలెన్ = లక్ష్మీదేవివలె, మిగులన్ ఒప్పెన్ = మిక్కిలి ప్రకాశించెను.

తా. పురుషశ్రేష్ఠుడైన నలునిచే ఆ రీతిగా గౌరవింపబడిన ఆ దమయంతి పద్మమును చేతియందు ధరించిన లక్ష్మీదేవివలె మిక్కిలి ప్రకాశించెను.

**35 తే. రాజముఖికి నయ్యేటవరాటకంబు**
**లలిత సమ్మానమున నేక లక్షమయ్యె**
**రాజకృపగన్న యొక్క వరాటకంబు**
**నేక లక్షంబ మతి సంశయింపనేల?**

రాజముఖికిన్ = చంద్రముఖికి, ఆ ఏక వరాటకంబు = ఆ ఒక్క తామర, లలిత సమ్మానమునన్ = నలుడు చూపిన

గౌరవముచేత, ఏక లక్షము అయ్యెన్ = ఒక లక్షగా భాసించెను. రాజ కృపన్ కన్న = రాజు దయనుపొందిన, ఒక్క వరాటకంబు = ఒక గవ్వయును, ఏక లక్షంబ = ఒక లక్షతో సమానమేకదా!, మఱి = ఇంక, సంశయింపనేల ?

తా. చంద్రముఖియైన దమయంతికి ఆ నలుడు ఇచ్చిన ఒక్క తామరదుద్దు ఆతడు చూపిన గౌరవముచే ఒక లక్ష పద్మములుగా భాసించెను. రాజు దయను పొందిన ఒక గవ్వయైనా అది ఒక లక్షతో సమానమేకదా ? ఇంక సందేహహించడం ఎందుకు?

**36 వ. అనంతరంబ విధి విశేషంబు సమాప్తింపం గోరి చకోరలోచనం గడకంట నీక్షించుచు నిషధాధ్యక్షుం డగ్నిహోత్రంబునకుం జని**

**37 తే. తన కరిష్టంబులగు కలి ద్వాపరముల**
**కేతు సూపియుఁబోలె ధాత్రీశ్వరుండు**
**నిత్య సత్త్రేత ఋత్విక్ప్రణీతయైన**
**త్రేత సేవించె విజిత మిత్రేతరుండు**

విజిత మిత్రేతరుండు = జయింపబడిన శత్రువులుకలవాడగు, ధాత్రీశ్వరుండు = నలుడు, నిత్య సత్త్రేత = ఎల్లప్పుడు యజ్ఞముతో కూడినదియు, ఋత్విక్ ప్రణీతయైన = ఋత్విజులచే మంత్రపూర్వకముగా ప్రజ్వలింప చేయబడినదియునైన, త్రేతన్ = అగ్నిత్రయమును (త్రేతాయుగమును), తనకు అరిష్టంబులగు = తనకు హానికరములైన, కలి ద్వాపరములకు, ఏతు చూపియున్ పోలె = అవమానము కలిగించునట్లువలె, సేవించెన్

తా. శత్రుంజయుడగు నలుడు సతతము యజ్ఞములతో కూడినదియు, ఋత్విజులచే ప్రజ్వలింపచేయబడినదియునైన అగ్నిత్రయమును తనకు హానికరములైన కలి ద్వాపరములకు అవమానము కలిగించునట్లువలె సేవించెను.

**38 తే. విభుఁడు ప్రాహ్ణేతనక్రియా విధి కలాప**
**మీ విధంబునఁ దీర్చి సద్భావ మొప్ప**
**భామినీ భావ జిజ్ఞాసఁ బాదపద్మ**
**యుగము నిశ్శబ్దముగ మెట్టు చొయ్య వచ్చె**

విభుడు = నలుడు, ప్రాహ్ణేతన క్రియావిధి కలాపము = వేకువను చేయవలసిన క్రియానుష్ఠాన పరంపరను, ఈ విధంబునన్ తీర్చి = ఈరీతిగా నెఱవేర్చుకొని, సద్భావము ఒప్పన్ = మంచి మనస్సుతో, భామినీ = దమయంతియొక్క, భావ జిజ్ఞాసన్ = మనసు తెలుసుకొను తలంపుతో, పాదపద్మయుగము = పద్మములవంటి తన రెండు పాదములను, నిశ్శబ్దముగన్ = చప్పుడు చేయకుండగ, మెట్టుచు = వేయుచు, ఒయ్యన్ వచ్చెన్ = మెల్లగా వచ్చెను.

తా. నలుడు వేకువను చేయవలసిన క్రియానుష్ఠాన పరంపరను ఈ రీతిగా నెఱవేర్చుకొని మంచి మనస్సుతో దమయంతియొక్క మనసును తెలుసుకొను తలంపుతో తన రెండు పాదములను చప్పుడుచేయకుండగ వేయుచు మెల్లగ సమీపించెను.

**39 ఉ. మిన్నక చేరవచ్చి యొక మేలపు మైవడిఁ బువ్వుఁబోడి క్రా**
**ల్గన్నులు మూసెఁ బాణికమలంబుల భూపతి నవ్వుచున్న యా**
**సన్న సఖీజనంబుఁ గనుసన్న నదల్చుచు నవ్వధూటి క్రా**
**ల్గన్నులఁ జేరలం గొలుచుకైవడిఁ గన్నుల నవ్వుదేఱగాన్**

భూపతి = నలుడు, మిన్నక = నిశ్శబ్దముగా, చేరవచ్చి = సమీపించి, కన్నుల, నవ్వుదేఱగాన్ = నవ్వుచు, నవ్వుచున్న, ఆసన్న = చేరువనున్న, సఖీజనంబున్, కనుసన్నన్, అదల్చుచు = అదుపుచేయుచు, ఆ వధూటి = ఆ దమయంతియొక్క, క్రాల్గన్నులన్ = చంచల నేత్రములను, చేరలన్, కొలుచు కైవడిన్ = కొలుచు రీతిగా, పవ్వుబోడి = దమయంతియొక్క, క్రాల్గనులు = చంచలనేత్రములను, మేలపు మైవడిన్ = నవ్వులాటకు, పాణి కమలంబులన్ = పద్మములవంటి చేతులతో, మూసెన్ (ఉత్ప్రేక్ష)

తా. నలుడు మెల్లగా సమీపించి నవ్వుచు కన్నులతో నవ్వుచున్న చెలికత్తెలను అదుపుచేయుచు ఆ దమయంతియొక్క చంచల నేత్రములను చేరలతో కొలుచువిధముగా నవ్వులాటకు తన రెండుచేతులతో మూసెను.

**40 తే. ఒక్క పూఁబోఁడి భ్రూసంజ్ఞ నొయ్యఁ బిలిచి**
**యాత్మ హస్తాధికార మయ్యబ్జవదన**
**హస్తముల కిచ్చి యెఱుఁగని యట్ల తాను**
**వసుమతీశుండు నగె నప్డె వచ్చినట్లు**

ఒక్క పూబోడిన్ = ఒక చెలికత్తెను, భ్రూసంజ్ఞన్ = కనుబొమల సంజ్ఞచే, ఒయ్యన్ = క్రమముగా, పిలిచి, ఆత్మ హస్తాధికారము = తన చేతులతో దమయంతి కన్నులను మూయు అధికారము, ఆ అబ్జవదన హస్తములకు ఇచ్చి, ఎఱుగని యట్ల, తాను, వసుమతీశుండు = రాజు, అప్డె = అప్పుడే, వచ్చినట్లు, నగె = నవ్వెను.

తా. నలుడు ఒక చెలికత్తెను కనుసైగతో పిలిచి తన చేతులతో దమయంతి కన్నులను మూయు అధికారమును

ఆమెకిచ్చి ఏమీ ఎఱగనట్లు తాను అప్పుడే వచ్చినట్లు నవ్వెను.

41 తే. **జ్ఞాత హస్తాంబుజాంతర స్పర్శ యగుటఁ**
**గైతవంబు నెపంబుగాఁ గమలనయన**
**మానసంబున మాన సంపద వహించె**
**నాననంబున వహియించె మౌనముద్ర**

జ్ఞాత హస్తాంబుజాంతర స్పర్శ యగుటన్ = తెలిసిన వేరొక పద్మమువంటి చేతి స్పర్శ యగుటను, కైతవంబు నెపంబుగాన్ = మోసముచేయాలనే వంకయని తెలిసి, కమలనయన = పద్మనేత్రి దమయంతి, మానసంబున = మనసునందు, మానసంపద = కోపముద్రను, వహించె, ఆననంబున = ముఖమున, మౌనముద్ర, వహియించెన్

తా. తెలిసిన వేరొక పద్మమువంటి చేతి స్పర్శయగుటను, మోసముచేయాలనే వంకయని తెలిసి దమయంతి మనసునందు కోపమును, ముఖమున మౌనముద్రను వహించెను.

42 చ. **కుటిల కటాక్ష వీక్షణముఁ గోమల నూత్న కపోలరాగముం**
**జటుల సమంచిత భ్రుకుటి సంవళనంబును జూచు వేడుకన్**
**జిటపొట రేఁచె రాజు సరసీరుహనేత్రకుఁ గామకేళికిన్**
**గటువులు గాని మానముల కావె ప్రదీపనసిద్ధిహేతువుల్**

రాజు = నలుడు, కుటిల కటాక్ష వీక్షణమునన్ = మోసపు క్రీగంటి చూపుతో, కోమల = మృదువైన, నూత్న = నవకమైన, కపోల = చెక్కిళ్ళయందలి, రాగమున్ = ఎఱుపుదనమును, చటుల = చలించునట్టివియును, సమంచిత = ప్రకాశించునవియు నగు, భ్రుకుటి = కనుబొమలయొక్క, సంవళనంబున్ = తిరుగుడును, చూచువేడుకన్ = చూడాలనే కోరికతో, సరసీరుహ నేత్రకున్ = దమయంతికి, చిటపటన్ = చిఱుకోపమును, రేచెన్ = పెంచెను, కాముకేళికిన్ = సురతమునకు, కటువులు కాని = వెగటయినవి కానట్టి, మానముల = ప్రణయకోపములే, ప్రదీపన సిద్ధి హేతువుల్ = కామోద్రేకమును కల్పించుటకు కారణములు, కావె = అగుచున్నవికదా!

తా. నలమహారాజు మోసపు క్రీగంటిచూపుతో మృదువైన, నవకమైన చెక్కిళ్ళయందలి ఎఱ్ఱదనమును, చలించు నట్టి, ప్రకాశించు కనుబొమలయొక్క తిరుగుడును చూడాలనే కోరికతో దమయంతి చిఱుకోపమును హెచ్చించెను. సురతమునకు వెగటయినవి కానట్టి ప్రణయకోపములే కామోద్రేకమును కల్పించుటకు కారణములగుచున్నవి కదా!

43 వ. **అప్పుడు నృపతి సామోపాయంబునం బ్రణయమానం బపనయింపఁ దలంచి యిట్లనియె.**

తా. అపుడు రాజు లాలనరూప ఉపాయముతో కృత్రిమమైన ఆ కోపమును పోగొట్ట తలచి ఇట్లు పలికెను.

44 ఉ. **దాస్యము నిన్న రే కుసుమధన్వుఁ డొకండును సాక్షిగా సరో**
**జాస్య వహించినాఁడ విను మప్పుడ మ్రొక్కుటలేదు నీకు వి**
**శ్వాస్యుడఁగాన మ్రొక్కుగొను స్వస్తటినీ సలిలాభిషేక సా**
**రస్య పవిత్రమస్తకము వ్రాల్చెద నీ పదయుగ్మకంబుపై**

సరోజాస్య = పద్మముఖీ!, విను, నిన్న రే = నిన్న రాత్రి, కుసుమధన్వుడు ఒకండును సాక్షిగాన్ = మన్మథుడొక్కడే సాక్షికాగా, దాస్యము వహించినాడన్ = నీకు సేవను చేసినాను, అప్పుడు = అలా సేవచేయునపుడు, నీకు, మ్రొక్కుటలేదు = నమస్కరింపనైతిని, విశ్వాస్యుడన్ కాన = నమ్మదగినవాడను కనుక, స్వస్తటినీ = గంగానదియొక్క, సలిల = నీటిచే, అభిషేక = స్నానముయొక్క, సారస్య = సరసత్వముచే, పవిత్ర మస్తకము = పరిశుద్ధమైన తలను, నీ పదయుగ్మకంబుపైన్ = నీ పాదముల జంటపై, వ్రాల్చెదన్, మ్రొక్కు కొను = నమస్కారమును స్వీకరింపుము.

తా. ఓ పద్మముఖీ! విను. నిన్న రాత్రి మన్మథుడు ఒక్కడే సాక్షికాగా నీకు సేవ చేసినాను. అప్పుడు నీకు మ్రొక్కడం జరుగలేదు. నమ్మదగినవాడను కనుక గంగానదిలో స్నానమాచరించిన పరిశుద్ధ శిరస్సును నీ పాదములపై ఉంచుతున్నాను. నా నమస్కారమును స్వీకరించుము.

45 తే. **కుటిలమగు నీ కటాక్షంబు కువలయాక్షి**
**యించుకించుక నామీఁద నెఱ్ఱబాఱి**
**నిగిడి మరలిన భావంబు నిజము తెలిసె**
**శ్రవణ కూప నిపాతైక శంకఁజూవె**

కువలయాక్షి = కలువనేత్రీ!, కుటిలమగు = వక్రమైన, నీ కటాక్షంబు = నీ కడకంటి చూపు, ఇంచుక ఇంచుక = కొంచెము కొంచెము, నామీదన్, ఎఱ్ఱబాఱి = ఎఱ్ఱదనము వహించినదై, నిగిడి = నాపై పడి, మరలిన భావంబు = మరలిన రీతియొక్క, నిజము = సత్యము, తెలిసెన్, శ్రవణ కూప = చెవులనెడి నూతులందు, నిపాత = పడుటయనెడి, ఏక = ముఖ్యమైన, శంకన్ చూవె = జంకుచేతనే సుమా!(ఉత్ప్రేక్ష)

తా. ఓ దమయంతీ! వక్రమైన నీ కడకంటి చూపు కొంచెము కొంచెము నా మీద కోపము వహించినదై నాపై పడి మరలినట్టి విధానము నాకు నిజమును తెలిపెను. నీ చూపులు చెవులనెడి నూతులందు పడిపోతామనే ప్రధానమైన జంకుచేతనేసుమా!

46 క. **లేయెండ వేఁడియయ్యుం**
**దోయజ షండముల కింపు దొలఁకించు క్రియన్**
**నీ యలుక పరుసనయ్యును**
**నా యెడఁదకు వేడ్కసేయు నలినదళాక్షీ !**

నలినదళాక్షీ = తామరరేకులవంటి కన్నులుకలదానా !, లే ఎండ = లేత ఎండ, వేడి అయ్యున్, తోయజ షండములకు = తామర గుబురునకు, ఇంపున్ = ప్రీతిని, తొలకించు క్రియన్ = కురిసెడు విధముగా, నీ అలుక = నీ ప్రణయ కోపము, పరుసనయ్యును = తీవ్రమైనదైనప్పటికిని, నా ఎడదకున్ = నా మనస్సునకు, వేడ్క చేయున్ = సంతోషమునే కలిగించును.

తా. ఓ దమయంతీ ! లేతయెండ వేడిదయినా తామర గుబురునకు ప్రీతిని వర్షించు విధముగా నీ ప్రణయ కోపము తీవ్రమైనదైనప్పటికిని నా మనస్సునకు సంతోషమునే కలిగించును.

47 తే. **చివురుఁ గెమ్మోవి చిఱుగాటు నెవము గాఁగఁ**
**దామరసనేత్ర ! కోపింపఁ దగదు మమ్ము**
**ఫల రసాస్వాద మొనరించు చిలుక మీఁద**
**బింబవల్లీమతల్లి కోపింపనట్లు**

తామరసనేత్ర = దమయంతీ, చివురు కెమ్మోవి = చిగురువంటి ఎఱ్ఱని పెదవియందు, చిఱుగాటు = చిన్నగాటు, నెవము కాగన్ = వంకతో, ఫలరస ఆస్వాదము = పండ్లరసమును అనుభవించుటను, ఒనరించు = చేయు, చిలుక మీద, బింబ వల్లీమ తల్లి = చక్కని దొండతీగ, కోపింపనట్లు , మమ్ము, కోపింపన్, తగదు.

తా. దమయంతీ ! చిగురువంటి ఎఱ్ఱని పెదవియందు చిన్నగాటు వంకతో పండ్లరసముననుభవించు చిలుకమీద దొండతీగ కోపింపనట్లు మాపైన కోపింపకుము.

48 తే. **ఉవిద నీమాట వినవొల్ల మూరకుందు**
**కాదనక వింటి మేనేమి కారణంబొ**
**రాజకీరము మము నిష్ఠురంబులాడుఁ**
**బ్రతిదినంబును బరుసుగాఁ బలుకు వీణ**

ఉవిద = దమయంతీ !, నీ మాట, వినన్, ఒల్లము = ఇష్టపడము, కాదనక = అట్లు కాదని, వింటిమేని = విన్నచో, ఏమి కారణంబో = ఏ కారణమో తెలియదు కాని, రాజకీరము = రామచిలుక, మమున్, నిష్ఠురంబులు ఆడు = నిందించును, ప్రతిదినంబును, వీణ, పరుసుగాన్ = కఠినముగా, పలుకున్

తా. దమయంతీ ! నీ మాట వినుటకు మేము ఇష్టపడము. అలా కాదని వింటే, ఏం కారణమో తెలియదు కాని రామచిలుక మమ్మల్ని నిందిస్తుంది. ప్రతిరోజూ వీణ కఠినంగా పలుకుతుంది.

49 వ. **అని వెండియు రసావేశంబున**

50 తే. **చూడవేటికి నిడువాలు సోగమీల**
**సూడు పట్టంగఁ జాలెడి చూపుఁ గొనలఁ**
**బలుకు పలుకున నమృతంబు చిలుకుచుండఁ**
**బలుకవేటికిఁ జిలుకల కొలికికాన**

నిడువాలు సోగమీలన్ = మిక్కిలి పొడవైన కోలచేపలను, సూడు పట్టంగన్ = విరోధించుటకు, చాలెడి = సమర్థములైన, చూపు కొనలన్ = కడ కన్నులతో, పలుకు పలుకున అమృతంబు చిలుకుచుండన్, చిలుకల కొలికికాన = నా ముద్దుల సుందరీ!, ఏటికి పలుకవు ?

తా. మిక్కిలి పొడవైన కోలచేపలను విరోధించుటకు సమర్థములైన కడ కన్నులతో, మాట మాటకు అమృతము చిలుకుచుండగా నా ముద్దుల సుందరీ ఏల పలుకవు?

51 శా. **కోపంబింతయు నుజ్జగించి సుమనః కోదండ నారాచ ధా**
**రా పాణింధమమైన నీ ధవళ నేత్రజ్యోత్స్న పైఁజల్లవే**
**తాపం బారఁగఁ గౌఁగిలించుకొనవే తథ్యంబు నీ బంటనే**
**యో పుంస్కోకిలవాణి ! యో శశిముఖీ ! యో పక్వ బింబాధరా !**

ఓ పుంస్కోకిలవాణి = మగకోయిల కంఠస్వరముకలదానా !, ఓ శశిముఖీ = ఓ చంద్రవదనా !, ఓ పక్వ బింబాధరా = పండిన దొండపండువంటి పెదవి కలదానా !, కోపంబు = కోపమును, ఇంతయున్ = కొంచెము, ఉజ్జగించి = విడిచి, సుమన:కోదండ = మన్మథునియొక్క, నారాచధారా = బాణ పరంపరకు, పాణింధమమమైన = ప్రేరకమైన, నీ ధవళ నేత్ర

జ్యోత్స్న = నీ తెల్లని నేత్రముల వెన్నెల, పైన్ = నాపైన, చల్లవే, తాపంబు = మదనతాపము, ఆరగన్ = పోవునట్లు, కౌగలించుకొనవే, నీ బంటనే = నీ సేవకుడనే, తథ్యంబు = ఇది నిజము.

తా. మగకోయిల కంఠస్వరముకలదానా ! ఓ చంద్రవదనా ! ఓ పండిన దొండపండువంటి పెదవి కలదానా ! కోపమును కొంచెము తగ్గించి మన్మథుని బాణపరంపరకు ప్రేరకమైన నీ తెల్లని నేత్రకాంతిని నాపైన చల్లవే ! మదనతాపము పోవునట్లుగ కౌగలించుకొనవే ! నీ సేవకుడనే ! ఇది నిజము.

**52 మ. విసమౌచున్నది కాలయాపనము నువ్విళ్ళూరెడిన్ భావముల్**
**రసభంగంబగు మానరోష మతి దీర్ఘంబయ్యెనే నింతటన్**
**బ్రసభాలింగన పూర్వకంబుగ మనోరాగంబు రెట్టింపఁగా**
**ణిసిధాత్వర్థ మనుగ్రహింపఁగదవే నీరేజపత్రేక్షణా !**

నీరేజపత్రేక్షణా = దమయంతీ !, కాలయాపనమున్ = ఆలసించుటను, విసము ఔచున్నది, భావముల్ = కోరికలు, ఉవ్విళ్ళూరెడిన్ = త్వర పడుచున్నవి, మానరోషము = పొలయలుక, అతి దీర్ఘంబయ్యెనేని, రసభంగంబగు, ఇంతటన్ = ఇంక, మనోరాగంబు రెట్టింపగాన్ = మనసులోని ప్రేమ రెట్టింపవునట్లుగా, ప్రసభ ఆలింగన పూర్వకంబుగ = బలాత్కారంపు కౌగిలి మున్ను కలుగునట్లుగా, ణిసిధాత్వర్థము = చుంబనమును, అనుగ్రహింపగదవే = దయచేయవే !

తా. దమయంతీ ! ఆలసించుట విషమౌచున్నది. కోరికలు త్వరపెట్టుచున్నవి. పొలయలుక అతి దీర్ఘమయితే రసభంగమవుతుంది. ఇంక మనసులోని ప్రేమ రెట్టింపవునట్లుగా బలాత్కారపు కౌగిలి ముందు కలుగునట్లుగా చుంబనమును ఒసంగుము.

**53 వ. అని పలికి బలిమిన యాలింగనంబు సేసి తల్పంబునకుఁ దార్చి**

**54 తే. పతి కళావతియనుదానిఁ బద్మనయన**
**దమ సహోదరి గారాపు దాది కూఁతు**
**నంతికమునకు రప్పించి యాదరించి**
**నర్మసాక్షిణిఁ గావించి నగుచుఁ బలికె**

పద్మనయన, కళావతి, అనుదానిన్, దమ సహోదరి = దమయంతి, గారాపు = ప్రియమైన, దాది కూతున్, పతి = రాజు, అంతికమునకు = దగ్గరకు, రప్పించి, ఆదరించి, నర్మసాక్షిణి గావించి = క్రీడయందు సాక్షిగానుంచుకొని, నగుచు = నవ్వుచు, పలికెన్

తా. పద్మనేత్రియైన కళావతి యనుదానిని దమయంతికి ప్రియమైన చెలికత్తెను దాదికూతురును చెంతకు రప్పించి ఆదరముతో తమ క్రీడకు సాక్షిగానుంచుకొని నవ్వుచు ఇట్లు పలికెను.

**55 వ. కళావతీ ! నీవు నిగారంపు మాటలాడం బ్రోడవని విందుము. నీ వెఱుంగని పాడిపంతంబులు లేవు. తగవు దప్పక చెప్పెదేని గొన్ని మాట లడిగెదము. మాటలాడక విచారించి యుత్తరం బిమ్ము.**

తా. కళావతీ ! నువ్వు చమత్కారముగా మాటలాడుటయందు నేర్పరివని వింటిమి. నీకు తెలియని న్యాయము కొరకు చేయు ప్రతినలు లేవు. ధర్మము తప్పక చెబుతానంటే కొన్ని మాటలు అడుగుదుము. ఊరికే మాటలాడక ఆలోచించి సమాధానము ఇమ్ము.

**56 తే. అన్యపురుషునిఁ గలలోననైనఁ దలఁప**
**దాత్మలో నంద్రు మీ విదర్భాత్మజాత**
**యన్యపురుషుండు గాఁడె పుష్పాయుధుండు**
**వనిత దన యాత్మలోన నెట్లుంచెఁ జెపుమ**

మీ విదర్భాత్మజాత = మీ విదర్భ రాజకుమారి, కలలోనైనన్, అన్యపురుషుని, ఆత్మలోన్, తలపదు, అంద్రు = అంటారు, పుష్పాయుధుండు = మన్మథుడు, అన్యపురుషుండు కాడె, వనిత = దమయంతి, తన ఆత్మలోనన్, ఎట్లుంచె, చెపుమ= చెప్పు

తా. మీ విదర్భరాజకుమారి కలలోకూడా అన్యపురుషుణ్ణి మనసులోనైనా తలచదంటారుకదా ! మరి మన్మథుడు పరాయి పురుషుడే కదా ! అతనిని దమయంతి తన మనస్సులో ఎలా ఉంచుకుంది చెప్పు.

**57 వ. అని యడిగిన నది యిట్లనియె.**

**58 తే. వనిత హృదయంబులో నున్న వాడ వీవు**
**నీ ప్రతిచ్ఛాయ మదనుండు నృపవరేణ్య**
**యట్లు గాకున్న నశరీరియైన యతఁడు**
**పుణ్యశుభమూర్తి దేవరఁ బోలుటెట్లు**

నృపవరేణ్యా = ఓ నలరాజా !, వనిత హృదయంబులోన్ = దమయంతి మనసులో, ఉన్నవాడవు, ఈవు = నీవు, నీ ప్రతిచ్ఛాయ

= నీ ప్రతిబింబమే, మదనుండు, అట్లు కాకున్న = అలా కాకపోతే, అశరీరియైన యతడు = శరీరము లేని యతడు, పుణ్య శుభమూర్తి = పవిత్ర మంగళరూపునిగ, దేవరన్ = ప్రభువువారిని, పోలుట ఎట్లు = పోలియుండడం ఎలాకుదురుతుంది?

59 వ. **అనిన నృపాలుం డిట్లనియె.**

60 తే. **తోఁకచుక్కలఁ బోలు దృక్తోయజముల**
**వెలితి లేకుండ మీబోఁటి చెలులఁ జూచుఁ**
**గాంత వీక్షింప దరగంటఁగాని మమ్ము**
**నేము చేసిన యపరాధ మేమి చెపుమ**

తోకచుక్కలన్ పోలు, దృక్ తోయజములన్ = పద్మనేత్రములతో, వెలితి లేకుండన్ = కొంచెం కూడా లోపం కలుగకుండా, మీ బోటి = మీ స్నేహితురాలు, చెలులన్ చూచున్ = చెలికత్తెలను చూస్తుంది, కాంత = దమయంతి, మమ్మున్ = మమ్మల్ని, అర కంట కాని, వీక్షింపదు = చూడదు, ఏము = మేము, చేసిన, అపరాధము, ఏమి చెపుమ = ఏమిటో చెప్పు.

తా. తోకచుక్కలను పోలిన పద్మనేత్రములతో కొంచెంకూడా లోపం లేకుండగా మీ స్నేహితురాలు తన చెలికత్తెలను చూస్తుంది. మమ్మల్ని మాత్రం అరకంటకాని చూడదు. మేము చేసిన నేరమేమిటో చెప్పు.

61 క. **భూపాల ! మెఱుఁగుఁ బోఁడుల**
**చూపులకున్ డాయు నీదు సొబగట్లగుటన్**
**మా పిన్నది యినువింతల**
**చూపుల నరగంట వెఱచుచున్ నినుఁ జూచున్**

భూపాల = ఓ రాజా !, మెఱుగుబోడుల చూపులకున్ = స్త్రీల చూపులకు, నీదు సొబగు = నీ సౌందర్యము, డాయున్ = అంటుకొనిపోవును, అట్లగుటన్ = ఆ కారణమున, మా పిన్నది = మా చిన్నది, ఇను వింతల = రెట్టించిన ఆశ్చర్యముతో కూడిన, చూపులన్ = చూపులతో, వెఱచుచున్ = భయపడుచు, నినున్, అరకంట, చూచున్.

తా. ఓ రాజా ! స్త్రీల చూపులకు నీ సౌందర్యము అంటుకొని మరలిపోవు. ఆ కారణమున మా చిన్నది రెట్టించిన ఆశ్చర్యముతో కూడిన చూపులతో భయపడుచు అరకంట మాత్రమే చూస్తోంది.

62 క. **కలకంఠి తనకు వలసినఁ**
**గలికీ యని నిన్నుఁ బిలుచుఁ గల మధురముగా**
**నల యను రెండక్షరములు**
**పలుకఁగ నాలుకకు నెంతొ భారంబొ కదా !**

కలకంఠి = మనోహరమైన కంఠముకల దమయంతి, తనకు వలసినన్ = తను కావాలనుకుంటే, కలికీ యని = ఓ కాంతా అని, కల మధురముగా = అవ్యక్త మధురముగా, నిన్నున్ పిలుచున్, నల అను రెండు అక్షరములు, పలుకగన్ = పలుకుటకు, నాలుకకు, ఎంతో భారంబొ కదా = ఎంతో కష్టం కదా !

తా. మనోహరమైన కంఠముకల దమయంతి తను కావాలనుకుంటే కలికీ అని ఎంతో మధురముగా నిన్ను పిలుస్తుంది. కాని నల అనే రెండక్షరములు పలుకడానికి నాలుకకి చాలా భారమైపోతోంది.

63 తే. **మగువ దేవర దివ్యనామము జపించు**
**నెమ్మనమ్మున నిత్య వ్రతమ్ము గాఁగ**
**నచ్ఛముక్తా ఫలైకావళి చ్ఛలమునఁ**
**జన్నుఁగవ నక్షసూత్రంబు సంతరించి**

మగువ = దమయంతి, అచ్ఛ = స్వచ్ఛమైన, ముక్తాఫల ఏకావళి = ముత్యాలహారమనెడి, ఛలమునన్ = మిషచేత, చన్నుగవన్ = స్తనముల జంటపై, అక్షసూత్రంబున్ = జపమాలను, సంతరించి = ధరించి, నెమ్మనమునన్ = నిండు మనసున, నిత్య వ్రతమ్ము కాగన్ = ప్రతిరోజు వ్రతమగునట్లుగా, దేవర దివ్యనామము = ప్రభువుల దివ్యమైన నామమును, జపించు = జపించుచున్నది.

తా. దమయంతి ముత్యాలహారమనెడి వంకతో స్తనములపై జపమాలను ధరించి నిండు మనసుతో నిత్య వ్రతమగునట్లుగా ప్రభువుల దివ్యనామమును జపించుచున్నది.

64 వ. **అనిన నలుం డిట్లనియె**

65 చ. **మదగజరాజ కుంభముల మచ్చరికించు చురోజకుంభముల్**
**గదిసి కలంత మేరయును గైకొనియున్నవి యెల్లవారికి**
**న్విదితముగాఁగ నిట్టితటి నీచెలి డెందమునందు నేనియున్**
**గదలక మాకు నుండ నవకాశము లేదుగదే కళావతీ !**

కళావతీ !, మదగజరాజ కుంభములన్ = మదించిన ఏనుగు కుంభస్థలములను, మచ్చరికించుచు = ద్వేషించుచు, ఉరోజ కుంభముల్ = స్తన కుంభములు, కదిసి = విజృంభించి, ఎల్లవారికిన్, విదితముగాగ = స్పష్టమగునట్లుగా, కల అంత మేరయును = ఉన్నచోటునంతను, కైకొనియున్నవి = ఆక్రమించుకొని ఉన్నవి, ఇట్టి తఱి = ఇటువంటి సమయమున, నీచెలి డెందమునందు నేనియున్ = నీ చెలి మనసులోనైనను, కదలక = నిశ్చలముగా, మాకున్, ఉండన్, అవకాశము = చోటు, లేదుగదే = లేదుకదా !

తా. ఓ కళావతీ ! ఏనుగు కుంభస్థలములను ద్వేషించుచు దమయతి స్తనకుంభములు విజృంభించి చూచువారందరికి స్పష్టమగునట్లుగా ఉన్నచోటునంతను ఆక్రమించుకొనియున్నవి. ఇలాంటి సమయంలో నీ చెలి వక్షస్థలముపై నిర్మలముగా మాకు ఉండుటకు అవకాశము లేకపోవుచున్నది కదా !

**66 తే. రమణి హృదయంబునను మహారాజ వీవు**
**గరిమ విచ్చేసియుండిన కారణమున**
**దీని వక్షోరుహంబు లా లోన యుండ**
**నెడము లేకున్న మతికదా వెడలె వెలికి**

రమణి హృదయంబునను = దమయంతి మనసులో, ఈవు = నీవు, మహారాజవు, గరిమన్ = అతిశయముచే, విచ్చేసి యుండిన కారణమున = ప్రవేశించియున్న కారణంచేత, దీని వక్షోరుహములు = దీని స్తనములు, ఆ లోనన్ = ఆ మనసులో, ఉండన్ = ఉండుటకు, ఎడము లేకున్న = చోటు లేకపోవడంతో, వెలికి = బయటకు, వెడలె = వెళ్ళెను.

తా. దమయంతి మనసులో నీవు మహారాజవు. అతిశయంతో ఆమె మనసులో నీవు ప్రవేశించియున్న కారణంచేత దీని స్తనములు ఆ మనసులో ఉండడానికి చోటు లేకపోవడంచేత బయటకు వచ్చియున్నవి.

**67 వ. అని కళావతి రాజు నుద్దేశించి**

**68 ఉ. వంచన యింత లేక కర వాఁడి నఖంబుల నొక్కి నొక్కి నొ**
**ప్పించితి రెండు సేతులనుఁ బెద్దయు లావున నొత్తి యొత్తి పీ**
**డించితి విట్టి ఱా కటికి డెందము వానికి నీకుఁ గాదె మా**
**చంచలనేత్ర యొప్పుల కుచంబులు పయ్యెదలోన దాఁగెడిన్**

వంచన = కపటము, ఇంత లేక = కొంచెమైనను లేక, కరవాడి నఖంబులన్ = చేతుల వాడి గోళ్ళతో, నొక్కి నొక్కి, నొప్పించితి, రెండు చేతులను, పెద్దయు లావునన్ = శక్తి కొలది, ఒత్తి ఒత్తి, పీడించితివి, ఇట్టి = ఇటువంటి, ఱా కటికి డెందము వానికిన్ = ఱాయివలె కఠినమైన మనస్సుకలవానికి, నీకు కాదె = నీకు భయపడేకదా !, మా చంచలనేత్ర = మా దమయంతియొక్క ఒప్పుల కుచంబులు = అందమైన స్తనములు, పయ్యెదలోనన్ = పయిటలో, దాగెడిన్ = దాగుచున్నవి.

తా. కపటము లేకుండా వాడి గోళ్ళతో నొక్కి నొక్కి నొప్పించావు. రెండుచేతులతోను శక్తికొద్దీ ఒత్తియొత్తి పీడించావు. ఇటువంటి రాతివంటి మనసుకల నీకు భయపడేకదా ! మా దమయంతి స్తనములు పయిటలో దాగుకొనుచున్నవి.

**69 ఉ. ట్రుచ్చిలి గంధవారణ సమూహము కుంభ విలాస సంపదల్**
**ట్రుచ్చిలి మించు పయ్యెదల లోపల దాఁగుచునుండు నెప్డు మీ**
**నెచ్చెలికత్తె చన్నుఁగవ నీవు విచారము చేయుమా మదిన్**
**ట్రుచ్చుల గిట్టి పట్టుదురు నొంపుదు రేమన వచ్చు రాజులన్**

మీ నెచ్చెలికత్తె, చన్నుగవ, గంధవారణ సమూహము = మదపుటేనుగులయొక్క, కుంభ విలాస సంపదల్ = కుంభ స్థలముల కాంతిసంపదను, ట్రుచ్చిలి = హరించి, ట్రుచ్చిలి = వంచించి, మించు = అతిశయించు, పయ్యెదలలోపల, ఎప్డున్ = ఎల్లప్పుడు, దాగుచునుండున్, నీవు, మదిన్, విచారము చేయుమా = ఆలోచించుమా !, ట్రుచ్చులన్ = దొంగలను, గిట్టి పట్టుదురు = పైకొని పట్టుకొందురు, నొంపుదురు = మర్దింతురు, రాజులన్, ఏమనవచ్చు = ఏమంటాము?

తా. మీ చెలికత్తె స్తనములు మదపుటేనుగు కుంభస్థలముల కాంతిని దొంగిలించి, మోసంతో అతిశయించి పైటలో దాచేసుకున్నది. ఇపుడు నీవు నీ మనసులో ఆలోచించి చూడు. రాజులు దొంగలను పైకొని పట్టుకుంటారు, వాళ్లని మర్దిస్తారు కదా ! అందుకు రాజులని ఏమంటాము?

**70 వ. అని పలికి రాజు 'కళావతీ ! మా మాటలకుఁ బ్రత్యుత్తరంబులు పొసంగ నిచ్చితివి. మేలనవచ్చు. ఈ ప్రసంగం బిట్లుండె. నీ చెలికత్తియ నేఁడు మాతోడ నేలపలుకదు? నీవు చెవిఁజేరి మంతనంబుండి తదభిప్రాయం బెఱింగి మాకుం జెప్పుమా ! మెచ్చు గలదు'. అనినఁ బ్రసాదంబని మదనరాజకార్య షాడ్గుణ్య చక్రవర్తియగు నయ్యింతిం దమయంతిం జేరవచ్చి షడక్షీణ మంత్ర రహస్యంబున**

తా. అని పలికి రాజు 'కళావతీ ! మా మాటలకు సమాధానములు సరిగా ఇచ్చితివి. సెభాషనవచ్చును. నీ సంభాషణమును ఇట్లుంచుము. నీ స్నేహితురాలు ఇపుడు మాతో ఎందుకు మాటాడుటలేదు? నీవు ఆమె చెంతకు చేరి ఇష్టముగా మాటలాడి ఆమె అభిప్రాయమును తెలుసుకొని మాకు చెప్పుమా ! మేము మెచ్చుకుంటాము.' అనిన అనుగ్రహమని

మదనుని రాచకార్యములయొక్క ఆరు గుణములను నడుపుటలో సమర్థురాలైన ఆమె దమయంతిని సమీపించి ఇరువురి కంటె ఇతరులకు తెలియనట్టి రహస్య వచనమున (సంధి, విగ్రహ, యాన, ఆసన, ద్వైధీభావ, సమాశ్రయములు షడ్గుణములు)

71 మ. **వరివస్యా నియమం బఖండితముగా వాత్స్యాయనీయాదిక**
**స్మర శాస్త్రంబులు వింటి నాముఖమునన్ జాణండు నీ భర్త నే**
**ర్పరివై చిత్తము కీలెఱింగి సురత ప్రాగల్భ్యముల్ చూపితే**
**సరసీజానన ! యన్న నుగ్మలి వయస్యన్ వ్రేసెఁ గెందామరన్**

సరసీజానన = పద్మమువంటి ముఖముకల ఓ దమయంతీ !, వరివస్యా నియమంబు = శుశ్రూష నియమము, అఖండితముగాన్ = అవిచ్ఛిన్నముగా, వాత్స్యాయనీ యాదిక స్మరశాస్త్రంబులు = వాత్స్యాయన మునిప్రోక్త కామ శాస్త్రములు, నా ముఖమునన్ = నా ద్వారా, వింటి = వినియున్నావు, నీ భర్త, జాణండు = నేర్పరి, నేర్పరివై = నేర్పుకలదానివై, చిత్తము కీలు = మనో రహస్యము, ఎఱింగి = తెలుసుకొని, సురత ప్రాగల్భ్యముల్ = రతియందు నేర్పును, చూపితే = చూపించినావా! అన్న = అనిన, ఉగ్మలి = దమయంతి, వయస్యన్ = చెలికత్తెను, కెందామరన్ = ఎఱ్ఱతామరతో, వ్రేసెన్ = కొట్టెను.

తా. 'ఓ దమయంతీ ! శుశ్రూషా నియమము అవిచ్ఛిన్నముగా వాత్స్యాయన కామశాస్త్రములు నాద్వారా విని యున్నావు. నీ భర్త ఆ శాస్త్రముల నేర్పరి. నీవును నేర్పుకలదానివై, నీ భర్త మనసు నెఱిగి రతియందు నేర్పును చూపించితివా!' అనగా దమయంతి తన చెలికత్తెను ఎఱ్ఱతామరతో కొట్టెను.

72 వ. **వ్రేసి యసూయా కుటిలంబగు కటాక్ష వీక్షణంబునం దర్జించె. ఇట్లు నిర్భర్త్సింపఁబడి వైదర్భిం జూచి రిత్త యలుక దెచ్చికొని యుపదేశ గురువనగు నాకు రతిరహస్య వార్త సెప్పవైతివి. ధూర్తవై నీవు సెప్పకుండుదువు గాకేమి? 'నా నేర్పున నీ మగనిచేతన చెప్పించెద. అటు చూడుమని మఱియునుం గొంత తడవు మంతనంబున్నయదియై శుద్ధాంత చారిణి మహీకాంతునితో నిట్లనియె.**

తా. కొట్టి, ఈర్ష్యచే వక్రమైన క్రీగంటి చూపుచే అదల్చెను. ఇట్లు అదల్పబడి దమయంతిని చూచి పొలయలుక తెచ్చుకొని 'ఉపదేశ గురువనగు నాకు రతిరహస్య విషయమును చెప్పకపోతివి. మోసగత్తెవై నీవు చెప్పకపోదువు గాక ఏమైంది? నా నేర్పున నీ మగనిచేతనే చెప్పిస్తాను. ఎలాగో చూడు' అని మఱికొంతసేపు సంభాషించినదై రాజుతో ఇట్లనెను.

73 తే. **అధిప ! వైదర్భి ధర్భాంకురాగ్రబుద్ధి**
**మన తలంపులఁ బోలదీ మగువ తలఁపు**
**బాల యనుచున్నవార మీ పద్మనయన**
**యిట్టి ప్రౌఢియుఁ గలదె? యే యింతులకును**

అధిప = రాజా ! వైదర్భి = దమయంతి, దర్భ అంకురాగ్ర బుద్ధి = దర్భమొనవలె వాడియైన బుద్ధికలది. మగువ తలను = దమయంతి ఆలోచన, మన తలంపులన్ = మన ఆలోచనలతో, పోలదు = సరిపడదు. ఈ పద్మనయనన్ = ఈ దమయంతిని, బాల అనుచున్నవారము = బాల అనుకొనుచున్నాము, ఏ ఇంతులకును = ఏ స్త్రీలకైనా, ఇట్టి = ఇటువంట, ప్రౌఢియు కలదె = నేర్పు కలదా? (ముగ్ధ, మధ్య, ప్రౌఢ – నాయికా లక్షణాలు)

తా. రాజా ! దమయంతి వాడియైన బుద్ధి కలది. కావున ఆమె ఆలోచన మన ఆలోచనలతో సరితూగదు. ఈ పద్మనయనను మనము ముగ్ధయనుకొనుచున్నాము. కాని ఏ స్త్రీలయందును ఇట్టి ప్రౌఢత్వము కలదా?

74 వ. **'ప్రణయ కోపంబులు రతి దీపనౌషధములు. పొలయలుకలు లేక మగవారికి మగువలు బ్రాఁతులు గారు. దీర్ఘంబులయ్యేనేని యవియే ప్రేమభంగ కారణములు. కావునఁ గోపం బింతమాత్రంబ చాలు' అని పలికి దేవర మాఱుగాఁ బాద ప్రణామంబు సేయంబోయి లీలాకమలంబున మొత్తువడితి. పడుదుఁగాకేమి? అమ్మత్తకాశిని చిత్తం బెఱింగి వచ్చితి నవధరింపుము.**

తా. 'ప్రణయ కోపములు కోరికరేపునట్టి ఔషధములు. పొలయలుకలు లేకపోతే మగవారికి స్త్రీలు ప్రియతమలు కారు. అవి దీర్ఘములైతే ప్రేమకు భంగములగుటకు కారణములగును. కావున కోపము ఇంతమాత్రము చాలును.' అని పలికి ప్రభువులకు బదులుగా నేను పాదములపై పడబోయి ఆమెచే పద్మమున కొట్టబడితిని. పడితేనేం? ఆ దమయంతి మనసు తెలుసుకొని వచ్చితిని. వినుము.

75 ఉ. **తా మది నమ్మకున్నది విదర్భనరేంద్ర తనూజ నిన్ను, సు**
**త్రాముఁడవంచు, నీయరమరంబునఁ బో మనసీదు నీకు, సు**
**త్రాముఁడు గాని వానికిఁ బ్రతాపమునం జదలేటి పైఁడి కెం**
**దామర పువ్వుఁ దే వశమె ధాత్రికి మాటలు వేయు నేటికిన్**

విదర్భనరేంద్ర తనూజ = దమయంతి, నిన్ను, తాన్ = తాను, మదిన్ = మనసునందు, నమ్మకున్నది, సుత్రాముడవంచున్ = ఇంద్రుడవేమోనని, ఈ అరమరంబునన్ పో = ఈ సందేహముచేతనే, నీకు, మనసు ఈదు = మనసిచ్చి మాటాడదు, వేయున్ మాటలు ఏటికిన్, సుత్రాముదు కాని వానికి = ఇంద్రుదు కానివానికి, ప్రతాపమునన్ = శౌర్యముతో, చదలేటి = ఆకాశగంగయందలి, కెందామర పువ్వున్, ధాత్రికి = భూమికి, తేన్ వశమె = వీలుపడునా?

తా. దమయంతి నిన్ను తాను మనసులో నమ్ముకున్నది. ఇంద్రుడవేమోననే సందేహముతో నీకు మనసు ఇవ్వలేకపోతోంది. వేయి మాట లెందుకు? ఇంద్రుడు కాకపోతే బలంతో ఆకాశగంగలోని కెందామరను భూమికి తేవడం వీలుపడుతుందా?

**76 క. దంభోళి భాగ్యరేఖా**
**దంభంబునఁ బ్రస్ఫుటముగ ధరియించెదు హ**
**స్తాంభోజమ్మున దేవర**
**జంభారివి యగుటకేల సందేహింపన్**

దేవర = ఓ నలరాజా !, నీవు, హస్తాంభోజమ్మున = పద్మమువంటి చేతియందు, భాగ్యరేఖా దంభంబున్ = భాగ్యరేఖ యనెడి మిషతో, దంభోళిన్ = వజ్రమును, ప్రస్ఫుటముగన్ = స్పష్టముగా, ధరియించెదు = ధరించినావు, జంభారివి అగుటకున్ = ఇంద్రుడవు అగుటకు, సందేహింపన్ ఏల = సందేహించుట ఎందులకు?

తా. ఓ నలరాజా ! నీవు చేతితో భాగ్యరేఖ యనెడి మిషతో వజ్రాయుధమును ధరించితివి. ఇక ఇంద్రుడవు అనుటకు సందేహమేముంది ?

**77 తే. లోకపాలుఁడ వస్వల్ప లోచనుఁడవు**
**వజ్రపాణివి దేవతావల్లభుండ**
**విన్ని లాంఛనములుఁ గూడ నింద్రుఁడౌదు**
**నైషధుండ వగుటకుఁ జిహ్నంబు చెపుమ**

లోకపాలుడవు, అస్వల్ప లోచనుడవు = అనేక నేత్రములుకలవాడవు, వజ్రపాణివి = వజ్రాయుధము హస్తమందు కలవాడివి, దేవతా వల్లభుండవు, ఇన్ని, లాంఛనములు = గుఱుతులు, కూడన్ = కూడుటచే, ఇంద్రుడు, ఔదు = అవుతావు, నైషధుండవు అగుటకున్, చిహ్నంబు = గుఱుతు, చెపుమ = చెప్పుము.

తా. లోకాల్ని పాలించేవాడవు, వేయి నేత్రములు కలవాడవు, వజ్రాయుధము ధరించేవాడవు, దేవతలకు ప్రభువువు, ఇన్ని గుఱుతులు కూడుటచే నువ్వు ఇంద్రుడవే అయివుంటావు. నీవు నలుడవైతే గుఱుతు చెప్పుము.

**78 వ. మాహేంద్రుం డింద్రజాల మాయావిదుండు. స్వయంవరంబునం దెట్లట్ల నలరూపధారియై వచ్చెనో యని శంకించుచున్నయది. మందాకినీ కాంచన కమల దానం బీ సందేహమునకు నిదానంబు.**

**79 ఉ. రోయఁడొకించుకేనియు మరుత్పతి యన్యకళత్ర దూషణా**
**న్యాయము సేయ మన్మథ మదాంధత నాశ్రమభూమిఁ గొక్కురో**
**కోయని కూయఁడే యతఁడు కుక్కుటమై నడిరేయి గౌతమ**
**ప్రేయసిఁ బొందఁగోరి తన పెద్దతనంబు జలంబు పాలుగాన్**

మరుత్పతి = ఇంద్రుడు, అన్య కళత్ర దూషణ అన్యాయము = పరస్త్రీలను పాడుచేయు పాపమను అన్యాయమును, చేయన్ = చేయుటకు, ఒకించుకేనియున్ = కొంచెమైనప్పటికిని, రోయడు = ఏవగించుకొనడు, అతడు, గౌతమ ప్రేయసిన్ = అహల్యను, పొందన్ కోరి, తన పెద్దతనంబు, జలంబు పాలుగాన్ = నీటిపాలగునట్లుగా, మన్మథ మదాంధతన్ = కామాతిశయముచే గుడ్డివాడై. ఆశ్రమభూమిన్ = గౌతముని ఆశ్రమభూమియందు, కుక్కుటమై = కోడియై, నడిరేయి = అర్థరాత్రి, కొక్కొరొకోయని కూయడే.

తా. ఇంద్రుడు పరస్త్రీలను పాడుచేయు పాపమను అన్యాయమును చేయుటకు కొంచెంకూడా అసహ్యించుకోడు. అతడు అహల్యను పొందుటకు తన పెద్దతనం నీటిపాలగునట్లుగా, కామపరవశచేత గుడ్డివాడై గౌతముని ఆశ్రమభూమిని కోడియై కొక్కొరోకోయని కూసినాడుకదా !

**80 వ. నీవు తత్త్వ నైషధుండ వయితివేని, యనన్య సాక్షికంబులగు శయ్యా రహస్యంబు లుగ్గడించి యిప్పంకజాక్షి శంకాకలంకం బపనయింపు మనుటయు, మందస్మిత సుందర వదనారవిందుండై యయ్యిందుముఖి నుద్దేశించి పురందరుఁ డను సందేహంబు డిందుపడునట్లుగా మహీపురందరుం డిట్లనియె.**

తా. నీవు నిజముగా నలుడవే అయితే ఇతరులకు తెలియరాని పడక రహస్యములను చెప్పి ఈ దమయంతి సందేహ దోషమును పోగొట్టుము. అనగా చిఱునవ్వుతో అందమైన ముఖపద్మముకలవాడై ఆ దమయంతి నుద్దేశించి ఇంద్రుడనే సందేహం పోయేటట్లుగా భూదేవేంద్రుడు ఇట్లు పలికెను.

**81 తే. మఱచితే నెమ్మనమ్ములో మెఱుఁగుఁబోఁడి**
**ప్రథమ రతికేళి నతి పరిశ్రాంతిఁ బొంది**
**కూడ రెండవ రతికి నూల్కొనని నిన్ను**
**గ్రీష్మయామిని యని నిన్ను గేలిగొంటి**

ప్రథమ = తొలి, రతికేళిన్ = రతి క్రీడయందు, అతి పరిశ్రాంతిన్ పొంది = మిక్కిలి అలసిపోయి, రెండవ రతికి, కూడన్ = కలియుటకు, నూల్కొనని = సిద్ధపడని, నిన్ను, గ్రీష్మయామిని యని = వేసవి రాత్రియని, నిన్ను, గేలికొంటి = ఎగతాళి చేసితిని,

నెమ్మనమ్ములో = నిండు మనస్సులో, మఱచితే = మరిచిపోయావా ?

తా. తొలి రతిక్రీడయందు మిక్కిలి అలసిపోయిన నువ్వు రెండవ రతికి కూడుటకు సిద్ధపడకపోతే వేసవిరాత్రియని నిన్ను ఎగతాళి చేసినసంగతి మనసులో మరచిపోయావా?

**82 తే. నీవు మృదుశయ్యఁ గపటంపు నిద్రవోవ**
**నెలఁత కేల్దమ్మి యిడితి నీ నిమ్ననాభి**
**నప్పు డచ్చోటఁ బులకంబు లంకురింప**
**నంబురుహనాభివైన చందంబుఁ దలఁపు**

నెలత = ఓ కాంతా !, నీవు, మృదుశయ్యన్, కపటంపు నిద్రవోవన్, కేలు తమ్మి = హస్తపద్మమును, నీ నిమ్ననాభిన్ = నీ బొడ్డుక్రింద, ఇడితి = ఉంచితిని, అప్పుడు, ఆ చోట, పులకంబులు = రోమాంచము, అంకురింపన్ = కలుగగా, అంబురుహనాభివి ఐన = పద్మము నాభియందు కలదానవయిన (విష్ణుమూర్తివైన), చందంబు = రీతిని, తలపు = తలంపుము.

తా. ఓ దమయంతీ ! నీవు మెత్తనిపడకపై కపటనిద్రపోతున్నప్పుడు నేను నీ కోకముడిని విప్పుటకు నా చేతిని నీ బొడ్డుక్రింద పెట్టితిని. అప్పుడు అక్కడ రోమాంచము కలుగగా నీవు విష్ణుమూర్తివైన (కపట నిద్ర) రీతిని స్మరింపుము.

**83 ఉ. కామిని ! ఘర్మ బిందువులు గస్తురి బొట్టునఁ దోఁగి రేఖలై**
**కోమల గండపాళికల కోణములన్ దిగజాఱ నంచల**
**శ్యామలమైన యాత్మ వదనాబ్జముఁ జూతుగదే మదీయ చిం**
**తామణి దామ దర్పణమున న్నెఱిఁ దత్సమయోచితంబుగన్**

కామిని = ఓ తరుణీ !, ఘర్మ బిందువులు = చెమటచుక్కలు, కస్తురి బొట్టునన్, తోగి = కలిసి, రేఖలై = చాఱలై, కోమల = మృదువైన, గండ పాళికల కోణములన్ = చెక్కిళ్ళ ప్రదేశములందు, దిగజాఱన్, అంచల శ్యామలమైన = కొనయందు నల్లనైన, ఆత్మ వదనాబ్జమున్ = నీ ముఖపద్మమును, మదీయ = నాయొక్క, చింతామణి దామ దర్పణమునన్ = చింతామణి హారమనెడు అద్దమునందు, నెఱిన్ = చక్కగా, తత్ సమయోచితంబుగన్ = ఆ పురుషాయిత సమయమునకు తగినట్లుగా, చూతుగదే = చూచుకొంటివికదా !

తా. ఓ దమయంతీ ! చెమటచుక్కలు నీ కస్తూరిబొట్టుతో కలిసి చాఱలై మృదువైన చెక్కిళ ప్రదేశముల దిగజాఱగా కొనయందు నల్లనైన నీ ముఖపద్మమును నా చింతామణి హారమునందు చక్కగా ఆ వేళ చూసుకున్నావుకదా !

**84 తే. తరుణి యెఱుఁగవె వీటికా దానవేళ**
**గురుజన ప్రాంతమునయందు గూఢవృత్తి**
**నాగవల్లీ దళంబు నెన్నడుమఁ జీఱి**
**మడిచి యందిచ్చినపుడు గోరిడుదుఁ గేల**

తరుణి = దమయంతీ !, గురుజన ప్రాంతమునయందు = పెద్దవారు మనయొద్దనున్న సమయమునందు, వీటికా దాన వేళన్ = తములపాకులు చుట్టియిచ్చు సమయమున, నాగవల్లీదళంబున్ = తములపాకును, నెన్నడుమన్ = మధ్యకు, చీఱి = చీలిచి, మడిచి, అందిచ్చినపుడు = నాకిచ్చెడి సమయాన, గూఢవృత్తిన్ = వారికి తెలియని విధముగా, కేలన్ = నీ చేతియందు, గోరు ఇడుదున్ = నఖక్షతము చేయుదును, ఎఱుగవె = తెలియదా ?

తా. దమయంతీ ! పెద్దవారు మనయొద్దనున్న సమయమందు నీవు తములపాకులు చుట్టియిచ్చు సమయాన తములపాకు మధ్యకు చీలిచి, మడిచి నాకు అందిచ్చునపుడు వారికి తెలియకుండగా నీచేతియందు నఖక్షతము చేసితిని. తెలుసుకొనలేవా ?

**85 ఉ. మానిని ! భోజనావసర మధ్యమునం గొనియాడ గోస్తనిం**
**దేనియ సంస్తుతింప వినుతింపను మీఁగడ ఖండశర్కరా**
**పానక ముగ్గడింపఁ ప్రతిపక్ష చటూక్తి నిసర్గ రోష ర**
**క్తాననమైన నీ యధర మల్గునొయంచు మదిం దలంకుచున్**

మానిని = ఓ దమయంతీ !, భోజనావసర మధ్యమునన్ = భోజనకాల మధ్యలో, ప్రతిపక్ష = తనకు శత్రువులైన ద్రాక్షాదులను, చటూక్తి = నుతించుటచే, నిసర్గ = స్వాభావికమైన, రోష = కోపముచే, రక్తాననమైన = ఎఱ్ఱని ముఖము కలదైన, నీ అధరము, అల్గునొ యంచు = కోపించునేమోయని, మదిన్, తలంకుచున్ = భయపడుచు, గోస్తనిన్ = ద్రాక్షను, కొనియాడను = నుతింపలేదు, తేనియన్ = తేనెను, సంస్తుతింపను, మీగడన్, వినుతింపను, ఖండ శర్కరా పానకమున్ = కండ చక్కెర పానకమును, ఉగ్గడింపన్ = పొగడను,

తా. ఓ దమయంతీ ! భోజన సమయంలో తనకు శత్రువులైన ద్రాక్షాదులను నుతించుటచే సహజంగా కోపముచేత ఎఱ్ఱనైన ముఖముగల నీ అధరము కోపించునేమోయని మనసులో భయపడుచు ద్రాక్షను, తేనెను, మీగడను, కండ చక్కెర పానకమును నుతింపను.

86 తే. **ఆననం బాదిగా నాభి యవధిగాఁగఁ**
**బ్రేమ భవదంగకములు చుంబించునపుడు**
**చరమ చుంబన వేళ నో సరసిజాక్షి**
**యేను చక్కిలి గిలిగింత లిడుటఁ దలఁతె**

ఆననంబు ఆదిగా = ముఖము మొదలుకొని, నాభి అవధి కాగన్ = నాభి హద్దువరకు, భవత్ అంగకములు = నీ శరీరమును, ప్రేమన్, చుంబించునపుడు = ముద్దిడునపుడు, చరమ చుంబన వేళన్ = చివరి ముద్దు సమయంలో, ఓ సరసిజాక్షి = ఓ దమయంతీ !, ఏను = నేను, చక్కిలి గిలిగింతలు, ఇడుటన్, తలతె = తలచెదవా ?

తా. ఓ దమయంతీ ! నీ ముఖము మొదలుకొని నాభి వరకు నీ శరీరమును నేను ముద్దిడునపుడు, చివరి ముద్దు సమయంలో నేను నీ చక్కిలి గిలిగింతలిడుట తలచెదవా ?

87 మ. **అని సంకల్పభవైక సాక్షులగు శయ్యానేక సంభోగ చి**
**హ్నానలన్ భూపతి ప్రత్యభిజ్ఞ కొఱకై యందంద వాక్రువ్వ, న**
**వ్వనితారత్నము వాలుఁగన్నులఁ బతి న్వారించుచు న్మూసె నొ**
**య్యన ధాత్రేయి శ్రుతి ద్వయంబు నిజ హస్తాంభోజయుగ్మంబునన్**

భూపతి = నలుడు, ప్రత్యభిజ్ఞ కొఱకై = ఆనవాలు నిమిత్తము, అని = ఈ ప్రకారముగా, సంకల్ప భవైకసాక్షులగు = మన్మథు డొక్కడే సాక్షిగాకలవగు, శయ్యా = శయ్యాసంబంధులగు, అనేక, సంభోగ చిహ్నానలన్ = రతి చిహ్నములను, అందంద = వాటిని వాటిని, వాక్రువ్వన్ = చెప్పుచుండగా, ఆ వనితారత్నము, వాలు కన్నులన్ = కళ్ళు పెద్దవిచేసి, పతిన్ వారించుచున్, ఒయ్యనన్ = మెల్లగా, నిజహస్తాంభోజ యుగ్మంబునన్ = తన రెండు పద్మములవంటి చేతులతో, ధాత్రేయి = దాది కూతురగు కళావతియొక్క శ్రుతి ద్వయంబు = రెండు చెవులను, మూసెన్

తా. నలుడు ఆనవాలు నిమిత్తము ఈ ప్రకారంగా మన్మథుడొక్కడే సాక్షిగాగల శయ్యా సంబంధమగు అనేక రతి చిహ్నములను వాటిని వాటిని చెప్పుచుండగా ఆ దమయతి కళ్ళు పెద్దవిచేసి భర్తను వారించి, మెల్లగా తన రెండు చేతులతో కళావతి చెవులను మూసెను.

88 వ. **ఇట్లు లజ్జా వశంబునం దన వీనులు మూసిన**

89 తే. **అధిప ! తాటంక చక్ర ధారాంచలములు**
**వాఁడు లతికోమలములు పూఁబోఁడి చేతు**
**లొయ్య నేతెంచి శ్రుతి రోధ ముడుప నీకు**
**నర్హ మాయాస మైనను నయ్యెఁగాని**

అధిప = నలరాజా !, తాటంక చక్ర ధారాంచలములు = చక్రములవంటి నా చెవికమ్మల కొట్టకొనలు, వాడులు = కఱకయినవి, పూబోడి చేతులు, అతి కోమలములు, ఆయాసమైనను = ప్రయాసము ఐనను, అయ్యెన్ కాని = ఐనప్పటికిని, ఒయ్యన్ = మెల్లగా, ఏతెంచి = వచ్చి, శ్రుతి నిరోధము = చెవులను మూయుటను, ఉడుపన్ = మాన్పుట, నీకు, అర్హము = తగినది.

తా. ఓ నలరాజా ! చక్రములవంటి నా చెవికమ్మల కొట్టకొనలు కఱకయినవి. దమయంతి చేతులు మిక్కిలి మృదువైనవి. ప్రయాసమైనను మెల్లగావచ్చి నా చెవులను మూయుచున్నది. నీవే ఆపవలయును.

90 వ. **అనిన విని 'మాన్యురాలవు. నీ మాట యతిక్రమింప వచ్చునే?' యనుచు నమ్మచ్చెకంటిం గ్రుచ్చి కౌఁగలించుకొని శయ్యాతలంబునకుం దెచ్చి, ముచ్చటవోవం జెక్కుటద్దంబులు ముద్దువెట్టుకొనియె. నయ్యవసరంబున సమీప కక్ష్యాంతరంబున నుండి వైతాళిక పురంధ్రి యుచ్చైస్స్వరంబున**

91 సీ. **అవధారు దేవ మధ్యాహ్న సంధ్యావేళ**
**దిన యౌవనంబు దోఁతెంచె నిప్పు**
**డతి తీవ్రతాప తప్తాంగియై మేదిని**
**భవ దాప్లవనవాః పిపాసువయ్యె**
**మార్తాండమండలీ మధ్య భాగంబున**
**నీ డెందమునఁ బోలె నిలిచె శివుఁడు**
**నిష్ప్రతీపంబైన నీ ప్రతాపంబుతో**
**హెచ్చు కుందాడె బీరెండ వేఁడి**

తే. **నీల నీలంబులయిన నీ నిడుద నెఱుల**
**యందుఁ బ్రవహించు విమల గంగాంబుధారఁ**

**దలఁచుఁగాక కళిందజా సలిలవేణి**
**తరళతర వీచికా పూర్వ పరిచయంబు**

దేవ = ప్రభూ !, అవధారు = వినుము, దిన యౌవనంబు = దినముయొక్క మధ్యభాగము, తోతెంచెన్ = వచ్చెను, ఇప్పుడు, మధ్యాహ్న సంధ్యావేళ = మధ్యాహ్న సంధ్య చేయవలసిన సమయము, మేదిని = భూమి, అతి తీవ్ర తప్తాంగియై = మిక్కిలి వేడెక్కినదై, భవత్ = నీయొక్క, ఆప్లవనవా: = స్నానసంబంధియగు జలమును, పిపాసువయ్యెన్ = త్రాగగోరినది అయ్యెను, మార్తాండమండలీ = సూర్యమండలముయొక్క, మధ్యభాగంబున, శివుడు, నీ డెందమున పోలెన్ = నీ మనసునందు వలెనే, నిలిచెన్, నీప్రతీపంబైన = ఎదురులేని, నీ ప్రతాపంబుతోన్, బీరెండవేడి = మధ్యాహ్న ఎండ వేడి, హెచ్చుకుందాడెన్ = ఇంచుమించులాడుచున్నది, నీల నీలంబులయిన = మిక్కిలి నల్లనివగు, నీ నిడుద నెఱులయందున్ = నీ పొడుగైన కేశములందు, ప్రవహించు, విమల = స్వచ్ఛమైన, గంగాంబుధార = గంగానది జలధార, కళిందజా = యమునా నదియొక్క, సలిలవేణి = జలప్రవాహమందలి, తరళతర = మిక్కిలి చంచలమైన, వీచికా = కెరటములయొక్క, పూర్వ పరిచయంబు, తలచుగాక = స్మరించుకొనునుగాక. (సూర్యుడు ప్రాత:కాలమున బ్రహ్మాత్మకుడును, మధ్యాహ్నమున శివాత్మకుడును, సాయంకాలము నారాయణాత్మకుడునగునని చెప్పుదురు)

తా. ప్రభూ ! వినుము. దిన మధ్యభాగము అయినది. ఇప్పుడు మధ్యాహ్న సంధ్య చేయవలసిన సమయము. భూమి మిక్కిలి వేడెక్కినదై నీ స్నానసంబంధియగు జలమును త్రాగగోరుచున్నది. సూర్యమండలముయొక్క మధ్యభాగమున శివుడు నీ మనసునందువలెనే నిలిచియున్నాడు, ఎదురులేని నీ పరాక్రమముతో మధ్యాహ్నపు ఎండవేడి ఇంచుమించులాడు చున్నది. మిక్కిలి నల్లనివగు నీ పొడుగైన వెంట్రుకలందు ప్రవహించు స్వచ్ఛమైన గంగానది జలధారలు యమునానది యొక్క జలప్రవాహమందలి మిక్కిలి చంచలమైన కెరటములయొక్క పూర్వ పరిచయమును స్మరించుకొనుగాక.

92 వ. అని వైతాళిక పురంధ్రి పలికిన

93 తే. ధరణినాథుండు కేళిసౌధంబు డిగ్గి
జలకమింటికి నేతెంచె సమ్మదమున
నవసరము వేచియున్న నానావనిపులు
దవ్వు దవ్వుల నిలిచి వందనమొనర్ప

ధరణినాథుండు = రాజు, కేళి సౌధంబు డిగ్గి = క్రీడా సౌధమును దిగి, అవసరము = సమయముకొరకు, వేచియున్న = కాచియున్న, నానా అవనిపులు = పలువురు రాజులు, దవ్వు దవ్వులన్ = దూర దూరముననే, నిలిచి, వందనము ఒనర్ప, సమ్మదమున = సంతోషముగా, జలకము ఇంటికి = స్నానశాలకు, ఏతెంచెన్ = వచ్చెను.

తా. రాజు క్రీడా సౌధమును దిగి తన దర్శనముకొరకు వేచియున్న పలువురు రాజులు దూర దూరమునుండియే వందనమాచరించుచుండగా సంతోషముగా స్నానశాలకు వచ్చెను.

**94 తే. అంగుళిక్షేప లోచనాపాంగ భంగి**
**విభ్రమ భ్రూతరంగ సంవేల్లనముల**
**నాదరంబు ప్రసాదించి యవ్విభుండు**
**సకల నృపుల నిజనివాసముల కనిచె**

ఆ విభుండు = ఆ రాజు, అంగుళి క్షేప = వ్రేళ్ళు కదల్చుటచేతను, లోచనాపాంగ భంగిన్ = క్రీగంటి చూపులచేతను, విభ్రమ = విలాసముతోకూడిన, భ్రూతరంగ = కెరటములవంటి కనుబొమలయొక్క, సంవేల్లనములన్ = చలనములచేతను, ఆదరంబు ప్రసాదించి, సకల నృపతులన్ = అందఱు రాజులను, నిజ నివాసములకు, అనిచె = పంపివేసెను.

తా. ఆ రాజు వ్రేళ్ళు కదల్చుటచేతను, క్రీగంటి చూపులచేతను, విలాసముతోకూడిన కెరటములవంటి కనుబొమలు కదల్చుటచేతను ఆదరణమును చూపి రాజు లందఱను వారి వారి నివాసములకు పంపివేసెను.

**95 వ. అనిచి మజ్జనశాల కరిగి**

**96 తే. కలపములతోడి నవ యక్ష కర్దమమున**
**నలుఁగు వెట్టించుకొని రాజనందనుండు**
**మహిత మృగనాభిపంకంబు మౌళిఁదాల్చి**
**జలజలోచన లార్పంగ జలకమాడె**

రాజనందనుండు, కలపములతోడి = పరిమళద్రవ్యములతో, నవ యక్ష కర్దమమున = క్రొత్త నలుగుపిండితో, నలుగు పెట్టించుకొని, మహిత = శ్రేష్ఠమైన, మృగనాభిపంకంబు = కస్తూరిని, మౌళి తాల్చి = శిరసున ధరించి, జలజలోచనలు = పద్మలోచనలగు స్త్రీలు, ఆర్పంగన్ = స్నానమాడింపగా, జలకమాడె = స్నానముచేసెను.

తా. నలుడు పరిమళద్రవ్యములతో కూడిన క్రొత్త నలుగుపిండితో నలుగు పెట్టించుకొని శ్రేష్ఠమైన కస్తూరిని శిరసుకు రాసుకుని పద్మలోచనలగు స్త్రీలు జలకమాడింపగా స్నానముచేసెను.

**97 చ. మహిపతి భామినీకర సమంచిత కాంచనకుంభ తీర్థ వా**
**ర్లహరులు మూర్ధభాగమున వ్రాలఁగ నొప్పు విలోచనోత్సవా**
**వహమహనీయమూర్తియయి వారిజలోచన పాదతీర్థ వా**
**ర్లహరులు మూర్ధభాగమున వ్రాలఁగనొప్పు హిమాద్రికైవడిన్**

మహిపతి = రాజు, భామినీకర = స్త్రీల చేతులయందు, సమంచిత = ఒప్పుచున్న, కాంచన కుంభ = బంగారు కడవలందలి, తీర్థవార్లహరులు = పవిత్ర గంగాజలపు పెద్ద తరంగములు, మూర్ధభాగమునన్ = శిరసునందు, వ్రాలగన్ = పడుచుండగా, విలోచన = నేత్రములకు, ఉత్సవ ఆవహ = పండువును కలిగించునట్టి, మహనీయమూర్తియయి = దివ్య స్వరూపుడయి, వారిజలోచన = పద్మనేత్రుడగు విష్ణువుయొక్క, పాద = పాదమందుపుట్టిన, తీర్థ = గంగానదియొక్క, వార్లహరులు = నీటి తరంగములు, మూర్ధభాగమునన్ = శిరసునందు, వ్రాలగన్ = పడుచున్న, హిమాద్రి కైవడిన్ = హిమవత్పర్వతమువలె, ఒప్పున్ = ఒప్పుచుండెను.

తా. నలుడు స్త్రీ చేతులందొప్పుచున్న బంగారు కడవలలోని పవిత్ర గంగాజల తరంగములు శిరసుపై పడుచుండగా కనులకు పండుగను కలిగించునట్టి దివ్య స్వరూపుడయి విష్ణువుయొక్క పాదమందు పుట్టిన గంగానదియొక్క నీటి కెరటములు శిరసుపై పడునట్టి హిమవత్పర్వతమువలె భాసించెను.

**98 క. వ్యామగ్రాహ్య స్తనులగు**
**భామలు మును జలకమార్పఁ బదపడి నిషధ**
**స్వామికిఁ దీర్థం బార్చిరి**
**భూమీ నిర్జరులు మంత్రపూతాంబువులన్**

వ్యామ గ్రాహ్య స్తనులగు = బారతో పట్టుకొనదగిన స్తనములుకలవారగు, భామలు = స్త్రీలు, మును = ముందుగా, జలకమార్పన్ = స్నానముచేయించగా, పదపడి = తరువాత, భూమీ నిర్జరులు = బ్రాహ్మణులు, మంత్రపూత అంబువులన్ = మంత్రములచే పవిత్రమైన నీటిచే, నిషధస్వామికిన్ = నలునకు, తీర్థంబార్చిరి = స్నానముచేయించిరి.

తా. విశాలమైన స్తనములుకల స్త్రీలు ముందుగా నలుని స్నానము చేయించగా ఆపైన బ్రాహ్మణులు అఘమర్షణ మంత్రముల పవిత్రమైన నీటిచే స్నానము చేయించిరి.

**99 ఉ. అంతరకల్ప్యమాన చులుకాచమనంబుగ నైషధ క్షమా**
**కాంతుఁడు తీర్థమాడె మధుకైటభవైరి పదాంబుజోదరో**
**ద్వాంత మధూళియైన శుభవారి మహీదివిజు ల్వినిర్మల**
**స్వాంతులు చేరువన్నిలిచి వారుణసూక్తము లుచ్చరింపగన్**

వినిర్మల స్వాంతులు = మిక్కిలి స్వచ్ఛమైన మనసుకలవారగు, మహీదివిజులు = బ్రాహ్మణులు, చేరువన్ నిలిచి = సమీపమున నిలబడి, వారుణ సూక్తములు = వరుణదేవతాకమగు మంత్రములను, ఉచ్చరింపగన్ = చదువుచుండగా, మధుకైటభవైరి = విష్ణువుయొక్క, పదాంబుజ = పాదపద్మముయొక్క, ఉదర = గర్భమునుండి, ఉద్వాంత = నిర్గమించిన, మధూళియైన = మకరందరూపమైన, శుభవారి = పవిత్ర జలములచే, నైషధక్షమాకాంతుడు = నలమహారాజు, అంతర = స్నానమధ్యమున, కల్ప్యమాన = చేయబడిన, చులుక = పుడిసిటి జలముయొక్క, ఆచమనంబుగన్ = ఆచమనీయముగా, తీర్థము ఆడెన్ = స్నానము చేసెను.

తా. మిక్కిలి స్వచ్ఛమైన మనసుకలవారగు బ్రాహ్మణులు చెంత నిలబడి వారుణ సూక్తములను పఠించుచుండగా విష్ణువుయొక్క పాదమునుండి నిర్గమించిన మకరందరూప పవిత్రజలముచే నలమహారాజు స్నానమధ్యమున పుడిసిటి జలముతో ఆచమనీయము చేసి స్నానమాచరించెను.

**100 తే. కమల కింజల్కరేణు సంకాశమైన**
**గౌర మృత్స్నాద్రవం బంగకములఁ బూసి**
**తీర్థమాడె మహారాజు త్రిదశసింధు**
**పుణ్యజలముల సంకల్ప పూర్వకముగ**

కమల కింజల్క = పద్మ కేసరములయొక్క, రేణు = పరాగముతో, సంకాశమైన = సమానమైన, గౌర మృత్స్నాద్రవంబు = పచ్చని మేలయిన మట్టి ద్రవమును, అంగకములన్ పూసి = అవయవములందు పూసికొని, మహారాజు, త్రిదశ సింధు పుణ్య జలములన్ = గంగానదీ పవిత్ర జలములచే, సంకల్ప పూర్వకముగ = సంకల్పము చెప్పుకొని, తీర్థమ ఆడెన్

తా. పద్మకేసరముల పరాగముతో సమానమైన పచ్చని మేలయిన మట్టి ద్రవమును శరీరమునకు పూసికొని మహారాజు గంగా పవిత్ర జలములచే సంకల్పము చెప్పుకొని స్నానమాచరించెను.

**101 క. గర్భధృత హరిత కోమల**
**దర్భంబై యొప్పె ధరణిధవు హస్తము వై**

దర్భీ కుచయుగ విరహ హ
విర్భుగ్ధూమాంకురాభివృతముం బోలెన్

ధరణిధవు హస్తము = రాజు చేయి, గర్భ = అరచేయియందు, ధృత = ధరింపబడిన, హరిత = పచ్చని, కోమల = మృదువైన, దర్భంబై = దర్భలుకలదై, వైదర్భీ = దమయంతియొక్క, కుచయుగ = స్తనముల జంటయొక్క, విరహ = వియోగమనెడి, హవిర్భుక్ ధూమ = అగ్ని ధూమముయొక్క చిగుళ్ళచే, ఆవృతంబు పోలెన్ = ఆవరింపబడినదివలె, ఒప్పెన్ = ప్రకాశించెను.

తా. రాజుయొక్క అరచేతియందు ధరింపబడిన పచ్చని మృదువైన దర్భలు దమయంతియొక్క స్తనముల వియోగమనెడి అగ్నిధూమముయొక్క చిగుళ్ళచే ఆవరింపబడినట్లుగా ప్రకాశించెను. (అలంకారము – ఉత్ప్రేక్ష)

**102 తే.** మృదులతర గౌరమృద్బిందు వదనచంద్ర
చికుర శేషాంబు మౌక్తిక ప్రకర దశన
గురు పయఃకుంభ పృథుల వక్షోజకుంభ
పతి భజించె గంగాజలాప్లవన లక్ష్మి

మృదులతర = మిక్కిలి మెత్తనిదగు, గౌరమృత్ = పచ్చని మట్టియొక్క, బిందు = తిలకమనెడి, వదనచంద్ర = ముఖచంద్రుడు కలదియు, చికుర = కుంతలములందు, శేషాంబు మౌక్తిక ప్రకర = మిగిలిన నీటి ముత్యముల సమూహమనెడి, దశన = పలుకుదురుకలదియు, గురు = గొప్పవగు, పయఃకుంభ = నీటి కడవలనెడి, పృథుల = విరివియైన, వక్షోజకుంభ = స్తనకలశములుకలదియునగు, గంగాజలాప్లవన లక్ష్మి = గంగాజలమందు స్నానమనెడి లక్ష్మి, పతిన్ = నలుని, భజించెన్ = సేవించెను. (రూపకము)

తా. మిక్కిలి మెత్తనిదగు పచ్చని మట్టియొక్క తిలకమనెడు ముఖచంద్రుడు కలదియు, కుంతలములందు మిగిలిన నీటిముత్యముల సమూహమనెడి పలుకుదురుకలదియు, గొప్పవగు నీటి కడవలనెడి విరివియైన స్తనకలశములుకలదియునైన గంగాజలస్నానమనెడి లక్ష్మి నలుని సేవించెను.

**103 సీ.** సీమంత మేర్పడఁ జికుర భారమును సు
శ్లిష్ట బంధంబుగ శిఖ యమర్చి
గన్నేరు పూచాయఁ గనుపట్టు జిలుగైన
సలిల కాషాయ వస్త్రంబు గట్టి
చంద్రాతపముతోడ సరియైన వెలిపట్టుఁ
బుట్ట ముత్తరవాసముగ ధరించి
ప్రక్షాళితములైన పదియాఱు వన్నియ
కనకంపు గొడుగుఁ బాగాలు దొడిగి

**తే.** శైవుఁడగు బ్రాహ్మణ బ్రహ్మచారి యిచ్చు
హస్త మవలంబనంబుగ నల్ల నడిచి
నియత మౌనవ్రతంబుతో నృపతి సొచ్చె
శాంత చిత్తుఁడై దేవపూజా గృహంబు

సీమంతము = పాపట, ఏర్పడన్ = ఏర్పడునట్లుగా, చికురభారంబునన్ = కేశపాశమును, సుశ్లిష్ట బంధంబుగన్ = చక్కని ముడిగా, శిఖ అమర్చి = శిఖను అమర్చుకొని, గన్నేరు పూచాయ, కనుపట్టు, జిలుగైన = సన్నని, సలిల కాషాయ వస్త్రంబు = నీర్కావి ధోవతిని, కట్టి, చంద్రాతపముతోడన్ = వెన్నెలతో, సరియైన = సమానమైన, వెలిపట్టు పుట్టము = తెల్లని పట్టు వస్త్రమును, ఉత్తరవాసముగన్ = పై వస్త్రముగా, ధరించి, ప్రక్షాళితములు = కడుగబడిన, పదియాఱు వన్నియ, కనకంపు గొడుగున్, పాగాలు = పావుకోళ్ళు, తొడిగి, శైవుడగు = శివభక్తుడైన, బ్రాహ్మణ బ్రహ్మచారి ఇచ్చు, హస్తము = చేయి, అవలంబనంబుగన్ = ఊతగా, అల్ల = మెల్లగా, నడిచి, నియత మౌనవ్రతంబుతోన్ = నియమమైన మౌనవ్రతముతో, శాంత చిత్తుడై, దేవపూజా గృహంబున్, నృపతి = నలుడు, చొచ్చె = ప్రవేశించెను.

తా. పాపట ఏర్పడునట్లుగా కేశపాశమును చక్కని ముడిగా శిఖను అమర్చుకొని, గన్నేరు పూచాయ సన్నని నీర్కావి ధోవతిని కట్టి, వెన్నెలతో సమానమైన తెల్లని పట్టు వస్త్రమును పైవస్త్రముగా ధరించి, కడుగబడిన పదహారు వన్నె బంగరు గొడుగులుకల పావుకోళ్ళు తొడిగి శివభక్తుడైన బ్రహ్మచారి ఊతగా చేయి అందించగా, మెల్లగా నడిచి నియమమైన మౌన వ్రతముతో శాంత చిత్తుడై దేవపూజా గృహమునకు నలుడు ప్రవేశించెను.

**104 సీ.** అభినవాజ్య సమేధితాఖండ దీపంబు
పుష్ప మండపికా విభూషితంబు
ననవద్య బహునివేద్య సమన్వితంబును

**వివిధ చిత్ర సువస్త్ర విలసితంబు**
**నఖిల తీర్థాంబు పూర్ణార్ఘ్యపాత్రంబును**
**గలధౌత రత్నోపకరణచితము**
**శశికాంత కుట్టిమక్ష్మా కుట్టమితమును**
**చందన స్రక్కుశాక్షతయుతంబు**
**తే. నయిన సద్దేవ పూజా గృహంబునందు**
**భద్రపీఠాసనస్థుఁడై పరమ నియతి**
**నాగమోక్త ప్రకారంబు ననుసరించి**
**శంభులింగంబుఁ బూజించె జనవిభుండు**

అభినవ = క్రొత్తదైన, ఆజ్య = నేతితో, సమేధిత = పెంపబడిన, అఖండ దీపంబు, పుష్ప మండపికా = పూల చిన్న మండపముచే, విభూషితంబును = శోభించుచున్నదియు, అనవద్య = తక్కువకాని, బహు = నానావిధములగు, నివేద్య సమన్వితంబును = నైవేద్యములతో కూడినదియును, వివిధ = పలువిధములగు, చిత్ర = చిత్ర వర్ణములుకల, సువస్త్ర = మంచి వస్త్రములచే, విలసితంబును = ప్రకాశించుచున్నదియును, అఖిల = సమస్తమైన, తీర్థాంబు = నదులయందలి నీటిచే, పూర్ణ = నిండిన, అర్ఘ్య పాత్రంబును = అర్ఘ్యపాత్రయును, కలధౌత = రజతమయము, రత్న = రత్నమయమ్మునైన ఉపకరణచితము = సాధనములచే పరుపబడినదియును, శశికాంత = చంద్రకాంత మణులయొక్క, కుట్టిమ క్ష్మా = రాకట్టునేలయందు, కుట్టమితమును = ప్రతిబింబించిన శృంగారచేష్టా విశేషములు కలదియు, చందన = గంధము, స్రక్ = పూలు, కుశ = దర్భలు, అక్షత యుతంబు = అక్షతలతో కూడినదియును, అయిన ఆ దేవ పూజా గృహంబునందు, భద్రపీఠాసనస్థుడై = మంగళప్రదమగు ఆసనమునందు కూర్చున్నవాడై, పరమ నియతి = నిశ్చలమైన నిష్ఠతో, ఆగమ ఉక్త ప్రకారంబున్ = శాస్త్రోక్త ప్రకారమును, అనుసరించి, జనవిభుండు = రాజు, శంభులింగంబున్ పూజించెన్

తా. నేతితో పెంచబడిన అఖండ దీపము, పూలచే అలంకరింపబడిన చిన్న మండపము, పలు విధములగు నైవేద్యములతో కూడినది, పలు చిత్రవర్ణములుకల వస్త్రములచే ప్రకాశించునది, సమస్త తీర్థములనుండి తెచ్చిన నీటితో నిండిన అర్ఘ్యపాత్రము, వెండి, రత్నమయమయిన ఉపకరణములచే పరుపబడినది, చంద్రకాంతమణుల రాకట్టునేలయందు ప్రతిబింబించిన శృంగారచేష్టా విశేషములుకల గంధము, పూలు, దర్భలు, అక్షతలతో కూడిన దేవ పూజా గృహమునందు భద్రాసనాసీనుడై నిశ్చలమైన నిష్ఠతో శాస్త్రోక్త ప్రకారము రాజు శివుని పూజించెను.

**105 తే. పసిడి ధత్తూర పుష్పంబు ఫాలనయను**
**పానవట్టంబుపైఁబెట్టి పార్థివుండు**
**విశ్వపతి కాత్మ సంగ్రామ విజయలబ్ధ**
**మదన కాహళముగ దాని మదిఁ దలంచె**

పార్థివుండు = నలుడు, పసిడి ధత్తూర పుష్పంబు = బంగారు ఉమ్మెత్తపువ్వును, ఫాలనయను = శివుని, పానవట్టంబు పైన్, పెట్టి, విశ్వపతికి = శివునకు, ఆత్మ = తనయొక్క, సంగ్రామ విజయ = యుద్ధవిజయమునందు, లబ్ధ = లభించిన, మదన కాహళముగన్ = మన్మథుని కాహళ వాద్యవిశేషముగా, దానిన్ = ఆ ఉమ్మెత్తపువ్వును, మదిన్ = మనసునందు, తలంచెన్

తా. నలమహారాజు బంగరు ఉమ్మెత్తపువ్వును శివుని పానవట్టముపై పెట్టి, ఆ విశ్వపతికి తన యుద్ధవిజయమున లభించిన మన్మథుని కాహళ వాద్యవిశేషముగా ఆ ఉమ్మెత్తపువ్వును మనసున తలంచెను. (అలంకారము – ఉత్ప్రేక్ష)

**106 క. అమృతాంశు మౌళి మౌళిం**
**గమలభవ కపాలమాలికకు సదృశముగా**
**విమలారవింద కోరక**
**సముదయ మాల్యంబు నిషధజనపతి చుట్టెన్**

నిషధ జనపతి, అమృతాంశు మౌళి = శివుని, మౌళిన్ = శిఖయందు, కమలభవ = బ్రహ్మయొక్క, కపాలమాలికకు, సదృశముగా = సమానముగా, విమల = స్వచ్ఛమైన, అరవిందకోరక సముదయము = తామర మొగ్గల సముదాయమును, చుట్టెన్.

తా. నలుడు శివుని శిఖయందు బ్రహ్మయొక్క కపాలమాలికకు సమానముగా స్వచ్ఛమైన తామర మొగ్గల సముదాయమును చుట్టెను.

**107 సీ. ఖట్వాంగపాణిఁ జెంగల్వ పుష్పంబుల**
**ఫాలలోచను బిల్వ పల్లవముల**
**నాగేంద్రకేయూరు నాగకేసరముల**
**బాలేందుకోటీరుఁ బాటలములఁ**

**గుసుమ కోదండారి గుండ వర్ధనములఁ**
**గాంచనాచల చాపుఁ గాంచనముల**
**నంబికా హృదయేశు నసితాంబుజంబుల**
**దక్షాధ్వరధ్వంసి దమనకముల**

తే. **బొండుమల్లియ విరిదండ ఖండపరశు**
**నఖిల సురసార్వభౌము దూర్వాంకురముల**
**బంతి శ్రీవత్సలాంఛన ప్రాణ బంధు**
**శివునిఁ జేమంతి బంతిఁ బూజించె నలుడు**

నలుడు, ఖట్వాంగపాణిన్ = మంచపుకోడువంటి ఆయుధముకలవానిని, చెంగల్వ పుష్పములన్ = ఎఱ్ఱకలువ పూలతోను, ఫాలలోచనున్ = నుదుట కన్నుకలవానిని, బిల్వ పల్లవములన్ = మారేడు చిగుళ్ళతోను, నాగేంద్ర కేయూరున్ = సర్ప రాజగు వాసుకి బాహుపురిగ కలవానిని, నాగకేసరములన్, బాలేందు కోటీరున్ = బాలచంద్రుడు కిరీటముగాకలవానిని, పాటలములన్, కుసుమకోదండారిన్ = మన్మథుని శత్రువును, గుండవర్ధనములన్, కాంచనాచల చాపున్ = మేరు పర్వతము ధనుస్సుగ కలవానిని, కాంచనములన్ = చంపకములతోను, అంబికా హృదయేశు = పార్వతీ ప్రియుని, అసితాంబుజములన్ = నల్లకలువలతోను, దక్షాధ్వరధ్వంసిన్ = దక్షయజ్ఞము పాడుచేసినవానిని, దమనకములన్, ఖండ పరశున్ = ఖండించు గండ్రగొడ్డలికలవానిని, బొండుమల్లియ విరిదండన్ = బొండుమల్లెపూల దండతోను, అఖిల సుర సార్వభౌమున్ = సకల దేవతలకు చక్రవర్తియగువానిని, దూర్వాకురములన్ = గఱిక చిగుళ్ళచేతను, శ్రీవత్సలాంఛను ప్రాణబంధున్ = విష్ణుని ప్రాణబంధువును, బంతిన్, శివునిన్, చేమంతి, బంతిన్, పూజించెన్ .

తా. నలుడు శివుని ఎఱ్ఱకలువపూలతోను, మారేడు చిగుళ్ళతోను, నాగకేసరములతోను, పాటలములతోను, గుండ వర్ధనములతోను, చంపకములతోను, నల్లకలువలతోను, దమనముతోను, బొండుమల్లెలదండతోను, గఱిక చిగుళ్ళతోను, చేమంతి, బంతి పూలతోను పూజించెను.

**108** ఉ. **దగ్గఱ మేదినీ పరివృఢ ప్రవరుండు సువర్ణపాత్రలన్**
**బుగ్గన దివ్య సౌరభ విభూతి యెలర్పఁగ సాత్కరించెఁ బెం**
**పగ్గలమైన భక్తి మహిసాక్ష రజ స్త్రసరేణు సమ్మిళ**
**ద్గుగ్గులు ధూప ధూమములు గోమల తారక రాజమౌళికిన్**

మేదినీ పరివృఢ ప్రవరుండు = రాజశ్రేష్ఠుడైన నలుడు, కోమల తారక రాజమౌళికన్ = బాలచంద్రుడు శిఖయందుకలవానికి, దగ్గఱన్ = చేరువనందు, సువర్ణ పాత్రలన్ = బంగారు పాత్రలయందు, దివ్య సౌరభ విభూతి = అద్భుత పరిమళ సంపద, బుగ్గనన్ = గుప్పున, ఎలర్పగన్ = వ్యాపింపగా, పెంపు అగ్గలమయిన భక్తి = ఆధిక్యము అతిశయించిన భక్తితో, మహిసాక్ష = మహిసాక్షయను గుగ్గులు సంబంధియగు, రజ: = పరాగముయొక్క త్రసరేణు = చిన్న నలుసులతో, సమ్మిళత్ = కూడుకొన్న, గుగ్గులు ధూప ధూమములు = గుగ్గులు ధూపపు పొగలచేత, సాత్కరించెన్ = గౌరవించెను.

తా. రాజశ్రేష్ఠుడైన నలుడు బాలచంద్రుని శిఖయందుకల శివునికి చేరువనే బంగారు పాత్రలయందు అద్భుత పరిమళ సంపద గుప్పున వ్యాపింపగా అధికమైన భక్తితో మహిసాక్ష సంబంధియగు పరాగపు చిన్న నలుసులతో కూడుకొన్న గుగ్గులు ధూప పొగలచే సత్కరించెను.

**109** తే. **సరస ధూపార్థమై కామ శరములందుఁ**
**బురములందును బొగసూపె భూవరుండు**
**మదనసంహారుఁడును బురమర్దనుండు**
**నయిన దేవర కామోద మావహిల్ల**

భూవరుండు = నలుడు, మదన సంహారుడును = మన్మథుని దహించినవాడును, పురమర్దనుండు = త్రిపురములను ధ్వంసము చేసినవాడును, అయిన, దేవరకు = శివునకు, ఆమోదము ఆవహిల్ల = సంతోషము కలుగునట్లుగా, సరస = మనోహరమైన, ధూపార్థమై = ధూపముకొఱకు, కామశరములందున్ = మన్మథుని బాణములందును (కర్పూరమునందును), పురములందును = త్రిపురములయందును (గుగ్గిలమునందును), పొగ చూపెన్ = పొగను వ్యాపింపచేసెను.

తా. నలుడు మన్మథుని దహించినవాడును, త్రిపురములను ధ్వంసముచేసినవాడును అయిన శివునకు ప్రీతిని కలుగునట్లుగా మనోహరమైన కర్పూరమునందు (కామశరములు), గుగ్గిలమునందు (పురములు) పొగను వ్యాపింపచేసెను.

**110** సీ. **పద్మాసనస్థుఁడై భావించె మానస**
**కమల కర్ణికయందుఁ గాలకంఠుఁ**
**బంచాస్యు మ్రోల జపించెఁ బంచబ్రహ్మ**
**పంచాక్షరంబులఁ బరమ నియతి**

**భక్ష్యభోజ్యాదిక బహుపదార్థంబుల**
**నసమాక్షునకు నుపహారమిచ్చె**
**రాజదేవోపచార ప్రకారంబుల**
**నతిభక్తిఁ గొలిచె రాజార్ధమౌళి**
**తే.** **మంత్రపుష్పంబుఁ బెట్టె మన్మథ విరోధి**
**మూర్ధభాగమునందు సమ్మోద మెసఁగ**
**నవని సంస్పృష్ట సకలాంగుడగుచు మ్రొక్కె**
**నిఖిలలోకైక భర్తకు నిషధ రాజు**

నిషధరాజు, పద్మాసనస్థుడై = పద్మాసనమునందున్నవాడై, కాలకంఠున్ = శివుని, మానస కమల కర్ణికయందు = మనస్సనెడి తామర బొడ్డునందు, భావించెన్ = స్మరించెను, పంచాస్య మ్రోలన్ = శివుని చెంత, పరమ నియతిన్ = మిక్కిలి నిష్ఠతో, పంచ బ్రహ్మ = పంచ బ్రహ్మమంత్రములను, పంచాక్షరములన్ = ఓం నమశ్శివాయ మంత్రమును, జపించెన్, అసమాక్షునకు = త్రినేత్రునకు, భక్ష్య భోజ్యాదిక బహు పదార్థములన్, ఉపహారము ఇచ్చెన్ = కానుక ఇచ్చెను, రాజార్ధమౌళిన్ = చంద్రఖండము శిఖయందుకల శివునకు, రాజదేవోపచార ప్రకారంబుల = రాజోపచార, దేవోపచారముల ప్రకారముగ, అతిభక్తిన్ = మిక్కిలి భక్తితో, కొలిచెన్ = సేవించెను. మన్మథ విరోధి = శివుని, మూర్ధభాగమునందు = శిరోభాగమునందు, సమ్మోదము ఎసగన్ = సంతోషము ఒప్పునట్లుగ, మంత్రపుష్పంబు = మంత్రపుష్పపు పూవులను, పెట్టెన్, నిఖిల లోకైక భర్తకున్ = సకల లోకములకు ముఖ్యనాయకుడైన శివునికి, అవని = నేలను, సంస్పృష్ట = తాకుచున్న, సకలాంగుడగుచు = అన్ని అవయవములు కలవాడగుచు, మ్రొక్కెన్ = నమస్కరించెను. (పంచబ్రహ్మములు – సద్యోజాతము, వామదేవము, అఘోరము, తత్పురుషము, ఈశానము)

తా. నలుదు పద్మాసనము వేసుకొని శివుని మనసునందు స్మరించెను. మిక్కిలి నిష్ఠతో పంచ బ్రహ్మ, పంచాక్షర మంత్రములను జపించెను. భక్ష్య భోజ్యాది బహు పదార్థములను నైవేద్యమిచ్చెను. రాజోపచార, దేవోపచార ప్రకారముగ మిక్కిలి భక్తితో శివుని సేవించెను. మంత్రపుష్ప పూవులను పెట్టి, సాష్టాంగ మొనర్చెను.

**111** **వ.** **అనంతరంబ పరమపురుషునిం బురుషోత్తము నారాధింప నద్దేవుని సన్నిధికి వచ్చి**

**112** **సీ.** **కీలుకొప్పునఁ బైఁడి గేదంగి ఱేకులు**
**గొనలు గానంగరాఁ గుదురుపఱిచి**
**కర్ణపాశంబులఁ గలధౌతమయ పాండు**
**పుండరీక వతంసములు ధరించి**
**బాహు మధ్యంబునఁ బవడంపుఁ జివుళుల**
**పచ్చలఁ దోమాలె యచ్చుపఱిచి**
**చరణ పీఠంబుల గరుడాంకమణిఖండ**
**తులసీదళంబులు నెలవు కొలిపి**
**తే.** **పురుషసూక్త నిపాఠంబు పరిచయించి**
**పావనాష్టాక్షరీ మంత్ర పఠనఁ దగిలి**
**పాంచరాత్రోదిత క్రియా పథమునందు**
**నలిననాభు సమారాధనంబు సేసె**

కీలు కొప్పునన్ = బంధింపబడిన కేశపాశమునందు, పైడి గేదకి ఱేకులు = బంగారువంటి మొగలి ఱేకులను, కొనలు కానంగరాన్ = కొనలు కనబడునట్లుగా, కుదురుపఱచి = చక్కచేసి, కర్ణపాశంబులన్ = పాశములవంటి చెవులందు, కలధౌతమయ = రజతమయములైన, పాండు = తెల్లని, పుండరీక వతంసములన్ = పద్మములనెడి భూషణములను, ధరించి, బాహు మధ్యంబునన్ = వక్షస్థలమందు, పవడంపు చివుళులన్ = పగడపు చిగుళ్ళయొక్క, పచ్చల దోమాలెన్ = మరకతమాలను, అచ్చు పఱిచి = అర్పించి, చరణ పీఠంబులన్ = పాదపీఠములందు, గరుడాంకమణి = గరుడ పచ్చలయొక్క, ఖండ = తునుకలనెడి, తులసీదళంబులు, నెలవు కొలిపి = ఉంచి, పురుషసూక్త నిపాఠంబు = పురుష సూక్త ప్రసిద్ధ పాఠమును, అభ్యసించి = చదివి, పావన = పవిత్రమైన, అష్టాక్షరీ మంత్ర పఠనన్ = ఓం నమో నారాయణాయ – మంత్రము చదువుటను, తగిలి = ఆసక్తిని చూపి, పాంచరాత్ర = పాంచరాత్రమునందు, ఉదిత = చెప్పబడిన, క్రియా పథమునందు = చేయవలసిన విధానమునందు, నలిననాభున్ = విష్ణుని, సమారాధనంబున్ = పూజను, చేసెన్.

తా. బంధింపబడిన కేశపాశమునందు బంగారు మొగలి ఱేకులను కొనుల కనబడునట్లుగా చక్కచేసి, చెవులయందు రజతమయములైన తెల్లని పద్మములనెడి భూషణములను ధరింపచేసి, వక్షస్థలమునందు పగడపు చివుళ్ళయొక్క మరకత హారమును అర్పించి, పాదపీఠములందు గరుడ పచ్చలయొక్క తునుకలనెడి తులసీదళంబులు ఉంచి, పురుషసూక్తమును పఠించి, పవిత్రమైన అష్టాక్షరీ మంత్రమున ఆసక్తిని చూపి, పాంచరాత్ర విధిగా విష్ణుని పూజ చేసెను.

113 చం. **గురుతర కౌస్తుభాఖ్యమణి కుట్టిమమైన రథాంగపాణి పే**
**రురమునఁ బూన్చె నొక్క యసితోత్పలమాలిక షట్పదావళీ**
**గరుదనిలావతారమునఁ గంపము నొందెడి తేకు లిందిరా**
**తరళ కటాక్ష వీక్షణ విధా వికటాయిత మభ్యసింపగన్**

గురుతర = మిక్కిలి గొప్పదైన, కౌస్తుభాఖ్య మణి = కౌస్తుభమను పేరుగల రత్నముయొక్క, కుట్టిమమైన = నెలకట్టుకలదైన, రథాంగపాణి = విష్ణునియొక్క, పేరురమున = వక్షస్థలమున, షట్పదావళీ = తుమ్మెద సమూహముల, గరుత్ = ఱెక్కల యొక్క, అనిల = గాలియొక్క, అవతారమునన్ = ప్రసారముచే, కంపమున్ ఒందెడి = ఊగులాడుచున్న, తేకులు = కలువ తేకులు, ఇందిరా = లక్ష్మీదేవియొక్క, తరళ = చంచలమైన, కటాక్ష వీక్షణ = క్రీగంటి చూపుల, విధా = రీతియొక్క, వికటాయితము = విలాసమును, అభ్యసింపగన్ = నేర్చునట్లుగా, ఒక్క అసిత ఉత్పలమాలికన్ = ఒక నల్లకలువ మాలికను, పూన్చెన్ = ధరింపచేసెను.

తా. మిక్కిలి గొప్పదైన కౌస్తుభమణి నెలకట్టుకలదైన నారాయణుని వక్షస్థలమున తుమ్మెద సమూహముల ఱెక్కల గాలి ప్రసారముచే ఊగులాడుచున్న కలువ తేకులు లక్ష్మీదేవియొక్క చంచలమైన క్రీగంటి చూపుల రీతియొక్క విలాసమును నేర్పునట్లుగా ఒక నల్లకలువ దండను ధరింపచేసెను.

114 క. **అలనాటి కాళియోరగ**
**వలనంబులు దలఁపకున్నె వనమాలి మదిన్**
**నలదత్త వికచ విచికల**
**కలికా దుండుభ కదంబ ఘటితాంగకుడై**

వనమాలి = విష్ణువు, నల = నలునిచే, దత్త = ఈయబడిన, వికచ = వికసించిన, విచికల కలికా దుండుభ = రెండు తలల పాముపంటి మల్లెమొగ్గల దండలయొక్క, కదంబ = సమూహముచేత, ఘటిత = కూర్చబడిన, అంగకుడై = అవయవములు కలవాడై, అలనాటి = పూర్వకాలమందలి, కాళియ ఉరగ = కాళియ సర్పముయొక్క, వలనంబులు = చుట్టలను, మదిన్ = మనసున, తలపకున్నె = తలచకుండా ఉంటాడా ! (ఉత్ప్రేక్ష)

తా. విష్ణువు నలునిచే ఈయబడిన వికసించిన రెండు తలల పాముపంటి మల్లెమొగ్గల దండలయొక్క సమూహము చేత కూర్చబడిన అవయవములుకలవాడై తాను పూర్వకాలమందలి కాళియ సర్పముయొక్క చుట్టలను మనసులో తలంపకపోవునా !

115 క. **నరనాథ సమర్పితమగు**
**విరవాదుల దండ యొప్పె వెన్నుని పాదాం**
**బురుహంబున నంగుటమున**
**నురలిన యాకాశగంగ కుపమానంబై**

నరనాథ సమర్పితమగు = నలునిచే ఈయబడిన, విరవాదుల దండ = విరజాజులమాల, వెన్నుని = విష్ణుని, పాదాంభోరుహంబులన్ = పాదపద్మములయందు, అంగుటమునన్ = బొటనవ్రేలినుండి, ఉరలిన = స్రవించుచున్న, ఆకాశగంగకు, ఉపమానంబై = పోలికకలదై, ఒప్పెన్ = ఒప్పినది.

తా. నలునిచే సమర్పింపబడిన విరజాజుల దండ విష్ణుని పాదపద్మములందు బొటనవ్రేలినుండి స్రవించుచున్న ఆకాశగంగకు సాటియై ఒప్పుచున్నది.

116 వ. **ఇవ్విధంబున నిషధదేశాధ్యక్షుండు పుండరీకాక్షు నర్చించి ప్రణామంబు చేసి యప్పరమపురుషు నిట్లని నుతించె**

117 సీ. **జయ భూర్భువస్స్వస్తి జగదేక నాయక**
**జయ సర్వదేవతా సార్వభౌమ**
**జయ పూర్వ గీర్వాణ సంహార కారణ**
**జయ కుక్షినిహిత విశ్వప్రపంచ**
**జయ జహ్నుకన్యకాజనక పాదాంభోజ**
**జయ కోమలాంబుద శ్యామలాంగ**
**జయ వైజయంతికా స్రక్ప్రభాలంకార**
**జయ పుండరీక విశాల నయన**

తే. **జయ శతక్రతు ముఖ మరు చ్చక్రవాళ**
**కనక కోటీర చారు సంఘటిత నూత్న**
**రత్న నీరాజన క్రియా రాజమాన**
**చరణ పీఠాంతికోద్దేశ జయ రమేశ**

భూః భువః స్వః = భూలోకము, భువర్లోకము, స్వర్గలోకము, త్రి జగత్ ఏక నాయక = మూడులోకములకు ప్రధాన నాయకా !, జయ = జయము, సర్వదేవతా సార్వభౌమ, జయ, పూర్వ గీర్వాణ = రాక్షసులను, సంహార కారణ = చంపుటకు కారణమైనవాడా, జయ, కుక్షి నిహిత = కడుపులోనుంచుకొనబడిన, విశ్వప్రపంచ = సమస్త ప్రపంచముకలవాడా, జయ, జహ్నుకన్యకా జనక = ఆకాశగంగ పుట్టుకకు కారణమైన, పాదాంభోజ = పాదపద్మములు కలవాడా, జయ, కోమల = నూత్నమైన, అంబుద = మేఘమువంటి, శ్యామల = నల్లని, అంగ = దేహముకలవాడా, జయ, వైజయంతికా స్రక్ = వైజయంతి మాలయొక్క, ప్రభా = కాంతులచే, అలంకార = శోభించువాడా, జయ, పుండరీక = పద్మమువలె, విశాల నయన = విశాలమైన నేత్రములుకలవాడా, జయ, శతక్రతు ముఖ = ఇంద్రుడు మొదలైన, మరుత్ = దేవతలయొక్క, చక్రవాళ = సమూహముయొక్క, కనక కోటీర = బంగరు కిరీటములందలి, సంఘటిత = కూర్చబడిన, నూత్న రత్న = క్రొత్త రత్నములు, నీరాజన = హారతి, క్రియా = ఇచ్చుటచే, రాజమాన = ప్రకాశించు, చరణపీఠ = పాదపీఠముయొక్క, అంతిక ఉద్దేశా = సమీప భూమికలవాడా, రమేశ = లక్ష్మీనాథా, జయ

తా. భూలోక, భువర్లోక, స్వర్గలోకములకు ప్రధాన నాయకా జయము, సర్వదేవతా సార్వభౌమా జయము, రాక్షస సంహార కారాణా జయము, కడుపులో సమస్త ప్రపంచముంచుకొన్నవాడా జయము, ఆకాశగంగ పుట్టుకకు కారణమైన పాదపద్మములుకలవాడా జయము, నూతన మేఘమువంటి నల్లని దేహముకలవాడా జయము, వైజయంతి మాల కాంతులచే శోభించువాడా జయము, పద్మమువలె విశాల నేత్రములుకలవాడా జయము, ఇంద్రుడు మొదలైన దేవతల సమూహముయొక్క బంగారు కిరీటములందు కూర్చబడిన నూతన రత్నములు నీరాజన మిచ్చుటచే ప్రకాశించు పాదపీఠముయొక్క సమీపమందున్నవాడా జయము, లక్ష్మీనాథా జయము.

**118 క.**

**భవదీయములగు మహిమము**
**లవాఙ్మనస గోచరంబు లంభోరుహ సం**
**భవ భవుల కనిన శక్యం**
**బవునే? మావంటివారి కచ్యుత ! పొగడన్**

అచ్యుత = ఓ హరీ!, భవదీయములగు = నీ సంబంధమైన, మహిమములు, అంభోరుహ సంభవ = బ్రహ్మకును, భవ = శివునకును, అవాఙ్మనస గోచరంబులు = వాక్కునకు, మనస్సునకు గోచరింపనివి, అనిన, మావంటివారికిన్, పొగడన్, శక్యంబవునే = శక్యమగునా?

తా. ఓ హరీ ! నీ మహిమలు బ్రహ్మకును, శివునకును వాక్కునకు మనస్సునకును గోచరింపనివి అనగా ఇక మావంటివారికి నిన్ను పొగడడం వశమవుతుందా ?

**119 శా.**

**ఓ దామోదర ! యిందిరాయువతి విద్యుల్లేఖతో నూత్న పిం**
**ఛాదామ త్రిదశేంద్రు కార్ముకముతో సమ్యక్కృపావృష్టితో**
**నీ దేహంబను మేచకాంబుదము మన్నేత్రద్వయీ చాతకా**
**హ్లాదంబుం బొనరించుఁగాక భవతాపాటోపముం బాపుచున్**

ఓ దామోదర !, ఇందిరాయువతి = లక్ష్మీదేవియనెడి, విద్యుల్లేఖతోన్ = మెఱుపుతీగతో, నూత్న = క్రొత్తదైన, పింఛాదామ = నెమలిపురి మాలయనెడి, త్రిదశేంద్రుకార్ముకముతోన్ = ఇంద్రధనుస్సుతో, సమ్యక్ కృపావృష్టితో = అధికమైన దయ యనెడి వర్షముతో, నీ దేహంబను మేచక అంబుదము = నీ శరీరమను నల్లని మేఘము, భవతాప ఆటోపముం = సంసార తాపాతిశయమును, పాపుచున్ = తొలగించుచు, మత్ = నాయొక్క, నేత్రద్వయీ = రెండు నేత్రములనెడి, చాతక = చాతక పక్షులకు, ఆహ్లాదంబున్ = ఆనందమును, ఒనరించు కాక = కలిగించునుగాక

తా. ఓ దామోదర ! లక్ష్మీదేవియనెడి మెఱుపుతీగతోను, క్రొత్త నెమలిపురి మాలయనెడి ఇంద్రధనుస్సుతోను, అధికమైన దయయనెడు వర్షముతోను నీ శరీరమనెడి నల్లని మేఘము సంసార తాపమును తొలగించుచు నా రెండు నేత్రములకు ఆనందమును కలిగించునుగాక.

**120 తే.**

**కపట మత్స్యంబవై నీవు కడలి నడుమఁ**
**బుచ్ఛ మల్లార్ప నెగసిన భూరిజలము**
**మింటఁ గడుఁ దెల్లనై పాఱుచుంటఁ జూచి**
**యభ్రనది యంచు వర్ణించె నఖిలజగము**

నీవు, కపట మత్స్యంబవై = చేపరూపుడవై, కడలి నడుమన్ = సముద్ర మధ్యమున, పుచ్ఛము అల్లార్పన్ = తోక ఆడింపగా, ఎగసిన = పైకి లేచిన, భూరి జలము = విస్తారమైన నీరు, మింటన్ = ఆకాశమునందు, కడున్ = మిక్కిలి, తెల్లనై, పాఱుచుంటన్ = ప్రవహించుటను, చూచి, అఖిల జగము = లోకమంతయు, అభ్రనది అంచున్ = ఆకాశగంగయని, వర్ణించెన్ = పొగడెను.(అలంకారము – ఉత్ప్రేక్ష)

తా. నీవు మత్స్యావతారమున సముద్ర మధ్యమున తోక ఆడింపగా పైకి లేచిన విస్తారమైన నీరు ఆకాశమందు మిక్కిలి తెల్లనై ప్రవహించుటను చూచి లోకమంతా ఆకాశగంగ అని పొగడెను.

**121 క.**
**గత భువన సర్గ సముదయ**
**ధృత భూవలయాంక సదృశ దృఢచరమతనూ**
**వితత బహు చక్ర చిహ్నముఁ**
**బతగధ్వజ ! కపట కచ్ఛపము నినుఁ గొల్తున్**

పతగ ధ్వజ = గరుడుడు పతాకముగకలవాడా !, గత = అతీతమైన, భువన స్రష్ట = లోకసృష్టులయొక్క, సముదయ = సమూహమునందు, ధృత = ధరింపబడిన, భూవలయ = భూచక్రములయొక్క అంక = చిహ్నములతో, సదృశ = సమానమైన, దృఢ = గట్టిదైన, చరమతనూ = పృష్ఠభాగమునందు, వితత = స్పష్టమగుచున్న, బహు = అనేకములగు, చక్ర = వలయాకారములగు, చిహ్నము = గుర్తులుకలదగు, కపట కచ్ఛపమున్ = కూర్మావతారమును ధరించిన, నినున్ = నిన్ను, కొలుతున్ = సేవింతును. (ఉత్ప్రేక్ష)

తా. గరుడధ్వజా ! నీవు చిరకాలమునుండి ప్రతి సృష్టియందును భూమండలమును నీ వీపున ధరించుటచే దాని రాపిడిచేత వలయాకారములగు వీపు మచ్చలు కానవచ్చుచున్నవి. వీపుమచ్చలు పడునట్లు ప్రతి యుగమునందు భూమండలమును ధరించుచున్న నిన్ను సేవింతును.

**122 తే.**
**చించి వెడలిన తనురుహ శ్రేణిచేతఁ**
**బద్మజాండంబు కడప పూబంతిఁ బోలఁ**
**బెరిఁగియున్నట్టి కిటిరూపధరుని నిన్ను**
**ఖుర చతుష్టయ బిలచతుశ్శరధిఁ గొలుతు**

చించి = చీల్చుకొని, వెడలిన తనురుహ శ్రేణిచేతన్ = పొడుచుకొని వెలువడిన నీ వెంద్రుకలచేత, పద్మజాండంబు = బ్రహ్మాండము, కడప పూబంతిన్ పోలన్ = కదంబ పూలబంతిని పోలునట్లుగా, పెరిగి ఉన్నట్టి, కిటిరూపధరునిన్ = వరాహరూపము ధరించినవానిని, ఖుర చతుష్టయ = నాలుగు డెక్కలచేతను చేయబడిన, బిల = గుంటలయిన, చతుశ్శరధి = నాలుగు సముద్రములు కలవానిని, నిన్ను, కొలుతున్.

తా. నీవు వరాహరూపమును ధరించి బ్రహ్మాండము పిక్కటిల్లునట్లుగా పెరుగగా పొడుచుకొని వెలువడిన నీ వెంద్రుకలు బ్రహ్మాండమును చీల్చుకొని పైకి వచ్చెను. అపుడు బ్రహ్మాండము నిగిడిన కేసరములు కల కదంబపూల బంతిని పోలుచుండ పెరిగియున్నట్టి నీ నాలుగు డెక్కలచేతను చేయబడిన గుంటలయిన నాలుగుసముద్రములుకలవానిని నిన్ను సేవింతును.

**123 మ.**
**అతి గంభీర హిరణ్యదైత్య హృదయాహంకార కూపోదరా**
**పతిత స్వర్గ రమా సువర్ణకలశ ప్రత్యుద్ధృతి ప్రక్రియా**
**యతపంచాంగుళ లోహయంత్రమగు నీ హస్తంబు వర్ణింతు ను**
**ద్ధత కంఠధ్వని కుంఠితారి హృదయోత్కంఠా నృకంఠీరవా !**

ఉద్ధత = అతిశయించిన, కంఠధ్వనిచే, కుంఠిత = మొక్కపరుపబడినట్టి, అరి = శత్రువులయొక్క హృదయ = మనస్సులోని, ఉత్కంఠా = ఆస కలవాడా !, నృకంఠీరవా = నరసింహావతారా ! అతి గంభీర = మిక్కిలి లోతయిన, హిరణ్య దైత్య = హిరణ్య కశిపుడనెడి రాక్షసునియొక్క, హృదయ = మనస్సులోని, అహంకార = గర్వమనెడి, కూప = నూతియొక్క, ఉదర = గర్భమునందు, పతిత = పడినట్టి, స్వర్గరమా = స్వర్గ లక్ష్మియనెడి, సువర్ణకలశ = బంగారు పాత్రయొక్క, ప్రత్యుద్ధృతి = పైకి తీయుటయనెడి, క్రియా = వ్యాపారమునకు, ఆయత = పొడుగైన, పంచాంగుళ = అయిదు కొక్కెములుగల, లోహయంత్రమగు = ఇనుప గాలమువంటిదగు, నీ హస్తంబున్ = నీ చేతిని, వర్ణింతున్.

తా. ఓ నారసింహా ! లోతయిన నూతిలో పడిన బంగారు కలశమును గాలము పైకి తీసినట్లు నీచే హిరణ్యకశిపుని గర్వమున అణగియున్న స్వర్గరాజ్యము ఉద్ధరింపబడినది. అటువంటి నీచేతిని వర్ణింతును.

**124 తే.**
**భోగి సహవాస సంబంధములు భజింతు**
**భువనధార హస్తంబునఁ బోయుమనుచు**
**రెంటమాటల బలిఁ బ్రతారించినట్టి**
**దంభవామన ! మా మనస్తాప ముడుపు**

భోగి = సుఖవంతులతో, సహవాస = కూడియుండుటవలన, సంబంధములు = యోగములు, భజింతు = పొందుదువు, (భోగి = సర్పములతో, సహవాస సంబంధములు = పాతాళలోక వాసము) భువన దారన్ = దాన జలధారను, హస్తంబునన్ = నా చేతియందు, పోయుము అనుచు, రెంటమాటలన్ = రెండర్థముల మాటలను, బలిన్ = బలి చక్రవర్తిని, ప్రతారించినట్టి = మోసముచేసినట్టి, దంభ వామన = కపట వామనుడా !, మా మనస్తాపము = మా మనసునందలి తాపమును, ఉడుపు =

పోగొట్టుము.

తా. పాతాలలోకవాసమును నీవు పొందెదవు నా చేతియందు దానజలధారను పోయుము, (నీవు సుఖవంతులతో సహవాసముచేయు యోగమందెదవు దానజలధారను పోయుము) అని రెండర్థముల మాటలతో బలిచక్రవర్తిని మోసగించిన కపట వామనావతారా ! మా మనస్తాపము పోగొట్టుము.

**125 మ. తతినాక్రాంత సమస్తలోక బలదైత్యధ్వంసి యో దేవ నీ**
**యఱకాలుద్ధతి రాహుమండలము బ్రహ్మాండంబుతో నొత్తినం**
**గుఱుగుఱ్ఱుంచెడసందిబిట్టొరలు నా ఘోరాహి నీ యంఘ్రికిన్**
**గిఱుచెప్పైన విధంబు నా మనములోఁ గీలించినట్లయ్యెడిన్**

ఆక్రాంత సమస్తలోక = ఆక్రమింపబడిన సమస్తలోకములు కలవాడా !, బలిదైత్యధ్వంసి, ఓ దేవ, నీ అఱకాలు, తతిన్ = తగినసమయమందు, ఉద్ధతిన్ = అతిశయముచే, రాహుమండలమున్, బ్రహ్మాండంబుతోన్, ఒత్తినన్ = గట్టిగా నదుమగా, ఎడసందిన్ = బ్రహ్మాండమునకు, కాలికి మధ్య ప్రదేశమునందు, గుఱు గుఱ్ఱుంచున్ = గుఱ్ఱుమనుచు, బిట్టు = గట్టిగా, ఒరలున్ = ఏడ్చుచున్న, ఆ ఘోరాహి = ఆ క్రూరుడైన రాహువు, నీ అంఘ్రికిన్ = నీ కాలికి, కిఱుచెప్ప ఐన విధంబున్ = కిఱ్ఱుమని ధ్వనిచేయునట్టి చెప్పు అయిన విధముగా, నా మనంబులోన్, కీలించినట్లు = హత్తుకొన్నట్లు, అయ్యెడిన్ = ఐనది. (ఉత్ప్రేక్ష)

తా. లోకములనన్నిటిని ఆక్రమించినవాడా ! బలిని చంపినవాడా ! ఓ దేవ ! నీ కాలు బలి శిరముపై నుంచుటకు ఎత్తినపుడు అతిశయముతో రాహుమండలమును బ్రహ్మాండమును ఒత్తగా ఆ మధ్య ప్రదేశమున గుఱ్ఱుమనుచు గట్టిగా ఏడ్చుచున్న క్రూరుడైన రాహువు నీ కాలికి కిఱ్ఱుచెప్పురీతిని ధ్వనిచేయుచు హత్తుకొనినట్లు నామనసులో అయ్యెను.

**126 తే. తిరిగెనఁట జాంబవంతుండు దేవ నీకు**
**దైత్య బంధనవేళఁ బ్రదక్షిణంబు**
**తద్భ్రమీ చక్రవలయంబు దంభవటుక**
**యుచిత బంధన రజ్జువై యుండకున్నె**

దంభవటుక = ఓ కపట బ్రహ్మచారీ !, దైత్య బంధనవేళన్ = బలిని బంధించు సమయమునందు, దేవ = ప్రభూ, నీకు, జాంబవంతుండు, ప్రదక్షిణంబు, తిరిగెనట, తత్ = ఆ ప్రదక్షిణము, భ్రమీచక్రవలయంబు = గుండ్రముగా తిరుగుట యనెడి వలయము, ఉచిత = తగిన, బంధన రజ్జువై = బంధించుత్రాడై, ఉండకున్నె = ఉండకపోవునా ?(ఉత్ప్రేక్ష)

తా. ఓ కపటబ్రహ్మచారీ ! బలిని బంధించు సమయమునందు ప్రభూ ! నీకు జాంబవంతుడు ప్రదక్షిణము చేసెనట. ఆ తిరగడం నీకు తగిన బంధించుత్రాడు కాకపోవునా ?

**127 తే. క్షత్రజాతికి నీ చేయి కారణంబు**
**దత్క్షయంబున కదియ నిదానమయ్యెఁ**
**గారణమునంద విలయంబు గార్యమునకు**
**ననుట యుచితంబుగాదె రామావతార !**

రామావతార = ఓ పరశురామావతారా !, క్షత్రజాతికిన్ = క్షత్రియవంశమునకుకు, నీ చేయి, కారణంబు = కారణమైనది, తత్ క్షయంబునకున్ = ఆ వంశ నాశనమునకు, అదియ = ఆ బాహువే, నిదానము = కారణమయ్యెను. కారణమునంద, కార్యమునకున్ = పుట్టిన పదార్థమునకు, విలయంబు = నాశనము, అనుట, ఉచితంబు కాదె = తగినదేకదా !

తా. ఓ పరశురామావతారా ! ఓ దేవా ! క్షత్రియవంశ సృష్టికి నీ బాహువే కారణము. ఆ వంశ నాశనమునకును నీ బాహువే కారణమైనది. కారణమునందే కార్యమునకును నాశనము అనుట తగినదేకదా !

**128 సీ. తను సృజించిన విధాతకుఁ బూర్వ రాముండు**
**లీలాభ్యసన హస్త లేఖనముగఁ**
**దన విశ్వభూషణత్వముతోడ ఖర దూష**
**ణచ్ఛిదాకేళి యన్వయము నొందఁ**
**దన్నుఁ జింతించు నధ్యాత్మవేదులు రావ**
**ణానీక హృన్మోహ మాసపడఁగఁ**
**దన ఖడ్గధార ద్రెళ్ళిన శంబుకుని కీర్తి**
**కదలి కంబు కదంబకంబు గెలువ**

**తే. దివ్యనామ సహస్ర ప్రతినిధియనఁగఁ**
**దారక బ్రహ్మమనఁ దన పేరు మెఱయ**
**నతిశయిల్లిన నీ సప్తమావతార**
**మహరహంబును వర్ణింతు నాదిపురుష!**

ఆదిపురుష = ఓ పరమేశ్వరా!, తనున్ = తనను, సృజించిన = సృష్టించిన, విధాతకున్ = బ్రహ్మకు, పూర్వ రాముండు = పరశు రాముడు, లీల = సృజించుటయందలి, అభ్యసన = నేర్పుకొరకు, హస్త లేఖనముగన్ = గీసిన బొమ్మకాగా, తన విశ్వభూషణత్వముతోడ = తనయొక్క లోకమున కలంకారమగుటతో, ఖర దూషణ = ఖరునియొక్కయు, దూషణునియొక్కయు, ఛిదాకేళి = ఖండించుటయనెడి క్రీడ, అన్వయమున్ ఒందన్ = సంబంధమును పొందుచుండగా, తన్ను = తనను, చింతించు = ధ్యానించు, అధ్యాత్మవేదులు = వేదాంతవిద్య తెలిసినవారు, రావణ అనీక = రావణుని సైన్యముయొక్క, హృత్ = మనసునందలి, మోహము = మోహమును, ఆసపడగన్ = కోరుకొనగా, తన = తనయొక్క, ఖడ్గధారన్ = కత్తి అంచుచే, త్రెళ్ళిన = తెగిన, శంబుకుని కీర్తి = శంబుకునియొక్క కీర్తి,కడలి = సముద్రమునందలి, కంబు కదంబకంబున్ = శంఖ సముదాయమును, గెలువన్ = గెలువగా, దివ్య = అద్భుతమైన, నామ సహస్ర = వేయి నామములకు, ప్రతినిధి అనగన్ = సమానమైనదియనగా, తారక బ్రహ్మమనన్ = పరబ్రహ్మయనగా, తన పేరు, మెఱయన్ = ప్రకాశింపగా, అతిశయిల్లిన = అతిశయించిన, నీ సప్తమ అవతారమున్ = నీ ఏడవ అవతారమును, అహరహంబును = ప్రతి నిత్యమును, వర్ణింతును = స్తుతింతును.

తా. ఓ పరమేశ్వరా ! నిన్ను సృష్టించిన బ్రహ్మకు నీకంటె ముందు సృష్టింపబడిన పరశురాముడు నేర్పుకొరకు గీసిన బొమ్మకాగా, నీ సర్వలోక సౌందర్యముతో ఖర, దూషణులను ఖండించిన క్రీడ సంబంధమును పొందుచుండగా, నిన్ను ధ్యానించు వేదాంతవిద్య తెలిసినవారు రావణుని సైన్యముయొక్క భ్రాంతిని కోరుకొనుచుండగా (అంతటా తానే కనబడుట), తన కత్తిఅంచుచే తెగిన శంబుకుని కీర్తి సముద్రమందలి శంఖ సముదాయమును గెలువగా (ధవళత్వము), అద్భుతమైన నీ సహస్రనామమునకు సమానమైనదిగా, పరబ్రహ్మమనగా నీ పేరు ప్రకాశింపగా అతిశయించిన నీ ఏడవ అవతారమును ప్రతినిత్యమును స్తుతింతును.

**129 సీ.** **జనకాజ్ఞకును లోక జనవాదమునకుఁ గా**
**నుర్వీజ యగు లక్ష్మి నుజ్జగించి**
**తజునిఁ బుత్రునిఁ జేసి తట్టి నెయ్యము పొంటె**
**నజుని పౌత్రుండవై యవతరిలితి**
**ధాత్రి నిక్ష్వాకు సంతతి నుద్భవం బంది**
**యాశ్రయించినవారి కమృత మిత్తు**
**వాలాయముగ విశ్రవసు కూర్మి కన్నెకు**
**విశ్రవస్త్వము గూర్చ వేడ్క పడితి**

**తే.** **పెద్దకాలంబు వాసితి ప్రియవధూటి**
**ననుజు నొకనాఁడు వాసి దేహంబు దొఱఁగి**
**తెవ్వఁ డెఱుఁగును నీ చంద మిట్టిదనఁగ**
**రాజితానేక గుణభద్ర రామభద్ర !**

రాజిత = ప్రకాశించుచున్న, అనేక గుణ = పలు గుణములచే, భద్ర = మంగళకరమైనవాడా !, జనక ఆజ్ఞకును = తండ్రి యానతికిని, లోక జనవాదమునకుగాన్= లోకమందలిజనుల అపవాదమునకుగాను, ఉర్వీజయగు = భూపుత్రియయిన, లక్ష్మిని = సీతను, ఉజ్జగించితి = విడిచితివి. అజునిన్ = బ్రహ్మను, పుత్రునిన్ చేసితి = కుమారునిగా కంటివి, అట్టి = అటువంటి, నెయ్యము పొంటెన్ = సంబంధముచేతనే, అజుని పౌత్రుండవై = అజమహారాజునకు మనుమడవై, అవతరిలితి = జన్మించితివి. ధాత్రిన్ = భూమిపై, ఇక్ష్వాకు సంతతిన్ = ఇక్ష్వాకు వంశమునందు, ఉద్భవంబంది = పుట్టి, ఆశ్రయించిన వారికి = శరణన్నవారికి, అమృతము ఇత్తు = మోక్షము నిచ్చెదవు. వాలాయముగన్ = అత్యంతము, విశ్రవసు కూర్మి కన్నెకు = శూర్పణఖకు, విశ్రవస్త్వము కూర్పన్ = చెవులు లేకుండ చేయుటను, వేడ్కపడితి = సంతోషపడితివి. పెద్దకాలంబు = చాలకాలము, ప్రియవధూటిన్ = ప్రియ భార్యను, వాసితి = విడిచియుంటివి. అనుజున్ = తమ్ముడగు లక్ష్మణుని, ఒకనాడు బాసి = ఒక్క రోజు విడిచినంతనే, దేహంబు తొఱగతి = శరీరమును విడిచితివి. నీ చందము = నీ పద్ధతి, ఇట్టిది అనగ = ఇలా ఉంటుందని, ఎవ్వడు ఎఱుగును = ఎవరు తెలుసుకొనగలుగుదురు.(అలంకారము – విరోధాభాసము)

తా. ప్రకాశించు పలుగుణములచే మంగళకరమైనవాడా! తండ్రి యానతికిని, లోకాపవాదమునకును భూపుత్రి సీతను విడిచిపెట్టితివి. బ్రహ్మను కుమారునిగా కంటివి. అటువంటి సంబంధముచేతనే అజమహారాజునకు మనుమడవై అవతరించితివి. భూమిపై ఇక్ష్వాకువంశమునందు పుట్టి శరణన్నవారికి మోక్షము నిచ్చితివి. శూర్పణఖకు చెవులు లేకుండ చేయుటను సంతసించితివి. చాలకాలము ప్రియభార్యను విడిచియుంటివి కాని తమ్ముడగు లక్ష్మణుని ఒక్క రోజు విడిచినంతనే దేహమును విడిచితివి. నీ పద్ధతి ఇట్టిదని ఎవ్వరెరుగుదురు?

**130 తే.** **కామ సమ్మోహిత క్రౌంచ ఘాతమునకు**
**వగచి నీ చాటుకవి చెంచువానిఁ గినిసెఁ**
**గామమోహితయగు నింతిఁ గష్టపఱుప**
**ననుజుఁ బురికొల్పితివి నీకుఁ జనునె రామ**

నీ చాటుకవి = నిన్ను స్తుతించిన వాల్మీకి, కామ సమ్మోహిత = మన్మథవికారముచే మిక్కిలి మోహమునందిన, క్రౌంచ ఘాతమునకు = క్రౌంచ పక్షులను కొట్టినందులకు, వగచి = విచారించి, చెంచువానిన్ = కిరాతుని, కినిసెన్ = శపించెను, కామ మోహితయగు = కామ వికారమునందిన, ఇంతిన్ = శూర్పణఖను, కష్టపఱుపన్ = బాధించుటకు, అనుజున్ = తమ్ముని, పురికొల్పితివి = ఱెచ్చకొట్టితివి, రామ నీకున్, చనునె = తగునా?(అలంకారము – వ్యాజస్తుతి)

తా. నీ భక్తుడగు వాల్మీకి మన్మథవికారమునందిన క్రౌంచ పక్షులను కొట్టినందులకు విచారించి కిరాతుని శపించెను. నీవు మన్మథవికారమునందిన శూర్పణఖను బాధించుటకు లక్ష్మణుని ఱెచ్చకొట్టితివి. రామా ! ఇది నీకు తగునా?

**131 తే.** **నందనోద్యాన వాటికాంతరము సొచ్చి**
**వితరణ స్పర్ధఁబోలె దైవతకుజంబు**
**వెఱికి భూమిమీదఁ బడవైచి పేర్చినట్టి**
**విక్రమాలంకరిష్ణు శ్రీవిష్ణుఁ గొలుతు**

వితరణ స్పర్ధన్ పోలెన్ = దానగుణమునందు తనకు పోటీయగుచున్నదని, నందన ఉద్యాన వాటిక = నందనోద్యాన వీథియందు, అంతరము చొచ్చి = లోనికి ప్రవేశించి, దైవత కుజంబు = కల్ప క్షమును, పెఱికి = పెకలించి, భూమిమీదన్, పడవైచి = పడునట్లుచేసి, పేర్చినట్టి = అతిశయించిన, విక్రమ అలంకరిష్ణు = శౌర్యమునే అలంకారముగాగల, శ్రీవిష్ణున్ = విష్ణుమూర్తిని, కొలుతున్ = సేవించెదను. (అలంకారము – ఉత్ప్రేక్ష)

తా. దానగుణమునందు తనకు పోటీయగుచున్నదని నందనోద్యాన వనమున ప్రవేశించి కల్పవృక్షమును పెకలించి భూమిమీదకు తెచ్చి తన గొప్ప పరాక్రమమునే అలంకారముగాగల శ్రీమహావిష్ణుని సేవించెదను.

**132 తే.** **శైశవమునాడు కర్పరీ శకలపాళిఁ**
**దెచ్చి కాళింది తరగలఁ ద్రెవ్వవైతు**
**భావి బాణ భుజాదండ భంజనమున**
**కభ్యసనమయ్యె నీ కది యబ్జనాభ !**

అబ్జనాభ = కమలము నాభియందుకలవాడా !, శైశవమునాడు = బాల్యమునందు, కర్పరీ శకలపాళిన్ = కుండపెంకుల సమూహమును, తెచ్చి, కాళింది తరగలన్ = యమునానది తరంగములను, త్రెవ్వవైతు = తెగునట్లుగా విసరితివి, అది = ఆ విసరుట, భావి = భవిష్యత్తులో, బాణ = బాణాసురునియొక్క, భుజాదండ = స్తంభములవంటి భుజములను, భంజనమునకు = విఱుగ కొట్టుటకు, నీకు, అభ్యసనము అయ్యెన్ = అభ్యాసమయ్యెను.

తా. ఓ కృష్ణా ! బాల్యమునందు కుండపెంకులను తెచ్చి యమునానది తరంగములను తెగునట్లుగా విసరితివి. అది భవిష్యత్తులో బాణాసురుని స్తంభములవంటి భుజములను విఱుచుటకు అభ్యాసమయ్యెను.

**133 చ.** **వలపలి కన్ను నీకు రవి వారిజలోచన! చందురుండు దా**
**పలి నయనంబు గర్ణుఁడును బార్థుఁడుఁ దత్ప్రియ నందనుండు ద**
**త్కులజుఁడు వీరొకండొకనితోఁ గలహింప సహించితెట్లొకో**
**వలపలి లోచనాబ్జమును వామ దృగబ్జము వేఱె యచ్యుతా !**

వారిజలోచన = పద్మనయనా !, నీకు, రవి = సూర్యుడు, వలపలి కన్ను = కుడి కన్ను, చందురుండు, దాపలి నయనంబు = ఎడమ కన్ను, తత్ ప్రియనందనుండు = ఆ సూర్యుని ప్రియ పుత్రుడైన, కర్ణుడును, తత్ కులజుడు = ఆ చంద్రవంశమున పుట్టిన అర్జునుడును, వీరు, ఒకండొకనితో = పరస్పరము, కలహింప = పోట్లాడ, సహించితి = సహించితివి, ఎట్లొకో = ఎలా సహించగలిగావు?, వలపలి లోచనాబ్జమును = కుడి పద్మనేత్రమును, వామ దృగబ్జము = ఎడమ పద్మనేత్రమును, అచ్యుతా = కృష్ణా ! వేఱె = వేరయినవా ? (అలంకారము – వ్యాజస్తుతి)

తా. ఓ కృష్ణా ! నీకు సూర్యుడు కుడి కన్ను, చంద్రుడు ఎడమ కన్ను. ఆ సూర్యుని పుత్రుడయిన కర్ణుడును, చంద్రవంశమువాడైన అర్జునుడును వీరిరువురు పరస్పరము పోట్లాడుకొనుచుండగా ఎట్లు సహించితివి? అచ్యుతా ! కుడి కన్ను ఎడమ కన్ను వేఱయినవా?

**134 తే.** **అమరపతిసూను నిర్జించి తార్కిఁ గూడి**
**దైత్యమర్దన రామావతార వేళ**
**నా మనఃక్లేశ ముడుగనే యార్కి నణఁచి**
**తమరపతి సూనుఁ గూడి కృష్ణావతార !**

దైత్యమర్దన = రాక్షస సంహారకా !, రామావతార వేళ = రామావతార సమయమున, అమరపతి సూనున్ = ఇంద్రుని కుమారుని, అర్కిన్ కూడి = సూర్యపుత్రునితో కలిసి, నిర్జించితి = చంపితివి. ఆ మనఃక్లేశ ముడుగనే = ఆ మనోవేదన పోవుటకే, కృష్ణావతార = ఓ కృష్ణా ! అమరపతి సూనున్ కూడి = ఇంద్రునికొడుకుతో కలిసి, అర్కిన్ = సూర్యపుత్రుని, అణచితి =

చంపితివి. (అలంకారము – హేతూత్ప్రేక్ష)

తా. రాక్షస సంహారకా ! రామావతారమున ఇంద్రుని కుమారుని సూర్యుని కొడుకుతో కలిసి చంపితివి. ఆ మానసిక వ్యధ తొలగుటకే కృష్ణావతారమున ఇంద్రుని కొడుకుతో కలిసి సూర్యుని కుమారుని చంపితివి.

**135 తే.**
**దైత్యమర్దన ! శ్రీవత్స ధారణంబు**
**పొసఁగు దేవర ! శ్రీవల్లభుండ వగుటఁ**
**దామరస నేత్ర ! నీవు రాధా ప్రియుండ**
**వకట ! రాధేయుఁ జపించు టర్హమగునె**

దైత్యమర్దన = రాక్షసులను సంహరించిన ఓ కృష్ణా !, శ్రీ వల్లభుండవు అగుటన్ = లక్ష్మీదేవికి పతివగుటచే, దేవర = ప్రభూ ! శ్రీ వత్స లాంఛనంబు = లక్ష్మీదేవి పుత్రుని ఎత్తుకొనుట (శ్రీవత్సమను మచ్చను కలిగియుండుట), పొసగు = తగినదే. తామరస నేత్ర = ఓ పద్మనేత్రా !, నీవు, రాధాప్రియుండవు, అకట = అయ్యో, రాధేయున్ = రాధా పుత్రుని కర్ణుని, చంపించుట, అర్హమగునె = తగునా ! (అలంకారము – వ్యాజస్తుతి)

తా. రాక్షసులను సంహరించు ఓ కృష్ణా ! నీవు లక్ష్మీదేవికి పతివగుటచే లక్ష్మీదేవి పుత్రుని ఎత్తుకొనుట ఎంతయు సముచితమే. ఓ పద్మనేత్రా ! నీవు రాధకు ప్రియుడవు కదా ! మరి అయ్యో ! రాధా పుత్రుని కర్ణుని చంపించుట తగునా !

**136 తే.**
**కుముదబాంధవ ! రేవతీ రమణ ! భద్ర !**
**కామపాల ! శరన్మేఘ గౌరవర్ణ !**
**త్రిజగతీ లోచనోత్సవ ! దేవ ! నీకు**
**నందమైయుండు నీలాంబరాకలనము**

బలరామ పరంగా : కుముదబాంధవ = కుముదుడనెడి సర్పరాజునకు బంధువు, రేవతీ రమణ = రేవతీదేవికి భర్తయైనవాడా!, భద్ర = బలభద్రుడను పేరు కలవాడా !, కామపాల = బలరామా !, శరత్ మేఘ గౌర వర్ణ = శరత్కాల మేఘమువలె తెల్లని దేహచ్ఛాయ కలవాడా !, త్రిజగతీ లోచన ఉత్సవ = మూడు లోకములకు నేత్రోత్సవముకలిగించువాడా !, దేవ = ప్రభూ !, నీకున్, నీలాంబర ఆకలనము = నల్లని వస్త్రము ధరించుట, అందమై ఉండున్.

చంద్రుని పరంగా : కుముదబాంధవ = కలువల ప్రియుడా !, రేవతీ రమణ = రేవతీ నక్షత్రమునకు పతియైనవాడా ! భద్ర = శుభుడా !, కామపాల = మన్మథ పోషకా !, శరత్ మేఘ గౌరవర్ణ = శరత్కాల మేఘమువలె తెల్లని దేహచ్ఛాయ కలవాడా!, త్రిజగతీ లోచన ఉత్సవ = మూడు లోకములకు నేత్రోత్సవము కలిగించువాడా !, దేవ = ప్రభూ !, నీకున్, నీల అంబర ఆకలనము = నల్లని ఆకాశమందు వ్యాపించియుండుట, అందమై ఉండున్. (అలంకారము – శ్లేష)

తా. బలరాముడు ఆదిశేషుని యవతారము కావున కుముదుడనెడి సర్పరాజునకు బంధువు, రేవతీ దేవికి భర్త, బలభద్రుడను పేరు కలవాడు, శరత్కాల మేఘమువలె తెల్లని దేహచ్ఛాయ కలవాడు, మూడులోకములకు నేత్రోత్సవము కలిగించువాడు అటువంటి నీకు నల్లని వస్త్రము ధరించుట ఎంతయు అందముగానుండును.

**137 క.**
**బలరామ కృష్ణ సంజ్ఞలఁ**
**దెలుపు నలుపునైన దివ్య తేజంబులతో**
**నిలమీఁద నవతరించిన**
**జలజాక్షుని నెఱులు శర్మ సౌరభ మొసఁగున్**

బలరామ కృష్ణ సంజ్ఞలన్ = బలరాముడు, కృష్ణుడు అను పేరులతో, తెలుపు నలుపునైన, దివ్య తేజంబులతోన్, ఇల మీదన్ = ఈ భూమిమీద, అవతరించిన, జలజాక్షుని నెఱులు = విష్ణుని కేశములు, శర్మ సౌరభము ఒసగున్ = సౌఖ్యాతిశయమును కలిగించుగాక. (విష్ణువు విడిచిన రెండు వెంద్రుకలు బలరామ, కృష్ణులుగా అవతరించిరని పురాణములు)

తా. బలరాముడు, కృష్ణుడు అను పేరులతో తెలుపు నలుపునైన దేహచ్ఛాయతో ఈ భూమండలమున జన్మించిన విష్ణుని కేశములు సౌఖ్యాతిశయమును కలిగించుగాక.

**138 తే.**
**ఏక యద్వయవాది త్రయీవిదూర**
**యనవ గీత చతుర్విధ ఖ్యాతిమార్గ**
**పంచబాణారి షడభిజ్ఞ పరమపురుష**
**బుద్ధ సంపత్పరంపరా వృద్ధి నొసఁగు**

బుద్ధావతారము : ఏక = ఏకాకారమైనవాడా ! అద్వయవాది = రెండు లేదనువాడా !, త్రయీ విదూర = వేద ప్రామాణ్యము నంగీకరించనివాడా !, అనవగీత = అంగీకరింపబడని, చతుర్విధ = నాలుగు విధములగు, ఖ్యాతిమార్గ = జ్ఞానరీతులు కలవాడా ! (సాంఖ్య సిద్ధాంతము, వేదాంతుల సిద్ధాంతము, మీమాంసకుల సిద్ధాంతము, అద్వైతుల సిద్ధాంతములను బుద్ధుడు అంగీకరింపలేదు), పంచబాణారి = మన్మథుని జయించినవాడా !, షట్ అభిజ్ఞ = ఆరు జ్ఞానప్రకారములు కలవాడా

!(దేశాంతరమందున్న వస్తువును చూచుట, శబ్దమును వినుట, పూర్వజన్మ స్మృతి, ఇతరుల హృదయము తెలుసు కొనుట, క్లేశములను పరీక్షించుట, అణిమాది సిద్ధులు), పరమ పురుష = ఓ పుణ్యపురుషా !, బుద్ధ = ఓ బుద్ధా !, సంపత్ పరంపరా వృద్ధిని ఒసగు = సంపదలయొక్క అభివృద్ధిని ఇమ్ము.

తా. ఏకాకారమైనవాడా ! రెండవది లేదనువాడా ! వేద ప్రామాణ్యము నంగీకరింపనివాడా ! నాలుగు విధములగు జ్ఞానరీతులను అంగీకరింపనివాడా ! మన్మథుని జయించినవాడా ! ఆరు జ్ఞాన ప్రకారములు కలవాడా ! ఓ పుణ్యాత్ముడా! బుద్ధా ! సంపదల సమృద్ధిని ఇమ్ము.

**139 తే. బుద్ధ ! నీ గట్టి హృదయ సంపుటము దాఁకి**
**కుంఠితములయ్యె మరు నంపకోలలెల్ల**
**మొద్దువోయికదా యిప్డు మురవిరోధి**
**యలరులెల్లను వర్తులాస్యంబు లయ్యె**

బుద్ధ = ఓ బుద్ధదేవా !, మరుని అంపకోలలు ఎల్ల = మన్మథుని బాణములన్నియును, నీ గట్టి హృదయ సంపుటము దాకి = నీయొక్క గట్టిదైన హృదయమనెడి పెట్టెకు తగిలి, కుంఠితములు అయ్యెన్ = మొక్కవోయినవి, ముర విరోధి = ఓ మురారీ, మొద్దుపోయి కదా = మొద్దువైపోవుటచేతనేకదా !, ఇప్డు, అలరులు ఎల్లను = పూవులన్నియును, వర్తుల ఆస్యంబులు అయ్యెన్ = గుండ్రని మొగములుకలవి అయ్యెను.

తా. ఓ బుద్ధదేవా ! మన్మథుని బాణములన్నియును నీ దృఢమైన హృదయమును తాకి మొక్కవోయినవి. ఓ మురారీ! అలా మొద్దుపోవడంచేతనేకదా ఇప్పుడు పూవులన్నియును గుండ్రని మొగముకలవయ్యాయి.

**140 తే. ముఖ్య చతురాననుఁడ వీవు ముని శరణ్య !**
**గౌణ చతురాననుం డల కమలభవుఁడు**
**నీవు సర్వజ్ఞుడవు బుద్ధదేవ ! నిజము**
**శంభు సర్వజ్ఞుఁడగుట లాక్షణికవృత్తి**

మునిశరణ్య = మునులను రక్షించు ఓ దేవా !, ఈవు = నీవు, ముఖ్య = ప్రధానముగా (అభిదావృత్తిచే), చతురాననుడవు = చతుర వదనుడవు, అల కమలభవుడు = ఆ బ్రహ్మ, గౌణ చతురాననుండు = గుణ సంబంధముచే చతుర వదనుడు, బుద్ధదేవ = ఓ బుద్ధదేవా !, నీవు, సర్వజ్ఞుడవు = సర్వము తెలిసినవాడవు, నిజము = ఇది సత్యము, శంభు = శివుడు, సర్వజ్ఞుడు అగుట, లాక్షణికవృత్తి = లక్షణావృతిచేతనేసుమా ! (అలంకారము – అపహ్నవము)

తా. మునిశరణ్యా ! నీవు అభిదావృత్తిచే చతురమైన మాటలుపలుకు వదనుడవు. ఆ బ్రహ్మ గుణ సంబంధముచే చతురవదనుడు. ఓ బుద్ధదేవా ! నీవు సర్వజ్ఞుడవు. ఇది సత్యము. శివుడు సర్వజ్ఞుడనుట లక్షణావృత్తిచేతనే సుమా !

**141 తే. జ్ఞాన కర్మేంద్రియోపాధి సంప్రభూత**
**దశ మహాకల్క నీహార దశ శతాంశు**
**దశమ దివ్యావతారు నత్యంత నియతిఁ**
**గల్కి దేవుని నినుఁ గొల్తుఁ గైటభారి !**

కైటభారి = కైటభుడనే రాక్షసుని సంహరించినవాడా !, జ్ఞాన = జ్ఞానేంద్రియములయొక్కయు, కర్మ = కర్మేంద్రియముల యొక్కయు, ఉపాధి = ఉపాధివలన, సంప్రభూత = పుట్టిన, దశ మహాకల్క = పది మహాపాపములనెడి, నీహార = పొగమంచునకు, దశ శతాంశు = వేయికిరణముల సూర్యుని వంటివాడును, దశమ దివ్య అవతారున్ = పదవ గొప్ప అవతారమెత్తినవాడునగు, కల్కిదేవుని, నినున్ = నిన్ను, అత్యంత నియతిన్ = మిక్కిలి నిష్ఠతో, కొల్తున్ = సేవించెదను.

తా. ఓ కైటభారీ ! జ్ఞానేంద్రియములయొక్కయు, కర్మేంద్రియములయొక్కయు ఉపాధివలన పుట్టిన పది మహా పాపములనెడి పొగమంచునకు సూర్యుడవును, పదవ అవతారమూర్తియునైన కల్కిదేవుని నిన్ను మిక్కిలి నిష్ఠతో సేవించెదను.

**142 క. విశ్వవ్యాప్త యశో ని**
**త్యైశ్వర్యసమృద్ధి విష్ణుయశుఁడను నామం**
**బీశ్వర కల్కి సమాహ్వయ**
**నిశ్వసదర్థమయి చెల్లు నీ జనకునకున్**

ఈశ్వర = ఓ ప్రభూ !, కల్కిసమాహ్వయ = కల్కి యను పేరుకలవాడా !. విశ్వవ్యాప్త = విశ్వమంతయు వ్యాపించిన, యశ: = కీర్తియొక్క, నిత్య = శాశ్వతమైన, ఐశ్వర్య సమృద్ధి = సంపదయొక్క అభివృద్ధిచేతను, నీ జనకునకున్ = నీ తండ్రికి, విష్ణుయశు డను నామంబు = విష్ణుయశుడను పేరు, నిశ్వసదర్థమయి = సార్థకమయినదై, చెల్లు = ఒప్పుచున్నది.

తా. ఓ ప్రభూ ! కల్కియను పేరు కలవావాడా ! నీ తండ్రికి విష్ణుయశుడని పేరు. నీయొక్క విశ్వమంతయు వ్యాపించిన కీర్తిచేతను, శాశ్వతమైన సంపదయొక్క అభివృద్ధిచేతను ఆ పేరు సార్థకమయినదై ఒప్పుచున్నది.

**143 క.** **కురువీర పంక్తికంథర**
**హిరణ్యకశిపుల జయించితీ వంబురుహో**
**దర ! మూడవతారంబుల**
**నర హరి లీలావిడంబన ప్రౌఢుఁడవై**

అంబురుహోదర = ఓ పద్మనాభుడా !, మూడవతారంబుల = కృష్ణ, శ్రీరామ, నరసింహావతారముల, నర = నరుని యొక్కయు, హరి = విష్ణునియొక్కయు, లీలా = చేష్టలను, విడంబన = అనుకరించుటయందు, ప్రౌఢుడవై = సమర్థుడవై, కురువీర = భీష్మ, ద్రోణాది కౌరవ వీరులను, పంక్తికంథర = రావణుని, హిరణ్యకశిపులన్, ఈవు = నీవు, జయించితివి.

తా. ఓ పద్మనాభుడా ! కృష్ణ, శ్రీరామ, నరసింహావతారములలో నరునియొక్కయు, విష్ణువుయొక్కయు చేష్టలను అనుకరించుటయందు సమర్థుడవై భీష్మ,ద్రోణాది కౌరవవీరులను, రావణుని, హిరణ్యకశిపులను నీవు జయించితివి.

**144 తే.** **అర్జునచ్ఛేద మొనరించి తర్ధచక్ర**
**సన్నిభంబైన శితపరశ్వధముచేత**
**సర్వ లోకేశ సంపూర్ణ చక్రధార**
**బాణ భంజన మొనరింప బరువె నీకు**

సర్వలోకేశ = సమస్త లోకములకు ప్రభువా !, అర్ధచక్ర సన్నిభంబైన = చక్రముయొక్క సగభాగముతో సమానమైన, శిత పరశ్వధముచేత = వాడి గండ్రగొడ్డలిచేత, అర్జునచ్ఛేదము ఒనరించితి = కార్తవీర్యుని ఖండించితివి, సంపూర్ణ చక్రధారన్ = నిండైన చక్రపు అంచుచే, బాణ భంజనము = బాణాసురుని వధించుటను, ఒనరించుట = చేయుట, నీకు బరువె?

తా. సఁమస్తలోకములకు ప్రభువా ! చక్రపు సగభాగముతో సమానమైన వాడి గండ్రగొడ్డలిచేత కార్తవీర్యార్జునుని సంహరించితివి. నిండైన సుదర్శన చక్రముచే బాణాసురుని సంహరించుట నీకు బరువగునా ? ( అలంకారమ- అర్థాపత్తి)

**145 తే.** **ప్రథమ పరమేష్ఠివైన నీ ప్రకృతియందు**
**శేషఫణిరాజవయిన నీ శిరమునందుఁ**
**గపటబాలుండవయిన నీ కడుపునందు**
**విశ్వములు పండునని నాథ విందు శ్రుతుల**

నాథా = ఓ ప్రభూ !, ప్రథమ పరమేష్ఠివైన = మొదటి బ్రహ్మవైన, నీ ప్రకృతియందు = నీ మాయయందు, శేష ఫణిరాజవు = ఆదిశేషుడవు, అయిన = అయినట్టి, నీ శిరమునందు = నీ పడగలయందు, కపట బాలుండవయిన = మాయా శిశువువైన, నీ కడుపునందు, విశ్వములు = భువనములు, పండునని = శయనించియుండునని, శ్రుతులన్ = వేదములందు, విందు = వినుదును.

తా. ఓ ప్రభూ ! మొదటి బ్రహ్మవైన నీ మాయయందును, ఆదిశేషుడవయినట్టి నీ పడగలయందును, మాయా శిశు వైన నీ కడుపునందును భువనములు శయనించియుండునని వేదములందు వినుచున్నాము. పరమాత్ముడు సృష్టి, స్థితి, లయ కారకుడని తెలుపబడెను.

**146 క.** **సంసారి నికర మానస**
**సంసద్భవ నావకరరజ శ్శోధని యో**
**కంసారి నీ పదాబ్జ ని**
**నంసా పరిశుద్ధి బుద్ధినైపుణిఁ దలఁపన్**

ఓ కంసారి = ఓ కంసుని సంహరించినవాడా !, బుద్ధి నైపుణిన్ = బుద్ధి చాతుర్యముచేత, తలపన్ = ఆలోచింపగా, నీ పదాబ్జ = నీ పాదపద్మములయొక్క, నినంసా = సమస్కరించుటయందలి తలంపుయొక్క, పరిశుద్ధి = నైర్మల్యము, సంసారి = సంసారమందున్నవారియొక్క, నికర = సమూహముయొక్క, మానస = మనస్సనెడి, సంసద్భవన = సభామందిరము నందున్న, అవకర రజః = రాగద్వేషాదులను కలిగించు రజోగుణమనెడి పరాగమును, శోధని = తుడుచునట్టిది.

తా. ఓ కృష్ణా ! బుద్ధిచాతుర్యముచే ఆలోచింపగా నీ పాదపద్మములకు నమస్కరించు తలంపుయొక్క నైర్మల్యము సంసారమందున్నవారి సమూహముయొక్క మనస్సనెడి సభామందిరమునందున్న రాగద్వేషాదులను కలిగించు రజోగుణ మనెడి పరాగమును తుడుచునట్టిది.

**147 తే.** **ధర్మబీజ ! వియన్నదీ తాతపాద !**
**కామితార్థ ప్రదానైక కల్పవృక్ష !**
**కామజనక ! చిదాత్మ ప్రకాశరూప !**
**కమలనాభ ! చతుర్వర్గ గతివి నీవ**

ధర్మబీజ = ధర్మమునకు కారణమైన, వియన్నదీతాత పాద = ఆకాశగంగకు తండ్రియగు పాదములుకలవాడా !, కామిత =

కోరబడిన, అర్థ = ధనాదులను, ప్రదాన = ఇచ్చుటయందు, ఏక = ముఖ్యమగు, కల్పవృక్ష = కల్పవృక్షమైనవాడా !, కామజనక = మన్మథుని తండ్రియైనవాడా !, చిత్ = జ్ఞానమే, ఆత్మ = స్వరూపముగాగల, ప్రకాశరూప = కాంతియే మూర్తిగాకలవాడా!, కమలనాభ = ఓ పద్మనాభా !, చతుర్వర్గ గతివి = నాలుగు పురుషార్థములకు గతియైనవాడవు, నీవ = నీవే.

తా. ఓ పద్మనాభా ! ధర్మమునకు కారణమైన ఆకాశగంగ పుట్టుకకు కారణమైన పాదములుకలవాడవు, కోరిన సంపదలను ఇచ్చుటయందు ప్రధానమైన కల్పవృక్షమువంటివాడవు, మన్మథునికి తండ్రివి, జ్ఞానమే స్వరూపముగాగల కాంతిస్వరూపుడవు, ధర్మ అర్థ కామ మోక్షములనెడి నాలుగు పురుషార్థములకు ఆధారము నీవే కదా !

**148 తే. విశ్వరూప ! భవద్భూరి విభవ మహిమ**
**యెంత వర్ణింపఁజాలు మా యీ మనంబు**
**ప్రాఁత పైచీర చెఱఁగున బడుగువాఁడు**
**హేమశైలంబు చిదిపి ఱా లెన్ని ముడుచు**

విశ్వరూప = ప్రపంచమే రూపముగాకలవాడా !, భవత్ = నీయొక్క, భూరి విభవ మహిమ = గొప్ప సామర్థ్య అతిశయమును, మా ఈ మనంబు = మాయొక్క ఈ అల్పమైన మనస్సు, ఎంత వర్ణింపన్ చాలు = ఎంతని వర్ణింపగలదు, బడుగువాడు = నిఱుపేద, ప్రాత పైచీర చెఱగున = చిరిగిన ఉత్తరీయముయొక్క కొంగునందు, హేమశైలంబు చిదిపి = బంగారుకొండను బ్రద్దలుకొట్టి, ఱాలు = ఆ బంగారుముక్కలను, ఎన్ని ముడుచు = ఎన్నిటిని మూటకట్టగలుగును?(అలంకారము – దృష్టాంతము)

తా. విశ్వరూపా ! నీయొక్క గొప్ప సామర్థ్యమును మా యీ అల్పమనస్సు ఎంతని వర్ణించగలదు. ఒక పేదవాడు మేరుపర్వతమును బ్రద్దలుకొట్టి తన చిరిగిన ఉత్తరీయపు కొంగునందు ఎన్నిటిని మూటకట్ట గలుగును ?

**149 వ. అని యనేక ప్రకారంబులఁ బ్రస్తుతించి నమస్కరించె. ఇవ్విధంబున దేవతార్చనం బొనరించి, భోజన కార్యంబులు దీర్చి, విజిత వైజయంతంబగు శుద్ధాంతకేళీసౌధంబెక్కి, విహిత కులదేవతా భక్తియుఁ, గృతభుక్తియునగు దమయంతీ మహాదేవితోడం గూడె. అనంతరంబ**

తా. అని అనేక విధములుగా స్తుతించి నమస్కరించెను. ఈ విధముగా పూజ సమర్పించి, భోజనము చేసి జయింపబడిన దేవేంద్రుని మేడయగు వైజయంతియగు అంత:పుర క్రీడాసౌధమును ప్రవేశించి, కులదేవతలకు పూజ కావించినట్టిది, భోజనము చేసిట్టిది యగు దమయంతీ మహాదేవితో కూడెను. తరువాత

**150 శా. ఆ రామారమణుల్ రమాసతియు దైత్యారాతియుంబోలె శృం**
**గార క్రీడలఁ బ్రొద్దుపుచ్చిరి వధూగంధర్వ విద్యాకళా**
**కీరాలాపకలాప కోకిల కుహూ కేళీ మయూరాంగనా**
**చారీమండల తాండవారభటికా సంరంభ సంభావనన్**

ఆ రామా రమణుల్ = ఆ నల దమయంతులు, రమాసతియు దైత్యారియుంబోలె = లక్ష్మీ నారాయణులవలె, వధూ = స్త్రీలయొక్క, గంధర్వవిద్యా = గానవిద్యయందలి, కళా = చాతుర్యము, కీరాలాపకలాప = చిలుకపలుకులసమూహము, కోకిల కుహూ = కోకిల కుహూధ్వనులు, కేళీమయూర = క్రీడార్థమైన ఆడు నెమళ్ళయొక్కయు, చారీ మండల = చారీ మండల అను పేర్లుగల, తాండవారభటికా = నాట్య విశేషముయొక్క, సంరంభ = అతిశయపు, సంభావనన్ = గౌరవముచే, శృంగార క్రీడలన్ = శృంగార క్రీడలచేత, ప్రొద్దుపుచ్చిరి = కాలము గడపిరి.

తా. ఆ నలదమయంతులు లక్ష్మీనారాయణులవలె స్త్రీల గానావిద్యా చాతుర్యముచేతను, చిలుకల పలుకుల సమూహము, కోకిల కుహూధ్వనులు, క్రీడార్థమైన ఆడునెమిళ్ళ చారీ, మండల నాట్య విశేషముచేతను అతిశయించి గౌరవింపబడిన శృంగార క్రీడలచే కాలము గడపిరి.

**151 వ. అంత**

**152 తే. గగన హరినీల శైల శృంగంబునుండి**
**డొల్లిపడెఁ బ్రొద్దు జేగురుఁ గల్లువోలెఁ**
**దన్నిపాత సముద్ధూత ధాతుధూళి**
**చందమునఁ దోఁచె దివసావసాన సంధ్య**

గగన = ఆకాశమనెడి, హరీనీల = ఇంద్రనీలమణిమయపు, శైల = పర్వతముయొక్క, శృంగంబునుండి = శిఖరమునుండి, ప్రొద్దు = సూర్యుడు, జేగురు కల్లువోలె = జేగురుఱాతివలె, డొల్లిపడెన్ = దొర్లిపడెను. తత్ = ఆ జేగురు ఱాతియొక్క, నిపాత = పడుటచేత, సముద్ధూత = ఎగసినట్టి, ధాతు = గైరికాది ధాతువులయొక్క, ధూళిచందమునన్ = పరాగమువలె, దివసావసాన సంధ్య = సాయం సంధ్య, తోఁచెన్ = కానవచ్చెను.(అలంకారము – రూపకము, ఉత్ప్రేక్ష)

తా. ఆకాశమనెడి ఇంద్రనీలమణిమయపు పర్వతముయొక్క శిఖరమునుండి సూర్యుడు జేగురు ఱాతివలె దొర్లి పడెను. ఆ జేగురు ఱాయి పడుటవలన ఎగసిన గైరికాది ధాతువులయొక్క పరాగమువలె సాయంసంధ్య కానవచ్చెను.

**153 ఉ. కోమల తామ్ర చూళికల క్రొవ్విఱి సంజకుఁ బ్రోదివెట్ట ని**
**స్సీమ కఠోర తార రుతిఁ జెట్టుపలార్చుచు నఱ్ఱులెత్తి వి**

**శ్రామమువోలెఁ గూసె విలసచ్చరమాచలకూట పక్కణ**
**గ్రామటికా కుటీర శిఖరంబుల కుక్కుట చక్రవాళముల్**

కుక్కుట చక్రవాళముల్ = కోళ్ళ సమూహములు, విలసత్ = ఒప్పుచున్న, చరమాచల = అస్తాద్రియొక్క కూట = శిఖరములందున్న, పక్కణ = బోయవాళ్ళు నివసించెడి, గ్రామటికా = చిన్నపల్లెలయందలి, కుటీర = గుడిసెలయొక్క శిఖరంబులన్ = కొప్పులయందు, ఎఱ సంజకున్ = ఎఱ్ఱని సంధ్యకాలమునందు, కోమల = మృదువులైన, తామ్ర చూళికల = ఎఱ్ఱని జుట్టులయొక్క క్రొవ్వు = పుష్టి, ప్రోది పెట్టన్ = పెంచుచుండగా, చెట్టుపలు = ఱెక్కలు, ఆర్చుచున్ = ఆడించుచు, అఱ్ఱులు ఎత్తి = మెడలు ఎత్తి, నిస్సీమ = మితిలేని, కఠోర = కఠినమైన, తార రుతిన్ = పెద్ద ధ్వనితో, విశ్రామము పోలెన్ = విశ్రాంతిస్థానమునువలె, కూసెను.

తా. అస్తాద్రియొక్క శిఖరములందున్న బోయలు నివసించెడి పల్లెలందలి గుడిసెలయొక్క కొప్పులయందు కోళ్ళ సమూహములు ఎఱ్ఱని సంధ్యాకాలమునందు మృదువులైన ఎఱ్ఱని జుట్టులయొక్క పుష్టి పెంచుచుండగా ఱెక్కలు ఆడించుచు మెడలు ఎత్తి అధికమైన, కఠినమైన పెద్ద ధ్వనితో విశ్రాంతిస్థానమునువలె కూసెను.

**154 చ. తల ప్రతిబింబ భానుమణి దాల్చి విహార వనాంతరంబునన్**
**మలఁగి మలంగి పెంజిలువ నాతియ భంగి నవీన సారణీ**
**సలిల భరంబు దోలుకొని చయ్యన వచ్చినఁ జూచి భీతి బి**
**ట్టులికియుఁ బోయె నత్తఱి వియోగముఁ బొంది రథాంగదంపతుల్**

ఆ తఱిన్ = ఆ సాయంకాల సమయమందు, నవీనసారణీ సలిల భరంబు = క్రొత్తదైన కాలువ నీటి పూరము, తలన్ = అగ్రభాగమునందు, ప్రతిబింబ భానుమణిన్ = నీటిలో ప్రతిఫలించు సూర్యుడనెడి రత్నమును, తాల్చి = ధరించి, విహార వనాంతరంబునన్ = క్రీడోద్యాన మధ్యమునందు, మలగి మలంగి = వంకరగా నడచుచున్నదై, పెంజిలువ నాతియ భంగిన్ = పెద్ద ఆడుత్రాచువలె, తోలుకొని = తఱుముకొని, చయ్యనన్ = శీఘ్రముగా, వచ్చినన్, చూచి, భీతిన్ = భయముతో, బిట్టు ఉలికియున్ = మిక్కిలి ఉలిక్కిపడి, వియోగమున్ పొంది = ఎడబాటునుపొంది, రథాంగ దంపతులు = చక్రవాక మిధునములు, పోయెన్ = ఎగిరిపోయెను. (అలంకారము – ఉత్ప్రేక్ష)

తా. ఆ సాయం సమయమందు క్రొత్తదైన కాలువ నీటి ప్రవాహము అగ్రభాగమునందు ప్రతిఫలించిన సూర్యుడనెడి రత్నమును ధరించి క్రీడోద్యాన మధ్యమునందు వంకరగా నడచుచున్నదై పెద్ద ఆడుత్రాచువలె తఱుముకొని వేగముగా రాగా చూచి భయపడి మిక్కిలి ఉలిక్కిపడి ఎడబాటును పొంది చక్రవాక దంపతులు ఎగిరిపోయెను.

**155 శా. రశ్మిగ్రాహి గరుత్మదగ్రజ కరారబ్ధా విరామభ్రమిన్**
**గాశ్మీరాభ కరేష్టకారుచి పరాగంబున్ సహస్రాంశు శా**
**ణాశ్మంబు న్గదియించె ధాత నవసంధ్యాఖడ్గము న్వేదనా**
**వేశ్మస్వాంత రథాంగదంపతి చమూ విచ్ఛేద లీలార్థమై**

ధాత = బ్రహ్మ, వేదనా = వియోగ సంతాపమునకు, వేశ్మ = నిలయమగు, స్వాంత = చిత్తములుగల, రథాంగదంపతి = చక్రవాక మిధునములయొక్క, చమూ = సమూహముయొక్క, విచ్ఛేద = ఎడబాటునుకలిగించు, లీలార్థమై = క్రీడ కొఱకు, నవసంధ్యా ఖడ్గమున్ = క్రొత్త సంధ్యాకాలమనెడి కత్తిని, రశ్మి = కిరణములనెడి త్రాళ్లను, గ్రాహి = పట్టుకొనుచున్న, గరుత్మదగ్రజ = అనూరునియొక్క, కర = చేతులచే, ఆరబ్ధ = ప్రారంభింపబడిన, అవిరామ = ఎడతెగని, భ్రమిన్ = తిరుగుట కలిగినట్టిదియు, కాశ్మీరాభ = కుంకుమవలె ఎఱ్ఱనైన, కర = కిరణములనెడి, ఇష్టకా = ఇటుకలయొక్క, రుచి = కాంతియనెడు, పరాగంబున్ = చూర్ణము కలట్టిదియు, సహస్రాంశు శాణాశ్మంబున్ = సూర్యుడనెడి సానఱాతిని, కదియించెన్ = చేర్చెను. (అలంకారము – ఉత్ప్రేక్ష, రూపకము)

(తిరుగలిదిమ్మ వంటి ఱాతిచక్రముపై ఇటుకలపొడిని వేసి నీళ్లు చల్లి ఆ చక్రము తిరుగుచుండగా కత్తికి పదును పెట్టుదురు)

తా. బ్రహ్మ వియోగ సంతాపమునకు నిలయమైన చిత్తములుగల చక్రవాక మిధునములయొక్క ఎడబాటు కలిగించు క్రీడ కొఱకు క్రొత్త సంధ్యాకాలమనెడి కత్తిని కిరణములనెడి త్రాళ్లను పట్టుకొనుచున్న అనూరునియొక్క చేతులచే ప్రారంభింపబడిన ఎడతెగని తిరుగుటకలిగిన, కుంకుమవలె ఎఱ్ఱనైన కిరణములనెడి ఇటుకలయొక్క కాంతియనెడు చూర్ణము కలిగినట్టి సూర్యుడనెడి సానఱాతిని చేర్చెను.

**156 తే. సలిలనిధి సార్వభౌమ కాష్ఠా పురంధ్రి**
**యోలగందంపుఁ బసపాడెనొక్కొ యనఁగఁ**
**గమల కింజల్క రేణు సంకాశ మగుచు**
**నింగి నెఱ సంజ కెంజాయ నివ్వటిల్లె**

సలిలనిధి సార్వభౌమ = వరుణునియొక్క, కాష్ఠా = దిక్కనెడి, పురంధ్రి = కాంత, ఓలగందంపున్ పసపున్ = పూత పసుపుతో, ఆడెనొక్కొ = జలకమాడెనేమో, అనగ, నెఱసంజ కెంజాయ = నిండు సంధ్యారాగము, నింగిన్ = ఆకాశమందు, కమల కింజల్క రేణు = తామరపుప్పొడి పరాగముతో, సంకాశము అగుచు = సమానమగుచు, నివ్వటిల్లె = వ్యాపించెను.

తా. వరుణునియొక్క దిక్కనెడి స్త్రీ పూతపసుపుతో జలకమాడెనేమో యనునట్లుగ నిండు సంధ్యారాగము ఆకాశమందు తామరపుప్పొడిపరాగముతో సమానమగుచు వ్యాపించెను.

**157 క. కుసుమంబద్దిన విధమున**
**బసపున హత్తించినట్లు బంగారమునన్**
**బస నిచ్చినగతి సంధ్యా**
**వసరంబున నింగి యరుణవర్ణం బయ్యెన్**

నింగి = ఆకాశము, సంధ్యావసరంబునన్ = సంధ్యా సమయమునందు, కుసుమంబు = కుసుంభ రంగు, అద్దిన విధమున = అంటించిన రీతిగా, పసపున = పసుపుతో, హత్తించినట్లు = పూత పూసినట్లుగా, బంగారమునన్ = బంగారముతో, పస ఇచ్చినగతిన్ = ఎరుపును మించిన పసుపువన్నె పెట్టిరోయనునట్లుగ, అరుణవర్ణంబు = ఎఱ్ఱనిరంగుకలది, అయ్యెన్ = అయ్యెను.

తా. ఆకాశము సంధ్యాసమయమునందు కుసుంభ రంగు అద్దిన రీతిగాను, పసుపుతో పూతపూసినట్లుగాను, బంగారు నీటితో ఎరుపును మించిన పసుపువన్నె పెట్టిరోయనునట్లుగాను అరుణవర్ణముకలది అయినది.(అలంకారము = ఉత్ప్రేక్ష)

**158 క. అభినవ సంధ్యా తాండవ**
**రభస రయచ్ఛిన్న హిమధరాధర కన్యా**
**ప్రభు హారాస్థుల భంగిని**
**సభాస్థలిం దారకాగణంబులు వొడిచెన్**

తారకా గణంబులు = నక్షత్రములు, అభినవ = అప్పుడే ప్రారంభమైన, సంధ్యా = సంధ్యాసమయమందలి, తాండవ రభస = నృత్యమందలి సంతోషముచేనైన, రయ = వేగముచే, ఛ్ఛిన్న = తెగినట్టి, హిమధరాధరకన్యా ప్రభు = పార్వతీపతియొక్క, హార = హారములోని, అస్థుల భంగిని = ఎముకలో యనునట్లుగ, సభాస్థలిన్ = ఆకాశప్రదేశమందు, పొడిచెన్ =ఉదయించెను.

తా. అప్పుడే ప్రారంభమైన సంధ్యాసమయమందలి నృత్యసంరంభముచేనైన వేగముచే తెగినట్టి శివునియొక్క హారములోని ఎముకలో యనునట్లుగ నక్షత్రములు ఆకాశప్రదేశమునందు ఉదయించెను.(అలంకారము – ఉత్ప్రేక్ష)

**159 శా. చరమాశా నికషోపలాంచలములన్ సంధ్యా ప్రకాశోదయం**
**బొరఁగావించి విరించిచేఁ గొనిన సూర్యుండన్పదార్వన్నె బం**
**గరపుం బూదియకై వియద్విపణి వేద్కం గాలమన్బచ్చు చె**
**చ్చెరఁ జెల్లించిన గవ్వ చౌకమన మించెం దారకాచక్రముల్**

కాలమను బచ్చు = కాలమనెడి వర్తకుడు, చరమాశా = పశ్చిమదిక్కనెడి, నికషోపల = గీటురాయియొక్క, అంచలములన్ = కొనయందు, సంధ్యా ప్రకాశోదయంబు = సంధ్యాకాంతియనెడి, ఒరన్ = గీటును, కావించి = చేసి, విరించిచేన్ = బ్రహ్మవలన, కొనిన = కొన్నట్టి, సూర్యుండను, పదార్వన్నె బంగరపుం బూదియకై = మేలిమి బంగారు పూసకై, వియద్విపణిన్ = ఆకాశమనెడి అంగడియందు, వేద్కన్ = సంతోషముతో, చెచ్చెరన్ = వెంటనే, చెల్లించిన = ఇచ్చిన, గవ్వచౌకమనన్ = గవ్వల పుంజీలు అనునట్లుగ, తారకా చక్రముల్ = నక్షత్రముల సమూహములు, మించెన్ = ప్రకాశించెను.(అలంకారము – ఉత్ప్రేక్ష)

తా. కాలమనెడు వర్తకుడు పశ్చిమదిక్కనెడు గీటురాయి అంచున సంధ్యాకాంతియనెడు గీటును గీచి బ్రహ్మనుండి కొన్నట్టి సూర్యుడనే మేలిమి బంగారు పూసకై ఆకాశమనెడి అంగడియందు సంతోషముతో వెంటనే చెల్లించిన గవ్వలపుంజీలు అనునట్లుగ నక్షత్రముల సమూహములు ప్రకాశించెను.

**160 మ. నభమెల్లం గలయంగ నిండఁబొడిచె న్సంధ్యావశేషాదృతా**
**రభటీ డంబర తాండవ భ్రమరికా రంభంబునన్ శాంభవీ**
**ప్రభు పాదాహతి మీఁదికిన్నెగయుచున్ బ్రహ్మాండ గోళంబుతో**
**నభిసంబద్ధములయ్యెనో రజత శైలాశ్మంబు లన్నట్టుగన్**

సంధ్యా = సంధ్యాకాలముయొక్క, అవశేష = మిగిలిన భాగమందు, ఆదృత = అంగీకరింపబడిన, ఆరభటీ = నేర్పుయొక్క, డంబర = అతిశయముచేనైన, తాండవ = నాట్యముయొక్క, భ్రమరికా = తిరుగుటలయొక్క, ఆరంభంబునన్ = ప్రారంభ దశయందు, శాంభవీప్రభు = శంకరునియొక్క, పాదాహతిన్ = కాలి దెబ్బలచే, మీదికిన్ ఎగయుచున్ = పైకి ఎగురుచు, రజతశైలాశ్మంబులు = వెండికొండ రాళ్ళు, బ్రహ్మాండ గోళంబుతో, అభిసంబద్ధములు అయ్యెనో = అంటుకొన్నవేమో, అన్నట్టు = అనినట్లుగ, ఉడుల్ = చుక్కలు, నభము ఎల్లన్ = ఆకాశమంతటను, కలయంగన్= వ్యాపించి, పొడిచెన్ = ఉదయించెను.(అలంకారము – ఉత్ప్రేక్ష)

తా. సంధ్యాకాలమునందు మిగిలిన శేషభాగమునందు అంగీకరింపబడిన నేర్పుయొక్క అతిశయముచేనైన తాండవమునందు తిరుగుటలయొక్క ప్రారంభదశయందు శంకరునియొక్క పాదహతిచే మీదికి ఎగురుచున్న వెండికొండ రాళ్ళు బ్రహ్మాండగోళముతో అంటుకొన్నవేమో అనినట్లుగ చుక్కలు ఆకాశమందంతటను వ్యాపించి ఉదయించినవి.

161 సీ. **చుక్కలో యివిగావు సురలోక వాహినీ**
**విమలాంబుకణ కదంబములుగాని**
**తారలో యివిగావు తారాపథాంబోధి**
**కమనీయ పులిన సంఘములుగాని**
**యుడువులో యివిగావు మృడునంబరంబునఁ**
**దాపించినట్టి ముత్యాలుగాని**
**రిక్కలో యివిగావు రేచామ తుఱుముపైఁ**
**జెరివిన మల్లె క్రొవ్విరులుగాని**
తే. **యనుచు లోకంబు సందేహ మందుచుండఁ**
**బొడిచె బ్రహ్మాండ పేటికా పుట కుటీర**
**చారు కర్పూర ఫాలికా సంచయములు**
**మెండుకొని యోలి నక్షత్ర మండలములు**

ఇవి = ఈ కనబడునవి, చుక్కలో = నక్షత్రములా ?, సురలోక వాహినీ = గంగానదియొక్క, విమల = స్వచ్ఛమైన, అంబుకణ = నీటి బిందువులయొక్క, కదంబములు కాని = సమూహములే కాని, కావు = నక్షత్రములు కావు. ఇవి, తారలో = నక్షత్రములా ?, తారాపథాంబోధి = ఆకాశమనెడి సముద్రమునందు, కమనీయ = మనోహరమైన, పులిన సంఘములుకాని = ఇసుక ప్రదేశములే కాని, కావు = నక్షత్రములు కావు. ఇవి, ఉడుపులో = నక్షత్రములా ?, మృడు నంబరంబునన్ = శివుని వస్త్రమునందు, తాపించినట్టి = అతికించినట్టి, మత్యాలు కాని, కావు = నక్షత్రములు కావు. ఇవి, రిక్కలో = నక్షత్రములా ?, రేచామ = రాత్రియనెడి స్త్రీయొక్క, తుఱుముపైన్ = సిగమీద, చెరివిన = ముడిచినట్టి, మల్లె క్రొవ్విరులు కాని = మల్లె పూలు కాని, కావు = నక్షత్రములు కావు. అనుచు, లోకంబు సందేహము అందుచుండన్, బ్రహ్మాండ పేటికా పుట = బ్రహ్మాండమనెడి పెట్టియొక్క పైభాగమునందు, కుటీర = గుడిసెగాకల, చారు = సుందరమైన, కర్పూర ఫాలికా = కర్పూర ఖండములయొక్క, సంచయములు = సమూహములు, మెండుకొని = వ్యాపించి, నక్షత్ర మండలములు, ఓలి = క్రమముగా, పొడిచెన్ = కానవచ్చెను. (అలంకారము – సందేహము)

తా. ఈ కనబడునవి నక్షత్రములు కావు. అవి గంగానదియొక్క స్వచ్ఛమైన నీటి బిందువుల సమూహములు. ఇవి నక్షత్రములు కావు. ఆకాశమనెడి సముద్రమునందు మనోహరమైన ఇసుక తిన్నెలు. ఇవి నక్షత్రములు కావు. శంకరుని వస్త్రమునందు అతికించినట్టి ముత్యాలు, ఇవి నక్షత్రములు కావు. రాత్రియనెడి స్త్రీ సిగలో ముడిచిన మల్లె పూలు అని సందేహపడుచుండ బ్రహ్మాండమనెడి పెట్టి పైభాగమునందలి గుడిసెమీద సుందరమైన కర్పూర ఖండములయొక్క సమూహముల చందమున నక్షత్రములు ఆకసమున క్రమముగా వ్యాపించి కానవచ్చెను.

162 చ. **హటదురులీల నిర్జరులు నచ్చరలేమలు వేల్పుటేట నొ**
**క్కట విహరింప సందడికిఁ గాక తొలంగి చరించుమీన క**
**ర్కట మకరంబు లొక్కొయనఁగా గగనాగ్రమునందు మీన క**
**ర్కట మకరంబు లెంతయుఁ బ్రకాశమునొందె నిశా ప్రసంగతిన్**

నిర్జరులు = ముసలితనము లేనివారు, దేవతలు, అచ్చరలేమలున్ = అప్సరసలును, హటదురులీలన్ = ప్రకాశించుచున్న గొప్పదగు విలాసముతో, వేల్పుటేటన్ = ఆకాశగంగయందు, ఒక్కటన్ = ఒక్కమాఱుగా, విహరింపన్ = జలక్రీడలు సలుపగా, సందడికిన్ = వారి చర్యలకు, కాక = ఓర్వలేక, తొలంగి = అక్కడినుండి తప్పించుకొని, చరించు = సంచరించు, మీన కర్కట మకరంబు లొక్కొ యనగా = చేపలు, ఎండ్రులు, మొసళ్ళు అగునా అనునట్లుగ, గగనాగ్రమునందు = ఆకాశమునందు, నిశాప్రసంగతిన్ = రాత్రి సమయము వచ్చుటచే, మీన కర్కట మకరంబులు, ఎంతయున్ = మిక్కిలి, ప్రకాశమునొందెన్ = కాంతివంతములాయెను. (అలంకారము – ఉత్ప్రేక్ష)

తా. దేవతలు, అప్సరసలు ఒక్కసారిగా గొప్ప విలాసముతో ఆకాశగంగయందు జలక్రీడలు సలుపగా ఆ సందడికి ఓర్వలేక చేపలు, ఎండ్రులు, మొసళ్ళు అక్కడినుంచి తప్పించుకొని ఆకాశమున సంచరిస్తున్నాయా అన్నట్లుగ మీన, కర్కట, మకర రాసులు రాత్రిసమయమగుటచే ఆకసమునందు కానవచ్చెను.

163 మ. **విపులాకాశ నిపాతభీతి కలనా విన్యస్త దుర్వర్ణ కీ**
**ల పరిస్ఫూర్తి నిశాలతా కుసుమముల్ భాసిల్లె బ్రహ్మాండ మం**
**టప కాష్ఠామల కీట రంధ్రరజముల్ నాకాపగా చక్రవా**
**క పురంధ్రీ నయనాశ్రు బిందువులు నక్షత్రగ్రహ గ్రామముల్**

విపుల = విశాలమైన, ఆకాశ = ఆకాశముయొక్క, నిపాత = పడుటయందలి, భీతి = భయముయొక్క, కలనా = అతిశయముచే,

విన్యస్త = తాపింపబడిన, దుర్వర్ణ కీల = వెండిమేకులయొక్క, పరిస్ఫూర్తిన్ = ప్రకాశమును, నిశాలతా కుసుమముల్ = రాత్రియనెడు తీగయొక్క పుష్పములును, బ్రహ్మాండ మంటప = బ్రహ్మాండమనెడి మంటప సంబంధియుగు, కాష్ఠ = దిక్కులనెడి దూలములయొక్క, అమల = స్వచ్ఛమైన, కీటరంధ్రరజముల్ = పురుగులయొక్క రంధ్రములనుండి పడిన పరాగమును, నాకాపగా = ఆకాశగంగయందలి, చక్రవాక పురంధ్రీ = ఆడ చక్రవాకపక్షులయొక్క, నయన = నేత్రములనుండి జారు, అశ్రు బిందువులు = కన్నీటి చుక్కలైన, నక్షత్ర గ్రహ గ్రామముల్ = నక్షత్రములయొక్కయు, గ్రహములయొక్కయు సముదాయములు.(అలంకారము – ఉత్ప్రేక్ష)

తా. విశాలమైన ఆకాశము పడిపోవునను భయముచే అతిశయముగా తాపింపబడిన వెండి మేకుల కాంతిగల నక్షత్ర గ్రహ సమూహములు రాత్రియనెడు తీగయొక్క పుష్పములవలెను, బ్రహ్మాండమంటప సంబంధములగు దిక్కులనెడి దూలములయొక్క పురుగుల కన్నములందున్న తెల్లని పరాగమువలెను, ఆకాశగంగయందలి ఆడ చక్రవాక పక్షుల కంటినుండి జారు కన్నీటిచుక్కలవలెను ప్రకాశించెను.

**164 ఉ. కాలకిరాత పాదతలఘట్టనఁ జేసి వియద్వనీ మహా**
**కాలఫలంబు భాస్కరుఁడు గ్రక్కున నస్త మహామహీధర**
**స్థూల శిలాస్థలిం బడియెఁ దోరములైన తదీయ బీజముల్**
**నీలరుచుల్ వడిం జెదరె నింగి ననచ్ఛ తమశ్ఛలంబులన్**

కాల కిరాత = కాలమనెడి కిరాతకుని, పాదతల ఘట్టనన్ చేసి = పాదముల తాపులచేత, వియద్వనీ = ఆకాశమనెడి అరణ్యమునందు, మహాకాలఫలంబు = చిరకాలముగా పండిన పండగు, భాస్కరుడు = సూర్యుడు, గ్రక్కున = తటాలున, అస్తమహామహీధర = అస్తాద్రియనెడి పెద్ద కొండయొక్క, స్థూల = పెద్దదయిన, శిలాస్థలిన్ = పాషాణప్రదేశమందు, పడియెన్ = పడెను, తోరములైన = పెద్దవైన, తదీయ బీజముల్ = ఆ పండులోని గింజలు, నీలరుచుల్ = నల్లని కాంతులతో, నింగిన్ = ఆకాశమందు, అనచ్ఛ = మలినమైన, తమశ్ఛలంబులన్ = చీకటియనెడు మిషచేత, వడిన్ = వేగముగా, చెదరెన్ = వ్యాపించెను.(అలంకారము – రూపకము, అపహ్నవము, ఉత్ప్రేక్ష)

తా. కాలమనెడి కిరాతుని పాదతాడనముచే ఆకాశమనెడి వనములోని చిరకాలముగా పండిన పండగు సూర్యుడు తటాలున అస్తాద్రిపైనున్న శిలాతలముపై పడగా, ఆ పండులోని పెద్దవైన గింజలు నల్లని కాంతులతో ఆకసమున చీకట్లనెడి మిషతో శీఘ్రముగా వ్యాపించెను.

**165 తే. పగలు బ్రహ్మాండభాండ కర్పరమునందు**
**గగన మణిదీపముననైన కజ్జలంబు**
**రాలెనో కాక యంధకారంబు పేరఁ**
**గాల వాతూల హతి నిశావేళయందు**

పగలు, బ్రహ్మాండ భాండ = బ్రహ్మాండ గోళమనెడి, కర్పరమునందు = కొప్పెరయందు, గగనమణిదీపముననైన = సూర్యుడనెడి దీపముచేతనైన, కజ్జలంబు = కాటుక, నిశావేళయందున్ = రాత్రియందు, కాల = కాలమనెడి, వాతూల = పెద్ద గాలియొక్క హతి = దెబ్బచే, అంధకారంబు పేరన్ = చీకటియను మిషచేత, రాలెనోకాక = రాలిపోయినదేమో !

తా. పగటిపూట బ్రహ్మాండగోళమనెడి కొప్పెరయందు సూర్యుడనెడి దీపముచేతనైన కాటుక రాత్రియందు కాలమనెడి పెద్దగాలి దెబ్బకు చీకటియను మిషతో రాలిపోయెనేమో !(అలంకారము – రూపకము, అపహ్నుతి, ఉత్ప్రేక్ష)

**166 వ. అంత నమ్మహీకాంతుం డట మున్ను నిశాముఖోచిత క్రియాకలాపంబులు నిర్వర్తించుటంజేసి క్రీడాసౌధంబు నేడవ నిలువునకు దమయంతీ సమేతంబుగా నరిగి, యచ్చోట శుద్ధాంత కాంతాజనంబు పరివేష్టింపఁ గొలువుండె. అప్పుడు పొడుపుగుబ్బలిమీఁదం బొడతెంచు పూర్ణచంద్రబింబంబుఁ బొడగని యంగన కిట్లనియె.**

తా. అంత ఆ నలమహారాజు అంతకు పూర్వమే రాత్రి చేయవలసిన పనులన్నిటిని పూర్తిచేసుకొని దమయంతితో కూడి క్రీడాసౌధము ఏడవ అంతస్తునకు వెళ్లి, అక్కడ అంత:పుర స్త్రీలతోకూడి సభచేసెను. అప్పుడు తూర్పుకొండమీద కనబడు పూర్ణ చంద్రబింబమును చూచి నలుడు దమయంతితో ఇట్లు పలికెను.

**167 తే. శుద్ధకాంచన పిండంబు సూర్యుఁ దిగిచి**
**పూర్ణశశిఁ బూఁత బంగారు పూదె నొసఁగి**
**సాయమను ధూర్తు వంచించె జగమునెల్లఁ**
**దెల్లఁబాఱెడు నదెచూడు తెఱవ ! విధుఁడు**

తెఱవ = ఓ దమయంతీ !, సాయమను ధూర్తుడు = సాయంకాలమనెడి మోసగాడు, శుద్ధకాంచన పిండంబు = మేలిమి బంగారపు గుండయిన, సూర్యున్ = సూర్యుని, తిగిచి = తీసుకొని, పూర్ణశశిన్ = నిండుచంద్రుని, పూత బంగారు పూదెన్ = పూత బంగారముతో చేసిన పూసను, ఒసగి = ఇచ్చి, జగమును ఎల్లన్ = లోకమునంతను, వంచించెన్ = మోసపుచ్చెను, విధుడు = చంద్రుడు, తెల్లబాఱెడున్ = తెల్లగా కానవచ్చుచున్నాడు, అదె = అదిగో, చూడు = చూడుము.

తా. ఓ దమయంతీ ! సాయంకాలమనెడి మోసగాడు మేలిమి బంగారపు గుండయిన సూర్యుని తీసుకొని పూత బంగారముతో చేసిన పూసను నిండు చంద్రుని ఇచ్చి లోకమునంతను మోసపుచ్చెను. అదిగో చూడు చంద్రుడు తెల్లగా కానవచ్చుచున్నాడు. (అలంకారము – రూపకము, ఉత్ప్రేక్ష)

**168 సీ.** **ఇందుకాంతంబుల నెబ్భంగి వడిసెనో**
**నిష్యంద కీలాల నిర్ఝరములు**
**చక్రవాకముల లోచనయుగ్మకముల నె**
**ట్లుబ్బెనో విరహ బాష్పోదకములు**
**చంద్రాతపమున నేచందానఁ గురిసెనో**
**ధారాళమగుచు నీహారవృష్టి**
**విపిన వీథికల నే విధమునఁ గాఱెనో**
**శేఫాలికా పుష్ప సీదుధార**
**తే.** **యిన్ని విధముల నభివృద్ధి యెసఁగదేని**
**యొదిఁగి పవలింటి యట్టుల యుండుఁగాక**
**యూరకేల విజృంభించు నుదధు లేడు**
**నుత్పలేక్షణ యీ శశాంకోదయమున**

ఉత్పలేక్షణ = కలువ కంటీ !, ఈ శశాంకోదయమునన్ = ఈ చంద్రుడుదయించుచున్న సమయమందు, ఇందుకాంతంబులన్ = చంద్రకాంతమణులందు, ఎబ్భంగి = ఏ విధముగా, నిష్యంద కీలాల నిర్ఝరములు = స్రవించుచున్న జలప్రవాహములు, వడిసెనో = స్రవించెనో(చూడుము) – చక్రవాకముల, లోచన యుగ్మకముల = కనుల జంటయందు, విరహ బాష్పోదకములు = వియోగ సంతాపమువలన కలిగిన కన్నీరు, ఎట్టుబ్బెనో = ఏ రీతిగా ప్రవహించుచున్నదో(చూడుము) – చంద్రాతపమున = వెన్నెలచేత, ధారాళమగుచు = అడ్డులేనిదగుచు, నీహారవృష్టి = మంచువాన, ఏచందానన్ = ఏ విధముగా, గురిసెనో (చూడుము) – విపిన వీథికలన్ = అరణ్య సీమలందు, శేఫాలికా పుష్ప = వావిలి పూవులయొక్క, సీదు ధార = మకరంద ప్రవాహము, ఏ విధమునన్, కాఱెనో (చూడుము), ఇన్ని విధములన్, అభివృద్ధి = పెంపు, ఎసగదేని = అతిశయింపకపోయినచో, ఉదధులు ఏడును = సప్త సముద్రములును, పవలింటి యట్టులన్ = పగటిపూటయందువలె, ఒదిగి ఉండున్ కాక, ఊరక = ఊరకనే, ఏల విజృంభించున్ = ఎందుకు పొంగును ?(అలంకారము – ఉత్ప్రేక్ష)

తా. ఓ కలువకంటీ ! ఈ చంద్రుడుదయించుచున్న సమయమందు చంద్రకాంత మణులందు జలప్రవాహములు ఏ విధముగా స్రవించుచున్నవో చూడుము. చక్రవాకముల కన్నులు వియోగ సంతాపమువలన కలిగిన కన్నీరు ఏ రీతిగా ప్రవహిచుచున్నదో చూడుము. వెన్నెలచేత అడ్డులేక మంచువాన ఏ విధముగా కురిసెనో చూడుము. అరణ్యసీమలందు వావిలిపుష్పముల మకరంద ప్రవాహము ఏవిధముగ కాఱెనో చూడుము. ఇన్ని విధములుగ పెంపు అతిశయింపకపోయినచో ఏడు సముద్రములును పగటిపూటయందువలె ఒదిగియుండునేకాని ఊరకనే ఎందులకు పొంగును ?

**169 క.** **లీలావతి యామవతీ**
**కాళిందీ సైకతంబు గగనోదన్వ**
**ద్వేలా డిండీరము చం**
**ద్రాలోకం బింత యొప్పునా యివ్వేళన్**

లీలావతీ = మంచి విలాసముకల దమయంతీ !, ఈ వేళన్ = ఈ సమయమందు, చంద్రాలోకంబు = చంద్రుని కాంతి, యామవతీ = రాత్రియనెడి, కాళిందీ సైకతంబు = యమునానది ఇసుకతిన్నె కావచ్చును, గగన ఉదన్వత్ = ఆకాశమనెడి సముద్రముయొక్క, డిండీరము = నురుగు అయియుండవచ్చును, ఇంత ఒప్పునా = కాంతి ఇంత చక్కగానుండునా?(రూపకము)

తా. ఓ లీలావతీ ! ఈ సమయమందు చంద్రుని కాంతి రాత్రియనెడి యమునానది ఇసుకతిన్నె కావచ్చును. లేదా ఆకాశమనెడి సముద్రముయొక్క నురుగు కావచ్చును. కాకున్న చంద్రుని కాంతి ఇంత ప్రకాశవంతముగా నుండునా?

**170 ఉ.** **దేవి ! తమోమషీరసము తేటఁ బొసంగఁగ గట్టివెట్టి యం**
**కావళి వ్రాయఁగాఁ దొడఁగె నంబర సంపుట కాంతరంబునం**
**బూవిలుకాని శౌర్యగుణముల్ హరిణాంకుఁడు ముత్తియంబులం**
**దావడముల్ రచించిన విధంబున రుక్కటికా ముఖంబులన్**

దేవి = ఓ దమయంతీ !, అంబర = ఆకాశమనెడి, సంపుటకాంతరంబునన్ = నల్లబల్లపై, తమోమషీరసము = చీకటి యనెడి మసిపొడి ద్రవమును, తేట పొసంగగన్ = స్పష్టముగా కనబడునట్లు, గట్టి పెట్టి = గట్టించి, హరిణాంకుడు = చంద్రుడు, పూవిలుకాని = మన్మథునియొక్క, శౌర్య గుణముల్ = పరాక్రమమును, రుక్ = కిరణములనెడి, కటికా = బలపముయొక్క, ముఖంబులన్ = అగ్రములతో, ముత్తియంబులన్ = ముత్యాలతో, తావడముల్ రచించిన విధంబున = పేరులు గ్రుచ్చునట్టి

విధముగా, అంకావళి = అక్షరముల పంక్తిని, వ్రాయగా తొడగెన్ = వ్రాయుటకు మొదలిడెను,

తా. ఓ దేవీ ! చంద్రుడు ఆకాశమనెడి నల్లబల్లపై చీకటియనెడి మసిపొడి ద్రవమును స్పష్టముగా కనబడునట్లు గట్టించి మన్మథుని శౌర్య గుణములను కిరణములనెడి బలపముతో ముత్యాలతో పేరులు గ్రుచ్చు విధంగా అక్షరముల పంక్తిని వ్రాయుటకు ప్రారంభించినట్లుగా నక్షత్రములు ప్రకాశించుచున్నవి. (అలంకారము – ఉత్ప్రేక్ష, ఉపమ)

**171 తే. చామ ! యీశానమౌళి నీ చందమామ**
**కొంచెమై యుండు నవ యవాంకురము కంటె**
**డాసి గ్రహముండ మాల్య మండనము నడుమఁ**
**గీల్కొనిన రాహు వక్త్ర మీక్షించియొక్కొ**

చామ = దమయంతీ !, ఈ చందమామ, ఈశానమౌళిన్ = ఈశ్వరుని తలపై, నవ యవాంకురము కంటెన్ = క్రొత్త యవధాన్యపు మొలకకంటె, కొంచెమై ఉండును = చిన్నదిగానుండును, గ్రహ = గ్రహములనెడి, ముండ = కపాలములయొక్క మాల్య = దండయనెడి, మండనము నడుమన్ = అలంకార మధ్యమునందు, డాసి = చేరువగా, కీల్కొనిన = ఉన్నట్టి, రాహు వక్త్రమున్ = రాహువుయొక్క ముఖమును, ఈక్షించియొక్కొ = చూసి కావచ్చును. (రూపకము, అతిశయోక్తి)

తా. దమయంతీ ! ఈ చందమామ ఈశ్వరుని తలపై క్రొత్త యవధాన్యపు మొలకకంటె చిన్నదిగా నుండును. గ్రహములనెడి కపాలములయొక్క దండయను అలంకార మధ్యమునందు సమీపించి ఉన్నట్టి రాహువు ముఖమును చూసి కాబోలును.

**172 క. శివునకుఁ జకోరములకున్**
**దివిజులకును నిచ్చుఁ దుహిన దీధితి యీతం**
**డవయవము రుచుల నమృతము**
**నువిద ! తగుం గల్పతరు సహోదరుఁడగుటన్**

ఉవిద = ఓ కాంతా ! తుహిన దీధితి = చల్లని కిరణములుగల, ఈతండు = ఈ చంద్రుడు, అవయవము రుచులన్ = పదహారుకళలయొక్క కాంతులచే, అమృతమున్, శివునకున్, చకోరములకున్, దివిజులకు = దేవతలకును, ఇచ్చున్ = ఇచ్చుచున్నాడు, కల్పతరు సహోదరుడు అగుటన్, తగున్ = తగినదే యగును.

తా. ఓ కాంతా ! చల్లని కిరణములుగల ఈ చంద్రుడు తన పదహారుకళలయొక్క కాంతులచే అమృతమును శివునకును, చకోరములకును, దేవతలకును ఇచ్చుచున్నాడు. కల్పవృక్షమునకు సోదరుడగుటచే ఇది తగినదే యగును.

**173 ఉ. అంగద నంకవర్తి హరిణాభ్యవహార విలోలబుద్ధియై**
**మ్రింగు విధుంతుదుండనెడి మేటి భుజంగమ మీ శశాంకు సా**
**రంగముఁ బాయఁడీ యవసరంబున మేలని మెచ్చియో చుమీ**
**మ్రింగియుఁగ్రాయు నచ్చిలువ మెల్ల విధుం గసుకందకుండగన్**

మెల్త = ఓ వనితా !, విధుంతుదుండు అనెడి = రాహువు అనెడి, మేటి భుజంగమము = పెద్ద పాము, అంగదన్ = ఆకలిచే, అంకవర్తి = తన ఒడిలోనున్న, హరిణ = లేడిని, అభ్యవహార = తినుటయందు, విలోల బుద్ధియై = అసక్తికలదై, ఈ శశాంకున్ = ఈ చంద్రుని, మ్రింగున్ = మింగును, సారంగము = లేడిని, పాయదు = విడువదు, ఈ అవసరంబునన్ = ఈ కారణముచేతనే, మేలని = విడువకుండుట మేలని, మెచ్చియో చుమీ = మెచ్చుకొనియే కాబోలును, ఆ చిలువ = ఆ పాము, విధున్ = చంద్రుని, మ్రింగియున్, కసుకందకుండగన్ = కొంచెముకూడ నొప్పి కలుగకుండగా, మెల్ల = మెల్లగా, క్రాయున్ = వెడల గ్రక్కుచున్నాడు. (అలంకారము – ఉత్ప్రేక్ష)

తా. ఓ వనితా ! రాహువు యనెడి పెద్ద పాము ఆకలిచే తన ఒడిలోనున్న లేడిని తినుటయందు ఆసక్తికలదై ఈ చంద్రుని మింగును. తనను మింగుచున్నను చంద్రుడు లేడిని విడువకపోవుటచే, ఈ కారణముననే ఆ పాము చంద్రుని మింగినా కసుకందకుండగా మెల్లగా బయటకు వదలివేయుచున్నాడు.

**174 తే. లతల క్రీనీడఁ దిలతండులితము లగుచుఁ**
**గాంత ! యీ నిండు రేతేని కరము లమరు**
**నంగుళీ కీలితేంద్ర నీలాంగుళీయ**
**కంబులును బోలె లీలావనంబునందు**

కాంత = ఓ ప్రియురాలా !, ఈ నిండు రేతేని కరములు = ఈ పూర్ణచంద్రుని కిరణములు, లీలావనంబునందున్ = క్రీడోద్యానమందు, లతల క్రీనీడన్ = తీగెల క్రీనీడయందు, తిల తండులితములు అగుచు = తిల తండుల న్యాయము కలవగుచు, అంగుళీ = వ్రేళ్ళయందు, కీలిత = ధరింపబడిన, ఇంద్రనీలాంగుళీయకంబులును పోలెన్ = ఇంద్రనీల రత్నముకల ఉంగరమువలె, అమరున్ = ప్రకాశించును.

తా. ఓ ప్రియురాలా ! ఈ నిండుచంద్రుని కిరణములు క్రీడోద్యానమున లతల క్రీనీడలయందు నల్లగాను, తెల్లగాను

వ్రేలికి ధరించిన ఇంద్రనీల ఉంగరములవలె ప్రకాశించుచున్నది.

**175 తే. తండ్రి కంబోనిధికిఁబోలె ధవళనేత్ర !**
**హాని వృద్ధులు గలవీ శశాంకునకును**
**రాజబింబనిభాస్య కారణగుణంబు**
**గార్యమున సంక్రమించుట గలదకాదె**

ధవళనేత్ర = తెల్లని కన్నులుకలదానా !, ఈ శశాంకునకును = ఈ చంద్రునకును, తండ్రికిన్ = తండ్రియైన, అంబోనిధికిన్ పోలె = సముద్రునకును వలె, హాని వృద్ధులు = క్షయ వృద్ధులు, కలవు. రాజబింబనిభాస్య = చంద్రబింబముతో సమమగు ముఖముకలదానా !, కారణ గుణంబు = కారణమునందున్న గుణము, కార్యమునన్ = పుట్టిన వస్తువునందును, సంక్రమించుట = సంభవించుట, కలద కాదె = ఉన్నదేకదా !(అలంకారము – అర్థాంతరన్యాసము)

తా. ధవళనేత్రా ! ఈ చంద్రునకును తండ్రియైన సముద్రునకువలె క్షయ వృద్ధులు కలవు. కారణమునందున్న గుణములు కార్యమునందును సంభవించుట ఉన్నదేకదా !

**176 తే. వహ్ని మొదలగు నఖిల దైవతగణంబు**
**దృప్తిఁ బొందుదు రీ సుధాదీప్తియందు**
**మహిత పుణ్యాత్ము కల్యాణ గృహమునందుఁ**
**బొలఁతి ! యభ్యాగతులు తృప్తిఁ బొందునట్లు**

పొలతి = ఓ దమయంతీ ! మహిత = పూజ్యుడయిన, పుణ్యాత్ము, కల్యాణ గృహమునందున్ = శుభకరమైన ఇంటియందు, అభ్యాగతులు = అతిధులు, తృప్తిన్ పొందునట్లు, వహ్ని మొదలగు = అగ్ని మొదలైన, అఖిల = సమస్తమైన, దైవతగణంబు = దేవతల సమూహము, ఈ సుధా దీప్తియందున్ = ఈ చంద్రునియందు, తృప్తిన్ పొందుదురు.

తా. ఓ దమయంతీ ! పూజ్యుడైన పుణ్యాత్ముని శుభకరమైన గృహమునందు అతిధులు తృప్తిని పొందునట్లుగానే అగ్ని మొదలైన సమస్తమైన దేవతల సమూహము ఈ చంద్రుని చల్లని కాంతిచే తృప్తిని పొందుదురు

**177 తే. ప్రవహ వాయుకురంగ మంబరమునందు**
**దప్పిగొని యీ సుధాంశు మండలము సొచ్చి**
**యమృత పంకంబులో నంఘ్రులణఁగుటయును**
**వెడల లేకున్నయది చూడు విద్రుమోష్ఠి !**

విద్రుమోష్ఠి = పగడమువంటి పెదవికలదానా !, అంబరమునందున్ = ఆకాశమునందు, ప్రవాహ వాయు కురంగము = ప్రవాహమనెడి వాయువు వాహనమగు లేడి, దప్పిగొని = దాహముతో, ఈ సుధాంశు మండలము = ఈ చంద్రమండలమును, చొచ్చి = ప్రవేశించి, అమృత పంకంబులోన్ = అమృతమనెడి బురదలో, అంఘ్రులు = పాదములు, అణగుటయును = దిగబడిపోవుటచే, వెడలలేకున్నయది = బయటకు రాలేకున్నది, చూడు. (అలంకారము – ఉత్ప్రేక్ష)

తా. బింబోష్ఠి! ఆకాశమునందు ప్రవాహమనెడి వాయువు వాహనమగు లేడి దాహముతో ఈ చంద్ర మండలమునందు ప్రవేశించి అమృతమనెడి బురదలో పాదములు దిగబడిపోవటంతో బయటకు రాలేకున్నది. చూడుము.

**178 సీ. ఓషధీ సందేశ భాషా ప్రణిధియైన**
**మృగము గాఁబోలు నీ మృగము తరుణి**
**రుద్రాగ్రహత్రాస విద్రావితంబైన**
**మృగము గాఁబోలు నీ మృగము తరుణి**
**ప్రవహ నామక మహా పవన వాహనమైన**
**మృగము గాఁబోలు నీ మృగము తరుణి**
**రోహిణీ శుద్ధాంత గేహ వర్ధితమైన**
**మృగము గాఁబోలు నీ మృగము తరుణి**

**తే. సతత సేవా సమాయాత సకలభువన**
**భవ్య విపినౌషధీ లతా పల్లవాగ్ర**
**భక్షణ క్షీభమై సుధాపాయి యగుచు**
**మగువ ! యీ చంద్రునందు నీ మృగము బ్రదికె**

తరుణి = ఓ కాంతా, ఈ మృగము, ఓషధీ = ఓషధీలతలనెడి నాయికలయొక్క, సందేశ భాషా = సందేశ వచనమునకు, ప్రణిధియైన = దూతయైన, మృగము = లేడి, కాబోలున్, రుద్ర = శంకరునియొక్క, ఆగ్రహ = కోపముచే, త్రాస = భయపడి, విద్రావితంబైన = పరుగెత్తింపబడిన, మృగము, కాబోలున్, ప్రవహ నామక = ప్రవహమనెడి పేరుగల, మహా పవన =

గొప్పవాయువునకు, వాహనమైన, మృగము, కాబోలున్, రోహిణీ = రోహిణీ దేవిచే, శుద్ధాంత గేహ = అంత:పురమునందు, వర్ధితమైన = పెంచబడిన, మృగము, కాబోలున్, సతత = ఎల్లప్పుడును, సేవా = చంద్రుని సేవకై, సమాయాత = వచ్చినట్టి, సకల భువన = సమస్త లోకములందలి, భవ్య = శ్రేష్ఠమైన, విపిన = అడవులందలి, ఔషధీ లతా = మందు తీగెలయొక్క పల్లవాగ్ర = చిగుళ్ళ కొనలను, భక్షణ = తినుటచే, క్షీభమై = మదించినదై, సుధాపాయి యగుచు = అమృతము త్రాగినదగుచు, మగువ = ఓ దమయంతీ !, ఈ మృగము, బ్రదికెన్ = జీవించెను.

తా. ఓ దమయంతీ ! చంద్రుడు ఓషధీశుడు కనుక ఈ మృగము ఓషధీలతల సందేశ వచనమునకు దూతయైన లేడి కావచ్చును. ఈ మృగము దక్ష యజ్ఞమున లేడియై శంకరుని కోపముచే భయపడి పరుగెత్తింపబడిన లేడి కావచ్చును. ఈ మృగము ప్రవహమనెడి పేరుగల గొప్పవాయువునకు వాహనమైన లేడి కావచ్చును, ఈ మృగము చంద్రుని భార్యయైన రోహిణిచే అంత:పురమునందు పెంచబడిన లేడి కావచ్చును. ఎల్లప్పుడు చంద్రుని సేవకై వచ్చినట్టి సమస్తలోకములందలి శ్రేష్ఠమైన అడవులందలి ఓషధీ లతలయొక్క చిగుళ్ళకొనలను తినుటచే మదించినదై అమృతము త్రాగినదగుచు ఈ లేడి జీవించుచున్నది.

**179 తే.** **కంతుఁడును నీ విధుండు నొక్కంతవారు**
**సఖ్య మీ యిద్దరకు నొప్పు సదృశులగుట**
**ముదిత ! యొక్కండు హరుని నెన్నుదుటి కంట**
**నొకఁడు కంసారి కుడికంట నోహటిలిరి**

ముదిత = ఓ దమయంతీ !, కంతుండును = మన్మథుడును, ఈ విధుండును = ఈ చంద్రుడును, ఒక్కంతవారు = సమానులు, సదృశులు అగుటన్ = అలా సమానులగుటచేతనే, ఈ యిద్దఱకును, సఖ్యము = స్నేహము, ఒప్పున్ = తగును, ఒక్కండు = ఒకడు, హరుని నెన్నుదుటి కంటన్ = శంకరుని నుదుటి కన్నుచేతను, ఒకడు, కంసారి = విష్ణువుయొక్క, కుడికంటన్ = కుడికన్నైన సూర్యునిచేతను, ఓహటిలిరి = లయమయిరి.

తా. ఓ దమయంతీ ! ఈ దుర్మార్గులయిన మన్మథుడును, చంద్రుడును ఒకటే. అలా సమానులగుటచేతనే ఈ ఇద్దరికిని విరహులను బాధించుటకు స్నేహము కుదిరినది. దానికి ఫలితముగానే ఒకడు శివుని నుదుటి కంటిమంటచే నశించెను, మరొకడు విష్ణువు కుడికన్నైన సూర్యునిచే నష్టప్రాయుడగుచు అమావాస్యనాడు పూర్తిగ నశించెను.

**180 ఉ.** **బాలిక ! యీ సుధాకరుఁడు పంకజనాభుని వామభాగ దృ**
**గ్గోళకమైననాఁడు నవ కోమల బాల తమాల కందళీ**
**కాళిమఁ గేలి సేయు నడుకందిది తన్నయనాంతరంబునన్**
**నీల కనీనికా మఘవ నీలమణిత్వము నొందకుండునే**

బాలిక = ఓ దమయంతీ !, ఈ సుధాకరుడు = ఈ చంద్రుడు, పంకజనాభుని = విష్ణుని, వామభాగ = ఎడమభాగమందున్న, దృగ్గోళకమైన నాడు = కంటిగ్రుడ్డు అయినప్పుడు, నవ = నూతనముగా పుట్టిన, కోమల = మృదువైన, బాల = లేతయైన, తమాలకందళీ = తమాల చిగుళ్ళయొక్క, కాళిమన్ = నల్లదనమును, గేలిచేయు = పరిహాసముచేయు, నడుకందు = మధ్యలోనున్న మచ్చ, ఇది, తత్ నయనాంతరంబునన్ = ఆ విష్ణుని కంటిమధ్యమందున్న, నీల = నల్లని, కనీనికా = కంటిగ్రుడ్డు, మఘవనీలమణిత్వము = ఇంద్రనీలమణిధర్మమును, ఒందకుండునే = పొందకుండా ఉంటుందా ?

తా. ఓ బాలికా ! ఈ చంద్రుడు విష్ణుని ఎడమభాగమందున్న కంటిగ్రుడ్డు అయినప్పుడు నూతనముగా పుట్టిన మెత్తని, లేత తమాలచిగుళ్ళయొక్క నల్లదనమును పరిహసించు మధ్యలోని మచ్చ యిది. ఆ విష్ణుని కంటిమధ్యనున్న నల్లని కంటిగ్రుడ్డు ఇంద్రనీలమణిధర్మమును పొందకుండునా ?(అలంకారము – ఉత్ప్రేక్ష)

**181 ఆ.** **కమలవిపినదాహ కంఠోక్త పటు తీవ్ర**
**శక్తియగు హిమాగ్ని సంగమమునఁ**
**గందఁబోలు శిశిరకరు డెంద మీ భంగి**
**నాతి యొందు కారణంబు లేదు**

నాతి = ఓ మగువా !, కమలవిపిన = పద్మవనములను, దాహ = దహించుటయనెడి, కంఠోక్త = నిశ్చయమగు, పటు = సమర్థమైన, తీవ్రశక్తియగు = భయంకరమైన సామర్థ్యముకలదైన, హిమాగ్ని సంగమమునన్ = హిమమందున్న అగ్నియొక్క సంపర్కముచేత, శిశిరకరు డెందము = చంద్రుని మనస్సు, ఈ భంగిన్ = ఈ విధముగా, కందన్ పోలు = కమిలియుండవచ్చును, ఒందు కారణంబు = వేరొక కారణము, లేదు = కనబడదు. (అలంకారము – ఉత్ప్రేక్ష)

తా. ఓ మగువా ! పద్మవనములను దహించుటయనెడి నిశ్చయమగు సమర్థమైన, తీవ్రమైన సామర్థ్యముకలదైన హిమమందున్న అగ్నియొక్క సంపర్కముచేత చంద్రుని మనస్సు ఈ విధముగా కమిలి మచ్చ కావచ్చును. ఇంతకుమించి వేరొక కారణము కనబడదు.

**182 కం. హరిత చ్ఛాయా చ్ఛలమున**
**భర ఖేదము వాయ నమృతపానీయ సరో**
**వరమగు నీ శశియందుం**
**దరుణీ ! యోలాడుచున్న ధరణిం గంటే**

తరుణీ = ఓ నాతీ !, హరిత చ్ఛాయా = నల్లని కాంతులయొక్క, ఛలమున = మిషచేత, భర = ప్రాణికోటులను భరించుటచేతనైన, ఖేదము = శ్రమ, వాయన్ = పోవుటకు, అమృతపానీయ సరోవరమగు = అమృతపునీటి సరస్సగు, ఈ శశియందున్ = ఈ చంద్రునియందు, ఓలలాడుచున్న ధరణిన్ = జలక్రీడలాడుచున్న భూమిని, కంటే = చూచితివా ?(అలంకారము - ఉత్ప్రేక్ష)

తా. ఓ తరుణీ ! భూమి సమస్త ప్రాణికోటులను భరించుటచేతనైన శ్రమను పోగొట్టుకొనుటకు అమృతపునీటి సరస్సగు ఈ చంద్రునియందు జలక్రీడలాడుచున్నది. ఆ భూమియొక్క ఛాయయే చంద్రునియందలి మచ్చగా కానవచ్చుచున్నది. చూచితివా ?

**183 తే. జనకుడగు దుగ్ధ వార్ధి కుచ్చైశ్రవంబు**
**గలిగె నైరావణంబును గలిగె నట్టి**
**తనకు గారాబుపట్టికి వనజవైరి**
**కొక్క కుందేలు గలుగుట యువిద ! యరుదె**

జనకుడగు = చంద్రునకు తండ్రియగు, దుగ్ధ వార్ధికి = పాలసముద్రమునకు, ఉచ్చైశ్రవంబు = ఉచ్చైశ్రవమను గుఱ్ఱము, కలిగెన్, ఐరావణంబును = ఐరావతమను ఏనుగును, కలిగెన్, అట్టి తనకు = అటువంటి తనకు, గారాబుపట్టికిన్ = సముద్రునకు ముద్దుల కుమారునికి, వనజవైరికిన్ = పద్మవిరోధికి, ఒక్క కుందేలు కలుగుట, అరుదె = ఆశ్చర్యమా !

తా. ఓ కాంతా ! చంద్రునకు తండ్రియగు పాలసముద్రమునకు ఉచ్చైశ్రవమను గుఱ్ఱమును, ఐరావతమను ఏనుగును కలుగగా ఆ సముద్రుని ముద్దుల కుమారునికి, పద్మ విరోధికి ఒక్క కుందేలు కలుగుట ఆశ్చర్యముకాదు.(అర్థాపత్తి)

**184 తే. జ్యోత్స్న నాఁగఁదమిస్ర నా నుభయ భార్య**
**లుడుపతికి నందు నొకతె దె ల్పోర్తు నల్పు**
**తాను వారికి మెచ్చుగాఁ దాల్పఁబోలు**
**తెలుపు నలుపునునగు మేను నెలఁత యితఁడు**

నెలత = ఓ ముగుదా !, ఉడుపతికిన్ = నక్షత్రములకు రాజైన చంద్రునకు, జ్యోత్స్ననాగన్ = జ్యోత్స్నయనియు, తమిస్ర నాన్ = తమిస్రయనియు, ఉభయ భార్యలు = ఇద్దరు భార్యలు. అందు ఒకతె, తెల్పు = తెలుపు (వెన్నెల), ఓర్తు = ఒకతె, నల్పు = నలుపు (చీకటి), తాను = ఆ చంద్రుడు, వారికి = ఆ ఇద్దరు భార్యలకు, మెచ్చుగాన్ = మెప్పుగా, ఇతడు, తెలుపు నలుపును నగు మేను = తెల్లని నల్లని దేహమును, తాల్పన్ పోలున్ = ధరించియుండును.(అలంకారము = ఉత్ప్రేక్ష)

తా. ఓ కాంతా ! నక్షత్రములకు రాజైన చంద్రునకు జ్యోత్స్నయనియు, తమిస్రయనియు ఇద్దరు భార్యలు కలరు. అందు ఒకామె తెలుపు, మరొకామె నలుపు కలిగియుండును. అందువలన చంద్రుడు ఆ ఇద్దరు భార్యలను మెప్పించుటకై తాను తెలుపు, నలుపు దేహములను ధరించెనుగాబోలును.

**185 మ. గణుతింపంగ నితండు పాల్కడలికిన్ గారాబు పుత్త్రుండు బ్రా**
**హ్మణ రాజోషధి భర్త నెట్టుకొని సంపాదించినన్ బ్రాఁతియౌ**
**మణిమంత్రౌషధము ల్పురావిహిత కర్మంబెట్టిదో కాక ల**
**క్షణ కాలుష్యము రాజయక్ష్మమును జిక్కంబెట్ట లేఁడయ్యెడున్**

గణుతింపగన్ = ఆలోచింపగా, ఇతండు = ఈ చంద్రుడు, పాల్కడలికిన్ = పాలసముద్రమునకు, గారాబు పుత్త్రుండు, బ్రాహ్మణరాజు = బ్రాహ్మణులకు అధిపతి, ఓషధి భర్త = ఓషధులకు నాయకుడైనను, ప్రాతియౌ = లభింపబడని, మణి మంత్ర ఔషధములు, నెట్టుకొని = పూనుకొని, సంపాదించినన్ = ఆర్జించినప్పటికిని, పురావిహిత కర్మంబు = పూర్వ జన్మమునందు చేసిన కర్మము, ఎట్టిదో = ఎటువంటిదో, కాక = కాకున్న, లక్షణ కాలుష్యము = నల్లని మచ్చయును, రాజయక్ష్మమును = క్షయరోగమును, చిక్కంబెట్ట లేడయ్యెడున్ = పోగొట్టుకొనలేకుండెను.(అలంకారము - విశేషోక్తి)

తా. అలోచింపగా ఈ చంద్రుడు పాలసముద్రమునకు గారాబు పుత్రుడు, బ్రాహ్మణులకు అధిపతి, ఓషధులకు నాయకుడు, అంతియేగాక లభించని మణులను, మంత్రములను, ఔషధములను పూనుకొని సంపాదించినవాడు. పూర్వ జన్మమునందు చేసిన కర్మ యెట్టిదో లేకపోతే నల్లని మచ్చయును, క్షయరోగమును పోగొట్టుకొన లేకపోయాడుకదా !

**186 క. కాలతమ తిమిర నీలీ**
**కాళీదళరస కళంక కజ్జలపంక**
**క్షాళన గోక్షీరము లివె**
**ప్రాలేయ కరాంశు లంబరము శోధించెన్**

కాలతమ = మిక్కిలి నల్లని, తిమిర = చీకట్లనెడి, నీలీ,కాళీదళరస = పెను, సామాన్య నీలి చెట్లయాకులయొక్క రసముచే కలిగిన, కళంక = మచ్చలను, కజ్జలపంక = కాటుక బురదను, క్షాళన = కడుగుటకు, గోక్షీరములు ఇవె =ఆవుపాలవంటివి ఇవియె, ప్రాలేయ కరాంశులు = ఈ చంద్రుని కిరణములు, అంబరమున్ = ఆకాశమనెడి వస్త్రమును, శోధించెన్ = శుభ్రపరిచెను.(అలంకారము – రూపకము)

తా. మిక్కిలి నల్లని చీకట్లనెడి పెను, సామాన్య నీలిచెట్లయొక్క రసముచే కలిగిన మచ్చలను, కాటుకబురదను కడుగుటకు ఆవుపాలవంటివి ఇవియె. ఈ చంద్రుని కిరణములు ఆకాశమనెడి వస్త్రమును శుభ్రపరిచెను.

**187 తే. జలద కాళిమఁ బాపంగఁ జాలెఁ గాని**
**సహజ కాళిమఁ బాపంగఁ జాలదయ్యె**
**శారదారంభవేళ యీ చందురునకు**
**నతివ ! యయ్యెడి దౌఁ గానియదియుఁ గాదు**

అతివ = ఓ దమయంతీ !, శారదారంభవేళ = శరత్కాలము, జలద కాళిమన్ = వర్షాకాలమందలి మేఘముల నల్లదనమును, పాపంగన్ చాలెన్ కాని = పోగొట్టగలిగెనే కాని, ఈ చందురునకున్, సహజ కాళిమన్ = సహజముగా నున్న నలుపును, పాపంగ చాలదయ్యెన్ = పోగొట్టలేకపోయెను, అయ్యెడిది = కాబోవునది, ఔన్ = అగును, కానియదియున్ = కానట్టి కార్యమును, కాదు = కాబోదు.(అలంకారము – అర్థాంతరము)

తా. ఓ దమయంతీ ! శరత్కాలము వర్షాకాలమందలి మేఘముల నల్లదనమును పోగొట్టగలిగెనే కాని ఈ చంద్రునకు సహజముగానున్న నలుపును పోగొట్టలేకపోయెను. కాబోవునది కాకమానదు. కానట్టిది కానేకాదు.

**188 తే. అస్తమించిన యప్పు డీ యమృతకరుని**
**కళలు పదునొక్కఁడెక్కు రుద్రుల శిరంబు**
**లసమబాణుని దొనఁజొచ్చు నైదుకళలు**
**కాంత ! యిదిసూవె పదియాఱు కళల లెక్క**

కాంత = ఓ వనితా !, అస్తమించిన యప్పుడు = అస్తమించినప్పుడు, ఈ అమృతకరుని కళలు = ఈ చంద్రుని పదహారు కళలు, పదునొక్కడు = పదకొండు, రుద్రుల శిరంబులు = ఏకాదశ రుద్రుల శిరములను, ఎక్కున్, ఐదు కళలు, అసమబాణుని = మన్మథుని, దొన చొచ్చున్ = అమ్ములపొదిని ప్రవేశించును. పదియాఱు కళల లెక్క = పదాహారు కళలయొక్క లెక్క, ఇదిసూవె = ఇదియే సుమా !(అలంకారము – ఉత్ప్రేక్ష)

తా. ఓ వనితా ! అస్తమించినయప్పుడు ఈ చంద్రుని పదహారు కళలలో పదకొండు ఏకాదశరుద్రుల శిరములను ఎక్కును. ఐదు కళలు మన్మథుని అమ్ములపొదిని ప్రవేశించును. ఇదే పదహారు కళలయొక్క లెక్క సుమా !

**189 తే. అమృత జంబాలమున సందు లదికియదికి**
**వేయు నక్షత్రముల నొక్క విధమువానిఁ**
**జేర్చి విధి చందురునిగా నొనర్చెనేని**
**లలన ! నీ మోముసరి సకళంకుఁ డితఁడు**

లలన = ఓ యువిదా !, విధి = బ్రహ్మ, వేయు నక్షత్రములన్ = పెక్కు నక్షత్రములను, ఒక్క విధమువానిన్ = సమానముగా నున్నవానిని, చేర్చి = ఒకచోట చేర్చి, జంబాలమునన్ = అమృతసంబంధియగు బురదతో, సందులు = నక్షత్రములకు మధ్యనున్న సందులను, అదికి అదికి = సందులేకుండ పూడ్చి, చందురునిగాన్, ఒనర్చెనేని = చేసినచో, నీ మోముసరి = నీ ముఖమునకు సరిపడును, కాని, ఇతడు, సకళంకుడు = దోషముకలవాడు.(అలంకారము – అభూతోపమ)

తా. ఓ దమయంతీ ! బ్రహ్మ పెక్కు నక్షత్రములను సమానముగానున్నవానిని ఒకచోట చేర్చి అమృతసంబంధియగు బురదతో నక్షత్రములకు మధ్యనున్న సందులను సందులేకుండగ పూడ్చి చంద్రునిగా చేసినచో నీ ముఖమునకు సరిపడును. కాని ఇతడు దోషముకలవాడయ్యెను.

**190 తే. చంద్రమండల మిది పితృస్థానమగుట**
**జన సమావర్జిత స్వధా సలిల తిలలు**
**మంత్రబలమున నెక్కె నీమధ్యమునకుఁ**
**జంద్రబింబాస్య ! లాంఛనచ్ఛాయగాదు**

చంద్రబింబాస్య = చంద్రునితో సమానమైన ముఖముకలదానా !, ఇది చంద్రమండలము = ఈ చంద్రమండలము, పితృస్థానము అగుటన్ = పితృదేవతలకు నిలయమగుటనుబట్టి, జన = జనులచే, సమావర్జిత = ఈయబడిన, స్వధా = పితృదేవతల కాహారమైన, సలిల తిలలు = తిలోదకములు, ఈ మధ్యమునకున్ = ఈ చంద్రుని మధ్యభాగమునకు, మంత్రబలమునన్, ఎక్కెన్ = చేరినవి. లాంఛనచ్ఛాయ = కళంకము, కాదు.(అలంకారము – ఉత్ప్రేక్ష)

తా ఓ చంద్రవదనా ! ఈ చంద్రమండలము పితృస్థానమవడంచేత లోకంలోని జనులచే యివ్వబడిన పితృ

దేవతలకాహారమైన తిలోదకములు ఈ చంద్రుని మధ్యభాగమునకు మంత్రబలముచే చేరినవి. అంతియేకాని అది కళంకము కాదు.

**191 మ. ఇదె వీక్షింపు చకోరశాబకనిభాక్షీ ! దీర్ఘికా హంసి యి**
**ప్డుదకాంతః ప్రతిబింబితున్ గగన మధ్యోపస్థితున్ చంద్రునిన్**
**వది దర్శించి నిజాధినాథుఁడనుచున్ వాత్సల్యమేపారఁగాఁ**
**జదురొప్పం బరిచుంబనం బొనరుచుం జంచూపుటాగ్రంబునన్**

చకోరశాబకనిభాక్షీ = పిల్లచకోర పక్షులవంటి కన్నులుకలదానా !, దీర్ఘికా హంసి = క్రీడాసరస్సులోని ఆడుహంస, ఇప్డు = ఈ సమయమునందు, ఉదకాంత: ప్రతిబింబితున్ = నీటిలో ప్రతిఫలించినవాడును, గగన మధ్యోపస్థితున్ = ఆకాశ మధ్యమందున్నవాడుననగు, చంద్రునిన్, వదిన్ = మఱుగున, దర్శించి = చూచి, నిజ అధినాథుండనుచున్ = తన భర్తయని, మదిన్ = మనస్సునందు, వాత్సల్యము ఏపారగాన్ = అత్యంత అనురాగముతో, చదురొప్పన్ = నేర్పుమీఱ, చంచూపుటాగ్రంబునన్ = ముక్కుపుటము కొనతో, పరిచుంబనంబు ఒనరుచున్ = ముద్దుపెట్టుకొనుచున్నది.

తా. చకోరపక్షి పిల్లలవంటి కన్నులుకలదానా ! క్రీడాసరస్సులోని ఆడుహంస నీటిలో ప్రతిఫలించినవాడును, ఆకాశమధ్యభాగమందున్నవాడును అగు చంద్రుని మఱుగున చూచి తన భర్తయని మనసున అత్యంత అనురాగముతో నేర్పుగా ముక్కుపుటము కొనతో ముద్దుపెట్టుకొనుచున్నది. (అలంకారము = భ్రాంతిమత్తు)

**192 మ. అకలంకాఖిల దీర్ఘికాజల తపస్యత్కైరవ శ్రేణికా**
**ముకుళీభావ సమాధి భంగకలనా ముగ్ధాప్సరః కామినీ**
**వికచాస్యాంబుజ మీ నిశాకరుడు, దేవీ ! చూడు మీ సాంద్ర చం**
**ద్రిక లేత ద్దరహాస చంద్రికలు, సందేహంబు లేదెంతయున్**

దేవీ !, ఈ నిశాకరుడు = ఈ చంద్రుడు, అకళంక = కళంకములేని, అఖిల = సమస్తమైన, దీర్ఘికా = సరస్సులందలి, జల = నీటియందు, తపస్యత్ = తపస్సుచేయుచున్న, కైరవ శ్రేణికా = తెల్లకలువపంక్తులయొక్క, ముకుళీభావ = ముదుచుకొని యుండుటయనెడి, సమాధి = తపస్సుయొక్క, భంగకలనా = భంగము కలిగించుటయందు, ముగ్ధ = అందమైన, అప్సరః కామినీ = అప్సరస కాంతయొక్క, వికచ = వికసించిన, ఆస్య అంబుజము = ముఖపద్మము, ఈ సాంద్ర చంద్రికలు = ఈ దట్ట మైన వెన్నెలలు, ఏతత్ దరహాస చంద్రికలు = ఆమెయొక్క చిరునవ్వు కాంతులు, ఎంతయున్ = ఏమాత్రమును, సందేహంబు,లేదు.

తా. దేవీ ! ఈ చంద్రుడు కళంకములేని సమస్తమైన సరస్సులందలి నీటియందు తపస్సుచేయుచున్న తెల్ల కలువ పంక్తులయొక్క ముదుచుకొనియుండుటయనెడి తపస్సుకు భంగము కలిగించుటయందు అందమైన అప్సరస స్త్రీయొక్క వికసించిన ముఖపద్మమునుండి వెలువడిన ఆమెయొక్క చిరునవ్వు కాంతులే ఈ దట్టమైన వెన్నెలలు. ఏమాత్రమును సందేహము లేదు.

**193 మ. నవలావణ్య రసంబు పళ్ళెరములోనం బోసి యగ్రంబునన్**
**భవదీయాస్య మొనర్చి యార్చి పిదపం బ్రాలేయ రుఙ్మండలం**
**బు వినిర్మించె విరించి యచ్చిలుమువో పూఁబోఁడి ! యా చిహ్న మం**
**బువులం దాతఁడు చేఁ దొలంచు మిసిమిం బుట్టె న్సరోజాతముల్**

పూబోడి = పూవువంటి దేహముకలదానా !, విరించి = బ్రహ్మ, నవలావణ్య రసంబు = క్రొత్త లావణ్యమను రసమును, పళ్ళెరములో, పోసి, అగ్రంబునన్ = మొదట, భవదీయ = నీయొక్క, ఆస్యము = ముఖమును, ఒనర్చి = సృజించి, ఆర్చి = తడియారిచి, పిదపన్ = తరువాత, ప్రాలేయ రుఙ్మండలంబు = చంద్రమండలమును, వినిర్మించె = నిర్మించెను. ఆ చిహ్నము = ఆ చంద్రునిలోని కళంకము, చిలుమువో = ఆ నిర్మించుటలోని ముఱికిసుమా !, ఆతడు = బ్రహ్మ, అంబువులన్ = నీటితో, చేన్ =చేతిని, తొలంచు = కడుగుకొన్న, మిసిమిన్ = లావణ్యముచేత, సరోజాతముల్ = పద్మములు, పుట్టెన్.

తా. పూబోడీ ! బ్రహ్మ క్రొత్త లావణ్యరసమును పళ్ళెరములో పోసి మొట్టమొదట నీయొక్క ముఖమును సృజించి తడియారిచి తరువాత చంద్రమండలమును నిర్మించెను. ఆ చంద్రులోని కళంకము ఆ నిర్మించుటలోని ముఱికియే ! బ్రహ్మ నిర్మాణానంతరము నీటితో చేతులు కడుగుకొన్న లావణ్యముచేతనే పద్మములు పుట్టినవి. (అలంకారము – ఉత్ప్రేక్ష)

**194 శా. ఛాయామార్గ భుజంగ హారమును జంచత్తారకామండల**
**స్ఫాయ ద్దివ్య కపాల భూషణము జ్యోత్స్నా భస్మ గౌరంబునై**
**యీ యాకాశము శంభుమూర్తియగు తన్నేర్పాటునం దెల్పెడుం**
**ద్రైయక్షాణిమభూతి సూక్ష్మతరమధ్యా ! దీని వీక్షింపుమా !**

త్రైయక్ష = ముక్కంటి సంబంధియగు, అణిమ = అణుత్వమనెడి, భూతి = సిద్ధికంటెను, సూక్ష్మతర = మిక్కిలి సూక్ష్మమైన, మధ్యా = నడుముకలదానా ! ఛాయామార్గ = ఛాయామార్గమనెడి, భుజంగమ హారమును = సర్పహారముకలదియు, చంచత్ = ఒప్పుచున్న, తారకామండల = నక్షత్రమండలమనెడి, స్ఫాయత్ = పెద్దవియగు, దివ్య = శ్రేష్ఠమైన, కపాల భూషణము =

కపాలముల హారముకలదియు, జ్యోత్స్న = వెన్నెలయనెడి, భస్మ = బూడిదచే, గౌరంబునై = తెల్లనిదియునై, ఈ ఆకాశము, శంభుమూర్తి అగున్ = శివుడేయగును, తన్నున్ = తనను, ఏర్పాటున్ = స్పష్టముగా, తెల్పెడున్ = తెలుపుచున్నది.
(శివుడు అష్టమూర్తి – భూమి, జలము, అగ్ని, వాయు, ఆకాశము (పంచభూతములు) సూర్యుడు, చంద్రుడు, సోమయాజి)

తా. శివునియొక్క అణుత్వమనెడి సిద్ధికంటెను మిక్కిలి సూక్ష్మమైన నడుముకలదానా ! ఆకాశమున ఉత్తర దక్షిణములుగా వ్యాపించిన నక్షత్రమార్గమనెడి సర్పహారముకలదియు, ఒప్పుచున్న నక్షత్రమండలమనెడి పెద్దవియగు, దివ్యమైన కపాల హారముకలదియు, వెన్నెలయనెడి బూడిదచే తెల్లనిదియునైన ఈ ఆకాశము శివుని ఎనిమిది మూర్తులలో తానొకటియనునది స్పష్టముగా తెలుపుచున్నది.(అలంకారము – రూపకము, ఉత్ప్రేక్ష)

**195 క. దేవి ! యితడు హర్యక్షీ**
**భావము భజియించియుండc బ్రకృతి విరోధం**
**బేవెంటc గలిగెనొక్కో**
**కావలమున కకట సింహికాసూనునకున్**

దేవి = దమయంతీ !, ఇతడు = ఈ చంద్రుడు, హరి అక్షీ (హర్యక్షీ) భావము = విష్ణుని నేత్రధర్మమును (సింహ ధర్మమును), భజియించియుండన్ = పొందియుండగా, కావలమునకున్ = దుష్టుడగు, సింహికాసూనునకున్ = సింహము పిల్లకు (సింహిక కొడుకగు రాహువునకు), అకట = అయ్యో, ప్రకృతి విరోధము = సహజమైన వైరము, ఏ వెంటన్ = ఏకారణమున, కలిగెనొక్కో = కలిగెనోకదా !

తా. దేవీ ! ఈ చంద్రుడు సింహధర్మమును పొందియుండగా దుష్టుడగు తన కొడుకగు రాహువుతో అయ్యో ! తండ్రి కొడుకులకు సహజవైరము ఏకారణమున కలిగెనోకదా !

**196 మ. అలరుంబోcడి ! సహస్రపత్ర తులనాహంకార లీలా విశృం**
**ఖల సౌభాగ్య కళాకలాపమగు నీ కాంతాస్యముం బోలcగా**
**వలదా యీ శశికిం కళంకికి మృగవ్యాధోత్తమాంగస్థలీ**
**వల దాకాశధునీ తటావని వనీ వానీరకోయష్టికిన్**

అలరుం పోడి = పూవువంటి మేనుకలదానా !, సహస్రపత్ర = వేయిఱేకులపద్మముయొక్క, తులనా = తిరస్కరించుట యందలి, అహంకార = గర్వముయొక్క, లీలా = విలాసముచే, విశృంఖల = నిరాటంకమైన, సౌభాగ్య కళా = సౌందర్య కళయే, కలాపమగు = భూషణముగాకలదైన, నీ = యొక్క, కాంత ఆస్యమున్ = మనోహరమైన ముఖమును, కళంకికిన్ = కళంకము కలవానికి, మృగవ్యాధ = శివునియొక్క (దక్షయజ్ఞమున యజ్ఞము మృగరూపమై పారిపోవుచుండ శివుడు వేటాడెను), ఉత్తమ అంగ స్థలీ = శిరసునందున్న, వలత్ = పాఱుచున్న, ఆకాశధునీ = ఆకాశగంగయొక్క, తట అవని = తీరమునందున్న, వనీ = చిట్టడవులయందున్న, వానీర = నీటి ప్రబ్బలిచెట్లయొక్క మధ్య, కోయష్టికిన్ = గ్రుడ్డి కొంగయయినట్టివాడునగు, ఈ శశికిన్ = ఈ చంద్రునకు, పోలగాన్ వలదా = సామ్యము వీలగునా ! (అలంకారము – రూపకము)

తా. ఓ దమయంతీ ! వేయిఱేకుల పద్మమును తిరస్కరించుటయందలి అహంకార విలాసముచే నిరాటంకమైన సౌందర్యకళయే భూషణముగా కలదైన ఈ మనోహరమైన ముఖమునకు కళంకముకలవాడును, శివుని శిరసునందున్న ఆకాశగంగా తీరమునందున్న చిట్టడవిలోని ప్రబ్బలిచెట్ల మధ్యనున్న గ్రుడ్డికొంగవంటివాడైన ఈ చంద్రునకు సాటియగునా!

**197 స్రగ్ధర. నానా ధావళ్య సంతానములకును నిదానంబు నా నొప్పు నీ రా**
**కా నక్షత్రేశు మేనం గలదె యొక కళంకంబునుం గాకతాళీ**
**యానంబై త్రోవరాcగా హరిహయనగరీ హస్తిరాడ్గండపిండ**
**స్థానాపాదాన దానద్రవ నవలవము ల్దాcకెcగాకభ్రవీథిన్**

పైత్రోవన్ = ఊర్ధ్వమార్గమున, రాగాన్ = వచ్చునప్పుడు, అభ్రవీథిన్ = ఆకాశమార్గమందు, కాకతాళీయానంబై = దైవ వశమున, హరిహయనగరీ = అమరావతియందలి, హస్తిరాట్ = ఐరావతముయొక్క, గండపిండస్థాన = పిండములవంటి చెక్కిళ్ళ ప్రదేశమునందు, అపాదాన = వెలువడిన, దానద్రవ = ద్రవరూపమైన మదముయొక్క, నవ లవముల్ = నూతన లేశములు, తాకెగాక = అంటుకొన్నవి కాని, నానా ధావళ్య సంతానములకును = పలువిధములైన ధవళకాంతుల సమూహమునకు, నిదానంబునాన్ = మూలకారణమగునట్లుగా, ఒప్పున్ = ఒప్పుచున్న, ఈ రాకా నక్షత్రేశు మేనన్ = ఈ పున్నమిచంద్రుని దేహమున, ఒక కళంకంబునుం కలదె = ఒక మచ్చయినను కలదా !

తా. ఊర్ధ్వమార్గమున వచ్చునప్పుడు ఆకాశమార్గమందు కాకతాళీయముగా అమరావతీ నగరమందలి ఐరావతము యొక్క పిండములవంటి చెక్కిళ్ళనుండి కారుచున్న మదజలముయొక్క నూతన లేశములు అంటుకొన్నవే కాని పలు తెల్లని కాంతులకు మూలకారణముగానొప్పుచున్న ఈ పున్నమిచంద్రుని దేహమున ఒక మచ్చయినను కలదా ?

198 మ. ఉడువీథీ హరినీలరత్నమయ పాత్రోత్సంగ భాగంబునన్
గడు గారామున రేఝషాంకునకు నంకచ్ఛాయయ న్నంజు నూ
టిడితోఁగూడ సుధాంశు బింబమను నేయిం బాయసాహారముం
గుడువంబెట్టెనొ బంతికూళ్ళకును జాకోరంబు లేపారఁగాన్

చాకోరంబులు = చకోరములు, బంతి కూళ్ళకును = బంతులుతీరి భుజించుటకు, ఏపారగాన్ = ఒప్పునట్లుగా, కదు గారామునన్ = మిక్కిలి భక్తితో, ఉడువీథీ = ఆకాశవీథియనెడి, హరినీలరత్నమయ పాత్ర = ఇంద్రనీలమణులతో చేయబడిన పాత్రయొక్క, ఉత్సంగ భాగంబునన్ = మధ్యభాగమునందు, రేన్ = రాత్రియందు, ఝషాంకునకున్ = చేప చిహ్నముగాగల మన్మథునకు, అంకచ్ఛాయయన్ = మచ్చయొక్క కాంతియనునట్టి, నంజున్ = నంజుకొనుటను, నూటిడితోన్ కూడన్ = నూవుపిండి భక్ష్యముతోకూడ, సుధాంశుబింబమను = చంద్రబింబమను, నేయిన్ పాయసాహారమున్ = నేతి పాయసాన్నమును, కుడువన్ పెట్టెనొ = ఆహారముగా పెట్టెనుకాబోలును.

తా. చక్రవాకములు బంతులుతీరి భుజించుటకు ముందు ఒప్పునట్లుగా మిక్కిలి భక్తితో ఆకాశవీథియనెడి ఇంద్రనీలమణిమయపాత్రయొక్క మధ్యభాగమునందు రాత్రియందు మన్మథునకు మచ్చయొక్క కాంతియను నంజుదును, నూవుపిండి భక్ష్యముతో కూడ చంద్రబింబమను నేతి పాయసాన్నమును ఆహారముగా పెట్టెనుకాబోలును.

199 శా. అభ్రాంతంబున సింహికాతనయ దంష్ట్రాంకూర యంత్రోద్భవ
శ్వభ్రాళీ పతయాళు దీధితి సుధాసార చ్ఛటావాహియై
శుభ్రాంశుండు సహస్రధార కలశ స్ఫూర్తిం బ్రవర్తిల్లె హే
లా భ్రాజిష్ణు రతిస్మరోద్వహన కల్యాణాభిషేకంబునన్

అభ్రాంతంబునన్ = ఆకాశమధ్యమున, శుభ్రాంశుండు = తెల్లని కిరణములుకలవాడగు చంద్రుడు, సింహికాతనయ = రాహువుయొక్క, దంష్ట్రాంకూర యంత్ర = కోఅలనెడి సాధనములవలన, ఉద్భవ = పడిన, శ్వభ్రాళీ = కన్నములవరుస యనెడి, పతయాళు = పడుచున్న, దీధితి = కిరణరూపములైన, సుధాసార = అమృతపు జడివానయొక్క, ఛటావాహియై = పంక్తిని వహించువాడై, హేలా = విలాసములచే, భ్రాజిష్ణు = ప్రకాశించు స్వభావముకల, రతిస్మర = రతి, మన్మథుల యొక్క, ఉద్వహన = వివాహ సంబంధియగు, కల్యాణ అభిషేకంబునన్ = మంగళస్నానమునందు, సహస్రధార కలశ స్ఫూర్తిన్ = వేయి అంచులుగల కలశమువలె, ప్రవర్తిల్లె = ఒప్పెను. (అలంకారము – రూపకము, ఉత్ప్రేక్ష)

తా. ఆకాశమధ్యభాగమునందు తెల్లని కిరణములతో చంద్రుడు రాహువు కోఅలవలన పడిన కన్నములనుండి పడుచున్న కిరణరూపములైన అమృతజడివానను వహించువాడై, విలాసముగా ప్రకాశించు స్వభావముకల రతి, మన్మథుల యొక్క వివాహ సంబంధమగు మంగళస్నానమున సహస్రధారకలశమువలె ఒప్పెను.

200 క. పదియేను దినంబులకుం
బదియేన్కళలెక్కి మేను పరిపూర్ణముగాఁ
బదియాఱవ కళ యితనిది
మదిరాక్షి వృషధ్వజుండు మౌళి ధరించున్

మదిరాక్షి, పదియేను దినంబులకున్, పదియేను కళలు, ఎక్కి = పొంది, మేను పరిపూర్ణముగాన్ = దేహము పరిపూర్ణముకాగా, ఇతనిది = ఈ చంద్రునిది, పదియాఱవ కళ, వృషధ్వజుండు = వృషభచిహ్నము ధ్వజముగాకల శివుడు, మౌళిన్ = కిరీటమునందు, ధరించున్.

తా. ఓ దమయంతీ ! పదిహేను కళలను పొంది నిండు దేహము కలవాడైన ఈ చంద్రుని పదహారవ కళను శివుడు తన కిరీటమున ధరించును.

201 సీ. ముక్కంటి తలపువ్వు మున్నీటి లేఁబట్టి
కైటభారాతి దా కన్నుఁదమ్మి
గగనలక్ష్మికి దంతకాండ తాటంకంబు
కలువలవిందు జక్కవలగొంగ
వలరాజు వెల్లల్లి వనజబాంధవునుద్ది
శిశిరాంశు రత్నంబు చేఁదుమందు
కన్నులపందువు గ్రహసార్వభౌముండు
సురల యాఁకటిపంట యిరులుదాయ
తే. శ్రీమహాలక్ష్మి సైదో దశేషభువన
సౌధ కలధౌతకలశంబు చందమామ

**రాజవదన కల్యాణ పరంపరాభి**
**వృద్ధిఁ గావించుఁగాత మీ విశ్వమునకు**

రాజవదన = చంద్రునివంటి ముఖముకలదానా ! ముక్కంటి = శివునకు, తలపువ్వు = తలపూవును, మున్నీటి = సముద్రునకు, లేపట్టి = కుమారుడును, కైటభారాతి = విష్ణువుయొక్క, డా కన్ను తమ్మి = ఎడమ నేత్ర పద్మమును, గగన లక్ష్మికి = ఆకాశమునకు, దంతకాండ తాటంకంబు = దంతమయమైన కర్ణాభరణమును, కలువల = కలువలకు, విందు = చుట్టమును, జక్కవల = చక్రవాకపక్షులకు, గొంగ = శత్రువును, వలరాజు = మన్మథుని, వెల్లల్లి = తెల్లనికలువయును (ధనుస్సు), వనజబాంధవుని = సూర్యుని, ఉద్ది = జోడును, శిశిరాంశు = చల్లని కాంతులుకల, రత్నంబు = రత్నమును, చేదు = విషమునకు, మందు = అమృతమును, కన్నులపండువు = కనులకు ఆనందమును, గ్రహ సార్వభౌముడు = గ్రహములకు అధిపతియును, సురల ఆకటిపంట = దేవతలకు ఆహారమును, ఇరులు దాయ = చీకట్లకు శత్రువును, శ్రీమహాలక్ష్మి = ఆదిలక్ష్మికి, సై తోడు = తోడపుట్టినవాడును, అశేషభువన = సమస్త లోకముల, సౌధ = మేడలయొక్క, కలధౌత కలశంబు = వెండి కలశమునైన, చందమామ, ఈ విశ్వమునకు = ఈ లోకమునకు, కల్యాణ పరంపరాభివృద్ధిన్ = శుభ పరంపరల అభివృద్ధిని, కావించుగాత = ఇచ్చుగాక.

తా. ఓ దమయంతీ ! శివునకు తలపువ్వును, సముద్రునకు కుమారుడును, విష్ణువునకు ఎడమకన్నును, ఆకాశమునకు కర్ణాభరణమును, కలువలకు మిత్రుడును, చక్రవాకములకు శత్రువును, మన్మథుని విల్లును, సూర్యుని జోడును, చల్లని కాంతుల రత్నమును, విషమునకు అమృతమును, కనులకు ఆనందమును, గ్రహములకు అధిపతియును, దేవతలకు ఆహారమును, చీకటికి శత్రువును, ఆదిలక్ష్మికి తోడపుట్టినవాడును, సమస్త లోకముల భవనములకు వెండి కలశమునైన చందమామ ఈ ప్రపంచమునకు శుభపరంపరల అభివృద్ధిని ఇచ్చుగాక.

**202** వ. **అనుచు నిజవంశ మకుట మాణిక్యంబైన రోహిణీరమణునకు రమణీ సమేతంబుగాఁ బుష్పాంజలి సమర్పించి యంగుళీయక మణిప్రభా సందోహంబు చంద్రికా ప్రవాహంబునై వెల్గిగొన భూవల్లభుండు పాణిపల్లవంబులు మొగిడ్చి ఫాలభాగంబునం గీలుకొలిపె నివ్విధంబున నాదంపతు లనురాగ సంపద సొంపిరివోవం బ్రాజంబులగు రాజ్య సుఖంబుల ననుభవించుచుండిరి. తత్కాలంబునం చాతుర్వర్ణ్యంబు నిజధర్మంబుఁ దప్పక మెలంగె. వాతజ్వరాగ్ని క్షుత్పిపాసా వ్యాధి తస్కర భయంబులుడిగె. పర్జన్యుండు గాలంబు దప్పక వర్షించె. దేశంబులు ధనధాన్య సమృద్ధంబులయ్యె. సురభు లమృతంబులఁ గురిసె. తరువులు పుటక పుటకంబుగ మధుస్యందంబుఁ జెందె. సకల జనంబులు పరమానందంబు నొందిరి.**

తా. అనుచు, తన వంశమనెడి కిరీటమునకు రత్నమువంటివాడగు చంద్రునకు దమయంతీతో కూడి పుష్పాంజలి సమర్పించి, ఉంగరముల మణికాంతుల సమూహము వెన్నెల ప్రవాహమై ప్రవహించునట్లుగా నలుడు చేతులు ఫాలభాగంబున జోడించి నమస్కరించెను. ఈ విధముగా ఆ దంపతుల అనురాగసమృద్ధి వర్ధిల్లునట్లుగా గొప్ప రాజ్యసుఖముల ననుభవించు చుండిరి. ఆ కాలమున నాలుగు వర్ణములవారును నిజధర్మములు తప్పక జీవించిరి. వాత, రోగ, అగ్ని, ఆకలి, దాహము బాధలు, మనోవ్యాధి, దొంగల భయములు లేకపోయెను. మేఘుడు కాలము తప్పక వర్షించెను. రాజ్యభాగములు ధన ధాన్య సమృద్ధములయ్యెను. గోవులు పాలను కురిసెను. వృక్షములు చొటచొటమని తేనెను స్రవించెను. జనులందరును సంతోషముతో నుండిరి.

**203** వ. **మామల్లదేవీ నందనుండును శ్రీహీర రోహణాచల రత్నప్రరోహంబును, చింతామణి మంత్రచింతన ఫలంబును, గన్యాకుబ్జ రాజాస్థాన రంగ మంగళాభరణంబును, గౌడవిజయ కావ్యకర్తయుఁ, గవి చక్రవర్తియు, ఖండన గ్రంథకారుండును, వైతండిక కమలషండ వేదండంబుననగు భట్టహర్ష మహాకవీశ్వరుండుఁ గవికులాదృష్టాధ్వపాంథుం డొనర్చిన నైషధ శృంగార కావ్య ప్రబంధ విశేషంబున నశేష మనీషి హృదయంగమంబుగా శబ్దంబనుసరించియు, నభిప్రాయంబుగుతించియు, భావంబుపలక్షించియు, రసంబుఁబోషించియు, నలంకారంబు భూషించియు, నౌచిత్యంబాదరించియు, ననౌచిత్యంబుఁ బరిహరించియు మాతృకానుసారంబునఁ జెప్పఁబడిన యీ భాషా నైషధకావ్యం బాపస్తంబసూత్ర ! భారద్వాజగోత్ర ! యుభయ కులపవిత్ర ! దానవిద్యాసత్ర ! నెల్లూరి తూర్క రాజ పౌత్ర ! మామిడి పెద్దనామాత్య పుత్ర ! పెదకోమటివేమభూపాల కరుణా పాత్ర ! వినయ వివేక సాహిత్య సింగనామాత్యా ! నీవు కృతిభర్తవుగాఁ బుణ్యశ్లోకుండు నలుండు కథానాయకుండుగా విలసిల్లు నాచంద్రతారార్కంబు**

తా. మామల్లదేవి కుమారుడును, శ్రీహీరుడనెడి రోహణపర్వతమునకు రత్నాంకురమువంటివాడును, చింతామణి మంత్ర జప ఫలమైనవాడును, కన్యాకుబ్జనగరాధిపతి సభకు మంగళాభరణమైనవాడును, గౌడవిజయ గ్రంథకర్తయును, కవులలో సార్వభౌమునివంటివాడును, ఖండన గ్రంథములను రచించినవాడును, వైతండికులనెడి పద్మసమూహమునకు మదగజమువంటివాడును, కవి సమూహముచే చూడబడని నూతన మార్గముల త్రొక్కినవాడునగు భట్టహర్ష మహాకవీశ్వరుడు చేసినట్టి నైషధమనెడి శృంగార ప్రబంధమునందు సమస్త పండితులకు సంతోషమగునట్లుగా హర్షుని శబ్దము ననుసరించియు, అభిప్రాయము గుర్తించియు, భావంబు గ్రహించియు, రసము పోషించియు, అలంకారము లలంకరించియు, ఔచిత్యమును ఆదరించియు, అనౌచిత్యమును విడిచిపెట్టియు మూలానుసారముగ చెప్పబడిన ఈ తెలుగు నైషధకావ్యము అపస్తంబ సూత్రుడు, భారద్వాజ గోత్రుడు, మాతా పితృ వంశముల పవిత్రుడు, దానవిద్యకు సత్రమువంటివాడు, నెల్లూరి తూర్కరాజ పౌత్రుడు,

మామిడి పెద్దనామాత్య పుత్రుడు, పెదకోమటి వేమభూపాలుని కరుణపొందినవాడు, వినయము, వివేకము, సాహిత్యముకల సింగనామాత్యా ! నీవు కృతిభర్తవుగా పుణ్యశ్లోకుడైన నలుడు కథానాయకుడుగా ఆచంద్రతారార్కము వెలుగొందును.

**204** సీ. **నలచక్రవర్తి పుణ్యశ్లోకుఁడగుటను**
**దమయంతి పతిదేవతావతంస**
**మగుట నప్పరమభవ్య పురంధ్రి పురుషుల**
**చరితంబు సత్కావ్య సరణిఁ గూర్చి**
**చింతామణీ మంత్రసిద్ధుం డుపాధ్యాయ**
**భట్ట హర్షుండు వాక్ప్రౌఢి మెఱయఁ**
**జెప్పిన నైషధ శృంగార కావ్యంబు**
**దెలియ జెప్పితి నాంధ్రదేశ భాష**

తే. **నిమ్మహాకృతిఁ బఠియించు నెవ్వఁడేని**
**నాతఁ డపగత కలిదోషుఁ డగుచుఁ గాంచు**
**నాయు రారోగ్య విమల విద్యా వివేక**
**భాగ్య సౌభాగ్య వైభవ ప్రాభవంబు**

నలచక్రవర్తి, పుణ్యశ్లోకుడు = పవిత్రమగు చరిత్రకలవాడు, అగుటను, దమయంతి, పతిదేవతావతంస = పతివ్రతలకు శిరోభూషణము, అగుటన్, ఆ పరమ భవ్య = ఆ మిక్కిలి కొనియాడదగిన, పురంధ్రి పురుషుల = దంపతుల, చరితంబు = చరిత్ర, సత్కావ్య సరణిన్ = నిర్దుష్టమగు కావ్యమార్గమునందు, కూర్చి = పొందుపరచి, చింతామణీ మంత్ర సిద్ధుండు = చింతామణియను మంత్రసిద్ధికల, ఉపాధ్యాయ భట్ట హర్షుండు = శ్రీహర్షుడు, వాక్ప్రౌఢి = వాక్చాతుర్యము, మెఱయన్ = ప్రకాశింపగా, చెప్పిన, నైషధ శృంగార కావ్యంబు, ఆంధ్రదేశభాష, తెలియన్ = తెలియునట్లుగా, చెప్పితిని, ఈ మహాకృతిన్ = ఈ మహాకావ్యమును, ఎవ్వడేనిన్ = ఎవరైనను, పఠియించు = చదివిన, ఆతడు, అపగత = పోయిన, కలిదోషుడు అగుచున్ = కలిదోషముకలవాడగుచు, ఆయుర్, ఆరోగ్య, విమల = స్వచ్ఛమైన, విద్యా, వివేక, భాగ్య, సౌభాగ్య, వైభవ, ప్రాభవంబులు = గొప్పతనములను, కాంచున్ = పొందును.

తా. నలచక్రవర్తి పవిత్రమగు చరిత్రకలవాడగుటను, దమయంతి పతివ్రతాశిరోమణియగుటను ఆ పరమభవ్య దంపతుల చరిత్రమును నిర్దుష్టకావ్యమార్గమున పొందుపరచి, చింతామణి మంత్రసిద్ధుడగు శ్రీహర్షుని వాక్చాతుర్యము ప్రకాశించునట్లుగా చెప్పిన నైషధ శృంగార కావ్యంబును తెలుగుభాషలో వివరముగా చెప్పితిని. ఈ మహాకావ్యమును ఎవరైనను చదివిన అతడు కలిదోషము పోయినవాడగుచు ఆయువు, ఆరోగ్యము, విమలమైన విద్య, వివేకము, భాగ్యము, సౌభాగ్యము, వైభవము, ప్రాభవము పొందును.

**205** శా. **ఆ లంకాపురి శంకరాచల మహీ వ్యాపార పారంగత !**
**ప్రాలేయ ద్యుతి కీర్తిమండల ! కృపా పాథోనిధీ ! దాన వి**
**ద్యాలంకార ! కరాళ హాలహల జిహ్వాభీల నిస్త్రింశ ! లో**
**కాలోకోపరిభాగ సంతమస సంహార ప్రతాపాతపా !**

ఆ లంకాపురి శంకరాచల మహీ = ఆ లంకాపట్టణము మొదలు కైలాసమువరకుగల భూమండలమందు, వ్యాపార = సంచారవ్యాపారమునందు, పారంగత = ఒద్దును పొందినవాడా !, ప్రాలేయద్యుతి మండల = చంద్రునిబోలు కీర్తి కలవాడా !, దయా సముద్రుడా !, దానవిద్య అలంకారముగా కలవాడా !, కరాళ = భయంకరమైన, హాలహల జిహ్వా = కాలకూట విషజ్వాలవలె, ఆభీల = భీకరమైన, నిస్త్రింశ = ఖడ్గముకలవాడా !, లోకాలోక = లోకాలోకపర్వతముయొక్క, ఉపరిభాగ = ఆవలిభాగమందున్న, సంతమస = దట్టమైన చీకటిని, సంహార = పోగొట్టు, ప్రతాపాతపా = ప్రతాపమను ఎండకలవాడా !

తా. ఆ లంకాపట్టణము మొదలు కైలాసమువరకుగల భూమండలమందు సంచారవ్యాపారమునందు ఒద్దును తెలిసినవాడా ! చంద్రునిబోలు తెల్లని కీర్తికలవాడా ! దయా సముద్రుడా ! దానవిద్య అలంకారముగా కలవాడా ! భయంకరమైన కాలకూట విషజ్వాలవలె భీకరమైన ఖడ్గముకలవాడా ! లోకాలోక పర్వతముయొక్క ఆవలి భాగమునందున్న దట్టమైన చీకటిని పోగొట్టు ప్రతాపమను ఎండకలవాడా !

**206** క. **హాటకమయ రత్నతులా**
**కోటి ఝుళంఝుళ కఠోర కోలాహల వి**
**స్ఫోటిత కుటిల మహీభృ**
**త్కోటీ కఠినాంతరంగ తులితానంగా**

హాటకమయ = బంగారువికారమైన, రత్నతులాకోటి = మణుల గండపెండేరముయొక్క, ఝుళంఝుళ = ఝుళంఝుళయని

ధ్వనించు, కఠోర, కోలాహల = పెద్ద చప్పుడుచేత, విస్ఫోటిత = పగులగొట్టబడిన, కుటిల = దుష్టులగు, మహీభృత్ = రాజులయొక్క, కోటీ = సమూహముయొక్క, కఠిన అంతరంగ = కఠినమైన మనస్సుకలవాడా !, తులిత = తిరస్కరింప బడిన, అనంగా = మన్మథుడు కలవాడా !

తా. బంగారుమయమైన మణులతోకూడిన గండపెండేరపు ఝుళంఝుళధ్వని కఠోరమైన పెద్దచప్పుడుచేత పగులగొట్టబడిన దుష్టులగు శత్రురాజులయొక్క కఠినమైన మనస్సుకలవాడా ! తిరస్కరింపబడిన మన్మథుడు కలవాడా !

**207** మాలిని. **జగదవన ధురీణా ! సాధు రక్షా ప్రవీణా !**
**నగపతి సమ ధైర్యా ! నంది తాచార్యవర్యా !**
**యగణిత గుణభద్రా ! త్యాగముద్రా సముద్రా !**
**విగత సకల దోషా ! విశ్వ లోకైక భూషా !**

జగత్ అవన ధురీణా = జగద్రక్షణ భారమును వహించినవాడా !, సాధురక్షా ప్రవీణా = మంచివారిని రక్షించుటయందు నేర్పుకలవాడా !, నగపతి సమ ధైర్యా = హిమవంతునితో సమానమైన ధైర్యముకలవాడా !, నందిత ఆచార్యవర్యా = ఆనందింపచేయబడిన గురువులుకలవాడా !, అగణిత గుణభద్రా = సాటిలేని గుణములచే మంగళకరమైనవాడా !, త్యాగముద్రా సముద్రా = త్యాగ నియమమున సముద్రునివంటివాడా !, విగత సకల దోషా = సమస్త దోషములు పోయినవాడా !, విశ్వ లోకైక భూషా = లోకమందలి సమస్తజనులకు అలంకారమైనవాడా !

తా. జగద్రక్షణ భారమును వహించినవాడా ! మంచివారిని రక్షించుటయందు నేర్పుకలవాడా ! హిమవంతునితో సమానమైన ధైర్యముకలవాడా ! ఆనందించిన గురువులు కలవాడా ! సాటిలేని గుణములచే మంగళకరమైనవాడా ! త్యాగమున సముద్రునివంటివాడా ! సమస్త దోషములు తొలగినవాడా ! లోకంలోని సమస్తజనులకు అలంకారమైనవాడా !

**గద్య**
**ఇది శ్రీమత్కమలనాభ పౌత్త్ర మారయామాత్య పుత్త్ర**
**సకల విద్యా సనాథ శ్రీనాథభట్ట ప్రణీతమయిన**
**శృంగార నైషధ కావ్యమునందు**
**అష్టమాశ్వాసము**

**వ్యాఖ్యాతృ గద్యము**
**ఇది బుధజన విధేయుండును, బులుసు వంశ సంభూతుండును,**
**కీ.శే. శేషమ్మ, వెంకటరమణయ్య పుణ్యదంపతీ తనూజుండును,**
**గౌతమ గోత్రజుండునగు వేంకటసత్యనారాయణమూర్తి**
**ప్రణీతంబైన శృంగార నైషధ మహాకావ్యంబునందు**
**అష్టమాశ్వాసమునకు టీక-తాత్పర్యములు**
**సంపూర్ణము**